శ్రీః

శ్రీమతే హయగ్రీవాయనమః.

శ్రీసీతాలక్ష్మణ భరతశత్రుఘ్న హనుమత్సమేత

శ్రీరఘునందన పరబ్రహ్మణేనమః.

# కిష్కింధాకాండ.

## అవతారిక.

ఈకాండలో పరమాత్మకు సకలకల్యాణ గుణాకరత్వము, లేక, ఆశ్రిత మిత్రులను రక్షించవలయునను విషయము, లేక, సర్వజనరక్షణ ప్రవర్తకుండగనుండు పరమాత్మకు చేతనుని సుజ్జీవింపఁజేయుటలో ఆచార్య రూపమ్మగుడు పురుషకార లాభము, చెప్పఁబడు చున్నది.

శ్రీరామాయణే - కిష్కింధాకాండ ప్రారంభః.

స తాం పుష్కరిణీంగత్వా పద్మోత్పలఝషాకులామ్।
రామ స్సౌమిత్రి సహితో. విలలాపాకులేంద్రియః॥ ౧

తస్య దృష్ట్వైవ తాం హర్షా దింద్రియాణి చకంపిరే।
స కామవశ మాపన్న స్సౌమిత్రి మిద మబ్రవీత్॥

సౌమిత్రే శోభతే పంపా వైడూర్యవిమలోదకా।
ఫుల్లపద్మోత్పలవతీ శోభితా వివిధై ర్ద్రుమైః॥

సౌమిత్రే పశ్య పంపాయాః కాననం శుభదర్శనమ్।
తత్ర రాజంతి శైలాభా ద్రుమా స్సశిఖరా ఇవ॥

మాం తు శోకాభిసంతప్తం మాధవః పీడయ న్నివ।
భరతస్య చ దుఃఖేన వైదేహ్యా హరణేన చ॥

## పంపాసరసు వర్ణనము.



(౧) శ్రీరాముఁడు కమలములు ఇందీవరములు మత్స్యములతో నిండియుండు పంపయను సరస్సునకుఁబోయి వ్యాకులపడిన ఇంద్రియములు గలవాఁడై లక్ష్మణునితోడ దుఃఖించెను. (అనఁగా, కమలమును జూడగా సీతముఖము, ఇందీవరములను జూడగా సీత నేత్రములు, చేపలను జూడగా సీతయొక్క కటాక్షములు స్మరణకు వచ్చినందున ఆమెను దలఁచి రాముఁడు దుఃఖించెనని భావము.)

(౨) పంపను జూడగనే శ్రీరాముని ఇంద్రియములు చలించినవి. శ్రీరాముఁడు కామపరవశుఁడై లక్ష్మణుని జూచి యిటులనెను.

(3) (ఈశ్లోకములో భక్తిరసముతోఁగూడి దీని సూచించు ముఖ ప్రసాదము గలిగి, శరణాగతి అంగములతోఁ గూడియుండు చేతనుఁడు సూచింపఁబడినటుల ధ్వని.) లక్ష్మణా! వైడూర్యమువలె నిర్మలముగనుండు జలము గలదిగను వికసించియుండు తామరపూలు కలువలు గలదిగను తీరములోనుండు నానా విధములగు వృక్షములు గలదిగను పంపాసరసు ప్రకాశించుచున్నది.

(౪) (ఈశ్లోకములో భగవంతుఁడనుదయారసమే తారకమనియుండు ఆచార్యుఁడు, ఆచార్యుఁడే తారకమని భావించియుండు శిష్యులు, చెప్పఁబడినటుల ధ్వని.) ఉన్నతమగు శాఖలుగలిగి శృంగములు గలిగినటు లుండుటచే పర్వతమువలెఁ ప్రకాశించుచుండు వృక్షములుగల రమణీయమైన పంపా సమీపములో నుండు అరణ్యము అగుపడుచున్నది. ఓ లక్ష్మణా! చూడుము.

(౫) (ఈశ్లోకములో సంసారబద్ధుఁడై దుఃఖించుచుండు జీవుని జూచి పరమాత్మ దుఃఖించుచుండునటుల ధ్వని.) భరతుఁడు నగరమునకు వెలుపల వసించి వ్రతోపవాసములు చేయుటచే గలిగిన దుఃఖము చేతను, సీతాపహరణము చేతను మిగుల దుఃఖించుచుండు నన్ను వసంతఋతువు విశేషముగ పీడించుచున్నది.

కిష్కింధా కాండ, ౧-వ సర్గ.

శోకార్తస్యాపి మే పంపా శోభతే చిత్రకాననా।
వ్యవకీర్ణా బహువిధైః పుష్పైః శ్శీతోదకా శివా॥
నళినై రపి సంఛన్నా హ్యత్యర్థం శుభదర్శనా।
సర్పవ్యాళానుచరితా మృగద్విజ సమాకులా॥
అధికం ప్రతిభాత్యేత న్నీలపీతం తు శాద్వలమ్।
ద్రుమాణాం వివిధైః పుష్పైః పరిస్తోమై రివార్పితమ్॥

పుష్పభారసమృద్ధాని శిఖరాణి సమంతతః।
లతాభిః పుష్పితాగ్రాభి రుపగూఢాని సర్వతః॥
సుఖానిలోఽయం సౌమిత్రే కాలః ప్రచురమన్మథః।
గంధవాన్ సురభి ర్మాసో జాత పుష్పఫలద్రుమః॥
పశ్య రూపాణి సౌమిత్రే వనానాం పుష్పశాలినామ్।
సృజతాం పుష్పవర్షాణి తోయం తోయముచా మివ॥

ప్రస్తరేషు చ రమ్యేషు వివిధాః కాననద్రుమాః।
వాయువేగ ప్రచలితాః పుష్పై రవకిరంతి గామ్॥
పతితైః పతమానైశ్చ పాదపస్థైశ్చ మారుతః।
కుసుమైః పశ్య సౌమిత్రే క్రీడన్నివ సమంతతః॥

(౬) నానావిధములుగనుండు అరణ్యముగలదియు, నానావిధములగుపూల
౬ చే నిండినదియు, శీతలముగనుండు జలముగలదియు, శుద్ధముగ నుండునదియు నగు
యీపంప దుఃఖించుచుండినను నాకు సంతోషము గలిగించుచున్నది.

౭ (౭) కమలములు కుముదములచేతఁ గప్పఁబడినదియు, మృగములు పక్షుల
చే నిండినదియు నగుపంపాసరస్సు పడిగెలు గల పాములతోను, మరికొన్ని విధ
ములగు పాములతోను గూడియుండినను మిగుల రమ్యముగనున్నది. (అనఁగా, జ్ఞా
౮ నులపట్ల కొన్నిదోషములుండినను అవి వారికి హేయతనుగలిగించవని ధ్వని.)

(౮) కొన్నిచోట్ల నీలముగను కొన్నిచోట్ల పచ్చగనునుండు గరిక మొల
చియుండు ప్రదేశము వృక్షములలోనుండి నానారంగులపూలు రాలియుండుటచే
౯ పరచియుండు రత్నకంబళమువలెఁ బ్రకాశించుచున్నది.

(౯) పుష్పముల సమూహములు గల వృక్షములకొనలు పూచియుండు
కొనలు గలలతలచే అన్నిచోట్లలో ఆలింగనము చేసికొని యుండునటు లగుప
౧౦ డుచున్నవి.

(౧౦) ఈసమయము మంచిపరిమళముతోఁగూడి యున్నది. అందుచేతనే
సుఖముగ గాలి వీచుచున్నది. కనుకనే మన్మథోద్దీపకముగ నున్నది. ఏఁలనగా
౧౧ నిది వసంత ఋతువు. కనుకనే యిట్లు పూలు పండ్లతో నిండియున్నది.

(౧౧) లక్ష్మణా! పూలతోఁ బ్రకాశించు వనముల రూపములు పూ
లవానగురిసినందున వర్షించుచుండు మేఘమువలె అగుపడుచున్నవి. చూడుము.

౧౨ (౧౨) నానా విధములగు అడవిచెట్లు గాలివేగముచే మిగుల ఆడుచు
మనోహరములగు రాళ్లమీఁదను భూమిమీదను పూలను వెదచల్లుచున్నవి.

(౧౩) లక్ష్మణా! రాలిపడియుండు, రాలిపడునటులుండు వృక్షములపూ
౧౩ లచే గాలి ఆటలాడు వానివలె సర్వత్ర అగుపడుచున్నది చూడుము.

విక్షిప న్వివిధా శ్శాఖా నగానాం కుసుమోత్కచాః।
మారుత శ్చలిత స్థానై ష్షట్పదై రనుగీయతే॥ ౧౪

మత్తకోకిలసన్నాదై ర్నర్తయ న్నివ పాదపాన్।
శైలకందరనిష్క్రాంతః ప్రగీత ఇవ చానిలః॥ ౧౫

తేన విక్షిపతా౽త్యర్థం పవనేన సమంతతః।
అమీ సంసక్తశాఖాగ్రా గ్రథితా ఇవ పాదపాః॥ ౧౬

స ఏష సుఖసంస్పర్శో వాతిచందన శీతలః।
గంధ మభ్యావహ న్పుణ్యం శ్రమాపనయనోనిలః॥ ౧౭

అమీ పవననిక్షిప్తా వినదంతీవ పాదపాః।
షట్పదై రనుకూజంతో వనేషు మధుగంధిషు॥ ౧౮

గిరి ప్రస్థేషు రమ్యేషు పుష్పవద్భి ర్మనోరమైః।
సంసక్తశిఖరా శైలా విరాజంతే మహాద్రుమైః॥ ౧౯

పుష్పసంఛన్నశిఖరా మారుతోత్క్షేపచంచలాః।
అమీ మధుకరోత్తంసాః ప్రగీత ఇవ పాదపాః॥ ౨౦

## వసంతఋతువు వర్ణనము.

(౧౪) పుష్పసమృద్ధి గల వృక్షములయొక్క నానావిధములగు శాఖలను నాడించుచుండు గాలి స్వస్థానమును విడిచియుండు తుమ్మెదలద్వారా గానము సేయువానివలె అగుపడుచున్నది.

(౧౫) మదించియుండు కోకిల ధ్వనులచే వృక్షములను నాడించుచుండు వానివలెను, పర్వతగుహలలోనుండి వెలుపల వచ్చుటచే, బాగుగ గానము సేయు వానివలెను గాలి యగుపడుచున్నది.

(౧౬) వృక్షములకొనలను గాలి ఆడించుటచే నలుప్రక్కలలోను నొక చెట్టుకొమ్మలు ఇంకొక చెట్టుకొమ్మలకొనలతో కలిసిన వృక్షములు పూల హారము కట్టఁబడినటు లగుపడుచున్నవి.

(౧౭) చందనమువలె చల్లగనుండునదియు, శ్రేష్ఠముగనుండు సుగంధమును దెచ్చుచుండునదియు, శ్రమమును బోగొట్టునదియునగు యీ గాలి సుఖముగ వీచుచున్నది.

(౧౮) గాలిచే ఆడి నర్తనముచేసి, యీవృక్షములు తేనెవాసనగల యీ వనములో తుమ్మెదలద్వారా గానముసేయు నటు లున్నవి. (ఈ శ్లోకములో భగవద్భక్తులగు సామగానలోలురు చెప్పఁబడుచున్నారు.)

(౧౯) రమ్యముగు కొండ ప్రదేశములలోపుట్టి పూలతోనిండి మనోహరముగనుండు గొప్పవృక్షములచే ఒకటితోనొకటి చేరియుండు శిఖరములుగల కొండలు గొప్పపూల రాసులవలె ప్రకాశించుచున్నవి. (అనఁగా, జ్ఞానులందరు ఒకయభిప్రాయము గలవారని ధ్వని.)

(౨౦) పూలతో అలంకరింపఁబడినశాఖలు గలిగి, గాలి వీచినందున చలించుచుండునట్టి, తుమ్మెదలను శిరోభూషణములుగ గల యీవృక్షములు గానము సేయుట కుపక్రమించునటు లున్నవి.

పుష్పితాగ్రాం స్తు పశ్యేమా న్కర్ణికారా న్సమంతతః।
హాటకప్రతిసంఛన్నా న్నరా న్పీతాంబరానివ॥ ౨౧

అయం వసంత స్సౌమిత్రే. నానావిహగనాదితః।
సీతయా విప్రహీనస్య శోకసందీపనో మమ॥ ౨౨

మాం హి శోకసమాక్రాంతం సంతాపయతి మన్మథః।
హృష్టః ప్రవదమానశ్చ మా మాహ్వయతి కోకిలః॥ ౨౩

ఏష నత్యూహకో హృష్టో రమ్యే మాం వననిర్ఝరే।
ప్రణద న్మన్మథా విష్టం శోచయిష్యతి లక్ష్మణ॥ ౨౪

శ్రుత్వైతస్య పురా శబ్ద మాశ్రమస్థా మమ ప్రియా।
మా మాహూయ ప్రముదితా పరమం ప్రత్యనందత॥ ౨౫

ఏవం విచిత్రాః పతగా నానారావ విరావిణః।
వృక్షగుల్మలతాః పశ్య సంపతంతి తత స్తతః। ౨౬

విమిశ్రా విహగాః పుంభి రాత్మ వ్యూహాభినందితాః।
భృంగరాజ ప్రముదితా సౌమిత్రే మధురస్వరాః॥ ౨౭

## వసంత ఋతువు వర్ణనము.

(౨౧) లక్ష్మణా! ఈ కర్ణికారవృక్షము లన్నిచోటులలోను పూచియుండు కొలలుగలవియై, బంగారు ఆభరణములను పీతాంబరములను ధరించిన పురుషులవలె అగుపడుచున్నవి చూడుము.

(౨౨) లక్ష్మణా! నానావిధము లగుపక్షులధ్వనితోఁగూడిన యీవసంతఋతువు సీతను నెడబాసియుండు నాకు శోకమును వృద్ధిచేయుచున్నది.

(౨౩) (అవతారిక.— ఇంతవరకు వసంతకాలములోగల పుష్పసమృద్ధిని వర్ణించి, యికమీదు, అటులనే, మన్మథోద్దీపకముగనుండు కోకిలాదిపక్షుల ధ్వనులు వర్ణింపఁబడుచున్నవి.) — దుఃఖముచేఁ బీడింపఁబడుచుండు నన్ను మన్మథుఁడు మరియు తపింపఁజేయుచున్నాఁడు. దుఃఖముతోఁగూడియుండునన్ను సంతోషించుచుండు కోకిల జయఘోషచేయుచు వెక్కిరించుచున్నది.

(౨౪) ఈ నీరుకోళ్ళు సంతోషించి రమ్యమగు వనములోనుండు నదులలో కూయుచు మన్మథపీడితుఁడుగనుండు నాకు దుఃఖము గలిగించుచున్నవి.

(౨౫) పూర్వము జలకుక్కుటముల ధ్వనిని ఆశ్రమములోనుండిన నాప్రియురాలు విన్ని నన్ను పిలిచి నాతోడ విని మిగులసంతోషమును బొందెను.

(౨౬) ఈవిధముగ నానావిధములుగ ధ్వనిచేయుచుండు నానావర్ణములు గలపక్షులు ఆయాప్రదేశములనుండివచ్చి చెట్లలోను పొదలలోను లతలలోను దిగుచున్నవి. చూడుము.

(౨౭) ఆడుపక్షులు మగపక్షులతోఁజేరియున్నవి. తగిన భర్తలతోఁ గలిసియుండుటను ఆయాజాతిపక్షులు శ్లాఘించుచున్నవి. ఆపక్షులు శ్రేష్ఠమైన తుమ్మెదల ఝుంకారము విని సంతోషించి ఆయుద్దీపనచే రమ్యమగు ధ్వనులుగలవియై యున్నవి. లక్ష్మణా! చూడుము.

నత్వ్యాహరత విక్రందైః పుంస్కోకిలరుతై రపి।
స్వనంతి పాదపాశ్చేమే మమానంగప్రదీపనాః। ౨౮

అశోక స్తబకాంగార షట్పద స్వన నిస్స్వనః।
మాం హి పల్లవతామ్రార్చి ర్వసంతాగ్నిః ప్రధక్ష్యతి॥ ౨౯

నహి తాం సూక్ష్మపక్ష్మాక్షీం సుకేశీం మృదుభాషిణీమ్।
అపశ్యతో మే సౌమిత్రే జీవితేఽస్తి ప్రయోజనమ్॥ ౩౦

అయం హి దయిత స్తస్యాః కాలో రుచిరకాననః।
కోకిలాకులసీమాంతో దయితాయా మమానఘ॥ ౩౧

మన్మథాయాసంభూతో వసంత గుణవర్ధితః।
అయం మాం ధక్ష్యతి క్షిప్రం శోకాగ్ని ర్నచిరా దివ॥ ౩౨

అపశ్యత స్తాం దయితాం పశ్యతో రుచిరద్రుమాన్।
మమాయ మాత్మప్రభవో భూయ స్త్వముపయాస్యతి॥ ౩౩

అదృశ్యమానా వైదేహీ శోకం వర్ధయతే మమ।
దృశ్యమానో వసంతశ్చ స్వేదసంసర్గదూషకః॥ ౩౪

మాం హ్యద్య మృగశాబాక్షీ చింతాశోకబలాత్కృతమ్।
సంతాపయతి సౌమిత్రే క్రూర శ్చైత్రో వనానిలః॥ ౩౫

(౨౭) జలకుక్కుటము మగకోకిల ధ్వనులద్వారా నాకు మన్మథోద్దీపనము గలిగించు యీవృక్షములు కూయుచున్నవి.

(౨౮) అశోకపూలగుత్తి యనుఅగ్నికణముగలదియు, భ్రమరములధ్వని యనుశబ్దముగలదియు, చిగురు అను ఎర్రనిజ్వాల గలదియు నగువసంతఋతువను అగ్నినన్ను మిగుల దహించుచున్నది.

(30) సన్ననిరెప్పలు గలనేత్రములు గలదియు, మంచి తలవెంట్రుకలు గలదియు, మృదువగు మాటలుగలదియు, నగునాప్రియురాలిని జూడకుండు నాకు, ప్రాణముండి యేమి లాభము.

(3౧) మనోహరముగనుండు అరణ్యములు, కోకిలపక్షులతో నిండిన నాలుగు యెల్లలుగల యీ ఋతువు, ఓ పాపరహితుఁడా! నాప్రియురాలికి మిగుల ప్రియమైనది కదా.

(3౨) మన్మథపీడచేఁ బుట్టి, వసంతఋతువు గుణములచే వృద్ధిపొంది, సీతను నెడబాసినందున గలిగిన యీశోకాగ్ని నన్ను శీఘ్రముగ దహించునటులున్నది.

(33) నాప్రియురాలిని జూడక పూచి మనోహరముగనుండు వృక్షములను జూచుచుండు నాకు గలిగిన మన్మథబాధ వృద్ధియగుచున్నది.

(3౪) నాకు అగుపడకుండు సీత నాశోకమును వృద్ధిచేయుచున్నది. అగుపడుచుండు యీవసంతఋతువు మలయమారుతమును వీచి స్వేదమును బోగొట్టుచున్నది.

(3౫) సీతయొక్క సంతతస్మరణచే దుఃఖపరవశుఁడుగనుండు నన్ను, లక్ష్మణా! మన్మథోద్దీపకమగుటచే క్రూరముగనుండు యీవసంతమారుతము తపింపఁజేయుచున్నది.

అమీ మయూరా శ్శోభంతే ప్రనృత్యంత స్తత స్తతః।
స్వైః పక్షైః పవనోద్ధూతై ర్గవాక్షైః స్ఫాటికై రివ॥ ౩౬
శిఖినీభిః పరివృతా స్త ఏతే, మదమూర్ఛితాః।
మన్మథాభిపరీతస్య మమ మన్మథవర్ధనాః॥ ౩౭

పశ్య లక్ష్మణ నృత్యంతం మయూర ముపనృత్యతి।
శిఖినీ మన్మథార్తైషా భర్తారం గిరిసానుషు॥ ౩౮
తా మేవ మనసా రామాం మయూరోఽప్యుపధావతి।
వితత్య రుచిరౌ పక్షౌ రుతై రపహసన్నివ॥ ౩౯

మయూరస్య వనే నూనం రక్షసా నహృతా ప్రియా।
తస్మా న్నృత్యతి రమ్యేషు వనేషు సహ కాంతయా॥ ౪౦
మమ త్వ యం వినా వాసః పుష్పమాసే సుదుస్సహః॥ ౪౦½

పశ్య లక్ష్మణ సంరాగం తిర్యగ్యోనిగతే ష్వపి।
యదేషా శిఖినీ కామా ద్భర్తారం రమతేంతికే॥ ౪౧½
మామప్యేవం విశాలాక్షీ జానకీ జాతసంభ్రమా।
మదనేనాభివర్తేత యది నాపహృతా భవేత్॥ ౪౨½

(౩౭) స్ఫటిక మణులచే నిర్మింపఁబడిన గవాక్షములవలె నుండునట్టి, గాలిచే నెగరగొట్టఁబడుచుండు స్వకీయమగు రెక్కలను విదిలించుకొని నెమళ్ళు అచ్చటచట నాట్యముచేయుచు ప్రకాశించుచున్నవి.

(౩౭) ఆఁడునెమళులతోఁగూడి, అందుచే విశేషముగ మదముగల, యీ మగనెమళులు మన్మథబాధచే మిగుల పీడితుఁడనైయుండు నాకు, మఱియును, నీ బాధను హెచ్చించుచున్నవి.

(౩౮) ఓ లక్ష్మణా! పర్వతము ప్రక్కలలో నాట్యముచేయుచుండు భర్తయగు మగనెమలి సమీపములో రతినిమిత్తమై ఆఁడునెమలి నాట్యముచేయుచున్నది.

(౩౯) నానారంగులు గలరెక్కలను విప్పుకొని సుస్వరముతోఁగూడి నన్ను పరిహాసముసేయునటుల, ఆఁడునెమలి సమీపమునకుఁబోవుటకు మగనెమలియుఁ గోరుచున్నది.

(౪౦) ఉపభోగమునకుఁ దగిన అరణ్యములో రాక్షసుఁడగు రావణుఁడు సీతను నపహరించుకొనిపోయినటుల యీనెమలియొక్క ప్రియురాలిని అతఁడపహరించుకొనిపోలేదు. అందుచేతనే, మనోహరమగు అరణ్యములో భార్యతోఁ గూడి అది నాట్యముసేయుచున్నది.

(౪౦౹) ఈ వసంతమాసములో సీతను నెడబాసియుండుట మిగుల దుస్సహముగ నున్నది.

(౪౧౹) లక్ష్మణా! తిర్యగ్జంతువులకును గల యీ గొప్ప అనురాగమును జూచితివా, ఏలననఁగా, యీయాఁడునెమలి కామబాధచే భర్తసమీపములో నే యున్నది. ఇది వసంతకాలవైభవము.

(౪౨౹) సీత అపహరింపఁబడక ఉండినటులైతే, విశాలాక్షియగు జానకి నా మీద మిగుల ప్రీతిగలిగి నావద్ద యిటులనే యుండును.

పశ్య లక్ష్మణ పుష్పాణి నిష్ఫలాని భవంతి మే।
పుష్పభారసమృద్ధానాం వనానాం శిశిరాత్యయే॥ ౪౩
రుచిరాణ్యపి పుష్పాణి పాదపానా మతిశ్రియా।
నిష్ఫలాని మహీం యాంతి సమం మధుకరోత్కరైః। ౪౪
వదంతి రావం ముదితా శ్శకునా స్సంఘశః కలమ్।
ఆహ్వాయంత ఇవాన్యోన్యం కామోన్మాదకరా మమ॥ ౪౫
వసంతో యది తత్రాఽపి యత్ర మే వసతి ప్రియా।
నూనం పరవశా సీతా సాపి శోచత్యహం యథా॥ ౪౬
నూనం నతు వసంతోఽయం దేశం స్పృశతి యత్ర సా।
కథం హ్యసితపద్మాక్షీ వర్తయే త్సా మయా వినా॥ ౪౭
అథవా వర్తతే తత్ర వసంతో యత్ర మే పిృయా।
కిం కరిష్యతి సుశ్రోణీ సాతు నిర్భర్త్సితా పరైః॥ ౪౮
శ్యామా పద్మపలాశాక్షీ మృదుపూర్వాభిభాషిణీ।
నూనం వసంత మాసాద్య పరిత్యక్ష్యతి జీవితమ్॥ ౪౯
దృఢం హి హృదయే బుద్ధి ర్మమ సంప్రతివర్తతే।
నాలం వర్తయితుం సీతా సాధ్వీ మద్విరహం గతా॥ ౫౦
మయి భావస్తు వైదేహ్యా స్తత్వతో వినివేశితః।
మమాపిభావ స్సీతాయాం సర్వథా వినివేశితః॥ ౫౧

(౪౩౫) ఈ వసంతఋతువులో పూలతో బాగుగ నిండియుండు వనముల లోగల పూలు నాకు నిష్ఫలముగ నున్నవి. చూడుము.

(౪౪౫) కాంతిచే మిగుల మనోహరముగనుండినను నావిషయములో నిష్ఫలములై తుమ్మెదల గుంపులతోఁగూడి పూలు భూమిమీద రాలుచున్నవి.

(౪౫౫) పక్షులు నాకు కామోద్దీపన గలిగించుటకై సంతోషించి గుంపుకూడుటకై ఒకదాని నింకొకటి పిలుచునటుల కూయుచున్నవి.

(౪౬౫) నా ప్రియురాలుండుచోట వసంత ఋతువు యిటులనే యుండినటులైతే ఆమె మన్మథపరవశురాలై నావలె దుఃఖించుచుండును. నిజము.

(౪౭౫) సీతయుండు ప్రదేశములో వసంతఋతువు ఉండదు. నిజము. అటు లది యుండినచో నల్లకలువలవంటికన్నులు గలసీత నన్నెడబాసి యెటుల జీవించియుండును.

(౪౮౫) లేక, నాప్రియురాలుండు చోట వసంతఋతువు ఉండినను ఉండును. మంచి కటిభాగముగలనామె మదనపీడితురాలుగ నుండినను యితరులు బెదిరించుచుండగా నేమి సేయగలదు.

(౪౯౫) యౌవనమధ్యస్థురాలుగను పద్మము రేకులవంటి నేత్రములు గలదిగను, మృదువుగ మాటలాడునదిగనునుండుసీత యీవసంత ఋతువులో తసులు కొని ప్రాణము విడుచును. నిజము.

(౫౦౫) నా మనసులో బాగుగ నిటుల తోచుచున్నది. నా విరహము గలసీతకు జీవించుటకు సాధ్యముకాదు. ఏలననగా, ఆమెపతివ్రిత.

(౫౧౫) సీత నాయెడల అనురాగమును బాగుగనుంచియున్నది. నేనుకూడ అటులనే సీతయెడల అనురాగమును సర్వవిధముల చేతను నుంచియున్నాను.

ఏష పుష్పవహో వాయు స్సుఖస్పర్శో హిమావహః।
తాం విచింతయతః కాంతాం పావక ప్రతిమో మమ॥ ౫౨॥
సదా సుఖ మహం మన్యే యం పురా సహ సీతయా।
మారుతః స వినా సీతాం శోకం వర్ధయతే మమ॥ ౫౩॥
తాం వినా స విహంగో యః పక్షీ ప్రణదిత స్తదా।
వాయసః పాదపగతః ప్రహృష్ట మభినర్దతి॥ ౫౪॥
ఏష వై తత్ర వైదేహ్యా విహగః ప్రతిహారకః।
పక్షీ మాంతు విశాలాక్ష్యా స్సమీప ముపనేష్యతి॥ ౫౫॥
శృణు లక్ష్మణ సన్నాదం వనే మదవివర్ధనమ్।
పుష్పితాగ్రేషు వృక్షేషు ద్విజానా ముపకూజతామ్॥ ౫౬॥
విక్షిప్తాం పవనే నైతా మసౌ తిలకమంజరీమ్।
షట్పద స్సహసాభ్యేతి మదోద్ధూతా మివ ప్రియామ్॥ ౫౭॥
కామినా మయ మత్యంత మశోక శ్శోకవర్ధనః।
స్తబకైః పవనోత్క్షిప్తై స్తర్జయన్నివ మాం స్థితః॥ ౫౮॥
అమీ లక్ష్మణ దృశ్యంతే చూతాః కుసుమశాలినః।
విభ్రమోత్సిక్తమనస స్సాంగరాగా నరా ఇవ॥ ౫౯॥
సౌమిత్రే పశ్య పంపాయా శ్చిత్రాసు వనరాజిషు।
కిన్నరా నరశార్దూల విచరంతి తత స్తతః॥ ౬౦॥

(౫౨౪) పూలవాసనను దెచ్చువాఁడును, సుఖముగ వీచుచుండువాఁడును మంచును దెచ్చువాఁడును నగుయీవాయుదేవుఁడు సీతను జింతించుచుండు నాకు అగ్నివలె తాపమును గలిగించుచున్నాఁడు.

(౫౩౪) పూర్వము నేను సీతతోడనుండినపుడు యీవాయువు నాకు సదా సుఖమును గలిగించుచుండెను. అట్టివాయుదేవుఁడే సీతను నెడబాసియుండు నాకు దుఃఖమును బెంచుచున్నాఁడు.

(౫౪౪) నేను పంచవటిలో సీతతోడ నుండినపుడు కాకి ఆకాశములోఁ బోవుచు ఘోరముగ కూసినది. సీతను విడిచియుండు అవస్థలో ఆకాకి చెట్టుమీదనుండి సంతోషముగఁ బిలుచుచున్నది. (అనఁగా, అపుడుసీతా వియోగమును, ఇపుడు నామె సంశ్లేషమును కాకికూత సూచించినదని భావము.)

(౫౫౪) అపుడు సీతయొక్క వియోగమును గలిగించిన ఆపక్షి యిపుడు ఆ విశాలాక్షి సమీపమునకు నన్ను దీసికొనిపోవుచున్నది.

(౫౬౪) ఓలక్ష్మణా! అరణ్యములో పూచియుండుశాఖలు గలవృక్షములోనుండి కూయుచుండు పక్షులయొక్క, మదమును వృద్ధిచేయు, రొదను వినుము.

(౫౭౪) గాలివీచి కదులుచుండుటచే, మిగులమదము గలప్రియురాలువలెనుండు, యీతిలకపూలుగుత్తిని తుమ్మెద శీఘ్రముగఁబొందుచున్నది.

(౫౮౪) విరహులకు మిగుల దుఃఖమును బెంచునట్టిస్వభావముగల యీయశోకము, గాలిచే ఆకులకువెలుపల వచ్చి కదులుచుండు పూలగుత్తిచే, నన్ను బెదిరించునటు లున్నవి.

(౫౯౪) లక్ష్మణా! పూలతోఁ బ్రకాశించుచుండు యీమామిడిచెట్లు విలాసముచే గర్వించియుండు మనసుగలిగి పరిమళద్రవ్యములను బూసికొనిన మనుజులవలెఁ బ్రకాశించుచున్నవి.

ఇమాని శుభగంధీని పశ్య లక్ష్మణ సర్వశః।
నళినాని ప్రకాశంతే జలే తరుణసూర్యవత్॥ ౬౧

ఏషా ప్రసన్నసలిలా పద్మనీలోత్పలాయుతా।
హంసకారండవాకీర్ణా పంపా సౌగంధికాయుతా॥ ౬౨

జలే తరుణసూర్యాభై ష్షట్పదాహత కేసరైః।
పంకజై శ్శోభతే పంపా సమంతా దభిసంవృతా॥ ౬౩

చక్రవాకయుతా నిత్యం చిత్రప్రస్థవనాంతరా।
మాతంగమృగయూథై శ్చ శోభతే సలిలార్థిభిః॥ ౬౪

పవనాహితవేగాభి రూర్మిభి ర్విమలేంభసి।
పంకజాని విరాజంతే తాడ్యమానాని లక్ష్మణ॥ ౬౫

పద్మపత్రవిశాలాక్షీం సతతం పంకజప్రియామ్।
అపశ్యతో మే వైదేహీం జీవితం నాభిరోచతే॥ ౬౬

అహో కామస్య వామత్వం యో గతా మపి దుర్లభామ్।
స్మారయిష్యతి కల్యాణీం కల్యాణతరవాదినీమ్॥ ౬౭

(౭౦౪) ఓ లక్ష్మణా! పంపయొక్క నానా విధములుగనుండు వనములలో, ఓ నరోత్తముఁడా ! కిన్నరులు అచ్చటచట సంచరించుచున్నారు చూడుము.

(౭౧౪) మంచి గంధము గలయెఱ్ఱకలువలు పంపాజలములో ఒక్కొక్క అలలోను ప్రతిఫలించిన బాలసూర్యునివలె అన్నిప్రదేశములలోనుఁ బ్రకాశించుచున్నవి. చూడుము.

(౭౨౪) ఈపంపాసరసు నిర్మలమగుతీర్థముగలిగి పద్మములు నల్లకలువలు హంసలు నీటికోళ్ళు సౌగంధికపూలతో నిండియున్నది.

(౭౩౪) జలములో బాలసూర్యుని కాంతిగలదిగను తుమ్మెదలచేఁ గొట్టఁబడిన కింజల్కములు గలదిగను నుండుపంపపద్మములచే నలుప్రక్కలనిండి ప్రకాశించుచున్నది.

(౭౪౪) సదా చక్రవాకపక్షులతో నిండి చిత్రముగనుండు ప్రదేశములు గలవనములతోఁగూడి జలమును నపేక్షించి వచ్చిన యేనుఁగుల జింకల గుంపులచే యీ పంప ప్రకాశించుచున్నది.

(౭౫౪) లక్ష్మణా! గాలిచేగలిగిన వేగముతోఁగూడిన అలలచే నిర్మలమైన జలములోఁ గొట్టఁబడిన పద్మములు, కొరడాతోఁ గొట్టఁబడినటుల, ప్రకాశించుచున్నవి.

(౭౬౪) పద్మ పత్రములవలె విశాల మగుకన్నులుగలదియు, సదా పద్మములమీఁద ప్రీతిగలదియునగుసీతను జూడకుండు నాకు ప్రాణము పెట్టుకొనియుండుటలో రుచిలేకయున్నది.

(౭౭౪) మన్మథుని కుటిలస్వభావము ఆశ్చర్యముగ నున్నది. దూరములో నుండునట్టి కనిపెట్టుటకు సాధ్యపడని 'మృగముసు దెచ్చియిమ్ము' అను మంచి మాటచెప్పినట్టి సీతను జ్ఞాపకపరచుచున్నది.

శక్యో ధారయితుం కామో భవే దద్యాగతో మయా।
యది భూయో వసంతో మాం నహన్యాత్పుష్పితద్రుమః॥ ౧౮
యాని స్మ రమణీయాని తయా సహ భవంతి మే।
తాన్యేవారమణీయాని జాయంతే మే తయా వినా॥ ౧౯
పద్మకోశపలాశాని దృష్ట్వా దృష్టిర్హి మన్యతే।
సీతాయా నేత్రకోశాభ్యాం సదృశానీతి లక్ష్మణ॥ ౨౦
పద్మకేసరసంసృష్టో వృక్షాంతర వినిస్సృతః।
నిశ్శ్వాస ఇవ సీతాయా వాతి వాయు ర్మనోహరః॥ ౨౧
సౌమిత్రే పశ్య పంపాయా దక్షిణే గిరిసానుని।
పుష్పితాం కర్ణికారస్య యష్టిం పరమశోభనామ్॥ ౨౨
అధికం శైలరాజోఽయం ధాతుభి స్సువిభూషితః।
విచిత్రం సృజతే రేణుం వాయువేగ విఘట్టితమ్॥ ౨౩
గిరిప్రస్థాస్తు సౌమిత్రే సర్వత స్సంప్రపుష్పితైః।
నిష్పత్రై స్సర్వతో రమ్యైః ప్రదీప్తా ఇవ కింశుకైః॥ ౨౪
పంపాతీరరుహా శ్చేమే సంసక్తా మధుగంధినః।
మాలతీ మల్లికా షండాః కరవీరాశ్చ పుష్పితాః॥ ౨౫
కేతక్య స్సింధువారాశ్చ వాసంత్యశ్చ సుపుష్పితాః।
మాధవ్యో గంధపూర్ణాశ్చ కుందగుల్మాశ్చ సర్వశః॥ ౨౬

(౧౮౫) పూచినవృక్షములు గలవసంతమాసము, మరియు, నన్నుహింసించక పోయినట్లైతే యిపుడు గలిగిన కామమును సైచుకొనియుందును.

(౧౯౫) సీతతోఁ గూడియుండినపుడు నాకు యెవి మనోహరములుగనుండెనో ఆమెను నెడబాసినపు డవి వియోగబాధను గలిగించుచున్నవి.

(౨౦౫) లక్ష్మణా! సీతయొక్క మూసికొనియుండు నేత్రముల రెప్పలతో సమముగనుండు తామరమొగ్గలమీద మూసికొనియుండు ఆకులను జూచినపుడు సీతకన్నులు స్మరణకు వచ్చుచున్నవి.

(౨౧౫) పద్మముల పుప్పొడితోఁ గూడినదిగను, వృక్షములమధ్యనుండి వచ్చినదిగను, మనోహరముగను,నుండుగాలి సీతయొక్క నిశ్వాసమువలె వీచుచున్నది. (పద్మకేసర సంస్పృష్టః అనుపదము గాలియొక్క చల్లదనము, వృక్షాంతర వినిసృత అనుటచే మాంద్యము, నిశ్వాస ఇవ సీతాయాః అనుటచే సౌగంధ్యము సూచింపఁ బడినది. (దీనికి వ్యాఖ్యానములలో విశేషముగ అర్థము వ్రాయఁబడియున్నది )

(౨౨౫) పంపయొక్క దక్షిణభాగములోనుండు పర్వతముల ప్రక్కలో పూచి మిగుల మనోహరముగనుండు కర్ణికారలతను జూడుము.

(౨౩౫) గైరికాది ధాతువులతోనిండిన యీపర్వతము.గాలి వేగముచే నెగరకొట్టఁబడిన నానారంగులు గలరేణువులను కలిగించుచున్నది.

(౨౪౫) లక్ష్మణా! కొండప్రదేశములు నలుప్రక్కలోను ఆకులులేక బాగుగఁబూచి రమ్యముగనుండు మోదుగ చెట్లచే బాగుగ మండునట్లు ఉన్నవి.

(౨౫౫) పంపాసరసుతీరములోఁబుట్టి మకరంద గంధముతోఁగూడి పూచియుండు మాలతీ•మల్లిక కరవీరములు ఒకటితోనొకటి చేరియున్నవి.

(౨౬౫) కేతకి సిందువారము వాసంతి మాధవి గంధపూర్ణము కుందగుల్మము,

బిల్వా మధూకాశ్చ వంజులా వకుళా స్తథా।
చంపకా స్తిలకా శ్చైవ నాగవృక్షా స్సుపుష్పితాః। ౭౭½
నీపాశ్చ వరణా శ్చైవ ఖర్జూరా శ్చ సుపుష్పితాః।
పద్మకాశ్చోప శోభంతే నీలాఽశోకాశ్చ పుష్పితాః॥ ౭౮½
లోధ్రాశ్చ గిరిపృష్ఠేషు సింహ కేసర పింజరాః।
అంకోలాశ్చ కురంటాశ్చ పూర్ణకాః పారిభద్రకాః। ౭౯½
చూతాః పాటలయశ్చైవ కోవిదారాశ్చ పుష్పితాః।
ముచుళిందార్జునాశ్చైవ దృశ్యంతే గిరి సానుషు॥ ౮౦½
కేతకోద్దాలకాశ్చైవ శిరీషా శ్శింశుపాధవాః।
శాల్మల్యః కింశుకాశ్చైవ రక్తాః కురవకా స్తథా॥ ౮౧½
తినిశా నక్తమాలాశ్చ చందనా స్స్యందనా స్తథా॥ ౮౨
పుష్పితా న్పుష్పితాగ్రాభి ర్లతాభిః పరివేష్టితాన్।
ద్రుమాన్ పశ్య హ సౌమిత్రే పంపాయా రుచిరాన్ బహూన్॥
వాత విక్షిప్త విటపాన్ యథాఽఽసన్నాన్ ద్రుమా నిమాన్।
లతా స్సమనువర్తంతే మత్తా ఇవ వరస్త్రియః। ౮౪
పాదపా త్పాదపం గచ్ఛన్ శైలా చ్ఛైలం వనా ద్వనమ్।
వాతి నైకరసా స్వాద స్సంమోదిత ఇవానిలః॥ ౮౫
కేచి త్పర్యాప్తకుసుమాః పాదపా మధుగంధినః।
కేచి న్ముకుళసంవీతా శ్శ్యామవర్ణా ఇవాబభుః॥ ౮౬

(౭౭,౭౮) చిరి బిల్వ మధూక వంజుళ వకుళ చంపక తిలక నాగవృక్ష నీప వరణ కర్జూర పద్మక నీలాశోక,

(౭౯) సింహముల జడలవలె పింజరవర్ణముగనుండు కొండలలోఁగల లోధ్రి అంకోల కురంట పూర్ణక పారిభద్రక,

(౮౦) చూత పాటలి పాదరి కోవిదార ముచుళింద అర్జున వృక్షములు,

(౮౧) కేతక ఉద్దాలక శిరీష శింశుప ధవ శాల్మలి కింశుక రక్త కురవక,

(౮౨) తిమిశ, నక్తమాల, చందన, స్పందన, వృక్షములు బాగుగ పూచి యూగుపడుచున్నవి.

(౮౩) లక్ష్మణా! పూచియుండుకొనలు గలలతలచేఁ జుట్టఁబడి పంపాతీరములోఁ బుట్టి మనోహరముగఁబూచియుండు వృక్షములను జూడుము.

(౮౪) గాలిచే ఆడుచుండు శాఖలుగలిగి సమీపమునకు వచ్చుచుండు నీవృక్షములను, మదించిన ఉత్తమస్త్రీలవలె, లతలు ఆలింగనము చేసికొనుచున్నవి.

(౮౫) నానావిధము లగుపూలరసమును పానముచేసి మదించియుండుగా గాలి ఒకచెట్టునుండి యింకొకచెట్టుకు, ఒకపర్వతమునుండి యింకొక పర్వతమునకు, ఒకవనమునుండి యింకొక వనమునకుఁ బోవుచు వీచుచున్నది.

(౮౬) పుష్పరసముయొక్క పరిమళము గలకొన్నివృక్షములలో కొన్ని పూలుమాత్రము వికసించి యున్నవి. కొన్ని వృక్షములు మొగ్గలతో నిండి నల్లని వర్ణముగలిగి ప్రకాశించుచున్నవి.

ఇదం మృష్ట మిదం స్వాదు ప్రఫుల్ల మిద మిత్యపి।
రాగమత్తో మధుకరః కుసుమేష్వవలీయతే॥ ౮౭

నిలీయ పున రుత్పత్య సహసాఽన్యత్ర గచ్ఛతి।
మధులుబ్ధో మధుకరః పంపాతీరద్రుమేష్వసౌ॥ ౮౮

ఇయం కుసుమసంఘాతై రుపస్తీర్ణా సుఖాకృతా।
స్వయం నిపతితై ర్భూమి శ్శయన ప్రస్తరై రివ॥ ౮౯

వివిధా వివిధైః పుష్పై స్తై రేవ నగసానుషు।
వికీర్ణైః పీతరక్తాహి సౌమిత్రే ప్రస్తరాః కృతాః॥ ౯౦

హిమాంతే పశ్య సౌమిత్రే వృక్షాణాం పుష్పసంభవమ్॥ ౯౦½

పుష్పమాసే హి తరవ స్సంఘర్షా దివ పుష్పితాః।
ఆహ్వయంత ఇవా న్యోన్యం నగా ష్షట్పదనాదితాః॥ ౯౧½
కుసుమోత్తంసవిటపా శ్శోభంతే బహు లక్ష్మణ॥ ౯౨

ఏష కారండవః పక్షీ విగాహ్య సలిలం శుభమ్।
రమతే కాంతయా సార్ధం కామ ముద్దీపయ న్నమ॥ ౯౩

మందాకిన్యా స్తు య దిదం రూప మేవం మనోహరమ్।
స్థానే జగతి విఖ్యాతా గుణా స్తస్యా మనోరమాః॥ ౯౪

(౮౭) ఇది రమ్యముగ నున్నది, ఇది రసవత్తుగ నున్నది; ఇది బాగుగ వికసించియున్నది. అని సంతోషముచే మదించియుండు తుమ్మెద పూలలో దాగి యున్నది.

(౮౮) తేనమీద ఆశ గలతుమ్మెద పంపాతీరములో నుండు వృక్షములలో డాగి మరియు వెలుపల వచ్చి శీఘ్రముగ మరి యొక వృక్షమునకుఁ బోవుచున్నది.

(౮౯) ఈ భూమి తమకుతామే రాలిన పూలతోఁ గప్పఁబడి పడకవేయఁబడి నపుడు గలుగు సుఖమును గలిగించుచున్నది.

(౯౦) పర్వత ప్రాంత ప్రదేశములు, రాలియుండు నానావిధములగు పూలచే పచ్చని ఎఱ్ఱని మొదలగు రంగులు గలనానావిధములగు పాన్పులవలె అగుపడుచున్నవి.

(౯౦౪) లక్ష్మణా! వసంత కాలములో వృక్షములలో గలపూల సమృద్ధిని జూడుము.

(౯౧౪) వసంతమాసములో ఒకటితో నింకొకటిచేరుటచే పూచియుండు వృక్షములు తుమ్మెదల ధ్వనితో ఒకదాని నింకొకటి పిలుచునట్లులున్నది.

(౯౨) పూలు ఆభరణములుగ గలశాఖలతోఁ గూడిన వృక్షములు మిగుల ప్రకాశించుచున్నవి. లక్ష్మణా!

(౯౩) ఈ జలకుక్కుటము నిర్మల మగుజలములో మునిగి దాని భార్యతోడ, నాకు కామోద్దీపనము గలిగించుచు, భోగించుచున్నది.

(౯౮) పంపాసరసుకు గల రమణీయతవలెనె గంగయొక్కరూపము గూడ మిగులరమణీయముగ నున్నది. ఏలననఁగా, గంగయొక్క మనోహరమగు నుండు గుణములు జగములోఁ బ్రసిద్ధముగ నున్నవి.

యది దృశ్యేత సా సాధ్వీ యది చేహ వసేమహి।
స్పృహయేయం న శక్రాయ నాయోధ్యాయై రఘూత్తమ॥ ౯౫
న హ్యేవం రమణీయేషు శాద్వలేషు తయా సహ।
రమతో మే భవేచ్చింతా నస్పృహాఽన్యేషు వా భవేత్॥

అమీ హి వివిధైః పుష్పై స్తరవో రుచిరచ్ఛదాః।
కాననేఽస్మి న్వినా కాంతాం చిత్త మున్మాదయంతి మే॥ ౯౬
పశ్య శీతజలాం చేయం సౌమిత్రే పుష్కరాయుతామ్।
చక్రవాకానుచరితాం కారండవనిషేవితామ్॥ ౯౭
ప్లవైః క్రౌంచైశ్చ సంపూర్ణాం వరాహమృగసేవితామ్॥ ౯౮

అధికం శోభతే పంపా వికూజద్భి ర్విహంగమైః॥ ౯౯

దీపయంతీవ మే కామం వివిధా ముదితా ద్విజాః।
శ్యామాం చంద్రముఖీం స్మృత్వా ప్రియాం పద్మనిభేక్షణామ్॥
పశ్య సానుషు చిత్రేషు మృగీభి స్సహితా న్మృగాన్।
మాం పున ర్మృగశాబాక్ష్యా వైదేహ్యా విరహీకృతమ్॥ ౧౦౧
వ్యథయంతీవ మే చిత్తం సంచరంత స్తత స్తతః।
అస్మిన్ సానుని రమ్యే హి మత్త ద్విజగణాయుతే॥ ౧౦౨

(౯౪) రఘుకులములో నుత్తముఁడా! పతివ్రత యగుసీత యిచట అగుప డి, ఆపెతోడ యిచట వసించుటకు గలిగినట్లైతే, నేను ఇంద్రపదవిని అయోధ్యకుఁ బోవుటను గోరను.

(౯౫) ఈ విధముగ రమణీయముగ నుండు పచ్చిక భూములలో సీత తోడ ఆటలాడుచుండిన నాకు ఒక చింతయును నుండదు. ఇతర విషయమ్ములలో నాశయు నుండదు.

(౯౬) నానావిధము లగుపూలు గలిగి మనోహరమగు ఆకులు గల యీ వృక్షములు యీ యరణ్యములో భార్యను నెడబాసి యుండు నా చిత్తమునకు భ్రాంతి గలిగించు చున్నవి.

(౯౭, ౯౮) లక్ష్మణా! చల్లని జలము గలదియు, పద్మములతో నిండి నదియు, సంచరించుచుండు చక్రవాకములు నీటికాకులు గలగి, నీటికోళ్ళు క్రౌంచపక్షులు పందులు జింకలతోఁ గూడిన యీ పంపను జూచుము.

(౯౯) కూయుచుండు పక్షులను గలిగి పంపాసరసు మిగుల ప్రకాశించు చున్నది.

(౧౦౦) యువతియై చంద్రుని వంటి ముఖము పద్మమువంటి నేత్రములు గల ప్రియురాలిని స్మరించుచుండు నాకు, ప్రియురాండ్రతోఁ గూడి సంతోషించుచుండు నానావిధములగు పక్షులు, కామోద్దీపనము గలిగించుచున్నవి.

(౧౦౧) మనోహరములుగ నుండు కొండ ప్రదేశములలో ఆడు జింకల తోఁ గూడియుండు మగ జింకలను, జింకపిల్ల నేత్రముల వంటి నేత్రములు గల సీతను నెడబాసి యుండు నన్ను, జూచుము.

(౧౦౨) మనోహరముగను మదించిన పక్షుల గుంపులతోఁ గూడినదిగను నుండు యీ పర్వత ప్రాంతములలో, అచ్చటచ్చట సంచరించుచుండు, జింకలు మొదలగునవి నా మనసునకు సంకటము గలిగించుచున్నవి.

పశ్యేయం యది తాం కాంతాం తత స్స్వస్తి భవేన్మమ॥

జీవేయం ఖలు సౌమిత్రే! మయా సహ సుమధ్యమా।
సేవతే యది వై దేహీ పంపాయాః పవనం సుఖమ్॥ ౧౦౩॥

పద్మసౌగంధికవహం శివం శోకవినాశనమ్।
ధన్యా లక్ష్మణ సేవంతే పంపోపవనమారుతమ్॥ ౧౦౪॥

శ్యామా పద్మపలాశాక్షీ ప్రియా విరహితా మయా।
కథం ధారయతి ప్రాణాన్ వివశా జనకాత్మజా॥ ౧౦౫॥

కిన్ను వక్ష్యామి రాజానం ధర్మజ్ఞం సత్యవాదినమ్।
సీతాయా జనకం పృష్టః కుశలం జనసంసది॥ ౧౦౬॥

యా మా మనుగతా మందం పిత్రా ప్రవ్రాజితం వనమ్।
సీతా సత్పథమాస్థాయ క్వను సా వర్తతే ప్రియా॥ ౧౦౭॥

తయా విహీనః కృపణః కథం లక్ష్మణ ధారయే।
యా మా మనుగతా రాజ్యా ద్భ్రష్టం విగతచేతసమ్॥ ౧౦౮॥

(౧౦౨౫) నా ప్రియురాలిని జూచినట్లైతే నాకు క్షేమముగలుగును.

(౧౦౩౫) లక్ష్మణా! మంచి కటిప్రదేశము గలజనకుని కూతు రగు సీత నాతో సుఖముగ నుండు నీపంపాసరస్సు గాలిననుభవించి నట్లైతే అప్పుడే నా జన్మము సార్థకమగును.

(౧౦౪౫) తామర సౌగంధిక పూల గంధమును దెచ్చునదియు, శుద్ధముగ నుండునదియు, దుఃఖమును బోగొట్టునదియు, పంపయొక్క ఉపవనముల నుండి వచ్చుచుండు యీ గాలిని, లక్ష్మణా! కాంతలతోఁ గూడి ధన్యులుగ నుండు వారు అనుభవించెదరు.

(౧౦౫౫) యౌవన మధ్యస్థురాలుగను తామరరేకులవంటి నేత్రములు గలదిగను జనకుని కూతురుగను నా ప్రియురాలుగను నుండు సీత నన్నెడబాసి పరవశురాలై ప్రాణములను నెట్లుల ధరించి యుండును.

(౧౦౬౫) 'సీతతోఁ గూడిన నీకు క్షేమమా' యని సభలో నన్నడిగినట్లైతే, ధర్మజ్ఞుఁడుగను సత్యవాదిగను నుండు శ్రీ జనకజనకునికి నేనేమి బదులు చెప్పఁగలను.

(౧౦౭౫) పతివ్రతల మార్గమును నాశ్రయించి, తండ్రిమాటవిని అరణ్యమునకుఁ బోవుచుండు నన్ను అనుసరించి, వచ్చిన నాప్రియురాలగు అట్టి సీత యెచట నున్నదో.

(౧౦౮౫) రాజ్యభ్రష్టుఁడనై మనసు చెడిన నన్ను అనుసరించి వచ్చిన సీతను నెడబాసి దీనుఁడనై యెట్లుల ప్రాణము పెట్టుకొని యుండఁగలను. లక్ష్మణా!

తచ్చార్వంచితపక్ష్మాక్షం సుగంధి శుభ మవ్రణమ్।
అపశ్యతో ముఖం తస్యా స్సీదతీవ మనో మమ॥ ౧౦౯

స్మితహాస్యాంతరయుతం గుణవ న్మధురం హితమ్।
వైదేహ్యా వాక్య మతులం కదా శ్రోష్యామి లక్ష్మణ॥ ౧౧౦

ప్రాప్య దుఃఖం వనే శ్యామా సా మాం మన్మథ కర్శితమ్।
నష్టదుఃఖేవ హృష్టేవ సాధ్వీ సాధ్వభ్యభాషత॥ ౧౧౧

కిన్ను వక్ష్యామి కౌసల్యా మయోధ్యాయాం నృపాత్మజ।
క్వ సా స్నుషేతి పృచ్ఛంతీం కథంచాతిమనస్వినీమ్॥ ౧౧౨

గచ్ఛ లక్ష్మణ పశ్య త్వం భరతం భ్రాతృవత్సలమ్।
న హ్యహం జీవితుం శక్త స్తామృతే జనకాత్మజామ్॥ ౧౧౩

ఇతి రామం మహాత్మానం విలపంత మనాథవత్।
ఉవాచ లక్ష్మణో భ్రాతా వచనం యుక్త మవ్యయమ్॥ ౧౧౪

సంస్తంభ రామ భద్రం తే మాశుచః పురుషోత్తమ।
నేదృశానాం మతి ర్మందా భవత్యకలుషాత్మనామ్॥ ౧౧౫

(౧౦౯-౪) మనోహరమై పళపళ లాడుచుండు ఱెప్పలతోఁ గూడిన నేత్రములు గలదియు, సువాసనతోఁ గూడినదియు, ప్రకాశించుచుండునదియు, నిర్దోషమైనదియు, నగు సీత ముఖమును జూడకయుండు నా మనసు మిగుల దుఃఖించుచున్నది.

(౧౧౦౪) స్వాభావికముగనుండు చిఱునవ్వుతోను, ఆగంతుక హాస్యరసముతోను గూడినవియు, నా మాటలకంటె ఉత్కృష్టముగ నుండు నవియు, ప్రియముగను హితముగను నుండునవియు, అసమానముగ నుండునవియు, నగు సీత పలుకులను నెపుడు వినగలను.

(౧౧౧౪) సంపూర్ణముగనుండు యౌవనముగల పతివ్రతగనుండు సీత మనసులో దుఃఖించియు ఆట్టిదుఃఖమును బయలుపరచక, సంతోషమునె దెలుపుచు, నామన్మథపీడను బోగొట్టునట్టి పలుకును పూర్వము నాతోఁ జెప్పెను.

(౧౧౨౪) 'నాకోడలు యెచటనున్నది ఎటులున్నది.' అని అయోధ్యలో మిగుల మంచి మనసుతో ప్రశ్నసేయుచుండు కౌసల్యకు, ఓ లక్ష్మణా! నేనేమి బదులు చెప్పఁగలను. (అతిమనస్వినీ - అను పదముచే సీతాపహరణము దెలిపినచో కౌసల్య సైచక అపుడే ప్రాణము విడుచునని భావము.)

(౧౧౩౪) లక్ష్మణా! నీవు అయోధ్యకుఁ బొమ్ము. భ్రాతృవాత్సల్యము గల భరతుని జూడుము. జనకుని కూతు రగుసీతను విడిచి నేను జీవించలేను.

(౧౧౪౪) మహాత్ముఁడును, ఇటుల అనాథవలె విలపించుచుండువాఁడును, నగు రాముని జూచి తమ్ముఁ డగులక్ష్మణుఁడు, యుక్తిచే తిరస్కరించుటకు సాధ్యపడని మాటను నిటుల చెప్పెను.

(౧౧౫౪) ఓరామా! ధైర్యమును నవలంబింపుము. నీకు మంగళమగుగాక. పురుషోత్తముఁడా! దుఃఖపడకుము. ధీరులగు నీవంటివారిబుద్ధి క్షీణింపదు.

స్మృత్వా వియోగజం దుఃఖం త్యజ స్నేహం ప్రియే జనే।
అతిస్నేహ పరిష్వంగా ద్వర్తిరార్ద్రాऽపి దహ్యతే॥ ౧౧౬॥

యది గచ్ఛతి పాతాళం తతో హ్యధికమేవవా।
సర్వథా రావణ స్తావ న్నభవిష్యతి రాఘవ॥ ౧౧౭॥

ప్రవృత్తి ర్లభ్యతాం తావ త్తస్య పాపస్య రక్షసః।
తతో హాస్యతి వా సీతాం నిధనం వా గమిష్యతి॥ ౧౧౮॥

యది యాత్యదితే ర్గర్భం రావణ స్సహ సీతయా।
తత్రాऽప్యేనం హనిష్యామి నచే ద్దాస్యతి మైథిలీమ్॥ ౧౧౯॥

స్వాస్థ్యం భద్రం భజస్వార్య త్యజ్యతాం కృపణా మతిః।
అర్థోహి నష్టకార్యార్థై ర్నాయత్నే నాధిగమ్యతే॥ ౧౨౦॥

ఉత్సాహో బలవా నార్య నాస్త్యుత్సాహా త్పరం బలమ్।
సోత్సాహస్యాస్తి లోకేస్మి న్నకించి దపి దుర్లభమ్॥ ౧౨౧॥

ఉత్సాహవంతః పురుషా నావసీదంతి కర్మసు।
ఉత్సాహమాత్ర మాశ్రిత్య సీతాం ప్రతిలభే మహి॥ ౧౨౨॥
త్యజ్యతాం కామవృత్తత్వం శోకం సన్న్యస్య పృష్ఠతః।
మహాత్మానం కృతాత్మాన మాత్మానం నావబుధ్యసే॥ ౧౨౩॥

(౧౧౬౪) వియోగమువలన దుఃఖముగలుగుట లోకములో సహజమని తలంచి, దుఃఖహేతువుగ నుండు ప్రియులయందుగల విశేషమైన స్నేహమును విడువుము. జలములో తడిపిన వత్తి విశేషముగ తైలములో నానుటవల్ల కాలిపోవుచున్నది. (అనఁగా, వాత్సల్యమును విడిచి చేతనుని సంరక్షించు ఉపాయమును నాలోచింపవలయునని భావము.)

(౧౧౭౪) రామా! రావణుఁడు పాతాళలోకమునకు, లేక, దానికంటె లోపలనుండు లోకమునకుఁబోయినను, సర్వప్రయత్నములతోను జీవించఁడు.

(౧౧౮౪) పాపియగు ఆరాక్షసుని సమాచారమును దెలిసికొనవలయును. పిమ్మట, సీతను నైనను విడిచిపెట్టును. లేక, నాశమును బొందును.

(౧౧౯౪) రావణుఁడు సీతతోడ ఇంద్రుని తల్లియగు అదితిగర్భములోఁ బ్రవేశించినను, సీతను దెచ్చి సమర్పించక పోయినటులైతే, అచటికిఁబోయి వాని జంపెదను.

(౧౨౦౪) పూజ్యుఁడా! శుభముగలిగించుధైర్యమును బడయవలయును. దైన్యమును విడువుము. కార్యమును చెరచుకొనిన పురుషులు యత్నముసేయక ఆ కార్యమును సాధింపుకొనలేరు కదా.

(౧౨౧౪) పూజ్యుఁడా! ఉత్సాహమేబలమును నిచ్చును. ఉత్సాహమునకంటె గొప్ప బలములేదు. ఉత్సాహముతోఁ గూడిన వానికి లోకములో సాధ్యపడనిది యొద్దియు లేదు.

(౧౨౨౪) ఉత్సాహము గలపురుషులు కార్యసాధన విషయములో దుఃఖించరు. ఉత్సాహమునే ఆశ్రయించి సీతను కనిపెట్ట వచ్చును.

(౧౨౩౪) దుఃఖమును తిరస్కరించి కామవిషయమైన వ్యాపారమును విడువవలయును. పెద్దల సహవాసముచే మంచిమనసు గలవానివిగను మిగుల ధైర్యము గలవానివిగను నిన్ను నీవు తెలిసికొనలేవు.

ఏవం సంబోధిత స్తత్ర శోకోపహత చేతనః।
న్యస్య శోకం చ మోహం చ తతో ధైర్యముపాగమత్॥

సోభ్యతిక్రామ దవ్యగ్ర స్తా మచింత్యపరాక్రమః।
రామః పంపాం సురుచిరాం రమ్యపారిప్లవద్రుమామ్॥ ౧౨౫

నిరీక్షమాణ స్సహసా మహాత్మా సర్వం వనం నిర్ఝరకందరాం
శ్చ। ఉద్విగ్నచేతా స్సహలక్ష్మణేన విచార్య దుఃఖోపహతః
ప్రతస్థే॥ ౧౨౬

తం మత్తమాతంగవిలాసగామీ గచ్ఛంత మవ్యగ్రమనా మ
హాత్మా। స లక్ష్మణో రాఘవ మప్రమత్తో రరక్ష ధర్మేణ బలే
న చైవ॥ ౧౨౭

తౌ ఋశ్యమూకస్య సమీపచారీ చరన్దదర్శాద్భుతదర్శనీయౌ।
శాఖామృగాణా మధిప స్తరస్వీ వితత్రసే నైవ చిచేష్ట కించిత్॥

స తౌ మహాత్మా గజమందగామీ శాఖామృగ స్తత్ర చిరం
చరంతౌ। దృష్ట్వా విషాదం పరమం జగామ చింతాపరీతో భయ
భారమగ్నః॥ ౧౨౯

(౧-౧౨౪) దుఃఖాక్రాంతుఁడైన రామునికి లక్ష్మణుఁ డిటుల చెప్పఁగా, రాముఁడు దయను వాత్సల్యమును విడిచి ధైర్యమును నవలంబించెను.

(౧-౧౨౫) చింతించుటకు సాధ్యపడని పరాక్రమము గలవాఁడును సమర్థుఁడును నగు రాముఁడు, మనోహరముగను చలించుచుండు వృక్షములు గల పంపను దాటి పోయెను.

(౧-౧౨౬) మహాత్ముఁ డగు రాముఁడు వనము నంతయు కొండనదులను గుహలను లక్ష్మణునితోఁడ జూచి సీతను వెతకి ఆమె లభించనందున దుఃఖాక్రాంతుడై ప్రయాణము చేసెను.

(౧-౧౨౭) మదించిన యేనుఁగు నడకవంటి నడక గలవాఁడును రాముని విషయమైన ప్రేమకు చంచలము లేనివాఁడును, మిగుల ధైర్యము గలవాఁడును, నగు లక్ష్మణుఁడు జాగ్రత్త గలవాఁడై (అనఁగా, శ్రీరామునిగమన సౌందర్యమును ననుభవించి మైమఱవకుండువాఁడని భావము.) సీతావియోగదుఃఖముచేఁ బీడింపఁబడి పోవుచుండు రామునికి రాజనీతిని అతనిబలమును దెలిపి దుఃఖము బోగొట్టెను.

(౧-౧౨౮) ఋశ్యమూక పర్వతము సమీపములో సంచరించుచుండువాఁడును, బలముగలవాఁడును, వానరులకు రాజును నగు సుగ్రీవుఁడు ఒక సమయములో పంపాతీరములో సంచరించుచుండు ఆశ్చర్యమును గలిగించు రూపములు గల రామలక్ష్మణులను జూచి భయపడి, చేష్టలుడిగి యుండెను.

(౧-౧౨౯) మహాత్ముఁడును గజమువలె గంభీరముగ నడచువాఁడును నగు సుగ్రీవుఁడు పంపాతీరములో సంచరించుచు రామలక్ష్మణులను జూచి మిగుల దుఃఖించి చింతాక్రాంతుఁడై మిగులభయపడెను.

త మాశ్రమం పుణ్యసుఖం శరణ్యం స దైవ శాఖామృగ సేవి
తాంతమ్ । త్రస్తాశ్చ దృష్ట్వా హరయో౽భిజగ్ము ర్మహౌజసౌ
రాఘవలక్ష్మణౌ తౌ॥

ఇతి శ్రీమత్కిష్కింధా కాండే - ప్రథమస్సర్గః.

---

## ద్వితీయస్సర్గః.

తౌ తు దృష్ట్వా మహాత్మానౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ।
వరాయుధధరౌ వీరౌ సుగ్రీవ శ్శంకితో౽భవత్॥ ౧
ఉద్విగ్నహృదయ స్సర్వా దిశ స్సమవలోకయన్।
నవ్యతిష్ఠత కస్మింశ్చి ద్దేశే వానరపుంగవః॥ ౨
నైవచక్రే మన స్స్థానే వీక్షమాణో మహాబలౌ।
కపేః పరమభీతస్య చిత్తం వ్యవససాద హ॥ ౩
చింతయిత్వా స ధర్మాత్మా విమృశ్య గురులాఘవమ్॥
సుగ్రీవం పరమోద్విగ్న స్సర్వై రనుచరై స్సహ॥ ౪
తత స్స సచివేభ్యస్తు సుగ్రీవః ప్లవగాధిపః।
శశంస పరమోద్విగ్నః పశ్యం స్తౌ రామ లక్ష్మణౌ॥ ౫
ఏతౌ వన మిదం దుర్గం వాలిప్రణిహితౌ ధ్రువం।
ఛద్మనా చీరవసనౌ ప్రచరంతావిహాగతౌ॥ ౬

(౧౩౦౯) మిగులతేజస్సు గలరామలక్ష్మణులనుజూచి భయపడినవారై, పుణ్యమును సుఖమును నిచ్చునదియు ఋషులు వసించుటకు తగినదియు సదాహావరులుండు మధ్యప్రదేశము గలదియు నగుమతంగుని ఆశ్రమమునకు సుగ్రీవుఁడు మొదలగు వానరులు పోయిరి.

ఇది యొకటవ సర్గ.

---

౨వ సర్గ.

(అవతారిక.— సుగ్రీవుఁడు హనుమంతుని శ్రీరామలక్ష్మణులవద్దకు బంపుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) మనోహరముగనుండు శరీరము శ్రేష్ఠమైనఆయుధములు గలవీరులును అన్నదమ్ములును నగురామలక్ష్మణులను జూచి సుగ్రీవుఁడు సందేహపడెను.

(౨) వానరశ్రేష్ఠుఁ డగుసుగ్రీవుఁడు భయపడి దిక్కులు చూచుచు ఒకచోట నిలువలేకపోయెను.

(౩) గొప్పబలము గలరామలక్ష్మణులనుజూచిన సుగ్రీవునికి మనసు స్థిమితపడలేదు. మిగుల భయపడిన అతని మనసు దుఃఖించెను.

(౪) రాజనీతిని నెరింగినసుగ్రీవుఁడు మంత్రులతో బలాబలములను విచారించి (అచట నేయుండుట లేక పారిపోవుట యుక్తమాయని విచారించి యనుట) మిగులభయపడి యుండెను.

(౫) పిమ్మట, వానరరాజగు సుగ్రీవుఁడు మిగులభయపడి మంత్రులతోడ రామలక్ష్మణులను జూచుచు వారి స్వభావములను జెప్పెను.

(౬) వీరు ప్రవేశించుటకు సాధ్యముగాని యీవనమునకు వాలిపంపుననె వచ్చియుందురు. *నిజము. కపటముచే నారవస్త్రములు ధరించి యిచట్ల సంచరించుచున్నారు.

తత స్సుగ్రీవసచివా దృష్ట్వా పరమధన్వినౌ।
జగ్ము ర్గిరితటా త్తస్మా దన్య చ్ఛిఖరముత్తమమ్॥ ౭
తే క్షిప్ర మధిగమ్యాథ యూథపా యూథపర్షభమ్।
హరయో వానరశ్రేష్ఠం పరివార్యోపతస్థిరే॥ ౮
ఏక మేకాయనగతాః ప్లవమానా గిరే ర్గిరిమ్।
ప్రకంపయంతో వేగేన గిరీణాం శిఖరాణ్యపి॥ ౯
తత శ్శాఖామృగా స్సర్వే ప్లవమానా మహాబలాః।
బభంజు శ్చ నగాం స్తత్ర పుష్పితాన్ దుర్గసంశ్రితాన్॥ ౧౦
ఆప్లవంతో హరివరా స్సర్వత స్తం మహాగిరిమ్।
మృగమార్జారశార్దూలాం స్త్రాసయంతో యయు స్తదా॥ ౧౧
తత స్సుగ్రీవసచివాః పర్వతేంద్రం సమాశ్రితాః।
సంగమ్య కపిముఖ్యేన సర్వే ప్రాంజలయ స్స్థితాః॥ ౧౨
తత స్తం భయసంవిగ్నం వాలికిల్బిషశంకితమ్।
ఉవాచ హనుమా న్వాక్యం సుగ్రీవం వాక్యకోవిదః॥ ౧౩
సంభ్రమ స్త్యజ్యతా మేష సర్వై ర్వాలికృతే మహాన్।
మలయోయం గిరివరో భయం నేహాస్తి వాలినః॥ ౧౪
యస్మా దుద్విగ్నచేతా స్త్వం ప్రద్రుతో హరిపుంగవ।
తం క్రూరదర్శనం క్రూరం నేహ పశ్యామి వాలినమ్॥ ౧౫

(౭) పిమ్మట, సుగ్రీవుని మంత్రులు ఉత్తమమైన ధనుస్సులు ధరించి యుండు రామలక్ష్మణులను జూచి ఆపర్వతము శిఖరమునుండి యింకొక శిఖరము నకుఁ బోయిరి.

(౮) వానరసేనను పరిపాలించునట్టి యీమంత్రులు శీఘ్రముగఁ గుంపుగూడి వానరసేనాపతులలో మొదటివాఁడుగనుండు సుగ్రీవుని జుట్టుకొనియుండిరి.

(౯) మఱియు, ఒక కొండనుండి యింకొక కొండకు దాటుచు పర్వత శిఖరములను వాడించుచు క్రమముగ నొకచోటచేరి ఏకాకిగనుండు సుగ్రీవుని సమీపములోఁ గూడిరి.

(౧౦) పిమ్మట, గొప్పబలము గలవానరులందరు ఒకకొండనుండి యింకొక కొండకు దాటుచు పర్వతములలో పూచియుండిన చెట్లను నాశము చేసిరి.

(౧౧) ఆవానరోత్తములు ఆగొప్పకొండను దాటుచు జింకలను అడవి పిల్లులను పులులను భయపరచుచు పోయిరి.

(౧౨) పిదప, సుగ్రీవునిమంత్రులు ఋశ్యమూకపర్వతముచేరి సుగ్రీవుని సమీపించి అందరు అంజలిబంధము చేసికొని యుండిరి.

(౧౩) పిమ్మట, భయముచే దీనుఁడుగను వాలి కపటము సేసియుండునని శంకించియుండినవాఁడును నగు సుగ్రీవునితో, మాటలుచెప్పుటలో సమర్థుఁడగు హనుమంతుఁ డిట్లనెను.

(౧౪) వాలివలన గలిగిన యీగొప్పభయమును నందరు విడువవలయును. ఇది ఋశ్యమూకపర్వతము. వాలివలని భయ మిచటలేదు.

(౧౫) ఓ కపిశ్రేష్ఠుఁడా! వాలికి భయపడి నీవు పారిపోతివి.. భయంకరమగు చూపుగలవాఁడును క్రూరుఁడును నగువాలిని నే నెపుడును జూడలేదు.

యస్మాత్తవ భయం సౌమ్య పూర్వజాత్పాపకర్మణః।
నేహ వాలీ దుష్టాత్మా నతే పశ్యా మ్యహం భయమ్॥ ౧౬

అహో శాఖామృగత్వం తె వ్యక్త మేవ ప్లవంగమ।
లఘుచిత్తతయాఽత్మానం నస్థాపయసి యో మతౌ॥ ౧౭

బుద్ధివిజ్ఞానసంపన్న ఇంగితై స్సర్వ మాచర।
నహ్యబుద్ధిం గతో రాజా సర్వభూతాని శాస్తి హి॥ ౧౮

సుగ్రీవ స్తు శుభం వాక్యం శ్రుత్వా సర్వం హనూమతః
తత శ్శుభతరం వాక్యం హనూమంత మువాచహ॥ ౧౯

దీర్ఘబాహూ విశాలాక్షౌ శరచాపాసిధారిణౌ।
కస్య నస్యాద్భయం దృష్ట్వా హ్యేతౌ సురసుతోపమౌ॥ ౨౦

వాలిప్రణిహితా వేతౌ శంకేహం పురుషోత్తమౌ।
రాజానో బహుమిత్రాశ్చ విశ్వాసో నాత్ర హి క్షమః॥ ౨౧

అరయశ్చ మనుష్యేణ విజ్ఞేయా శ్ఛన్నచారిణః।
విశ్వస్తానా మవిశ్వస్తా రంధ్రేషు ప్రహరంతి హి॥ ౨౨

కృత్యేషు వాలీ మేధావీ రాజానో బహుదర్శనాః।
భవంతి పరహంతార స్తేజ్ఞేయాః ప్రాకృతై ర్నరైః॥ ౨౩

(౧౬) ఓ సౌమ్యుఁడా! జ్యేష్ఠుఁడును, పాపియును నగువాలివలన నీకు భయముగలుగదు. దుష్టుఁడగు అట్టివాలి యిచటికి రాఁడు. కనుక నీభయము లేదు.

(౧౭) చపలచిత్తుఁడవగుటచే నీకు మంచి విచారణలో బుద్ధిలేనందున, ఓ వానరుఁడా! నీశాఖామృగత్వము వ్యక్తమగుచున్నది. అయ్యో.

(౧౮) సామాన్యజ్ఞానము విశేషజ్ఞానముతోఁగూడి పరుల అభిప్రాయమును దెలిసికొని పనులుసేయవలయును. బుద్ధి విజ్ఞానము ఇంగితము లేనిరాజు ప్రజలను రక్షించనేరఁడు.

(౧౯) హనుమంతుఁడు చెప్పిన యుక్తియుక్తమగు మాటలు సుగ్రీవుఁడు విని, పిమ్మట, అతనితో నిటుల మంచిమాటలు చెప్పెను.

(౨౦) పొడవైన చేతులుగలవారును, విశాలమైన నేత్రములుగలవారును, బాణములు ధనుస్సులు ఖడ్గములుగలవారును, దేవకుమారులలో సములుగనుండు వీరిని జూచి యెవరికి భీతికలుగకుండును.

(౨౧) వాలిపంపినందుననె వీరు వచ్చియున్నారు. వీరు పురుషోత్తములని తలంచుచున్నాను. రాజులకు మిత్రులనేకు లుందురు. వీరిని మనము నమ్మరాదు.

(౨౨) కపటవేషము ధరించి సంచరించుచుండు శత్రువులను, శత్రువులుగలవాఁడు తెలిసికొనవలయును. ఏలనన్నఁగా, నమ్మియుండిన శత్రువుకు ప్రమాదము గలిగినపుడు నమ్మకములేని శత్రువులతని జంపుదురు.

(౨౩) వాలి పనులుసేయుటలో మిగుల దీర్ఘాలోచనగలవాఁడు. ఏలనన్నఁగా, రాజులు అనేకఉపాయములను నెరింగినవారు. శత్రువులను జంపుదురు. అట్టి రాజుల స్వభావమును దీనమైన వేషమునుధరించి పోయికనిపెట్టవలయును.

తౌ త్వయా ప్రాకృతే నైవ గత్వా జ్ఞేయౌ ప్లవంగమ।
ఇంగితానాం ప్రకారైశ్చ రూపవ్యాభాషణేన చ॥ ౨౪

లక్షయస్వ తయో ర్భావం ప్రహృష్టమనసా యది।
విశ్వాసయ న్ప్రశంసాభి రింగితైశ్చ పునఃపునః॥ ౨౫

మమైవాభిముఖం స్థిత్వా పృచ్ఛ త్వం హరిపుంగవ।
ప్రయోజనం ప్రవేశస్య వనస్యాస్య ధనుర్ధరౌ॥ ౨౬

శుద్ధాత్మానౌ యది త్వేతౌ జానీహి త్వం ప్లవంగమ।
వ్యాభాషితై ర్వా విజ్ఞేయా స్యా ద్దుష్టాదుష్టతా తయోః॥ ౨౭

ఇత్యేవం కపిరాజేన సందిష్టో మారుతాత్మజః।
చకార గమనే బుద్ధిం యత్ర తౌ రామలక్ష్మణౌ॥ ౨౮

తథేతి సంపూజ్య వచస్తు తస్య తత్కపే స్సుభీమస్య దురాసద
స్య చ। మహానుభావో హనుమా న్యయౌ తదా స యత్ర
రామోఽతిబలశ్చ లక్ష్మణః॥ ౨౯

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - ద్వితీయస్సర్గః

(౨౪) ఓ వానరుఁడా! నీవు ప్రాకృతవేషము ధరించియే అచటికిఁబోయి భావమును బ్రకాశింపఁజేయు కాయిక వ్యాపారభేదములచేతను సౌమ్యాసౌమ్య లక్షణములచేతను, పరస్పర సంభాషణములచేతను వారిని కనిపెట్టవలయును.

(౨౫,౨౬) వారి భావములను గనిపెట్టుము. శుద్ధమైన మనసుగలవారుగ వారుండినటులైతే, అపుడు, స్తోత్రములతోను తదనుకూలమైన కాయిక వ్యాపారములతోను మరియు మరియు వారికి నమ్మకముగలిగించుచు, నాకుఅభిముఖముగనే యుంచుకొని, ధనుసును ధరించుకొని యిచటికి వచ్చినందుకు కారణమును, ఓవానరశ్రేష్ఠుఁడా! అడుగుము.

(౨౭) హనుమంతుఁడా! వీరు పరిశుద్ధమైన మనసుగలవారుగనుండినటులైతే, మరియు, వారి శుద్ధాశుద్ధ స్వభావములను వారిమాటలద్వారా గ్రహింపుము.

(౨౮) ఈవిధముగ వానరరాజగు సుగ్రీవుఁడు ఆజ్ఞాపించగా వాయుపుత్రుఁడగు హనుమంతుఁడు రామలక్ష్మణులుండుచోటికిఁ బోవుటకు యత్నించెను.

(౨౯) మిగుల భయమును గలిగించువాఁడును, శత్రువులు తిరస్కరించుటకు సాధ్యపడనివాఁడును నగుసుగ్రీవునిమాటను గౌరవించి, అటులనే చేయునటులచెప్పి, గొప్ప మహిమ గలహనుమంతుఁడు మిగులబలశాలురగురామలక్ష్మణు లుండుచోటికిఁ బోవుటకు యత్నించెను.

ఇది రెండవ సర్గ.

# తృతీయస్సర్గః



వచో విజ్ఞాయ హనుమాన్ సుగ్రీవస్య మహాత్మనః।
పర్వతా దృశ్యమూకాత్తు పుప్లువే యత్ర రాఘవౌ॥ ౧

కపిరూపం పరిత్యజ్య హనుమాన్మారుతాత్మజః।
భిక్షురూపం తతో భేజే శఠబుద్ధితయా కపిః॥ ౨

తతస్స హనుమాన్వాచా శ్లక్ష్ణయా సుమనోజ్ఞయా।
వినీతవ దుపాగమ్య రాఘవౌ ప్రణిపత్య చ॥ ౩
ఆబభాషే తదా వీరౌ యథావత్ప్రశశంస చ॥ ౩½

## ౩ వ సర్గ.

(అవతారిక.— ఈ కాండయొక్క మొదటిసర్గలో, కొందరు చేతనులు భగవంతుని కైంకర్యముచేసి నిత్యానందము ననుభవించుచుండగా, కొందరు విషయాంతరములలో మనసుంచియుండుటచూచి భగవంతుఁడు కరుణించుచున్నాడని చెప్పఁబడినది. రెండవసర్గలో భగవద్భక్తిలేనందున దండన గలుగునని భయపడియుండు చేతనుఁడు భగవంతునియందు మనసుంచి, అతనికభిముఖుఁడగుట చెప్పబడినది. ఈ మూఁడవసర్గలో, భగవంతుని బడయుటలో హేతువుగనుండు ఆచార్యకృత్యము దెలుపఁబడుచున్నది.)

(౧) హనుమంతుఁడు మహాత్ముఁడగు సుగ్రీవునిఅభిప్రాయము తెలిసికొని ఋశ్యమూక పర్వతమునుండి రామలక్ష్మణు లుండుచోటికి గంతువేసిపోయెను.

(౨) వాయుపుత్రుఁడగు హనుమంతుఁడు వానర రూపమును విడిచి, వంచించుటకు కోరిక గలిగియుండుటచే, సన్న్యాసివేషము ధరించెను.

(౩,౪) పిమ్మట, హనుమంతుఁడు వినయముతో సమీపమునకుఁ బోయి వారికి నమస్కరించి మృదువుగను, అర్థముచే రమ్యముగను నుండుమాటలుచెప్పి, వీరులగు రామలక్ష్మణులను పరమార్థముగ స్తోత్రము చేసెను. (ఈశ్లోకములో సన్న్యాసి వేషముధరించిన హనుమంతుఁడు రామలక్ష్మణులకు నమస్కరించినటుల చెప్పఁబడినది. కనుక, లోకములో సన్న్యాసిగనుండువాఁడు గృహస్థునికి నమస్కారముచేయవచ్చునని యేర్పడుచున్నది. సన్న్యాసి గృహస్థునికి నమస్కారము సేయకూడదను నిషేధవాక్యములు అజ్ఞుఁడగు గృహస్థునికే అన్వయించునని తెలిసికొనవలయును. కాషాయదండమాత్రముచేతనే పూజ్యుఁడుగనుండుయతి జ్ఞానముచే అధికులుగనుండు గృహస్థాదులకు నమస్కారము సేయకపోయినచో 'విప్రాణాం జ్ఞానతో జ్యైష్ఠ్యం' అను మనువచనమునకు విరోధమువచ్చును. మరియు, సన్న్యాసి

సంపూజ్య విధివ ద్వీరౌ హనుమా న్మారుతాత్మజః॥
ఉవాచ కామతో వాక్యం మృదుసత్యపరాక్రమః॥ ౪

రాజర్షి దేవప్రతిమౌ తాపసౌ సంశితవ్రతౌ।
దేశం కథ మిమం ప్రాప్తౌ భవంతౌ వరవర్ణినౌ॥ ౫

త్రాసయంతౌ మృగగణా నన్యాంశ్చ వనచారిణః।
పంపాతీరరుహా న్వృక్షా న్వీక్షమాణౌ సమంతతః॥ ౬

ఇమాం నదీం శుభజలాం శోభయంతౌ తపస్వినౌ॥
ధైర్యవంతౌ సువర్ణాభౌ కౌ యువాం చీరవాససౌ॥ ౭

గృహస్థునికి నమస్కరించరాదని మనువు చెప్పలేదు. అత్యద్భుతమగు రామలక్ష్మణుల రూపసందర్శనముచే విస్మితుఁడై, అతఁడు ధరించిన సన్యాసి రూపమును మరచి హనుమంతుఁడు నమస్కరించెనని చెప్పుట యుక్తియుక్తముకాదు. ఇదియూ పక్రమమునకు విరోధముగనుండును. ఇంగితాదులచే రామలక్ష్మణుల యభిప్రాయములను దెలిసికొనుటకే యితని సుగ్రీవుఁడు పంపెను. అట్టిసంధిలో నిట్టి సచివధురంధరుఁడగు హనుమంతుఁ డతని స్వరూపమును మరచి యిటులచేసియుండుననుట తగదు. కొందరు భిక్షుశబ్దమునకు బ్రహ్మచారియని యర్థము యచటచెప్పుదురు. అదిసరికాదు. బ్రహ్మచారిగనుండి హనుమంతుడు బ్రహ్మచారి వేషము ధరించెననుట యుక్తము కాదు.)

(౪౫)వీరుఁడును వాయుపుత్రుఁడును నగుహనుమంతుఁడుశాస్త్రోక్తప్రకారము వీరినిఁబూజించి సత్యమైన పరాక్రమము గలరామలక్ష్మణులతో సుగ్రీవుఁడుచెప్పినదానికి విరోధములేక యితనియిష్టప్రకారము మృదువుగ నిటుల నెను.

(౫౫,౬౫) మృగములను వనములో సంచరించుచుండు యితరులను భయపెట్టువారును,నలుప్రక్కల పంపాతీరములోనుండు వృక్షములను జూచువారును నగుమీరు మిగుల అందమగు రూపము గలిగి యున్నారు. అందుచేతనే రాజర్షులతోను దేవతలతోను సమానులుగను ఉగ్రమైన వ్రతముగల వారుగను నుండు మీరు ఋషివేషముధరించి యిట్టిదుర్గమమగు ప్రదేశమున కెందుకు వచ్చితిరి.

(౭౫,౮౫,౯౫,౧౦)మనోహరమగుజలము గలయీపంపాసరసును తేజస్సుచేఁ బ్రకాశింపఁజేయువారుగను,ఋషివేషములుధరించియుండువారుగను, ధీరులుగనుండువారుగను,బంగారువంటి దేహకాంతిగలవారుగను, నారవస్త్రములు ధరించినవారుగను, మార్గాయాసముచే నిట్టూర్పు విడుచుచుండువారుగను, ఉత్తమ

నిశ్వసంతౌ వరభుజౌ పీడయంతౌ విమాః ప్రజాః।
సింహవిప్రేక్షితౌ వీరౌ సింహాతిబలవిక్రమౌ॥ ౮½

శక్రచాపనిభే చాపే గృహీత్వా శత్రుసూదనౌ।
శ్రీమంతౌ రూపసంపన్నౌ వృషభశ్రేష్ఠవిక్రమౌ॥ ౯½

హస్తిహస్తోపమభుజౌ ద్యుతిమంతౌ నరర్షభౌ॥ ౧౦
ప్రభయా పర్వతేంద్రోఽయం యువయో రవభాసితః॥ ౧౦½

రాజ్యార్హా వమరప్రఖ్యౌ కథం దేశ మిహాగతౌ।
పద్మపత్రేక్షణౌ వీరౌ జటామండలధారిణౌ॥ ౧౧½

అన్యోన్యసదృశౌ వీరౌ దేవలోకా దివాగతౌ।
యదృచ్ఛయేవ సంప్రాప్తౌ చంద్రసూర్యౌ వసుంధరామ్॥ ౧౨½

విశాలవక్షసౌ వీరౌ మానుషౌ దేవరూపిణౌ।
సింహస్కంధౌ మహోత్సాహౌ సమదావివ గోవృషౌ॥ ౧౩½

ఆయతాశ్చ సువృత్తాశ్చ బాహవః పరిఘోపమాః।
సర్వభూషణభూషార్హాః కిమర్థం నవిభూషితాః॥ ౧౪½

ఉభౌ యోగ్యావహం మన్యే రక్షితుం పృథివీమిమామ్।
ససాగరవనాం కృత్స్నాం వింధ్యమేరు విభూషితామ్। ౧౫½

ఱుగు భుజములు గలవారుగను, పక్షులు మృగములు మొదలగుజంతువులను బీడించువారుగను, సింహమువంటి చూపుగలవారుగను, వీరులుగను, సింహముకంటె హెచ్చినబలము పరాక్రమము గలవారుగను, ఇంద్రునిధనుసువంటి ధనుసును ధరించి శత్రు సంహారము సేయువారుగను, శ్రీమంతులుగను, రూపసంపద గలవారుగను, శ్రేష్ఠమైన వృషభమువంటి పరాక్రమము గలవారుగను యేనుఁగుతొండమువంటి భుజములుగలిగి ప్రకాశించుచుండు వారుగనునుండు పురుష శ్రేష్ఠులగు మీరెవరు.

(౧౦౫) ఈఋశ్యమూక పర్వతము మీకాంతిచే వెలుంగుచున్నది.

(౧౧ ) దేవతలవంటి పరాక్రమముగలవారును, దేవలోకమునుండి వచ్చినవీరులుగనుండువారును, పద్మమురేకులవంటి నేత్రములు గలవారును, జడలు కమండలములు ధరించినవారును, రాజ్య పరిపాలనముసేయుటకుఁ దగియుండు వారునునగు మీరు యీప్రదేశమున కెందుకువచ్చితిరి.

(౧౨౫,౧౩౫) ఒకరినొకరు పోలియుండువారును, దేవలోకమునుండి వచ్చిన వీరులుగనుండువారును, భూమికి స్వేచ్ఛగ దిగివచ్చిన సూర్య చంద్రులవలెనుండువారును, విశాలముగనుండు రొమ్ముగలవారును, వీరులును, దేవతలవలెనుండు మనుజులును, సింహమువంటి మెడగలిగి మిగులఉత్సాహము గలవారును, మదించిన ఆబోతుయెద్దులవలె నుండువారును, నగుమీరు యిచటికెందుకు వచ్చితిరి.

(౧౪౫) నోకాలులవరకు వ్రేలుచుండు, బలిసి గుండ్రముగనునుండు మీ బాహువులు పరిఘాయుధములవలె నున్నవి. సకల విధములగు ఆభరణములకు భూషణముగనుండదగిన యీభుజము లెందుకు అలంకరింపఁబడలేదు.

(౧౫౫) వింధ్య మేరుపర్వతములతో నలంకరింపఁబడి, సముద్రముతోను వనములతోను గూడియుండు యీభూమినంతయు పరిపాలించుటకు మీరు తగినవారని తలంచెదను.

ఇమేచ ధనుషీ చిత్రే శ్లక్ష్ణే చిత్రానులేపనే।
ప్రకాశేతే యథేంద్రస్య వజ్రే హేమవిభూషితే॥ ౧౬½

సంపూర్ణా నిశితై ర్బాణై స్తూణాశ్చ శుభదర్శనాః।
జీవితాంతకరై ర్ఘోరై శ్శ్వసద్భి రివ పన్నగైః॥ ౧౭½

మహాప్రమాణౌ విస్తీర్ణౌ తప్తహాటకభూషితౌ।
ఖడ్గావేతౌ విరాజేతే నిర్ముక్తా వివ పన్నగౌ॥ ౧౮½
ఏవం మాం పరిభాషంతం కస్మాద్వై నాభిభాషథః॥ ౧౯

సుగ్రీవో నామ ధర్మాత్మా కశ్చిద్వానరయూథపః।
వీరో వినికృతో భ్రాత్రా జగద్భ్రమతి దుఃఖితః॥ ౨౦

ప్రాప్తోఽహం ప్రేషిత స్తేన సుగ్రీవేణ మహాత్మనా।
రాజ్ఞా వానరముఖ్యానాం హనూమా న్నామ వానరః॥ ౨౧

యువాభ్యాం సహ ధర్మాత్మా సుగ్రీవ స్సఖ్య మిచ్ఛతి।
తస్య మాం సచివం విత్తం వానరం పవనాత్మజమ్॥ ౨౨
భిక్షురూప ప్రతిచ్ఛన్నం సుగ్రీవ ప్రియకామ్యయా।
ఋశ్యమూకా దిహ ప్రాప్తం కామగం కామరూపిణమ్॥ ౨౩

(౧౬-౪) ఆశ్చర్యమును గలిగించునట్టి, స్నిగ్ధముగనుండు, రంగు బూయఁబడిన, యీధనుసులు బంగారుకట్లతో నలంకరింపఁబడిన వజ్రాయుధమువలెఁ బ్రకాశించుచున్నవి.

(౧౭-౪) మనోహరముగనుండు యీయంబులపొదలు కరకుగలవిగను ప్రాణమును హరించగలవిగను, భయంకరములుగను, బుస పెట్టుచుండు పాములవలెను నుండుబాణములతో నిండియున్నవి.

(౧౮-౪) మిగుల పొడవుగను, లావుగను, పుటము వేసిన బంగారు కట్లుతో నలంకరింపఁబడినవిగనునుండు మీరుధరించిన యీ కత్తులు కుబుసము విడిచిన సర్పమువలె వెలుంగుచున్నవి.

(౧౯-౪) ఈవిధముగఁ బలుకుచుండునాతో మీరేల మాటలాడకున్నారు.

(౨౦) (అవతారిక.— తన వాక్సాఫల్యమునుజూచి మాటలాడకుండినరామలక్ష్మణులతో హనుమంతుఁడేఅతఁడు వచ్చినకార్యమును దెలుపుకొనుచున్నాఁడు.)— వీరుఁడును ధర్మాత్ముఁడును నగుసుగ్రీవుఁడను, ఒక వానరరాజు, అన్నచే వంచింపఁబడి దుఃఖితుఁడై భూమిలోఁ దిరుగుచున్నాఁడు.

(౨౧) వానరులకు రాజును మహాత్ముఁడును నగుసుగ్రీవుఁడు పంపగా నేనిచటికి వచ్చితిని. నాపేరు హనుమంతుఁడు. వానరుఁడను.

(౨౨, ౨౩) ధర్మాత్ముఁడగు సుగ్రీవుఁడు మీ చెలిమి గోరుచున్నాఁడు. సుగ్రీవునకి మేలుసేయుటకై సన్యాసిరూపము ధరించినవాఁడును, ఋశ్యమూకమునుండి యిచటికి వచ్చినవాఁడును, కోరినచోటికిఁ బోగలవాఁడును కోరినరూపమును దాల్చగలవాఁడును, వాయుదేవుని పుత్త్రుఁడను, వానరుఁడును, ప్రసిద్ధుఁడును నగు నేను అతని మంత్రిగనున్నాను.

ఏవ ముక్త్వా తు హనుమాం స్తౌ వీరౌ రామలక్ష్మణౌ।
వాక్యజ్ఞో వాక్యకుశలః పున ర్నోవాచ కించన॥ ౨౪

ఏత చ్ఛ్రుత్వా వచ స్తస్య రామో లక్ష్మణ మబ్రవీత్।
ప్రహృష్టవదన శ్శ్రీమా న్భ్రాతరం పార్శ్వతస్స్థితమ్॥ ౨౫

సచివోఽయం కపీంద్రస్య సుగ్రీవస్య మహాత్మనః।
త మేవ కాంక్షమాణస్య మమాంతిక ముపాగతః॥ ౨౬

త మభ్యభాష సౌమిత్రే సుగ్రీవసచివం కపిమ్।
వాక్యజ్ఞం మధురై ర్వాక్యైః స్నేహయుక్త మరిందమ॥ ౨౭

నాఽనృగ్వేద వినీతస్య నాఽయజుర్వేదధారిణః।
నాఽసామవేదవిదుష శ్శక్య మేవంపరిభాషితుమ్॥ ౨౮

(౨౪) వీరులును, మాటలసొంపు గ్రహించ గలవారును నగు రామలక్ష్మణులతో మాటలు పలుకుటలో సమర్థుఁడగు హనుమంతుఁ డిటుల చెప్పివిరమించెను.

(౨౫) హనుమంతుని మాటలు విని,శ్రీమంతుఁడగు రాముఁడు మిగులసంతోషించినవాఁడై ప్రక్కనుండు లక్ష్మణునితో నిటు లనెను.

(౨౬) ఇతఁడు కపిశ్రేష్ఠుఁడును మహాత్ముఁడును నగుసుగ్రీవుని మంత్రి. సుగ్రీవుని సమాగమనమునే గోరుచుండు మనవద్దకు వచ్చెను.

(౨౭) (అవతారిక.—పెఱరాజు మంత్రితో రాజు సంభాషించరాదని రాముఁడు లక్ష్మణుని కిటుల హనుమంతునితో మాటలాడవలయునని చెప్పెను) ఓలక్ష్మణా! మాటలప్రయోగమును నెఱింగినవాఁడును, సుగ్రీవుని యెడలను నాయెడలను మిగుల ప్రీతిగలవాఁడును, అతనికి మంత్రియును నగు యీకపితో, ఓ శత్రు సంహారకుఁడా! ఇంపుగనుండు మాటలచే సంభాషింపుము.

(౨౮) ఋగ్వేదము యజుర్వేదము సామవేదములలో శిక్షలేని వానికి యిట్లు భాషించుటకు సాధ్యపడదు. (అనఁగా, హనుమంతుఁడు రామ లక్ష్మణులతో సంభాషించునపుడు 'ఉభాయోగ్యావహం మన్యే' ఇత్యాది శ్లోకములలో సృష్టిస్థితి సంహార కర్తృత్వము సెప్పెను. ఈ యభిప్రాయము ఋగ్వేద ఐతరేయఉపనిషత్తులో నున్నది. ఈ వేదము దెలియనివాఁడిట్లు చెప్పుటకు సాధ్యపడదు, 'మానుషౌదేవరూపిణౌ' ఇత్యాదిశ్లోకములచే భగవంతుని అవతార రహస్యమును హనుమంతుఁడు తెలిపెను. యజుర్వేదాంతర్గతమైన తైత్తరీయోపనిషత్తులో 'అజాయమానో బహుధా విజాయతే' అని యున్నది. ఈ వేదమును నెఱుంగనివాడిట్లు చెప్పలేఁడు, 'ధైర్యవంతౌ సువర్ణాభౌ' 'పద్మపత్రేక్షణౌ'. ఇత్యాది శ్లోకములచే భగవంతునికి సగుణత్వమును స్వరూపత్వమును హనుమంతుఁడు చెప్పె

నూనం వ్యాకరణం కృత్స్నమనేన బహుధా శ్రుతమ్।
బహువ్యాహరతాఽనేన నకించి దపశబ్దితమ్॥ ౨౯

న ముఖే నేత్రయో ర్వాపి లలాటేచ భ్రువో స్తథా।
అన్యేష్వ పి చ గాత్రేషు దోష స్సంవిదితః క్వచిత్॥ ౩౦

అవిస్తర మసందిగ్ధ మవిలంబిత మద్రుతమ్।
ఉరస్థం కంఠగం వాక్యం వర్తతే మధ్యమే స్వరే॥ ౩౧

సంస్కారక్రమసంపన్నా మద్రుతా మవిలంబితామ్।
ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయహారిణీమ్॥ ౩౨

సు. ఈయభిప్రాయము ఛాందోగ్య ఉపనిషత్తులో 'అథయఏషో అంతరాది త్యే' 'అక్షిణీ' అని చెప్పఁబడి యున్నది. ఈవేదమును నెఱుంగనివాఁడిట్లు చెప్ప లేఁడు. కనుక, హనుమంతుఁ డీయూఁడు వేదము లెఱింగినవాఁడని నిర్ధారణ చేయఁ బడినది. అథర్వాణ వేదమును నధ్యయనము చేయవలయునని విధిలేనందున యిది ప్రస్తావింపఁ బడలేదు. ఈ శ్లోకములో నితనికి వేదాధ్యయనము చెప్పబడినది )

(౨౯) ఇతఁడు అనేకసార్లు వ్యాకరణము నంతయు బాగుగ వినియు న్నాఁడు. విశేషముగ సంభాషించినను యితఁడు కొంచమైనను అపశబ్దమును బలుకలేదు. (ఈ శ్లోకములో హనుమంతునికి అంగాధ్యయనము చెప్పఁబడినది )

(౩౦) ముఖములోను నేత్రములలోను లలాటములలోను కనుబొమల లోను ఇతర అవయవములలోను మాటలు బలుకునపుడు కొంచెమైనను వికార మగుపడలేదు.

(౩౧) శబ్దబాహుళ్యము లేక, పద వర్ణ సందేహము లేక, మాటలాడు వాని అశక్తిని దెలుపునట్లు మాటలమధ్య సావకాశము లేక, మిగులత్వరగ మాట లాడినచో వినువానికి అర్థము కాదు. కనుక అట్టి త్వరలేక, హృదయమునుండి మంద్రస్వరముతో కంఠస్వరములోఁ బ్రవేశించి మధ్యమస్వరములో నితని మాట లు నిలిచి యున్నవి.

(౩౨) వ్యాకరణ జ్ఞానముచేఁ గలిగిన శబ్దశుద్ధితోను వ్యక్తమైన అక్షర ములతో గూడినట్టివియుఁ, మిగుల వేగములేక, మిగుల సావకాశములేక ఉండున వియు, మరికొన్ని మంచి గుణములతోఁ గూడినవియు, మధురమై హృదయ మును నపహరించు చుండునవియు నగుమాటలు చెప్పుచున్నాఁడు. (మాధుర్యము అక్షరవ్యక్తి పదచ్ఛేదము అత్వరధైర్యము లయతో గూడియుండుట, యీ యారు ను మాట లుచ్చరించుటలో నుండవలయును.)

అనయా చిత్రయా వాచా త్రిస్థానవ్యంజనస్థయా।
కస్య నారాధ్యతే చిత్త ముద్యతాసే రరే రపి॥ ౩౩
ఏవం విధో యస్య దూతో నభవే త్పార్థివస్యతు।
సిధ్యంతి హి కథం తస్య కార్యాణాం గతయోఽనఘ॥ ౩౪

ఏవం గుణగణై ర్యుక్తా యస్య స్యుః కార్యసాధకాః।
తస్య సిధ్యంతి సర్వార్థా దూతవాక్యప్రచోదితాః॥ ౩౫
ఏవ ముక్త స్తు సౌమిత్రి స్సుగ్రీవసచివం కపిమ్।
అభ్యభాషత వాక్యజ్ఞో వాక్యజ్ఞం పవనాత్మజమ్॥ ౩౬
విదితా నో గుణా విద్వన్ సుగ్రీవస్య మహాత్మనః।
తమేవ చావాం మార్గావ స్సుగ్రీవం ప్లవగేశ్వరమ్॥ ౩౭
యథా బ్రవీషి హనుమన్ సుగ్రీవవచనా దిహ।
త త్తథా హి కరిష్యావో వచనా త్తవ సత్తమ॥ ౩౮

త త్తస్య వాక్యం నిపుణం నిశమ్య ప్రహృష్టరూపః పవనాత్మజః కపిః। మన స్సమాధాయ జయోపపత్తౌ సఖ్యం తదా కర్తు మియేష తాభ్యామ్॥

ఇతి శ్రీమత్కిష్కింధా కాండే - తృతీయస్సర్గః



(౩౩) ఆశ్చర్యమును గలిగించునవియు, శిరసు ఉరస్సు కంఠము అను మూఁడు స్థానములలో నుండి ఉదాత్త అనుదాత్త స్వరిత స్వరూపముగ వెడలు చుండునవియునగు, యీ (హనుమంతుని) మాటలచే యెవని మనసు సంతోషపరచ బడదు; నరకుటకు కత్తియెత్తుకొని వచ్చిన క్రూరుఁడగు శత్రువుయొక్క మనసును గూడ యిట్టి మాటలు సంతోష పరచును. (ఈనాలుగు శ్లోకములలో శిక్షాధ్యయనము చెప్పఁబడినది.)

(౩౪) ఓ పాపరహితుఁడా! ఇట్టి దూతరాజుకు లేనియెడల అతని కార్యము లెటుల సంఘటించును.

(౩౫) ఇట్టి గుణగణములతోఁ గూడి కార్యములు సాధించగల దూత రాజులకు ఉండినటులైతే, వారికి సకలకార్యములు సిద్ధించును.

(౩౬) ఇటుల శ్రీరాముఁడు చెప్పఁగా, మాటలస్వారస్యమును నెరింగిన లక్ష్మణుఁడు, అట్టి స్వారస్యమును నెరింగినట్టి వాయు పుత్రుఁడును సుగ్రీవుని మంత్రియునగు హనుమంతునితో సంభాషించెను.

(౩౭) ఓ పండితుఁడా! మహాత్ముఁడగు సుగ్రీవుని గుణములను మేము వినియున్నాము. వానర రాజగు ఆ సుగ్రీవుని మేము వెతుకుచు వచ్చితిమి.

(౩౮) (ఈ శ్లోకములో ఆచార్యుల అనుగ్రహమునకుఁ బాత్రులైయుండువారి మనోరథములను వారి ద్వారా సఫలము చేయఁబడునని భగవంతుని ప్రతిజ్ఞ చెప్పఁబడినది.) హనుమంతుఁడా! సుగ్రీవుని మాటలుగ నీ విచట చెప్పిన ప్రకారము, ఓ యుత్తముఁడా! మేము సేసెదము.

(౩౯) శ్రేష్ఠముగ నుండు లక్ష్మణుని మాటలు విని మిగుల సంతోషము గలవాఁడును వాయుపుత్రుఁడును నగు హనుమంతుఁడు మనసును సమాధానపరచుకొని, వాలిని గెలుచు నిమిత్తమై, రామలక్ష్మణులతో సుగ్రీవునికి స్నేహము గలిగించుటకు అభిప్రాయ పడెను.

## చతుర్థస్సర్గః



తతః ప్రహృష్టో హనుమాన్ కృత్యవా నితి తద్వచః।
శ్రుత్వా మధురసంభాషం సుగ్రీవం మనసాగతః॥ ౧
భవ్యో రాజ్యాగమ స్తస్య సుగ్రీవస్య మహాత్మనః।
యదయం కృత్యవా న్ప్రాప్తః కృత్యం చైత దుపాగతః॥ ౨

తతః పరమసంహృష్టో హనుమాన్ ప్లవగర్షభః।
ప్రత్యువాచ తతో వాక్యం రామం వాక్యవిశారదః॥ 3
కిమర్థం త్వం వనం ఘోరం పంపాకాననమండితమ్।
ఆగత స్సానుజో దుర్గం నానావ్యాళమృగాయుతమ్॥ ౪

తస్య తద్వచనం శ్రుత్వా లక్ష్మణో రామచోదితః।
ఆచచక్షే మహాత్మానం రామం దశరథాత్మజమ్॥ ౫
రాజా దశరథో నామ ద్యుతిమా న్ధర్మవత్సలః।
చాతుర్వర్ణ్యం స్వధర్మేణ నిత్యమే వాభ్యపాలయత్॥ ౬

న ద్వేష్టా విద్యతే తస్య న చ స ద్వేష్టి కంచన।
న చ సర్వేషు భూతేషు పితామహ ఇవా పరః॥ ౭

## ౪ వ సర్గ.

(అవతారిక.— ఈసర్గలో ఆచార్యుని ద్వారా భగవంతునికి చేతన లాభము గలుగుట చెప్పఁబడుచున్నది)

(౧) పిమ్మట, హనుమంతుఁడు మధురమైన సంభాషణతోఁ గూడిన లక్ష్మణుని మాటలు విని, సుగ్రీవుని ద్వారా రాముని కొకపని కావలసి యున్నదని, మిగుల సంతోషించి సుగ్రీవుని స్మరించెను.

(౨) పిమ్మట, వానరశ్రేష్ఠుఁడును మాటలాడుటలో సమర్థుఁడును నగు హనుమంతుఁడు మిగుల సంతోషించి రామునితో నిటులనెను.

(౩,౪) రామా! భయంకరముగను పంపయొక్క ఉపవనములచే అలంకరింపఁ బడినదిగను ప్రవేశించుటకు సాధ్యము కానిదిగను నానావిధములగు పాములు మృగములతో నిండినదిగను నుండు దండకావనమునకు తమ్మునితోడ యెందుకు వచ్చితివి.

(౫) హనుమంతుని ప్రశ్నను విని లక్ష్మణుఁడు, రామునిచే ప్రేరేపింపఁ బడినవాఁడై, శ్రీరాముఁడు మహాత్ముడు. దశరథుని పుత్రుఁడు. అనితెలిపెను.

(౬) తేజోవంతుఁడును ధర్మమునందు ప్రీతిగలవాఁడును నగుదశరథుఁడను పేరుగల రాజు క్షత్రియ ధర్మముచే నాలుగు వర్ణముల ప్రజలను సదా పరిపాలించుచుండెను.

(౭) ఆతని ద్వేషించువాడు లేఁడు. ఎవరిమీదను నతనికి ద్వేషము లేదు. అతఁడు సకలప్రాణుల విషయములోను రెండవ బ్రహ్మవలె హితకుడుఁడుగ నుండెను.

అగ్నిష్టోమాదిభి ర్యజ్ఞై రిష్టవా నాప్తదక్షిణైః॥ ౭

తస్యా యం పూర్వజః పుత్రో రామో నామ జనైశ్శ్రుతః।
శరణ్య స్సర్వభూతానాం పితు ర్నిర్దేశపారగః॥ ౮

వీరో దశరథస్యాయం పుత్రాణాం గుణవత్తమః।
రాజలక్షణసంపన్న స్సంయుక్తో రాజసంపదా॥ ౯

రాజ్యాద్భ్రష్టో వనే వస్తుం మయా సార్ధ మిహాగతః॥ ౧౦
భార్యయాచ మహాతేజా స్సీతయాఽనుగతో వశీ।
దినక్షయే మహాతేజాః ప్రభయేవ దివాకరః॥ ౧౧

అహ మస్యావరో భ్రాతా గుణై ర్దాస్యముపాగతః।
కృతజ్ఞస్య బహుజ్ఞస్య లక్ష్మణో నామ నామతః॥ ౧౨

సుఖార్హస్య మహార్హస్య సర్వభూతహితాత్మనః।
ఐశ్వర్యేణ చ హీనస్య వనవాసాశ్రితస్య చ॥ ౧౩

(౭) పరిపూర్ణమైనదక్షిణగల అగ్నిష్టోమాది యాగములను నతఁడు చేసియుండెను.

(౮) ఇతఁడు అతని పెద్దకొడుకు. ఇతని పేరు రాముఁడు. సామాన్యమైన జనులకు కూడ తెలిసిన వాఁడు. సకల ప్రాణికోటిని రక్షించు వాఁడు. తండ్రి ఆజ్ఞనుపూర్తిచేయువాఁడు.

(౯) వీరుఁడగు యితఁడు దశరథునికొడుకులలో మిగుల గుణవంతుఁడు, రాజలక్షణములతోను, రాజ సంపదతోను గూడియున్నాఁడు.

(౧౦,౧౧) గొప్పతేజస్సు గల జితేంద్రియుఁడగు నితఁడు రాజ్యభ్రష్టుడై, గొప్ప తేజస్సు గల సూర్యుఁడు సాయంకాలములో కాంతితో చేరియుండు నట్టుల, భార్యయగు సీతతోడను నాతోడను వనవాసము సేయుటకు యిచ్చటికి వచ్చెను.

(౧౨,౧౩) అల్పమైన ఉపకారమును విశేషముగ భావించువాఁడును, సుఖము లనుభవించుటకుఁ దగినవాఁడును. ఐశ్వర్యసంపన్నుఁడును, సకల ప్రాణులకు హితముచేయువాఁడును, ఐశ్వర్యమును విడిచియుండువాఁడును, వనవాసము చేసి దుఃఖించుచుండువాఁడును నగు యీ రామునికి ఇతని (రాముని) అభిప్రాయానుసారముగ తమ్ముఁడుగ నుండినను, నేను, యితని గుణములచే వశపరచుకొనబడినవాఁడనై యితనికి దాసుఁడుగనున్నాను. నాపేరు లక్ష్మణుఁడు. (పరవానస్మి' ఇత్యాది స్థలములలో చేతనునికిఁ దాస్యమే స్వరూపమని చెప్పఁబడినది. ఇచ్చట యీశ్వరునిగుణములచే చేతనునికి దాస్యము చెప్పిరి. ఇట్లు పరస్పరవిరోధముగఁ జెప్పఁబడినను భగవంతునియెడలగల గుణాతిశయములచే స్వరూపప్రయుక్తముగనునుండు దాస్యము వృద్ధి పొందుచున్నదని పరిహారము చెప్పఁబడినది. 'ఉపాగతః' అనుటచే సర్వదేశ సర్వకాల సర్వావస్థోచిత సర్వవిధ కైంకర్యము చేతనునికి చెప్పబడినది.)

రక్షసాఽపహృతా భార్యా రహితే కామరూపిణా।
తచ్చ నజ్ఞాయతే రక్షః పత్నీ యెనాస్య సా హృతా॥ ౧౪

దనుర్నామ దితేః పుత్రః శ్శాపా ద్రాక్షసతాంగతః।
ఆఖ్యాత స్తేన సుగ్రీవ స్సమర్థో వానరర్షభః॥ ౧౫

స జ్ఞాస్యతి మహావీర్య స్తవ భార్యాపహారిణమ్।
ఏవ ముక్త్వా దను స్స్వర్గం భ్రాజమానో గత స్సుఖమ్। ౧౬
ఎత త్తే సర్వ మాఖ్యాతం యాథాతథ్యేన పృచ్ఛతః॥ ౧౬½

అహం చైవ హి రామశ్చ సుగ్రీవం శరణం గతౌ॥ ౧౭

ఎష దత్త్వాచ విత్తాని ప్రాప్యచానుత్తమం యశః।
లోకనాథః పురా భూత్వా సుగ్రీవం నాథ మిచ్ఛతి॥ ౧౮

పితా యస్య పురా హ్యాసీ చ్ఛరణ్యో ధర్మవత్సలః।
తస్య పుత్రః శ్శరణ్యశ్చ సుగ్రీవం శరణంగతః॥ ౧౯

(౧౪) మేమిద్దరము లేని ప్రదేశములో కామరూపియగు రాక్షసుఁడు శ్రీరాముని భార్యను నపహరించుకొని పోయెను. ఆరాక్షసుఁడు యెచట ఉన్నాఁడో తెలియలేదు.

(౧౫) శాపముచే రాక్షసత్వమును బొంది యుండువాఁడును, దితిపుత్రుఁడును దనువంశములోఁ బుట్టినవాఁడును నగు కబంధుఁడు వానరశ్రేష్ఠుఁడగు సుగ్రీవుఁడు సమర్థుఁడని చెప్పెను.

(౧౬) 'గొప్పపరాక్రమముగల సుగ్రీవుఁడు నీభార్యను నపహరించినవాని నెఱుంగును' అని దనువంశములోఁబుట్టిన కబంధుఁడు చెప్పి, ప్రకాశించుచు సుఖముగ స్వర్గలోకమునకుఁ బోయెను.

(౧౬-౧) నీవడిగినందున యదార్థముగ విన్నదంతయుఁ దెలిపితిని.

(౧౭) రాముఁడు నేను సుగ్రీవునికి శరణాగతి సేయుచున్నాము.

(౧౮). (ఈ శ్లోకములో రాముని పరత్వము సౌశీల్యము చెప్పబడినది.) కోరినవారికి ఐశ్వర్యమును నిచ్చి, పరత్వదశలో నుండినదానికంటె అవతారప్రయుక్తమైన అతిశయములతోఁ గూడిన యశస్సును పొంది, పూర్వము సకలలోకములచే యాచింపఁబడి, సర్వస్వామిగనుండు యీ రాముఁడు యిపుడు సుగ్రీవుని నాథునిగ యిచ్ఛయించుచున్నాఁడు.

(౧౯) ఇతని తండ్రి పూర్వము అందరికిని రక్షకుఁడుగను ధర్మమునందాసక్తిగలవాఁడుగను నుండెను. ఆతని కొడుకగుయీరాముఁడు సర్వలోకములకు శరణ్యుఁడుగనున్నాఁడు. అట్టివాఁడు సుగ్రీవునికి శరణాగతి చేయుచున్నాఁడు.

సర్వలోకస్య ధర్మాత్మా శరణ్య శ్శరణం పురా।
గురు ర్మే రాఘవ స్సో యం సుగ్రీవం శరణంగతః॥ ౨౦

యస్య ప్రసాదే సతతం ప్రసీదేయు రిమాః ప్రజాః।
స రామో వానరేంద్రస్య ప్రసాద మభికాంక్షతే॥ ౨౧

యేన సర్వగుణోపేతాః పృథివ్యాం సర్వపార్థివాః।
మానితా స్సతతం రాజ్ఞా సదా దశరథెన వై॥ ౨౨

తస్యా యం పూర్వజః పుత్ర స్త్రిషు లోకేషు విశ్రుతః।
సుగ్రీవం వానరేంద్రం తు రామ శ్శరణ మాగతః॥ ౨౩
శోకాభిభూతె రామేతు శోకార్తే శరణంగతే।
కర్తు మర్హతి సుగ్రీవః ప్రసాదం హరియూథపః॥ ౨౪

ఏవం బ్రువాణం సౌమిత్రిం కరుణం సాశ్రులోచనమ్।
హనుమా న్ప్రత్యువా చేదం వాక్యం వాక్యవిశారదః॥ ౨౫
ఈదృశా బుద్ధిసంపన్నా జితక్రోధా జితేంద్రియాః।
ద్రష్టవ్యా వానరేంద్రేణ దిష్ట్యా దర్శనమాగతాః॥ ౨౬

(౨౦) ధర్మాత్ముఁడగు నీ రాముఁడు పూర్వము సకలలోకములకు ప్రాప్యుఁడుగను, రక్షకుఁడుగను నుండెను. నాకు అన్నగనుండు అట్టి రాముఁడు సుగ్రీవుని రక్షకునిగ నమ్మియున్నాఁడు.

(౨౧) ఈ జనులు యెవరి యనుగ్రహముచే సకల సుఖములు బడసి యెల్లపుడు ప్రసన్నచిత్తులు అగుదురో అట్టిరాముఁడు యిపుడు సుగ్రీవుని యనుగ్రహమును గోరుచున్నాఁడు. (ఈశ్వరుఁడు సర్వతంత్ర స్వతంత్రుఁడు గనుక యిట్లు చేసినందు కితని ఆక్షేపించుట తగదు.)

(౨౨) దశరథుఁడు సకల సుగుణములతోఁగూడి భూమియందు నుండు రాజుల నందరిని సదా గౌరవించుచుండెను.

(౨౩) అట్టిదశరథుని జ్యేష్ఠపుత్రుఁడును మూఁడులోకములలోను ప్రసిద్ధుఁడును నగు రాముఁడు వానర శ్రేష్ఠుఁడగు సుగ్రీవుని శరణాగతి సేయుచున్నాఁడు.

(౨౪) శోక పరతంత్రుఁడై శోక పీడితుఁడై యుండు రాముఁడు శరణాగతి సేయఁగా వానరులకు రాజుగనుండు సుగ్రీవుఁడు అతనివిషయములో అనుగ్రహించవలయును. (ఆచార్యరూపపురుషకారము లేకపోయినట్లైతే కర్మపరతంత్రులై దుఃఖించుచుండు స్వజనమును జూచి ఈశ్వరునిదుఃఖముపోదు. అనఁగా, చేతనునిదుఃఖము ఈశ్వరునిదుఃఖము పోవుటకు ఆచార్యుఁడే కారణమనిభావము.)

(౨౫) జాలిపుట్టునటుల యీ విధముగ జెప్పుచుండువాఁడును కంట తడిపెట్టుకొనిన వాఁడును నగు లక్ష్మణునితో మాటలు చెప్పుటలో సమర్థుఁడగు హనుమంతుఁడు యిటుల బదులుచెప్పెను.

(౨౬) బుద్ధిమంతులును, క్రోధమును ఇంద్రియములను జయించిన యట్టి వారినే సుగ్రీవుఁడు వెతుకవలయును. దైవయోగముచేతనే యట్టివారు సుగ్రీవునికి లభించిరి.

స హి రాజ్యా త్పరిభ్రష్టః కృత వైరశ్చ వాలినా।
హృతదారో వనే త్యక్తో భ్రాత్రా వినికృతో భృశమ్॥ ౨౭

కరిష్యతి స సాహాయ్యం యువయో ర్భాస్క రాత్మజః।
సుగ్రీవ స్సహ చాస్మాభి స్సీతాయాః పరిమార్గణే॥ ౨౮

ఇత్యేవ ముక్త్వా హనుమాన్ శ్లక్ష్ణం మధురయా గిరా।
బభాషే సోఽభిగచ్ఛేమ సుగ్రీవ మితి రాఘవమ్॥ ౨౯

ఏవం బ్రువాణం ధర్మాత్మా హనుమంతం స లక్ష్మణః।
ప్రతిపూజ్య యథాన్యాయ మిదం ప్రోవాచ రాఘవమ్॥ ౩౦

కపిః కథయతే హృష్టో యథాఽయం మారుతాత్మజః।
కృత్యవా న్సోఽపి సంప్రాప్తః కృతకృత్యోఽసి రాఘవ॥ ౩౧

ప్రసన్నముఖవర్ణశ్చ వ్యక్తం హృష్టశ్చ భాషతే।
నానృతం వక్ష్యతే వీరో హనుమా న్మారుతాత్మజః॥ ౩౨

తత స్సతు మహాప్రాజ్ఞో హనుమా న్మారుతాత్మజః।
జగామాదాయ తౌ వీరౌ హరిరాజాయ రాఘవౌ॥ ౩౩

భిక్షురూపం పరిత్యజ్య వానరం రూప మాస్థితః।
పృష్ఠమారోప్య తౌ వీరౌ జగామ కపికుంజరః॥ ౩౪

(౨౭) ఆ సుగ్రీవుఁడును రాజ్యభ్రష్టుఁడుగ నున్నాఁడు. వాలితోడ నతనికి ద్వేషముగలిగినది. వాలి యతని భార్యను నపహరించి యున్నాఁడు. అన్నయగు వాలి వంచించి అడవికి యితని తరిమెను.

(౨౮) సూర్యుని పుత్రుఁడగు సుగ్రీవుఁడు మనతోడ సీతను వెతకుటలో మాకు యిపుడే సహాయము సేయును.

(౨౯) ఈ విధముగ హనుమంతుఁడు యింపుగనుండు మాటలతో బాగుగఁ జెప్పి 'సుగ్రీవుని సమీపమునకుఁ బోవుదము' అని రామునితో మరియు చెప్పెను.

(౩౦) ధర్మాత్ముఁడగు లక్ష్మణుఁడు యిట్లు పలుకుచుండిన హనుమంతుని దూతకుఁ దగినటుల గౌరవించి యిట్లు శ్రీరామునితోఁ జెప్పెను.

(౩౧) ఓ రామా! వాయుపుత్రుఁడగు యీ వానరుఁడు సంతోషించి యదార్థముగఁ జెప్పుచున్నాఁడు. సుగ్రీవుఁడు కార్యమును గోరియే యున్నాఁడు. కనుక, నీవు కోరిన పని యగును.

(౩౨) వీరుఁడును వాయుపుత్రుఁడును నగు హనుమంతుఁడు తేటయైన ముఖకాంతి గలవాఁడై సంతోషించి వ్యక్తముగఁ జెప్పుచున్నాఁడు. ఇతఁడు అబద్ధము చెప్పఁడు.

(౩౩) పిమ్మట, మహాప్రాజ్ఞుఁడును వాయుపుత్రుఁడును నగుహనుమంతుఁడు వీరులగు రామలక్ష్మణులను వానరరాజగు సుగ్రీవుఁడుండు ప్రదేశమునకుఁ దీసికొని పోయెను.

(౩౪) సన్న్యాసిరూపమును విడిచి, వానర రూపమును దాల్చి కపిశ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు వీరులగు రామలక్ష్మణులను భుజముమీద గూర్చుండఁబెట్టుకొని పోయెను.

స తు విపులయశాః కపిప్రవీరః పవనసుతః కృతకృత్యవత్ప్ర
హృష్టః। గిరివర మురువిక్రమః ప్రయాత స్సుశుభమతి స్స
హ రామలక్ష్మణాభ్యామ్॥ ౩౫

ఇతి శ్రీమత్కిష్కింధా కాండే - చతుర్థస్సర్గః

## పంచమస్సర్గః

ఋశ్యమూకాత్తు హనుమాన్ గత్వాతు మలయం గిరిమ్।
ఆచచక్షే తదా వీరౌ కపిరాజాయ రాఘవౌ॥ ౧
అయం రామో మహాప్రాజ్ఞ స్సంప్రాప్తో దృఢవిక్రమః।
లక్ష్మణేన సహ భ్రాత్రా రామోఽయం సత్యవిక్రమః॥ ౨
ఇక్ష్వాకూణాం కులే జాతో రామో దశరథాత్మజః।
ధర్మే నిగదితశ్చైవ పితు ర్నిర్దేశపారగః॥ ౩
తస్యాస్య వసతోఽరణ్యే నియతస్య మహాత్మనః।
రావణేన హృతా భార్యా స త్వాం శరణ మాగతః॥ ౪

హనుమంతుఁడు రామలక్ష్మణుల కథను సుగ్రీవునికిఁ దెలుపుట. కి.కా.

(3౪) సర్వదేవతల వరముల చే విశాలమైన కీర్తిగలవాఁడును, వానరుల లో మిగుల పరాక్రమము గలవాఁడును, వచ్చినపని బాగుగ ముగిసినందున సంతోషించిన వాఁడును, మంచి బుద్ధిగలవాఁడును, నగుహనుమంతుఁడు రామలక్ష్మణులతోడ ఋశ్యమూక పర్వతమునకుఁ బోయెను. (ఈ శ్లోకములో భగవంతుని బడయుట ఆచార్యాధీనమని చెప్పఁబడినది.)

ఇది నాల్గవ సర్గ.

౫ వ సర్గ.

(అవతారిక.— ఈ సర్గలో, పాపభీతుఁడై కర్మానురూప మైన ఫలము నిచ్చుచుండు భగవంతునికి భయపడియుండువాఁడు ఆచార్యునిద్వారా భగవంతుని కల్యాణగుణములు విని, అతఁడే ముఖ్యమైన ఉపాయమని తలంచియుండు చేతనునియొక్క అనుష్ఠానము చెప్పఁబడుచున్నది.)

(౧) హనుమంతుఁడు ఋశ్యమూక పర్వతముతోఁ జేరియుండు మలయ పర్వతమునకుఁ బోయి, వీరులగు రామలక్ష్మణులను దీసికొని వచ్చినటుల సుగ్రీవునితో జెప్పెను.

(౨) స్థిరమైన పరాక్రమము మిగుల ప్రాజ్ఞత గలరాముఁడు అతని తమ్ముఁడగు లక్ష్మణునితోడ సమీపమునకు వచ్చియున్నాఁడు.

(3) దశరథుని కొడుకగు రాముఁడు ఇక్ష్వాకు వంశములోఁ బుట్టినవాఁడు. ధర్మాత్ముఁడని ప్రసిద్ధి కెక్కినవాఁడు, తండ్రియాజ్ఞను పరిపూర్తి చేయువాఁడు.

(౪) పవిత్రశీలుఁడును మహాత్ముఁడును అరణ్యములో వసించుచుండువాఁడును నగుశ్రీరాముని భార్యను రావణుఁ డపహరించుకొని పోయెను. అందుచే అతఁడు నీ శరణు చొచ్చుచున్నాఁడు.

రాజసూయాశ్వమేధైశ్చ వహ్ని ర్యేనాభితర్పితః।
దక్షిణాశ్చ తథోత్సృష్టా గావ శ్శతసహస్రశః॥ ౫
తపసా సత్యవాక్యేన వసుధా యేన పాలితా।
స్త్రీహేతో స్తస్య పుత్రోఽయం రామ స్త్వాం శరణం గతః॥
భవతా సఖ్యకామౌ తౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ।
ప్రతిగృహ్యార్చయస్వైతౌ పూజనీయతమావుభౌ॥ ౭
శ్రుత్వా హనుమతో వాక్యం సుగ్రీవో హృష్టమానసః।
భయంచ రాఘవా ద్ఘోరం ప్రజహౌ విగతజ్వరః॥ ౮
స కృత్వా మానుషం రూపం సుగ్రీవః ప్లవగర్షభః।
దర్శనీయతమో భూత్వా ప్రీత్యా ప్రోవాచ రాఘవమ్॥ ౯
భవా న్ధర్మవినీతశ్చ విక్రాన్త స్సర్వవత్సలః।
ఆఖ్యాతా వాయుపుత్రేణ తత్త్వతో మే భవద్గుణాః॥ ౧౦
తన్మమైవైష సత్కారో లాభశ్చైవోత్తమః ప్రభో।
య త్త్వ మిచ్ఛసి సౌహార్దం వానరేణ మయా సహ॥ ౧౧
రోచతే యది వా సఖ్యం బాహురేష ప్రసారితః।
గృహ్యతాం పాణినా పాణి ర్మర్యాదా బధ్యతాం ధ్రువా॥ ౧౨
ఏతత్తు వచనం శ్రుత్వా సుగ్రీవేణ సుభాషితమ్।
స ప్రహృష్టమనా హస్తం పీడయామాస పాణినా॥ ౧౩

(౫,౬) రాజసూయ అశ్వమేధ యాగములచే అగ్నిని బాగుగఁ బూజించు వాఁడును, విశేషముగ యాగములలో దక్షిణ లిచ్చినవాఁడును, వేనవేలు గోదానములు చేసినవాఁడును, తపనుచేతను, సత్యముచేతను భూమిని పరిపాలించిన వాఁడును, నగుదశరథుని కొడుకగు రాముఁడు స్త్రీ నిమిత్తముగ నిన్ను శరణాగతి చేయుచున్నాఁడు.

(౭) అన్నదమ్ములగు రామలక్ష్మణులు నీ స్నేహమును గోరుచున్నారు. వారి కభిముఖముగఁబోయి మిగుల పూజనీయులుగ నుండు వారిద్దరిని బూజింపుము.

(౮) సుగ్రీవుఁడు హనుమంతుని మాటవిని మిగుల సంతోషించి, రామలక్ష్మణుల వలన గలిగిన భయమును విడిచి స్వస్థచిత్తుఁడాయెను.

(౯) కపిశ్రేష్ఠుఁడగు సుగ్రీవుఁడు మనుజుని రూపముదాల్చి దర్శనీయమైన రూపము గలవాఁడై సంతోషముతో శ్రీరాముని జూచి యిట్లనెను.

(౧౦) నీకు ధర్మవిషయములు బాగుగఁ దెలిసియున్నవి. మిగుల ప్రసిద్ధిం గాంచినవాఁడవు. అందరి యెడలను వాత్సల్యము గలవాఁడవు. వాయుపుత్రుఁడగు హనుమంతుఁడు నీ గుణములను నాకు తత్త్వముగఁ జెప్పెను.

(౧౧) నీవు వానరుఁడనగు నాతో స్నేహము గోరినందున, హే ప్రభో! యిదే నాకు గొప్ప గౌరవము, ఉత్తమమైన లాభము.

(౧౨) నా స్నేహము నీకు యిష్టముగ నుండినట్లైతే యిదిగో చేయి యిచ్చితిని. నీ చేతితో నాచేతిని బట్టుకొనుము. స్థిరమైన వ్యవస్థను నేర్పరుపుము.

(౧౩) సుగ్రీవుఁడు చెప్పిన యింపుగనుండు యీ మాటలు విని శ్రీరాముఁడు మిగుల సంతోషించి చేతితో నతని చేతిని బట్టుకొనెను.

హృద్యం సౌహృద మాలంబ్య పర్యష్వజత పీడితమ్॥ ౧౩ ॥
తతో హనుమా న్సంత్యజ్య భిక్షురూప మరిందమః।
కాష్ఠయో స్స్వేన రూపేణ జనయామాస పావకమ్॥ ౧౪ ॥
దీప్యమానం తతో వహ్నిం పుష్పై రభ్యర్చ్య సత్కృతమ్।
తయో ర్మధ్యేథ సుప్రీతో నిదధే సుసమాహితః॥ ౧౫ ॥
తతోఽగ్నిం దీప్యమానం తౌ చక్రతు శ్చ ప్రదక్షిణమ్।
సుగ్రీవో రాఘవ శ్చైవ వయస్యత్వ ముపాగతౌ॥ ౧౬ ॥
తత స్సుప్రీతమనసౌ తావుభౌ హరిరాఘవౌ।
అన్యోన్య మభివీక్షంతౌ నతృప్తి ముపజగ్మతుః॥ ౧౭ ॥
త్వం వయస్యోఽసి మే హృద్యో హ్యేకం దుఃఖంసుఖంచనౌ।
సుగ్రీవో రాఘవం వాక్య మిత్యువాచ ప్రహృష్టవత్॥ ౧౮ ॥
తత స్స పర్ణబహుళాం ఛిత్త్వా శాఖాం సుపుష్పితామ్।
సాలస్యాస్తీర్య సుగ్రీవో నిషసాద సరాఘవః॥ ౧౯ ॥
లక్ష్మణాయాథ సంహృష్టో హనుమాన్ ప్లవగర్షభః।
శాఖాం చందనవృక్షస్య దదౌ పరమపుష్పితామ్॥ ౨౦ ॥
తతః ప్రహృష్ట స్సుగ్రీవః శ్లక్ష్ణం మధురయా గిరా।
ప్రత్యువాచ తదా రామం హర్షవ్యాకులలోచనః॥ ౨౧ ॥

(౧౩) మనసుకు సంతోషము గలిగించునట్టి స్నేహమును గలిగించుకొని రాముఁడు సుగ్రీవుని గాఢాలింగనము చేసికొనెను.

(౧౪) శత్రుసంహారకుఁ డగుహనుమంతుఁడు సన్యాసివేషమును విడిచి వానరరూపముదాల్చి శమీ సమిధలను మథించి అగ్నిని వెలిగించెను. (సుగ్రీవుని సమీపమునకుఁ బోవునపుడు హనుమంతుఁడు మరియు సన్యాసిరూపము ధరించె నని భావము.)

(౧౫) పిమ్మట, జ్వలించుచుండు అగ్నిని బూలతోఁ బూజించి హనుమంతుఁడు సంతోషించినవాఁడై మిగుల జాగ్రత్తగ దాని (అగ్నిని) రామ సుగ్రీవుల మధ్యలో నుంచెను.

(౧౬) పిమ్మట సుగ్రీవుఁడు శ్రీరాముఁడు చేతులు పట్టుకొని జ్వలించుచుండు అగ్నికిఁ బ్రదక్షిణము చేసి అగ్నిసాక్షిగ స్నేహముచేసికొనిరి.

(౧౭) పిదప, సుగ్రీవుఁడు రాముఁడు మిగుల సంతోషించినవారై ఒకరి నొకరు బాగుగఁ జూచుకొని తృప్తి పొందలేదు.

(౧౮) సుగ్రీవుఁడు మిగుల సంతోషించి రాముని జూచి, 'నాకుఁ బ్రియమైన స్నేహితుఁడవైతి, అని చెప్పెను. (అనఁగా, నీ సుఖమే నా సుఖము, నీ దుఃఖమే నా దుఃఖమని భావము.)

(౧౯) పిమ్మట సుగ్రీవుఁడు ఆకులతోనిండి బాగుగఁ బూజియుండు సాలవృక్ష శాఖను నరికి క్రింద పరచుకొని రామునితోడ గూర్చుండెను.

(౨౦ పిదప, వానరశ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు మిగులసంతోషించిన వాఁడై బాగుగఁ బూచియుండు చందనశాఖను నరికి లక్ష్మణునికి ఆసనముగ నిచ్చెను.

(౨౧) సంతోషించియుండు సుగ్రీవుఁడు ఆనందబాష్పములతో నిండిన కన్నులు గలవాఁడై శ్రీరాముని జూచి మధురముగఁ బలికెను.

అహం వినికృతో రామ చరామీహ భయార్దితః।
హృతభార్యో వనే త్రస్తో దుర్గ మేత దుపాశ్రితః॥ ౨౨

సోహం త్రస్తో వనే భీతో వసామ్యుద్భ్రాంత చేతనః।
వాలినా నికృతో భ్రాత్రా కృతవైరశ్చ రాఘవ॥ ౨౩

వాలినో మే మహాభాగ భయార్తస్యాభయం కురు।
కర్తు మర్హసి కాకుత్స్థ భయం మే నభవే ద్యథా॥ ౨౪

ఏవ ముక్త స్తు తేజస్వీ ధర్మజ్ఞో ధర్మవత్సలః।
ప్రత్యభాషత కాకుత్స్థ స్సుగ్రీవం ప్రహసన్నివ॥ ౨౫

ఉపకారఫలం మిత్రం విదితం మే మహాకపే।
వాలినం తం వధిష్యామి తవ భార్యాపహారిణమ్॥ ౨౬

అమోఘా స్సూర్యసంకాశా మమైతే నిశితా శ్శరాః।
తస్మిన్ వాలి నిదుర్వృత్తే నిపతిష్యంతి వేగితాః॥ ౨౭

కంకపత్రప్రతిచ్ఛన్నా మహేంద్రాశని సన్నిభాః।
తీక్ష్ణాగ్రా ఋజుపర్వాణ స్సరోషా భుజగా ఇవ॥ ౨౮

త మద్య వాలినం పశ్య క్రూరై రాశీవిషోపమైః।
శరై ర్వినిహతం భూమౌ వికీర్ణమివ పర్వతమ్॥ ౨౯

స తు తద్వచనం శ్రుత్వా రాఘవస్యాత్మనో హితమ్।
సుగ్రీవః పరమప్రీత స్సుమహ ద్వాక్యమబ్రవీత్॥ ౩౦

(౨౨4) నేను వాలిచే వెడలగొట్టఁబడినవాఁడనై భయపడి యిచట సంచరించుచున్నాను. నాభార్యను నతఁడపహరించెను. ఈ వనములో భయములేక యీ దుర్గములో నున్నాను.

(౨౩4) ఓరామా! అన్నయగు వాలిచే అవమానింపఁబడి, అతనితో ద్వేషము గలిగించుకొని భయపడి మనసు చెడి యీ వనములో నిర్భయముగ వసించుచున్నాను.

(౨౪4) ఓ పూజ్యుఁడా! వాలికి భయపడియుండు నాకు అభయ మీయవలయును. రామా! నాకు భయము గలుగకుండునటుల చేయుము.

(౨౫4) ధర్మజ్ఞుఁడును ధర్మములోఁ బ్రీతిగలవాఁడును తేజస్సు గలవాఁడును నగు రాముఁడు, యిటుల సుగ్రీవుఁడు చెప్పగా విని చిరునవ్వు నవ్వి యిటులనెను.

(౨౬4) ఓ మహాకపీ! మిత్రుని లక్షణము ఉపకారము సేయుటే యని నే నెఱుంగుదును. నీభార్యను నవహరించిన వాలిని జంపెదను.

(౨౭4, ౨౮4) గురితప్పని సూర్యునివలె వెలుంగుచుండు ఘోరమయిన కంకపక్షి రెక్కలు కట్టఁబడిన ఇంద్రుని వజ్రాయుధమునకు సరిపోలునట్టి పదునుగల మొనలుగల, సమమగు గణుపులు గలనా బాణములు దురాచారము గల వాలిమీద, మిగుల కోపముతోఁ గూడిన పాములవలె, వేగముతోఁ బోయి పడును.

(౨౯4) ఘోరమైన సర్పములతో సమముగనుండు బాణములతోఁ జంపఁబడి, బద్దలై భూమిమీద పడిన పర్వతమువలె నుండు, వాలిని జూడఁగలవు.

(౩౦4) తనకు క్షేమము గలిగించు శ్రీరాముని మాటవిని సుగ్రీవుఁడు మిగుల సంతోషించి, అతనితో గొప్పమాటను జెప్పెను.

తవ ప్రసాదేన నృసింహ-రాఘవ ప్రియాం చ రాజ్యంచ సమా
ప్నుయా మహమ్। తథా కురుత్వం నరదేవ వైరిణం యథా
నిహంస్యద్య రిపుం మమాగ్రజమ్॥ ౩౧౪

సీతాకపీంద్ర క్షణదాచరాణాం రాజీవ హేమజ్వలనోపమాని।
సుగ్రీవ రామ ప్రణయప్రసంగే వామాని నేత్రాణి సమం స్ఫు
రంతి॥ ౩౨౪

ఇతి శ్రీమత్కిష్కింధా కాండే- పంచమస్సర్గః

## షష్ఠస్సర్గః

పునరే వాబ్రవీత్ ప్రీతో రాఘవం రఘునందనమ్॥ ౧
అయ మాఖ్యాతి మే రామ సచివో మంత్రిసత్తమః।
హనుమాన్ యన్నిమిత్తం త్వం నిర్జనం వన మాగతః॥ ౧౪

(౩౧౪) ఓ పురుషోత్తముఁడా! రామా! నీకటాక్షముచే నాభార్యను రాజ్యమును బడసేదను. ఓ నరనాథా! వైరముచే శత్రువుగనుఁడు నాయన్నను జంపుటకు వలసిన యత్నము సేయవలయును.

(౩౨౪) రాముఁడు సుగ్రీవుఁడు అగ్నిసాక్షిగ స్నేహముచేసికొని సల్లాపము లాడుకొనుచుండు సమయములో, సీత, వానరరాజగు వాలి, రావణాసురుఁడు, అను యీముగ్గురియొక్క, క్రమముగ తామరపూవు, బంగారము, అగ్నితో, సమమయిన యెడమకన్నులు యేకకాలములో చలించినవి. (అనఁగా, సీతకన్నులు తామర రేకువలెను, వాలికన్నులు బంగారు రంగుగను, రావణుని నేత్రములు అగ్నివలెను నుండునవి. మఱియు, సీతకు ఎడమకన్ను చలించినది ఆమెకు శుభసూచకము, వాలికి రావణునికి యెడమ కన్ను చలించినది వారికి అశుభసూచకమని భావము.)

ఇ ది అ యి ద వ స ర్గ.



## ౬ వ సర్గ.

(అనతారిక.— రాముఁడు వాలిని వధింపుచుటుల ప్రతిజ్ఞ చేసినందున సుగ్రీవుఁడు రాముని కార్యమును బరిపూర్తిచేయుటకు ప్రతిజ్ఞచేయుట ఈసర్గలో చెప్పఁబడుచున్నది.)

(౧, ౧౪) మఱియు సుగ్రీవుఁడు సంతోషించి రఘుకులమునకు ఆనందమునానిచ్చునట్టి శ్రీరామునితో నిటులనెను. రామా! మంత్రివరుఁడగు యీహనుమంతుఁడు జనులులేని వనమునకు నీవు వచ్చినకారణమును నాకుఁ దెలిపెను.

లక్ష్మణేన సహభ్రాత్రా వసతశ్చ వనే తవ॥ ౨
రక్షసాఽపహృతా భార్యా మైథిలీ జనకాత్మజా॥
త్వయా వియుక్తా రుదతీ లక్ష్మణేన చ ధీమతా॥ ౩
అంతర ప్రేప్సునా తేన హత్వా గృధ్రం జటాయుషమ్॥ ౩½
భార్యా వియోగజం దుఃఖ మచిరా త్త్వం విమోక్ష్యసే।
అహం తా మానయిష్యామి నష్టాం వేదశ్రుతీ మివ॥ ౪½
రసాతలేవా వర్తంతీం వర్తంతీం వా నభస్తలే।
అహ మానీయ దాస్యామి తవ భార్యా మరిందమ॥ ౫½
ఇదం తథ్యం మమ వచ స్త్వమవేహి చ రాఘవ॥ ౬
న శక్యా సా జరయితు మపి సేంద్రై స్సురాసురైః॥
తవ భార్యా మహాబాహో భక్ష్యం విషకృతం యథా॥ ౭
త్యజ శోకం మహాబాహో తాం కాంతా మానయామి తే।
అనుమానాత్తు జానామి మైథిలీ సా నసంశయః॥ ౮
హ్రియమాణా మయా దృష్టా రక్షసా క్రూరకర్మణా।
క్రోశంతీ రామ రామేతి లక్ష్మణేతి చ విస్వరమ్॥ ౯
స్ఫురంతీ రావణస్యాంకే పన్నగేంద్రవధూ ర్యథా॥ ౯½
ఆత్మనా పంచమం మాం హి దృష్ట్వా శైలతటే స్థితమ్।
ఉత్తరీయం తయా త్యక్తం శుభా న్యాభరణాని చ॥ ౧౦½

సీతను దెచ్చియిచ్చునటుల సుగ్రీవుడు శ్రీరామునికి దెలుపుట.

(౨,౩,౩½) తమ్ముడగు లక్ష్మణునితోడ నీవు వనములో వాసము చేయుచుండగా, నీవు బుద్ధిమంతుడగు లక్ష్మణుడు లేనందున యేడ్చుచుండిన జనకుని కూతురును నీ భార్యయగు సీతను, మార్గములో జటాయుపక్షి నిజంపి, సమయము చూచుచుండిన పూర్వమునీకు దెలియకుండిన రావణాసురుడు అపహరించుకొని పోయెనని హనుమంతుడు చెప్పెను.

(౪½ భార్యా వియోగమువల్ల కలిగిన దుఃఖమును నీవు శీఘ్రములో విడిచెదవు. నష్టమైపోయిన వేదరూపముగనుండు శాస్త్రమును దెచ్చినటుల నీభార్యను నేను దెచ్చెదను.

(౫½) ఓ శత్రుసంహారకుడా! పాతాళములోనుండినను ఆకాశములోనుండినను నీభార్యను దీసికొనివచ్చి యిచ్చెదను.

(౬) రాఘవా! నామాట సత్యమని తెలిసికొనుము.

(౭) విషముచే పక్వము సేయబడిన భక్ష్యమును జీర్ణించుకొనుటకు సాధ్యపడనటుల, ఓ గొప్ప భుజములుగలవాడా! ఇంద్రునితోగూడిన దేవాసురులు నీభార్యను నపహరించుకొనిపోయియుండినను వారు ఆమెను జీర్ణించుకొనలేరు.

(౮,౯,౯½) గొప్పభుజములు గలరామా! దుఃఖమును విడువుము. నీప్రియురాలిని దెచ్చెదను. పాపియగు రావణునిచే అపహరింపబడి దీనస్వరముతో 'రామరామ, లక్ష్మణా' యని యేడ్చుచు, రావణుని ఒడిలో పన్నగేంద్రుని భార్యవలె ప్రకాశించుచుండిన ఒకస్త్రీని జూచితిని. అనుమానముచే ఆమె సీతయని తలచుచున్నాను. అందుకు సందేహము లేదు.

(౧౦½) పర్వతముమీద నలుగురితోడ ఉండిన నన్నుచూచి ఉత్తరీయములో మంచి యాభరణములను ముడిచి నేనుండినచోట పడవేసెను.

తాన్యస్మాభి ర్గృహీతాని నిహితాని చ రాఘవ।
ఆనయిష్యామ్యహం తాని ప్రత్యభిజ్ఞాతు మర్హసి॥ ౧౧
త మబ్రవీ త్తతో రామ స్సుగ్రీవం ప్రియవాదినమ్।
ఆనయస్వ సఖే శీఘ్రం కిమర్థం ప్రవిళంబసే॥ ౧౨
ఏవ ముక్త స్తు సుగ్రీవ శ్శైలస్య గహనాం గుహామ్।
ప్రవివేశ తత శ్శీఘ్రం రాఘవప్రియకామ్యయా॥ ౧౩
ఉత్తరీయం గృహీత్వా తు శుభాన్యాభరణాని చ॥
ఇదం పశ్యేతి రామాయ దర్శయామాస వానరః॥ ౧౪
తతో గృహీత్వా తద్వాస శ్శుభాన్యాభరణాని చ।
అభవ ద్బాష్పసంరుద్ధో నీహారేణేవ చంద్రమాః॥ ౧౫
సీతాస్నేహప్రవృత్తేన సతు బాష్పేణ దూషితః।
హా ప్రియేతి రుద న్ధైర్య ముత్సృజ్య న్యపత త్క్షితౌ॥ ౧౬
హృది కృత్వా తు బహుశ స్త మలంకార ముత్తమమ్।
నిశశ్వాస భృశం సర్పో బిలస్థ ఇవ రోషితః॥ ౧౭
అవిచ్ఛిన్నాశ్రువేగ స్తు సౌమిత్రిం వీక్ష్య పార్శ్వతః।
పరిదేవయితుం దీనం రామ స్సముపచక్రమే॥ ౧౮
పశ్య లక్ష్మణ వైదేహ్యా సంత్యక్తం హ్రియమాణయా।
ఉత్తరీయ మిదం భూమౌ శరీరా ద్భూషణాని చ॥ ౧౯

సుగ్రీవుఁడు చూపిన సీతఆభరణములను జూచి రాముఁడు దుఃఖించుట. వా౧

(౧౧౫) రామా! ఆసొమ్ములను మేము పుచ్చుకొని దాచియుంచితిమి. ఆసొమ్ములను దెచ్చెదను. నీవుచూచి గురుతుపట్టుము.

(౧౨౫) పిమ్మట, రాముఁడు ప్రియముగ బలుకుచుండు సుగ్రీవునిజూచి, ఓ స్నేహితుఁడా! శీఘ్రముగ దీసికొనిరమ్ము. ఆలస్యము వలదని చెప్పెను.

(౧౩౫) ఇటుల రాముఁడు చెప్పగా, సుగ్రీవుఁడు ఆపర్వతములో ప్రవేశించుటకు సాధ్యముకాని గుహలో, శ్రీరామునికి ప్రియముసేయుటకై, శీఘ్రముగఁ బ్రవేశించెను.

(౧౪౫) సుగ్రీవుఁడు మూటకట్టియుండిన శ్రేష్ఠమైన ఆభరణములను దెచ్చి, ఇవిగో అని రామునికిఁ జూపెను.

(౧౫౫) పిమ్మట, రాముఁడు ఆయుత్తరీయమును దీసికొని ముడివిప్పి ఆభరణములను జూచి, మంచుచే చంద్రుఁడు మూయఁబడినటుల, మిగుల దుఃఖించెను.

(౧౬౫) సీతమీది స్నేహముచే గలిగిన కన్నీటితోఁదడిసి, ఓ ప్రియురాలా! అని యేడ్చుచు ధైర్యమువిడిచి రాముఁడు భూమిమీద పడెను.

(౧౭౫) రాముఁడు ఆయుత్తమమైన ఆభరణములను రొమ్మమీదనుంచుకొని, పుట్టలోనుండు పాము కోపపడి నిట్టూర్పువిడిచినటుల, మిగుల దుఃఖించి నిట్టూర్పు విడిచెను.

(౧౮౫) ధారధారగ కన్నీరు విడుచుచుండు రాముఁడు దీనుఁడై ప్రక్కలోనుండిన లక్ష్మణుని జూచి విశేషముగ పరితపించుట కారంభించెను.

(౧౯౫) రాక్షసుఁడు అపహరించుకొని పోవుచుండిన సీత ఆమెదేహముమీదనుండిన ఆభరణములను ఉత్తరీయములోముడిచి యిచట వేసెను. చూడుము.

శాద్వలిన్యాం ధ్రువం భూమ్యాం సీతయా హ్రియమాణయా।
ఉత్సృష్టం భూషణ మిదం తథా రూపం హి దృశ్యతే॥ ౨౦ ౼
ఏవ ముక్త స్తు రామేణ లక్ష్మణో వాక్య మబ్రవీత్।
నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే॥ ౨౧ ౼
నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్॥ ౨౨
తత స్స రాఘవ్రో దీన స్సుగ్రీవ మిద మబ్రవీత్॥ ౨౨ ౼
బ్రూహి సుగ్రీవ కం దేశం హ్రియంతీ లక్షితా త్వయా।
రక్షసా రౌద్రరూపేణ మమ ప్రాణైః ప్రియా ప్రియా॥ ౨౩ ౼
క్వవా వసతి తద్రక్షో మహ ద్వ్యసనదం మమ॥
యన్నిమిత్త మహం సర్వా న్నాశయిష్యామి రాక్షసాన్॥ ౨౪ ౼
హరతా మైథిలీం యేన మాం చ రోషయతా భృశమ్॥
ఆత్మనో జీవితాంతాయ మృత్యుద్వార మపావృతమ్॥ ౨౫ ౼
మమ దయితతరా హృతా వనాంతా ద్రజనిచరేణ విమథ్య
యేన సా। కథయ మమ రిపుం త్వ మద్య వై ప్లవగపతే
యమసాదనం నయామి॥ ౨౬ ౼

ఇతి శ్రీమత్కిష్కింధా కాండే - షష్ఠస్సర్గః



(౨౦౪) రాక్షసుఁడు అపహరించుకొనిపోవుచుండిన సీత పచ్చికమొలచి పచ్చగనుండు భూమిమీద నీ యాభరణములను పడవేసెను. ఏలననఁగా, యీ యాభరణములు చెక్కుచెదర కున్నవి.

(౨౧) శ్రీరాముని మాటలు విని లక్ష్మణుఁ డిటులనెను.

(౨౨) సీతయొక్క భుజకీర్తులు నాకు తెలియవు. ఆమె కుండలములను నేను చూచినదిలేను. దినదినము ఆమె పాదములకు నమస్కారము సేయుచుం డుటవల్ల అందెలుమాత్రము నాకు బాగుగఁ దెలిసియున్నవి. (లక్ష్మణుఁడు సీతను కన్నెత్తిచూచినదే లేదని భావము.)

(౨౨౪) పిమ్మట, శ్రీరాముఁడు దీనుఁడై సుగ్రీవునితో నిటులనెను.

(౨౩౪) భయంకరమైన రూపముగల రాక్షసులు ప్రాణముఃకంటె ప్రియముగనుండు నాప్రియురాలిని అపహరించుకొని యేదిక్కులోఁ బోవుట నీవు చూచితివి; సుగ్రీవుఁడా! చెప్పుము.

(౨౪౪, ౨౫ ) ఎవనికిగాను రాక్షసులనందరిని జంపెదనో సీతను నపహరించి నాకెవఁడు మిగుల కోపము గలిగించెనో అతనినాశముకొరకే మృత్యుద్వారమును తెరచుకొనెనో నాకు మిగులదుఃఖమును గలిగించు అట్టిరాక్షసుఁడు, ఓ సుగ్రీవుఁడా! ఎచట వసించుచున్నాఁడు.

(౨౬౪) నా మిగులప్రియమైన భార్యను బలాత్కరించి అరణ్యములో నుండి అపహరించుకొనిపోయిన నాకు శత్రువుగనుండు రాక్షసుఁడు యెక్కడ ఉన్నాఁడు. ఓ వానరరాజా ? నాకుఁ దెలుపుము. వాని యమలోకమునకుఁ బంపెదను.

ఇది ఆరవసర్గ.

## సప్తమస్సర్గః



ఏవ ముక్త స్తు సుగ్రీవో రామేణార్తేన వానరః।
అబ్రవీ త్ప్రాంజలి ర్వాక్యం సబాష్పం బాష్పగద్గదః॥ ౧

నజానే నిలయం తస్య సర్వథా పాపరక్షసః।
సామర్థ్యం విక్రమంవాపి దౌష్కులేయస్యవా కులమ్॥ ౨

సత్యం తే ప్రతిజానామి త్యజ శోక మరిందమ।
కరిష్యామి తథా యత్నం యథా ప్రాప్స్యసి మైథిలీమ్॥ ౩

రావణం సగణం హత్వా పరితోష్యాత్మపౌరుషమ్।
తథాస్మి కర్తా నచిరా ద్యథా ప్రీతో భవిష్యసి॥ ౪

## ౭ వ సర్గ.

(అవతారిక.— సీతయొక్క ఆభరణములను జూచుట యనెడు నెపముచేభగవంతునికి చేతనుని మీఁద నిర్హేతుక కటాక్షము గలిగినందున అట్టి చేతనుని రక్షించవలయుననుత్వర భగవంతునికి యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) రాముఁడు దుఃఖపీడితుఁడై చెప్పినమాటలు విని సుగ్రీవుఁడు అంజలి చేసికొని గద్గదస్వరముతో కన్నీరువిడుచుచు యిటు లనెను.

(౨) దుష్టవంశములోఁ బుట్టినవాఁడును పాపియును నగురావణుఁడు వసించుచోటు అతనిసామర్థ్యము పరాక్రమము కులము నాకుఁ దెలియదు. (సుగ్రీవుఁడిట్లుచెప్పి వానరులను నలుదిక్కులకుఁ బంపుసమయములో రావణుని సమాచారమును దెలిపెను. ఇది పరస్పరవిరుద్ధమైన విషయము. ఇందుకుకారణము, మొట్టమొదటనే యీవిషయమును రామునికిఁ దెలిపినచో అతఁడు సీతాన్వేషణ విషయములో త్వరగలవాఁడుగనుండును. అందుచేత వాలివధ తత్క్షణము జరుగదు. అందువల్ల వానరులందరు సుగ్రీవునికి వశపడరు. కొందరు వశమైనను, వాలి రావణునితోఁ గలిసి రామ సుగ్రీవుల కార్యమునకు భంగము గలిగించునని యోచించి, బుద్ధిమంతుఁడగు సుగ్రీవుఁడు రావణుని విషయమేమియు తెలియనటుల నటించెనని భావము. వాలివధ జరిగిన పిమ్మట, తార లక్ష్మణునితోఁ జెప్పినమాటలను రాముఁడు విననందున సుగ్రీవుని మాటలమీఁద నతనికి శంకగలుగలేదు.)

(౩) శత్రుసంహారకుఁడా! సీతను వెతకితెచ్చునటుల ప్రతిజ్ఞ చేయుచున్నాను దుఃఖమును విడువుము. సీత లభించుటకు వలసినప్రయత్నమును జేసెదను.

(౪) పరివారముతోడ రావణుని జంపి శీఘ్రముగ నీకు సంతోషము గలిగించి నాపౌరుషమును జూపెదను. అపుడు నీవు సంతోషించెదవు.

అలం వైక్లబ్య మాలంబ్య ధైర్య మాత్మగతం స్మర।
త్వద్విధానా మసదృశ మీదృశం విద్ధి లాఘవమ్॥ ౫
మయాపి వ్యసనం ప్రాప్తం భార్యాహరణజం మహత్।
నచాహ మేవం శోచామి నచ ధైర్యం పరిత్యజే॥ ౬
నాహం తా మనుశోచామి ప్రాకృతో వానరోపి సన్।
మహాత్మాచ వినీతశ్చ కింపున ర్ధృతిమా న్భవాన్॥ ౭
బాష్ప మాపతితం ధైర్యా న్నిగ్రహీతుం త్వ మర్హసి।
మర్యాదాం సత్వయుక్తానాం ధృతిం నోత్స్రష్టు మర్హసి॥ ౮
వ్యసనే వాఽర్థకృచ్ఛ్రే వా భయే వా జీవితాంతకే।
విమృశన్ వై స్వయా బుద్ధ్యా ధృతిమా న్నావసీదతి॥ ౯
బాలిశస్తు నరో నిత్యం వైక్లబ్యం యోనువర్తతే।
స మజ్జత్యవశ శ్శోకే భారాక్రాంతేవ నౌ ర్జలే॥ ౧౦
ఏషోఽంజలి ర్మయా బద్ధః ప్రణయా త్త్వాం ప్రసాదయే।
పౌరుషం శ్రయ శోకస్య నాంతరం దాతు మర్హసి॥ ౧౧
యే శోక మనువర్తంతే నతేషాం విద్యతే సుఖమ్।
తేజశ్చ క్షీయతే తేషాం నత్వం శోచితు మర్హసి॥ ౧౨
శోకేనాభిప్రపన్నస్య జీవితే చాపి సంశయః।
స శోకం త్యజ రాజేంద్ర ధైర్య మాశ్రయ కేవలమ్॥ ౧౩

(౫) దీనత్వమును విడువుము. ధైర్యమును స్మరింపుము. నీవంటివారికి దైన్యము తగదు. ఇది లాఘవమని తలంచవలయును.

(౬) భార్యాపహారణమువల్ల నేనును గొప్పవ్యసనమును ననుభవించు చున్నాను. నేను నీవలె దుఃఖించలేదు. ధైర్యమును విడువలేదు.

(౭) నేను కేవలము హీనుఁడనై వానరుఁడుగనుండినను భార్యావిషయము లో దుఃఖించలేదు. మహాత్ముఁడుగను పెద్దలచే శిక్షింపఁబడినవాఁడుగను ధైర్యము గలవాఁడుగను నుండు నీవు దుఃఖించవచ్చునా.

(౮) కన్నీటిని ధైర్యముచే నిగ్రహించవలయును. కార్యవంతులకు ఉచితుగనుండు ధైర్యమును విడుచుట తగదు.

(౯) గొప్పవ్యసనము గలిగినపుడును, ధననాశము గలిగినపుడును ప్రాణముపోవునట్టి భయము సంభవించినపుడును, తనబుద్ధిచే బాగుగ నాలోచించుచు ధీరుఁడు దుఃఖపడఁడు.

(౧౦) ఎవఁడు యెల్లపుడు దీనుఁడుగనుండునో అతఁడు వట్టిమూఢుఁడు. అట్టివాఁడతని స్థితిని తెలియంగక, బరువుగలఓడ నీళ్ళలో మునిగిపోయినటుల, నాశముపొందును.

(౧౧) ఇదిగో అంజలిచేసికొని నీకు మనశ్శాంతి గలుగవలయునని కోరుచున్నాను. పౌరుషమును నాశ్రయించుము. దుఃఖమున కవకాశ మీయవలదు.

(౧౨) ఎవరు యెల్లపుడు దుఃఖించుచుందురో వారికి సుఖమే లేదు. వారిబలము సహా క్షీణించును. కనుక, ఓరామా! నీవు చింతించవలదు.

(౧౩) శోకముచే మిగుల బీడింపఁబడినవాఁడు జీవించియుండుట, సంశయమేను, కనుక, రాజేంద్రా! దుఃఖము విడిచి, కేవలము ధైర్యమునుబొందుముఃం

హితం వయస్యభావేన బ్రూమి నోపదిశామి తే।
వయస్యతాం పూజయన్మే నత్వం శోచితు మర్హసి॥ ౧౪
మధురం సాంత్వితస్తేన సుగ్రీవేణ స రాఘవః।
ముఖ మశ్రుపరిక్లిన్నం వస్త్రాంతేన ప్రమార్జయత్॥ ౧౫
ప్రకృతిస్థస్తు కాకుత్స్థ స్సుగ్రీవవచనాత్ప్రభుః।
సంపరిష్వజ్య సుగ్రీవ మిదం వచన మబ్రవీత్॥ ౧౬
కర్తవ్యం యద్వయస్యేన స్నిగ్ధేన చ హితేన చ।
అనురూపం చ యుక్తంచ కృతం సుగ్రీవ తత్త్వయా॥ ౧౭
ఏషచ ప్రకృతిష్ఠోఽహ మనునీత స్త్వయా సఖే।
దుర్లభో హీదృశో బంధు రస్మిన్కాలే విశేషతః॥ ౧౮
కింతు యత్న స్త్వయా కార్యో మైథిల్యాః పరిమార్గణే।
రాక్షసస్య చ రౌద్రస్య రావణస్య దురాత్మనః॥ ౧౯
మయాచ యదనుష్ఠేయం విస్రబ్ధేన తదుచ్యతామ్।
వర్షాస్వివచ సుక్షేత్రే సర్వం సంపద్యతే మయి॥ ౨౦
మయా చ యదిదం వాక్య మభిమానా త్సమీరితమ్।
తత్త్వయా హరిశార్దూల తత్వమిత్యుపధార్యతామ్॥ ౨౧
అనృతం నోక్తపూర్వం మే నచ వక్ష్యే కదాచన।
ఏతత్తే ప్రతిజానామి సత్యేనైవచ తే శపే। ౨౨

(౧౪) మిత్రభావముతో హితమును జెప్పుచున్నాను. నీకుపదేశము చేయుటకు రాలేదు. నా మిత్రత్వమును గౌరవించుచు నీవు దుఃఖించక యుండవలయును.

(౧౫) సుగ్రీవుఁడు యింపుగ నిటుల సమాధాన పరచగా, రాముఁడు కన్నీటితో దడిసిన ముఖమును వస్త్రము కొంగుతోఁదుడుచుకొనెను.

(౧౬) ప్రభుఁడగు శ్రీరాముఁడు సుగ్రీవుని మాటచే దుఃఖమును విడిచినవాఁడై అతని గాఢాలింగనము చేసికొని యిటు లనెను.

(౧౭) నమ్మకము గలవాఁడుగను హితుఁడుగను నుండు స్నేహితుఁడు చేయవలసిన కార్యము చేసి, సుగ్రీవుఁడా! మిత్రత్వమునకుఁ దగినటులుగను, శోకమును వారించునట్టిదిగను నుండుమాటలు చెప్పితివి.

(౧౮) స్నేహితుఁడా! నీవు సమాధాన పరచినందున నేను దుఃఖమును విడిచియున్నాను. ఇట్టిబంధువు లభించుట దుర్లభము. మరియు ఇట్టి కాలములో దొరకనే దొరకఁడు.

(౧౯) మరియు, సీతను వెతకి కనిపెట్టుటలోను, భయంకరుఁడును దురాత్ముఁడును నగు రావణుని కనిపెట్టుటలోను ప్రయత్నము చేయవలయును.

(౨౦) నేను చేయవలసినపనిని నన్ను నమ్మి నాతోఁ జెప్పవలయును. వర్షాకాలములో మంచిభూమిలో సమస్తము పండునట్టుల, అన్ని పనులు నావలన ముగియును.

(౨౧) నేను నాశౌర్యాభిమానములవల్లను, లేక, నీయెడలగల అభిమానమువల్లను యిటుల చెప్పితిని. వానరశ్రేష్ఠుఁడా! నేను చెప్పినమాట నిజమని తెలిసికొనుము.

(౨౨) నేను అబద్ధము యెప్పుడును చెప్పినదిలేను. ఇఁక మీఁదను జెప్పఁబోను. ఇటుల నీకు సత్యముగ ఒట్టుపెట్టుచున్నాను.

తతః ప్రహృష్ట స్సుగ్రీవో వానరై స్సచివై స్సహ।
రాఘవస్య వచ శ్శ్రుత్వా ప్రతిజ్ఞాతం విశేషతః॥ ౨౩
ఏవ మేకాంతసంపృక్తౌ తత స్తౌ నరవానరౌ।
ఉభావన్యోన్యసదృశం సుఖం దుఃఖం ప్రభాషతామ్॥ ౨౪
మహానుభావస్య వచో నిశమ్య హరి ర్నరాణా మృషభస్య
తస్య। కృతం స మేనే హరివీరముఖ్య స్తదా స్వకార్యం హృద
యేన విద్వాన్॥ ౨౫

ఇతి శ్రీమత్కిష్కింధా కాండే - సప్తమస్సర్గః

## అష్టమస్సర్గః

పరితుష్ట స్తు సుగ్రీవ స్తేన వాక్యేన వానరః।
లక్ష్మణస్యాగ్రతో రామ మిదం వచన మబ్రవీత్॥ ౧
సర్వథాహ మనుగ్రాహ్యో దేవతానా మసంశయః।
ఉపపన్నగుణోపేత స్సఖా యస్య భవా న్మమ। ౨
శక్యం ఖలు భవే ద్రామ సహాయేన త్వయాఽనఘ।
సురరాజ్య మపి ప్రాప్తుం స్వరాజ్యం కిం పునః ప్రభో॥ ౩
సోఽహం సభాజ్యో బంధూనాం సుహృదాం చైవ రాఘవ।
యస్యాగ్నిసాక్షికం మిత్రం లబ్ధం రాఘవవంశజమ్॥ ౪

రామునివంటి స్నేహితుఁడు లభించినందుకు సుగ్రీవుఁడు సంతోషించుట. ౯౧

(౨౩) పిమ్మట రాముని సత్యమైన ప్రతిజ్ఞను విని, సుగ్రీవుడు మంత్రులతోఁ గూడి మిగుల సంతోషించెను.

(౨౪ పిమ్మట, రామసుగ్రీవులు యీ విధముగ నేకాంతములో గలసి యిద్దరు పరస్పరము సమానములుగ నుండు వారి సుఖదుఃఖములను జెప్పుకొనిరి.

(౨౫) వానరవీరులలోఁ బ్రధానుఁడుగను పండితుఁడుగనునుండు సుగ్రీవుఁడు మహాత్ముఁడును మనుజులలో నుత్తముఁడును నగు శ్రీరాముని మాటవిని అపుడు, తన కార్యము మనసా పరిపూర్తియైనదని తలఁచెను.

ఇది యేడవ సర్గ.

## ౮ వ సర్గ.

(అవతారిక.— ఈ సర్గలో సుగ్రీవుఁడతనికిఁ గలిగిన దుఃఖమునకు కారణము దెలుపుచున్నాఁడు.)

(౧) వానరుఁడగు సుగ్రీవుఁడు శ్రీరాముని మాటవిని సంతోషించి లక్ష్మణుని యెదుట శ్రీరామునితో నిటులనెను.

(౨) రాజునకుతగిన శౌర్యవీర్యాది సకలగుణ సంపన్నుఁడ వగు నీవు నాకు స్నేహితుఁడవైనందున దేవతలకును నా యెడల దయగలదు ఇందుకు సందేహము లేదు.

(౩) పాపరహితుఁడా! రామా! నీ సహాయముచే దేవరాజ్యమును బడయుటకును సాధ్యమేను హే ప్రభో! నా రాజ్యమును బడయుట యెంత మాత్రము.

(౪) రఘువంశములోఁ బుట్టియుండు మిత్రుని అగ్నిసాక్షిగ బడసినందున ఓ రామా! బంధువులకును స్నేహితులకును నేను పూజ్యుఁడనైతిని.

అహ మప్యనురూప స్తే వయస్యో జ్ఞాస్యసే శనైః।
నతు వక్తుం సమర్థోఽహం స్వయ మాత్మగతాన్ గుణాన్॥ ౫
మహాత్మనాం తు భూయిష్ఠం త్వద్విధానాం కృతాత్మనామ్।
నిశ్చలా భవతి ప్రీతి ర్ధైర్య మాత్మవతా మివ॥ ౬
రజతం వా సువర్ణం వా వస్త్రాణ్యాభరణాని చ।
అవిభక్తాని సాధూనా మవగచ్ఛంతి సాధవః॥ ౭
ఆఢ్యో వాపి దరిద్రో వా దుఃఖిత స్సుఖితోఽపివా।
నిర్దోషోవా సదోషోవా వయస్యః పరమా గతిః॥ ౮
ధనత్యాగ స్సుఖత్యాగో దేహత్యాగోఽపివా పునః।
వయస్యార్థే ప్రవర్తంతే స్నేహం దృష్ట్వా తథావిధమ్। ౯
తత్తథేత్యబ్రవీ ద్రామ స్సుగ్రీవం ప్రియవాదినమ్।
లక్ష్మణస్యాగ్రతో లక్ష్మ్యా వాసవస్యేవ ధీమతః॥ ౧౦
తతో రామం స్థితం దృష్ట్వా లక్ష్మణం చ మహాబలమ్।
సుగ్రీవ స్సర్వత శ్చక్షు ర్వనే లోల మపాతయత్॥ ౧౧
స దదర్శ తత స్సాల మవిదూరే హరీశ్వరః।
సుపుష్ప మీషత్పత్రాఢ్యం భ్రమరై రుపశోభితమ్। ౧౨
తస్యైకాం పర్ణబహులాం భఙ్క్త్వా శాఖాం సుపుష్పితామ్।
సాలస్యాస్తీర్య సుగ్రీవో నిషసాద స రాఘవః॥ ౧౩

(౫) ఓ రామా! నేను నీకుఁ దగిన స్నేహితుఁడను. ఇది నీవు పోనుపోను విశదమగును, నా గుణములను నేనే చెప్పుకొనుట తగదు.

(౬) మహాత్ములుగను ప్రశస్తమైన బుద్ధిగలవారుగను నుండు మీవంటి వారి సంతోషము, ఆత్మజ్ఞానము గలవారికి ధైర్యమెటుల చలించదో, అటుల చలించకుండును.

(౭) మంచి స్నేహితులయొక్క వెండి బంగారు వస్త్రములు ఆభరణములను తమ సొమ్ముతో సమానముగ వారి స్నేహితులు భావింతురు.

(౮) ధనికుఁడుగను దరిద్రుఁడుగను నుండినను దుఃఖించు చుండినను సుఖించు చుండినను నిర్దోషిగ నుండినను దోషిగనుండినను స్నేహితుఁడే కార్య సాధనములో ఉపాయముగ నుండును.

(౯) చెప్పుటకు సాధ్యముగాని స్నేహమును స్మరించి అట్టి స్నేహితుని విషయమై ధనమును సుఖమును దేహమును విడువవలసినటుల సంభవించుచున్నది.

(౧౦ కాంతిచే ఇంద్రునితో సముఁడుగ నుండువాఁడును బుద్ధిమంతుఁడును నగు లక్ష్మణుని యెదుట ప్రియమైన మాటలు చెప్పుచుండు సుగ్రీవునితో నీవు చెప్పినదంతయు నిజమేను అనిరాముఁడు అనెను.

(౧౧) పిమ్మట, గొప్ప బలముగల రామలక్ష్మణులు సీత ఆభరణములను జూచినదిమొదలు దీర్ఘకాలము గూర్చుండియుండుట చూచి, సుగ్రీవుఁడు వనములో మంచి శాఖలను సంపాదించుటకు అన్ని చోట్లను జూచెను.

(౧౨) వానరరాజగు సుగ్రీవుఁడు మంచిపూలు చిగిరించియుండు తుమ్మెదలతోఁ బ్రకాశించుచుండు ఒక సాలవృక్షమును సమీపములోఁ జూచెను.

(౧3) చిగురుటాకులతో నిండి బాగుగఁబూచియుండిన సాలవృక్షముశాఖను విరిచి తెచ్చి పరచి, సుగ్రీవుఁడు రామునితోడ దానిమీద గూర్చుండెను.

తా వాసీనౌ తతో దృష్ట్వా హనూమా నపి లక్ష్మణమ్।
సాలశాఖాం సముత్పాట్య వినీత ముపవేశయత్॥ ౧౪

సుఖోపవిష్టం రామం తు ప్రసన్న ముదధిం యథా।
ఫలపుష్పసమాకీర్ణే తస్మి న్గిరివరోత్తమే॥ ౧౫
తతః ప్రహృష్ట స్సుగ్రీవ శ్శ్లక్ష్ణం మధురయా గిరా।
ఉవాచ ప్రణయా ద్రామం హర్ష వ్యాకులితాక్షరమ్॥ ౧౬

అహం వినికృతో భ్రాత్రా చరామ్యేష భయార్దితః।
ఋశ్యమూకం గిరివరం హృతభార్య స్సుదుఃఖితః॥ ౧౭

సోఽహం త్రస్తో భయే మగ్నో వసామ్యుద్భ్రాంతచేతనః।
వాలినా నికృతో భ్రాత్రా కృతవైర శ్చ రాఘవ॥ ౧౮
వాలినో మే భయార్తస్య సర్వలోకాభయంకర।
మమాపి త్వ మనాథస్య ప్రసాదం కర్తు మర్హసి॥ ౧౯

ఏవ ముక్త స్తు తేజస్వీ ధర్మజ్ఞో ధర్మవత్సలః।
ప్రత్యువాచ స కాకుత్స్థ స్సుగ్రీవం ప్రహసన్నివ॥ ౨౦
ఉపకారఫలం మిత్ర మపకారోఽరిలక్షణమ్।
అద్యైవ తం హనిష్యామి తవ భార్యాపహారిణమ్॥ ౨౧

(౧౪) పిమ్మట, కూర్చుండియుండిన రామ సుగ్రీవులను జూచి హనుమంతుఁడు పూచియుండు ఒక సాలవృక్షము శాఖను విరిచి పఱచి దానిమీద మిగుల వినయము గల లక్ష్మణుని గూర్చుండపెట్టెను.

(౧౫,౧౬) ఫలపుష్పములతో నిండిన పర్వత శ్రేష్ఠమగు ఆ ఋశ్యమూకములో సుఖముగ గూర్చుండి సముద్రము వలె గంభీరముగ నుండు వాఁడును మనోహరుఁడుగ నుండువాఁడును, నగు రాముని జూచి సుగ్రీవుఁడు మిగుల సంతోషించి మధురముగ నుండు మాటలు తడబడుచు విశ్వాసముతో నిటుల నెను.

(౧౭) నేను నాయన్నచే వెడలగొట్టఁబడి భయపీడితుఁడనై భార్యను బోగొట్టుకొని దుఃఖించుచు యీ ఋశ్యమూక పర్వతముమీద సంచరించు చున్నాను.

(౧౮) ఓ రామా! నేను భయపడి భయము అను సముద్రములో మునిగి మతిచెడి వాలిచే వెడలగొట్టఁబడి అతనితో ద్వేషము సంపాదించుకొని యిచట వసించు చున్నాను.

(౧౯) సర్వలోకములకు అభయమిచ్చు రామా! వాలికి భయపడి అనాథుఁడుగ నుండు నన్ను నీవు అనుగ్రహించ వలయును.

(౨౦) ఇటుల సుగ్రీవుఁడు చెప్పగా, తేజస్సు గలవాఁడును ధర్మస్వరూపమును నెరింగి దానిలోఁ బ్రీతిగలవాఁడును నగు శ్రీరాముఁడు నవ్వుచు సుగ్రీవునితోఁ నిటులనెను.

(౨౧) ఉపకారము సేయుటే స్నేహితుని లక్షణము. అపకారము సేయుట శత్రువు లక్షణము. కనుక, నీ భార్యను నపహరించినవాని యిపుడే నేను జంపగలను.

ఇమేహి మే మహావేగాః పత్రిణ స్తిగ్మతేజసః।
కార్తికేయవనోద్భూతా శ్శరా హేమవిభూషితాః॥ ౨౨
కంకపత్రప్రతిచ్ఛన్నా మహేంద్రాశనిసన్నిభాః।
సుపర్వాణ స్సుతీక్ష్ణాగ్రా స్సరోషా భుజగా ఇవ॥ ౨౩

భ్రాతృసంజ్ఞ మమిత్రం తే వాలినం కృతకిల్బిషమ్।
శరై ర్వినిహతం పశ్య వికీర్ణ మివ పర్వతమ్॥ ౨౪
రాఘవస్య వచ శ్శ్రుత్వా సుగ్రీవో వాహినీపతిః।
ప్రహర్ష మతులం లేభే సాధు సాధ్వితి చాబ్రవీత్॥ ౨౫

రామ శోకాభిభూతోహం శోకార్తానాం భవా న్గతిః
వయస్య ఇతి కృత్వాహి త్వయ్యహం పరిదేవయే॥ ౨౬
త్వంహి పాణిప్రదానేన వయస్యో మేఽగ్నిసాక్షికమ్।
కృతః ప్రాణై ర్బహుమత స్సత్యేనాపి శపామి తే॥ ౨౭

వయస్య ఇతి కృత్వాచ విస్రబ్ధం ప్రవదా మ్యహమ్।
దుఃఖ మంతర్గతం యన్మే మనో హరతి నిత్యశః॥ ౨౮
ఏతావ దుక్త్వా వచనం బాష్పదూషితలోచనః।
బాష్పోపహతయా వాచా నోచ్చై శ్శక్నోతి భాషితుమ్॥ ౨౯

(౨౨,౨౩) గొప్ప వేగము రెక్కలు మంచి తేజస్సు గలవిగను, శరవణములలోఁ బుట్టినవిగను, బంగారు కట్లచే నలంకరింపఁబడినవిగను, కంకపక్షి యీకెలుగలవిగను, ఇంద్రునివజ్రాయుధముతో సమముగను, మంచి గణుపులు మొనలు గలవిగను నుండు బాణములు రోషము గలసర్పమువలె నున్నవి.

(౨౪) నీతోడబుట్టి నీకు శత్రువుగ నుండువాఁడును, పాపకార్యము చేసియుండువాఁడును నగువాలిని, బాణములతోఁ జంపఁబడి చెదిరి భూమిమీద పడియుండు పర్వతమును వలె, తెలిసికొనుము.

(౨౫) వానర సేనాధిపతియగు సుగ్రీవుఁడు శ్రీరామునిమాట విని మిగుల సంతోషించి 'సాధు సాధు' అని చెప్పెను.

(౨౬) ఓ రామా! నేను దుఃఖపీడితుఁడనై యున్నాను. దుఃఖాక్రాంతులగు వారికి నీవే రక్షకుఁడవు. నిన్ను స్నేహితునిగ దలఁచి నా సంకటమును జెప్పుకొని దుఃఖించుచున్నాను.

(౨౭) నీవు అగ్నిసాక్షిగ చేయిపట్టుకొని స్నేహితుఁడవైతివి. ప్రాణమునకంటె నీవు అధికుఁడవుగ నున్నావు. సత్యముగ ఒట్టుపెట్టి చెప్పుచున్నాను.

(౨౮) సదా నా మనసును నపహరించుచుండు అంతర్గతమగు దుఃఖమును నీవు స్నేహితుఁడవని తెలిసికొని, లజ్జను విడిచి నీతోఁజెప్పుకొంటిని.

(౨౯) ఇంతమాత్రము చెప్పి, బాష్పములతో నిండిన నేత్రములు గలవాఁడై గద్గద స్వరము గలిగినందున సుగ్రీవుఁడు మాటలు బాగుగఁ జెప్పుటకు శక్తిలేనివాఁడాయెను.

బాష్పవేగం తు సహసా నదీవేగమివాగతమ్।
ధారయామాస ధైర్యేణ సుగ్రీవో రామసన్నిధౌ॥ ౩౦
సన్నిగృహ్యతు తం బాష్పం ప్రమృజ్య నయనే శుభే।
వినిశ్శ్వస్యచ తేజస్వీ రాఘవం వాక్య మబ్రవీత్॥ ౩౧
పురాఽహం వాలినా రామ రాజ్యాత్స్వాదవరోపితః।
పరుషాణి చ సంశ్రావ్య నిర్ధూతోఽస్మి బలీయసా॥ ౩౨
హృతా భార్యాచ మే తేన ప్రాణేభ్యోపి గరీయసీ।
సుహృదశ్చ మదీయా యే సంయతా బంధనేషు తే॥ ౩౩
యత్నవాంశ్చ సుదుష్టాత్మా మద్వినాశాయ రాఘవ।
బహుశస్తత్ప్రయుక్తాశ్చ వానరా నిహతా మయా॥ ౩౪
శంకయా త్వేతయా చేహ దృష్ట్వా త్వామపి రాఘవ।
నోపసర్పామ్యహం భీతో భయే సర్వేహి బిభ్యతి॥ ౩౫
కేవలం హి సహాయా మే హనుమత్ప్రముఖాస్త్విమే।
అతోఽహం ధారయామ్యద్య ప్రాణాన్ కృచ్ఛ్రగతోఽపిసన్॥
ఏతేహి కపయస్స్నిగ్ధా మాం రక్షంతి సమంతతః।
సహగచ్ఛంతి గంతవ్యే నిత్యం తిష్ఠంతి చ స్థితే॥ ౩౭
సంక్షేప స్త్వేష తే రామ కిముక్త్వా విస్తరం హి తే।
సమే జ్యేష్ఠో రిపుర్భ్రాతా వాలీ విశ్రుతపౌరుషః॥ ౩౮

(౩౦) సుగ్రీవుఁడు శ్రీరాముని సన్నిధిలో నడిపడ్రివాహామువలె వచ్చుచుండు కన్నీటిని ధైర్యముతో సైచుకొనెను.

(౩౧) కన్నీటిని నిలుపుకొని అందమగు నేత్రములను దుడుచుకొని నిట్టూర్పువిడిచి రామునితో తేజస్వియగు సుగ్రీవుఁ డిటులనెను.

(౩౨) ఓ రామా! పూర్వము బలముగల వాలి నన్నుయువరాజ్యమునుండి తప్పించి కఠినోక్తులాడి వెడలఁగొట్టెను.

(౩౩) నా ప్రాణములకంటె హెచ్చుగనుండిన నాభార్యను నతఁడపహరించి, నాస్నేహితులను చెరలో నుంచెను.

(౩౪) రామా! మిగుల దుష్టుఁడగు వాలి నన్ను నాశముచేయుటకు యత్నించి అనేకులు వానరులను నామీదికిఁ బంపెను. ఆవానరులను నేను జంపితిని.

(౩౫) రామా! నిన్నుచూచి వాలిపంపియుండునను శంకచేతనే భయపడి నీసమీపమునకు రాలేదు. ఏలననఁగా, భయనిమిత్తముగలిగినపుడు అందరును భయపడుదురు కదా.

(౩౬) హనుమంతుఁడు మొదలగు యీవానరులు నాకు మంచి సహాయముగ నున్నారు. అందుచే, మిగుల దుఃఖము గలిగినను ప్రాణముపెట్టుకొని యున్నాను.

(౩౭) మంచి స్నేహితులుగనుండు యీవానరులు నన్ను నలుప్రక్కల లోను రక్షించుచున్నారు. నేనెచటికిఁ బోయినను నాతోడవచ్చుచుందురు. నేనొకచోట గూర్చుండిన వీరును నచటనే గూర్చుందురు.

(౩౮) రామా! నాస్థితిని నీకు సంగ్రహముగఁ దెలిపితిని. విస్తరించి ప్రయోజనములేదు. జ్యేష్ఠభ్రాతయై ప్రసిద్ధమగుపరాక్రమము గలవాలి నాకు శత్రువు.

తద్వినాశాద్ధి మే దుఃఖం ప్రణష్టం స్యా దనంతరమ్।
సుఖం మే జీవితం చైవ తద్వినాశ నిబంధనమ్॥ ౩౯
ఏష మే రామ శోకాంత శ్శోకార్తేన నివేదితః।
దుఃఖిత స్సుఖితో వాపి సఖ్యు ర్నిత్యం సఖా గతిః॥ ౪౦
శ్రుత్వైతద్వచనం రామ స్సుగ్రీవ మిద మబ్రవీత్।
కిం నిమిత్త మభూ ద్వైరం శ్రోతు మిచ్ఛామి తత్త్వతః॥ ౪౧
సుఖం హి కారణం శ్రుత్వా వైరస్య తవ వానర।
ఆనంతర్యం విధాస్యామి సంప్రధార్య బలాబలమ్॥ ౪౨
బలవాన్ హి మమామర్ష శ్శ్రుత్వా త్వా మవమానితమ్।
వర్తతే హృదయోత్కంపీ ప్రావృడ్వేగ ఇవాంభసః॥ ౪౩
హృష్టః కథయ విస్రబ్ధో యావ దారోప్యతే ధనుః।
సృష్టశ్చ హి మయా బాణో నిరస్తశ్చ రిపు స్తవ॥ ౪౪
ఏవ ముక్త స్తు సుగ్రీవః కాకుత్స్థేన మహాత్మనా।
ప్రహర్ష మతులం లేభే చతుర్భి స్సహ వానరైః॥ ౪౫
తతః ప్రహృష్టవదన స్సుగ్రీవో లక్ష్మణాగ్రజే।
వైరస్య కారణం తత్త్వ మాఖ్యాతు ముపచక్రమే॥ ౪౬

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - అష్టమస్సర్గః.

(౩౯) అతఁడు చచ్చినపిమ్మట నే నాదుఃఖముపోవును. నాసుఖము ప్రాణము అతని నాశముతో సంబంధపడియున్నవి.

(౪౦) రామా! దుఃఖించుచుండు నేను నాదుఃఖమును దెలిపితిని. స్నేహితుఁడు దుఃఖించుచుండినను సుఖపడుచుండినను స్నేహితుని కతఁడేగతి.

(౪౧) రాముఁడు యీమాటను విని సుగ్రీవునితో నిటు లనెను. వాలికి నీకు వైరము సంభవించినకారణమును సవిస్తరముగ వినఁగోరుచున్నాను.

(౪౨) ఓ వానరుఁడా! వాలికి నీకు గలిగిన వైరమునకు కారణమును విని బలాబలములను విచారించి పిమ్మట నీకు సుఖమును గలిగించెదను, (అనఁగా, స్వల్పమైన అపరాధమునకు విశేషమైన ద్వేషమును గలిగించినచో అతని యిపుడే చంపెదను. నీయపరాధము హెచ్చుగనుండి అతనిద్వేషము అల్పముగనుండినచో మీకు సమాధానము చేసెదనని భావము.)

(౪౩) వర్షాకాలములో జలము వేగము అధికముగనుండునటుల వాలిచే అవమానింపఁబడిన నీవిషయమును విని నాకు మిగుల కోపముగలిగినది. అది నా హృదమును నాడించుచున్నది.

(౪౪) ధనుసును అల్లెత్రాటితోఁ గట్టుటకులోగా, సంతోషించి నమ్మకముగలవాఁడవై మీద్వేషమునకు కారణమును దెలుపుము. నేను బాణమును విడిచినపుడే నీశత్రువు చచ్చెనని తెలిసికొనుము. (హృష్టః అను పదప్రయోగముచే, వాలి చచ్చినచో నీవు దుఃఖపడవలదని భావము.)

(౪౫) మహాత్ముఁడగు శ్రీరాముఁ డిటుల చెప్పగా, సుగ్రీవుఁడు హనుమంతుఁడు మొదలగు వానరులతోడ మిగుల సంతోషించెను.

(౪౬) పిమ్మట, సుగ్రీవుఁడు మిగుల సంతోషించి శ్రీరాముని సన్నిధిలో వాలికి తనకుగల వైరమునకు కారణమును విస్తారముగఁ దెలుపుటకు ప్రారంభించెను.

## నవమస్సర్గః.

వాలీనామ మమ భ్రాతా జ్యేష్ఠ శ్శత్రునిషూదనః।
పితు ర్బహుమతో నిత్యం మమాపి చ తథా పురా॥ ౧
పితర్యుపరతేఽస్మాకం జ్యేష్ఠో యమితిమం త్రిభిః।
కపీనా మీశ్వరో రాజ్యే కృతః పరమసంమతః॥ ౨

రాజ్యం ప్రశాసత స్తస్య పితృపైతామహం మహత్।
అహం సర్వేషు కాలేషు ప్రణతః ప్రేష్యవత్ స్థితః॥ ౩
మాయావీ నామ తేజస్వీ పూర్వజో దుంధుభే స్సుతః।
తేన తస్య మహద్వైరం స్త్రీకృతం విశ్రుతం పురా॥ ౪

స తు సుప్తజనే రాత్రౌ కిష్కింధా ద్వార మాగతః।
నర్దతిస్మ సుసంరబ్ధో వాలినం చాహ్వయ ద్రణే॥ ౫
ప్రసుప్తస్తు మమ భ్రాతా నర్దితం భైరవస్వనమ్।
శ్రుత్వా నమమృషే వాలీ నిష్పపాత జవా త్తదా॥ ౬
సతునై నిస్సృతః క్రోధా త్తం హంతు మసురో త్తమమ్।
వార్యమాణ స్తత స్త్రీభి ర్మయా చ ప్రణతాత్మనా॥ ౭

## ౯ వ సర్గ.

(అవతారిక.— తన విషయములో వాలి చేసిన యపరాధమును సుగ్రీవుఁడు యీ సర్గలోఁ జెప్పుచున్నాఁడు.)

(౧) వాలియనువాఁడు నాయన్న. శత్రుసంహారకుఁడు. సదా తండ్రికి ప్రేమపాత్రుఁడుగనుండెను. నాకును అతఁడు ప్రేమపాత్రుఁడుగ నుండెను.

(౨) మా తండ్రి స్వర్గస్థుఁడుకాగా మంత్రులు అందరికిని ప్రీతిపాత్రుఁడగు యితఁడు పెద్దవాఁడని వానరులకు రాజుగ రాజ్యములో నితని స్థాపించిరి.

(౩) మాతండ్రికి బ్రహ్మయిచ్చిన గొప్పరాజ్యమును బరిపాలించుచుండు వాలికి నేను సర్వకాలములలోను మిగుల వినయము గలవాఁడనై సేవకునివలె నుంటిని.

(౪) దుందుభియను రాక్షసునికి అన్నయు మయునిపుత్రుఁడును నగు మాయావి యను రాక్షసుఁడు మిగుల బలముగలవాఁడుగ నుండెను. అట్టి మాయావి యను రాక్షసునితోడ వాలికి స్త్రీనిమిత్తముగ గొప్ప వైరము గలిగెనని నేను వినియుంటిని.

(౫) మాయావి యను రాక్షసుఁడు జనులు నిద్రించుచుండు అర్థరాత్రిలో కిష్కింధద్వారమునకు వచ్చి మిగులగర్వించినవాఁడై సింహనాదము చేసి వాలిని యుద్ధమునకుఁ బిలిచెను.

(౬) నిద్రించుచుండిన నాయన్నయగు వాలి ఆభయంకరమైన సింహనాదమును విని సైచక అపుడు అంతఃపురమునుండి వెలుపలవచ్చెను.

(౭) పిమ్మట, అంతఃపురస్త్రీలు, వినయముతో వేడుకొనుచుండు నేను, అడ్డగించినను నిలువక వాలి కోపముతో ఆగొప్పరాక్షసుని జంపుటకై పోయెను.

స తు నిర్ధాయ సర్వాన్నో నిర్జగామ మహాబలః।
తతో హ మపి సౌహార్దా న్నిస్సృతో వాలినా సహ॥
స తు మే భ్రాతరం దృష్ట్వా మాంచ దూరా దవస్థితమ్।
అసురో జాతసంత్రాసః ప్రదుద్రావ తతో భృశమ్॥
తస్మిన్ ద్రవతి సంత్రస్తే హ్యావాం ద్రుతతరం గతౌ।
ప్రకాశశ్చ కృతో మార్గ శ్చంద్రేణోద్గచ్ఛతా తదా॥ ౧౦
స తృణై రావృతం దుర్గం ధరణ్యా వివరం మహత్।
ప్రవివే శాసురో వేగా దావా మాసాద్య విష్ఠితౌ॥ ౧౧
తం ప్రవిష్టం రిపుం దృష్ట్వా బిలం రోషవశంగతః।
మా మువాచ తదా వాలీ వచనం క్షుభితేంద్రియః॥ ౧౨
ఇహ త్వం తిష్ఠ సుగ్రీవ బిలద్వారి సమాహితః।
యావ త్తత్ర ప్రవిశ్యాహం నిహన్మి సహసా రిపుమ్॥ ౧౩
మయా త్వే తద్వచ శ్శ్రుత్వా యాచిత స్స పరంతపః।
శాపయిత్వా తు మాం పద్భ్యాం ప్రవివేశ బిలం మహత్॥
తస్య ప్రవిష్టస్య బిలం సాగ్ర స్సంవత్సరో గతః॥
స్థితస్య చ మమ ద్వారి సకాలో వ్యత్యవర్తత। ౧౫
అహంతు నష్టం జ్ఞాత్వా తం స్నేహా దాగతసంభ్రమః।
భ్రాతరం నచ పశ్యామి పాపాశంకిచ మే మనః॥ ౧౬

వాలికి తనకు గలిగిన వైరము కారణమును సుగ్రీవుఁడు రామునికి దెలుపుట. ౧౦౫

(౮) మమ్ము నటుల నెట్టి గొప్పబలముగలవాలి పోయెను. పిమ్మట నేను అన్నమీఁదగల ప్రీతిచేఁ నతనివెంటనే పోతిని.

(౯) మాయావి యనురాక్షసుఁడు నాయన్నను దూరములోనుండిన నన్ను చూచి భయపడి శీఘ్రముగ పారిపోయెను.

(౧౦) భయపడిన ఆరాక్షసుఁడు పారిపోగా మేమిద్దరము శీఘ్రముగఁ బోతిమి. అపుడు చంద్రోదయమై దారి బాగుగఁ దెలియుచుండెను.

(౧౧) ఆరాక్షసుఁడు కసవుచేఁ గప్పబడి ప్రవేశించుటకు సాధ్యపడని భూమిలోనుండు గుహలో త్వరగఁ బ్రవేశించెను. అపుడు మేము ఆబిలద్వారము లో గూర్చుండి ఉంటిమి.

(౧౨) బిలములోఁ బ్రవేశించిన శత్రువును జూచి కోపముగలవాఁడై వాలి నన్నుచూచి ఇంద్రియక్షోభముగలవాఁడై యిటు లనెను.

(౧౩) సుగ్రీవుఁడా! ఈబిలములోఁ బ్రవేశించి శత్రువును జంపివచ్చు నంతవరకు యిచటనే జాగ్రత్తగఁ గూర్చుండియుండుము.

(౧౪) వాలి చెప్పినమాట విని నేనుకూడ వచ్చెదనని మిగుల ప్రార్థించి తిని. శత్రుసంహారకుఁడగు అతఁడు అతని పాదములమీఁద ఒట్టుపెట్టి అతఁడే ఆ గొప్ప బిలములోఁ బ్రవేశించెను.

(౧౫) వాలి బిలములోపల ప్రవేశించిన పిమ్మట ఒక సంవత్సరము నిండి నది. ద్వారములోఁ గూర్చుండియుండిన నాకును అంతకాలమాయెను.

(౧౬) మాయావి చచ్చియుండునని తలఁచి వాలిమీఁదగల ప్రీతిచే విశే షముగ వ్యాకులము గలిగినది. అన్నను చూడలేదు. వాలికి యేమియాపద సంభ వించెనో యని నామనసుకు శంకగలిగినది,

అథ దీర్ఘస్య కాలస్య బిలా త్తస్మాద్వినిస్సృతమ్।
సఫేనం రుధిరం రక్త మహం దృష్ట్వా సుదుఃఖితః॥ ౧౭
నర్దతా మసురాణాం చ ధ్వని ర్మే శ్రోత్ర మాగతః।
నిరస్తస్య చ సంగ్రామే క్రోశతో నిస్స్వనో గురోః॥ ౧౮
అహం త్వవగతో బుద్ధ్యా చిహ్నై స్తై ర్భ్రాతరం హతమ్।
పిధాయ చ బిలద్వారం శిలయా గిరిమాత్రయా॥ ౧౯
శోకార్త శ్చోదకం కృత్వా కిష్కింధా మాగత స్సఖే॥ ౧౯½
గూహమానస్య మే తత్త్వం యత్నతో మంత్రిభి శ్శ్రుతమ్।
తతోఽహం తై స్సమాగమ్య సమ్మతై రభిషేచితః॥ ౨౦½
రాజ్యం ప్రశాసత స్తస్య న్యాయతో మమ రాఘవ।
ఆజగామ రిపుం హత్వా వాలి తమసురోత్తమమ్॥ ౨౧½
అభిషిక్తం తు మాం దృష్ట్వా వాలీ సంరక్తలోచనః।
మదీయా న్మంత్రిణో బద్ధ్వా పరుషం వాక్య మబ్రవీత్॥ ౨౨½
నిగ్రహేఽపి సమర్థస్య తం పాపం ప్రతి రాఘవ।
న ప్రావర్తత మే బుద్ధి ర్భ్రాతృ గౌరవయంత్రితా॥ ౨౩½
హత్వా శత్రుం స మే భ్రాతా ప్రవివేశ పురం తదా।
మానయం స్తం మహాత్మానం యథావచ్చాభ్యవాదయమ్॥
ఉక్తాశ్చ నాశిష స్తేన సంతుష్టేనాంతరాత్మనా॥ ౨౪

వాలికి తనకు గలిగిన వైరము కారణమును సుగ్రీవుఁడు రామునికిఁ దెలుపుట ౧౦

(౧౬) పిమ్మట, బహుకాలము గడువగా, ఆ బిలమునుండి నురుగుతో కూడిన రక్తము ప్రవహించి వెలుపలవచ్చెను. దానిజూచి దుఃఖించితిని.

(౧౭) బిలములోపల సింహనాదము చేయుచుండు రాక్షసులధ్వని నా చెవిలోఁబడెను. యుద్ధములో అపజయము పొంది అరచుచుండు నా యన్నధ్వని నాకు వినవచ్చెను.

(౧౮, ౧౮½) కొన్ని గురుతులచే నాయన్న చచ్చెనని తలఁచి, పర్వతము వలె నుండు శిలను బిలద్వారమున కడ్డము పెట్టి దుఃఖముగలవాఁడనై అతనికి ఉదక దానము చేసి కిష్కింధ చేరితిని. ఓ స్నేహితుఁడా!

(౨౦½) నేను నిజము చెప్పకపోయినను కొన్ని కారణములచే మంత్రులు జరిగిన సమాచారమును దెలిసికొనిరి. పిమ్మట ఆ మంత్రులు కూడ ఆలోచించి నాకు పట్టాభిషేకము చేసిరి.

(౨౧½) రామా! నేను పిమ్మట వాలి రాజ్యమును న్యాయముగఁ బరిపాలించుచుండు నపుడు ఆ గొప్ప రాక్షసుని జంపి వాలి వచ్చెను.

(౨౨½) కపిరాజ్యములో పట్టాభిషిక్తుఁడనై యుండు నన్ను చూచి వాలి కోపముచే నెఱ్ఱనైన కన్నులు గలవాఁడై నా మంత్రులను చెరలో నుంచి, నాతో కఠినమైన పలుకులు పలికెను.

(౨౩½) రామా! ఆ పాపిని నిగ్రహించుటకు నాకు శక్తి యుండినను అన్నయను గౌరవముచే నా కట్టిబుద్ధి పుట్టలేదు.

(౨౪½) నాయన్న శత్రువును జంపి పురము చేరెను. అపుడు, మహాత్ముఁడగు నతని బూజించుచు క్రమముగ నే నతనికి నమస్కరించితిని.

(౨౫) అతఁడు సంతోషించి నాకు మనఃపూర్వకముగ ఆశీర్వాదము సేయలేదు.

నత్వా పాదావహం తస్య మకుటేనాస్పృశం ప్రభో।
అపి వాలీ మమ క్రోధా న్నప్రసాదం చకార సః॥ ౨౬

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - నవమస్సర్గః

## దశమస్సర్గః

తతః క్రోధసమావిష్టం సంరబ్ధం త ముపాగతమ్।
అహం ప్రసాదయాం చక్రే భ్రాతరం ప్రియకామ్యయా॥ ౧
దిష్ట్యాసి కుశలీ ప్రాప్తో నిహతశ్చ త్వయా రిపుః।
అనాథస్య హి మే నాథ స్త్వమేకోఽనాథనందనః॥ ౨
ఇదం బహుశలాకం తే పూర్ణచంద్రమివోదితమ్।
ఛత్రం సవాలవ్యజనం ప్రతీచ్ఛస్వ మయోద్యతమ్॥ ౩
ఆ ర్త శ్చాథ బిలద్వారి స్థిత స్సంవత్సరం నృప।
దృష్ట్వాఽహం శోణితం ద్వారి బిలాచ్చాపి సముత్థితమ్॥ ౪
శోకసంవిగ్నహృదయో భృశం వ్యాకులితేంద్రియః।
అపిధాయ బిలద్వారం శైలశృంగేణ త త్తథా॥ ౫
తస్మా ద్దేశా దపాక్రమ్య కిష్కింధాం ప్రావిశం పునః॥ ౫½

వాలికి తనకు గలిగిన వైరము కారణమును సుగ్రీవుఁడు రామునికిఁ దెలుపుట. ౧౦౯

(౨౭) ప్రభో! నమస్కరించి నా కిరీటమును నతని పాదములమీఁద నుంచితిని. అయినను, కోపముగలవాఁడై అతఁడు నన్ను అనుగ్రహించలేదు.

ఇ ది తొ మ్మి ద వ స ర్గ.



౧౦ వ సర్గ.

(అవతారిక.— వాలి యెడల దోషము హెచ్చుగ గలదని నిర్ధారణచేసి రాముఁడతని జంపుటకు ప్రతిజ్ఞసేయుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) పిమ్మట, కోపాక్రాంతుఁడును గర్వించి సమీపములో నుండు వాఁడును నగు నాయన్నకు నేను ప్రియముసేయ గోరి వేడికొంటిని.

(౨) అన్నా! దైవయోగమువల్ల శత్రువును జంపి క్షేమముగ వచ్చితివి. అనాథలను సంతోషింపఁ జేయునట్టి నీవు అనాథగ నుండు నాకు నాథుఁడవు.

(౩) అనేక కమ్ములుగలదియుఁ బూర్ణచంద్రునివలె నుండునదియు, నగు నీ తెల్ల గొడుగును చామరములతోఁడ బట్టుచున్నాను. పరిగ్రహింపుము.

(౪) రాజా! దుఃఖాక్రాంతుఁడై యొక సంవత్సరము బిలద్వారములో వేచియుంటిని. బిలమునుండి వెలుపలవచ్చిన రక్తమును జూచి,

(౫,౬) దుఃఖముచే మిగుల చెడినమనసు మిగులవ్యాకులపడిన యింద్రియములు గలవాఁడనై ఆ బిలద్వారమును నొక పర్వతశిఖరముతో మూసి, అచటినుండి వచ్చి, కిష్కింధలోఁ బ్రవేశించితిని.

విషాదా త్త్విహ మాం దృష్ట్వా పౌరై ర్మంత్రిభి రేవ చ।
అభిషిక్తో నకామేన తన్మే త్వం క్షంతు మర్హసి॥ ౬

త్వ మేవ రాజా మానార్హ స్సదా చాహం యథా పురమ్।
రాజభావనియోగోఽయం మయా త్వద్విరహా త్కృతః॥ ౭

సామాత్య పౌరనగరం స్థితం నిహతకంటకమ్।
న్యాసభూత మిదం రాజ్యం తవ నిర్యాతయామ్యహమ్॥ ౮

మాచ రోషం కృథా స్సౌమ్య మయి శత్రునిబర్హణ।
యాచే త్వాం శిరసా రాజన్ మయా బద్ధోఽయ మంజలిః॥ ౯

బలా దస్మి సమాగమ్య మంత్రిభిః పురవాసిభిః।
రాజభావే నియుక్తో హం శూన్య దేశ జిగీషయా॥ ౧౦

స్నిగ్ధ మేవం బ్రువాణం మాం సతు నిర్భర్త్స్య వానరః।
ధి క్త్వా మితి చ మా ముక్త్వా బహుత త్తదువాచహ॥ ౧౧

ప్రకృతీశ్చ సమానీయ మంత్రిణ శ్చైవ సంమతాన్।
మా మాహ సుహృదాం మధ్యే వాక్యం పరమగర్హితమ్॥

విదితం వో యథా రాత్రౌ మాయావీ స మహాసురః।
మాం సమాహ్వయత క్రూరో యుద్ధకాంక్షీ సుదుర్మతిః॥ ౧౩

తస్య తద్వచనం శ్రుత్వా నిస్సృతో హం నృపాలయాత్।
అనుయాతశ్చ మాం తూర్ణ మయం భ్రాతా సుదారుణః॥ ౧౪

వాలికి తనకు గలిగిన వైరము కారణమును సుగ్రీవుఁడు రామునికిఁ దెలుపుట. ౧౧౧

(౬౪) దుఃఖముతో వచ్చిన నన్ను జూచి పురజనులు మంత్రిలు రాజ్యము నకు నాశము గలుగునను దుఃఖముచే, నాకు యిష్టములేకపోయినను, నాకు పట్టాభిషేకము చేసిరి. ఇందుకు నీవు క్షమించవలయును.

(౭౪) గౌరవమునకుఁ దగియుండు నీవే రాజుగ నుండవలయును. నేను పూర్వమువలె యువరాజుగనుండెదను. నేను రాజుగనుండి పరిపాలనచేసినది నీవు లేనందున నేను.

(౮౪) మంత్రిలతోను పురజనులతోను కూడిన యీపట్టణము శత్రువులు లేకయున్నది. మంత్రిలు నాకు పట్టాభిషేకము చేసి యిచ్చినరాజ్యమును నీకు యిచ్చుచున్నాను.

(౯౪) ఓ సౌమ్యుఁడా! శత్రుసంహారకుఁడా! నామీద కోపము వలదు. ఓరాజా! నాతలతోఁ బ్రార్థించుచున్నాను. నీకు అంజలిచేయుచున్నాను.

(౧౦౪) రాజులేక శూన్యముగ నుండు యితర దేశములను జయించుటకై మంత్రిలు పురజనులు గుంపుకూడి బలాత్కారముచే ప్రభుత్వము నాకుఁగట్టిరి.

(౧౧౪) ఈ విధముగ మృదువుగఁ జెప్పుచుండు నన్ను హీనరుఁడగు వాలి నానావిధములుగ, నిందించి ఛీ కొట్టి చెప్పరాని మాటలు చెప్పెను.

(౧౨౪) ప్రజలను మంచి మంత్రిలను బిలిపించి స్నేహితుల మధ్యగో నన్ను చూచి మిగులనిందితములగు మాటలు చెప్పెను.

(౧౩౪) క్రూరుఁడుగను మిగుల దుర్మతియైనను నుండు మాయావియను గొప్ప అసురుఁడు, మంత్రులారా! అర్ధరాత్రిలో యుద్ధము నపేక్షించి నన్ను పిలిచెను. ఇది మీరెఱింగినదే కదా.

(౧౪౪) వాని పిలుపు విని రాజగృహము నుండి నేను వెలుపల వచ్చితిని. మిగుల క్రూరుఁడగు వాతమ్ముఁడు నన్ననుసరించి త్వరగవచ్చెను.

సతు దృష్ట్వైవ మాం రాత్రౌ సద్వితీయం మహాబలః॥ ౧౫
ప్రాద్రవ ద్భయసంత్రస్తో వీక్ష్యావాం త మనుద్రుతౌ।
అనుద్రుతశ్చ వేగేన ప్రవివేశ మహాబిలమ్॥ ౧౬
తం ప్రవిష్టం విదిత్వా తు సుఘోరం సుమహద్బిలమ్।
అయ ముక్తో థ మే భ్రాత్రా మయాతు క్రూరదర్శనః॥ ౧౭
అహత్వా నాస్తి మే శక్తిః ప్రతిగంతు మితః పురీమ్।
బిలద్వారి ప్రతీక్ష త్వం యావ దేనం నిహ న్మ్యహమ్॥ ౧౮
స్థితో య మితి మత్వా తు ప్రవిష్టో హం దురాసదమ్।
తం చ మే మార్గమాణస్య గత స్సంవత్సర స్తదా॥ ౧౯
సతు దృష్టో మయా శత్రు రనిర్వేదా ద్భయావహః।
నిహతశ్చ మయా తత్ర సోసురో బంధుభి స్సహ॥ ౨౦
తస్యాస్యాత్తు ప్రవృత్తేన రుధిరౌఘేణ తద్బిలమ్।
పూర్ణమాసీ ద్దురాక్రామం స్తవత స్తస్య భూతలే॥ ౨౧
సూదయిత్వా తు తం శత్రుం విక్రాంతం దుందుభే స్సుతమ్।
నిష్క్రామ న్నైవ పశ్యామి బిలస్యపి హితం ముఖమ్॥ ౨౨
విక్రోశమానస్య తు మే సుగ్రీవేతి పునఃపునః।
యదా ప్రతివచో నాస్తి తతో హం భృశ దుఃఖితః॥ ౨౩

వాలికితనకు గలిగిన వైరము కారణమును సుగ్రీవుఁడు రామునికిఁ దెలుపుట. ౧౪

(౧౫,౧౬) గొప్పబలము గలరాక్షసుఁడు సహాయముతోడ నుండిన నన్ను జూచి భయపడి పరుగెత్తిపోయెను. మేమిద్దరము అతని వెంట బోతిమి. మేము తరుమగా అతఁడొక గొప్పబిలములోఁ బ్రవేశించెను.

(౧౭) మిగుల భయంకరముగ నుండు గొప్ప బిలములో రాక్షసుఁడు జొచ్చెనని తెలిసికొని, భయంకరుఁడగు నాతమ్మునితో నిటు లంటిని.

(౧౮) మాయావి యనురాక్షసుని జంపక కిష్కింధకుఁ బోలేను. ఈ రాక్షసుని జంపువరకు నీవు యీ బిలద్వారములో నుండుము.

(౧౯) రాక్షసుఁడు వెలుపల పోకుండుటకై యితఁడు (సుగ్రీవుఁడు) ద్వారములో కావలియున్నాఁడని తలచి ప్రవేశించుటకు సాధ్యపడని ఆబిలము లో నేను ప్రవేశించితిని. ఆరాక్షసుని బిలములో వెతకుటకు ఒక సంవత్సరమాయెను.

(౨౦) భయంకరుఁడగు శత్రువగు మాయావిని గనిపెట్టి మిగుల సులభముగ బంధువులతోడ ఆబిలములో నతని జంపితిని.

(౨౧) ఆబిలములో సింహనాదము చేయుచుండు ఆరాక్షసుని నోటి నుండి వచ్చిన రక్తప్రవాహముచే ఆబిలమునిండి వెలుపలపోవుటకు సాధ్యపడ

(౨౨) బలశాలియగు దుందుభికిఅన్నయు శత్రువునగు మాయావినిజంపి వెలుపల వచ్చునపుడు రాతితో మూయబడి బిలద్వారము నాకు అగుపడలేదు.

(౨౩) 'సుగ్రీవా' యని పలుమరు పిలుచుచుండునాకు అతఁడు బదులు చెప్పలేదు, అందుచే నేను మిగుల దుఃఖించితిని.

పాదప్రహారై స్తు మయా బహుభి స్తద్విదారితమ్।
తతోఽహం తేన నిష్క్రమ్య యథాపుర ముపాగతః॥ ౨౪
అత్రానేనాస్మి సంరుద్ధో రాజ్యం ప్రార్థయతాఽఽత్మనః।
సుగ్రీవేణ నృశంసేన విస్మృత్య భ్రాతృసౌహృదమ్॥ ౨౫
ఏవ ముక్త్వా తు మాం తత్ర వస్త్రేణైకేన వానరః।
నిర్వాసయామాస తదా వాలీ విగతసాధ్వసః॥ ౨౬
తేనాహ మపవిద్ధశ్చ హృతదారశ్చ రాఘవ।
తద్భయాచ్చ మహీ కృత్స్నా క్రాంతేయం సవనార్ణవా॥ ౨౭
ఋశ్యమూకం గిరివరం భార్యాహరణదుఃఖితః।
ప్రవిష్టోఽస్మి దురాధర్షం వాలినః కారణాంతరే॥ ౨౮
ఏతత్తే సర్వ మాఖ్యాతం వైరానుకథనం మహత్।
అనాగసా మయా ప్రాప్తం వ్యసనం పశ్య రాఘవ॥ ౨౯
వాలిన స్తు భయార్తస్య సర్వలోకాభయంకర।
కర్తు మర్హసి మే వీర ప్రసాదం తస్య నిగ్రహాత్॥ ౩౦
ఏవ ముక్త స్తు తేజస్వీ ధర్మజ్ఞో ధర్మసంహితమ్।
వచనం వక్తు మారేభే సుగ్రీవం ప్రహసన్నివ॥ ౩౧
అమోఘా స్సూర్యసంకాశా మమైతే నిశితా శ్శరాః।
తస్మి న్వాలిని దుర్వృత్తే నిపతిష్యంతి వేగితాః॥ ౩౨

వాలికిఁ దనకుగలిగిన వైరము కారణమును సుగ్రీవుఁడు రామునికిఁ దెలుపుట.౧౧౫

(౨౪) పాదములతో ననేకవిధములుగ తన్ని బిలమునకు మూసియుండిన బండను బగులగొట్టి వెలుపలవచ్చి ముందువలె కిష్కింధ చేరితిని.

(౨౫) పాపిగనుండు యీసుగ్రీవుఁడు అన్నమీది స్నేహమును విడిచి రాజ్యమునుగోరి బిలములోనే నేనుండవలయునని ద్వారమునకు బండ అడ్డముగనుంచెను.

(౨౬) రామా! ఈవిధముగ మంత్రులు ప్రజలు గలసభలో వాలి నన్ను గురించిచెప్పి, లోకమునకు భయపడక, కట్టుగుడ్డతో రాజ్యమునుండి నన్ను వెడలఁగొట్టెను.

(౨౭) రామా! అతఁడు నన్ను గొట్టి నాభార్యను నపహరించుకొనెను. అతనికి భయపడి అరణ్యములతోను సముద్రముతోను గూడియుండు యీభూమియంతయుఁ దిరిగివచ్చితిని.

(౨౮) నేను భార్య అపహరింపఁబడినందుకు మిగుల దుఃఖించి, ఒక నిమిత్తముచే వాలివచ్చుటకు సాధ్యపడని యీ ఋశ్యమూకపర్వతము చేరితిని.

(౨౯) మా గొప్ప వైరమునకు కారణమునంతయు నీకుఁ దెలిపితిని. రామా! నిరపరాధిగనుండు నాకుసంభవించిన వ్యసనమును జూడుము.

(౩౦) సకలలోకములకు అభయము నిచ్చువాఁడా! వాలికిభయపడియుండువాఁడు, వీరుఁడా! అతని జంపి, అభయ మీయవలయును.

(౩౧) తేజస్సు గలవాఁడును ధర్మమును నెరింగినవాఁడును, నగు రాముఁడు సుగ్రీవుని మాటవిని నవ్వుచు అతనితో ధర్మముతోఁ గూడిన మాటచెప్పుట కుపక్రమించెను.

(౩౨) గురితప్పని సూర్యునివలె వెలుంగుచుండు కరకుగల నాబాణములు దుర్వ్యాపారముగల వాలిమీఁద మిగుల వేగముగఁ బడుచున్నవి.

యావత్త్వం నాభిపశ్యామి తవ భార్యాపహారిణమ్।
తావత్స జీవే త్పాపాత్మా వాలీ చారిత్రదూషకః॥ 33
ఆత్మానుమానా త్పశ్యామి మగ్నం త్వాం శోకసాగరే।
త్వా మహం తారయిష్యామి కామం ప్రాపస్యసి పుష్కలమ్॥
తస్య తద్వచనం శ్రుత్వా రాఘవస్యాత్మనో హితమ్।
సుగ్రీవః పరమప్రీత స్సుమహ ద్వాక్య మబ్రవీత్॥ 3౫

ఇతిశ్రీమత్కిష్కింధాకాండే - దశమస్సర్గః.

## ఏ దశస్సర్గః.

రామస్య వచనం శ్రుత్వా హర్షపౌరుషవర్ధనమ్।
సుగ్రీవః పూజయాంచక్రే రాఘవం ప్రశశంసచ॥ ౧
అసంశయం ప్రజ్వలితై స్తీక్ష్ణై ర్మర్మాతిగై శ్శరైః।
త్వం దహేః కుపితో లోకా న్యుగాంతఇవ భాస్కరః॥ ౨
వాలినః పౌరుషం యత్తద్యచ్చ వీర్యం ధృతిశ్చ యా।
త న్మమైకమనా శ్శ్రుత్వా విధత్స్వ యదనంతరమ్॥ 3
సముద్రా త్పశ్చిమా త్పూర్వం దక్షిణాదపిచోత్తరమ్।
క్రామత్యనుదితే సూర్యే వాలీ వ్యపగతక్లమః॥ ర

(౩౩) నీభార్యను నపహరించినవాలిని నేను చూడనంతవరకు పాపియు గర్హ్యమగు ప్రవర్తనగల అతఁడు జీవించియుండును.

(౩౪) తనవలెనే సర్వభూతములను భావించవలయునను న్యాయముచే, నీవు దుఃఖసాగరములో మునిగియుండునటుల తలంచెదను. నిన్ను నేను ఉద్ధరించెదను. నీ కోరిక మిగుల సఫలమగును.

(౩౫) తనకు హితముగనుండు శ్రీరాముని మాటలు విని సుగ్రీవుఁడు మిగుల సంతోషించి గొప్పమాటను జెప్పెను.

ఇ ది ప ది య వ స ర్గ.

## ౧౧ వ సర్గ.

(అవతారిక.— వాలిని జంపుటకు శ్రీరామునికి బలముగలదా యని పరీక్షించుటకై వాలిబలమును సుగ్రీవుఁడు యీసర్గలోఁ జెప్పుచున్నాఁడు)

(౧) సంతోషమును పరాక్రమమును వృద్ధిచేయునట్టి శ్రీరాముని మాటను విని సుగ్రీవుఁడు అంజలి చేసికొని అతని నుతించెను.

(౨) ప్రళయకాలములో సూర్యుఁడు లోకములను దహించునటుల, రామా! నీవు కోపముగలవాఁడవై, మిగులజ్వలించి కరకుగల మర్మములఁ ఛేదించునట్టి బాణములతో లోకములను దహించగలవు. ఇందుకు సందేహములేదు.

(౩) రామా! వాలిపరాక్రమము దేహబలము ధైర్యమును నీవు బాగుగ విని, పిమ్మట చేయవలసినకార్యమును ఆలోచింపుము.

(౪) తూర్పుసముద్రమునుండి పడమటిసముద్రమునకును, దక్షిణ సముద్రమునుండి ఉత్తర సముద్రమునకును సూర్యుఁ డుదయించుటకు ముందుగనే సంధ్యావందనము సేయుటకై, అనాయాసముగ వాలి తిరుగుచుండును.

అగ్రాణ్యారుహ్య శైలానాం శిఖరాణి మహాంత్యపి।
ఊర్ధ్వ ముత్క్షిప్య తరసా ప్రతిగృహ్ణాతి వీర్యవాన్॥ ౫
బహవ స్సారవంతశ్చ వనేషు వివిధా ద్రుమాః।
వాలినా తరసా భగ్నా బలం ప్రథయతాఽఽత్మనః॥ ౬
మహిషో దుందుభి ర్నామ కైలాసశిఖరప్రభః।
బలం నాగసహస్రస్య ధారయామాస వీర్యవాన్॥ ౭
వీర్యోత్సేకేన దుష్టాత్మా వరదానాచ్చ మోహితః।
జగామ సుమహాకాయ స్సముద్రం సరితాంపతిమ్॥ ౮
ఊర్మిమంత మతిక్రమ్య సాగరం రత్నసంచయమ్।
మహ్యం యుద్ధం ప్రయచ్ఛేతి త మువాచ మహార్ణవమ్॥ ౯
తత స్సముద్రో ధర్మాత్మా సముత్థాయ మహాబలః।
అబ్రవీ ద్వచనం రాజ న్నసురం కాలచోదితమ్॥ ౧౦
సమర్థో నాస్మి తే దాతుం యుద్ధం యుద్ధవిశారద।
శ్రూయతాం చాభిధాస్యామి య స్తే యుద్ధం ప్రదాస్యతి॥ ౧౧
శైలరాజో మహారణ్యే తపస్విశరణం పరమ్।
శంకరశ్వశురో నామ్నా హిమవా నితి విశ్రుతః॥ ౧౨
గుహాప్రస్రవణోపేతో బహుకందరనిర్ఝరః।
స సమర్థ స్తవ ప్రీతి మతులాం కర్తు మాహవే॥ ౧౩

(౫) వీర్యవంతుఁడగువాలి పర్వతములమీఁద నెక్కి గొప్ప శిఖరములను దీసికొని యెగరవైచి మరియు వాని పట్టుకొనును.

(౬) అరణ్యములలో సారముగల నానావిధములగు వృక్షములను వాలి అతని బలమును జూపుటకై పెల్లగించును.

(౭) కైలాస పర్వతమువంటి ఆకారము గలవాఁడును వీర్యవంతుఁడును నగు దుందుభియను రాక్షసుఁడు మహిషరూపము ధరించి వేయియేనుఁగుల బలము గలిగియుండెను.

(౮) గొప్ప శరీరముగల దుష్టుఁడగు దుందుభి దేహబల గర్వముచేతను వరదానముచేతను మైమరచి నదులకు భర్తయగు సముద్రమువద్దకుఁ బోయెను.

(౯) రత్న సమూహములుగల అలలతో గూడియుండు సముద్రములో బోవుచు 'నాతో యుద్ధము చేయవలయును' అని సముద్రుని బిలిచెను.

(౧౦) రాజా! పిమ్మట, ధర్మాత్ముఁడును గొప్ప బలముగలవాఁడును నగు సముద్రుఁడులేచి యమునిచేఁ బ్రేరేపింపఁబడి వచ్చినరాక్షసునితో నిటు లనెను.

(౧౧) ఓయుద్ధ విశారదుఁడా! నీతో నేను యుద్ధము సేయలేను. నీతో యుద్ధము సేయఁగలవాని జెప్పెదను వినుము.

(౧౨) గొప్పఅరణ్యములో తపసు సేయువారికి ముఖ్యస్థానముగ నుండువాఁడును రుద్రునిమామగ నుండువాఁడును హిమవంతుఁడను పేరుచేఁ బ్రసిద్ధిగాంచిన వాఁడును నగు నొకపర్వతరాజు గలఁడు.

(౧౩) అతఁడు గుహలతోను సెలయేళ్ళతోను గూడియుండువాఁడు. పర్వత సంఘ లనుచీలియుండురాళ్ళతోను గూడినవాఁడు. అతఁడు యుద్ధములో నీకు మిగుల సంతోషము గలిగించుటకు తగినవాఁడు.

తం భీతఇతి విజ్ఞాయ సముద్రో మనుజోత్తమః।
హిమవద్వన మాగచ్ఛ చ్ఛర శ్చాపాదివ చ్యుతః॥ ౧౪
తత స్తస్య గిరే శ్శ్వేతా గజేంద్రవిపులా శ్శిలాః।
చిక్షేప బహుధా భూమౌ దుందుభి ర్విననాదచ॥ ౧౫

తత శ్శ్వేతాంబుదాకార స్సౌమ్యః ప్రీతికరాకృతిః।
హిమవా నబ్రవీ ద్వాక్యం స్వఏవ శిఖరే స్థితః॥ ౧౬
క్లేష్టు మర్హసి మాం న త్వం దుందుభే ధర్మవత్సల।
రణకర్మస్వకుశల స్తపస్విశరణం హ్యహమ్॥ ౧౭

తస్య తద్వచనం శ్రుత్వా గిరిరాజస్య ధీమతః।
ఉవాచ దుందుభి ర్వాక్యం రోషా త్సంరక్తలోచనః॥ ౧౮
యది యుద్ధే సమర్థ స్త్వం మద్భయాద్వా నిరుద్యమః।
త మాచక్ష్వ ప్రదద్యా న్మే యో౽ద్య యుద్ధంయుయుత్సతః॥

హిమవా నబ్రవీ ద్వాక్యం శ్రుత్వా వాక్యవిశారదః।
అనుక్తపూర్వం ధర్మాత్మా క్రోధా త్త మనుజోత్తమమ్॥ ౨౦
వాలీ నామ మహాప్రాజ్ఞ శ్శక్రతుల్యపరాక్రమః।
అధ్యాస్తే వానర శ్శ్రీమాన్ కిష్కింధా మతులప్రభామ్॥ ౨౧

(౧౪) రాక్షసవీరుఁడు, సముద్రుఁడు భయపడెనని తలంచి, ధనుసునుండి బాణము వేగముగఁబోవునటుల, హిమవంతము సమీపమునకు వచ్చెను.

(౧౫) పిమ్మట, దుందుభి యేనుఁగులవలె స్థూలమై తెల్లగనుండు రాళ్లను పర్వతమునుండి భూమికిఁద్రోసి సింహనాదము చేసెను.

(౧౬) పిదప, తెల్లని మేఘమువలె నుండువాఁడును సౌమ్యుఁడును సంతోషమును నిచ్చునట్టి దేహా ఆకృతిగలవాఁడును నగు హిమవంతుఁడు అతనిశిఖరములోనేయుండి యిటుల చెప్పెను.

(౧౭) ఓదుందుభీ! ధర్మవత్సలుఁడా ! నీవు నన్ను హింసించవలదు. యుద్ధముసేయు విధము నే నెఱుంగను. నేను తపసు చేయువారికి నివాసస్థానముగ నున్నాను.

(౧౮) బుద్ధిమంతుఁడగు పర్వతరాజుమాట విని దుందుభి కనులెఱ్ఱ చేసికొని కోపముతో నిటు లనెను.

(౧౯) నీకు యుద్ధములో సామర్థ్యములేక పోవుటచేతనా, లేక, నాకు భయపడి ఊరక ఉన్నావా. ఇటులైతే, యుద్ధముసేయవలయునని కోరుచుండు నాతోడ యుద్ధము సేయుఁగలవాని దెలుపుము.

(౨౦) ధర్మాత్ముఁడును మాటలు చెప్పుటలో సమర్థుఁడును నగు హిమవంతుఁడు యిటుల పూర్వ మెవఁడును పలుకని యిపుడితఁడు పలికిన మాటలు విని కోపముచే నతనితో నిటులనెను.

(౨౧) మిగుల ప్రాజ్ఞుఁడును ఇంద్రునితో సమమైన పరాక్రమము గలవాఁడును ఐశ్వర్యవంతుఁడును, నగు వాలియను వానరుఁడు మిగుల ప్రసిద్ధమైన కిష్కింధలో నున్నాఁడు.

స సమర్థో మహాప్రాజ్ఞ స్తవ యుద్ధవిశారదః।
ద్వంద్వయుద్ధం మహ ద్దాతుం నముచేరివ వాసవః॥ ౨౨
తం శీఘ్ర మభిగచ్ఛ త్వం యది యుద్ధ మిహేచ్ఛసి।
సహి దుర్ధర్షణో నిత్యం శూర స్సమరకర్మణి॥ ౨౩

శ్రుత్వా హిమవతో వాక్యం క్రోధావిష్ట స్స దుందుభిః।
జగామ తాం పురీం తస్య కిష్కింధాం వాలిన స్తదా॥ ౨౪
ధారయ న్మాహిషం రూపం తీక్ష్ణశృంగో భయావహః।
ప్రావృషీవ మహామేఘ స్తోయపూర్ణో నభ స్తలే॥ ౨౫
తత స్తద్ద్వార మాగమ్య కిష్కింధాయా మహాబలః।
ననర్ద కంపయన్ భూమిం దుందుభి ర్దుందుభి ర్యథా॥ ౨౬

సమీపస్థాన్ ద్రుమాన్ భంజన్ వసుధాం దారయన్ ఖురైః।
విషాణేనోల్లిఖన్ దర్పా త్తద్ద్వారం ద్విరదో యథా॥ ౨౭
అంతఃపురగతో వాలీ శ్రుత్వా శబ్ద మమర్షణః।
నిష్పపాత సహ స్త్రీభి స్తారాభిరివ చంద్రమాః॥ ౨౮
మితం వ్యక్తాక్షరపదం త మువాచాథ దుందుభిమ్।
హరీణా మీశ్వరో వాలీ సర్వేషాం వనచారిణామ్॥ ౨౯

(౨౨) యుద్ధము సేయుటలో పండితుఁడును మిగుల ప్రాజ్ఞుఁడును నగు వాలి, నముచితో ఇంద్రుఁడు యుద్ధము చేసినటుల, నీకు గొప్ప ద్వంద్వయుద్ధము యిచ్చుటకు సమర్థుఁడు.

(౨౩) నీకు యుద్ధము సేయుటలోఁ గోరిక గలిగినటులైతే శీఘ్రముగ అతని వద్దకుఁ బొమ్ము. అతఁడు తిరస్కరించుటకు సాధ్యముకాని వాఁడు. యుద్ధము సేయుటలో సదాశూరుఁడుగ నున్నాఁడు.

౨౪, ౨౫) హిమవంతునిమాట విని దుందుభి యను రాక్షసుఁడు మిగుల కోపము గలవాఁడై అపుడు దున్నపోతురూపము ధరించి పదునగు కొమ్ములు గలవాఁడై, భయమును గలిగించువాఁడై, నీళ్ళతోనిండిన గొప్పమేఘము వానకాలములో ఆకాశములో నుండునటుల, వాలిపట్టణ మగుకిష్కింధకు అపుడు పోయెను.

(౨౬) గొప్పబలము గలదుందుభి కిష్కింధ కోట వాకిట నిలిచి భూమిని కంపింపఁజేయుచు దుందుభి వాద్యమువలె సింహనాదము చేసెను.

(౨౭) సమీపములోనుండు వృక్షములను విరిచివేయుచు గిట్టలతో భూమిని జీల్చుచు యేనుఁగువలె కిష్కింధ కోట వాకిటిని అహంకారముతోఁ బొడుచుచు ఉండెను.

(౨౮) అంతఃపురములో నుండు వాలి ఆ సింహనాదమును విని సైచక, నక్షత్రములతోఁ గూడి చంద్రుఁడు వచ్చునటుల, స్త్రీలతోఁడ వెలుపల వచ్చెను.

(౨౯) వనములో సంచరించుచుండు వానరుల కందరికిని రాజగు వాలి స్పష్టమగు అక్షరములతోఁ గూడిన మితమైన మాటలు దుందుభితో నిటుల చెప్పెను.

కిమర్థం నగరద్వార మిదం రుద్ధ్వా వినర్దసి।
దుందుభే విదితో మేఽసి రక్ష ప్రాణా న్మహాబల॥ ౩౦
తస్య తద్వచనం శ్రుత్వా వానరేంద్రస్య ధీమతః।
ఉవాచ దుందుభి ర్వాక్యం రోషా త్సంరక్తలోచనః॥ ౩౧

న త్వం స్త్రీసన్నిధౌ వీర వచనం వక్తు మర్హసి।
మమ యుద్ధం ప్రయచ్ఛాద్య తతో జ్ఞాస్యామి తే బలమ్॥ ౩౨
అథవా ధారయిష్యామి క్రోధ మద్య నిశా మిమామ్।
గృహ్యతా ముదయ స్స్వైరం కామభోగేషు వానర॥ ౩౩

దీయతాం సంప్రదానంచ పరిష్వజ్యచ వానరాన్।
సర్వశాఖామృగేంద్ర స్త్వం సంసాదయ సుహృజ్జనాన్॥ ౩౪
సుదృష్టాం కురు కిష్కింధాం కురుష్వాత్మసమం పురే।
క్రీడస్వచ సహ స్త్రీభి రహం తే దర్పనాశనః॥ ౩౫

యో హి మత్తం ప్రమత్తం వా సుప్తం వా రహితం భృశమ్।
హన్యా త్స భ్రూణహా లోకే త్వద్విధం మదమోహితమ్॥ ౩౬
స ప్రహస్యాబ్రవీ న్మందం క్రోధా త్త మసురోత్తమమ్।
విసృజ్య తా స్స్త్రియ స్సర్వా స్తారాప్రభృతికా స్తదా॥ ౩౭

(౩౦) ఓ దుందుభి! ఈ నగరద్వారమును నడ్డగించి యెందుకు అరచుచున్నావు. నిన్ను నేనెఱుంగుదును కదా. గొప్పబలము గలవాఁడా! ప్రాణమును రక్షించుకొనుము.

(౩౧) బుద్ధిమంతుఁడును వానరరాజును నగు వాలిమాట విని దుందుభి యను అసురుఁడు కోపముతో కన్ను లెఱ్ఱగఁ జేసికొని యిటు లనెను.

(౩౨) ఓ వీరుఁడా! స్త్రీలనుమోసపుచ్చునట్టిమాటను నాతో నీవు చెప్పఁదగదు. ఇపుడు నాతో యుద్ధముచేయుము. పిమ్మట, నీ బలమును నే నెఱింగెదను.

(౩౩) లేకపోయినటులైతే, యీ రాత్రియంతయు కోపమును సైచికొని యుండెదను. వానరుఁడా! కామభోగములను ననుభవించుచు నీ యిష్టము ప్రకారము సూర్యోదయ మగునంతవరకు ఉండుము.

(౩౪,౩౫) సకల శాఖామృగములకు రాజవునీవు బాంధవులగు వానరులను బాగుగ నాలింగనము చేసికొని చరమదశలో నీయందుగల ధనము వారివారి కిచ్చి స్నేహితులతోఁ గొంతసేపు గడిపి కిష్కింధను బాగుగఁజూచి, నీకు సమునిగు రాజును నేర్పాటుచేసి, భార్యలతోడ యిపుడు సుఖముగ నుండుము. వెనుక నేను నీ యహంకారమును నాశము సేసెదను.

(౩౬) మధుపానముచేసి మదించియుండువాని, జాగ్రత్తగ నుండనివాని, నిద్రించుచుండు వాని, ఆయుధశూన్యుఁడుగ నుండువాని, నీవలె స్త్రీలమధ్యలో నుండి కామమోహితుఁడుగ నుండువాని జంపువాఁడుభ్రూణహత్య చేసిన పాపములోఁ బోవును.

(౩౭) వాలి, అప్పుడు, తార మొదలగు స్త్రీలను విడిచిపెట్టి నవ్వి కోపముతో రాక్షస శ్రేష్ఠుడగు దుందుభిని జూచి శాంతముగ నిటులనెను.

మత్తోయమితి మా మంస్థా యద్యభీతోసి సంయుగే।
మదోయం సంప్రహారేఽస్మి న్వీరపానం సమర్థ్యతామ్॥ ౩౮
త మేవ ముక్త్వా సంక్రుద్ధో మాలా ముత్క్షిప్య కాంచనీమ్।
పిత్రా దత్తాం మహేంద్రేణ యుద్ధాయ వ్యవతిష్ఠత॥ ౩౯

విషాణయో ర్గృహీత్వా తం దుందుభిం గిరిసన్నిభమ్।
ఆవిధ్యత తదా వాలీ వినద న్కపికుంజరః॥ ౪౦
వాలీ వ్యాపాతయాంచక్రే ననర్ద చ మహాస్వనమ్।
శ్రోత్రాభ్యా మథ రక్తం తు తస్య సుస్రావ పాత్యతః॥ ౪౧

తయోస్తు క్రోధసంరంభా త్పరస్పరజయైషిణోః।
యుద్ధం సమభవ ద్ఘోరం దుందుభే ర్వానరస్య చ॥ ౪౨
అయుధ్యత తదా వాలీ శక్రతుల్యపరాక్రమః।
ముష్టిభి ర్జానుభి శ్చైవ శిలాభిః పాదపై స్తథా॥ ౪౩

పరస్పరం ఘ్నతో స్తత్ర వానరాసురయో స్తదా।
ఆసీద దసురో యుద్ధే శక్రసూను ర్వ్యవర్ధత॥ ౪౪
వ్యాపారవీర్య ధైర్యైశ్చ పరిక్షీణం పరాక్రమైః।
తం తు దుందుభి ముత్పాట్య ధరణ్యా మభ్యపాతయత్॥ ౪౫

(౩౮) మదించి స్త్రీలోలుఁడనై యున్నానని నన్నవమానపరచ వలదు. యుద్ధరంగములో నీవు భయములేక పోయినట్లైతే నిన్ను జంపుటకు యీ నా మదమే యుద్ధములో నాకు వీరపానముగ నుండునని తలంచుము.

(౩౯) దుందుభితో నిట్లుల చెప్పి మిగులకోపముగలవాఁడై తండ్రియగు ఇంద్రుఁడిచ్చిన బంగారుహారమును మెడలో ధరించుకొని వాలి యుద్ధసన్నద్ధుఁడుగ నుండెను.

(౪౦) కపిశ్రేష్ఠుఁడగు వాలి, అప్పుడు, సింహనాదముసేయుచు కొండవలె నుండు ఆ దుందుభిని కొమ్ములతోఁ బట్టుకొని గిరగిర త్రిప్పెను.

(౪౧) వాలి దుందుభిని భూమిమీఁద పడవైచి గొప్పసింహనాదము చేసెను. పిమ్మట, భూమిమీఁద పడియుండు ఆరాక్షసుని చెవులనుండి రక్తము స్రవించెను.

(౪౨) కోపవేగముచే పరస్పరము జయమును గోరుచుండు వాలికి దుందుభికి భయంకరమైన యుద్ధము జరిగెను.

(౪౩) పిమ్మట, ఇంద్రునితో సమ మగుపరాక్రమము గల వాలి పిడికిళులతోను మోకాళులతోను రాళ్ళతోను వృక్షములతోను దుందుభితోడ యుద్ధముసేసెను.

(౪౪) ఈ వానరుఁడు రాక్షసుఁడు పరస్పరము గొట్టుకొను చుండునపుడు యుద్ధములో దుందుభి తగ్గిపోయెను. ఇంద్రునికొడు కగువాలి వృద్ధింగాంచెను.

(౪౫) యుద్ధవ్యాపార వీర్య ధైర్యములచేత మిగుల క్షీణించుచుండు దుందుభిని వాలి యెగరఁగొట్టి భూమిమీఁద పడవైచెను.

యుద్ధే ప్రాణహరే తస్మిన్ నిష్పిష్టో దుందుభి స్తదా।
పపాతచ మహాకాయః క్షితౌ పంచత్వ మాగతః॥ ౪౬

తం తోలయిత్వా బాహుభ్యాం గతసత్వ మచేతనమ్।
చిక్షేప బలవా న్వాలీ వేగేనై కేన యోజనమ్॥ ౪౭

తస్య వేగప్రవిద్ధస్య వక్త్రా త్క్షతజబిందవః।
ప్రపేతుర్మారుతోత్క్షిప్తా మతంగస్యాశ్రమం ప్రతి॥ ౪౮

తాన్ దృష్ట్వా పతితాం స్తస్య ముని శ్శోణితవిప్రుషః।
క్రుద్ధ స్తత్ర మహాభాగ శ్చింతయామాస కోన్వయమ్॥ ౪౯

యేనాహం సహసా స్పృష్ట శ్శోణితేన దురాత్మనా।
కోయం దురాత్మా దుర్బుద్ధి రకృతాత్మాచ బాలిశః॥ ౫౦

ఇత్యుక్త్వాఽథ వినిష్క్రమ్య దదర్శ మునిపుంగవః।
మహిషం పర్వతాకారం గతాసుం పతితం భువి॥ ౫౧

స తు విజ్ఞాయ తపసా వానరేణ కృతంహి తత్।
ఉత్ససర్జ మహాశ్శాపం క్షేప్తారం వాలినం ప్రతి॥ ౫౨

ఇహ తేనాప్రవేష్టవ్యం ప్రవిష్టస్య వధో భవేత్।
వనం మత్సంశ్రయం యేన దూషితం రుధిరస్రవైః॥ ౫౩
సంభగ్నాః పాదపాశ్చేమే క్షిపతేహాసురీం తనుమ్॥ ౫౩౪

(౪౬) అపుడు గొప్పదేహముగల దుందుభి ప్రాణము అపహరింపఁబడు చుండు యుద్ధములో నలిపివేయఁబడినవాఁడై భూమిమీదపడి పంచత్వము పొం దెను.

(౪౭) బలవంతుఁడగు వాలి ప్రాణమువిడిచి అచేతనుఁడుగ నుండు రాక్ష సుని చేతులతో వాడించి ఒకేసారి యొక యోజనము దూరము విసిరి పార వైచెను.

(౪౮) వేగముగ విసిరివేయఁబడిన ఆరాక్షసుని నోటినుండి రక్తబిందువు లను గాలి దీసికొనిపోయి మతంగుని ఆశ్రమములో పడవైచెను.

(౪౯) మతంగ మహర్షి తన యాశ్రమములోఁ బడిన రాక్షసుని రక్త బిందువులను చూచి, మహాత్ముఁడగు నతఁడు కోపముగలవాఁడై యిటుల చేసిన వాఁడెవఁడని ఆలోచించి చూచెను.

(౫౦) నామీద రక్తము పడునటులచేసిన దురాత్ముఁడును దుర్బుద్ధి అజ్ఞా నములేని అవివేకి యెవఁడు.

(౫౧) ఇటుల చెప్పి, పిమ్మట, ఆశ్రమమునుండి వెలుపలవచ్చి ఆఋషి శ్రేష్ఠుఁడు ప్రాణము విడిచి భూమిమీద పడి పర్వతాకారముగ నుండు మహిషా సురుని జూచెను.

(౫౨) ఆ ఋషి తపఃప్రభావముచే యిది కోతిపని యని తెలిసికొని యీ శవమును యాశ్రమములో బడవైచిన వాలికి గొప్ప శాప మిచ్చెను.

(౫౩,౫౪) "నేను వసించుచుండు వనమును రక్తముచే అశుద్ధపఱచిన వాఁడు రాక్షసుని దేహమును పడవైచి అందుచేత వృక్షములను విరిచివేసినవాఁ డు యీ వనములో ప్రవేశించకూడదు. ప్రవేశించినటులైతే చచ్చిపోవును. అని శపించెను.

సమంతాద్యోజనం పూర్ణ మాశ్రమం మామకం యది।
ఆగమిష్యతి దుర్బుద్ధి ర్వ్యక్తం స నభవిష్యతి॥ ౫౪½
యేచాపి సచివా స్తస్య సంశ్రితా మామకం వనమ్।
నచ తై రిహ వస్తవ్యం శ్రుత్వా యాంతు యథాసుఖమ్॥ ౫౫½
యది తేపీహ తిష్ఠంతి శపిష్యే తానపి ధ్రువమ్।
వనేఽస్మి న్మామకే నిత్యం పుత్రవత్పరిరక్షితే॥ ౫౬½
పత్రాంకురవినాశాయ ఫలమూలాభవాయచ॥ ౫౭
దివస శ్చాస్య మర్యాదా యం ద్రష్టా శ్వోఽస్మి వానరమ్।
బహువర్ష సహస్రాణి సవై శైలో భవిష్యతి॥ ౫౮
తత స్తే వానరా శ్రుత్వా గిరం మునిసమీరితామ్।
నిశ్చక్రము ర్వనా త్తస్మా త్తాన్ దృష్ట్వా వాలి రబ్రవీత్॥ ౫౯
కిం భవంత స్సమస్తాశ్చ మతంగవనవాసినః।
మత్సమీప మనుప్రాప్తా అపి స్వస్తి వనౌకసామ్॥ ౬౦
తత స్తే కారణం సర్వం తదా శాపంచ వాలినః।
శశంసు ర్వానరా స్సర్వే వాలినే హేమమాలినే॥ ౬౧
ఏత చ్ఛ్రుత్వా తదా వాలీ వచనం వానరేరితమ్।
స మహర్షిం తదాఽసాద్య యాచతేస్మ కృతాంజలిః॥ ౬౨
మహర్షి స్త మనాదృత్య ప్రవివేశాశ్రమం తదా।
శాపధారణభీతస్తు వాలీ విహ్వలతాం గతః॥ ౬౩

(౫౪) నా యాశ్రమమునకు నలుప్రక్కల యొక యోజనము దూరము వచ్చినను ఆ దుష్టుఁడు ప్రాణముతో నుండఁడు నిజము.

(౫౫) నాయొక్క వనములో వసించుచుండు వాలి మంత్రులు వాలికి లభించినశాపమును విని వారును నిచటవాసమును విడిచి సుఖముగ బోవలయును.

(౫౬,౫౭) బిడ్డనువలె నేను రక్షించుచుండు నా వనములో ఆకులను మొలకలను ఫలములను గడ్డలను నాశము సేయుచు అతనిమంత్రులిచట ఉండినట్టులైతే వారిని సహా శపించెదను. నిజము.

(౫౮) ఈ శాపము యీ దినములో మాత్రమే వారికి తగులదు. రేపటి దినము యెట్టివానరుఁడు నాకంటికి అగుపడినను అతఁడు అనేకవేల సంవత్సరములు రాయిగ పడియుండును.

(౫౯) పిమ్మట, ఋషియిచ్చిన శాపమును విని వనమునుండి వానరులు వెలుపలపోయిరి. వారిని వాలి చూచి యిటు లనెను.

(౬౦) మంతగ మహర్షి వనములోనుండు మీరందరు యెందుకుగాను నా వద్దకువచ్చితిరి. వానరు లందరు క్షేమముగ నున్నారా.

(౬౧) పిమ్మట, వానరులందరు యిందుకు కారణమును,ఋషిశాపమును బంగారుహారములు ధరించుకొనియుండిన వాలికి విశదపరచిరి.

(౬౨) వానరులుచెప్పినమాటలు వాలి విని అపుడు అతఁడు మతంగ మహర్షి సమీపమునకు వచ్చి అంజలిసేసికొని వేడుకొనెను.

(౬౩) వాలి ప్రార్థనను లక్ష్యపెట్టక మతంగమహర్షి ఆశ్రమము లోపలికిఁబోయెను. శాపము తగులునని భయపడి వాలి దుఃఖించి ఆచోటు విడిచిపోయెను.

తత శ్శాపభయాద్భీత ఋశ్యమూకం మహాగిరిమ్।
పరివేష్టుం నేచ్ఛతి హరి ర్ద్రష్టుం వాపి నరేశ్వర॥ ౬౪
తస్యాప్రవేశం జ్ఞాత్వాఽహ మిదం రామ మహావనమ్।
విచరామి సహామాత్యో విషాదేన వివర్జితః॥ ౬౫
ఏషోఽస్థినిచయ స్తస్య దుందుభే స్సంప్రకాశతే।
వీర్యోత్సేకా న్నిర స్తస్య గిరికూటోపమో మహాన్॥ ౬౬
ఇమేచ విపులా స్సాలా స్సప్త శాఖావలంబినః।
యత్రైకం ఘటతే వాలీ నిష్పత్రయితు మోజసా॥ ౬౭
ఏత దస్యాసమం వీర్యం మయా రామ ప్రకీర్తితమ్।
కథం తం వాలినం హంతుం సమరే శక్ష్యసే నృప॥ ౬౮
తథా బ్రువాణం సుగ్రీవం ప్రహస న్లక్ష్మణో బ్రవీత్।
కస్మిన్కర్మణి నిర్వృత్తే శ్రద్దధ్యా వాలినో వధమ్। ౬౯
త మువాచాథ సుగ్రీవ స్సప్త సాలా నిమా న్పురా।
ఏవమేకైకశో వాలీ వివ్యాధాథ స చాసకృత్॥ ౭౦
రామోఽపి దారయే దేషాం బాణే నైకేన చే ద్ద్రుమమ్।
వాలినం నిహతం మన్యే దృష్ట్వా రామస్య విక్రమమ్॥ ౭౧
హతస్య మహిషస్యాస్థి పాదేనైకేన లక్ష్మణ।
ఉద్యమ్యాథ ప్రక్షిపేచ్చే త్తరసా ద్వే ధనుశ్శతే॥ ౭౨

(౬౪) రామా! పిమ్మట, వాలి శాపమునకు భయపడి ఋశ్యమూకమను గొప్ప పర్వతమునకు వచ్చుటకును దీని జూచుటకును గోరుటలేదు.

(౬౫) రామా! వాలి యిచటికి వచ్చుటకు యోగ్యతలేదని తెలిసికొని యీ గొప్ప వనములో సుఖముగ మంత్రులతోడ సంచరించుచున్నాను.

(౬౬) పరాక్రమగర్వముచే దూరముగ విసిరివేయబడి యుండు దుందుభియొక్క కొండవంటి గొప్ప అస్థిపంజరమిదే అగుపడుచున్నది.

(౬౭) వ్రేలాడుచుండు శాఖలుగల లావుగనుండు యేడుసాలవృక్షములు యివియేను. వీనిలో నొకదాని వాలి అతని పరాక్రమముచే ఆకులు రాలిపోవునటుల ఆడించి విడిచిపెట్టెను.

(౬౮) ఓ రామా! అసమానమైన వాలి పరాక్రమము యిట్టిదేను. నేను విన్నవించితిని, రాజా! అట్టి వాలిని యుద్ధములో జంపుటకు నీకు శక్తిగలదా.

(౬౯) ఇట్లు సుగ్రీవుఁడు చెప్పగా లక్ష్మణుఁడు నవ్వుచు, ఎట్టికార్యము ను రాముఁడుచేసిన వాలిని జంపుటకు పలసినబలము యితనికిగలదని నీవు నమ్మెదువు. చెప్పుము అనెను.

(౭౦) పిమ్మట, ఓ లక్ష్మణా! పూర్వము వాలి యీ యేడు సాలవృక్షములను నొక్కొకదానిని ఆడించి విడిచెను. ఇప్పుడును పలుమారు ఒక్కొకదానిని ఆడించుచున్నాఁడు.

(౭౧) రాముఁడు ఒక బాణముతో యీ వృక్షములలో నొకదానిని చీల్చినటులైతే యితని పరాక్రమమును చూచి వాలి చచ్చెనని తెలిసికొనెదను.

(౭౨) లక్ష్మణా! చచ్చిపడియుండి యీ దుందుభియొక్క అస్థిపంజరమును కాలితో ౨౦౦ ధనుసుల ప్రమాణము యెగర చిమ్మినటులైతే వాలిని యితఁడు చంపగలఁడని నమ్మెదను.

ఏవ ముక్త్వా తు సుగ్రీవో రామం రక్తాంతలోచనమ్।
ధ్యాత్వా ముహూర్తం కాకుత్స్థం పునరేవ వచోఽబ్రవీత్॥ ౨౩

శూరశ్చ శూరఘాతీచ ప్రఖ్యాతబలపౌరుషః।
బలవాన్వానరో వాలీ సంయుగేష్వపరాజితః॥ ౨౪

దృశ్యంతే చాస్య కర్మాణి దుష్కరాణి సురైరపి।
యాని సంచిత్య భీతోఽహ మృశ్యమూకం సమాశ్రితః ॥౨౫

తమజయ్య మధృష్యంచ వానరేంద్ర మమర్షణమ్।
విచింతయ న్న ముంచామి ఋశ్యమూక మహం త్విమమ్॥ ౨౬

ఉద్విగ్న శ్శంకిత శ్చాపి విచరామి మహావనే।
అనురక్తై స్సహామాత్యై ర్హనుమత్ప్రముఖై ర్వరైః॥ ౨౭

ఉపలబ్ధంచ మే శ్లాఘ్యం సన్మిత్రం మిత్రవత్సల।
త్వా మహం పురుషవ్యాఘ్ర హిమవంత మివాశ్రితః॥ ౨౮

కింతు తస్య బలజ్ఞోఽహం దుర్భ్రాతు ర్బలశాలినః।
అప్రత్యక్షంతు మే వీర్యం సమరే తవ రాఘవ॥ ౨౯

(౨౩) కొనలలో రక్తవర్ణముగనుండు కన్నులు గల రామునితో నిట్లు సుగ్రీవుఁడు చెప్పి ఒక ముహూర్తకాలము చింతించి మరియు నతనితో నిట్లు లనెను.

(౨౪) వాలి శూరుఁడు, శూరులను జంపినవాఁడు. ప్రసిద్ధమగు తేజోబలము పౌరుషము గలవాఁడు. బలవంతుఁడు, యుద్ధములో అపజయమును నెప్పుడును పొందనివాఁడు.

(౨౫) దేవతలుచేయుటకు అసాధ్యముగనుండు పనులను నితఁడు చేసియున్నాఁడు. అటుల యితఁడు చేసిన పనులను నాలోచించి భయపడి ఋశ్యమూకమునందు నున్నాను.

(౨౬) జయించుటకును తిరస్కరించుటకును నెవరికిని సాధ్యము కాని వాఁడును, కోపముగలవాఁడును వానరశ్రేష్ఠుఁడును నగువాలిని స్మరించుచు ఋశ్యమూకమును విడిచిపెట్టి పోలేక యిచటనే యున్నాను.

(౨౭) మిగుల ప్రేమగల ఉత్తములగు హనుమంతుఁడు మొదలగు మంత్రులతోడ వాలికి భయపడి, అతఁడేమిసేయునో యని శంకించుచు, యీ గొప్పవనములో సంచరించుచున్నాను.

(౨౮) మిత్రులమీఁద వాత్సల్యము గలరామా! శ్రేష్ఠుఁడగు మంచిస్నేహితుఁడవు నాకు లభించెను. ఓ పురుషోత్తముఁడా! ధైర్యములో హిమవంతుని వలె నుండు నిన్ను ఆశ్రయించితిని.

(౨౯) మతియు, దుష్టుఁడగుభ్రాతగను బలశాలిగను నుండు వాలి బలము నాకు బాగుగఁ దెలిసియున్నది. ఓరామా! యుద్ధములో నీవీర్యము నాకుఁ దెలియదు.

నఖల్వహం త్వాం తులయే నావమన్యే నభీషయే।
కర్మభి స్తస్య భీమైస్తు కాతర్యం జనితం మమ॥ ౮౦
కామం రాఘవ తే వాణీ ప్రమాణం ధైర్య మాకృతిః।
సూచయంతి పరం తేజో భస్మచ్ఛన్న మివానలమ్॥ ౮౧

తస్య తద్వచనం శ్రుత్వా సుగ్రీవస్య మహాత్మనః।
స్మితపూర్వ మథో రామః ప్రత్యువాచ హరిం ప్రభుః॥ ౮౨
యది న ప్రత్యయోఽస్మాసు విక్రమే తవ వానర।
ప్రత్యయం సమరే శ్లాఘ్య మహ ముత్పాదయామి తే॥ ౮౩

ఏవ ముక్త్వా తు సుగ్రీవం సాంత్వం లక్ష్మణపూర్వజః।
రాఘవో దుందుభేః కాయం పాదాంగుష్ఠేన లీలయా॥ ౮౪
తోలయిత్వా మహాబాహు శ్చిక్షేప దశయోజనమ్॥ ౮౪½
అసురస్య తనుం శుష్కం పాదాంగుష్ఠేన వీర్యవాన్।
క్షిప్తం దృష్ట్వా తతః కాయం సుగ్రీవః పున రబ్రవీత్॥ ౮౫½
లక్ష్మణస్యాగ్రతో రామ మిదం వచన మబ్రవీత్ ౮౬
ఆర్ద్ర స్సమాంసః ప్రత్యగ్రః క్షిప్తః కాయః పురా సఖే।
లఘు స్సంప్రతి నిర్మాంస స్తృణభూతశ్చ రాఘవ॥ ౮౭

(౮౦) నేను నీమనసుకు చాంచల్యము గలిగించలేదు. నీకు ఆగౌరవమును భయమునుగలిగించలేదు. వాలి చేసిన భయంకరములగు కార్యముల వల్ల నాకు భయము గలుగుచున్నది.

(౮౧) ఓరామా! నీమాట నీబుద్ధి ధైర్యము నీవేషము యివియన్నియు, బూడిదతోఁ గప్పఁబడి అగ్నివలెనుండు యుత్తమమైననీతేజస్సును బాగుగఁ దెలుపుచున్నవి.

(౮౨) మహాత్ముఁడగు సుగ్రీవుని మాట విని ప్రభువగు రాముఁడు నవ్వి యిటుల బదులు చెప్పెను.

(౮౩) వానరుఁడా! నాపరాక్రమము విషయములో నీకు నమ్మకములేక పోయినటులైతే యుద్ధములో గొప్ప నమ్మకమును నీకు గలిగించెదను.

(౮౪) గొప్ప భుజములుగల రాముఁడు యిట్లు సుగ్రీవునికి సమాధానము చెప్పి, దుందుభి శరీరమును బొటనవ్రేలితో, సునాయాసముగ, నెత్తి పది యోజనముల దూరములోఁ బడునటుల నెగరచిమ్మెను.

(౮౫,౮౬) శ్రీరాముని పాదాంగుష్ఠముచే పదియోజనములు చిమ్మివేయఁబడి ముందుకంటె శుష్కించినసూక్ష్మముగనుండు ఆ శరీరమునుజూచి లక్ష్మణుని నెదుట రామునితో వీర్యవంతుఁడగు సుగ్రీవుఁడు మరియు నిటులనెను.

(౮౭) ఓ మిత్రుఁడా! పూర్వము తడి గలిగి మాంసముతోఁ గూడి క్రొత్తగనుండిన రాక్షసుని శరీరమునువాలి యెగర చిమ్మెను. ఓ రామా! ఇప్పుడు, యెండితేలికయై మాంసములేక తృణమువలె యిది యున్నది.

పరిశ్రాంతేన మత్తేన భ్రామితా మే వాలినా తదా।
క్షిప్త మేవం ప్రహర్షేణ భవతా రఘునందన॥ ౮౮
నాతి శక్యం బలం జ్ఞాతుం తవ వా తస్య వాఽధికమ్॥ ౮౮½
ఆర్ద్రం శుష్క మితి హ్యేత త్సుమహ దాఘవాంతరమ్।
స ఏవ సంశయ స్తాత తవ తస్యచ యద్బలే॥ ౮౯½

సాల మేకం తు నిర్భింద్యా భవేద్వ్యక్తి ర్బలాబలే॥ ౯౦
కృత్వేదం కార్ముకం సజ్యం హస్తిహస్త మివాంతరమ్।
ఆకర్ణపూర్ణ మాయమ్య విసృజస్వ మహాశరమ్॥ ౯౧

ఇమంహి సాలం సహిత స్త్వయా శరో నసంశయోఽత్ర స్తి
విదారయిష్యతి। అలం విమర్శేన మమ ప్రియం ధ్రువం కురు
ష్వ రాజాత్మజ శాపితో మయా। ౯౨

యథాహి తేజస్సు వర స్సదారవి ర్యథాహి శైలో హిమవా
న్మహాద్రిషు। యథాచతుష్పాత్సుచ కేసరీ వర స్తథా నరాణా
మపి విక్రమే వరః॥ ౯౩

ఇతి శ్రీమత్కిష్కింధా కాండే - ఏకాదశస్సర్గః



సాలవృక్షము నచ్ఛేదించవలయునని సుగ్రీవుఁడు రామునిఁ వడుగుట. ౧౩౯

(౮౭,౮౭౪) పూర్వము, నాయన్నయగు మదించినవాలి మిగుల శ్రమ తో దీని నెగర చిమ్మెను. ఓ రామా! నీవు మిగుల సంతోషముతో దీని నెగర చిమ్మితివి. కనుక, యీవిషయములో నీబలము హెచ్చుగనున్నదో వాలిబల ము హెచ్చుగనున్నదో తెలిసికొనుటకు సాధ్యపడలేదు.

(౮౯౪) రామా! పచ్చిగనుండు దానికిని యెండిపోయియుండు దానికిని మిగుల తారతమ్యముగలదు. అందుచే, ఓ తండ్రీ! నీయొక్క వాలియొక్క బలము విషయములో నిదియ సంశయముగ నున్నది.

(౯౦) ఒకసాలవృక్షమును బాణము ప్రయోగించి బద్దలుచేయుము. అప్ఫు డు నీ బలాబలవిషయము సువ్యక్తమగును.

(౯౧) ఏనుఁగు తొండమువలె పొడవుగనుండు యీధనుసుకు అల్లెత్రా డుఁగట్టి చెవివరకు యీడిచి గొప్పబాణమును విడువుము.

(౯౨) నీవు ధనుసులో సంధానముసేసియుండు బాణము యీ సాలవృ క్షమును జీల్చును. ఇందుకు సందేహములేదు. ఓ రాజకుమారా! ఈపరీక్ష చా లును. నాకు సంతోషము గలిగింపుము. ఇట్లు నేను నిర్బంధించి చెప్పుచున్నాను.

(౯౩) తేజస్సు గలపదార్థములలో సూర్యుఁడెట్లులనో, గొప్పపర్వతము లలో హిమవంతుఁడెట్లులనో, చతుష్పాత్తుజంతువులలో సింహమెట్లులనో, అట్టు ల, మనుష్యులలో నీవు పరాక్రమములో నుత్తముఁడవు,

ఇది పదునొకండవ సర్గ.



## ద్వాదశస్సర్గః

ఏతచ్చ వచనం శ్రుత్వా సుగ్రీవేణ సుభాషితమ్।
ప్రత్యయార్థం మహాతేజా రామో జగ్రాహ కార్ముకమ్॥ ౧
స గృహీత్వా ధను ర్ఘోరం శర మేకంచ మానదః।
సాల ముద్దిశ్య చిక్షేప జ్యాస్వనైః పూరయ న్దిశః॥ ౨

స విసృష్టో బలవతా బాణ స్స్వర్ణపరిష్కృతః।
భిత్వా సాలాన్ గిరిప్రస్థే సప్తభూమిం వివేశ హ॥ ౩
ప్రవిష్టశ్చ ముహూర్తేన ధరాం భిత్వా మహాజవః।
నిష్పత్యచ పున స్తూర్ణం స్వతూణీం ప్రవివేశ హ॥ ౪

తాన్ దృష్ట్వా సప్త నిర్భిన్నాన్ సాలా న్వానరపుంగవః।
రామస్య శరవేగేన విస్మయం పరమం గతః॥ ౫
సమూర్ధ్నా న్యపత ద్భూమౌ ప్రలంబీకృతభూషణః।
సుగ్రీవః పరమప్రీతో రాఘవాయ కృతాంజలిః॥ ౬
ఇదం చోవాచ ధర్మజ్ఞం కర్మణా తేన హర్షితః।
రామం సర్వాస్త్రవిదుషాం శ్రేష్ఠం శూర మవస్థితమ్। ౭

## ౧౨ వ సర్గ.

(అవతారిక.— సుగ్రీవునికి నమ్మకము గలిగించి రాముఁడు వాలిని వధించుటకుఁ బోవుట యీ సర్గలోఁ దెలుపఁబడుచున్నది.)

(౧) సుగ్రీవుఁడు చెప్పిన మంచిమాటలు విని గొప్పతేజస్సు గలరాముఁడు, అతనికి నమ్మకము గలిగించుటకై, ధనుసును నెత్తికొనెను.

(౨) ఆశ్రయించినవానికి బహుమాన మిచ్చునట్టి రాముఁడు భయంకరమగు ధనుసును నొక బాణమును బుచ్చుకొని అల్లెత్రాటిధ్వనిచే దిక్కులు నిండించుచు సాలవృక్షముమీద దాని బ్రయోగించెను.

(౩) బలవంతుఁ డగురాముఁడు ఒకసాలవృక్షమునకుగాను బ్రయోగించిన బంగారు కట్లచే నలంకరింపఁ బడినబాణము యేడుసాల వృక్షములను ఛేదించి పర్వతము పార్శ్వముద్వారా భూమిలోఁ బ్రవేశించెను.

(౪) భూమిలోపల బ్రవేశించి ముహూర్తకాలములో భూమిని బద్దలుసేసి మిగుల వేగముతో వెలుపలవచ్చి మరియు శీఘ్రముగ అంబులపొదలో నా బాణము బ్రవేశించెను.

(౫) వానర శ్రేష్ఠుఁడగు సుగ్రీవుఁడు రాముని బాణవేగముచే బద్దలైన సప్తసాలవృక్షములను జూచి మిగుల ఆశ్చర్యపడెను.

(౬) ఆభరణములు ధరించియుండు సుగ్రీవుఁడు మిగుల సంతోషించి శ్రీరామునికి అంజలిచేసి శిరసుచే భూమినిముట్టి నమస్కరించెను.

(౭) ధర్మజ్ఞుఁడును సమస్తబాణములను నెరింగినవారిలో శ్రేష్ఠుఁడును శూరుఁడును నగురాముని జూచి, సప్తసాలవృక్షములు ఛేదింపఁబడినందున మిగుల సంతోషించి సుగ్రీవుఁడు యిటు లనెను,

సేంద్రానపి సురా న్సర్వాన్ త్వం బాణైః పురుషర్షభ।
సమర్థ స్సమరే హంతుం కింపున ర్వాలినం ప్రభో॥ ౮
యేన సప్తమహాసాలా గిరి ర్భూమిశ్చ దారితాః।
బాణేనైకేన కాకుత్స్థ స్థాతా తే కో రణాగ్రతః॥ ౯
అద్య మే విగత శ్శోకః ప్రీతి రద్య పరా మమ।
సుహృదం త్వాం సమాసాద్య మహేంద్రవరుణోపమమ్॥ ౧౦
త మద్యైవ ప్రియార్థం మే వైరిణం భ్రాతృరూపిణమ్।
వాలినం జహి కాకుత్స్థ మయా బద్ధోఽయ మంజలిః॥ ౧౧
తతో రామః పరిష్వజ్య సుగ్రీవం ప్రియదర్శనమ్।
ప్రత్యువాచ మహాప్రాజ్ఞో లక్ష్మణానుమతం వచః॥ ౧౨
అస్మా ద్గచ్ఛామ కిష్కింధాం క్షిప్రం గచ్ఛ త్వ మగ్రతః।
గత్వా చాహ్వాయ సుగ్రీవ వాలినం భ్రాతృగంధినమ్॥ ౧౩
సర్వే తే త్వరితం గత్వా కిష్కింధాం వాలినః పురీమ్।
వృక్షై రాత్మాన మావృత్య వ్యతిష్ఠ న్గహనే వనే॥ ౧౪
సుగ్రీవో వ్యనద ద్ఘోరం వాలినోఽహ్వానకారణాత్।
గాఢం పరిహితో వేగా న్నాదై ర్భింద న్నివాంబరమ్॥ ౧౫
తం శ్రుత్వా నినదం భ్రాతుః క్రుద్ధో వాలీ మహాబలః।
నిశ్చక్రామ సుసంరబ్ధో భాస్కరోఽస్తతటాదివ॥ ౧౬

(౮) ఓ పురుషోత్తముఁడా! ఇంద్రుఁడు సకలదేవతలతోఁ గూడివచ్చినను, యుద్ధములో నతని నీవు బాణములతో చంపఁగలవు. హే ప్రభో! ఇఁక వాలిని జంపుట యెంతటిపని.

(౯) రామా! ఒకబాణముతో సప్త మహాసాలవృక్షములను కొండను భూమిని బద్దలుచేసితివి. యుద్ధములో నీ యెదుట యెవఁడు నిలువఁగలఁడు.

(౧౦) ఇంద్రునితోను వరుణునితోను సమమైన నిన్ను స్నేహితునిగ బడసి నా దుఃఖమిపుడె పోయినది. ఇపుడె నాకు ఉత్తమమైన సంతోషము గలిగినది.

(౧౧) సోదరుఁడను పేరుపెట్టుకొని నాకు శత్రువుగనుండు వాలిని, నాకుఁ బ్రియము సేయుటకై యిపుడె నిగ్రహింపుము. ఓ రామా! నీకు నేను అంజలిచేయుచున్నాను.

(౧౨) పిమ్మట, మహాప్రాజ్ఞుఁడగు రాముఁడు ప్రియమైన చూపుగల సుగ్రీవుని నాలింగనముచేసికొని లక్ష్మణునికి యిష్టముగనుండునట్టి మాట చెప్పెను.

(౧౩) సుగ్రీవుఁడా! ఇచటనుండి కిష్కింధకుఁ బోవుదము. నీవు శీఘ్రముగ ముందుపొమ్ము. తమ్మునికి హింసగలిగించువాలిని యుద్ధమునకుఁ బిలువుము.

(౧౪) రాముఁడు లక్ష్మణుఁడు సుగ్రీవుఁడు త్వరగ వాలిపట్టణ మగుకిష్కింధకుఁబోయి గహనమైన వనములో వృక్షములలో దాగియుండిరి.

(౧౫) సుగ్రీవుఁడు బాగుగ నడుముకు వస్త్రము చుట్టుకొని, ఆకాశమును బద్దలుసేయువానివలె, వాలిని యుద్ధమునకుఁ బిలుచుటకు, భయంకరముగ సింహనాదము చేసెను.

(౧౬) గొప్పబలము గలవాలి తమ్ముని సింహనాదము విని కుపితుఁడై సూర్యుఁడు అస్తగిరిలో ఉదయించునటుల మిగుల త్వరతో కిష్కింధకు వెలుపలవచ్చెను.

తత స్సుతుములం యుద్ధం వాలిసుగ్రీవయో రభూత్।
గగనే గ్రహయో ర్ఘోరం బుధాంగారకయో రివ॥ ౧౭
తలై రశనికల్పైశ్చ వజ్రకల్పైశ్చ ముష్టిభిః।
జఘ్నతు స్సమరేఽన్యోన్యం భ్రాతరౌ క్రోధమూర్ఛితౌ॥ ౧౮
తతో రామో ధనుష్పాణి స్తావుభౌ సముదీక్ష్య తు।
అన్యోన్యసదృశౌ వీరావుభౌ దేవావివాశ్వినౌ॥ ౧౯
య న్నావగచ్ఛ త్సుగ్రీవం వాలినం వాపి రాఘవః।
తతో న కృతవా న్బుద్ధిం మోక్తు మంతకరం శరమ్॥ ౨౦
ఏతస్మి న్నంతరే భగ్న స్సుగ్రీవ స్తేన వాలినా।
అపశ్య న్రాఘవం నాథ మృశ్యమూకం ప్రదుద్రువే॥ ౨౧
క్లాంతో రుధిరసిక్తాంగః ప్రహారై ర్జర్జరీకృతః।
వాలినాఽభిద్రుతః క్రోధా త్ప్రవివేశ మహావనమ్॥ ౨౨
తం ప్రవిష్టం వనం దృష్ట్వా వాలీ శాపభయార్దితః।
ముక్తో హ్యసి త్వ మిత్యుక్త్వా సన్నివృత్తో మహాద్యుతిః॥ ౨౩
రాఘవోఽపి సహభ్రాత్రా సహచైవ హనూమతా।
తదేవ వన మాగచ్ఛ త్సుగ్రీవో యత్ర వానరః॥ ౨౪
తం సమీక్ష్యాగతం రామం సుగ్రీవ స్సహలక్ష్మణమ్।
హ్రీమా న్దీన మువాచేదం వసుధా మవలోకయన్॥ ౨౫

(౧౭) పిమ్మట, ఆకాశములో బుధునికి అంగారకునికి భయంకరముగ యుద్ధము జరిగినటుల వాలి సుగ్రీవులకు గొప్పయుద్ధము జరిగినది.

(౧౮) అన్నదమ్ములిద్దరు కోపముగలవారై పిడుగువంటి అరచేతుల దెబ్బలతోను వజ్రాయుధముతో సమమగు పిడికిళుల గుద్దులతోను నొకరినొకరు కొట్టుకొనిరి.

(౧౯,౨౦) పిమ్మట, ధనుర్ధారియగు రాముఁడు, ఒకరితో నొకరు వారుగ పోలియుండువారుగను వీరులుగను అశ్వినీదేవతలవలె నుండువారును నగు వాలి సుగ్రీవులను జూచి, యితఁడువాలి యితఁడు సుగ్రీవుఁడు అని తెలిసికొన లేక ప్రాణమును హరించునట్టి బాణమును విడుచుటకు యిష్టపడలేదు.

(౨౧) ఇంతలోపల, వాలిచే సుగ్రీవుఁడు భంగపడి రక్షించునట్టి రాముని జూడలేక ఋశ్యమూకపర్వతమునకు పారిపోయెను.

(౨౨) శ్రమపడి రక్తముతోఁ దడిసిన శరీరముగలిగి వాలికొట్టిన దెబ్బలతో బద్ధలైన దేహముగలవాఁడై కోపముతో వాలి తరుమగా మతంగుని గొప్ప వనములో సుగ్రీవుఁడు ప్రవేశించెను.

(౨౩) మతంగుని వనములోఁ బ్రవేశించిన సుగ్రీవుని జూచి గొప్పకాంతి గలవాలి ఋషి శాపమునకు వెరచి 'సుగ్రీవుఁడా! తప్పించుకొంటివి' అని చెప్పి వెనుకకు తిరిగిపోయెను.

(౨౪) శ్రీరాముఁడు తమ్ముఁడగు లక్ష్మణుఁడు, హనుమంతుఁడు మొదలగువారితో సుగ్రీవుఁడుండిన వనమునకు వచ్చిరి.

(౨౫) లక్ష్మణునితోడ వనమునకు వచ్చియుండు రాముని జూచి సుగ్రీవుఁడు సిగ్గుపడి తలవంచుకొని భూమిని జూచుచు దీనుఁడై యిటు లనెను.

ఆహ్వాయస్వేతి మా ముక్త్వా దర్శయిత్వాచ విక్రమమ్।
వైరిణా ఘాతయిత్వాచ కి మిదానీం త్వయా కృతమ్॥
తామేవ వేలాం వక్తవ్యం త్వయా రాఘవ తత్వతః।
వాలినం ననిహన్మీతి తతో నాహ మితో వ్రజే॥ ౨౭
తస్య చైవం బ్రువాణస్య సుగ్రీవస్య మహాత్మనః।
కరుణం దీనయా వాచా రాఘవః పున రబ్రవీత్॥ ౨౮
సుగ్రీవ శ్రూయతాం తాత క్రోధశ్చ వ్యపనీయతామ్।
కారణం యేన బాణోఽయం న మయా స విసర్జితః। ౨౯
అలంకారేణ వేషేణ ప్రమాణేన గతేనచ।
త్వంచ సుగ్రీవ వాలీచ సదృశౌ స్థః పరస్పరమ్॥ ౩౦
స్వరేణ వర్చసా చైవ ప్రేక్షితేనచ వానర।
విక్రమేణచ వాక్యైశ్చ వ్యక్తిం వాం నోపలక్షయే॥ 3౧
తతోఽహం రూపసాదృశ్యా న్మోహితో వానరోత్తమ॥ 3౧౪
నోత్సృజామి మహావేగం శరం శత్రునిబర్హణమ్॥ 3౨
జీవితాంతకరం ఘోరం సాదృశ్యాత్తు విశంకితః।
మూలఘాతో న నౌ స్యాద్ధి ద్వయోరపి కృతో మయా॥ 33
త్వయి వీరే విపన్నేహి అజ్ఞానా ల్లాఘవా న్మయా।
మౌఢ్యంచ మమ బాల్యంచ ఖ్యాపితం స్యా ద్ధరీశ్వర॥ 3౪

(౨౬) వాలిని యుద్ధమునకు బిలువమని నాతోఁ జెప్పి, నీ పరాక్రమమును నాకుఁ దెలిపి, శత్రువుచే నన్ను గొట్టించి యిప్పుడు నీ వేమి యోచించుచున్నావు.

(౨౭) ఓ రామా! నీవు అప్పుడే వాలిని నేను జంపనని నిజముగా నాకుఁ జెప్పియుండిన యెడల నేను యిచటి నుండి వాలితోఁ బోరుటకుఁ బోయియుండను.

(౨౮) ఇట్లు చెప్పిన మహాత్ముఁడగు సుగ్రీవునిమాట విని రాముఁడు దీనస్వరముతో జాలిపుట్టునటుల యిట్లు బదులు చెప్పెను.

(౨౯) సుగ్రీవుఁడా! కోపమును విడువుము. ఓ బిడ్డా! నేను ప్రాణమును దీయునట్టి బాణమును విడువనందుకుఁ గారణము చెప్పెదను వినుము.

(30) సుగ్రీవుఁడా! మీ యాభరణములు వేషములు దేహప్రమాణములు, నడకలు, వీనిలో నీవు వాలి ఒకరినొకరు బాగుగ పోలియున్నారు.

(3౧,3౧౪) కంఠధ్వనులచేతను దేహకాంతిచేతను చూపుచేతను పరాక్రమముచేతను మాటలచేతను మీకు గలపరస్పర ఆకారభేదమును నేను దెలిసికొనలేక పోతిని. ఓ వానరోత్తముఁడా! మీరు ఒకరిని నింకొకరు పోలియుండుటచే నేను భ్రమచెందితిని.

(3౨,33) మిగుల వేగముగలదియు, శత్రువులను నాశముసేయునదియు, ప్రాణమును హరించునదియూ నగు భయంకరమైన బాణమును, మీరు ఒకరిని నింకొకరు పోలియుండి నందున, సందేహముగలవాఁడనై నేనుబ్రయోగించలేదు. మన యిద్దరిలో నొకరు నాశమగుకార్యమును నేను చేయను.

(3౪) వీరుఁడవగు నిన్ను నేను తెలియక అనాలోచితముగాఁ జంపినటులైతే, ఓ వానరరాజా! నా మౌఢ్యము బాల్యము ప్రసిద్ధమగునుగదా.

దత్తాభయవధోనామ పాతకం మహ దుచ్యతే॥ ౩౪
అహంచ లక్ష్మణశ్చైవ సీతాచ వరవర్ణినీ।
త్వదధీనా వయం సర్వేవనేఽస్మిన్ శరణం భవాన్॥ ౩౫
తస్మా ద్యుద్ధ్యస్వ భూయ స్త్వం మా మాశంకీశ్చవానర॥ ౩౬
ఏతస్మిన్ముహూర్తే సుగ్రీవ పశ్య వాలిన మాహవే।
నిర స్త మిషుణై కేన వేష్టమానం మహీతలే॥ ౩౭
అభిజ్ఞానం కురుష్వ త్వ మాత్మనో వానరేశ్వర।
యేన త్వా మభిజానీయాం ద్వంద్వయుద్ధ ముపాగతమ్॥ ౩౮
గజపుష్పీ మిమాం ఫుల్లా ముత్పాట్య శుభలక్షణామ్।
కురు లక్ష్మణ కంఠేఽస్య సుగ్రీవస్య మహాత్మనః॥ ౩౯
తతో గిరితటే జాతా ముత్పాట్య కుసుమాకులామ్।
లక్ష్మణో గజపుష్పీం తాం తస్య కంఠే వ్యసర్జయత్॥ ౪౦
స తయా శుశుభే శ్రీమాన్ లతయా కంఠసక్తయా।
విపరీత ఇవాకాశే సూర్యో నక్షత్రమాలయా॥ ౪౧
మాలయేవ బలాకానాం ససంధ్యఇవ తోయదః।
విభ్రాజమానో వపుషా రామవాక్యసమాహితః॥ ౪౨
జగామ సహ రామేణ కిష్కింధాం వాలిపాలితామ్॥ ౪౨౨

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - ద్వాదశస్సర్గః.

(౩౪) శరణాగతిచేసినవాని జంపుట గొప్ప పాపమని చెప్పుదురు.

(౩౫) నేను లక్ష్మణుఁడు నుంచి అందము గలసీత మాకందరికి యీ వన ములో నీవే రక్షకుఁడవు.

(౩౬,౩౭) కనుక, ఓ వానరుఁడా! మరియు నీవు వాలితో యుద్ధము సేయుము. నన్ను గురించి నీవు సందేహపడవలదు. ఓ సుగ్రీవుఁడా! ఈ క్షణము లోనే యుద్ధములో నొక బాణముతోనే కొట్టఁబడి భూమిమీద పడి పొరలు చుండు వాలిని జూచెదవు.

(౩౮) వాలితో ద్వంద్వయుద్ధము సేయుచుండు నిన్ను నేను గుఱుతు పట్టునటుల, ఓ వానరరాజా! నీ కొకగుఱుతు నుంచుకొనుము.

(౩౯) లక్ష్మణా! బాగుగఁబూచినపూలు గలిగి బాగుగనుండు గజపుష్ప లతను తెంచితెచ్చి మహాత్ముఁడగు సుగ్రీవుని మెడలో నుంచుము.

(౪౦) పిమ్మట, లక్ష్మణుఁడు, పర్వతము సమీపములో పూలతో నిండి యుండిన గజపుష్పి యను తీగెను దెంచితెచ్చి సుగ్రీవునిమెడలో హారముగ నుంచెను.

(౪౧) శ్రీమంతుఁ డగు సుగ్రీవుఁడు కంఠములోనుండిన యీ లతతోఁ గూడి విపరీత కాలములో సూర్యుఁడు నక్షత్రములతోడ ప్రకాశించినటుల ప్రకా శించెను.

(౪౨,౪౩) సంధ్యాకాలము మేఘము కొంగల వరుసతోఁ బ్రకాశించు నటుల, దేహకాంతితో వెలుఁగుచుండు సుగ్రీవుఁడు, శ్రీరాముఁడు చెప్పినమాట లచే సమాధానపడి, వాలిపరిపాలించుచుండు కిష్కింధకు రామునితోడఁబోయెను.

ఇది పండ్రెండవ సర్గ.

## త్రయోదశస్సర్గః.

ఋశ్యమూకా త్సధర్మాత్మా కిష్కింధాం లక్ష్మణాగ్రజః।
జగామ సహసుగ్రీవో వాలివిక్రమపాలితామ్॥ ౧
సముద్యమ్య మహ చ్చాపం రామః కాంచనభూషితమ్।
శరాంశ్చాదిత్యసంకాశాన్ గృహీత్వా రణసాధకాన్॥ ౨

అగ్రతస్తు యయౌ తస్య రాఘవస్య మహాత్మనః।
సుగ్రీవ స్సంహతగ్రీవో లక్ష్మణశ్చ మహాబలః॥ ౩
పృష్ఠతో హనుమా న్వీరో నలో నీలశ్చ వానరః।
తారశ్చైవ మహాతేజా హరియూథపయూథపః॥ ౪
తే వీక్షమాణా వృక్షాంశ్చ పుష్పభారావలంబినః।
ప్రసన్నాంబువహా శ్చైవ సరిత స్సాగరంగమాః॥ ౫

కందరాణిచ శైలాంశ్చ నిర్దరాణి గుహా స్తథా।
శిఖరాణిచ ముఖ్యాని దరీశ్చ ప్రియదర్శనాః॥ ౬
వైడూర్య విమలైః పర్ణైః పద్మై శ్చాకోశకుట్మలైః।
శోభితా న్సజలా న్మార్గే తటాకాంశ్చ వ్యలోకయన్॥ ౭
కారండై స్సారసై ర్హంసై ర్వంచులై ర్జలకుక్కుటైః।
చక్రవాకై స్తథాచాన్యై శ్శకునై రుపనాదితాన్॥ ౮

౧౩వ సర్గ.

(౧, ౨) ధర్మాత్ముఁడును లక్ష్మణుని అన్నయు నగురాముఁడు బంగారు కట్లచే నలంకరింపఁబడిన గొప్ప ధనుసును, సూర్యునివలె వెలుఁగుచుండు యుద్ధమునకు సాధనములైన బాణములను, దీసికొని ఋశ్యమూక పర్వతమునుండి వాలి పరాక్రమముచే రక్షింపఁబడుచుండు కిష్కింధకు సుగ్రీవునితోడ పోయెను.

(౩, ౪) మహాత్ముఁడగు శ్రీరామునికి ముందుగ బాగుగబలిసియుండు మెడగల సుగ్రీవుఁడు గొప్ప బలము గల లక్ష్మణుఁడు, వెనుకభాగములో వీరుఁడగు హనుమంతుఁడు నళుఁడు నీలుఁడను వానరుఁడు గొప్పతేజస్సుగలవాఁడును వానర సేనాధిపతియగు తారుఁడును పోయిరి.

(౫) (అవతారిక.— కార్యసిద్ధిని సూచించుచు మంచి పదార్థములు కనఁబడుట దెలుపఁబడుచున్నది.) రాముఁడు మొగలగు వారు పుష్పభారముచే వంగియుండు వృక్షములను తేటగనుండు తీర్థము గల సముద్రములోఁ బ్రవేశించు నదులను జూచిరి.

(౬) గృహములవలె నుండుగుహలను పర్వతములను పర్వతములలో రాళ్ళు పరిగినందున యేర్పడిన రంధ్రములను దేవతలచే నేర్పరుపఁబడిన బిలములను ముఖ్యములగు పర్వతశిఖరములను, చూచుటకు అందముగ నుండు గృహాలను,

(౭) వైడూర్యమువలె నిర్మలముగ నుండు ఆకులతోను కొంచెము వికసించియుండు మొగ్గలతోను ప్రకాశించి, జలముతో నిండినవిగను,

(౮) మహాపక్షులు సారసపక్షులు హంసలు వంజులమను పక్షులు నీటికోళ్ళు చక్రవాకములు, జలములో నుండు మరికొన్ని విధముల పక్షుల రొదతో నిండియుండు తటాకములను జూచుచు పోయిరి.

మృదుశష్పాంకురాహారా న్నిర్భయా న్వనగోచరాన్।
చరత స్సర్వతో పశ్యన్ స్థలీషు హరిణాన్ స్థితాన్॥ ౯

తటాకవైరిణశ్చాపి శుక్లదంతవిభూషితాన్।
ఘోరా నేకచరా న్వన్యాన్ ద్విరదా న్కూలఘాతినః॥ ౧౦

మత్తా న్గిరితటోత్కృష్టా న్పర్వతానివ జంగమాన్।
వారణా న్వారిదప్రఖ్యాన్ మహీరేణుసముక్షితాన్॥ ౧౧

వనే వనచరాంశ్చాన్యాన్ ఖచరాంశ్చ విహంగమాన్।
పశ్యంత స్త్వరితా జగ్ముః సుగ్రీవవశవర్తినః॥ ౧౨

తేషాంతు గచ్ఛతాం తత్ర త్వరితం రఘునందనః।
ద్రుమషండం వనం దృష్ట్వా రామ స్సుగ్రీవ మబ్రవీత్॥ ౧౩

ఏష మేఘ ఇవాకాశే వృక్షషండః ప్రకాశతే।
మేఘసంఘాతవిపులః పర్యంతకదళీవృతః॥ ౧౪

కిమేతత్ జ్ఞాతు మిచ్ఛామి సఖే కౌతూహలం హి మే।
కౌతూహలాపనయనం కర్తు మిచ్ఛామ్యహం త్వయా॥ ౧౫

(౯) మెత్తని పచ్చికసవు కొనలను భక్షించునవియు, భయములేక అడవిలో సంచరించు చుండునవియు, అన్ని దిక్కులలోను సంచరించు చుండునవియు, నగు వనప్రదేశములలో నిలిచియుండు జింకలను,

(౧౦) తటాకములకు శత్రువులుగను తెల్లని దంతములే ఆభరణములుగ గలవిగను, భయంకరముగ నుండునవిగను, ఒక్కొకటిగ సంచరించు చుండునవిగను, నదుల తీరములను ధ్వంసము సేయునవిగను, నుండు వనములోనుండు రెండుదంతములు గల యేనుఁగులను,

(౧౧) మదించి గిరితటములను ధ్వంసము సేయుచు సంచరించుచుండు పర్వతములవలె నుండునవియు, మేఘమువలె నుండి భూమిలోగల దుమ్మును పైన చల్లుకొను చుండునవియు, నగు యేనుఁగులను,

(౧౨) వనములో సంచరించు చుండు మరికొన్ని మృగములను, ఆకాశములో సంచరించు చుండు పక్షులను, సుగ్రీవుని వశములోనుండు రాముఁడు మొదలగువారు చూచుచు శీఘ్రముగఁ బోయిరి.

(౧౩) అరణ్యములో వీరందరు పోవుచుండగా శ్రీరాముఁడు విశేషముగ వృక్షములుగల ఒక వనమును జూచి సుగ్రీవునితో నిటు లనెను.

(౧౪) ఈతోపు ఆకాశములో మేఘమువలె నల్లగఁ బ్రకాశించుచున్నది మేఘములగుంపువలె విస్తారముగ నున్నది. దీనిచుట్టు అరటిచెట్లు పెక్కులున్నవి.

(౧౫) ఓ స్నేహితుఁడా! దీని వృత్తాంతమును దెలిసికొనుటకు మిగుల కుతూహలముగలిగియున్నాను.దీని దెలిపి సంతోషమును బరిపూర్తి చేయవలయునని కోరుచున్నాను.

తస్య తద్వచనం శ్రుత్వా రాఘవస్య మహాత్మనః।
గచ్ఛ న్నేవాచచక్షేథ సుగ్రీవ స్త న్మహ ద్వనమ్॥ ౧౬
ఏత ద్రాఘవ విస్తీర్ణ మాశ్రమం శ్రమనాశనమ్।
ఉద్యానవనసంపన్నం స్వాదుమూలఫలోదకమ్॥ ౧౭

అత్ర సప్తజనానామ మునయ స్సంశితవ్రతాః।
సప్తైవాస న్నధశ్శీర్షా నియతం జలశాయినః॥ ౧౮
సప్తరాత్రకృతాహారా వాయునా వనవాసినః।
దివం వర్షశతై ర్యాతా స్సప్తభి స్సకళేబరాః॥ ౧౯

తేషా మేవంప్రభావానాం ద్రుమప్రాకారసంవృతమ్।
ఆశ్రమం సుదురాధర్ష మపి సేంద్రై స్సురాసురైః॥ ౨౦
పక్షిణో వర్జయంత్యేత త్తథాఽన్యే వనచారిణః।
విశంతి మోహా ద్యే తత్ర నివర్తంతే న తే పునః॥ ౨౧

విభూషణరవా స్తత్ర శ్రూయ తే సకలాక్షరాః।
తూర్యగీతస్వనాశ్చాత్ర గంధో దివ్యశ్చ రాఘవ॥ ౨౨
త్రేతాగ్నయోఽపి దీప్యంతే ధూమో హ్యత్ర ప్రకాశతే।
వేష్టయన్నివ వృక్షాగ్రా న్కపోతాంగారుణో ఘనః॥ ౨౩

(౧౬) మహాత్ముఁడగు శ్రీరామునిమాట విని సుగ్రీవుఁడు నడిచిపోవుచు ఆ గొప్పవనము సమాచారమును దెలిపెను.

(౧౭) రామా! విశాలమగు యీయాశ్రమము శ్రమమునుబోఁగొట్టునట్టిది. ఉద్యానములు దివ్యఫలములు గడ్డలు తీర్థము గలిగి యున్నది.

(౧౮) ఈయాశ్రమములో సప్తజను లను పేరు గలవారును ఉగ్రమైన వ్రతముగలవారును సదాజలములో తలనుముంచి పండుకొనియుండువారును నగు యేడ్గురు ఋషు లుండిరి.

(౧౯) ఏడు రాత్రుల కొకరాత్రిలో గాలిని భక్షించువారును, ఆశ్రమములో తపసు చేయుచు వసించుచుండువారును నగుయీయేడ్గురు ఋషులు యేడునూరుసంవత్సరములు తపసుచేసి దేహములతోడ స్వర్గమునకుఁ బోయిరి.

(౨౦) కోటవలె వృక్షములతోఁ జుట్టుకొని యుండు యీ యాశ్రమము యిట్టి ప్రభావము గలయీఋషుల దేశు. ఇంద్రునితోఁగూడిన దేవాసురులును దీనిలోఁ బ్రవేశించలేరు.

(౨౧) ఈయాశ్రమమును పక్షులు వనములోసంచరించుచుండు యితర జంతువులు వర్జించియున్నవి. తెలియక దీనిలోఁ బ్రవేశించినవారు వెలుపల రాలేక అచటనే చచ్చెదరు,

(౨౨) ఈ యాశ్రమములో మధుర మగుగానముతో మిళితమైన నర్తనముసేయునపుడు గలుగు ఆభరణముల ధ్వని, తాళము మృదంగము వీణ మొదలగు వాద్య విశేషముల ధ్వని వినవచ్చుచున్నవి. మంచి సువాసన వచ్చుచున్నది.

(౨౩) ఇచట త్రేతాగ్నులు (గార్హపత్యము ఆహవనీయము దాక్షిణాత్యము) గలవు. ఇందుకు కారణము పావురము దేహకాంతివలె అరుణవర్ణముగలిగి దట్టమై వృక్షముల కొనలను జుట్టుకొను ధూమము ప్రకాశించుచుండుటేను.

ఏతే వృక్షాః ప్రకాశంతే ధూమసంసక్తమస్తకాః।
మేఘజాలప్రతిచ్ఛన్నా వైడూర్యగిరయో యథా॥ ౨౪
కురుప్రణామం ధర్మాత్మ౯ తా న్సముద్దిశ్య రాఘవ।
లక్ష్మణేన సహ భ్రాత్రా ప్రయత స్సంయతాంజలిః॥ ౨౫

ప్రణమన్తిహి యే తేషాం మునీనాం భావితాత్మనాం।
న తేషా మశుభం కించి చ్ఛరీరే రామ దృశ్యతే॥ ౨౬
తతో రామ స్సహ భ్రాత్రా లక్ష్మణేన కృతాంజలిః।
సముద్దిశ్య మహాత్మాన స్తా నృషీ నభ్యవాదయత్॥ ౨౭

అభివాద్యతు ధర్మాత్మా రామో భ్రాతాచ లక్ష్మణః।
సుగ్రీవో వానరా శ్చైవ జగ్ము స్సంహృష్టమానసాః॥ ౨౮
తే గత్వా దూర మధ్వానం తస్మా త్సప్తజనాశ్రమాత్।
దదృశు స్తాం దురాధర్షాం కిష్కింధాం వాలిపాలితామ్॥ ౨౯

తతస్తు రామానుజ రామ వానరాః ప్రగృహ్య శస్త్రాణ్యుదితా గ్ర్య తేజసః । పురీం సురేశాత్మజ వీర్యపాలితాం వధాయ శత్రోః పునరాగతా స్సహ॥ ౩౦

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - త్రయోదశస్సర్గః.



(౨౪) పొగతో నిండిన కొనలు గలయీవృక్షములు మేఘముల సమూహములతో గప్పఁబడిన వైడూర్యపర్వతములవలెఁ బ్రకాశించుచున్నవి.

(౨౫) రామా! ధర్మాత్ముఁడా! తమ్ముఁడగు లక్ష్మణునితోడ మంచిమనసుతో అంజలిచేసికొని ప్రయోజనమునుగోరి యీ ఋషులకు నమస్కరింపుము.

(౨౬) పరమాత్మను ధ్యానించుచుండు యీఋషులకు నమస్కరించువారి శరీరములో, ఓరామా! నొకవ్యాధియు నుండదు.

(౨౭) పిమ్మట, శ్రీరాముఁడు తమ్ముఁడగు లక్ష్మణుఁడు అంజలిచేసికొని మహాత్ములగు ఆఋషులకు, ఫలమును గోరి, నమస్కరించిరి.

(౨౮) ధర్మాత్ముఁడగు రాముఁడు లక్ష్మణుఁడు సుగ్రీవుఁడు వానరులు ఆ ఋషులకునమస్కరించి మిగుల సంతోషించి వారి మార్గమున బోయిరి.

(౨౯) రాముఁడు మొదలగువారు ఆసప్తఋషుల ఆశ్రమమునుండి మిగుల దూరముపోయి యితరులకు తిరస్కరించుటకు సాధ్యముకాని వాలి పరిపాలించుచుండు కిష్కింధను జూచిరి.

(30) పిమ్మట, లక్ష్మణుఁడు రాముఁడు వానరులు అస్త్రములను ధరించి అభివృద్ధియగుచుండు గొప్పతేజస్సుగలవారై శత్రువును జంపుటకై, ఇంద్రుని కొడుకగు వాలి పరాక్రమముచే రక్షింపఁబడుచుండు కిష్కింధకు, మరియు, గుంపుగ వచ్చిచేరిరి.

ఇది పదిమూఁడవసర్గ.

## చతుర్దశస్సర్గః

సర్వే తే త్వరితం గత్వా కిష్కింధాం వాలిపాలితామ్।
వృక్షై రాత్మాన మావృత్య వ్యతిష్ఠ న్గహనే వనే॥ ౧

విచార్య సర్వతో దృష్టిం కాననే కాననప్రియః।
సుగ్రీవో విపులగ్రీవః క్రోధ మాహారయ ద్భృశమ్॥ ౨

తత స్స నినదం ఘోరం కృత్వా యుద్ధాయ చాహ్వయత్।
పరివారైః పరివృతో నాదై ర్భింద న్నివాంబరమ్॥ ౩
గర్జన్నివ మహామేఘో వాయువేగపురస్సరః॥ ౩½

అథ బాలార్కసదృశో దృప్తసింహగతి స్తదా।
దృష్ట్వా రామం క్రియాదక్షం సుగ్రీవో వాక్య మబ్రవీత్॥ ౪½

హరివాగురయా వ్యాప్తం తప్తకాంచనతోరణామ్॥
ప్రాప్తాస్స్మ ధ్వజయంత్రాఢ్యాం కిష్కింధాం వాలినః పురీమ్॥

ప్రతిజ్ఞా యా త్వయా వీర కృతా వాలివధే పురా॥
సఫలాం తాం కురు క్షిప్రం లతాం కాల ఇవాగతః॥ ౬½

## ౧౪ వ సర్గ.

(అవతారిక.— వాలిని రెండవసారి యుద్ధమునకుఁ బిలుచుటకు భయపడుచుండిన సుగ్రీవునికి రాముఁడు యీ సర్గలో ధైర్యము చెప్పుచున్నాఁడు.)

(౧) రాముఁడు మొదలగువారు శీఘ్రముగ వాలి పరిపాలించుచుండు కిష్కింధ చేరి ప్రవేశించుటకు సాధ్యము కాని వనములో వృక్షములలో దాగి యుండిరి.

(౨) అరణ్యముమీఁద ప్రియముగలవాఁడును బలిసి విశాల మగు మెడ గలవాఁడును నగుసుగ్రీవుఁడు అరణ్యమునంతయు నలుప్రక్కల బాగుగఁ జూచి మిగులకోపము గలవాఁడాయెను.

(౩,౩½) పిమ్మట మంత్రులతోఁ గూడియుండు సుగ్రీవుఁడు వాయువేగముతోఁ గూడి గర్జించుచు గొప్పమేఘమువలె అతనిధ్వనిచే ఆకాశమును బ్రద్దలుసేయునటుల భయంకరముగ ధ్వని చేసి వాలిని యుద్ధమునకుఁ బిలిచెను.

(౪½) బాలసూర్యునివలె నుండువాఁడును, మదించి సింహమువంటి గమనముగలవాఁడును, నగు సుగ్రీవుఁడప్పుడు, తన కార్యమును బూర్తిచేయుటలో దక్షుఁడుగనుండు రామునితో నిటు లనెను.

(౫½) వానరు లనువలలతో నిండినదియు, పుటము వేసిన బంగారు పురద్వారము గలదియు, ధ్వజములు ఆయుధములతో నిండినదియు నగువాలిపట్టణ మగుకిష్కింధకు వచ్చి చేరితిమి.

(౬½) ఓవీరుఁడా! నీవు పూర్వము వాలిని జంపునటుల ప్రతిజ్ఞ సేసితివి. అట్టిప్రతిజ్ఞను, వసంతాదిఋతువులు తీగెను పుష్పఫలాదులతోఁ గూడునట్లు చేయునటుల, సఫలము సేయుము.

ఏవ ముక్తస్తు ధర్మాత్మా సుగ్రీవేణ స రాఘవః।
త మథోవాచ సుగ్రీవం వచనం శత్రుసూదనః॥ ౭॥

కృతాభిజ్ఞానచిహ్న స్త్వ మనయా గజసాహ్వయా।
లక్ష్మణేన సముత్పాట్య యైషా కంఠే కృతా తవ॥ ౮॥

శోభసే హ్యధికం వీర లతయా కంఠ సక్తయా।
విపరీత ఇవాకాశే సూర్యో నక్షత్రమాలయా॥ ౯॥

అద్య వాలిసముత్థం తే భయం వైరంచ వానర।
ఏకేనాహం ప్రమోక్ష్యామి బాణమోక్షేణ సంయుగే॥ ౧౦॥

మమ దర్శయ సుగ్రీవ వైరిణం భ్రాతృరూపిణమ్।
వాలీ వినిహతో యావ ద్వనే పాంసుషు వేష్టతే॥ ౧౧॥

యది దృష్టిపథం ప్రాప్తో జీవ న్స నివర్తతే।
తతో దోషేణ మాగచ్ఛే త్సద్యో గర్హేచ్చ మా భవాన్॥ ౧౨॥

ప్రత్యక్షం సప్త తే సాలా మయా బాణేన దారితాః।
తేనావేహి బలే నాద్య వాలినం నిహతం మయా॥ ౧౩॥

(౭౪) ధర్మాత్ముఁడును శత్రుసంహారకుఁడును నగు శ్రీరాముఁడు సుగ్రీవునిమాట విని పిమ్మట అతనితో నిటు లనెను.

(౮౪) లక్ష్మణుఁడు తెంచితెచ్చిన మెడలో నుంచియుండు గజపుష్పి యనులతచే నీవు బాగుగఁ దెలిసికొనందగినటుల గురుతుగలవాఁడవుగ నున్నావు.

(౯౪) వీరుఁడగు సుగ్రీవుఁడా! కంఠములో నీవు ధరించుకొని యుండు గజపుష్ప హారముచే రాత్రిపూట ఆకాశములో నక్షత్రముల మాలచే చంద్రుని వలె ప్రకాశించుచున్నావు.(ఈశ్లోకములో సూర్యశబ్దముచే చంద్రుఁడెట్లు చెప్పబడెనని ప్రశ్న. ఇందుకు సమాధానము. నవోనవో భవతి అను శ్రుతిలో చంద్రుని బోధించుటచే చంద్రమన్ శబ్దముచే సూర్యుఁడు చెప్పబడెను. అటులనే, సూర్యుని కిరణములవల్ల చంద్రునికి ప్రకాశము గలుగుటచే సూర్యశబ్దము వల్ల చంద్రుఁడు చెప్పఁబడెను.)

(౧౦౪) ఓ సుగ్రీవుఁడా! వాలివల్ల నీకుగలిగినభయమును వైరమును యుద్ధములో నేను ఒక బాణమును విడిచి పోగొట్టెదను.

(౧౧౪) సుగ్రీవుఁడా! బాణముతోఁ జంపఁబడి అరణ్యములోధూళిలో పొరలుటను ముందుగనే అన్నయను పేరుపెట్టుకొని శత్రువుగనుండు వాని నాకుఁ జూపుము.

(౧౨౪) వాలి నాకంటికి అగుపడి జీవించి తిరిగి పోయినటులైతే అపుడు నన్ను దోషియని నీవు తెలిసికొని పిమ్మట నిందించవచ్చును.

(౧౩౪) నీవు చూచుచుండగనే బాణముతో సప్తసాల వృక్షములను ఛేదించితిని. అట్టి బలశాలిగ నుండుటచే యిపుడు వాలిని నేను జంపుదునని తెలిసికొనుము.

అనృతం నోక్తపూర్వం మే వీర కృచ్ఛ్రేఽపి తిష్ఠతా।
ధర్మలోభపరీతేన న చ వక్ష్యే కథంచన॥ ౧౪॥

సఫలాం చ కరిష్యామి ప్రతిజ్ఞాం జహి సంభ్రమమ్।
ప్రసూతం కళమం క్షేత్రే వర్షేణేవ శతక్రతుః॥ ౧౫॥

తదాహ్వాననిమిత్తం త్వం వాలినో హేమమాలినః।
సుగ్రీవ కురు తం శబ్దం నిష్పతేద్యేన వానరః॥ ౧౬॥

జితకాశీ బలశ్లాఘీ త్వయా చాధర్షితః పురా।
నిష్పతిష్యత్యసంగేన వాలీ స ప్రియసంయుగః॥ ౧౭॥

రిపూణాం ధర్షణం శూరా మర్షయంతి న సంయుగే।
జానంతస్తు స్వకం వీర్యం స్త్రీసమక్షం విశేషతః॥ ౧౮॥

స తు రామవచః శ్రుత్వా సుగ్రీవో హేమపింగళః।
ననర్ద క్రూరనాదేన వినిర్భిందన్నివాంబరమ్॥ ౧౯॥

తస్య శబ్దేన విత్రస్తా గావో యాంతి హతప్రభాః।
రాజదోషపరామృష్టాః కులస్త్రియ ఇవాకులాః॥ ౨౦॥

ద్రవంతి చ మృగాః శీఘ్రం భగ్నా ఇవ రణే హయాః।
పతంతి చ ఖగా భూమౌ క్షీణపుణ్యా ఇవ గ్రహాః॥ ౨౧॥

(౧౩౫) వీరుఁడా! కష్టదశలో నుండినను నింతకుముందు నేను అబద్ధమాడినది లేదు. ధర్మమునకు హానివచ్చుట సైచక మిగుల ప్రమాదము గలిగినను అబద్ధము పలుకను.

(౧౪౫) మంచి క్షేత్రములో మొలచిన పైరును వానచే ఇంద్రుఁడు సఫలముగఁ జేయునటుల, వాలిని జంపునటుల చేసిన ప్రతిజ్ఞను సఫలము చేసెదను. సంశయమువల్ల గలిగిన చపలతను విడువుము.

(౧౫౫) సుగ్రీవుఁడా! బంగారు హారమును ధరించిన వాలిని బిలుచుటకై నీవు అతఁడు విని వెలుపల వచ్చునట్టి సింహనాదము సేయుము.

(౧౬౫) జయముచే ప్రకాశించు వాఁడును, బలముచే శ్లాఘనీయుఁడును, పూర్వము నన్ను జయించిన వాఁడును, యుద్ధములో బ్రియముగలవాఁడును నగు వాలి నీ సింహనాదము విని శీఘ్రముగ వెలుపలవచ్చును.

(౧౭౫) వాలి పరాక్రమమును దెలిసికొనిన శూరులు స్త్రీలసమక్షమములో దానిని విశేషముగఁ జెప్పుకొనుచు శత్రువులచే యుద్ధములో గలుగు తిరస్కారమును సైచరు.

(౧౮౫) బంగారువంటి దేహకాంతి గలసుగ్రీవుఁడు శ్రీరామునిమాట విని భయంకరమగుధ్వనిచే ఆకాశమును బద్దలుసేయువానివలె సింహనాదముచేసెను.

(౨౦౫) సుగ్రీవుని భయంకరమైనధ్వని వినిభయపడి ముఖవికాసము చెడి ఆవులు, రాజులేని రాజ్యములో దుష్టులచే కేశములుపట్టి యీడువఁబడిన కులస్త్రీలవలె, పోయిచేరవలసిన ప్రదేశము తెలియక వ్యాకుల పడినవి.

(౨౧౫) రణరంగములో దెబ్బలుతినిన గుఱ్ఱములవలె మృగములు యీ ధ్వని విని శీఘ్రముగ పారిపోయినవి. పుణ్యము క్షీణించియున్న గ్రహములు క్రిందపడినటుల పక్షులు యీ ధ్వని విని క్రిందపడినవి.

తత స్సజీమూతగణ ప్రణాదో నాదం హ్యముంచ త్త్వరయా
ప్రతీతః। సూర్యాత్మజ శ్శౌర్యవివృద్ధతేజా స్సరిత్పతి ర్వాఽనిల
చంచలోర్మిః॥ ౨౨

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - చతుర్దశస్సర్గః

---

## పంచదశస్సర్గః.

అథ తస్య నినాదం తు సుగ్రీవస్య మహాత్మనః।
శుశ్రావాంతఃపురగతో వాలీ భ్రాతురమర్షణః॥ ౧

శ్రుత్వా తు తస్య నినదం సర్వభూతప్రకంపనమ్।
మద శ్చైకపదే నష్టః క్రోధ శ్చాపతితో మహాన్॥ ౨

స తు రోషపరీతాఽంగో వాలీ సంధ్యాఽతపప్రభః।
ఉపరక్తఇవాఽదిత్య స్సద్యో నిష్ప్రభతాంగతః॥ ౩

వాలీ దంష్ట్రాకరాళస్తు క్రోధా ద్దీప్తాగ్నిసన్నిభః।
భాత్యుత్పతిత పద్మాభ స్సమృణాళ ఇవ హ్రదః॥ ౪

(౨౫) పిమ్మట, మేఘముల గుంపువంటి ధ్వని గలవాఁడును సింహనాదము సేయుటలోఁ బ్రసిద్ధుఁడును పరాక్రమముచే వృద్ధిపొందిన తేజస్సు గలవాఁడును నగు సుగ్రీవుఁడు, గాలిచే చలించుచుండు అలలు గల సముద్రమువలె, శీఘ్రముగ గొప్పధ్వని చేసెను.

ఇది పదినాల్గవ సర్గ.

౧౫ వ సర్గ.

(అవతారిక.— సుగ్రీవునితోడ యుద్ధమునకుఁ బోవలదని తార వాలికి బుద్ధిసెప్పుట యీ సర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) పిమ్మట, అంతఃపురములో నుండిన శత్రువుల సింహనాదముసైచని వాలి కోపము గలవాఁడై, మిగుల ధైర్యవంతుఁడును తమ్ముఁడును నగు సుగ్రీవుని సింహనాదమును వినెను.

(౨) సకల ప్రాణులకును కంపము గలిగించునట్టి సుగ్రీవుని సింహనాదమును విని వాలికి, ఒకే స్థానములో అహంకారము పోయినది. గొప్ప కోపము గలిగినది.

(౩) రోషముచే విపరీతమైన వేషముతోఁ గూడిన అంగములు గలవాఁడును, కనకనే సంధ్యాకాలము యెండవంటి కాంతిగలవాఁడును, నగు వాలి, వెంటనే పరివేషము చుట్టుకొనియుండు సూర్యునివలె, తేజోహీనుఁ డాయెను.

(౪) కోరపండ్లచే నిండిన నోరుగలిగి కోపముచే మండు అగ్నివలె నుండు వాలి, వికసించిన రక్తోత్పలములకాంతిగలిగి, కాడలతోఁ గూడియుండు మడుగువలెఁ బ్రకాశించెను.

శబ్దం దుర్మర్షణం శ్రుత్వా నిష్పపాత తతో హరిః।
వేగేన చరణన్యాసై ర్దారయన్నివ మేదినీం॥ ౫

తం తు తారా పరిష్వజ్య స్నేహాద్దర్శిత సౌహృదా।
ఉవాచ త్రస్త సంభ్రాంతా హితోదర్క మిదం వచః॥ ౬

సాధు క్రోధ మిమం వీర నదీవేగమివాఽఽగతమ్।
శయనా దుత్థితః కాల్యం త్యజ భుక్తామివ స్రజమ్॥ ౭
కాల్యమేతేన సంగ్రామం కరిష్యసి చ వానర।
వీర తే శత్రుబాహుళ్యం ఫల్గుతా వాఽనవిద్యతే॥ ౮
సహసా తవ నిష్క్రామో మమ తావ న్నరోచతే।
శ్రూయతాం చాభిధాస్యామి యన్నిమిత్తం నివార్యసే॥ ౯

పూర్వ మాపతితః క్రోధా త్సత్వా మాహ్వయతే యుధి।
నిష్పత్యచ నిరస్తస్తే హన్యమానో దిశో గతః॥ ౧౦
త్వయా తస్య నిరస్తస్య పీడితస్య విశేషతః।
ఇహైత్య పునరాహ్వానం శంకాం జనయతీవ మే॥ ౧౧
దర్పశ్చ వ్యవసాయశ్చ యాదృశ స్తస్య నర్దతః।
నినాదశ్చాపి సంరంభో నైతదల్పంహి కారణమ్॥ ౧౨

(౫) పిమ్మట, వాలి సైచుటకు సాధ్యముకాని సుగ్రీవుని సింహనాదము విని వేగముచేతను పాదములతోఁ గొట్టుటచేతను భూమిని బద్దలుచేయుచు వానివలె ప్రయాణమగుటకు యెగిరిపడెను.

(౬) తనమాట వినవలయునని ప్రీతిచే తార వాలిని నాలింగనము చేసికొని స్నేహమును జూపునదియై భయముచే శీఘ్రముగ హితముసేయునట్టి యీ మాటలు చెప్పెను.

(౭) వీరుఁడా! ప్రాతఃకాలములో పడకనుండి లేచినవాఁడు అనుభవించిన పూలహారమును దీసివేయునటుల, నదీ వేగమువలె వచ్చియుండిన నీకోపము నంతయు విడువుము.

(౮) వానరుఁడా! తెల్లవారిన పిమ్మట సుగ్రీవునితో యుద్ధము సేయవచ్చును. వీరుఁడా! ఇందుచే లాఘవము గాని, శత్రువుల బలాబలవిషయమైన శంకగాని, నీకు లేదు.

(౯) నీవు త్వరపడి యుద్ధమునకుఁ బ్రయాణమగుట నా కిష్టములేదు. నేను అడ్డగించుటకు కారణము దెలిపెదను వినుము.

(౧౦) సుగ్రీవుఁడు ముందొకసారి వచ్చెను. కోపముచే యుద్ధములో తిరస్కరింపఁబడిన వాఁడై కొట్టఁబడి పారిపోయినవాఁడు యిపుడు మరియు యుద్ధమునకుఁ నిన్ను బిలుచుచున్నాఁడు.

(౧౧) నీచే తిరస్కరింపఁబడి బాగుగ కొట్టఁబడిన సుగ్రీవుఁడు యిచటికి వచ్చి మరియు నిన్ను యుద్ధమునకుఁ బిలుచుట నాకు సందేహము గలిగించుచున్నది.

(౧౨) సుగ్రీవునికి దర్పము ప్రయత్నము సింహనాదము యుత్సాహము గలిగినందుకు గొప్పకారణ ముండవలయును.

నాఽసహాయ మహం మన్యే సుగ్రీవం త మిహాఽగతమ్।
అవష్టబ్ధ సహాయశ్చ యమాశ్రిత్యైష గర్జతి॥ ౧౩
ప్రకృత్యా నిపుణ శ్చైవ బుద్ధిమాం శ్చైవ వానరః।
అపరీక్షిత వీర్యేణ సుగ్రీవ స్సహ నైష్యతి॥ ౧౪

పూర్వ మేవ మయా వీర శ్రుతం కథయతో వచః।
అంగదస్య కుమారస్య వక్ష్యామి త్వా హితం వచః॥ ౧౫
అంగదస్తు కుమారోఽయం వనాంత ముపనిర్గతః।
ప్రవృత్తి స్తేన కథితా చారై రాప్తై ర్నివేదితా॥ ౧౬

అయోధ్యాఽధిపతేః పుత్రౌ శూరౌ సమరదుర్జయౌ।
ఇక్ష్వాకూణాం కులే జాతౌ ప్రథితౌ రామలక్ష్మణౌ॥ ౧౭
సుగ్రీవప్రియకామార్థం ప్రాప్తౌ తత్ర దురాసదౌ॥ ౧౭½

తవ భ్రాతుర్హి విఖ్యాత స్సహాయో రణకర్కశః।
రామః పరబలాఽమర్దీ యుగాంతాఽగ్నిరివోత్థితః॥ ౧౮½
నివాసవృక్ష స్సాధూనా మాపన్నానాం పరాగతిః।
ఆర్తానాం సంశ్రయశ్చైవ యశసశ్చైక భాజనమ్॥ ౧౯½

(౧౩) సుగ్రీవుఁడిపటికి సహాయము తోడనే వచ్చినటుల నేను తలంచుచున్నాను. సహాయము తోడనే యున్నాఁడు. ఏలననగానితఁడందుచేతనే గర్జించుచున్నాఁడు.

(౧౪) ఇతఁడు స్వభావముచేతనే సమర్థుఁడు, బుద్ధిమంతుఁడు. అందుచేత సుగ్రీవుఁడు సహాయమునకుఁ వచ్చిన వాని వీర్యమును బరీక్షించక అతనితో స్నేహము సేయఁడు.

(౧౫) ఓ వీరుఁడా! ముందుగనే మన కొడుకగు అంగదుఁడు చెప్పగా నీ విషయమును వినియున్నాను. కనుక నేను నీకు హితమును జెప్పుచున్నాను.

(౧౬) కొడుకగు అంగదుఁడు విహారార్థ ముపవనమునకుఁ బోయెను. అప్పుడుగ సంచుచారులు దెలిపిన వృత్తాంతమును నితఁడు నాకుఁ దెలిపెను.

(౧౭, ౧౭½) దశరథుని పుత్రులును శూరులును యుద్ధములో జయించుటకసాధ్యపడని వారును ఇక్ష్వాకుకులములోఁ బుట్టినవారును ప్రసిద్ధులును, శత్రువులు తిరస్కరించుటకు సాధ్యము కానివారును నగు రామలక్ష్మణులు సుగ్రీవునికి హితముసేయుటకై ఋశ్యమూకమునకు వచ్చియున్నారని అంగదుఁడు చెప్పగా వింటిని.

(౧౮½) శత్రువు బలమును నాశముసేయువాఁడును, ప్రళయకాలములో లేచిన అగ్నివలెనుండువాఁడును, యుద్ధములో కఠిన చిత్తుఁడుగ నుండువాఁడును ప్రసిద్ధుఁడును నగు రాముఁడు సుగ్రీవునికి సహాయముగ నున్నాఁడు.

(౧౯½) సంసార తాపతప్తులై అనుకూలురుగనుండు వారికి విశ్రమస్థానమును, శరణాగతి సేసినవారికి పునరావృత్తి లేనట్టి ప్రాప్యస్థానమును, ఆర్తులుగనుండువారికి సర్వదా ఉత్కృష్టమైన ఆశ్రయమును, ఇట్టిరక్షకుఁడు లోకములో నింకొకఁడు లేఁడనుయశస్సునకు బాగుగతగినవాఁడును శ్రీరాముఁడేను. (ఈశ్లోకములో ఆర్తుఁడు జిజ్ఞాసు అర్థార్థి జ్ఞాని యనునలుగురు అధికారులు చెప్పఁబడిరి.)

జ్ఞానవిజ్ఞానసంపన్నో నిదేశే నిరతః పితుః।
ధాతూనా మివ శైలేంద్రో గుణానా మాకరో మహాన్॥ ౨౦

తత్క్షమం నవిరోధస్తే సహ తేన మహాత్మనా।
దుర్జయే నాప్రమేయేన రామేణ రణకర్మసు॥ ౨౧

శూర వక్ష్యామి తే కించి న్నచేచ్ఛామ్యభ్యసూయితుమ్।
శ్రూయతాం క్రియతాం చైవ తవ వక్ష్యామి యద్ధితం॥ ౨౨

యౌవరాజ్యేన సుగ్రీవం తూర్ణం సాధ్వభిషేచయ।
విగ్రహం మాకృథా వీర భ్రాత్రా రాజ న్బలీయసా॥ ౨౩

అహం హి తే క్షమం మన్యే తేన రామేణ సౌహృదమ్।
సుగ్రీవేణ చ సంప్రీతిం వైర ముత్సృజ్య దూరతః॥ ౨౪

లాలనీయోహి తే భ్రాతా యవీయా నేష వానరః।
తత్ర వా స న్నిహ స్థోవా సర్వథా బంధు రేవ తే॥ ౨౫

నహి తే నసమంబంధుం భువి పశ్యామి కంచన।
దానమానాదిసత్కారైః కురుష్వ ప్రత్యనంతరం॥ ౨౬

వైర మేత త్సముత్సృజ్య తవ పార్శ్వే స తిష్ఠతు॥
సుగ్రీవో విపులగ్రీవ స్తవ బంధు స్సదా మతః॥ ౨౭

(౨౦౫) సామాన్య విశేష జ్ఞానము గలవాఁడును, పితృవాక్య పరిపాలన లో నాసక్తిగలవాఁడును, నగు రాముఁడు , ధాతువులకు గొప్పపర్వతము ఆశ్రయముగనుండునటుల, సకల కల్యాణగుణములకు గొప్పనిధిగనుండు వాఁడు.

(౨౧౫) మహాత్ముఁడును జయించుటకు సాధ్యము కానివాఁడును యుద్ధములో అమితమైన మహిమగలవాఁడును నగు రామునితో నీకు విరోధము తగదు.

(౨౨౫) శూరుఁడా! నీకమరికొంత చెలుపు మన్నాను. నీకు గలదోషము లను దెలుపుటకు నేనెపుడును కోరను. లేక నేను చెప్పువిషయములో నీవు అసూయపడకూడదు. నేను చెప్పునట్టి హితమును విని అటులనే చేయవలయును.

(౨౩౫) సుగ్రీవునికి త్వరగ యువరాజ్య పట్టాభిషేకము సేయుము. ఓ రాజా, వీరుఁడా! బలవంతుఁడగు తమ్మునితో యుద్ధము వలదు.

(౨౪౫) ద్వేషమును దూరముగ విడిచిపెట్టి శ్రీరామునితో స్నేహము సేసికొనుట సుగ్రీవునితో సంతోషముగనుండుట నీకు యుక్తమని తలంచు చున్నాను.

(౨౫౫) నీకు తమ్ముఁడుగను చిన్నవాఁడుగను నుండు యీ సుగ్రీవుని నీవు లాలించవలయును. అతఁడు అచట ఉండినను ఇచట ఉండినను అన్నివిధముల లోను అతఁడు నీకు బంధువేను.

(౨౬౫) సుగ్రీవునివంటి బంధువును నీకుయీభూమిలో నింకొకని నేను చూడలేదు. కనుక, దానాదిసత్కారములచే అతని సమీపములోనే యుంచుకొనవలయును.

(౨౭౫) ద్వేషమును విడిచి నీప్రక్కలోనే అతఁడుండవలయును. ఏలన నఁగా, బలిసి విశాలముగ నుండు మెడ గలసుగ్రీవుఁడు యెల్లపుడు నీబంధువే యని నా యభిప్రాయము.

భ్రాత్రాతు స్సౌహృద మాలంబ నాఽన్యాగతి రిహాఽస్తి తే॥
యది తే మత్ప్రియం కార్యం యది చావైషి మాం హితామ్।
యాచ్యమానః ప్రయత్నేన సాధువాక్యం కురుష్వ మే॥ ౨౯
ప్రసీదపథ్యం శృణు జల్పితం హి మే నరోషమేవాఽనువిధా
తుమర్హసి। క్షమోహి తే కోసల రాజసూనునా నవిగ్రహ
శ్శక్ర సమానతేజసా। ౩౦
తదా హి తారా హితమేవ వాక్యం తం వాలినం పథ్యమిదం
బభాషే । నరోచతే తద్వచనం హి తస్య కాలాభిపన్నస్య వి
నాశకాలే॥ ౩౧

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - పంచదశస్సర్గః.

## షోడశస్సర్గః.

తామేవం బ్రువతీం తారాం తారాధిపనిభాఽననామ్।
వాలీ నిర్భర్త్సయామాస వచనం చేద మబ్రవీత్॥ ౧
గర్జతోఽస్యచ సంరంభం భ్రాతుశ్శత్రో ర్విశేషతః।
మర్షయిష్యా మ్యహం కేన కారణేన వరాననే॥ ౨

(౨౮) నీతమ్ముని స్నేహమును నపేక్షించవలయును. అదితప్ప నీకు గత్యంతరములేదు.

(౨౯) నీకు ప్రియము సేయవలయునని, నేను నీకు హితము తలఁచుదానవని నీవు తలచినటులైతే నేను సర్వవిధముల వేడుకొను చున్నాను. నా మాటను సార్థకపరచుము.

(౩౦) ప్రసన్నుఁడవగుము. హితముగనుండు నామాటను వినుము. కోపము సేయవలదు. ఇంద్రుని పరాక్రమమువంటి పరాక్రమముగల కోసలరాజపుత్రుఁడగు శ్రీరామునితో వైరము తగదు.

(౩౧) అప్పుడు, తార వాలిని జూచి హితముగను పథ్యముగను నుండు మాట చెప్పెను. వినాశకాలము సమీపించినందున, మృత్యువుచే యీడువబడు చుండు వాలికి, తార చెప్పినమాటలు రుచించలేదు.

ఇది పదునైదవసర్గ.



౧౬ వ సర్గ.

(అవతారిక,— ఈసర్గలో వాలి వధ చెప్పఁబడుచున్నది)

(౧) ఈవిధముగఁ జెప్పుచుండిన చంద్రునివంటి ముఖము గలతారను వాలి చీకొట్టి యిటు లనెను.

(౨) అందముగనుండుముఖము గలదానా! శత్రువై సింహనాదము సేయుచుండు తమ్మునియొక్క యుద్ధసంరంభమును నెటులసైచగలను.

అధర్షితానాం శూరాణాం సమరేష్వనివర్తినామ్।
ధర్షణా మర్షణం భీరు మరణా దతిరిచ్యతే॥ ౩
సోఢుం నచ సమర్థో హం యుద్ధకామస్య సంయుగే।
సుగ్రీవస్య చ సంరంభం హీనగ్రీవస్య గర్జతః॥ ౪

న చ కార్యో విషాదస్తే రాఘవం ప్రతిమత్కృతే।
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ కథం పాపం కరిష్యతి॥ ౫
నివర్తస్వ సహ స్త్రీభిః కథం భూయో నుగచ్ఛసి।
సౌహృదం దర్శితం తారే మయి భక్తిః కృతా త్వయా॥

ప్రతియోత్స్యా మ్యహం గత్వా సుగ్రీవం జహి సంభ్రమమ్।
దర్పమాత్రం వినేష్యామి నచ ప్రాణై ర్విమోక్ష్యతే॥ ౭
అహంహ్యాజిస్థితస్యాస్య కరిష్యామి యథేప్సితమ్।
వృక్షై ర్ముష్టిప్రహారైశ్చ పీడితః ప్రతియాస్యతి॥ ౮

న మే త్వరితమాయస్తం సహిష్యతి దురాత్మవాన్।
కృతం తారే సహాయత్వం సౌహృదం దర్శితం మయి॥ ౯
శాపితాఽసి మమ ప్రాణై ర్నివర్తస్వ జయేనచ।
అహం జిత్వా నివర్తిష్యే తమహం భ్రాతరం రణే॥ ౧౦

(౩) ఎవరివల్లను తిరస్కరింపఁబడని వారును, యుద్ధరంగములో వెనుక దీయనివారును నగుశూరులకు, యింకొకని తిరస్కారమును సైచుట, భయపడు స్వభావముగలదానా! మరణముకంటె గొప్పవిషయము.

(౪) యుద్ధమును నపేక్షించువాఁడును, కొరతలేనివాఁడై గర్జించుచుండు సుగ్రీవుని సంరంభమును నేను సైచను.

(౫) నావిషయమై రాముఁడేమైనను చేయునని నీవు దుఃఖించవలదు. ఏలననఁగా, ధర్మజ్ఞుఁడును కృతజ్ఞుఁడును నగు రాముఁడు నిరపరాధుని వధించునట్టి పాపము సేయునా?

(౬) స్త్రీలతోడ నీవు అంతఃపురములోకిఁ బొమ్ము. మరియు నెందుకు నా వెంట వచ్చెదవు. తారా! స్నేహితుఁడు చేయవలసిన కార్యము సేసి నాయెడల నీకుగల విశ్వాసమును వ్యక్తపరచితివి.

(౭) నేనుపోయి సుగ్రీవునితో యుద్ధము సేసెదను. నీవు భయపడవలదు. అతని అహంకారమును నడచెదను. అతని ప్రాణమును దీయను.

(౮) యుద్ధరంగములో నుండు సుగ్రీవుని ప్రాణముతీయక అతఁడు కోరునంతవరకుఁ బోరెదను. వృక్షములతోను గుద్దులతోను గొట్టఁబడి పారిపోవును.

(౯) దురాత్ముఁడగు సుగ్రీవుఁడు నా అహంకారమును నా యుద్ధ ప్రయత్నమును సైచలేఁడు. ఓ తారా! నీవు బుద్ధి సహాయమును స్నేహమును నావిషయమై చూపితివి.

(౧౦) నాప్రాణముమీద నేను ఒట్టుపెట్టితిని. నాకు జయము గలుగవలయునని ప్రార్థించి నీవు లోపలపొమ్ము. నేను యుద్ధములో తమ్ముని జయించి వచ్చుచున్నాను.

తం తు తారా పరిష్వజ్య వాలినం ప్రియవాదినీ।
చకార రుదతీ మందం దక్షిణా సా ప్రదక్షిణమ్॥ ౧౧

తత స్స్వ స్త్యయనం కృత్వా మంత్రవ ద్విజయైషిణీ।
అంతఃపురం సహ స్త్రీభిః ప్రవిష్టా శోకమోహితా॥ ౧౨

ప్రవిష్టాయాం తు తారాయాం సహ స్త్రీభి స్స్వమాలయమ్।
నగరా న్నిర్యయౌ క్రుద్ధో మహాసర్పఇవ శ్వసన్॥ ౧౩

స నిశ్శ్వస్య మహాతేజా వాలీ పరమరోషణః।
సర్వత శ్చారయ న్దృష్టిం శత్రుదర్శనకాంక్షయా॥ ౧౪

స దదర్శ తత శ్శ్రీమా న్సుగ్రీవం హేమపింగళమ్।
సుసంవీత మవష్టబ్ధం దీప్యమానమివాఽనలమ్॥ ౧౫

స తం దృష్ట్వా మహావీర్యం సుగ్రీవం పర్యవస్థితమ్।
గాఢం పరిదధే వాసో వాలీ పరమరోషణః॥ ౧౬

స వాలీ గాఢసంవీతో ముష్టి ముద్యమ్య వీర్యవాన్।
సుగ్రీవ మేవాభిముఖో యయౌ యోద్ధుం కృతక్షణః॥ ౧౭

శ్లిష్టముష్టిం సముద్యమ్య సంరబ్ధతరమాగతః।
సుగ్రీవోఽపి త ముద్దిశ్య వాలినం హేమమాలినం॥ ౧౮

(౧౧) ప్రియమైనమాటలు చెప్పినదియు సమర్థురాలును నగుతార వాలిని నాలింగనము సేసికొని యేడ్చుచు అతనికి తిన్నగ ప్రదక్షిణముచేసెను.

(౧౨) పిమ్మట తార వాలికి జయమునుగోరి మంత్రపురస్సరముగ ఆశీర్వదించి దుఃఖించి స్త్రీలతోడ అంతఃపురములోనికిఁ బోయెను.

(౧౩) తార స్త్రీలతోడ అంతఃపురములోఁ బ్రవేశించగా వాలి కోపము గల గొప్పసర్పమువలె బుసగొట్టుచు కిష్కింధనుండి వెలుపల వచ్చెను.

(౧౪) గొప్పతేజస్సు మిగులకోపము గలవాలి బుసగొట్టి శత్రువును జూచుటకై నలుదిక్కులలోను చూపు నిగిడించెను.

(౧౫) పిమ్మట, బంగారువంటి దేహకాంతి గలవాఁడును, నడుముకు బాగుగ వస్త్రము కట్టుకొని యుండువాఁడును, యుద్ధముసేయుటకై భూమిని బాగుగఁ ద్రొక్కుకొని యుండువాఁడును, అగ్నివలెఁ బ్రకాశించుచుండు వాఁడును నగుసుగ్రీవుని శ్రీమంతుఁడగు వాలి చూచెను.

(౧౬) గొప్పపరాక్రమము గలవాఁడును, యుద్ధమునకు సిద్ధముగనుండు వాఁడును నగుసుగ్రీవుని జూచి వాలి మిగులకోపము గలవాఁడై వస్త్రమును బాగుగ నడుమునకు గట్టుకొనెను.

(౧౭) వీర్యవంతుఁడగు వాలి నడుమునకు బాగుగ వస్త్రముగట్టుకొని ఉత్త పిడికిలి పైకెత్తుకొని యుద్ధముచేయుటకు సుగ్రీవుని కభిముఖముగఁ బోయెను.

(౧౮) సుగ్రీవుఁడును బాగుగచేరియుండు పిడికిలి పైకెత్తి బంగారు హారమును ధరించియుండు వాలిని నుద్దేశించి మిగుల త్వరగ యుద్ధమునకు వచ్చెను.

తం వాలీ క్రోధతామ్రాక్షః సుగ్రీవం రణపండితమ్।
ఆపతంతం మహావేగ మిదం వచన మబ్రవీత్॥ ౧౯
ఏష ముష్టి ర్మయా బద్ధో గాఢ స్సన్నిహితాంగుళిః।
మయా వేగవిముక్త స్తే ప్రాణా నాదాయ యాస్యతి॥ ౨౦
ఏవ ముక్త స్తు సుగ్రీవః క్రుద్ధో వాలిన మబ్రవీత్।
తవైవ చాహర న్ప్రాణా న్ముష్టిః పతతు మూర్ధని॥ ౨౧

తాడిత స్తేన సంక్రుద్ధ స్సమభిక్రమ్య వేగితః।
అభవ చ్ఛోణితోద్గారీ సోత్పీడ ఇవ పర్వతః॥ ౨౨
సుగ్రీవేణ తు నిస్సంగం సాల ముత్పాట్య తేజసా।
గాత్రేష్వభిహతో వాలీ వజ్రేణేవ మహాగిరిః॥ ౨౩
స తు వాలీ ప్రచలిత స్సాలతాడనవిహ్వలః।
గురుభారసమాక్రాంతో నౌసార్థ ఇవ సాగరే॥ ౨౪

తౌ భీమబలవిక్రాంతౌ సుపర్ణసమవేగినౌ।
ప్రవృద్ధౌ ఘోరవపుషౌ చంద్రసూర్యావివాంబరే॥ ౨౫
పరస్పర మమిత్రఘ్నౌ ఛిద్రాన్వేషణతత్పరౌ॥ ౨౫ ½
తతో వర్ధత వాలీ తు బలవీర్యసమన్వితః।
సూర్యపుత్రో మహావీర్య స్సుగ్రీవః పరిహీయతే॥ ౨౬ ½

(౧౯) కోపముతో నెఱ్ఱనైనకన్నులు గలవాలి యుద్ధములోఁ బండితుఁడుగను మిగుల వేగముతో వచ్చుచుండువాఁడును నగుసుగ్రీవుని జూచి యిటులనెను.

(౨౦) సుగ్రీవుఁడా! వేళ్లను బాగుగమూసికొని బాగుగఁ బట్టుకొని యుండు యీ పిడికిలితో బొడిచెదను. ఇది నీప్రాణములను అపహరించుకొని పోవును.

(౨౧) ఇటుల వాలి చెప్పగా, సుగ్రీవుఁడు కోపముగలవాఁడై యిటులనెను. నీప్రాణమును దీయునట్టి నా పిడికిలి నీ తలమీఁద పడుచున్నది.

(౨౨) వాలిచేఁ గొట్టఁబడి అందుచే మిగుల కోపముగలిగి ఆతని గొట్టుటకు మిగుల వేగము గలసుగ్రీవుఁడు రక్తముకక్కుచు, సెలయేళ్ళతోఁగూడిన పర్వతమువలె, నుండెను.

(౨౩) సుగ్రీవుఁడతని పరాక్రమముచే నొకసాలవృక్షమును పెల్లగించుకొని, వజ్రాయుధముతో గొప్పపర్వతమును గొట్టునటుల, వాలిని గొట్టెను.

(౨౪) గొప్పభారమును మోయుచుండు ఓడలగుంపు సముద్రములో చలించినటుల, సాలవృక్షము దెబ్బచే విహ్వలుఁడగు వాలి చలించెను.

(౨౫, ౨౬) భయంకరమగు బలపరాక్రమముగలవారును, గరుడునితో సమమైన వేగముగలవారును, భయంకరముగనుండు దేహముగలవారును, పరస్పరము శత్రువులను సంహరించువారును, ఒకరినొకరు చంపుసమయమును జూచుచుండువారును నగువాలిసుగ్రీవులు ఆకాశములో పున్నమచంద్రుఁడు సూర్యుడు వృద్ధియగునటుల వృద్ధియైరి.

(౨౭) పిమ్మట, బలపరాక్రములతోఁగూడిన వాలి యుద్ధములో నభివృద్ధిపొందెను. గొప్పపరాక్రమము గలసూర్యుని పుత్రుఁడగుసుగ్రీవుఁడు తగ్గిపోయెను.

వాలినా భగ్నదర్పస్తు సుగ్రీవో మందవిక్రమః।
వాలినం ప్రతిసామర్షో దర్శయామాస లాఘవమ్॥ ౨౭

వృక్షైస్సశాఖై స్సశిఖై ర్వజ్రకోటినిభై ర్నఖైః।
ముష్టిభి ర్జానుభిః పద్భి ర్బాహుభి శ్చ పునఃపునః॥ ౨౮
తయో ర్యుద్ధ మభూ ద్ఘోరం వృత్రవాసవయో రివ॥ ౨౯

తౌ శోణితాక్తౌ యుధ్యేతాం వానరౌ వనచారిణౌ।
మేఘావివ మహాశబ్దై స్తర్జయానౌ పరస్పరమ్॥ 3౦

హీయమాన మథో పశ్య త్సుగ్రీవం వానరేశ్వరమ్।
వీక్షమాణం దిశశ్చైవ రాఘవ స్స ముహుర్ముహుః॥ 3౧

తతో రామో మహాతేజా ఆర్తం దృష్ట్వా హరీశ్వరమ్।
శరం చ వీక్షతే వీరో వాలినో వధకారణాత్॥ 3౨
తతో ధనుషి సంధాయ శర మాశీవిషోపమమ్।
పూరయామాస తచ్చాపం కాలచక్రమివాంతకః। 33

తస్య జ్యాతలఘోషేణ త్రస్తాః పత్రరథేశ్వరాః।
ప్రదుద్రువు ర్మృగాశ్చైవ యుగాంత ఇవ మోహితాః॥ 3౪

(౨౬) వాలిచే భగ్నముచేయఁబడిన అహంకారము గలసుగ్రీవుఁడు తగ్గినపరాక్రమముగలిగి వాలిమీఁద కోపముగలవాఁడై యుద్ధములో గలలాఘవమును జూపెను.

(౨౭, ౨౮) శాఖలతోఁగూడిన వృక్షములతోను, మొనలతోఁ గూడి వజ్రాయుధమువంటి గోళ్ళతోను, ముష్టిదెబ్బలతోను మోకాళులతోను భుజములతోను పాదములతోను వాలిసుగ్రీవులు, వృత్రాసురునికి ఇంద్రునికి యుద్ధము జరిగినటుల, భయంకరముగ యుద్ధముచేసిరి.

(౩౦) మేఘమువలె గర్జించి ఒకరినొకరు బెదిరించుచుండువారును, వనములో సంచరించువారును నగువాలిసుగ్రీవులు రక్తముతోఁ దడిసి యుద్ధము చేసిరి.

(౩౧) పిమ్మట, బలములో తగ్గిపోవుచు పలుమరు దిక్కులుచూచుచుండు వానర రాజగుసుగ్రీవుని శ్రీరాముఁడు చూచెను.

(౩౨) పిదప, గొప్పతేజస్సుగల వీరుఁడగు రాముఁడు వానరరాజగు సుగ్రీవుఁడు మిగుల దుఃఖించుచున్నాఁడని తెలిసికొని వాలిని జంపుటకై బాణమును జూచెను.

(౩౩) పిమ్మట, సర్పమువంటి బాణమును ధనుసులో సంధానముసేసి, యముఁడు సకలలోకములను జంపుటకై కాలచక్రమును బ్రయోగించునటుల, రాముఁడు ధనుసును చెవివరకు యీడ్చెను.

(౩౪) రాముఁడుఅల్లెత్రాటిని నీడిచి కట్టునపుడు గలిగిన శబ్దమును విని భయమునపడి గొప్పపక్షులు మృగములు, ప్రళయకాలములోఁ బ్రజలు మోహాపడినటుల, దేహముతెలియక పారిపోయినవి.

ముక్త స్తు వజ్రనిర్ఘోషః ప్రదీప్తాశనిసన్నిభః।
రాఘవేణ మహాబాణో వాలివక్షసి పాతితః॥ ౩౫

తత స్తేన మహాతేజా వీర్యోత్సిక్తః కపీశ్వరః।
వేగేనాభిహతో వాలీ నిపపాత మహీతలే॥ ౩౬

ఇంద్రధ్వజ ఇవోద్ధూతః పౌర్ణమాస్యాం మహీతలే।
ఆశ్వయుక్సమయే మాసి గతశ్రీకో విచేతనః॥ ౩౭

నరోత్తమః కాలయుగాంతకోపమం శరోత్తమం కాంచన రూ
ప్య భూషితం। ససర్జ దీప్తం త మమిత్రమర్దనం సధూమమ
గ్నిం ముఖతో యథా హరః॥ ౩౮

అథో క్షిత శ్శోణితతోయవిస్రవైః సుపుష్పితాశోక ఇవా
నలోద్ధతః। విచేతనో వాసవసూను రాహవే విభ్రంశితేంద్ర
ధ్వజవత్క్షితిం గతః॥ ౩౯

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - షోడశస్సర్గః.

## సప్తదశస్సర్గః

తత శ్శరేణాభిహతో రామేణ రణకర్కశః
పపాత సహసా వాలీ నికృత్త ఇవ పాదపః॥ ౧

(౩౪) వజ్రాయుధమువంటి శబ్దముగలదియగను, మిగుల మండుచుండు పిడుగువంటిదియగు నుండు గొప్పబాణమును శ్రీరాముఁడు వాలిరొమ్ముమీద విడిచెను.

(౩౫) పిమ్మట, గొప్పతేజస్సు గలవాఁడును పరాక్రమముచే తుదించియుండువాఁడును కపిరాజును నగువాలి, ఆ బాణము వేగముగవచ్చి తగులగా, భూమిమీఁద పడెను.

(౩౬) వాలి కాంతిహీనుఁడై తెలివితప్పి ఆశ్వీజమాసము పున్నమతిథిలో, ఇంద్రుని ధ్వజమువలె, భూమిమీఁద పడెను.

(౩౭) ప్రళయకాలములో సంహారము చేయునట్టి రుద్రుఁడు పొగతోఁగూడియుండు అగ్నిని ముఖమునుండి వెలుపల విడుచునటుల, నరోత్తముఁడగు శ్రీరాముఁడు యుగప్రళయ మృత్యువుతో సమానమైనదియు, బంగారువెండితో నలంకరింపఁబడి యుండునదియు, ప్రకాశించునదియు, శత్రువుల మర్దించునట్టిదియు, నగు శ్రేష్ఠమైన బాణమును విడిచెను.

(౩౮) పిమ్మట, రక్తమను జలప్రవాహముచేఁ దడుపఁబడి, బాగుగఁబూచియుండు అశోకవృక్షమువలె నుండువాఁడును లేచి మండుచుండు అగ్నివలె నుండువాఁడును, నగు ఇంద్రుని పుత్రుఁడగు వాలి యుద్ధములో మూర్ఛపోయినవాఁడై, తెగిన ఇంద్రుని ధనుస్సువలె, భూమిమీఁద పడెను.

ఇది పదునారవ సర్గ.

## ౧౭ వ సర్గ.

(అవతారిక.— వాలి శ్రీరాముని నిందించుట యీ సర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) పిమ్మట, యుద్ధములోఁ కఠినమైనస్వభావముగలవాలిని శ్రీరాముఁడు బాణముతోఁగొట్టగా, ఛేదింపఁబడిన వృక్షమువలె, అతఁడు భూమిమీఁద పడెను.

స భూమౌ న్యస్తసర్వాంగ స్తప్తకాంచనభూషణః।
అపత ద్దేవరాజస్య ముక్తరశ్మి రివ ధ్వజః॥ ౨
తస్మి న్నిపతితే భూమౌ వానరాణాం గణేశ్వరే।
నష్టచంద్రమివ వ్యోమ నవ్యరాజత భూతలమ్॥ ౩

భూమౌ నిపతితస్యాపి తస్య దేహం మహాత్మనః।
నశ్రీ ర్జహాతి నప్రాణా నతేజో నపరాక్రమః॥ ౪
శక్రదత్తా వరా మాలా కాంచనీ వజ్రభూషితా।
దధార హరిముఖ్యస్య ప్రాణాం స్తేజ శ్శ్రియంచ సా॥ ౫

స తయా మాలయా వీరో హైమయా హరియూథపః।
సంధ్యా నుగత పర్యంతః పయోధరఇవాభవత్॥ ౬
తస్య మాలాచ దేహశ్చ మర్మఘాతీచ య శ్శరః।
త్రిధేవ రచితా లక్ష్మీః పతితస్యాపి శోభతే॥ ౭

తదస్త్రం తస్య వీరస్య స్వర్గ మార్గప్రభావనమ్।
రామబాణాసనక్షిప్త మావహ త్పరమాం గతిమ్॥ ౮
తం తదా పతితం సంఖ్యే గతార్చిష మివానలమ్।
బహుమాన్యచ తం వీరం వీక్షమాణౌ శనై రివ॥ ౯

(౨) భూమిమీద పడియుండు సకల అవయవములు గలవాఁడును, పుటము వేసిన బంగారు ఆభరణములు గలవాఁడును, నగు వాలి, త్రాడు తెగిన ఇంద్రుని ధ్వజమువలె, క్రిందపడెను.

(౩) వానరమూకకు రాజగు వాలి భూమిమీద పడగా, చంద్రుఁడు లేక ఆకాశ మెటుల ప్రకాశించదో, అటుల భూమి ప్రకాశించలేదు.

(౪) మహాత్ముఁడగు వాలి భూమిమీద పడియుండినను అతని దేహమును కాంతి ప్రాణములు వీర్యము పరాక్రమము విడిచిపోలేదు.

(౫) ఇంద్రుఁడిచ్చిన వజ్రములుపొదిగియుండు బంగారుహారము వానర శ్రేష్ఠుఁడగు వాలి ప్రాణమును పరాక్రమమును కాంతిని నిలిపియుంచెను.

(౬) వీరుఁడును వానరసేనాధిపతియును ఇంద్రుఁడిచ్చిన బంగారు హారమును ధరించినవాఁడును నగు వాలి, సంధ్యారాగము చుట్టుచుట్టుకొనియుండు మేఘమువలె, ప్రకాశించెను.

(౭) వాలి భూమిమీద పడియుండినను అతఁడు ధరించియుండిన బంగారుహారము అతని దేహము అతని ప్రేగులను చెండినబాణము, మూఁడు భాగములుగ నుండు తేజస్సులవలెఁ, బ్రకాశించినవి.

(౮) స్వర్గమును గలిగించునట్టిదియు, రాముని ధనుసునుండి విడువఁబడినదియు నగుబాణము ఉత్తమమైన పదవిని వీరుఁడగు వాలికి యిచ్చినది.

(౯) జ్వాలలేనినిప్పువలె నుండువాఁడును, యుద్ధములో వీరుఁడగు రాముఁడు మంచిబాణమును బ్రయోగించెనని శ్లాఘించి అతఁడెక్కడ అని మిగుల శ్రమతో తిన్నతిన్నగఁ జూచుచుండువాఁడును,

యయాతి మివ పుణ్యాంతే దేవలోకా త్పరిచ్యుతమ్।
ఆదిత్యమివ కాలేన యుగాంతే భువి పాతితమ్॥ ౧౦

మహేంద్రమివ దుర్ధర్షం మహేంద్రమివ దుస్సహమ్
మహేంద్రపుత్రం పతితం వాలినం హేమమాలినమ్॥ ౧౧

సింహోరస్కం మహాబాహుం దీప్తాస్యం హరిలోచనమ్।
లక్ష్మణానుగతో రామో దదర్శోపససర్ప చ॥ ౧౨

తం దృష్ట్వా రాఘవం వాలీ లక్ష్మణంచ మహాబలమ్।
అబ్రవీ త్ప్రశ్రితం వాక్యం పరుషం ధర్మసంహితమ్॥ ౧౩

త్వం నరాధిపతేః పుత్రః ప్రథితః ప్రియదర్శనః।
కులీన స్సత్త్వసంపన్న స్తేజస్వీ చరితవ్రతః॥ ౧౪
పరాఙ్ముఖవధం కృత్వా కోను ప్రాప్త స్త్వయా గుణః।
యదహం యుద్ధసంరబ్ధ శ్శరేణోరసి తాడితః॥ ౧౫

రామః కరుణవేదీచ ప్రజానాంచ హితే రతః।
సానుక్రోశో జితోత్సాహ స్సమయజ్ఞో దృఢవ్రతః॥ ౧౬
ఇతి తే సర్వభూతాని కథయంతి యశో భువి॥ ౧౬½

(౧౦) పుణ్యము నాశమైనందున స్వర్గలోకమునుండి పడిన యయాతివలె నుండువాడును, ప్రళయకాలములో దైవగతివల్ల భూమిమీద పడిన సూర్యునివలె నుండువాడును,

(౧౧,౧౨) ఇంద్రునివలె తిరస్కరించుటకును నెదుటపోయి నిలుచుటకును సాధ్యముకాని వాడును, ఇంద్రుని పుత్రుడును, బంగారుహారము ధరించినవాడును, సింహమువలె విశాలమైన రొమ్ముగలవాడును, గొప్ప భుజములు గలవాడును, వెలుంగుచుండు ముఖము గలవాడును, పసపురంగు గలకన్నులు గలవాడును, నగు భూమిమీదపడియుండు వాలిని లక్ష్మణునితోడ రాముడు చూచి అతని సమీపమునకుఁ బోయెను.

(౧౩) శ్రీరాముని గొప్పబలము గల లక్ష్మణుని వాలిచూచి కఠినముగను ధర్మముతో గూడి వినయముగను నుండు మాటను జెప్పెను.

(౧౪) ఓ రామా! నీవు దశరథుని పుత్రుడవు. ప్రసిద్ధుడవు. శాస్త్రములలో రుచిగలవాడవు. మంచికులములో బుట్టినవాడవు. సత్యగుణ సంపన్నుడవు. వ్రతానుష్ఠానము గలవాడవు.

(౧౫) నీవు యింకొకనితో యుద్ధము సేయుచుండునన్ను వధించి యెట్టి గౌరవమును బడసితివి? ఏలననఁగా, నేను యుద్ధపరవశుఁడనుగ నుంటిని. ఇట్టి నన్ను బాణముతో రొమ్ములోఁ గొట్టితివి.

(౧౬,౧౭) రాముఁడు కరుణను దెలిసికొనినవాఁడు, ప్రజలకు హితము సేయుటలో ఆశక్తిగలవాఁడు, దయగలవాఁడు, ఉత్సాహమును తన స్వాధీనములో నుంచుకొని యుండువాఁడు, పెద్దల ఆచారమును నెరింగినవాఁడు, స్థిరమైన వ్రతముగలవాఁడు అని అందరు నీ కీర్తిని బొగడుచున్నారు.

దమ శ్శమః క్షమా ధర్మో ధృతి స్సత్యం పరాక్రమః।
పార్థివానాం గుణా రాజన్ దండశ్చా ప్యపరాధిషు॥ ౧౭
తా న్గుణా న్సంప్రధార్యాహ మగ్ర్యం చాభిజనం తవ।
తారయా ప్రతిషిద్ధోఽపి సుగ్రీవేణ సమాగతః॥ ౧౮
నమా మన్యేన సంరబ్ధం ప్రమత్తం యోద్ధు మర్హతి।
ఇతి మే బుద్ధి రుత్పన్నా బభూవాదర్శనే తవ॥ ౧౯
నత్వాం వినిహతాత్మానం ధర్మధ్వజ మధార్మికమ్।
జానే పాపసమాచారం తృణైః కూప మివావృతమ్॥ ౨౦
సతాం వేషధరం పాపం ప్రచ్ఛన్న మివ పావకమ్।
నాహం త్వా మభిజానామి ధర్మచ్ఛద్మాభిసంవృతమ్॥ ౨౧
విషయే వా పురే వా తే యదా నాపకరోమ్యహమ్।
నచ త్వా మవజానే చ కస్మా త్త్వం హంస్యకిల్బిషమ్॥ ౨౨
ఫలమూలాశనం నిత్యం వానరంవనగోచరమ్।
మా మిహాప్రతియుధ్యంత మన్యేనచ సమాగతమ్॥ ౨౩
లింగమప్యస్తి తే రాజన్ దృశ్యతే ధర్మసంహితమ్।
కః క్షత్రియకులే జాత శ్శ్రుతవా న్నష్టసంశయః॥ ౨౪
ధర్మలింగప్రతిచ్ఛన్నః క్రూరం కర్మ సమాచరేత్॥ ౨౫

(౧౭౫) ఓ రాజా! ఇంద్రియ నిగ్రహము చిత్తప్రశాంతి ఓర్పు ధర్మము ధైర్యము సత్యము పరాక్రమము అపరాధులను దండించుట యనియన్నియును రాజు కుండవలసిన గుణములు.

(౧౮౫) ఇట్టి గుణములను నీగొప్పకులమును బాగుగఁ దెలిసికొని తార నన్ను అడ్డగించినను సుగ్రీవునితో యుద్ధమునకు తలపడితిని.

(౧౯౫) ఇంకొకనితో యుద్ధము చేయుచుండు నన్ను రాముఁడు వధించఁడు అని, రామా! నిన్ను చూడకముందు నాకుఁ దోఁచియుండెను.

(౨౦౫) కసవుతోఁ గప్పఁబడిన బావివలె నుండువాఁడుగను, కొంచెమైనను తెలివిలేనివాఁడుగను, ధర్మాత్ముఁడని వట్టి పేరుపెట్టుకొని యుండువాఁడుగను అధార్మికుఁడుగను పాపాత్ముఁడుగను, నీవు ఉండునటుల యింతవరకు నాకు తెలియకపోయెను.

(౨౧౫) సత్పురుషుఁడని వేషముధరించి యుండువాఁడును, పాపిష్ఠుడును, బూడిదెకప్పిన నిప్పువలె నుండువాఁడును, ధర్మమును నెపముగలవాఁడును నగు నిన్ను తెలిసికొనలేకపోతిని,

(౨౨౫, ౨౩౫) నీ దేశములోగాని నీ పట్టణములోగాని నేనెవరికిని అపకారము సేయలేదు. నీకును అవమానము గలిగించలేదు. నిర్దోషియు సదాఫలములు గడ్డలు భుజించువాఁడును వానరుఁడును వనములో సంచరించువాఁడును నీతో యుద్ధము సేయనివాఁడును, ఇంకొకనితోఁబోరుచుండువాఁడును నగు నన్నేల చంపితివి.

(౨౪౫, ౨౫) ఓరాజా! అధర్మముతోఁగూడిన ఆచారము నీవద్దఉన్నదని తెలిసినది. క్షత్రియకులములలోఁ బుట్టినవాఁడును పెద్దలద్వారా విశేషార్థములు విన్నవాఁడును సంశయము లేనట్టివాఁడును ధర్మాత్ముఁడని పేరుపెట్టుకొనిన వాఁడెవఁడును నిట్టి క్రూరమైన పనిచేయఁడు.

రామ రాజకులే జాతో ధర్మవానితి విశ్రుతః।
అభవ్యో భవ్యరూపేణ కిమర్థం పరిధావసి॥ ౨౬

సామ దానం క్షమా ధర్మ స్సత్యం ధృతిపరాక్రమౌ।
పార్థివానాం గుణా రాజన్ దండశ్చాప్యపరాధిషు॥ ౨౭

వయం వనచరా రామ మృగా మూలఫలాశనాః।
ఏషా ప్రకృతి రస్మాకం పురుష స్త్వం నరేశ్వరః॥ ౨౮

భూమి ర్హిరణ్యం రూప్యంచ నిగ్రహే కారణానిచ।
అత్ర క స్తే వనే లోభో మదీయేషు ఫలేషు వా॥ ౨౯

నయశ్చ వినయశ్చోభౌ నిగ్రహానుగ్రహావపి।
రాజవృత్తి రసంకీర్ణా న నృపాః కామవృత్తయః॥ ౩౦

త్వంతు కామప్రధానశ్చ కోపనశ్చానవస్థితః।
రాజవృత్తైశ్చ సంకీర్ణ శ్శరాసనపరాయణః॥ ౩౧

(౨౬) ఓ రామా! రాజవంశములోఁ బుట్టితివి. ధర్మాత్ముఁడని ప్రసిద్ధి పొందితివి. క్రూరచిత్తుఁడుగ నున్నావు. సౌమ్యమైన వేషముతో నెందుకు సంచరించెదవు.

(౨౭) సామము దానము క్షమ ధర్మము సత్యము ధైర్యము పరాక్రమము అపరాధులను దండించుట, ఓరాజా! ఇవి రాజుల గుణములు.

(౨౮) (అవతారిక.— లోకములో నొకని వధించుటకు అతని అపరాధము, లేక. అతని ధనమపహరించుటలో కోరిక, కారణములుగ నుండును ) ఓ రామా! మేము వనచరులము (మీరు పురములో నుండువారు). మేము మృగములము (మీరు మనుష్యులు), మేముమూలములను ఫలములను తినువారము (మీరు రాజాన్నము భుజించువారు), మేము పరిచారకులము (మీరు ప్రభువులు), మా స్వభావమిట్టిది, కనుక నే మీకేమియు అపరాధము నేను చేయలేదు.

(౨౯) భూమి బంగారము వెండి యీ మూడును కలహమునకు కారణముగ నున్నవి. అరణ్యములోగాని మేముభుజించు పండ్లలోగాని నీకేమి యిచ్ఛ గలదు. (కనుక, నాధనమును నపేక్షించి నన్ను చంపినటుల విశదపడలేదు.)

(౩౦) మంచి నీతి అనుగ్రహము మంచిరాజుకు ఉండవలసిన ధర్మములు. అనీతి నిగ్రహము దుష్టుఁడగు రాజుయొక్క ధర్మములు. రాజనీతి యిట్టిదని గ్రహించవలయును. దీనిగ్రహించని రాజులు స్వేచ్ఛాప్రవర్తకులుగనుందురు. రాజు తనబుద్ధినే నమ్మి న్యాయాన్యాయము నిగ్రహానుగ్రహములు చేయరాదు.

(౩౧) నీవు కామమే ప్రధానముగ గలవాఁడవు, కోపము గలవాఁడవు, మర్యాదలేనివాఁడవు, పరిశుద్ధమైన రాజనడవడి లేనివాఁడవు, కేవలము ధనుస్సును ధరించియుండు వాఁడవు. (అనఁగా, యుక్తాయుక్తములు విచారించక తలఁచినవారిని జంపుచున్నావని భావము.)

నతే స్త్వ్యపచితో ధర్మే నార్థే బుద్ధి రవస్థితా।
ఇంద్రియైః కామవృత్తస్సన్ కృష్యసే మనుజేశ్వర॥ ౩౨
హత్వా బాణేన కాకుత్స్థ మా మిహానపరాధినమ్।
కిం వక్ష్యసి సతాం మధ్యే కర్మ కృత్వా జుగుప్సితమ్॥ ౩౩

రాజహా బ్రహ్మహా గోఘ్న శ్చోరః ప్రాణివధే రతః।
నాస్తికః పరివేత్తాచ సర్వే నిరయగామినః॥ ౩౪
సూచకశ్చ కదర్యశ్చ మిత్రఘ్నో గురుతల్పగః।
లోకం పాపాత్మనా మేతే గచ్ఛంతే నాత్ర సంశయః॥ ౩౫

అధార్యం చర్మ మే సద్భి రోమాణ్యస్థిచ వర్జితమ్।
అభక్ష్యాణి చ మాంసాని త్వద్విధై ర్ధర్మచారిభిః॥ ౩౬
పంచ పంచనఖా భక్ష్యా బ్రహ్మక్షత్రేణ రాఘవ।
శల్యకః శ్వావిధో గోధా శశః కూర్మశ్చ పంచమః॥ ౩౭

చర్మ చాస్థిచ మే రాజన్ నస్పృశంతి మనీషిణః।
అభక్ష్యాణిచ మాంసాని సోహం పంచనఖో హతః॥ ౩౮
తారయా వాక్య ముక్తోఽహం సత్యం సర్వజ్ఞయా హితమ్।
తదతిక్రమ్య మోహేన కాలస్య వశ మాగతః॥ ౩౯

(౩౨) ధర్మములో నీకు శ్రద్ధలేదు. ద్రవ్యమును సంపాదించుటలో నీకు వ్యవస్థలేదు. ఓ మనుజేశ్వరా! కాముకుడవై యింద్రియములు యీడిచినటుల పోవుచున్నావు.

(33) ఓరామా! నిరపరాధిగనుండు నన్ను బాణముతోఁ జంపిన పాపకార్యముచేసి, సత్పురుషులమధ్య నెట్టి సమాధానము చెప్పఁగలవు.

(౩౪) రాజును జంపినవాఁడు బ్రహ్మహత్య గోహత్యలు చేసినవాఁడు దొంగిలించినవాఁడు జీవహింస చేయువాడు నాస్తికుఁడు అన్నవమునందు పెండ్లిచేసికొనిన తమ్ముఁడు వీరందరు నరకమునకుఁ బోదురు.

(౩౫) కృత్రిమ స్వభావముగలవాఁడు లోభి మిత్రహింసచేయువాఁడు గురుపత్నీగమనము చేయువాఁడు వీరందరు పాపులుండు లోకమునకుఁ బోదురు. ఇందుకు సందేహములేదు.

(౩౬) సత్పురుషులు పులితోలు జింకతోలు ధరించునటుల నాచర్మమును నుపయోగించరు. చమరాది మృగముల రోమములవలె నారోమము లుపయోగపడవు. ఏనుఁగు అస్థులవలె నాయస్థులను తాకనైనను తాకరు. నీవంటి ధర్మాత్ములు నామాంసమును తినరు.

(౩౭) ౫ గోళ్ళుగల జంతువులలో యేదుపంది ముండ్లపంది ఉడుము కుందేలు తాబేలు వీనిమాత్రము బ్రాహ్మణులు క్షత్రియులు భుజించవచ్చును.

(౩౮) ఓ రాజా! విద్వాంసులు నాచర్మమును యెముకలను ముట్టరు నామాంసము తినందగినది కాదు. తినుటకు తగని ౫ గోళ్ళుగల జంతువులలోఁ జేరిన నన్ను జంపితివి.

(౩౯) సర్వజ్ఞురాలగు తార సత్యముగనుండు హితమును నాకుఁ దెలిపెను. తెలివితక్కువచే ఆహితమును వినక యమునికి వశమైతిని,

త్వయా నాథేన కాకుత్స్థ న సనాథా వసుంధరా।
ప్రమదా శీలసంపన్నా ధూర్తేన పతినా యథా॥ ౪౦
శఠో నైకృతికః క్షుద్రో మిథ్యాప్రశ్రితమానసః।
కథం దశరథేన త్వం జాతః పాపో మహాత్మనా॥ ౪౧
ఛిన్నచారిత్రకక్ష్యేణ సతాం ధర్మాతివర్తినా।
త్యక్తధర్మాంకుశేనాహం నిహతో రామహస్తినా॥ ౪౨
అశుభం చాప్యయుక్తం చ సతాం చైవ విగర్హితమ్।
వక్ష్యసే చేదృశం కృత్వా సద్భి స్సహ సమాగతః॥ ౪౩
ఉదాసీనేషు యోఽస్మాసు విక్రమస్తే ప్రకాశితః।
అపకారిషు తం రాజ న్నహి పశ్యామి విక్రమమ్॥ ౪౪
దృశ్యమానస్తు యుధ్యేథా మయా యది నృపాత్మజ।
అస్య వైవస్వతం దేవం పశ్యే స్త్వం నిహతో మయా॥ ౪౫
త్వయా దృశ్యేన తు రణే నిహతోఽహం దురాసదః।
ప్రసుప్తః పన్నగేనేవ నరః పానవశంగతః॥ ౪౬
మామేవ యది పూర్వం త్వ మేతదర్థ మచోదయః।
మైథిలీ మహ మేకాహ్నా తవచానీతవా న్భవేత్॥ ౪౭
సుగ్రీవ ప్రియకామేన యత్కృతేఽస్మి హత స్త్వయా।
కంఠే బద్ధ్వా ప్రదద్యాం తే నిహతం రావణం రణే॥ ౪౮

(౪౦) ధూర్తుఁడగు పతిని బడసి సత్స్వభావ సంపన్నురాలగు స్త్రీ శోభిపదనటుల, ఓరామా! నిన్ను రాజుగ బడసి భూమి అనాథగనే యున్నది.

(౪౧) లోభముగనుండి అహితముసేయువాఁడును, అపకారము సేసి జీవించువాఁడును, నీచకార్యములు సేయువాఁడును, కపటముగ శాంతచిత్తుఁడవు గనుండువాఁడును పాపియును నగునీవు మహాత్ముఁడగు దశరథుని కెటుల పుట్టఁబుట్టితివి.

(౪౨) తెంచుకొనియుండు సత్ చరిత్రమను దారము గలదియు, సత్పురుషుల నర్మమనుయెల్లను నతిక్రమించినదియు, త్యజించియుండు ధర్మమను అంకుశముగలదియు నగురాముఁడను యేనుఁగు నన్నుజంపినది.

(౪౩) అమంగళముగను అయుక్తముగను సత్పురుషులచే నిందితముగను నుండు కార్యము సేసిననీవు సత్పురుషుల మధ్యలో నేమిసమాధానము చెప్పెదవు.

(౪౪) నిరపరాధులుగనుండు మామీఁద నీ పరాక్రమమును జూపితివి. అపరాధము చేసినవారిమీఁద నీవు అట్టిపరాక్రమమును జూపినది నేను చూడలేదు.

(౪౫) ఓరాజపుత్రుఁడా! యెదుట నిలిచి నీవు యుద్ధము చేసియుండినటులైతే, నాచేఁ జంపఁబడి యిప్పుడే యముని జూచి యుందువు.

(౪౬) త్రాగి దేహము తెలియక పడియుండువాని పాము గరచి చంపినటుల నీవు అగుపడక చాటుననుండి, చంపుటకు సాధ్యముగాని, నన్ను చంపితివి.

(౪౭) నీవు నన్ను చంపకమునుపు సీత విషయమును తెలిపినటులైతే ఒకదినములోనే నాపెను తెచ్చియిచ్చియుందును.

(౪౮) సుగ్రీవునికి మేలుసేయవలయునని కోరుచుండు నీవు రావణుని నిమిత్తముగ నన్ను చంపితివి. యుద్ధములో రావణుని జంపి అతని మెడకుగట్టుకొని తెచ్చి నీకు యిచ్చియుందును.

న్యస్తాం సాగరతోయే వా పాతాళే వాపి మైధిలీమ్।
ఆనయేయం తవాదేశా చ్ఛ్వేతా మశ్వతరీ మివ॥ ౪౯

యుక్తం యత్ప్రాప్నుయా ద్రాజ్యం సుగ్రీవ స్స్వర్గతే మయి।
అయుక్తం య దధర్మేణ త్వయాఽహం నిహతో రణే॥ ౫౦

కామ మేవంవిధో లోకః కాలేన వినియుజ్యతే।
క్షమం చే ద్భవతా ప్రాప్త ముత్తరం సాధు చింత్యతామ్॥ ౫౧

ఇత్యేవ ముక్త్వా పరిశుష్కవక్త్ర శ్శరాభిఘాతా ద్వ్యథితో మ
హాత్మా। సమీక్ష్య రామం రవిసన్నికాశం తూష్ణీం బభూవా
మరరాజసూనుః॥ ౫౨

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - సప్తదశస్సర్గః

## అష్టాదశస్సర్గః.

ఇత్యుక్తః ప్రశ్రితం వాక్యం ధర్మార్థసహితం హితమ్।
పరుషం వాలినా రామో నిహతేన విచేతసా॥ ౧
తం నిష్ప్రభ మివాదిత్యం ముక్తతోయ మివాంబుదమ్।
ఉక్తవాక్యం హరిశ్రేష్ఠ ముపశాంత మివానలమ్॥ ౨

(౪౯) మధుకైటభులు వేదములను తెల్ల గుఱ్ఱముపిల్లగమార్చి పాతాళలోకములోఁ గట్టియుంచగా వీరిని విష్ణువుచంపి అశ్వరూపముగనుండు వేదములను దెచ్చినటుల, ఓరామా? నీయాజ్ఞచే సముద్రములోనైనను పాతాళములోనైనను నుండు సీతను తీసికొని రాగలను.

(౫౦) సుగ్రీవుఁడు నన్ను యుద్ధములోఁ జంపి రాజ్యమును బడయుట యుక్తమేను. నీవు నన్ను చంపినదిమాత్రము యుక్తముకాదు.

(౫౧) దైవము మరణావస్థతోడ జనులను జేర్చుచున్నాఁడు. (అనఁగా పుట్టినవానిక మరణము నిజమనుట.) కన్నులకు కనుపడక ఉండి నన్ను జంపినది యుక్తముగ నున్నదాయని నీవు ఆలోచించవలయును.

(౫౨) మిగుల యెండిన నోరుగలవాఁడును, బాణము దెబ్బచే దుఃఖించుచుండువాఁడును, గొప్పధీరుఁడును ఇంద్రుని కొడుకును నగువాలి సూర్యునివలె వెలుంగుచుండు శ్రీరాముని జూచి యిట్లుచెప్పి ఊరకుండెను.

ఇది పదునేడవ సర్గ.

౧౮ వ సర్గ.

(అవతారిక.— వాలి నిందించినందుకు రాముఁడతనికి సమాధానము చెప్పుట యీసర్గములోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) రాముని బాణముచేఁగొట్టఁబడినవాఁడును తెలివిలేనివాఁడును నగు వాలి ధర్మార్థముతోఁ గూడి హితముగను కఠినముగను నుండు మాటలు చెప్పగా రాముఁడు వినెను.

(౨,౩) కాంతిలేని సూర్యునివలెను జలములేని మేఘము వలెను చల్లారిన నిప్పువలెను నుండువాఁడును, వానర శ్రేష్ఠుఁడును నగు వాలిని జూచి, అప్పుడు,

ధర్మార్థగుణసంపన్నం హరీశ్వర మనుత్తమమ్।
అధిక్షిప్త స్తదా రామః పశ్చా ద్వాలిన మబ్రవీత్॥ ౩

ధర్మ మర్థంచ కామంచ సమయం చాపి లౌకికమ్।
అవిజ్ఞాయ కథం బాల్యా న్మా మిహాద్య విగర్హసే॥ ౪

అపృష్ట్వా బుద్ధిసంపన్నా న్వృద్ధా నాచార్యసమ్మతాన్।
సౌమ్య వానర చాపల్యా త్త్వం మాం వక్తు మిహేచ్ఛసి॥ ౫

ఇక్ష్వాకూణా మియం భూమి స్సశైలవనకాననా।
మృగపక్షిమనుష్యాణాం నిగ్రహప్రగ్రహావపి॥ ౬

తాం పాలయతి ధర్మాత్మా భరత స్సత్యవాగృజుః।
ధర్మకామార్థతత్త్వజ్ఞో నిగ్రహానుగ్రహేరతః॥ ౭

నయశ్చ వినయ శ్చోభౌ యస్మి న్సత్యంచ సుస్థితమ్।
విక్రమశ్చ యథాదృష్ట స్స రాజా దేశకాలవిత్॥ ౮

తస్య ధర్మకృతాదేశా వయ మన్యేచ పార్థివాః।
చరామో వసుధాం కృత్స్నాం ధర్మసంతాన మిచ్ఛవః॥ ౯

తస్మి న్నృపతిశార్దూలే భరతే ధర్మవత్సలే।
పాలయత్యఖిలాం భూమిం క శ్చరే ద్ధర్మనిగ్రహమ్॥ ౧౦

ముందుగ వాలిచే ధిక్కరింపఁబడిన రాముఁడు ధర్మార్థములతోఁ గూడి యుత్తమ మగు మాటను జెప్పెను.

(౪) ధర్మార్థ కామముల స్వరూపమును లౌకికమైన శిష్టుల ఆచారమును అజ్ఞానముచే తెలిసికొనలేక యిట్లు నన్ను నీవు నిందించుచున్నావు.

(౫) బుద్ధిమంతులును జ్ఞానవృద్ధులును, ఆచార్యులుగ మేమంగీకరించిన పెద్దలకద్ద ధర్మాది స్వరూపములను దెలిసికొనక, ఓసౌమ్యుఁడా! వానరత్వముచే గలిగిన బుద్ధిచపలతచే నన్నేల యిటుల నిందించితివి.

(౬) కొండలతోను అరణ్యములతోను గూడిన యీ భూమి ఇక్ష్వాకు వంశములోఁ బుట్టినరాజులది. మృగములను,పక్షులను మనుష్యులను నిగ్రహించుట అనుగ్రహించుట వారికార్యమేను.

(౭) సత్యము పలుకువాఁడును ఋజుస్వభావము గలవాఁడును ధర్మాత్ముఁడును నగు భరతుఁడు రాజ్యమును నేలుచున్నాఁడు. అతఁడు ధర్మకామార్థముల స్వరూపమును నెఱింగి ప్రజలను నిగ్రహించుటలోను అనుగ్రహించుటలోను ఆసక్తిగలవాఁడై యున్నాఁడు.

(౮) నీతి వినయము సత్యము పరాక్రమము రెవనియెడల స్థిరముగ నుండునో అట్టిరాజే దేశకాలముల స్వభావమును నెఱింగినవాఁడు.

(౯) ధర్మాధర్మములను దెలిసికొనుటకై అతని అనుమతిని బొందిన మేము మఱికొందఱురాజులు ధర్మాభివృద్ధిని గోరినవారమై భూమిలో నంతయు సంచరించుచున్నాము.

(౧౦) ధర్మములో మిగుల ప్రీతిగలవాఁడును రాజశ్రేష్ఠుఁడును నగుభరతుఁడు భూమినంతయు పాలించుచుండగా అధర్మమును నెవఁడు సేయును.

తే వయం ధర్మవిభ్రష్టం స్వధర్మే పరమే స్థితాః।
భరతాజ్ఞాం పురస్కృత్య నిగృహ్ణీమో యథావిధి॥ ౧౧

త్వంతు సంక్లిష్టధర్మాచ కర్మణాచ విగర్హితః।
కామతంత్రప్రధానశ్చ న స్థితో రాజవర్త్మని॥ ౧౨
జ్యేష్ఠో భ్రాతా పితా చైవ యశ్చ విద్యాం ప్రయచ్ఛతి।
త్రయ స్తే పితరో జ్ఞేయా ధర్మ్యే పథి హి వర్తినః॥ ౧౩

యవీయా నాత్మనః పుత్రః శిష్యశ్చాపి గుణోదితః।
పుత్రవ త్తే త్రయ శ్చింత్యా ధర్మ శ్చేదత్ర కారణమ్॥ ౧౪
సూక్ష్మః పరమదుర్జ్ఞేయ స్సతాం ధర్మః ప్లవంగమ।
హృదిస్థ స్సర్వభూతానా మాత్మా వేద శుభాశుభమ్॥ ౧౫
చపల శ్చపలై స్సార్థం వానరై రకృతాత్మభిః।
జాత్యంధఇవ జాత్యంధై ర్మంత్రయన్ ద్రక్ష్యసే ను కిమ్॥ ౧౬

అహంతు వ్యక్తతా మస్య వచనస్య బ్రవీమి తే।
నహి మాం కేవలం రోషా త్త్వం విగర్హితు మర్హసి॥ ౧౭
తదేతత్కారణం పశ్య యదర్థం త్వం మయా హతః।
భ్రాతు ర్వర్తసి భార్యాయాం త్యక్త్వా ధర్మం సనాతనమ్॥ ౧౮

(౧౧) ఉత్తమమగు స్వధర్మానుష్ఠానములోనుండు మేము ధర్మమును విడిచినవాని, భరతుని ఆజ్ఞను ముందుగనుంచుకొని, శాస్త్రోక్త పరిహారముగ నిగ్రహించుచున్నాము.

(౧౨) నీవు అధర్మప్రవర్తకుఁడవు. అకృత్యమును జేయుచున్నావు. కామమే ప్రధానముగగలవాఁడవై రాజమార్గములో నుండలేవు.

(౧౩) జ్యేష్ఠభ్రాతను తండ్రిని విద్యాప్రదానము చేసిన ఆచార్యుని యీ ముగ్గురిని, ధర్మమార్గములోనుండువాఁడు, తండ్రులుగ భావించవలయును.

(౧౪) గుణవంతుఁడగుతమ్ముని తనకొడుకును శిష్యుని యీముగ్గురిని, ధర్మము నెరింగినవారు, తమ బిడ్డలుగ భావింతురు.

(౧౫) వానరుఁడా! ధర్మము ఇంద్రియములకు గోచరము కానట్టిది. అందువల్లనే పెద్దలచేతను తెలిసికొనుటకు సాధ్యము కాదు. (అనఁగా, నీవంటివానికది యెటుల తెలియును.) లేక, ప్రజలుచేయు ధర్మాధర్మము లెవరికిని తెలియవు. సర్వభూతముల హృదయములో లీనమైయుండు పరమాత్మకే యిది విశదపడుచున్నది. (ధర్మసూక్ష్మము పరమాత్మయగు నాకుతప్ప యింకొకరికి తెలియదు.)

(౧౬) చపలచిత్తులును ఆత్మజ్ఞానములేనివారును నగు వానరులతోఁగూడి తెలివిలేనివాఁడవుగ నున్నావు. పుట్టుగుడ్డివాండ్రతోఁజేరి ఆలోచించిన పుట్టుగుడ్డివానివలె యేమియుఁ దెలిసికొనలేక ఉన్నావు.

(౧౭) ముందుచెప్పిన వచనములకు నీకు వ్యక్తముగ అర్థము దెలుపుచున్నాను. కేవలమురోషముతో నీవు నన్ను నిందించుట తగదు.

(౧౮) పురాతన మగుధర్మమును నతిక్రమించి తమ్ముని భార్యతో భోగించుచున్నావు. కనుకనే నిన్ను నేను జంపితిని. తెలిసికొనుము.

అస్య త్వం ధరమాణస్య సుగ్రీవస్య మహాత్మనః।
రుమాయాం వర్తసే కామాత్ స్నుషాయాం పాపకర్మకృత్॥
తద్వ్యతీతస్య తే ధర్మాత్ కామవృత్తస్య వానర।
భ్రాతృభార్యావమర్శేఽస్మిన్ దండోఽయం ప్రతిపాదితః॥ ౨౦
నహి ధర్మవిరుద్ధస్య లోకవృత్తాదపేయుషః।
దండాదన్యత్ర పశ్యామి నిగ్రహం హరియూథప॥ ౨౧

నహి తే మర్షయే పాపం క్షత్రియోఽహం కులోద్భవః॥ ౨౧½
ఔరసీం భగినీం వాపి భార్యాం వాప్యనుజస్య యః।
ప్రచరేత నరః కామాత్తస్య దండో వధః స్మృతః॥ ౨౨½
భరతస్తు మహీపాలో వయం త్వాదేశవర్తినః।
త్వం తు ధర్మాదతిక్రాంతః కథం శక్య ఉపేక్షితుమ్॥ ౨౩½
గురుర్ధర్మవ్యతిక్రాంతం ప్రాజ్ఞో ధర్మేణ పాలయన్।
భరతః కామవృత్తానాం నిగ్రహే పర్యవస్థితః॥ ౨౪½

వయంతు భరతాదేశవిధిం కృత్వా హరీశ్వర।
త్వద్విధాన్ భిన్నమర్యాదాన్ నియంతుం పర్యవస్థితాః॥ ౨౫½
సుగ్రీవేణ చ మే సఖ్యం లక్ష్మణేన యథా తథా।
దారరాజ్యనిమిత్తంచ నిశ్శ్రేయసి రతస్సమే॥ ౨౬½

(౧౯) మహాత్ముఁడగు సుగ్రీవుఁడు జీవించియుండఁగా నీకు కోడలుఁగ నుండు రుమతో కామాతురుఁడవై పాపకార్యము చేయుచున్నావు.

(౨౦) ఓవానరుఁడా! ధర్మమార్గమును విడిచి కామపరతంత్రుఁడవై తమ్ముని భార్యతో భోగించుచుండు నిన్ను వధించుట ధర్మమేను.

(౨౧) వానరరాజా! ధర్మమార్గమునకువిరోధమై లోకాచారమును విడిచియుండు వాని వధించుటకంటె యింకొక శిక్షలేదు.

(౨౧½) మంచికులములోఁ బుట్టినక్షత్రియుఁడుగ నుండు నేను నీవు చేసిన పాపకార్యమును సైచను.

(౨౨½) కూతురు తోఁబుట్టువు తమ్మునిభార్య వీరితోఁ గామాతురుఁడై భోగించిన వాని వధించవలయునని శాస్త్రము చెప్పుచున్నది.

(౨౩½) భరతుఁడు రాజుగనున్నాఁడు. అతని ఆజ్ఞలో మేము ఉన్నాము. ధర్మమార్గమును విడిచియుండు నిన్ను మేముఉపేక్షించి విడుచుట తగదు.

(౨౪½) గురువుగను ప్రాజ్ఞుఁడుగను నుండుభరతుఁడు ధర్మముతో రాజ్యమును బరిపాలించుచు ధర్మమును నతిక్రమించిన వాని దెలిసికొని, అట్టి కామాతురులను నిగ్రహించుచున్నాఁడు.

(౨౫½) మేము భరతునినాజ్ఞను శాస్త్రముగ భావించి, ఓ వానరరాజా! నీవలె లోకమర్యాదను విడిచియుండు వారిని శిక్షించుటకు సిద్ధముగ నున్నాము.

(౨౬½) (అవతారిక.— నిరపరాధులను జంపుట దోషమను శంకకు యింతవరకు పరిహారముసెప్పి, సీతను నేనే తెచ్చియిచ్చి యుందునని వాలిచెప్పినమాటను సమాధానము చెప్పఁబడుచున్నది) సుగ్రీవునియెడల నాకు గలస్నేహము లక్ష్మణునియెడల గలస్నేహమువంటిదై అపరిహార్యముగ నున్నది. భార్య రాజ్యము యీ స్నేహమునకు ఫలముగ నున్నవి సుగ్రీవుఁడు నాకు మేలుసేయుటలో శాక్తి గలిగియున్నాఁడు. (కనుక సుగ్రీవుని ఉపేక్షించుట తగదనిభావము.)

ప్రతిజ్ఞాచ మయా దత్తా తదా వానరసన్నిధౌ।
ప్రతిజ్ఞాచ కథం శక్యా మద్విధేనానవేక్షితుమ్॥ ౨౭

తదేభిః కారణై స్సర్వై ర్మహద్భి ర్ధర్మసంహితైః।
శాసనం తవ యద్యుక్తం తద్భవా ననుమన్యతామ్॥ ౨౮
సర్వథా ధర్మఇత్యేవ ద్రష్టవ్య స్తవ నిగ్రహః॥ ౨౯

వయస్యస్యాపి కర్తవ్యం ధర్మ మేవానుపశ్యతః।
శక్యం త్వయాపి తత్కార్యం ధర్మ మేవానుపశ్యతా॥ ౩౦

శ్రూయతే మనునా గీతౌ శ్లోకౌ చారిత్రవత్సలౌ।
గృహీతౌ ధర్మకుశలై స్తత్తథాచరితం హరే॥ ౩౧

రాజభిః ధృతదండాస్తు కృత్వా పాపాని మానవాః
నిర్మలా స్స్వర్గ మాయాంతి సంత స్సుకృతినో యథా॥ ౩౨

శాసనాద్వాపి మోక్షాద్వా స్తేన స్స్తేయా ద్విముచ్యతే।
రాజా త్వశాస న్పాపస్య తదవాప్నోతి కిల్బిషమ్॥ ౩౩
ఆర్యేణ మమ మాంధాత్రా వ్యసనం ఘోర మీప్సితమ్।
శ్రమణేన కృతే పాపే యథాపాపం కృతం త్వయా॥ ౩౪

(౨౭) నేను వానరుల యెదుట ప్రతిజ్ఞ చేసితిని. నావంటివాఁడు యిట్టి ప్రతిజ్ఞను ఉపేక్షించుట తగదు.

(౨౮) ధర్మముతోఁ గూడి ప్రబలమైన యీ కారణము లన్నిటిచేతను నిన్ను శిక్షించినది యుక్తమేను. కనుక నీవు యీ దండన శాస్త్రసమ్మతమని తెలిసికొనుము.

(౨౯) నిన్ను నేను దండించినది అన్నివిధములలోను ధర్మమేయని తెలిసికొనవలయును,

(౩౦) ధర్మ స్వరూపమును నెఱింగిన సుగ్రీవుని నిమిత్తమైన నేను ప్రతిజ్ఞ చేసిన నీ వధరూపకార్యమును జేయవలసినదేను. ధర్మమును నెఱింగిన నీవు నిన్ను నేను నిగ్రహించిన విషయము నీ పాపమునకు ప్రాయశ్చిత్తమని దెలిసికొనుము.

(౩౧) శిష్టాచారమును ప్రధానముగ గల మనువుచేఁ జెప్పఁబడిన, ధర్మమును నెఱింగినవా రంగీకరించిన శ్లోకములు గలవు. ఆ ప్రమాణముల ప్రకారము, వానరుఁడా! నేను చేసితిని.

(౩౨) పాపము సేసినవారు రాజదండనకు లోఁబడిన వారై పాపరహితులై పుణ్యముచేసిన సత్పురుషులవలె స్వర్గమునకుఁ బోయెదరు.

(౩౩) రాజు దండించినను విడిచినను దొంగకు దోషము పరిహారమగుచున్నది. నేరముచేసిన వాని విచారించి దండించకపోయినటులైతే ఆ పాపము రాజుకే తగులును.

(౩౪) వానరుఁడా! నీవలె ఒక క్షపణకుఁడు పాపముచేసెను. నాకు పూజ్యుఁడగు మాంధాతచక్రవర్తి అతనికి ఘోరమైన దండన విధించెను.

అన్యైరపి కృతం పాపం ప్రమత్తై ర్వసుధాధిపైః।
ప్రాయశ్చిత్తంచ కుర్వంతి తేన తచ్ఛామ్యతే రజః॥ ౩౫

తదలం పరితాపేన ధర్మతః పరికల్పితః।
వధో వానరశార్దూల న వయం స్వవశే స్థితాః॥ ౩౬
శృణుచాప్యపరం భూయః కారణం హరిపుంగవ।
య చ్ఛ్రుత్వా హేతు మద్వీర న మన్యుం కర్తు మర్హసి॥ ౩౭
న మే తత్ర మనస్తాపో నమన్యు ర్హరియూథప।
వాగురాభిశ్చ పాశైశ్చ కూటైశ్చ వివిధై ర్నరాః॥ ౩౮
ప్రతిచ్ఛన్నాశ్చ దృశ్యాశ్చ గృహ్ణంతి సుబహూ న్మృగాన్।
ప్రధావితాన్వా విత్రస్తాన్ విస్రబ్ధాంశ్చాపి నిష్ఠితాన్॥ ౩౯
ప్రమత్తా నప్రమత్తాన్వా నరా మాంసార్థినో భృశమ్॥
విధ్యంతి విముఖాంశ్చాపి నచ దోషోఽత్ర విద్యతే॥ ౪౦
యాంతి రాజర్షయ శ్చాత్ర మృగయాం ధర్మకోవిదాః।
తస్మా త్త్వం నిహతో యుద్ధే మయా బాణేన వానర॥ ౪౧
అయుధ్య న్ప్రతియుధ్య న్వా యస్మా చ్ఛాఖామృగో హ్యసి॥
దుర్లభస్యచ ధర్మస్య జీవితస్య శుభస్యచ। ౪౨
రాజానో వానరశ్రేష్ఠ ప్రదాతారో నసంశయః॥ ౪౨½

(౩౫) మనించియుండు రాజులు కొందరు చేసినపాపములను తత్కాలము లలో విచారించక పిమ్మట వారికి వధ మొదలగు శిక్ష విధించెదరు. అందువల్ల నేరము చేసినవారి పాపము పోవుచున్నది.

(౩౬) అందుచేత, వానర శ్రేష్ఠుఁడా! నీవు తపించి ప్రయోజనము లేదు. ధర్మశాస్త్రము ననుసరించే నిన్ను చంపితిమి. మేము శాస్త్రమునకు వశ్యులము. స్వతంత్రులము కాము.

(౩౭) (అవతారిక.— ఇంతవరకుఁ వాలి శాస్త్రవశ్యుఁడని తెలిసికొని యీ విధముగ రాముఁడు శాస్త్రసమ్మతముగ బదులుచెప్పి, ఇఁకమీఁదు వానర జాతికిఁ దగిన సమాధానము చెప్పుచున్నాఁడు.) వానరశ్రేష్ఠుఁడా! ఇంకొక కారణము సెప్పెదను వినుము. యుక్తాయుక్తముగ నుండుదాని విని, పిదపఁడా! నీవు కోపమును విడిచెదవు.

(౩౮,౩౯,౪౦) గూఢముగ నుండి చంపినందుకై నన్ను నిందించినందుకు మనస్తాపము కోపము, ఓ వానరరాజా! నాకు లేదు. వలలతోను నానావిధము లగు కపట వ్యాపారములతోను మరిగియుండి, లేక, అగుపడియుండి మనుజులు, పరుగెత్తి పోవుచుండు భయపడియుండు నమ్మి సమీపమునకు వచ్చినట్టి, బాగుగ మదించి, లేక, మదములేక, ఎదురుగ రాకపోయినను, మాంసమును నపేక్షించిన వారై ప్రజలు మృగములను జంపెదరు. ఇది పాపముకాదు.

(౪౧,౪౨) ధర్మమును నెరింగిన రాజర్షులు మృగములను జంపుటకు వేటాడుచున్నారు. అందుచేత, నీవు కోతిగనుండుటచే నీవు యుద్ధముచేసినను చేయకపోయినను నిన్ను బాణముతోఁ గొట్టి చంపితిని. వానరుఁడా!

(౪౩) వానర శ్రేష్ఠుఁడా! దుర్లభమైన ధర్మమును, జీవనమును శుభమును గలిగించువారు రాజులేను. ఇందుకు సంశయము లేదు.

తాన్నహింస్యాన్నచాక్రోశేన్నాక్షిపేన్నాప్రియం వదేత్।
దేవా మానుషరూపేణ చరంత్యేతే మహీతలే॥ ౪౩

త్వం తు ధర్మమవిజ్ఞాయ కేవలం రోషమాస్థితః।
ప్రదూషయసి మాం ధర్మే పితృపైతామహే స్థితమ్॥ ౪౪

ఏవముక్తస్తు రామేణ వాలీ ప్రవ్యథితో భృశమ్।
న దోషం రాఘవే దధ్యౌ ధర్మేఽధిగతనిశ్చయః॥ ౪౫

ప్రత్యువాచ తతో రామం ప్రాంజలిర్వానరేశ్వరః॥ ౪౬

యత్త్వమాత్థ నరశ్రేష్ఠ తదేవం నాత్ర సంశయః।
ప్రతివక్తుం ప్రకృష్టే హి నాప్రకృష్టస్తు శక్నుయాత్॥ ౪౭

తదయుక్తం మయా పూర్వం ప్రమాదాదుక్తమప్రియమ్।
తత్రాపి ఖలు మే దోషం కర్తుం నార్హసి రాఘవ॥ ౪౮

త్వం హి దృష్టార్థతత్త్వజ్ఞః ప్రజానాంచ హితే రతః।
కార్యకారణసిద్ధౌ తే ప్రసన్నా బుద్ధిరవ్యయా॥ ౪౯

(౪౩½) ఆట్టి రాజులను హింసింపరాదు. (అనఁగా, వారికి అనర్థము గలిగించు తలంపును తలంచరాదు.) వారిని నిందింపరాదు. వారి ఆజ్ఞను మీఱరాదు. వారిని కఠినోక్తులాడకూడదు. ఏలననఁగా, రాజులు దేవతాస్వరూపులు. అనఁగా, అష్టదిక్పాలుర అంశగలవారు. వీరు భూమిలో మనిషిరూపముతో నున్నారు. (ఇందుకు ప్రమాణము. అష్టాభి ర్లోకపాలానాం మాత్రాభిః కల్పితో నృపః.)

(౪౪½) నీవు ధర్మసూక్ష్మమును నెఱుంగలేక, కేవలము రోషమును దెచ్చుకొని పూర్వీకులు చెప్పిన ధర్మమార్గములో నుండి ధర్మమును ననుసరించిన నన్ను నిందించితివి.

(౪౫½) ఇట్లు శ్రీరాముఁడు చెప్పగా వాలి మిగులదుఃఖించి ధర్మస్వరూపమును బాగుగఁ దెలిసికొని, రామునియెడల దోషముగలదని మనసా తలఁచలేదు.

(౪౬½) పిమ్మట, వానరరాజగు వాలి అంజలిచేసికొని రామునితో నిట్లనెను.

(౪౭) నరోత్తముఁడా! నీవు చెప్పినది బాగనేయున్నది. ఇందుకు సందేహము లేదు. మిగుల జ్ఞానిగ నుండువానికి నీచుఁడేమియుఁ జెప్పనేరఁడు.

(౪౮) నేను ముందు అజ్ఞానముచే నీకు అప్రియముగనుండుమాటలు చెప్పితిని. అది సరికాదు. నాయపరాధమును క్షమించవలయును.

(౪౯) నీవు విషయముల స్వరూపము నెఱింగి పండితుఁడుగ నున్నావు. ప్రజలకు హితముసేయుటలో నాసక్తిగలవాఁడవు. యీ పాపమునకు యిది దండనము అని నెఱుంగుటలో నీబుద్ధిమిగుల తేటగను స్థిరముగనున్నది.

మా మప్యగతధర్మాణం వ్యతిక్రాంతపురస్కృతమ్।
ధర్మసంహితయా వాచా ధర్మజ్ఞ పరిపాలయ॥ ౫౦
న త్వాత్మాన మహం శోచే న తారాం నచ బాంధవాన్।
యథాపుత్రం గుణశ్రేష్ఠ మంగదం కనకాంగదం॥ ౫౧
న మమాదర్శనా ద్దీనో బాల్యాత్ప్రభృతి లాలితః।
తటాకఇవ పీతాంబు రుపశోషం గమిష్యతి॥ ౫౨

బాల శ్చాకృతబుద్ధిశ్చ ఏకపుత్రశ్చ మే ప్రియః।
తారేయో రామ భవతా రక్షణీయో మహాబలః॥ ౫౩
సుగ్రీవే చాంగదే చైవ విధత్స్వ మతి ముత్తమామ్।
త్వం హి శాస్తాచ గోప్తాచ కార్యాకార్యవిధౌ స్థితః॥ ౫౪
యా తే నరపతే వృత్తి ర్భరతే లక్ష్మణేచ యా।
సుగ్రీవే చాంగదే రాజం స్తాం త్వ మాధాతు మర్హసి॥ ౫౫

మద్దోషకృతదోషాం తాం యథాతారాం తపస్వినీమ్।
సుగ్రీవో నావమన్యేత తథాఽవస్థాతు మర్హసి॥ ౫౬
త్వయా హ్యనుగృహీతేన రాజ్యం శక్య ముపాసితుం।
త్వద్వశే వర్తమానేన తవ చిత్తాఽనువర్తినా॥ ౫౭
శక్యం దివం చార్జయితుం వసుధాం చాపి శాసితుం॥ ౫౮

(౫౦) శాస్త్రవిహితములగు పనులుచేయక, పాపకార్యములు యొనరించవల సిచేసిన నన్ను, ఓ ధర్మజ్ఞుఁడా! ధర్మముతోఁగూడిన వాక్కుతో 'నీయపరాధ ములను క్షమించితిని' అని చెప్పుము.

(౫౧) సద్గతి బడయుటచే నావిషయములోను, సుగ్రీవుఁడుండుటచే తార బంధువుల విషయములోను నేనుదుఃఖించను. సుగుణములచే ఉత్తముఁడై, ఒం గారుభుజకీర్తులుగల అంగదుని విషయమై దుఃఖించుచున్నాను.

(౫౨) పుట్టినదిమొదలు నాచే లాలింపఁబడుచుండు అంగదుఁడు నన్ను జూడక దీనుఁడై, సూర్యకిరణములచేఁ బీల్చివేయఁబడిన జలముగల తటాకమువలె, మిగుల శోకించును.

(౫౩) బాలుఁడుగను, అందుచేతనే బుద్ధిలేనివాఁడుగను, ఒక్కే బిడ్డగను, గొప్పబలముగలవాఁడుగను, నీప్రీతికిఁ బాత్రుఁడుగనుండు అంగ దుని, ఓ రామా! నీవు రక్షించవలయును.

(౫౪) సుగ్రీవుని అంగదుని నీవు ఒకే విధముగఁ జూడవలయును. ఇది కార్యము యిది యకార్యము అని విధించి శిక్షించువాఁడుగను రక్షించువాఁడు గను నీవు ఉన్నావు

(౫౫) ఓ రాజా! భరతునిమీదను లక్ష్మణునిమీదనుగల అట్టిప్రీతిని సు గ్రీవునిమీదను అంగదునిమీదను నుంచవలయును.

(౫౬) నాదోషమువల్ల అపరాధియై దీనురాలుగనుండు తారను, సుగ్రీ వుఁడు అగౌరవించనటుల, నీవు అతని అట్టిస్థితిలో నుంచవలయును.

(౫౭) నీ యనుగ్రహమునకుఁ బాత్రుఁడై నీస్వాధీనములోనుండి నీయాజ్ఞ ప్రకారము ఉండినటులైతే రాజ్యమును సహా పరిపాలించియుండవచ్చును.

(౫౮) స్వర్గమును సంపాదించి, భూమిని పరిపాలించుటకు నాకు శక్తి గలదు.

త్వత్తోఽహం వధ మాకాంక్ష న్వార్యమాణోఽపి తారయా॥
సుగ్రీవేణ సహభ్రాత్రా ద్వంద్వయుద్ధ ముపాగతః॥ ౫౮౹
ఇత్యుక్త్వా సన్నతో రామం విరరామ హరీశ్వరః॥ ౫౯

స త మాశ్వాసయ ద్రామో వాలినం వ్యక్తదర్శనం।
సామసంపన్నయా వాచా ధర్మతత్త్వార్థయుక్తయా॥ ౬౦
న సంతాప స్త్వయా కార్య ఏతదర్థం ప్లవంగమ॥ ౬౦౹

నవయం భవతా చింత్యా నాప్యాత్మా హరిసత్తమ॥
వయం భవద్విశేషేణ ధర్మతః కృతనిశ్చయాః॥ ౬౧౹
దండ్యే యః పాతయే ద్దండం దండ్యో యశ్చాపి దండ్యతే।
కార్యకారణసిద్ధార్థా వుభౌ తౌ నావసీదతః॥ ౬౨౹

తద్భవా న్దండసంయోగా దస్మా ద్విగతకల్మషః।
గత స్స్వాం ప్రకృతిం ధర్మ్యాం ధర్మదృష్టేన వర్త్మనా॥ ౬౩౹
త్యజ శోకంచ మోహంచ భయంచ హృదయే స్థితమ్।
త్వయా విధానం హర్యగ్ర్య నశక్య మతివర్తితుమ్॥ ౬౪౹

యథా త్వయ్యంగదో నిత్యం వర్తతే వానరేశ్వర।
తథా వర్తేత సుగ్రీవే మయి చాపి నసంశయః॥ ౬౫౹

(౪౮½) తార అడ్డగించినను నీవల్ల వధనుగోరి తమ్ముఁడగు సుగ్రీవునితో ద్వంద్వయుద్ధము సేయుటకు తలపడితిని.

(౪౯) ఇట్లు వానరరాజగు వాలి మిగుల వినయముతో, రాముని జూచి పలికి, నిలిచెను.

(౫౦) శ్రీరాముడు సమాధానముతోఁగూడి ధర్మతత్త్వమును దెలుపు అర్థముగలమాటలతో నిర్మలమగు జ్ఞానముగల వాలిని సమాధాన పరచెను.

(౫౦½) వానరుఁడా! నీ బిడ్డను గాపాడుదునో లేదోయని నీవు సంతాపపడవలదు.

(౫౧) పాపకార్యము సేసితిమని మమ్ముగురించి చింతింపవలదు. నీ యాత్మనుగురించియు నీవు చింతించవలదు. ఏలననఁగా, ఓ వానర శ్రేష్ఠుఁడా! నీవు చేసిన పాపమునకు ప్రాయశ్చిత్తము చేసితిమి.

(౫౨½) శిక్షించువాఁడు శిక్షింపఁబడువాఁడు యిద్దరును దండనఆంరాధములచే ప్రయోజనము గలవారై సుఖముగ నున్నారు.

(౫౩½) ఈ శిక్షచే పాపముపోయి ధర్మశాస్త్ర న్యాయముచే నీవు పరిశుద్ధుఁడవైతివి.

(౫౪½) ఓ వానర శ్రేష్ఠుఁడా! దుఃఖమును మోహమును హృదములోగల భయమును విడువుము. విధిని నీవు అతిక్రమించ నేరవు.

(౫౫½) వానరరాజా! సదా అంగదుఁడు నీ యెడల ఉండునటులనే సుగ్రీవుని యెడల నాయెడల ఉండును. ఇందుకు సందేహము లేదు.

స తస్య వాక్యం మధురం మహాత్మన స్సమాహితం ధర్మపథా
నువర్తినః । నిశమ్య రామస్య రణావమర్దినో వచ స్సుయుక్తం
నిజగాద వానరః॥ ౬౬౪

శరాభితప్తేన విచేతసా మయా ప్రదూషిత స్త్వం యదజాన
తా ప్రభో । ఇదం మహేంద్రోపమ భీమవిక్రమ ప్రసాదిత
స్త్వం క్షమ మే నరేశ్వర॥ ౬౭౪

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - అష్టాదశస్సర్గః.

## ఏకోనవింశస్సర్గః.

స వానరమహారాజ శ్శయాన శ్శరవిక్షతః।
ప్రత్యుక్తో హేతుమద్వాక్యై ర్నోత్తరం ప్రత్యపద్యత॥ ౧

అశ్మభిః ప్రవిభిన్నాంగః పాదపై రాహతో భృశమ్।
రామబాణేన చాక్రాంతో జీవితాంతే ముమోహ సః॥ ౨

తం భార్యా బాణమోక్షేణ రామదత్తేన సంయుగే।
హతం ప్లవగశార్దూలం తారా శుశ్రావ వాలినమ్॥ ౩

(౬౪) మహాత్ముఁడును, ధర్మమార్గమును ననుసరించియుండు వాఁడును యుద్ధములో శత్రువులను జంపువాఁడును నగు శ్రీరాముని యొక్క మధురమును సమాధాన రూపమును నగు వాక్యమును విని వాలి మిగుల యుక్తముగ నిట్టు లిటులు చెప్పెను.

(౬౫.) ప్రభో! బాణముచే తప్తుఁడనై మూర్ఛ చెంది తెలివిలేక నిన్ను బాగుగ దూషించితిని. మహేంద్రునితో సముఁడా! భయంకరమైన పరాక్రమము గలవాఁడా! నరనాథా! ప్రసన్నుఁడవై నా యపరాధమును క్షమింపవల యును.

ఇది పదునెనిమిదవ సర్గ.



౧౯ వ సర్గ

(అవతారిక.— రాముని బాణము తగిలి పడియుండు వాలి వద్దకు తార వచ్చుట.)

(౧) వానరమహారాజగు వాలి రాముని బాణము తగిలి పండుకొని రాముఁడు సహేతుకముగ 'నిన్ను వధించినది న్యాయమేను' అని చెప్పగా విని బదులేమి యు జెప్పలేను.

(౨) రాళ్లతోను వృక్షములతోను బాగుగఁ గొట్టఁబడిన వాలి శ్రీరాముని బాణముతోను గొట్టఁబడి ప్రాణము విడుచుసమయములో మూర్ఛపోయెను.

(3) యుద్ధములోఁ శ్రీరాముఁడు ప్రయోగించిన బాణము తగిలి వానర శ్రేష్ఠుఁడగు వాలి పడిపోయియుండుట అతని భార్య యగు తార వినెను.

సా సపుత్రాఽప్రియం శ్రుత్వా వధం భర్తు స్సుదారుణమ్।
నిష్పపాత భృశం త్రస్తా వివిధా ద్గిరిగహ్వరాత్॥ ౪
ఏ త్వంగదపరీవారా వానరా భీమవిక్రమాః।
తే సకార్ముక మాలోక్య రామం త్రస్తాః ప్రదుద్రువుః॥ ౫

సా దదర్శ తత స్త్రస్తాన్ హరీ నాపతతో భృశమ్।
యూథాదివ పరిభ్రష్టాన్ మృగా న్నిహతయూథపాన్॥ ౬
తా నువాచ సమాసాద్య దుఃఖితాన్ దుఃఖితా సతీ।
రామవిత్రాసితా న్సర్వా ననుబద్ధా నివేషుభిః॥ ౭

వానరా రాజసింహస్య యస్య యూయం పురస్సరాః।
తం విహాయ సుసంత్రస్తాః కస్మా ద్ద్రవథ దుర్గతాః॥ ౮
రాజ్యహేతో స్స చే ద్భ్రాతా భ్రాత్రా రౌద్రేణ పాతితః।
రామేణ ప్రహితై రౌద్రై ర్మార్గణై ర్దూరపాతిభిః॥ ౯

కపిపత్న్యా వచ శ్శ్రుత్వా కపయః కామరూపిణః।
ప్రాప్తకాల మవిక్లిష్ట మూచు ర్వచన మంగనామ్॥ ౧౦
జీవపుత్రే నివర్తస్వ పుత్రం రక్షస్వ చాంగదమ్।
అంతకో రామరూపేణ హత్వా నయతి వాలినమ్॥ ౧౧

(౪) పుత్త్రునితోడ తార భయంకరముగను అప్రియముగనుండు భర్త మరణమును విని మిగుల భయపడి, కక్ష్యాంతరములుగల గుహవలెనుండు కిష్కింధనుండి వెలుపలవచ్చెను.

(౫) అంగదునికి పరిజనులుగను భయంకరమైనపరాక్రమముగలవారుగను నుండువానరులు ధనుర్ధారియగు శ్రీరాముని జూచి భయపడి పారిపోయిరి.

(౬) పిమ్మట, నాథుఁడుచచ్చి తనసమూహమును విడిచి నలుదిక్కుల పారిపోవుచుండు మృగములవలె మిగుల భయపడివచ్చుచుండు వానరులను తార చూచెను.

(౭) రాముని జూచి భయపడినవారును, బాణములతోఁ గొట్టఁబడినవారును దుఃఖించుచుండువారును, నగువానరుల సమీపమునకుఁబోయి తార మిగులదుఃఖించి వారితో నిటులనెను.

(౮) రాజశ్రేష్ఠుఁడగువాలికి, వానరులారా! యుద్ధములో మీరు ముందు నడుచుచుండువారు. అట్టివారు వాలిని విడిచి మిగులభయపడి దిక్కులేనివారై యెందుకు భయపడి పారిపోవుచున్నారు.

(౯) రాజ్యమును నపేక్షించి క్రూరుఁడగు సుగ్రీవుఁడు ఘోరములై బహుదూరము పోయి పడుచుండు శ్రీరాముఁడు ప్రయోగించిన బాణములతో అన్నయగువాలిని గొట్టించెను.

(౧౦) కోరినరూపము ధరించగలవానరులు వాలి పత్నియగు తారమాటలు విని యుక్తియుక్తముగ సమయమునకుఁ దగినమాటలిట్లు చెప్పిరి.

(౧౧) జీవించియుండుకొనుటకు గలదానా! కిష్కింధకు తిరిగిపొమ్ము. కొడుకగు అంగదుని గాపాడుకొనుము. యముఁడు రామునిరూపముధరించి వచ్చి వాలిని జంపి తీసికొని పోవుచున్నాఁడు.

క్షిప్తాన్ వృక్షాన్ సమావిధ్య విపులాశ్చ శిలా స్తథా।
వాలీ వజ్రసమై ర్బాణై రామేణ వినిపాతితః॥ ౧౨
అభిద్రుత మిదం సర్వం విద్రుతం ప్రసృతం బలమ్।
అస్మిన్ ప్లవగశార్దూలే హతే శక్రసమప్రభే॥ ౧౩
రక్ష్యతాం నగరద్వార మంగద శ్చాభిషిచ్యతామ్।
పదస్థం వాలినః పుత్రం భజిష్యంతి ప్లవంగమాః॥ ౧౪
అథవాఽరుచితం స్థాన మిహ తే రుచిరాననే।
ఆవిశంతిహి దుర్గాణి క్షిప్ర మన్యాని వానరాః॥ ౧౫
అభార్యాశ్చ సభార్యాశ్చ సంత్యత్ర వనచారిణః।
లుబ్ధేభ్యో విప్రయుక్తేభ్య స్తేభ్యో న స్తుములం భయమ్॥ ౧౬
అల్పాంతరగతానాంతు శ్రుత్వా వచన మంగనా।
ఆత్మనః ప్రతిరూపం సా బభాషే చారుహాసినీ॥ ౧౭
పుత్రేణ మమ కిం కార్యం కిం రాజ్యేన కి మాత్మనా।
కపిసింహే మహాభాగే తస్మిన్ భర్తరి నశ్యతి॥ ౧౮
పాదమూలం గమిష్యామి తస్యైవాహం మహాత్మనః।
యోఽసౌ రామప్రయుక్తేన శరేణ వినిపాతితః॥
ఏవ ముక్త్వా ప్రదుద్రావ రుదంతీ శోకకర్శితా।
శిర శ్చోరశ్చ బాహుభ్యాం దుఃఖేన సమభిఘ్నతీ॥ ౨౦

(౧౨) సుగ్రీవుఁడు ప్రయోగించిన వృక్షములను గొప్పరాళ్ళను పొడిచేసి నవాలిని వజ్రాయుధమువంటి బాణముతో రాముఁడు చంపెను.

(౧౩) వానర వీరుఁడును ఇంద్రునివంటి కాంతిగలవాఁడును నగువాలి హతుఁడుకాఁగా విశాలమగు యీసేన యంతయును పారిపోవుచున్నది.

(౧౪) పట్టణముయొక్క పెద్దద్వారమును గాపాడవలయును. అంగదునికి పట్టాభిషేకము సేయవలయును. వాలి స్థానములోనుండు అంగదుని వానరులు ఆశ్రయించియుందురు.

(౧౫) అందమగుముఖము గలతారాదేవీ! కిష్కింధలో మేముండుట నీకు యిష్టములేకపోయినట్లైతే శత్రువులుగనుండు వానరులు కిష్కింధలోగల దుర్గప్రదేశములను మరికొన్ని ప్రదేశములను శీఘ్రముగ నాక్రమించెదరు.

(౧౬) భార్యలను విడిచియుండువారును సామాన్యమైన భార్యలనపేక్షించువారును వాలిచే తరిమివేయఁబడిన వానరులున్నారు. కిష్కింధలోనుండిన యెడల మనకు వారివలన భయముగలుగును.

(౧౭) సంభాషించుటకు కొంత అవకాశము పొందియుండు, లేక, అల్పబుద్ధులగువారికేదో చినటుల చెప్పినమాటలను, అందముగనుండు నగపైగల తార విని యిటు లనెను.

(౧౮) మిగులపూజ్యుఁడును కపిశ్రేష్ఠుఁడుమనగు నాభర్త మృతిఁబొందుచుండగా, యిఁక నాకు పుత్రుఁడెందుకు రాజ్యమెందుకు నా ప్రాణమెందుకు,

(౧౯) రాముఁడు ప్రయోగించిన బాణము తగిలి పడియుండు మహాత్ముఁడగు వాలి పాదములనే నేను ఆశ్రయించుచున్నాను.

• (౨౦) ఇటులచెప్పి ప్రలపించి దుఃఖముచేఁ జిక్కియుండుతార చేతులతో తలను రొమ్మును బాగుగఁ గొట్టుకొనుచు వాలియుండుచోటికిఁ బోయెను.

ఆవిశంతీ దదర్శాథ పతిం నిపతితం భువి।
హంతారం దానవేంద్రాణాం సమరేష్వ నివర్తినామ్। ౨౧
క్షేప్తారం పర్వతేంద్రాణాం వజ్రాణా మివ వాసవమ్।
మహావాత సమావిష్టం మహామేఘౌఘ నిస్వనమ్॥ ౨౨
శక్రతుల్య పరాక్రాంతం వృష్ట్యేవోపరతం ఘనమ్।
నర్దంతం నర్దతాం భీమం శూరం శూరేణ పాతితమ్॥ ౨౩
శార్దూలేనామిషస్యార్థే మృగరాజం యథాహతం।
అర్చితం సర్వలోకస్య సపతాకం సవేదికమ్॥ ౨౪
నాగహేతో స్సుపర్ణేన చైత్య మున్మథితం యథా।
అవష్టభ్యచ తిష్ఠంతం దదర్శ ధను రుత్తమమ్॥ ౨౫
రామం రామానుజం చైవ భర్తు శ్చైవా నుజం శుభా॥ ౨౫½
తా నతీత్య సమాసాద్య భర్తారం నిహతం రణే।
సమీక్ష్య వ్యథితా భూమౌ సంభ్రాంతా నిపపాతహ॥ ౨౬½
సుప్త్వేవ పున రుత్థాయ ఆర్య పుత్రేతి క్రోశతీ।
రురోద సా పతిం దృష్ట్వా సందితం మృత్యుదామభిః॥ ౨౭½
తా మవేక్ష్యతు సుగ్రీవః క్రోశంతీం కురరీమివ।
విషాద మగమ త్కష్టం దృష్ట్వా చాంగద మాగతమ్॥ ౨౮½

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - ఏకోనవింశస్సర్గః.

(౨౧ మొదలు ౨౪౫ వరకు) యుద్ధములో వెనుకకుఁబోనట్టి రాక్షసశ్రేష్ఠులను జంపువాడును, శ్రేష్ఠమైన పర్వతములను పెల్లగించి పైకెగుర వేయువాఁడును, కింకరులు వజ్రాయుధము మొదలగు యుద్ధపరికరముల మధ్యలో ఇంద్రునివలె నుండువాడును, యుద్ధములో గొప్పగాలివంటి వేగముగలవాఁడును, గొప్ప మేఘసమూహములవలె గర్జించువాఁడును, ఇంద్రునితో సమమైన పరాక్రమముగలవాఁడును, వర్షించినిలిచిన మేఘమువలె నుండువాఁడును, భయంకరముగ సింహనాదము సేయువాఁడును, శూరుఁడును, శూరునిచేఁ గొట్టబడి క్రిందపడియుండువాఁడును, మాంసము కొఱకు సింహముచేఁ జంపఁబడిన సింహమువలె నుండువాఁడును, సకల లోకములచేఁ బూజింపఁబడినదిగను పతాకాదులచే నలంకరింపఁబడినదిగను శ్రమదీర్చుకొనుటకు నిర్మింపఁబడిన వేదికగలదిగను (ఇట్లుండినను నశట దాగియుండు) సర్పమును గ్రహించుటకు గరుఁడునిచే భంగ పరుపఁబడిన (బలికి స్థానముగనునుండు) మేడవలె నుండువాఁడును, నగుభూమిమీఁద పడియుండు భర్తయగు వాలిని, శ్రేష్ఠమైన దనుస్సును బట్టుకొని నిలిచియుండు రాముని లక్ష్మణుని తనభర్తతమ్ముఁడగు సుగ్రీవుని జూచి, తార రామునియెడల ద్వేషమును విడిచి మంచి మనసుగలదిగ నుండెను.

(౨౬౫) రాముఁడు లక్ష్మణుఁడు సుగ్రీవుఁడు వీరిని పాపులని తలఁచి యుద్ధములోఁ జంపఁబడిన భర్తసమీపమునకుఁబోయి అతనిఁజూచి దుఃఖించి మైమఱచి తార భూమిమీద పడెను.'

(౨౭౫) తార నిందిరించి లేచినట్టుల లేచి, 'ఆర్యపుత్రా' అని పిలుచుచు యముని పాశములతోఁ గట్టఁబడియుండు భర్తను జూచి యేడ్చెను.

(౨౮౫) కురరి పక్షివలె యేడ్చుచుండు తారను, సమీపములో నుండిన అంగదుని జూచి సుగ్రీవుఁడు మిగుల దుఃఖించెను.

## వింశస్సర్గః.



రామచాపవిసృష్టేన శరేణాంతకరేణ తం।
దృష్ట్వా వినిహతం భూమౌ తారా తారాధిపాననా॥ ౧
సా సమాసాద్య భర్తారం పర్యష్వజత భామినీ॥ ౧½

ఇషుణాభిహతం దృష్ట్వా వాలినం కుంజరోపమమ్॥ ౨
వానరేంద్రం మహేంద్రాభం శోకసంతప్తమానసా।
తారా తరుమివోన్మూలం పర్యదేవయ దాతురా॥ ౩

రణే దారుణవిక్రాంత ప్రవీర ప్లవతాంవర।
కిం దీనామపురోభాగామద్య త్వం నాభిభాషసే॥ ౪

ఉత్తిష్ఠ హరిశార్దూల భజస్వ శయనోత్తమమ్।
నైవంవిధాః శేరతే హి భూమౌ నృపతిసత్తమాః॥ ౫

అతీవ ఖలు తే కాంతా వసుధా వసుధాధిప।
గతాసురపి యాం గాత్రైర్మాం విహాయ నిషేవసే॥ ౬

## ౨౦ వ సర్గ.

( ఈ సర్గలో తారా ప్రలాపము చెప్పఁబడుచున్నది.)

(౧,౧౪) చంద్రునివంటి ముఖముగల తార శ్రీరాముని ధనుసునుండి ప్రయోగింపఁబడినదిగను నాశము గలిగించునదిగను నుండు బాణముతోఁ జంపఁబడి భూమిమీద పడియుండు భర్తనుజూచి అతని సమీపమునకు వచ్చి అతని నాలింగనము చేసికొనెను.

(౨,౩) రాముని బాణముతోఁ గొట్టఁబడిన వాఁడును ఇంద్రుని కాంతి వంటి కాంతిగలవాఁడును వానరశ్రేష్ఠుఁడును యేనుఁగులతో సమముగ నుండువాఁడును వేగతో పెల్లగింపఁబడి క్రిందత్రోయఁబడిన వృక్షమువలె నుండు వాఁడును నగువాలిని జూచి దుఃఖముతో తపించిన మనసుగల తార మిగుల ప్రలపించెను.

(౪) యుద్ధములో భయంకరముగ నుండువాఁడా, ప్రసిద్ధమైన వాఁడా, గొప్ప వీరుఁడా, గంతువేసి పోవువారిలో శ్రేష్ఠుడా, దీనురాలుగను నిరపరాధిగను నుండు నాతో నెందుకు మాటలాడక ఉన్నావు.

(౫) వానరశ్రేష్ఠుడా! లెమ్ము. ఉత్తమమగు పడకను పొందుము. నీవంటి గొప్పరాజులు వట్టి నేలమీఁద పండుకొనరు కదా.

(౬) ప్రాణము పోయినను నన్ను విడిచి నీ యవయవములతో భూమిని నాలింగనము చేసికొని ఉండినందున, ఓ రాజా! భూమి నీకు మిగుల ప్రియురాలుగ నున్నది.

వ్యక్త మన్యా త్వయా వీర ధర్మత స్సంప్రవర్తితా।
కిష్కింధేవ పురీ రమ్యా స్వర్గ మార్గే వినిర్మితా॥ ౭

యా న్యస్మాభి స్త్వయా సార్ధం వనేషు మధుగంధిషు।
విహృతాని త్వయా కాలే తేషా ముపరమః కృతః॥ ౮

నిరానందా నిరాశాఽహం నిమగ్నా శోకసాగరే।
త్వయి పంచత్వ మాపన్నే మహాయూధపయూధపే॥ ౯

హృదయం సుస్థిరం మహ్యం దృష్ట్వా వినిహతం పతిమ్।
య న్న శోకాభిసంతప్తం స్ఫుటతేఽద్య సహస్రధా॥ ౧౦

సుగ్రీవస్య త్వయా భార్యా హృతా సచ వివాసితః।
యత్తు తస్య త్వయా వ్యుష్టిః ప్రాప్తేయం ప్లవగాధిప॥ ౧౧

నిశ్శ్రేయసపరా మోహా త్త్వయాచాహం విగర్హితా।
యైషాఽబ్రువం హితం వాక్యం వానరేంద్ర హితైషిణీ॥ ౧౨

రూపయౌవనదృప్తానాం దక్షిణానాంచ మానద।
నూన మప్సరసామార్య చిత్తాని ప్రమథిష్యసి॥ ౧౩

(౭) వీరుఁడా! ధర్మయుద్ధము సేయుచుండిన నీవు స్వర్గసాధనమగు రణరంగములో కిష్కింధవలె యింకొక పట్టణమును నేర్పాటుచేసితివి. నిజము.

(౮) మాతోడ నీవు ధుమగంధము గలవనములలో నాయాకాలములలో విహరించితివి. అట్టి విహారములకు యిపుడు ముగింపు గలిగినది.

(౯) గొప్పసేనాధిపతులకు రాజగనుండు నీవు మరణమును బొందగా నేను ఆనందమును ఆశనువిడిచి శోకసాగరములో మునింగితిని.

(౧౦) చంపఁబడి క్రింపపడియుండు భర్తను జూచి శోకముచే మిగుల తపించి వేయిభాగములుగ బద్దలు కాకయుండుటచే నాగుండె రాతిగుండెగ నున్నది.

(౧౧) వానరరాజా! నీవు సుగ్రీవునిభార్యను నపహరించి అతని వెడలఁగొట్టితివిగదా, దానిఫలమును నీవు అనుభవించుచున్నావు.

(౧౨) వానరశ్రేష్ఠుడా! నీకు హితముగు గోరి నేను హితము బోధించితిని. నీశ్రేయస్సును గోరునట్టి నన్ను అజ్ఞానముచే తిరస్కరించితివి.

(౧౩) సౌందర్యము యౌవనముచే మదించి యుండుహారును, అనంగతంత్రములోఁ బండితులుగనుండువారును, నగుఅప్సరసల చిత్తమును, ఓ మానదా! స్వాధీనముచేసి కొనుచున్నావు. (అనఁగా నీకు వీరస్వర్గ సుఖము లభించినదనిభావము.)

కాలో నిస్సంశయో నూనం జీవితాంతకర స్తవ।
బలాద్యేనావపన్నోసి సుగ్రీవస్యావశో వశమ్॥ ౧౪
వైధవ్యం శోకసంతాపం కృపణం కృపణా సతీ।
అదుఃఖోపచితా పూర్వం వర్తయిష్యా మ్యనాథవత్॥ ౧౫
లాలిత శ్చాంగదో వీర స్సుకుమార స్సుఖోచితః।
వత్స్యతే కా మవస్థాం మే పితృవ్యే క్రోధమూర్ఛితే॥ ౧౬
కురుష్వ పితరం పుత్ర సుదృష్టం ధర్మవత్సలమ్।
దుర్లభం దర్శనం వత్స తవ తస్య భవిష్యతి॥ ౧౭
(సా సమాసాద్య భర్తారం పర్యష్వజత భామినీ।
ఇషుణాఽభిహతం దృష్ట్వా వాలినం కుంజరోపమమ్॥)
సమాశ్వాసయ పుత్రం త్వం సందేశం సందిశస్వచ।
మూర్ధ్ని చైనం సమాఘ్రాయ ప్రవాసం ప్రస్థితో హ్యసి॥ ౧౮
రామేణహి మహ త్కర్మ కృతం త్వా మభినిఘ్నతా।
ఆనృణ్యం చ గతం తస్య సుగ్రీవస్య ప్రతిశ్రవే॥ ౧౯
స కామో భవ సుగ్రీవ రుమాం త్వం ప్రతిపత్స్యసే।
భుఙ్క్ష్వ రాజ్య మనుద్విగ్న శ్శస్తో భ్రాతా రిపు స్తవ॥ ౨౦
కిం మా మేవం విలపతీం ప్రేమ్ణా త్వం నాభిభాషసే।
ఇమాః పశ్య వరా బహ్వీ ర్భార్యా స్తే వానరేశ్వర॥ ౨౧

(౧౪) ఎవరికిని స్వాధీనపడని నీవు బలాత్కారముచే సుగ్రీవునికి వశమైనందున యీసమయమున నీప్రాణమును పోగొట్టుకొనుచున్నది. నిజము. సందేహము లేదు.

(౧౫) నేను పూర్వము దుఃఖపడుటకు తగనిదానను దీనురాలను గాక సుఖముగ నుండి యిపుడు దీనురాలనై వైధవ్యమును శోకముచే మిగుల తాపపడుచు, అనాథవలె, పొందితిని.

(౧౬) వీరుండును సుకుమారుండును సుఖమును ననుభవించుటకుఁ దగిన వాఁడును నేను బాగుగఁ బోషించిన అంగదుండు, పినతండ్రి కోపము సేయగా, యెట్టి యవస్థను బడెనోకదా. (ప్రాణము విడువ నేరనాయని భావము.)

(౧౭) పుత్రుఁడా! ధర్మాత్ముఁడైన నీతండ్రిని బాగుగఁ జూడుము. ఓ బిడ్డా! తండ్రిదర్శనము నీకు యికమీఁదు దుర్లభమగుచున్నది.

(౧౮) నాథా! పరదేశమునకుఁ బోవుచున్నావు. కనుక, అంగదుని శిరస్సును ముద్దుపెట్టుకొని అతనికి సమాధానము చెప్పి బుద్ధి చెప్పవలయును.

(౧౯) రాముండు నిన్ను జంపి గొప్ప కార్యము చేసి సుగ్రీవుని ప్రతిజ్ఞను పూర్తి చేసి ఋణ విముక్తుండాయెను.

(౨౦) సుగ్రీవుండా. నీవు నీకోరికను పూర్తిచేసికొంటివి. రుమాదేవిని బడసెదవు. భయములేక రాజ్యమును నేలుము. నీకు శత్రువుగనుండు వాలిని జంపితివి.

(౨౧) ఈవిధముగ ప్రేమతో విలపించుచుండు నాతో నెందుకు మాటలాడకున్నావు. వానరరాజా! ఉత్తమ రాండ్రగనుండు నీభార్యలనందరిని జూడుము.

తస్యా విలపితం శ్రుత్వా వానర్య స్సర్వత శ్చ తాః।
పరిగృహ్యాంగదం దీనం దుఃఖార్తాః పరిచుక్రుశుః॥ ౨౨
కి మంగదం సాంగదవీరబాహో విహాయ యాస్యద్య చిరప్ర
వాసమ్ । న యుక్త మేవంగుణసన్నికృష్టం విహాయ పుత్రం
ప్రియపుత్ర గంతుమ్॥ ౨౩
కి మప్రియం తే ప్రియచారువేష మయా కృతం నాథ సుతేన
వా తే। సహాంగదాం మాం ప్రవిహాయ వీర యత్ప్రస్థితో దీ
ర్ఘ మితః ప్రవాసమ్॥ ౨౪
యద్యప్రియం కించి దసంప్రధార్య కృతం మయా స్యా త్తవ
దీర్ఘబాహో। క్షమస్వ మే త ద్ధరివంశనాథ వ్రజామి మూ
ర్ధ్నా తవ వీర పాదౌ॥ ౨౫
తథా తు తారా కరుణం రుదంతీ భర్తు స్సమీపే సహ
వానరీభిః। వ్యవస్యత ప్రాయ ముపోపవేష్టు మనింద్యవర్ణా భువి
యత్ర వాలీ॥ ౨౬

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - వింశస్సర్గః.

## ఏకవింశస్సర్గః.

తతో నిపతితాం తారాం చ్యుతాం తారా మివాంబరాత్।
శనై రాశ్వాసయామాస హనుమాన్ హరియూథపః॥ ౧

(౨౨) వానరస్త్రీలు తారప్రలాపమును విని దీనులగు అంగదుని కౌగలించుకొని దుఃఖపీడితురాండ్రై యుండిరి.

(౨౩) అంగదములతోను పరాక్రమముతోను గూడిన భుజములు గలవాఁడా! అంగదుని విడిచి యిపుడు తిరిగిరానట్టి దేశాంతరమునకుఁ బోవుచున్నావు. ప్రియమైన పుత్రుఁడు గలవాఁడా! నీగుణములతో సమానమైన గుణములుగల పుత్రుని విడిచి పోవుట తగదు.

(౨౪) ఇష్టమైన అందమైన వేషమును ధరించువాఁడా! నేను నీకేమి అప్రియము చేసితిని. ఓనాథా! నీకొఁడుకేమి అప్రియము చేసెను. ఓవీరుఁడా! అంగదుని నన్ను విడిచి యెప్పుడును తిరిగిరానట్టి దేశమునకుఁ బోవుచున్నావు.

(౨౫) పొడవైన బాహువులు గలవాఁడా! తెలియక నేను నీకు అప్రియము సేసియుండినటులైతే, వానర వంశనాథా! అట్టి నాయపరాధమును క్షమింపుము. ఓవీరుఁడా! నీపాదములలో శిరసుంచి శరణాగతి చేయుచున్నాను.

(౨౬) ఈవిధముగ మంచి దేహకాంతి గలతార వానరస్త్రీలతోఁ గూడి భర్తసమీపములో జాలిపుట్టునటుల యేడ్చుచు వాలిపడియుండు చోటనే ప్రాయోపవేశము సేయుటకు యత్నించెను.

ఇది యిరువదవ సర్గ.

---

## ౨౧ వ సర్గ.

(అవతారిక — ఈసర్గలో హనుమంతుఁడు తారను నూరడించుట చెప్పఁబడుచున్నది.)

(౧) పిమ్మట, క్రిందపడి ఆకాశమునుండి పడిన నక్షత్రమువలెనుండు తారను, వానరశ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు తిన్నగ సమాధానపరచెను.

గుణదోషకృతం జంతు స్స్వకర్మఫలహేతుకమ్।
అవ్యగ్ర స్తదవాప్నోతి సర్వం ప్రేత్య శుభాశుభమ్॥ ౨

శోచ్యా శోచసి కం శోచ్యం దీనం దీనాఽనుకంపసే।
కస్య కో వాఽనుశోచ్యోఽస్తి దేహేఽస్మి న్బుద్బుదోపమే॥ 3

అంగదస్తు కుమారోఽయం ద్రష్టవ్యో జీవపుత్రియా।
ఆయత్యాంచ విధేయాని సమర్థాన్యస్య చింతయ॥ ౪

జానాస్యనియతా మేవం భూతానా మాగతిం గతిమ్।
తస్మా చ్ఛుభంహి కర్తవ్యం పండితై నైహలౌకికమ్॥ ౫

యస్మిన్ హరిసహస్రాణి ప్రయుతా న్యర్బుదాని చ।
వర్తయంతి కృతాంశాని సోఽయం దిష్టాంత మాగతః॥ ౬

హనుమంతుఁడు తారను ఊరడించుట.

(౨) ప్రాణి జ్ఞానాజ్ఞానములచే చేసికొనిన స్వకర్మ ఫలముగనుండు సుఖదుఃఖముల నన్నిటిని మృతిఁబొంది బాగుగ ననుభవించును. (అనఁగా, వాలి యతని కర్మముచేతనే హతుఁడాయెను. ఇందుకు సుగ్రీవుఁడు నిమిత్తమాత్రుఁడు.)

(౩) (అవతారిక.— వాలి యతని కర్మమువల్లనే చచ్చినందున అతనికిగాను దుఃఖించుట తగదు. మన కర్మముచే మనకెట్టి లోకములు కలుగునో యనుటను గురించి మన మాలోచించవలయును.)—నీయాత్మను గురించి దుఃఖించవలసిన నీవు యింకొకని గురించి యెందుకు దుఃఖించెదవు. దీనురాలుగనుండు నీవు ఇంక నెవరిని గురించి దయను జూపుచున్నావు. నీటిబుగ్గవలె అస్థిరముగనుండు యీ దేహము నిమిత్తముగ ఒకఁడు ఒకనిగురించి దుఃఖించవలసిన పనిలేదు. ఏలననఁగా, అందరి దేహములును అస్థిరములేను. (స్థిరముగనుండువాఁడే అస్థిరముగనుండు పదార్థమునుగురించి చింతించవలయునని భావము. ఈ శ్లోకార్థము గీతలో నిట్లు చెప్పఁబడినది. శ్లో॥ అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే। గతాసూనగతాసూంశ్చ నానుశోచంతి పండితాః॥)

(౪) కొడుకుగల నీవు కొడుకగు నీయంగదుని రక్షించవలయును. ఉత్తరోత్తర వలసిన హితమును నాలోచించవలయును.

(౫) ఈవిధముగనే ప్రాణుల రాకపోకలు అస్థిరమని నీకుఁ దెలిసియున్నది. కనుక, ఓపండితురాలా! నీవు పరలోకములో వాలికి మేలుకలుగునట్టి ఉత్తరక్రియలను జేయవలయును. రోదనాది కర్మలను జేయకూడదు.

(౬) ఎవని ద్వారా అనేక అర్బుదముల సంఖ్యగల వానరులు జీవించియున్నారో అట్టివాఁడు కాలసమాప్తిని బొందెను. (వాలి అనేకులను గాపాడి ఆసుకృతఫలమును ననుభవించుటకు స్వర్గమునకుఁ బోయెను. అతనిగురించి దుఃఖించుట తగదని భావము.)

యదయం న్యాయదృష్టార్థ స్సామదానక్షమాపరః।
గతో ధర్మజితాం భూమిం నైనం శోచితు మర్హసి॥ ౭

సర్వేహి హరిశార్దూలాః పుత్రశ్చాయం తవాంగదః।
ఇదం హర్యృక్షరాజ్యంచ త్వత్సనాథ మనిందితే॥ ౮

తావిమౌ శోకసంతాపౌ శనైః ప్రేరయ భామిని।
త్వయా పరిగృహీతో ఽయ మంగద శ్శాస్తు మేదినీమ్॥ ౯

సంతతిశ్చ యథా దృష్టా కృత్యం యచ్చాపి సాంప్రతమ్।
రాజ్ఞ స్తత్క్రియతాం తావ దేష కాలస్య నిశ్చయః॥ ౧౦

సంస్కార్యో హరిరాజశ్చ అంగద శ్చాభిషిచ్యతామ్।
సింహాసనగతం పుత్రం పశ్యంతీ శాంతి మేష్యసి॥ ౧౧

సా తస్య వచనం శ్రుత్వా భర్తృవ్యసనపీడితా।
అబ్రవీ దుత్తరం తారా హనూమంత మవస్థితమ్॥ ౧౨

అంగదప్రతిరూపాణాం పుత్రాణా మేకత శ్శతమ్।
హతస్యాప్యస్య వీరస్య గాత్రసంశ్లేషణం వరమ్॥ ౧౩

(౭) శాస్త్రములు ద్వారా తత్త్వార్థములను నెరింగిన వాఁడును దుఃఖించు చుండు తన వారిని సమాధాన పరచుటలోను, వారియిష్టార్థములను బూర్తిచేయుటలోను వారియపరాధములను క్షమించుటలోను సాసక్తిగలవాఁడును నగువాలి ధర్మాధర్మములను స్వాధీనములో గలవారి లోకమునకుఁ బోయినందున అతనికి గాను దుఃఖించవలదు.

(౮) పూజ్యురాలా! సకల వానరోత్తములు నీకొడుకగు యీయంగదుఁడు యీవానరుల యెలుగుబంట్లరాజ్యము అన్నిటికిని నీవే యజమానురాలవైతివి.

(౯) ఓభామినీ! ఈదుఃఖ సంతాపములను విడువుము. నీవు పోషించుచుండు యీయంగదుఁడు భూమిని పాలించుగాక.

(౧౦) సంతానము గలిగినందుకు గల ప్రయోజనమును, ఇపుడు మనము సేయవలసిన కార్యమును, అన్నిటిని మనము వాలివిషయమై చేయవలయును. ఇపుడు మనము ఆలోచించవలసినది యిదియేను.

(౧౧) వానరరాజగు వాలికిసంస్కారము, అంగదునికి పట్టాభిషేకము, సేయవలయును. సింహాసనములోఁ గూర్చుండిన కొడుకును జూచుచు నీదుఃఖమును బోగొట్టుకొనెదవు.

(౧౨) తార హనుమంతునిమాట విని, పెనిమిటి దుఃఖముచేఁ బీడితురాలై అతని కిటుల బదులు చెప్పెను.

(౧౩) అంగదునివంటి నూర్గురు సుపుత్రులను త్రాసులో నొకప్రక్కను యింకొకప్రక్క హతుఁడైన యీవాలియొక్క గాఢాలింగనమును, నుంచి తూచినటులైతే భర్త ఆలింగనమె శ్రేష్ఠముగ నుండును.

నచాహం హరిరాజస్య ప్రభవా మ్యంగదస్య వా।
పితృవ్య స్తస్య సుగ్రీవ స్సర్వకార్యేష్వనంతరః॥ ౧౪
నహ్యేషా బుద్ధి రాస్థేయా హనుమ న్నంగదం ప్రతి।
పితా హి బంధుః పుత్రస్య నమాతా హరిసత్తమ॥ ౧౫
నహి మమ హరిరాజసంశ్రయాత్ క్షమతర మస్తి పరత్ర చే
హ వా। అభిముఖహతవీరసేవితం శయన మిదం మమ సేవి
తుం క్షమమ్॥ ౧౬

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - ఏకవింశస్సర్గః.



## ద్వావింశస్సర్గః.



వీక్షమాణస్తు మందాసు స్సర్వతో మంద ముచ్ఛ్వసన్।
ఆదావేవతు సుగ్రీవం దదర్శ త్వాత్మజాగ్రతః॥ ౧
తం ప్రాప్తవిజయం వాలీ సుగ్రీవం ప్లవగేశ్వరః।
ఆభాష్య వ్యక్తయా వాచా సస్నేహ మిద మబ్రవీత్॥ ౨

(౧౪) వాలికి యిప్పుడు చేయవలసిన కార్యములోను, అంగదునికి పట్టాభిషేకము సేయవలసిన విషయములోను నాకు స్వతంత్రములేదు. పినతండ్రిగనుండు సుగ్రీవుఁడు అంగదునికి అన్నికార్యములు చేయుంగలవాఁడుగ నున్నాఁడు.

(౧౫) హనుమంతుఁడా! అంగదుని విషయమై నేనేమియు నాలోచింపవలసినది లేదు. పుత్రునికిఁ దండ్రే హితము సేయువాఁడు. వానరోత్తమా! తల్లి కాదు. (బిడ్డకు తల్లి తాత్కాలిక ప్రియమును నాలోచించును. తండ్రి ఉత్తరోత్తర క్షేమమును గోరుచుండునని భావము.)

(౧౬) ఈలోకములోగాని పరలోకములోగాని వానర రాజగు వాలిని నాశ్రయించి యుండుటకంటె నాకు శ్రేయ మింకొకటిలేదు. శత్రువునకు అభిముఖముగ హతుఁడుగనుండు వీరుఁడగువాలి పండుకొనియుండు భూమిమీఁదనే నేను ప్రాయోపవేశముచేసి పండుకొనియుండుట యుక్తము.

ఇది యిరువదియొకటవ సర్గ.

## ౨౨ వ సర్గ.

(అవతారిక.— రాముని బాణము తగిలి మూర్ఛ పొందినవాలి, మృతుఁడాయెనని నిశ్చయించి, అతనికి సంస్కారము సేయుటకు హనుమంతుఁడు త్వరపడగా, దైవవశముచే వాలికి తెలివివచ్చి జరుగవలసిన పనులను నతఁడిట్లు తెలుపుచున్నాఁడు.)

(౧) అల్పముగ ప్రాణముగలవాలి కొంచెముగ శ్వాసమువిడిచి నలుదిక్కులు చూచుచు అతని కొడుకుకుముందుగ నుండిన సుగ్రీవుని మొగలు చూచెను.

(౨) వానరరాజగువాలి జయము పొందియుండు సుగ్రీవుని బిలిచి స్నేహమును జూపుమాటలు వ్యక్తముగ నిటుల చెప్పెను.

సుగ్రీవ దోషేణ న మాం గంతు మర్హసి కిల్బిషాత్।
కృష్యమాణం భవిష్యేణ బుద్ధిమోహేన మాం బలాత్॥ ౩
యుగప ద్విహితం తాత న మన్యే సుఖ మావయోః।
సౌహార్దం భ్రాతృయుక్తంహి తదిదం తాత నాన్యథా॥ ౪

ప్రతిపద్య త్వ మద్యైవ రాజ్య మేషాం వనౌకసామ్।
మా మప్యద్యైవ గచ్ఛంతం విద్ధి వైవస్వతక్షయమ్॥ ౫
జీవితంచహి రాజ్యంచ శ్రియంచ విపులా మిమామ్।
ప్రజహామ్యేష వై తూర్ణం మహ చ్చాగర్హితం యశః॥ ౬
అస్యాం త్వహ మవస్థాయాం వీర వక్ష్యామి య ద్వచః।
యద్యప్యసుకరం రాజన్ కర్తు మేవ తదర్హసి॥ ౭

సుఖార్హం సుఖసంవృద్ధం బాల మేన మబాలిశమ్।
బాష్పపూర్ణముఖం పశ్య భూమౌ పతిత మంగదమ్॥ ౮
మమ ప్రాణైః ప్రియతరం పుత్రం పుత్ర మివౌరసమ్॥ ౮ ౪

మయా హీన మహీనార్థం సర్వతః పరిపాలయ॥ ౯
త్వ మేవాస్యహి దాతా చ పరిత్రాతాచ సర్వతః।
భయేష్వభయద శ్చైవ యథాహం ప్లవగేశ్వర॥ ౧౦

(౩) సుగ్రీవుఁడా! రాజ్యమునుండి నిన్ను వెడలఁగొట్టి నీభార్యను నపహరించినందున నన్ను దోషిగ భావించుటతగదు. నీకు గలుగగలఫలమును నిమిత్తముగఁ జేసికొని, నాకు బుద్ధిమాంద్యము గలిగినదని తెలిసికొనవలయును.

(౪) మనకిద్దరికిని సోదరులుగ నుండినందున గల స్నేహము రాజ్యసుఖము యీరెండును మనమిద్దరము జీవించియుండి అనుభవించునటుల దైవము చేయక పోయెను. ఓబిడ్డా! దైవగతి అన్యథా కానేరదు.

(౫) ఈ వానరరాజ్యమును నీవు యిపుడే స్వాధీనపరచుకొని పరిపాలింపుము. నేను యిపుడే యమునియింటికిఁ బోవుచున్నాను. తెలిసికొనుము.

(౬) ప్రాణమును రాజ్యమును గొప్పయైశ్వర్యమును శ్లాఘనీయమగు యశస్సును నేను త్వరగ విడిచిపెట్టి పోవుచున్నాను.

(౭) వీరుఁడా? ఈచరమావస్థలో నేను చెప్పుమాట, వినతగనిదిగ నుండినను, ఓరాజా! దానిప్రకారము నీవు చేయవలయును.

(౮,౮½) సుఖము అనుభవించుటకుఁ దగినవాఁడును, సుఖముగఁ బెరిగినవాఁడును, బాలుఁడును, మంచి బుద్ధిమంతుఁడును, కన్నీళ్లతో నిండిన ముఖము గలవాఁడును, నాకు ప్రాణములకంటె హెచ్చుగ నుండువాఁడును, నాకొడుకును, భూమిమీద పడియుండువాఁడును నగు అంగదుని, నీకడుపున పుట్టినబిడ్డనువలెఁ, జూచుకొనుము.

(౯,౧౦) నన్ను విడిచియుండు అంగదుని అన్ని విషయములలోను తృప్తిచేయుచు రక్షించవలయును. అంగదుఁడు కోరినవస్త్రాభరణములు యిచ్చువాఁడవును, శత్రువులనుండి రక్షించు వాఁడవును, భయము గలిగినపుడు అభయమిచ్చువాఁడవును, ఓవానరరాజా! నావలెనే, నీవు ఉన్నావు.

ఎష తారాత్మజ శ్శ్రీమాన్ త్వయా తుల్యపరాక్రమః।
రక్షసాం తు వధే తేషా మగ్రత స్తే భవిష్యతి॥ ౧౧
అనురూపాణి కర్మాణి విక్రమ్య బలవా న్రణే।
కరిష్యత్యేష తారేయ స్తరస్వీ తరుణోంగదః॥ ౧౨

సుషేణ దుహితా చేయ మర్థసూక్ష్మవినిశ్చయే।
ఔత్పాతికేచ వివిధే సర్వతః పరినిష్ఠితా॥ ౧౩
యదేషా సాధ్వితి బ్రూయాత్ కార్యం త న్ముక్తసంశయమ్।
న హి తారా మతం కించి దన్యథాపరివర్తతే॥ ౧౪

రాఘవస్యచ తే కార్యం కర్తవ్య మవిశంకయా।
స్యా దధర్మో హ్యకరణే త్వాం చ హింస్యా ద్వమానితః॥ ౧౫
ఇమాంచ మాలా మాధత్స్వ దివ్యాం సుగ్రీవ కాంచనీమ్।
ఉదారా శ్రీస్థ్సితా హ్యస్యాం సంప్రజహ్యా న్మృతే మయి॥ ౧౬

ఇత్యేవ ముక్త స్సుగ్రీవో వాలినా భ్రాతృసౌహృదాత్।
హర్షం త్యక్త్వా పున ర్దీనో గ్రహగ్రస్త ఇవోడురాట్॥ ౧౭
తద్వాలివచనా చ్ఛాంతః కుర్వ న్యక్త మతంద్రితః।
జగ్రాహ సోఽభ్యనుజ్ఞాతో మాలాం తాం చైవ కాంచనీమ్॥

వాలి సుగ్రీవునికి హితముచెప్పి బంగారుహారము యిచ్చుట. ౨౨ స

(౧౧) శ్రీమంతుడును తారాపుత్రుడును నగు అంగదుడు నీతో సమానమైన పరాక్రమము గలవాడు. రాక్షసులను వధించుటలో నీకు ముందునడచువాడు.

(౧౨) బలవంతుడును యౌవనుడును తారాపుత్రుడును నగు యీయంగదుడు యుద్ధములో పరాక్రమమును జూపి తగినపనులు సేయును.

(౧౩) సుషేణుని కూతురగు యీ తార సూక్ష్మమైన విషయములలోను నానావిధములగు హేష్యముల ఫలములను గనిపెట్టుటలోను, అన్ని విషయములలోను పాండిత్యము గలది.

(౧౪) ఈమె మంచిదని చెప్పినకార్యమును సంశయములేక చేయవలయును. తారయొక్క అభిప్రాయము అన్యథా కానేరదు.

(౧౫) శ్రీరాముని కార్యమును నీవు నిస్సందేహముగ జేయవలయును. చేయకపోయినట్లైతే పాపము సంభవించును. అతని నవమానించినచో అతడు నిన్ను చంపును.

(౧౬) సుగ్రీవుడా! శ్రేష్ఠమగు యీబంగారు హారమును దీసికొనుము. దీనిలో గంభీరమగు కాంతియున్నది. నేను పోయినపిమ్మట శత్రువులను జయించవచ్చును.

(౧౭) వాలి తమ్మునిమీదగల ప్రీతిచే యిట్లుచెప్పినమాటను సుగ్రీవుడు విని సంతోషమువిడిచి దీనుడై రాహుగ్రస్తమైన చంద్రునివలెనుండెను.

(౧౮) వాలిమాటవిని వైరము విడిచి జాగరూకత గలవాడై యుక్తమైన కార్యమును జేయుటలో కోరికగలవాడై వాలియాజ్ఞచే బంగారు హారమును సుగ్రీవుడు దీసికొనెను.

తాంమాలాం కాంచనీందత్త్వా వాలీ దృష్ట్వాఽత్మజం స్థితమ్।
సంసిద్ధః ప్రేత్యభావాయ స్నేహా దంగద మబ్రవీత్॥ ౧౯

దేశకాలౌ భజస్వాద్య క్షమమాణః ప్రియాప్రియే।
సుఖదుఃఖసహః కాలే సుగ్రీవ వశగో భవ॥ ౨౦

యథాహి త్వం మహాబాహో లాలిత స్సతతం మయా।
న తథా వ ర్తమానం త్వాం సుగ్రీవో బహుమంస్యతే॥ ౨౧

మాఽస్యామిత్రై ర్గతం గచ్ఛే ర్మాశత్రుభి రరిందమ।
భ ర్తు రర్థపరో దాంత స్సుగ్రీవవశగో భవ॥ ౨౨

నచాతిప్రణయః కార్యః క ర్తవ్యోఽప్రణయశ్చ తే।
ఉభయంహి మహాదోష స్తస్మా దంతరదృగ్భవ॥ ౨౩

ఇత్యుక్త్వాథ వివృత్తాక్ష శ్శరసంపీడితో భృశమ్।
వివృతై ర్దశనై ర్భీమై ర్బభూవోత్క్రాంతజీవితః॥ ౨౪

వాలి అంగదునికి బుద్ధిచెప్పి ప్రాణము విడుచుట. ౨౧౧

(౧౯) వాలి ఆబంగారుహారమునిచ్చి ప్రాణము విడుచుటకు సన్నద్ధుండై సమీపములోనుండు కొడుకగు అంగదుని జూచి ప్రేమతో నిట్లనెను.

(౨౦) నేను పోయినపిమ్మట దేశకాలములను బాగుగ గ్రహించుచు, ప్రియాప్రియములను సైచుకొని, ఆయా కాలములలో, అనగా, సుఖపడవలసి నప్పుడు సుఖమును, సుఖపడవలసినప్పుడు గలుగు దుఃఖమును సైచుకొని, సుగ్రీవునికి పరతంత్రుడవై యుండవలయును.

(౨౧) గొప్పభుజములుగలవాడా! సదా నేను నిన్ను యెట్టుల పోషించితినో, నావిషయములో నడచుకొనినటుల సుగ్రీవుని విషయములో నడచుకొనినటులైతే, అటుల సుగ్రీవుడు నిన్ను రక్షింపడు.

(౨౨) సుగ్రీవునికి మిత్రులుగనటించి అమిత్రులుగ నుండువారితోఁ గలిసినవారితోను, అతని శత్రువులతోను నీవు సహవాసము చేయవలదు.

(౨౩) రాజునకు మేలుచేయుటలో ఆసక్తిగలవాడవై, వినీతుడవై సుగ్రీవునికి లోబడియుండుము. రాజుపట్ల అధిక స్నేహము, స్నేహమే లేకయుండుట, రెండును తగదు. ఈరెండును గొప్పదోషములేను. కనుక, మధ్యస్థుడవుగ నుండుము.

(౨౪) ఇటులచెప్పి, బాణముచే మిగుల బాధపడుచుండిన వాలి కన్నులు త్రిప్పి నోరు తెరచుకొనియుండుటచే బాగుగ అగుపడి భయంకరమగు దంతములు చూపించుచు ప్రాణము విడిచెను.

తతో విచుక్రుశు స్తత్ర వానరా హరియూథపాః।
పరిదేవయమానా స్తే సర్వే ప్లవగపుంగవాః॥ ౨౫
కిష్కింధా హ్యద్య శూన్యాసీ త్స్వర్గతే వానరాధిపే।
ఉద్యానానిచ శూన్యాని పర్వతాః కాననానిచ॥ ౨౬
హతే ప్లవగశార్దూలే నిష్ప్రభా వానరాః కృతాః॥ ౨౬½

యస్య వేగేన మహతా కాననాని వనానిచ।
పుష్పౌఘేణానుబధ్యంతే కరిష్యతి తదద్య కః॥ ౨౭½
యేన దత్తం మహ ద్యుద్ధం గంధర్వస్య మహాత్మనః।
గోలభస్య మహాబాహో ర్దశ వర్షాణి పంచచ॥ ౨౮½
నైవరాత్రౌ నదివసే తద్యుద్ధ ముపశామ్యతి।
తతస్తు షోడశే వర్షే గోలభో వినిపాతితః॥ ౨౯½

హత్వా తం దుర్వినీతం తు వాలీ దంష్ట్రాకరాళవాన్।
సర్వాభయకరోఽస్మాకం కథ మేష నిపాతితః॥ ౩౦½
హతేతు వీరే ప్లవగాధిపే తదా ప్లవంగమా స్తత్ర నశర్మ లే
భిరే। వనేచరా స్సింహయుతే మహావనే యథాహి గావో ని
హతే గవాంపతౌ॥ ౩౧½

(౨౫) పిమ్మట, వానరసేనానాయకులును వారిలో శ్రేష్ఠులును నగు వానరులందరు దుఃఖించుచు అచట గట్టిగ నేడ్చిరి.

(౨౬) వానరరాజగు వాలి స్వర్గస్థుఁడు కాగా, కిష్కింధ యుద్యానవనములు పర్వతములు అరణ్యములు శూన్యముగ అగుపడుచున్నవి.

(౨౬½) వానరశ్రేష్ఠుఁడగు వాలి మృతిపొందగా వానరులు తేజోహీనులుగనుండిరి.

(౨౭½) అరణ్యములు సరస్సులు వాలిపరాక్రమమునకు భయపడి సదా పూచియుండినవి. అటుల, యిపుడెవఁడు చేయఁగలఁడు.

(౨౮½,౨౯½) మహాత్ముఁడును గొప్పభుజములుగలవాఁడును నగు గోలభుఁడను గంధర్వునితో ౧౫ సంవత్సరములు వాలి గొప్పయుద్ధముచేసెను. ఆయుద్ధము రాత్రి పగటిపూటలలో నిలిచియుండినదిలేదు.

(౩౦½) పిమ్మట, ౧౬ వ సంవత్సరములో గోలభుఁడు ప్రాణము విడిచి క్రిందపడెను. భయంకరమైన కోరపండ్లు గలవాలి దుష్టుఁడగు నతనిజంపి మనకు అన్నివిధములలోను క్షేమముగలిగించెను. అట్టివాలి క్రిందపడియున్నాఁడు.

(౩౧½) సింహములు నిండియుండు గొప్ప యడవిలో, అచట సంచరించుచుండు గోవులు వృషభరాజు చచ్చినపుడెట్లు సుఖమును పొందవో, అటులనే వీరుఁడుగను వానరులకు రాజుగనున్నందు వాలి హతుఁడుకాగా అచటివానరులు సుఖపడలేదు.

తతస్తు తారా వ్యసనార్ణవాప్లుతా మృతస్య భర్తు ర్వదనం స
మీక్ష్య సా । జగామ భూమిం పరిరభ్య వాలినం మహాద్రు
మం ఛిన్నమివాశ్రితా లతా॥ ౩౨½

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - ద్వావింశస్సర్గః.

---

## త్రయోవింశస్సర్గః.

తత స్సముపజిఘ్రంతీ కపిరాజస్య తన్ముఖమ్।
పతిం లోకా చ్చ్యుతం తారా మృతం వచన మబ్రవీత్॥ ౧
శేషే త్వం విషమే దుఃఖ మకృత్వా వచనం మమ।
ఉపలోపచితే వీర సుదుఃఖే వసుధాతలే॥ ౨
మత్తః ప్రియతరా నూనం వానరేంద్ర మహీ తవ।
శేషే హి తాం పరిష్వజ్య మాంచ న ప్రతిభాషసే॥ ౩
సుగ్రీవస్య వశం ప్రాప్తో విధి రేష భవత్యహో।
సుగ్రీవ ఏవ విక్రాంతో వీర సాహసికప్రియ॥ ౪
ఋక్షవానర ముఖ్యా స్త్వాం బలినః పర్యుపాసతే।
ఏషాం విలపితం కృచ్ఛ్ర మంగదస్య చ శోచతః॥ ౫
మమ చేమాం గిరం శ్రుత్వా కిం త్వం న ప్రతిబుధ్యసే॥ ౫½

(౩-౨౬) పిమ్మట, తార వ్యసన మనుసముద్రములో తెప్పలేలి, చచ్చిన తన భర్తముఖమును జూచి, యతని నాలింగనము సేసికొని, నరికివేయఁబడిన గొప్పవృక్షము నాశ్రయించియుండిన లతవలె, భూమిమీఁద పడెను.

ఇది ఇరువది రెండవ సర్గ.

---

## ౨౩ వ సర్గ.

(అవతారిక — ఈసర్గలో తారా ప్రలాపము చెప్పఁబడుచున్నది.)

(౧) వానరరాజగు వాలి ముఖమును ముద్దుపెట్టుకొనుచు, యీలోకమును విడిచి స్వర్గస్థుఁడైన పతిని జూచి తార యిటు లనెను.

(౨) వీరుఁడా! నామాటవినక మిట్టపల్లముగను రాళ్ళతోనిండి మిగుల దుఃఖకరముగనుండు భూమిమీద దుఃఖమును గలిగించుచు పండుకొనియున్నావు.

(౩) వానరేంద్రుఁడా! భూమి నీకు నాకంటె మిగుల ప్రియురాలుగనున్నది. ఏలననఁగా, ఆమెను నాలింగనము చెసుకొని పండుకొని నాతో మాటలాడకున్నావు.

(౪) వీరుఁడా! సాహసముగలవాఁడా! ప్రియుఁడా! నీవుసుగ్రీవునికి వశుఁడవైతివి. సుగ్రీవుఁడే పరాక్రమ శాలియను విషయము దైవకార్యము. ఆశ్చర్యము.

(౫,౬) యెలుగొడ్డు వానరులలో ముఖ్యులుగనుండు వారు బలవంతుఁడగు నిన్ను ఆశ్రయించియున్నారు. వీరిప్రలాపమును, అంగదుని గొప్పదుఃఖమును నాదుఃఖ వాక్యమునువిని యెందుకు లేవకున్నావు.

ఇదం తద్వీర శయనం యత్ర శేషే హతో౽యుధి।
శాయితా నిహతా యత్ర త్వయైవ రిపవః పురా॥ ౬౫
విశుద్ధసత్వాభిజన ప్రియయుద్ధ మమ ప్రియ।
మా మనాథాం విహాయైకాం గత స్త్వ మసి మానద॥ ౭౫

శూరాయ న ప్రదాతవ్యా కన్యా ఖలు విపశ్చితా।
శూరభార్యాం హతాం పశ్య సద్యో మాం విధవాంకృతామ్॥
అవభగ్నశ్చ మే మానో భగ్నా మే శాశ్వతీ గతిః।
అగాధేచ నిమగ్నాస్మి విపులే శోకసాగరే॥ ౯౫

అశ్మసారమయం నూన మిదం మే హృదయం దృఢమ్।
భర్తారం నిహతం దృష్ట్వా య న్నాద్య శతధా గతమ్॥ ౧౦౫
సుహృచ్చైవహి భర్తా చ ప్రకృత్యా మమచ ప్రియః।
ఆహవేచ పరాక్రాంత శ్శూరః పంచత్వ మాగతః॥ ౧౧౫

పతిహీనాతు యా నారీ కామం భవతు పుత్రిణీ।
ధనధాన్యై స్సుపూర్ణాపి విధవే త్యుచ్యతే జనైః॥ ౧౨౫
స్వగాత్రప్రభవే వీర శేషే రుధిరమండలే।
క్రిమిరాగ పరిస్తోమే త్వ మాత్మశయనే యథా॥ ౧౩౫

(౬౪) పూర్వము, నీచే యుద్ధములోఁ జంపఁబడిన శత్రువులు యెట్టి వీరశయనములోఁ బండుకొనియుండిరో, అట్టుల రామునిచేఁ జంపఁబడి వీరశయనము లోనే నీవు యిపుడు పండుకొనియున్నావు.

(౭౪) కపటయుద్ధము సేయనందున నిజమైన బలముగలవాఁడా! మంచికులములోఁ బుట్టినవాఁడా! యుద్ధములో మిగుల ప్రీతిగలవాఁడా! నాప్రియుఁడా! ఒంటరిగను దిక్కులేనిదిగనుండు నన్ను విడిచి, ఓమానదా! నీవు పోతివా గదా.

(౮౪) తెలివిగలవాఁడు కన్యకను శూరుని కీయకూడదు. శూరునికి భార్యనై వెంటనే విధవనై, పతిలేక చెడిన నన్ను చూడుము.

(౯౪) నాయహంకారము శాశ్వతముగనుండు పతి వేవపోయినది. అగాధముగను విశాలముగను నుండు దుఃఖసముద్రములో మునిఁగితిని.

(౧౦౪) మృతిపొందియుండు భర్తను జూచి అనేకభాగములుగ బద్దలుకానందున నాగుండె రాతిగుండెగ మున్నది. నిజము. ఏలననఁగా, యిదిమిగుల ధృఢముగ నున్నది,

(౧౧౪) నాకు స్నేహితుఁడుగను భర్తగను నాస్వభావముచే నాకు ప్రియుఁడుగను యుద్ధములో శత్రువులను జంపువాఁడును శూరుఁడును నగు వాలి మృతుఁడాయెను.

(౧౨౪) పతిలేనిస్త్రీ అనేకులు పుత్రులను గలదిగనుండినను ధనధాన్య సమృద్ధి గలదిగనుండినను లోకులు ఆమెను విధవయనియె చెప్పుదురు.

(౧౩౪) వీరుఁడా! ఇంద్రగోపమను పేరుగలపురుగు రంగువంటి రంగుగల పరుపుగల నీపడకలో నీవు పండుకొని యుండునట్టుల నీదేహమునుండి వచ్చురక్తప్రవాహములో పండుకొని యున్నావు.

రేణుశోణితసంవీతం గాత్రం తవ సమంతతః।
పరిరబ్ధుం నశక్నోమి భుజాభ్యాం ప్లవగర్షభ॥ ౧౪॥

కృతకృత్యోఽద్య సుగ్రీవో వైరేఽస్మి న్నతిదారుణే।
యస్య రామవిముక్తేన హృత మేకేషుణాభయమ్॥ ౧౫॥

శరేణ హృదిలగ్నేన గాత్రసంస్పర్శనే తవ।
వార్యామి త్వాం నిరీక్షంతీ త్వయి పంచత్వ మాగతే॥ ౧౬॥

ఉద్బబర్హ శరం నీల స్తస్య గాత్రగతం తదా।
గిరిగహ్వరసంలీనం దీప్త మాశీవిషం యథా॥ ౧౭॥

తస్య నిష్కృష్యమాణస్య బాణస్యచ బభౌ ద్యుతిః।
అస్త మస్తకసంరుద్ధో రశ్మి ర్దినకరాదివ॥ ౧౮॥

పేతుః క్షతజధారాస్తు వ్రణేభ్య స్తస్య సర్వశః।
తామ్రగైరిక సంపృక్తా ధారాఇవ ధరాధరాత్॥ ౧౯॥

అవకీర్ణం విమార్జంతీ భర్తారం రణరేణునా।
అస్రై ర్నయనజైః శూరం సిషేచాస్త్రసమాహతమ్॥ ౨౦॥

(౧౪౫) వానరశ్రేష్ఠుఁడా! నీదేహమంతయు రక్తము గలిసిన మట్టితో కప్పఁబడియున్నది. భుజములతో నాలింగనము చేసికొనుటకు నాకు సరిపడలేదు.

(౧౫౫) మిగుల ఘోరమైన సుగ్రీవునికి నీకు గలద్వేషములో శ్రీరాముఁ డొక బాణమును బ్రయోగించి, నిన్నుజంపి, సుగ్రీవుని భీతిని నతఁడు తొలగించినందున, యిపుడు అతని మనోరథము సఫలమైనది.

(౧౬౫) మృతినొందిన నిన్ను చూచుచుండు నేను నిన్ను ఆలింగనము చేసికొను విషయములో, నీరొమ్ములోఁ బాఁడుకొని యుండు బాణము నన్ను అడ్డగించుచున్నది.

(౧౭౫) కొండగుహలో దాగియుండు క్రూరముగనుండు సర్పమును నీడిచివేయునటుల సుగ్రీవుని సేనాపతియగు నీలుఁడు వాలిరొమ్ములో గుచ్చుకొని యుండు బాణము తీసివేసెను.

(౧౮౫) అస్తగిరి శిఖరములో నుండిన సూర్యుని విడిచి వచ్చు కాంతివలె వాలి రొమ్మునుండి తీసివేయఁబడుచుండు శ్రీరాముని బాణముయొక్క కాంతి ప్రకాశించెను.

౧౯౫ వాలి దేహములో నుండిన వ్రణములనుండి రక్తధారలు, పర్వతము నుండి యెఱ్ఱగనుండు గైరికధాతువులతో సంబంధపడి యెఱ్ఱగఁ బ్రవహించు నదివలె స్రవించినవి.

(౨౦౫) రాముని బాణముతోఁ గొట్టఁబడి యుద్ధరంగములో గల దుమ్ము గప్పఁబడిన భర్తదేహమును దుడుచుచు నేత్రములనుండి వచ్చుచుండు కన్నీరుచే శూరుఁడగునతని తార తడిపెను.

రుధిరోక్షితసర్వాంగం దృష్ట్వా వినిహతం పతిమ్।
ఉవాచ తారా పింగాక్షం పుత్ర మంగద మంగనా॥ ౨౧
అవస్థాం పశ్చిమాం పశ్య పితుః పుత్ర సుదారుణామ్।
సంప్రసక్తస్య వైరస్య గతోఽన్తః పాపకర్మణా॥ ౨౨

బాలసూర్యోదయతనుం ప్రయాంతం యమసాదనమ్।
అభివాదయ రాజానం పితరం పుత్ర మానదమ్॥ ౨౩
ఏవ ముక్త స్సముత్థాయ జగ్రాహ చరణౌ పితుః।
భుజాభ్యాం పీనవృత్తాభ్యా మంగదోఽహ మితి బ్రువన్॥ ౨౪

అభివాదయమానం త్వా మంగదం త్వం యథాపురా।
దీర్ఘాయు ర్భవ పుత్రేతి కిమర్థం నాభిభాషసే॥ ౨౫
అహం పుత్రసహాయా త్వా ముపాసే గతచేతసమ్।
సింహేన నిహతం సద్యో గా స్సవత్సేవ గోవృషం॥ ౨౬

ఇష్ట్వా సంగ్రామయజ్ఞేన రామప్రహరణాంభసి।
అస్మి న్నవభృథే స్నాతః కథం పత్న్యా మయా వినా॥ ౨౭
యా దత్తా దేవరాజేన తవ తుష్టేన సంయుగే।
శాతకుంభమయీం మాలాం తాం తే పశ్యామి నేహ కిమ్॥

(౨౧) రామునిచేఁ జంపఁబడి రక్తముతోఁ దడిసిన సర్వాంగములు గలిగి పడియుండు పతినిజూచి తార, పింగళవర్ణమువంటి నేత్రములుగల కొడుకగు అంగదునితో నిటులనెను.

(౨౨) బిడ్డా! మిగుల భయంకరమైన తండ్రియొక్క చరమావస్థను జూడుము. పాపకార్యముచే సంభవించిన వైరము ముగిసినది.

(౨౩) ఉదయించిన బాలసూర్యునివలె సుందుదేహము గలవాఁడును, యముని యింటికిఁ బోవుచుండువాఁడును, నామానమును గాపాడినవాఁడును, వానరరాజునగు నీతండ్రికి నమస్కరింపుము.

(౨౪) ఇటుల తార చెప్పగా, అంగదుఁడు లేచి బలిసి గుండ్రముగనుండు భుజములతో తండ్రియగు వాలి పాదములను బట్టుకొని 'నేను అంగదుఁడను నమస్కారము సేయుచున్నాను' అని చెప్పెను.

(౨౫) నాథా! పూర్వము నీవు ఆశీర్వదించినటుల నీకు నమస్కరించుచుండు అంగదుని 'దీర్ఘాయుస్సు గలిగియుండుము, అని యెందుకు ఆశీర్వదించకున్నావు.

(౨౬) సింహముచేఁ జంపఁబడిన వృషభమును దూడతోఁ గూడిన ఆవు ఆశ్రయించి యుండునటుల, నేను నాబిడ్డతోఁగూడి మృతిపొందియుండు నీసమీపములోనున్నాను.

(౨౭) యుద్ధ మను యాగమును నీవుచేసి రాముని బాణ మనుజలములో, భార్యనగు నన్ను విడిచి, యెటుల నీవు అవభృతస్నానము చేసితివి.

(౨౮) యుద్ధములో నిన్ను మెచ్చి ఇంద్రుఁడు యిచ్చిన బంగారు హారమును నేను జూచుచున్నాను,

రాజశ్రీ ర్నజహాతి త్వాం గతాసుమపి మానద।
సూర్యస్యావ ర్తమానస్య శైలరాజమివ ప్రభా॥ ౨౯ ౫
న మే వచః పథ్య మిదం త్వయా కృతం నచాస్మి శక్తా వినివా
రణే తవ। హతా సపుత్రాస్మి హతేన సంయుగే సహ త్వయా
శ్రీ ర్విజహాతి మా మిహ॥ ౩౦ ౫

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - త్రయోవింశస్సర్గ.

## చ తు ర్విం శ స్స ర్గః.

తాం చాశ్రువేగేన దురాసదేన త్వభిప్లుతాం శోకమహార్ణ వేన।
పశ్యం స్తదా వాల్యనుజ స్తరస్వీ భ్రాతుర్వధేనాప్రతిమేన తేపే॥
స బాష్పపూర్ణేన ముఖేన వీక్ష్య క్షణేన నిర్విణ్ణమనా మనస్వీ।
జగామ రామస్య శనై స్సమీపం భృత్యై ర్వృత స్సంపరి
దూయమానః॥ ౨
సతం సమాసాద్య గృహీతచాప ముదాత్త మాశీవిషతుల్యబా
ణమ్। యశస్వినం లక్షణ లక్షితాంగ మవస్థితం రాఘవ
మిత్యువాచ॥ ౩

(౨౯) మానమును గాపాడువాఁడా! నీవు ప్రాణము విడిచినందున నీ రాజ్యలక్ష్మి, అస్తమగుచుండు సూర్యుని కాంతి మేరుపర్వతమును విడువకుండు నటుల, నిన్ను విడువకున్నది.

(౩౦) హితముగనుండు నామాటను నీవు వినకపోతివి. నిన్ను అడ్డగించుటకు నాకుస్వతంత్రము లేకపోయినది. యుద్ధములో మృతిపొందియుండు నీతోడ పుత్రునితోడ నేను చెడితిని ఇప్పుడు సౌమంగళ్యలక్ష్మి నన్ను విడిచి పోయినది.

ఇది ఇరువది మూడవ సర్గ.



౨౪ వ సర్గ.

(అవతారిక.— తారయొక్క ప్రలాపమును విని దుఃఖించుచుండు సుగ్రీవునికి శ్రీరాముఁడు సమాధానము చెప్పుట, తారకు రామునివిషయమై గల ప్రతిపత్తి యీ సర్గలోఁ జెప్పఁబడుచున్నవి.)

(౧) కన్నీరను ప్రవాహముతోను ఒడ్డు చేయుటకు సాధ్యపడనిదుఃఖసముద్రముతోను నిండియుండు తారను జూచుచు, అపుడు, వాలితమ్ముఁడుగను బలవంతుఁడుగను నుండుసుగ్రీవుఁడు, సంభవించకూడని అన్నమరణమునకై, మిగుల దుఃఖించెను.

(౨) కన్నీరునిండిన ముఖము గలతారను జూచి అపుడే మిగులచింతపొందిన మనసుగలవాఁడును మంచి మనసుగలవాఁడును నగు సుగ్రీవుఁడు మిగుల దుఃఖించి సేవకులతోఁగూడి శ్రీరాముని సమీపమునకుఁ బోయెను.

(౩) ధనుసుగలవాఁడును, ఉత్తముఁడును, సర్పమువంటి బాణముగలవాఁడును, కీర్తిగలవాఁడును, మంచి లక్షణములు గలదేహము గలవాఁడునునగు రాముని సమీపమునకుఁబోయి సుగ్రీవుఁ డిటు లనెను.

యథా ప్రతిజ్ఞాత మిదం నరేంద్ర కృతం త్వయా దృష్ట ఫలం చ కర్మ । మమాఽద్యభోగేషు నరేంద్రపుత్ర మనో నివృత్తం సహ జీవితేన॥ ౪

అస్యాం మహిష్యాంతు భృశం రుదంత్యాం పురేచ విక్రోశతి దుఃఖతప్తే । హతేఽగ్రజే సంశయితేంగదేచ న రామ రాజ్యే రమతే మనో మే॥ ౫

క్రోధా దమర్షా దతివిప్రధర్షాత్ భ్రాతు ర్వధో మేఽనుమతః పురస్తాత్ । హతే త్విదానీం హరియూథపేఽస్మిన్ సుతీవ్ర మిక్ష్వాకుకుమార తప్స్యే॥ ౬

శ్రేయోఽద్య మన్యే మమ శైలముఖ్యే తస్మి న్నివాస శ్చిర మృశ్యమూకే। యథా తథా వర్తయత స్స్వవృత్త్యా నేమం నిహత్య త్రిదివస్య లాభః॥ ౭

న త్వాం జిఘాంసామి చరేతి యన్మా మయం మహాత్మా మతి మా నువాచ। తస్యైవ తదారామ వచోనురూప మిదం పునః కర్మచ మేఽనురూపమ్॥

(౪) ఓ రాజా! ప్రతిజ్ఞప్రకారము రాజ్యరూపముగ నగుపడుచుండుఫలముగల కార్యమును జేసితివి. ఓ రాజకుమారా! రాజ్యసుఖానుభవములనుండి నామనసు యిపుడు ప్రాణముతోడ తిరిగిపోయినది. (అనఁగా, వీనిమీఁద నాకిష్టము లేదనుట.)

(౫) పట్టపుదేవియగు యీతార దుఃఖించుచుండఁగా, దుఃఖముచే తపించి పురజనులు యేడ్చుచుండఁగా, అన్న చచ్చుచుండఁగా, తండ్రిపోయిన దుఃఖముతోఁ జీవించునో లేదోయను శంకకు అంగదుఁడు పాత్రుఁడగుచుండఁగా, ఓ రామా! రాజ్యసుఖానుభవమును నామనసు కోరలేదు.

(౬) కారణములేక నన్ను వెడలగొట్టిన కోపముచేతను, అతని కఠినోక్తులను సైచలేకను, నన్ను అతఁడు మిగుల హింసపెట్టినందునను అన్నను జంపుట, పూర్వము, నాకు యిష్టముగనుండెను. ఇపుడు వానర నాథుఁడగు యీవాలి మాతుఁడుకాఁగా, ఓ ఇక్ష్వాకుకుమారా! నేను మిగుల దుఃఖించుచున్నాను.

(౭) అచట, యెటులైనను వానరజాతికి తగిన వృత్తిచే జీవించుచు పర్వతములలో ముఖ్యముగనుండు ఋశ్యమూకములో చిరకాలము వసించుట నాకు మిగుల శ్రేయమని తలంచుచున్నాను. ఇతని జంపి స్వర్గలాభముసహా నాకు శ్రేయముకాదు.

(౮) గొప్ప స్వభావము గలవాఁడును, కర్తవ్యాకర్తవ్య వివేకశీలుఁడును నగు యీవాలి 'నిన్ను నేనుజంపను నీయిష్టప్రకారము సంచరించుచుండుము' అని చెప్పెను. రామా! వాలి చెప్పిన ఆమాట అతనిబుద్ధికి శీలమునకుఁ దగియున్నది. నేనుచేసిన సోదరవధ నా దుష్టస్వభావమునకుఁ దగియున్నది.

భ్రాతా కథం నామ మహాగుణస్య భ్రాతు ర్వధం రాఘవ రో
చయేత । రాజ్యస్య దుఃఖస్యచ వీరసారం నచింతయ న్కామ
పురస్కృతస్సన్॥ ౯

వధోఽపి మే మతో నాసీ త్స్వమాహాత్మ్యావ్యతిక్రమాత్।
మమాసీ ద్బుద్ధిదౌరాత్మ్యా త్ప్రాణహారీ వ్యతిక్రమః॥ ౧౦

ద్రుమశాఖావభగ్నోఽహం ముహూర్తం పరినిష్టనన్।
సాంత్వయిత్వా త్వనేనోక్తో నపునః కర్తు మర్హసి॥ ౧౧

భ్రాతృత్వ మార్యభావశ్చ ధర్మశ్చానేన రక్షితః।
మయా క్రోధశ్చ కామశ్చ కపిత్వంచ ప్రదర్శితమ్॥ ౧౨

అచింతనీయం పరివర్జనీయ మనీప్సనీయం స్వనవేక్షణీయమ్।
ప్రాప్తోఽస్మి పాప్మాన మిమం నరేంద్ర భ్రాతు ర్వధా త్త్వాష్ట్ర
వధా దివేంద్రః॥ ౧౩

పాప్మాన మింద్రస్య మహీ జలంచ వృక్షాశ్చకామం జగృహు
స్త్రియశ్చ। కోనామ పాప్మాన మిమం క్షమేత శాఖామృగస్య
ప్రతిపత్తు మిచ్ఛన్॥ ౧౪

(౯) అన్నను చంపినందున గలిగినరాజ్యసుఖమునకు, ఆతని వధించిన పిమ్మట గలిగిన దుఃఖమునకు, గలతారతమ్యమును దెలిసికొనలేక, కామపరితంతుఁడనై, వీరుఁడా! రామా! గొప్పగుణములుగల అన్నను చంపువాఁడెటుల పోసదుఁడెకును.

(౧౦) తన మహిమను విడిచిపెట్టక ఉండుటచే వాలి నన్ను వధించుటకు కోరలేదు, నేను తెలివితక్కువచే అన్నను చంపించి ఆపాపము గట్టుకొంటిని.

(౧౧) చెట్ల కొమ్మలతోఁ గొట్టబడి నేను కొంతసేపు దీనస్వరము సేయుచుంటిని. అపుడు వాలి నన్ను సమాధానపరచి, యింకొకసారి యుద్ధమునకు తలపడవలదని చెప్పెను.

(౧౨) సోదరభావము సత్స్వభావము ధర్మమును వాలిగాపాడెను. నేనో కోపమును కామమును (రాజ్యలోభము) కోతి సేతను వ్యక్తపరచితిని.

(౧౩) ఓ రామా! న్నను జంపి ఇంతమాత్రమని నిర్ధారణచేయుటకు సాధ్యము కానిదియు, సాధువులచే త్యజింపఁజడినదియు, ఎప్పటికిని అభిలషింపఁతగనిదియు, కేవలము నింద్యముగ నుండునదియు నగు యిట్టి పాపమును, త్వష్టపుత్రుఁడగు విశ్వరూపునిజంపి ఇంద్రుఁడు పాపమును పొందినటుల, నేనుపొందితిని.

(౧౪) పరమైశ్వర్య సంపన్నుఁడగు ఇంద్రుని పాపమును భూమి జలము వృక్షములు స్త్రీలు ఊసర (చవుడు) నురుగు బంక బుతురూపముగ పంచుకొనెను. ఒకనికిని ఉపకారము సేయక వానరుఁడుగనుండు నాపాపమును నెవఁడు, యేదియో వరమును బడయుటకుగోరి, తీసికొనుటకు యిష్టపడును.

నార్హామి సంమాన మిమం ప్రజానాం న యౌవరాజ్యం కుత
ఏవ రాజ్యం। అధర్మయుక్తం కులనాశయుక్త మేవంవిధం రా
ఘవ కర్మ కృత్వా॥ ౧౫

పాపస్య కర్తాస్మి విగర్హితస్య క్షుద్రస్య లోకాప్రకృతస్య చైవ।
శోకో మహా న్మా మభివర్తతేఽయం వృష్టే ర్యథా నిమ్న మి
వాంబువేగః॥ ౧౬

సోదర్యఘాతాపరగాత్రవాల స్సంతాపహస్తాక్షి శిరోవిషాణః।
ఏనోమయో మామభిహంతి హస్తీ దృప్తో నదీకూల మివ ప్రవృద్ధః॥

అంహో బతేదం నృవరావిషహ్యం నివర్తతే మే హృది సాధు
వృత్తమ్। వివర్ణ మగ్నౌ పరితప్యమానం కిట్టం యథా రాఘవ
జాతరూపమ్॥ ౧౮

మహాబలానాం హరియూథపానా మిదం కులం రాఘవ మన్ని
మిత్తమ్। అస్యాంగదస్యాపిచ శోకతాపా దర్ధస్థితప్రాణమితీవ
మః ౧౯

(౧౪) ఓరాఘవా! అధర్మముతోఁ గూడినదియు, కులమును నశింపఁ జేయునదియు, నగు యిట్టిపనిని చేసిన నాకు ప్రజలు సేయు సన్మానమువలదు. యువ రాజ్యము మహారాజ్యమును వలదు.

(౧౫) నిందితముగ నుండునదియు, అసహ్యము గలిగించునదియు, లోకులెల్లను జేయఁదగనిదియు నగు పాపముచేసితిని. ఈగొప్పదుఃఖము, వర్షజలము వేగముగఁబోయి పల్లములో నిలిచినట్లు, నాయందు నిలిచినది.

(౧౬) సోదరుని జంపుటయను పెద్ద తోక గలదియు, సంతాపమనెడు తొండము కన్నులు తల కొమ్ములు గలదియు, నగు నాపాపమను యేనుఁగు, మదించి విజృంభించినది. వదలిమొద్దున కొమ్ములతో ధ్వంసముచేయునట్లు నన్ను జంపుచున్నది.

(౧౭) (అవతారిక.— పురాకృత సుకృతమువల్ల లభించిన వివేకధైర్యాదులచే యీదుఃఖమును సైచకూడదా యను ప్రశ్నకిది సమాధానము.) — ఓ నరోత్తమా! వన్నెలేనందున నిప్పులో పుటము వేయఁబడిన బంగారము కల్మషపదార్థములను వెలిద్రోసి అధికమాత్రము శుద్ధముగ నిలుచునట్లు, అన్నను జంపినందున గలిగిన పాపమును సైచక, నాహృదయములో నుండునట్టి సుకృతమువల్ల నాకులభించిన వివేక ధైర్యాదులు దూరముగఁ బోవుచున్నవి. ఓరామా! యిది కష్టము.

(౧౮) రామా! నానిమిత్తముగ అంగదునికి గలిగిన శోక తాపములవలన గొప్పబలము గలవానర సేనానాయకుల యీసమూహము, సగము ప్రాణము గలదాయెనని తలంచుచున్నాను.

సుత స్సులభ్య స్సుజన స్సువశ్యః కుత స్సుపుత్ర స్సదృశోఽంగ
దేన। నచాపి విద్యేత స వీరదేశో యస్మి న్భవే త్సోదరసన్ని
కర్షః॥ ౨౦
యద్యంగదో వీరవరార్హ జ్జీవే జ్జీవేచ్చ మాతా పరిపాలనార్థమ్।
వినాతు పుత్రం పరితాపదీనా తారా నజీవేదితి నిశ్చితం మే॥

సోఽహం ప్రవేక్ష్యామ్యతిదీప్త మగ్నిం భ్రాత్రాచ పుత్రేణచ
సఖ్య మిచ్ఛన్। ఇమే విచేష్యంతి హరిప్రవీరా స్సీతాం నిదేశే
తవ వర్తమానాః॥ ౨౨
కృత్స్నంతు తే సేత్స్యతి కార్యమేత న్మయ్యప్రతీతే మనుజేం
ద్రపుత్ర। కులస్య హంతార మజీవనార్హం రామానుజానీహి
కృతాగసం మామ్॥ ౨౩

ఇత్యేవ మార్తస్య రఘుప్రవీర శ్శ్రుత్వా వచో వాల్యనుజస్య
తస్య। సంజాతబాష్పః పరవీరహంతా రామో ముహూర్తం
విమనాబభూవ॥ ౨౪
తస్మిన్ క్షణేఽభీక్ష్ణ మవేక్ష్యమాణః క్షితిక్షమావా న్భువనస్య
గోప్తా। రామో రుదంతీం వ్యసనే నిమగ్నాం సముత్సుక స్సోఽథ
దదర్శ తారామ్॥

(౨౦) సాధారణముగ కోరుకొను వంటరికిని గలుగుచుండును. సౌజన్యముగలిగి మిగుల వశ్యుఁడుగనుండు అంగదునివంటి పుత్రుఁడు లోకములో సులభము గలుఁగఁడు. వీరుఁడా! సోదరుఁడు లభించునట్టి దేశము చిక్కదు.

(౨౧) వీరులగు సత్పురుషులచే స్తుతింపఁబడువాఁడా! అంగదుఁడు జీవించియుండునట్లైతే ఆతనిపోషించుట కతనితల్లి జీవించియుండును. లేనివాఁడు తపించి దీనురాలగు తార జీవించియుండదని నిశ్చయించుచున్నాను.

(౨౨) (అంగదుని మరణమును నిశ్చయించి సుగ్రీవుఁ డిట్లనుచున్నాఁడు)— రామా! నేను అన్నమీఁదను అన్నకొడుకు మీఁదను నాకుగల ప్రేమను జూపుచు మిగుల మండుచుండు అగ్నిలోఁ బ్రవేశించెదను. నీ యాజ్ఞలోనుండు వీరులగు యీ వానరులు సీతను వెతకి కనిపెట్టుదురు.

(౨౩) రాజకుమారా! నేను చచ్చిపోయినను నీ కార్యమంతయు పూర్తి యగును. కులమును నాశము చేసినవాఁడను గొప్పపాపము చేసినవాఁడను నగు నన్ను జీవించియుండుటకు తగనివానికి భావింపుము.

(౨౪) ఈవిధముగ దుఃఖించుచుండు వాలితమ్ముఁడగు సుగ్రీవుని మాటలు విని రఘువులలో వీరుఁడును వీరులగు శత్రువులను జంపువాఁడును నగు రాముఁడు కంటతడిపెట్టుకొని క్షణకాలము మనసు చెడి యుండెను.

(౨౫) అపుడు తారచే పదేపదే మాటఁబడుచుండువాఁడును ఓర్పులో భూమికి సమానుఁడుగ నుండువాఁడును లోకరక్షకుఁడును నగు రాముఁడు రోదనము సేయుచు దుఃఖములో మునిగియుండు తారను సమాధానపరచుటలో ఆదరము గలిగియుండెను.

తాం చారుం నేత్రాంకపిసింహనాథం పతిం సమాశ్లిష్య తదా
శయానామ్। ఉద్ధాపయామాసు రదీనసత్త్వాం మంత్రిప్రధా
నాః కపివీరపత్నీమ్॥ ౨౬

సా విష్ఫురంతీ పరిరభ్యమాణా భర్తు స్సకాశా దపనీయమా
నా। దదర్శ రామం శరచాపపాణిం స్వతేజసా సూర్యమివ జ్వ
లంతమ్॥ ౨౭

సుసంవృతం పార్థివలక్షణైశ్చ తం చారునేత్రం మృగశాబనే
త్రా। అదృష్టపూర్వం పురుషప్రధాన మయం స కాకుత్స్థ
ఇతి ప్రజజ్ఞే॥ ౨౮

తస్యేంద్రకల్పస్య దురాసదస్య మహానుభావస్య సమీప మా
ర్యా। ఆర్తాఽతితూర్ణం వ్యసనాభిపన్నా జగామ తారా పరి
విహ్వలంతీ॥ ౨౯

సా తం సమాసాద్య విశుద్ధసత్త్వా శోకేన సంభ్రాంత శరీరభా
వా। మనస్వినీ వాక్య మువాచ తారా రామం రణోత్కర్షణ
లబ్ధలక్షమ్॥ 30

(౨౬) అందమగు కన్నులు గలదియగు, శ్రేష్ఠులగు వానరులకు రాజగు పతిని నాలింగనము చేసికొని పండుకొని యుండునదియగు, గొప్పనైశ్వర్యము గలదియగు, వానర వీరుని భార్యయగు నందుతారను మంత్రులలో ముఖ్యుఁడగు హనుమాను రాముని రాకను జూచి లేవనెత్తెను.

(౨౭) విశేషముగఁ బ్రకాశించుచుండునదియు, వానరస్త్రీలచే పట్టుకొని యుండఁబడినదియు, భర్తసమీపమునుండి కొంతదూరము తీసికొనిపోఁబడినదియు నగుతార, బాణమును ధనువును ధరించినవాఁడును అతని తేజస్సుచే సూర్యునివలె వెలుంగుచుండు వాఁడును నగురాముని జూచెను.

(౨౮) రాజలక్షణములతో బాగుగనిండియుండు వాఁడును, పుండరీకాక్షుఁడును, ఇంతకుముందు నెక్కడను జూడఁబడనివాఁడును, (వానికి సాటి సములేక అగుపడఁడని భావము) పురుషోత్తముఁడును నగుయీరాముని, తనభర్తను జంపినవాఁడితఁడేయని, జింకపిల్ల కన్నులవంటి కన్నులుగల తార తెలిసికొనెను.

(౨౯) పూజ్యురాలును దుఃఖించి వ్యసనముచే పీడింపఁబడినదియు నగు తార మూర్ఛపొందుచు, ఇంద్రునితో సమానమై తిరస్కరించుట కెవరికిని సాధ్యపడనివాఁడును మహాబాహుఁడును నగు శ్రీరాముని సమీపమునకు మిగుల త్వరగఁబోయెను.

(30) గొప్పయుద్ధములో లభించిన గురి గలవాఁడగు (ఒకే బాణముతో వాలిని జంపినవాఁడని భావము), రాముని సమీపమునకుఁబోయి దుఃఖముచే భ్రమించిన దేహము గలిగియుండుటచే, మిగుల కోపము గలదియై 'నామగని జంపినవాని నాకసితీర తిట్టెద'నని సంకల్పించుకొని యుండునదియునగు తార, రాముని సాన్నిధ్య మహిమచే నాపె మనస్సులోగల కాలుష్యముపోయి, బాగుగ ప్రకాశించుచుండు సత్వగుణము గలదై రాముని జూచి యిట్లనెను.

త్వ మప్రమేయశ్చ దురాసదశ్చ జితేంద్రియ శ్చోత్తమధార్మిక
శ్చ। అక్షయ్యకీర్తిశ్చ విచక్షణశ్చ క్షితిక్షమావాన్ క్షతజోప
మాక్షః॥ ౩౧

(౩౧) (అవతారిక.— వాలిని జంపినంతను రాముని నిందించవలయునని తార యతని సమీపించి, అతని పురుషోత్తమత్వముతోను పురుషకారత్వముతోను గూడిన పర్వతమును నిట్లు అనుసంధానము చేయుచున్నది)— ఓ రామా! నీవు పరిచ్ఛేదింపఁగూడని మహిమగలవాఁడవు, తిరస్కరించుటకు సాధ్యపడనివాఁడవు, ఇంద్రియములను స్వాధీనములోనుంచుకొని యుండువాఁడవు, ఉత్తమమైన ధర్మము సేయువాఁడవు, గొప్పయశస్సుగలవాఁడవు, సమర్థుఁడవు, భూమివలె ఓర్పుగలవాఁడవు, ఎఱ్ఱని కన్నులుగలవాఁడవు.

(విశేషార్థము.)—(త్వం)= క్రింద చెప్పఁబడిన కల్యాణగుణములకుఁ దగిన విలక్షణ విగ్రహముతోఁ గూడియుండువాఁడవు, (అప్రమేయః)= ౧. వేదముల చేతను అపరిచ్ఛేద్యమగు మహిమగలవాఁడవు, ౨. నీమహిమ యిట్టిదని నీకే తెలియకుండువాఁడవు, ౩. నీవు ప్రత్యక్షముగ నుండినను నీ స్వభావమిట్టిదని మనసా ధ్యానించుటకును సాధ్యపడనివాఁడవు, ౪. శరచాపములు ధరించియుండినను శంఖచక్రములు ధరించియుండు నారాయణుఁడవు, ౫. పర్వతమువలెనే అపరిచ్ఛేద్యముగనుండు సౌలభ్యము గలవాఁడవు. ౬. ఏకవచన ప్రయోగమువలన పరివారము లేకయుండినను, పరాక్రమాతిశయముచే అసంఖ్యేయ సేనాసమేతుఁడవై తిరస్కరించుటకు సాధ్యపడకుండువాఁడవు,

తార శ్రీరాముని పర్వతమును అనుసంధానము సేయుట.

(అవతారిక.— ఇట్లు అంతఃకరణముచే పొందుటకు శక్యముకాకుండ, బాహ్యకరణముల చేతను పొందుటకు సాధ్యపడనివాఁడని చెప్పఁబడుచున్నది.)(దురాసదశ్చ) ౧. మనసుచేతనే పొందుటకు సాధ్యపడనివాని మఱియెట్లు పొందవచ్చును. ౨. సన్మార్గముచేతనే బడయవచ్చునుగాని, కుమార్గములోఁ బోవువానికి సాధ్యపడనివాఁడవు. ౩. నిత్యుఁడుగ నుండుటచే వేరువేరుగ విభాగించుటకు తగనివాఁడవు, ౪. సర్వత్ర వ్యాపించియుండుటచే చలనములేనివాఁడవు, ౫. నిత్యానందగుణ పరిపూర్ణుఁడవగుటచే నీకు దుఃఖముగలిగించుటకు సాధ్యపడదు. ౬. వేదబాహ్యులయొక్క కుయుక్తులచే చలించనట్టి వైభవముగలవాఁడవు,

(అవతారిక.— ఇట్లు అప్రమేయత్వ దుర్ధర్షత్వములచే బాగుగ మదించియుండినను, పరదార పరరాజ్యములను గ్రహించుటలో నాశలేనివాఁడని యీ పదముచేఁ జెప్పఁబడినది) (జితేంద్రియశ్చ) ౧. ఆశలేక సుగ్రీవునికి రాజ్యమునిచ్చినవాఁడవు. ౨. లోకములో పురుషులు స్త్రీలనుజూచి వారిని మెచ్చుకొనుటవాడుక. నీవు అట్టివాఁడవు కావనుట, ౩. 'పశ్యత్యచక్షుస్సశృణోత్యకర్ణః అపాణిపాదో జవనో గ్రహీతా' ఇత్యాది ఉపనిషత్ వాక్యములలోఁ జెప్పఁబడినట్టుల సర్వేంద్రియములు లేనివాఁడవైనను సర్వేంద్రియ వ్యాపారము యెల్లప్పుడును గలవాఁడవు. ౪. వాక్కునకు మనసునకు గోచరించనివాఁడవు. ౫. శ్లో॥ అహల్యాయై జారః సురపతిరభూత్, ఆత్మతనయాం ప్రజానాథో యాసీత్, అభజత గురోరిందు రబలామ్, ఇట్లు చెప్పియుండుటచే నీవు తప్ప అందరును విషయ చపలతగలవారేను. నీవుమాత్రమే జితేంద్రియుఁడవు.

(అవతారిక.— ఇట్లువిరక్తుఁడుగనుండినను మాకు హింసగలిగించినందున అధార్మికుఁడవని అనుకొంటిని. అట్లుకాదని తార యీపదములచే చెప్పుచున్నది.) (ఉత్తమధార్మికశ్చ)— ఇతరులకు నే యొక కార్యము సేయువాఁడు ఉత్తమధార్మికుఁడు. శరణాగత సంరక్షకుఁడు, ఆశ్రితసంరక్షణకై అసత్యాలములో సేసు వ్వానని చెప్పువాఁడు ఉత్తమధార్మికుఁడు. అట్టివాఁడగు సుగ్రీవుని రక్షించుటచే ధార్మికుఁడవు, పాపియగు వాలినిజంపి అతని పరమపదమునకుఁ జేసినందున ఉత్తమ ధార్మికుఁడవు.

(అవతారిక.—దాగియుండి వాలిని జంపినందున యితనికి ధార్మికత్వ మెట్లు గలిగినదనుటకు సమాధానము.) (అక్షయ్యకీర్తిశ్చ)— తనఆశ్రితునికి అపరాధముచేసినందునను, మృగములను దాగియుండి చంపుట పాపము కానందునను, మృగముతోఁ గలిసిపోరుట సార్వభౌమునికి గౌరవము కానందునను, నిందింపబ గని కీర్తిగలవాఁడవు, ౨. పరత్వరూపమునందు కీర్తిగలవాఁడవు,

(విచక్షణశ్చ)— యుక్తాయుక్త విచారపూర్వకముగ సర్వకార్యములు సేయువాఁడవు, (క్షితిక్షమావాన్)— సత్యయోగే మతుపు, అందువల్ల రామునికి అక్షమాప్రసక్తి లేదని భావము. (క్షతజోపమాక్షః) సాముద్రిక శాస్త్రములోఁ జెప్పఁబడినటుల యెఱ్ఱని అపాంగములు గలవాఁడవు.

త్వ మాత్తబాణాసనబాణపాణి ర్మహాబలస్సంహననోపపన్నః।
మనుష్యదేహాభ్యుదయం విహాయ దివ్యేన దేహాభ్యుదయేన
యుక్తః॥ 3౨
యేనైకబాణేన హతః ప్రియో మే తేనైవ మాం త్వం జహి
సాయకేన। హతా గమిష్యామి సమీప మస్య నమా మృతే
రామ రమేత వాలీ॥ 33
స్వర్గేపి పద్మామలపత్రనేత్ర స్సమేత్య సంప్రేక్ష్యచ మామప
శ్యన్। న హ్యేష ఉచ్చావచతామ్రచూడా విచిత్రవేషాప్స
రసో భజిష్యత్॥ 3౪
స్వర్గేపి శోకంచ వివర్ణతాంచ మయా వినా ప్రాప్స్యతి వీర
వాలీ। రమ్యే నగేంద్రస్య తటావకాశే విదేహకన్యా రహితో
యథా త్వమ్॥ 3౫
త్వం వేత్థ యావ ద్వనితావిహీనః ప్రాప్నోతి దుఃఖం పురుషః
కుమారః। తత్త్వం ప్రజాన న్జహి మాం న వాలీ దుఃఖం మ
మాదర్శనజం భజేత॥ 3౬
యచ్చాపి మన్యేత భవా న్మహాత్మా స్త్రీఘాతదోషో నభవే
త్తు మహ్యమ్। ఆత్మేయ మస్యేతిచ మాం జహి త్వం న స్త్రీవ
ధ స్స్యా న్మనుజేంద్రపుత్ర॥ 3౭
శాస్త్రప్రయోగా ద్వివిధాచ్చ వేదా దాత్మా హ్యనన్యః పురు
షస్య దారాః॥ 3౭౪

(3౨) నీవే చేతిలో ధరించియుండు ధనుస్సు బాణము గలవాఁడవు, గొప్ప బలముగలవాఁడవు, మహావీర్యత్వమునకు నిమిత్తముగనుండు అంతర్బలమును ప్రకాశము సేయుచుండు శరీరముతోఁ గూడియుండువాఁడవు, మనిషి శరీరమును విడిచి ప్రకృతి సంబంధములేని వైకుంఠమునందలి దివ్య మంగళ విగ్రహముతోఁ గూడియుండువాఁడవు,

(33) (అంతరార్థిక.— రాముని తేజో విశేషములనుజూచి ఆశ్చర్యపడి, భర్త దుఃఖమును మరచి రాముని మహిమను వర్ణించినతార ప్రకృతి సంబంధము చేఁ ప్రలపించుచున్నది.) నామగని నెట్టిబాణముతోఁ జంపితివో దానితోనే నన్ను జంపుము. అతనిసమీపమునకుఁ బోయెదను. ఓరామా! వాలి నన్నువిడిచి సుఖముగ నుండఁడు.

(3౪) నిర్మలమగు పద్మము రేకులవంటి కన్నులు గలవాలి స్వర్గములో అప్సరసలతోఁగలిసి, నన్నుజూడక, కలలో నెఱ్ఱనిపూలు ధరించిన నానావిధములగు వేషములుగల ఆస్త్రీలతో సుఖించఁడు.

(3౫) మనోహరముగనుండు ఋశ్యమూక పర్వత సమీప ప్రదేశములో సీతను నెడబాసి నీవెట్లుదుఃఖించి చిక్కిపోవుచున్నావో అటులనే స్వర్గములో నన్నువిడిచి వాలి దుఃఖించి కాంతిలేనివాఁడై యుండును, ఓ వీరుఁడా!

(3౬) ప్రియురాలిని నెడబాసియుండువాఁడెంత దుఃఖపడునో యది నీ వెరుంగుదువు. అందువల్ల నన్నుజంపుము. వాలి నా వియోగమువల్ల గలిగిన దుఃఖమును పొందఁడు (అనఁగా నే నతనివద్దకుఁ బోయెదను.)

(3౭,3౮) మహానుభావుఁడవగు నీవు స్త్రీని జంపినదోషముగలుగునని తలంచకూడదు. 'అర్ధో వా ఏష ఆత్మనః యత్పత్నీ' (తన ఆత్మలో భార్యసగము), 'అ

దారప్రదానా న్నహి దాన మన్య త్ప్రదృశ్యతే జ్ఞానవతాం హి లోకే॥ ౩౮

త్వంచాపి మాం తస్య మమ ప్రియస్య ప్రదాస్యసే ధర్మ మవేక్ష్య వీర। అనేన దానేన నలప్స్యసే త్వ మధర్మయోగం మమ వీర ఘాతాత్॥ ౩౯

ఆర్తా మనాథా మపనీయమానా మేవంవిధా మర్హసి మాం నిహంతుమ్। అహంహి మాతంగవిలాసగామినా ప్లవంగమానా మృషభేణ ధీమతా। వినా వరార్హోత్తమ హేమమాలి నా చిరం నశక్ష్యామి నరేంద్ర జీవితుమ్॥ ౪౦ ½

ఇత్యేవ ముక్తస్తు విభు ర్మహాత్మా తారాం సమాశ్వాస్య హితం బభాషే॥ ౪౧

మా వీర భార్యే విమతిం కురుష్వ లోకోహి సర్వో విహితో విధాత్రా। తం చైవ సర్వం సుఖదుఃఖయోగం లోకో௨బ్రవీ త్తేన కృతం విధాత్రా॥ ౪౨

త్రయోహి లోకా విహితం విధానం నాతిక్రమంతే వశగాహి తస్య। ప్రీతిం పరాం ప్రాప్స్యసి తాం తథైవ పుత్రస్తు తే ప్రాప్స్యతి యౌవరాజ్యమ్॥ ౪౩

ధాత్రా విధానం విహితం తథైవ న శూరపత్న్యః పరిదేవయంతి॥ ౪౩ ½

త్మాహి దారాః' (ఆత్మభార్యయే.) ఇట్లు అనేకవిధములుగను, వేదవాక్యములయం దు శాస్త్రములలో బాగుగఁ జెప్పియుండుటచేత, పురుషునికి భార్య భిన్నముగా నట్టిది ఆత్మగనున్నది. కనుక, నన్ను వాలికి ఆత్మయని భావించి చంపుము. అందువల్ల స్త్రీహత్యాదోషము, ఓరాచకుమారా! నీకు గలుగదు. లోకములో శాస్త్రవిధి స్త్రీ తోఁ జేర్చుటకంటె వేరువిధమైన దానమును గొప్పజ్ఞానులు భావించరు. ఇది గొప్పసుకృతము.

(౩౯) ఓ వీరుఁడా! ధర్మమును బాగుగ నాలోచించి నాప్రియునికి నీవు నన్ను యిచ్చినచో యీదానముచే పరుఁడగు నాభర్తను జంపుటచే గలిగినపాపము నీకు సిద్ధించదు.

(౪౦) దుఃఖితురాలుగను, అనాథగను, వాలిచే వంచింపఁబడినదానను నుండునన్ను జంపవలయును. ఏలననఁగా, ఏనుఁగువలె మదించి విలాసముగ నడచువాఁడును, వానరులలో శ్రేష్ఠుఁడును బుద్ధిమంతుఁడును మిగులఉత్తమమగు బంగారు మాలతోఁగూడియుండువాఁడును నగువాలిని విడిచి, ఓరాజా! నేను జీవించలేను.

(౪౧) లోకమునకు ప్రభుఁడును మహాత్ముఁడును నగు శ్రీరాముఁడు తార చెప్పిన మాటలు విని ఆమెను సమాధానపరచి హితము చెప్పెను.

(౪౨) వీరునిభార్య వగు తారా! వాలిని విడిచి జీవించియుండలేనను విపరీతబుద్ధిని విడిచిపెట్టుము. లోకమును బ్రహ్మసృష్టించెనని ప్రసిద్ధమే కదా. సుఖదుఃఖములన్నిటిని బ్రహ్మసృష్టించెనని లోకమే చెప్పుచున్నది.

(౪౩) మూఁడులోకములలో నుండు జనులు బ్రహ్మచేసిన కార్యమును అతిక్రమించనేరరు. ఏలననఁగా, వీరందరు బ్రహ్మవశములో నుండువారు. నీవు స నట్టిగొప్ప సుఖము నే బడయఁబోవుచున్నావు. నీకొడుకు యువరాజు అగును,

ఆశ్వాసితా తేన తు రాఘవేణ ప్రభావయుక్తేన పరంతపేన।
సా వీరపత్నీ ధ్వనతా ముఖేన సువేషరూపా విరరామ తారా॥

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - చతుర్వింశస్సర్గః.



పంచవింశస్సర్గః.



సుగ్రీవం చైవ తారాంచ సాంగదం సహ లక్ష్మణః।
సమానశోకః కాకుత్స్థ స్సాంత్వయ న్నిద మబ్రవీత్॥ ౧

న శోకపరితాపేన శ్రేయసా యుజ్యతే మృతః।
య దత్రానంతరం కార్యం తత్సమాధాతు మర్హథ॥

లోకవృత్త మనుష్ఠేయం కృతం వో బాష్పమోక్షమ్।
న కాలా దుత్తరం కించి త్కర్మ శక్య ముపాసితుమ్॥ 3

నియతిః కారణం లోకే నియతిః కర్మసాధనమ్।
నియతి స్సర్వభూతానాం నియోగేష్విహ కారణమ్॥ ౪

(౪౪౫) బ్రహ్మచేసిన విధానమిట్టిదేను. కూపులభార్యలు దుఃఖింపరు. గొప్పమహిమగలవాఁడును, శత్రువులను జంపగలవాఁడును నగురామునిచే నూరడింపఁబడినదై, సంతోషమును సూచించుముఖము గలదియై మనసులోన సంతోషించినదై వీరుని భార్య యగుతార దుఃఖమును విడిచి యుండెను.

ఇది ఇరువదినాలుగవ సర్గ.

## ౨౫ వ సర్గ.

(అవతారిక.— రాముఁడు అందరిని సమాధానపరచి వాలికి సంస్కారము సేయించె ననువిషయ మీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) లక్ష్మణునితోఁ గూడిన వాఁడును, సుగ్రీవాదుల వలె దుఃఖించుచుండు వాఁడును నగు రాముఁడు సుగ్రీవుని తారను అంగదుని సమాధానపరచుచు యిటు లనెను.

(౨) మీదుఃఖ పరితాపములచే మృతుఁడైనవాలికి శ్రేయస్సు గలుగదు. ఇతని విషయములో మృతిపొందిన పిమ్మట శ్రేయసు గలిగించునట్టి అపరక్రియలు సేయుటకు మీరు సన్నద్ధులుగ నుండవలయును.

(౩) ఇట్టి సమయములో లోకు లందరివలెనే మీరును యేడ్చినదిచాలును. దైవమును నతిక్రమించి యేకార్యమును జేయుటకును నెవరికిని సాధ్యము కాదు.

(౪) ఈశ్వరుఁడు అన్నిటికిని గారణము. కార్యములు సేయుటకు సహకారిగనుండువాఁడు ఈశ్వరుఁడేను. సర్వభూతములను నాయా పనులకు నేమించుటకు ఈశ్వరుఁడేకారణము. ('తేన వినా తృణాగ్రమపినచలతి' అను న్యాయముచే ఈశ్వరునికి పరతంత్రముగనుండి లోకము ఆయాపనులు చేయుచున్నది. అనఁగా, లోకమునకు స్వాతంత్ర్యము లేదు.)

న కర్తా కస్య చి త్కశ్చి న్నియోగేచాపి నేశ్వరః।
స్వభావే వర్తతే లోక స్తస్య కాలః పరాయణమ్॥ ౫

నకాలః కాల మత్యేతి నకాలః పరిహీయతే।
స్వభావంచ సమాసాద్య నకశ్చి దతివర్తతే॥ ౬

నకాలస్యాస్తి బంధుత్వం నహేతు ర్నపరాక్రమః।
నమిత్రజ్ఞాతిసంబంధః కారణం నాత్మనో వశః॥ ౭

కింతు కాలపరిణామో ద్రష్టవ్య స్సాధుపశ్యతా।
ధర్మశ్చార్థశ్చ కామశ్చ కాలక్రమసమాహితాః॥ ౮

(౫) ఒకఁడొక కార్యము సేయుటకు స్వతంత్రుఁడు గాఁడు. ఒకని శాసింపుటకును నెవరికిని అధికారము లేదు. లోకము ఈశ్వరుని అధీనములో నున్నది. లోకమునకు గతి యీశ్వరుఁడేను.

(౬) ఈశ్వరుఁడు ఆజ్ఞను నతిక్రమింపఁడు. (అనఁగా, ఈశ్వరుఁడు స్వతంత్రుఁడు (ఇతని బుట్టించువారు, ఇతనిమీఁద అధికారము చెల్లించువారు లేరని శ్రుతి చెప్పుచున్నది.) ఈశ్వరునికి నాశము లేదు. లోకము అతని అధీనములోనే యున్నది. అతని నతిక్రమింపువాఁడెవఁడును లేఁడు.(అనఁగా యీశ్వరుఁడు నిరంకుశ స్వతంత్రుఁడని తాత్పర్యము.) ఇతని యేర్పాటును నితఁడే అతిక్రమింపఁడు.

(౭) ఈశ్వరునికి పక్షపాతము లేదు. అతని యనుగ్రహము తప్ప అతని వశపరచుకొనుట కుపాయము లేదు. అతని జయించఁదగిన పరాక్రమము లేదు. (అనఁగా పురుషుని పరాక్రమమున కతఁడు భయపడఁడు) అతనికి మిత్రజ్ఞాతి సంబంధమును లేదు. అందువల్ల యీశ్వరుఁడు జీవునికి పరతంత్రుఁడు గాఁడు. (అనఁగా, ఆయా చేతనుల కర్మానుగుణముగ ఈశ్వరుఁడు సమస్తమును జేయుచున్నాఁడు.

(౮) బాగుగ శాస్త్రముయొక్క తత్త్వమును నెరింగినవాఁడు, ఈశ్వరుఁడు చేతనునికర్మానుగుణముగ ప్రవర్తించుచున్నాఁడని, తెలిసికొనవలయును. (అనఁగా యీశ్వరుఁడు చేసినపనికి దుఃఖింపకూడదు. చేతనునికి హితమునే అతఁడు చేయునని భావింపవలయును) ధర్మార్థకామములు పరమాత్మ యేర్పాటుప్రకారము చేతనునికి లభించుచుండును. (ఈఘట్టములో ఈశ్వరత్వమును వ్యక్తముగఁ దెలుపుటకు సరిపడనందున కాలము నియతి స్వభావము అనుపదములు ప్రయోగింపఁబడినవి).

ఇత స్స్వాం ప్రకృతిం వాలీ గతః ప్రాప్తః క్రియాఫలమ్।
ధర్మార్థకామసంయోగైః పవిత్రం ప్లవగేశ్వరః॥ ౯
స్వధర్మస్యచ సంయోగా జ్జిత స్తేన మహాత్మనా।
స్వర్గః పరిగృహీతశ్చ ప్రాణా నపరిరక్షతా॥ ౧౦
ఏషా వై నియతి శ్శ్రేష్ఠా యాం గతో హరియూథపః।
తవలం పరితాపేన ప్రాప్తకాల ముపాస్యతామ్॥ ౧౧
వచనాంతే తు రామస్య లక్ష్మణః పరవీరహా।
అవద త్ప్రశ్రితం వాక్యం సుగ్రీవం గతచేతసమ్॥ ౧౨
కురు త్వ మస్య సుగ్రీవ ప్రేతకార్య మనంతరమ్॥ ౧౨½
తారాంగదాభ్యాం సహితో వాలినో దహనం ప్రతి।
సమాజ్ఞాపయ కాష్ఠాని శుష్కానిచ బహూనిచ॥ ౧౩½
చందనాదీనిచ దివ్యాని వాలిసంస్కారకారణాత్।
సమాశ్వాసయ చైనం త్వ మంగదం దీనచేతసమ్॥ ౧౪½
మాభూ ద్బాలిశబుద్ధి స్త్వం త్వదధీన మిదం పురమ్।
అంగద స్త్వానయే న్మాల్యం వస్త్రాణి వివిధానిచ॥ ౧౫½
ఘృతం తైల మథో గంధాన్యచ్చాత్ర సమనంతరమ్॥ ౧౬
త్వం తార శిబికాం శీఘ్ర మాదాయాగచ్ఛ సంభ్రమాత్।
త్వరా గుణవతీ యుక్తా హ్యస్మి న్కాలే విశేషతః॥ ౧౭

(౯) నాబాణముతగిలి ప్రాణమువిడిచినందున శుద్ధభావముసు బొంది వానరరాజగు వాలి, విహిత కాలములో ననుష్ఠించిన ధర్మార్థ కామసంబంధముచే యీలోకమువిడిచి పరిశుద్ధముగ స్వర్గమునకుఁ బోయెను.

(౧౦) మహాత్ముఁడగువాలి అతని కర్మానుష్ఠానముచే ముందే స్వర్గమును స్వాధీనములో నుంచుకొనియుండెను. ఇప్పుడు, యుద్ధములో ప్రాణము విడిచి అట్టి స్వర్గలోకమునకుఁ బోయెను.

(౧౧) వానర సేనాపతియగు వాలి పొందిన గతి మంచిగతియేను. మీరు దుఃఖించినదిచాలును. ఇపుడు చేయవలసిన కార్యమును నాలోచించవలయును.

(౧౨) రాముఁడిటుల చెప్పిన పిమ్మట, వీరులగు శత్రువులను జంపు లక్ష్మణుఁడు దుఃఖించుచుండు సుగ్రీవునితో నిటులనెను.

(౧౨½) సుగ్రీవుఁడా! వాలికి యిపుడు చేయవలసిన ప్రేత క్రియలను జేయుము.

(౧౩,౧౪) సుగ్రీవుఁడా! తార అంగదునితోఁగూడి వాలిని దహనముసేయుటకు యెండిన చందనము చెక్కలు మొదలగు మంచి కఱ్ఱలను దెచ్చుట కాజ్ఞాపింపుము.

(౧౫) దుఃఖించుచుండు అంగదుని సమాధానపరచుము. నీవు బాలబుద్ధిని విడువవలయును. ఈకిష్కింధ నీయధీనముగనున్నది.

(౧౬) పూలసరములు నానావిధములగు పీతాంబరములు నేయి నూనె గంధములను యింకను వలసినపదార్థములను, అంగదునిచేఁ దెప్పించుము.

(౧౭) తారుఁడా! నీవు శీఘ్రముగఁబోయి పల్లకిని దెమ్ము. ఎపుడు త్వరగ పనిచేయుట మంచిది అందులో నిట్టి సమయములో త్వరపడవలసినది మిక్కిలి మంచిది.

గృహ్ణంతు ప్లవగా శ్శిబికా వహనోచితాః।
సమర్థా బలిన శ్చైవ నిర్హరిష్యంతి వాలినమ్॥ ౧౮
ఏవ ముక్త్వాతు సుగ్రీవం సుమిత్రానందవర్ధనః।
తస్థౌ భ్రాతృసమీపస్థో లక్ష్మణః పరవీరహా॥ ౧౯

లక్ష్మణస్య వచ శ్శ్రుత్వా తార స్సంభ్రాంతమానసః।
ప్రవివేశ గుహాం శీఘ్రం శిబికాసక్తమానసః॥ ౨౦
ఆదాయ శిబికాం తార స్సతు పర్యాపతత్పునః॥ ౨౦½
వానరై రుహ్యమానాం తాం శూరై రుద్వహనోచితైః।
దివ్యాం భద్రాసనయుతాం శిబికాం స్యందనోపమామ్॥ ౨౧½

పక్షికర్మభి రాచిత్రాం ద్రుమకర్మవిభూషితామ్।
ఆచితాం చిత్రపత్తీభి స్సునివిష్టాం సమంతతః॥ ౨౨½
విమానమివ సిద్ధానాం జాలవాతాయనాన్వితామ్
సునియుక్తాం విశాలాంచ సుకృతాం విశ్వకర్మణా॥ ౨౩½

దారుపర్వతకోపేతాం చారుకర్మపరిష్కృతామ్
వరాభరణహారైశ్చ చిత్రమాల్యోపశోభితామ్। ౨౪½
గుహాగహనసంఛన్నాం రక్తచందనరూషితామ్॥ ౨౫

(౧౮) పల్లకి మోయుటకుఁ దగినవారుగను సమర్థులుగను బలముగలవారుగను నుండు వానరులను వాలిని మోసికొని పోవుటకు సిద్ధపఱచవలయును.

(౧౯) సుమిత్రాదేవికి ఆనందమును పెంచువాఁడును, శీఘ్రముగ పరాక్రమించువాఁడును నగు లక్ష్మణుఁడు సుగ్రీవునితో నిటులచెప్పి అన్నయగు రాముని సమీపమునందు నుండెను.

(౨౦) లక్ష్మణునిమాటలు విని తారుఁడు (శతదశోక వానరుఁడు) మిక్కిలి త్వరగ పల్లకిని దెచ్చుటకు కిష్కింధకుఁబోయెను.

(౨౦౪) తారుఁడు పల్లకి దీసికొని త్వరగవచ్చి చేరెను.

(౨౧౪) సమర్థులగు వానరులచే మోయఁబడినదియు దివ్యమైనదియు రాజ పీఠముగలదియు రథమువలె నుండునదియు,

(౨౨౪) చుట్టు చిత్రింపఁబడిన పక్షులు వృక్షములచే ఆశ్చర్యముగ నుండునదియు, చిత్రింపఁబడిన పదాతి సేనగలదియు, మంచిసన్నివేశముతోఁ గూడినదియు,

(౨౩౪) సన్నసన్నరంధ్రములు గవాక్షములుగలదియు, సిద్ధులు సంచరించు విమానమువలె నుండునదియు, బాగుగ యిమిడియుండునదియు, మిగుల శ్రద్ధతో విశ్వకర్మ చేసినదియు,

(౨౪౪) మ్రానుతో నేర్పఱుపఁబడిన క్రీడాపర్వతము గలదియు, నును పుచేసి మెరుగు పెట్టఁబడియుండునదియు, దివ్యమైన ఆభరణములు హారములు పూలహారములతో వెలుఁగుచుండునదియు,

(౨౫) చిత్రింపఁబడిన గుహలు అరణ్యములుగలదియు, యెర్రగంధము పూయఁబడినదియు,

ప్రస్నైః స్సుమభిశ్చిత్రాం పద్మమాలాభిరేవచ।
తరుణాదిత్యవర్ణాభి ర్భ్రాజమానాభి రావృతామ్॥ ౨౬
ఈదృశీం శిబికాం దృష్ట్వా రామో లక్ష్మణ మబ్రవీత్।
క్షిప్రం వినీయతాం వాలీ ప్రేతకార్యం విధీయతామ్॥ ౨౭
తతో వాలిన ముద్యమ్య సుగ్రీవ శ్శిబికాం తదా।
ఆరోపయత విక్రోశ న్నంగదేన సహైవ తు॥ ౨౮
ఆరోప్య శిబికాం చైవ వాలినం గతజీవితమ్।
అలంకారైశ్చ వివిధై ర్మాల్యై ర్వస్త్రైశ్చ భూషితమ్॥ ౨౯
ఆజ్ఞాపయ త్తదా రాజా సుగ్రీవః ప్లవగేశ్వరః।
ఔర్ధ్వ దైహిక మార్యస్య క్రియతా మనురూపతః॥ ౩౦
విశ్రాణయంతో రత్నాని వివిధాని బహూన్యపి।
అగ్రతః ప్లవగాయాంతు శిబికా సమనంతరమ్॥ ౩౧
రాజ్ఞా మృద్ధివిశేషాహి దృశ్యంతే భువి యాదృశాః।
తాదృశం వాలినః క్షిప్రం ప్రాకుర్వ న్నౌర్ధ్వదైహికమ్॥ ౩౨
అంగదం పరిగృహ్యాశు తారప్రభృతయ స్తదా।
క్రోశంతః ప్రయయు స్సర్వే వానరా హతబాంధవాః॥ ౩౩
తతః ప్రణిహితా స్సర్వా వానర్యోఽస్య వశానుగాః।
చుక్రుశు ర్వీర వీరేతి భూయః క్రోశంతి తా స్స్త్రియః॥ ౩౪

(౨౬) పూలతోను బాలసూర్యునివలె నుండి ప్రకాశించుచుండు కమలముల హారములతోను నిండియుండునదియు,

(౨౭) నగు పల్లకిని శ్రీరాముఁడు చూచి లక్ష్మణునితో నిటు లనెను. దీని లోనుంచి త్వరగ వాలికి ప్రేతకార్యములు సేయవలయును.

(౨౮) పిమ్మట, సుగ్రీవుఁడు అంగదుఁడు విశేషముగ నేడ్చుచు వాలిని నెత్తి పల్లకిలోనుంచిరి.

(౨౯) ప్రాణము విడిచియుండు వాలిని అనేకవిధములుగ వస్త్రములతోను పూలతోను అభరణములతోను నలంకరించి పల్లకిలోనుంచిరి.

(3౦)అప్పుడు, వానర రాజగుసుగ్రీవుఁడు పూజ్యుఁడగు అన్నకుఁదగినటుల అపరక్రియలు సేయవలయునని ఆజ్ఞాపించెను.

(3౧) అనేకవిధము లగునవరత్నములను విశేషముగ దానముసేయుచు వానరులు పల్లకిముందు పోవలయును. వీరికి వెనుక పల్లకి పోవలయును.

(3౨) గొప్ప యైశ్వర్యమునకుఁ దగినటుల రాజులకు యీలోకములో జరుగునట్టి అపరక్రియలను వాలికి త్వరగఁ జేయించిరి.

(33) అపుడు తారుఁడు మొదలగు వానరులందరు బంధువగువాలిని బోఁగొట్టికొని యేడ్చుచు అంగదుని పట్టుకొని పల్లికివెంబడి నడిచిరి.

(3౪) పిమ్మట, అప్తులుగను వాలికి వశ్యులుగను నుండు వానరస్త్రీలందరు 'వీరుఁడా, వీరుడా' యని పిలుచుచు పదేపదే యేడ్చుచుండిరి.

తారాప్రభృతయ స్సర్వా వానర్యో హతయూథపాః।
అనుజగ్ముర్హి భర్తారం క్రోశంత్యః కరుణస్వనాః॥ ౩౫
తాసాం రుదితశబ్దేన వానరీణాం వనాంతరే।
వనాని గిరయ స్సర్వే విక్రోశంతీవ సర్వతః॥ ౩౬

పులినే గిరినద్యాస్తు వివిక్తే జలసంవృతే।
చితాం చక్రు స్సుబహవో వానరా శ్శోకకర్శితాః॥ ౩౭
అవరోప్య తత స్స్కంధా చ్ఛిబికాం వహనోచితాః।
తస్థు రేకాంత మాశ్రిత్య సర్వే శోకసమన్వితాః॥ ౩౮

తత స్తారా పతిం దృష్ట్వా శిబికాతలశాయినమ్।
ఆరోప్యాంకే శిర స్తస్య విలలాప సుదుఃఖితా॥ ౩౯
హా వానరమహారాజ హా నాథ మమ వత్సల।
హా మహార్హ మహాబాహో హా మమ ప్రియ పశ్య మామ్॥ ౪౦
జనం న పశ్యసీమం త్వం కస్మా చ్ఛోకాభిపీడితమ్॥ ౪౦½
ప్రహృష్టమివ తే వక్త్రం గతాసోరపి మానద
అస్తార్కసమవర్ణం చ లక్ష్యతే జీవితో యథా। ౪౧½
ఏష త్వాం రామరూపేణ కాలః కర్షతి వానర॥
యేన స్మ విధవా స్సర్వాః కృతా ఏకేషుణా వనే। ౪౨½

(౩౫) తారమొదలగు వానరస్త్రీలందఱు నాథుని బోగొట్టుకొని దీనస్వరముతో యేడ్చుచు పల్లకి వెంట నడిచిరి.

(౩౬) అరణ్యము మధ్యలో వానరస్త్రీల రోదన ధ్వనితో అరణ్యములు పర్వతములు నలుప్రక్కల యేడ్చుచుండునటు లుండెను.

(౩౭) జనులులేక జలసమృద్ధిగల సెలయేటి యిసుక దిన్నెలలో అనేకులగు వానరులు మిగుల దుఃఖించుచు చితిని యేర్పాటు చేసిరి.

(౩౮) పల్లకిని మోయుచుండిన వానరులు దానిదించి చితికి కొంతదూరములో నేకాంత మగు ప్రదేశములో దుఃఖించుచు కూర్చుండిరి.

(౩౯) పిమ్మట, తార పల్లకిలోఁ బండుకొని యుండు పతిని జూచి అతని తలను వడిలోనుంచుకొని మిగుల దుఃఖించి రోదనము చేసెను.

(౪౦) వానరుఁడా, మహారాజా, నా నాథుఁడా, నాప్రీతి పాత్రుఁడా, మిగుల పూజ్యుఁడా, గొప్ప భుజములు గలవాఁడా, నాప్రియుఁడా! నన్ను చూడుము.

(౪౦½) దుఃఖముచేఁ బీడింపఁబడుచుండు నన్ను యెందుకుఁ జూడకున్నావు.

(౪౧½) మానమును గాపాడువాఁడా! అస్తమించుచుండు సూర్యుని కాంతివంటి కాంతిగలిగి, నీవు ప్రాణము విడిచియుండినను, నీముఖము జీవించియుండు వానిముఖమువలె సంతోషముతోఁ గూడియుండునటు లగుపడుచున్నది.

(౪౨½) అరణ్యములో నొక బాణమును బ్రయోగించి వానరస్త్రీల నందరిని విధవలనుగఁ జేసిన యముఁడు యీరాముఁడుగ వచ్చి, వానరుఁడా! నిన్ను తీసికొనిపోవుచున్నాఁడు.

క్షమా యత్ర తవ రాజేంద్ర వానర్యో వల్లభా స్సదా।
తా స్త్వి త్రైకస్ప్త మధ్యైవ మాగతాః కిం న బుధ్యసే ౪౩½
తవేష్టా నను నామైతా భార్యా శ్చంద్రనిభాననాః॥ ౪౪

ఇదానీం నేక్షసే కస్మా త్సుగ్రీవం ప్లవగేశ్వరమ్।
ఏతే హి సచివా రాజన్ తారప్రభృతయ స్తవ॥ ౪౫

పురవాసీ జన శ్చాయం పరివార్యాసతేఽనఘ।
విసర్జయైతాన్ ప్లవగాన్ యథోచిత మరిందమ॥ ౪౬
తతః క్రీడామహే సర్వా వనేషు మదనోత్కటాః॥ ౪౬½

ఏవం విలపతీం తారాం పతిశోకపరిప్లుతామ్।
ఉత్థాపయన్తి స్మ తదా వానర్యః శోకకర్శితాః॥ ౪౭½

సుగ్రీవేణ తత స్సార్ధ మంగదః పితరం రుదన్।
చితా మారోపయామాస శోకేనాభిహతేంద్రియః॥ ౪౮½

తతోఽగ్నిం విధివ ద్దత్త్వా సోపసవ్యం చకార హ।
పితరం దీర్ఘ మధ్వానం ప్రస్థితం వ్యాకులేంద్రియః॥ ౪౯½
సంస్కృత్య వాలినం తే తు విధిపూర్వం ప్లవంగమాః।
ఆజగ్ము రుదకం కర్తుం నదీం శీతజలాం శివామ్॥ ౫౦½

(౪౩½) రాజశ్రేష్ఠుఁడా! నీప్రీతికి పాత్రులుగనుండు యీ వానరస్త్రీలందరు నడచి బహుదూరము వచ్చిరి. ఇది నీకుఁ దెలియలేదా.

(౪౪) చంద్రునివంటి ముఖములు గలయీవానరస్త్రీలు నీకు ప్రియమైన భార్యలుకదా.

(౪౫) వానరులకు రాజగు సుగ్రీవుని నెందుకుఁ జూడకున్నావు. ఓరాజా! తారుఁడు మొదలగు నీమంత్రులు యిదిగో ఉన్నారు.

(౪౬) పాపరహితుఁడా! యీపురజనులందరు నిన్ను చుట్టుకొని యున్నారు. శత్రుసంహారకుఁడా! వారివారికిఁ దగినటుల వారితో మాటలాడిపంపుము.

(౪౬½) పిమ్మట, మేమందరము యీయరణ్యములో, గొప్ప మన్మథబాధగలవారమై, నీతోడ క్రీడించెదము అని తారచెప్పి ప్రలపించెను.

(౪౭½) ఈవిధముగ భర్తపోయిన దుఃఖముచేఁ బీడింపఁబడి ప్రలపించుచుండు తారను దుఃఖముతో కృశించుచుండు వానరస్త్రీలు లేవతీసిరి.

(౪౮½) పిమ్మట, అంగదుఁడు సుగ్రీవునితోడ మిగుల దుఃఖించి తండ్రిని జూచి యేడ్చుచు వాలిని చితిమీద నుంచెను.

(౪౯½) పిదప, శాస్త్రోక్త ప్రకారముగ అగ్నినుంచి అపసవ్యముగ చితిచుట్టుతిరిగి పరలోకమునకుఁ బోయిన తండ్రినిగురించి అంగదుఁడు మిగుల దుఃఖించెను.

(౫౦½) సుగ్రీవుఁడు మొదలగు వానరులు శాస్త్రోక్తప్రకారముగ వాలికి సంస్కారముచేసి ఉదకదానము సేయుటకు చల్లని జలముగలిగి రమ్యముగనుండు నదికి వచ్చిరి.

తతస్తే సహితా స్తత్ర హ్యంగదం స్థాప్య చాగ్రతః।
సుగ్రీవతారాసహితా స్సిషిచు ర్వాలినే జలమ్॥ ౫౧

సుగ్రీవేణైవ దీనేన దీనో భూత్వా మహాబలః।
సమానశోకః కాకుత్స్థః ప్రేతకార్యాణ్యకారయత్॥ ౫౨

తతస్తు తం వాలిన మగ్ర్యపౌరుషం ప్రకాశ మిక్ష్వాకువరేషు
ణాహతమ్। ప్రదీప్య దీప్తాగ్నిసమౌజసం తదా సలక్ష్మణం రా
మ ముపేయివా న్హరిః॥ ౫౩

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - పంచవింశస్సర్గః.

## షడ్వింశస్సర్గః.

తత శ్శోకాభిసంతప్తం సుగ్రీవం క్లిన్నవాససమ్।
శాఖామృగమహామాత్రాః పరివార్యోపతస్థిరే॥ ౧

అభిగమ్య మహాబాహుం రామ మక్లిష్టకారిణమ్।
స్థితాః ప్రాంజలయ స్సర్వే పితామహ మివర్షయః॥ ౨

తతః కాంచన శైలాభ స్తరుణార్కనిభాననః।
అబ్రవీ త్ప్రాంజలి ర్వాక్యం హనూమా న్మారుతాత్మజః। ౩

(౫౧) పిమ్మట, సుగ్రీవుఁడు, తారతోఁ గూడిన వానరులు, సువ్వు గూడి అంగదుని ముందుంచుకొని వాలికి ఉదకదానము చేసిరి.

(౫౨) గొప్పబలముగల శ్రీరాముఁడు దీనుఁడగు సుగ్రీవునితోడ దీనుఁడై దుఃఖించి వాలికి ప్రేతక్రియలు చేయించెను.

(౫౩) పిదప, ఉత్తమమైన పరాక్రమముగలవాఁడును ప్రసిద్ధుఁడును శ్రీరాముని గొప్ప బాణముతోఁ జంపఁబడినవాఁడును నగు వాలికి దహనక్రియలు చేసి, వెలుంగుచుండు అగ్నివంటి కాంతిగల లక్ష్మణునితోఁ గూడియుండు రాముని సమీపమునకు సుగ్రీవుఁడు వచ్చెను.

ఇది యిరువది అయిదవ సర్గ.

---

## ౨౬ వ సర్గ

(అవతారిక — ఈసర్గలో సుగ్రీవునికి పట్టాభిషేకము చెప్పఁబడుచున్నది)

(౧) స్నానముచేసి తడివస్త్రములు ధరించియుండు వాఁడును, శోకముచే మిగుల తపించుచుండువాఁడును నగు సుగ్రీవుని జుట్టుకొని మంత్రులగు వానరులు ఉండిరి.

(౨) గొప్పభుజములు గలవాఁడును మంచికార్యము చేసినవాఁడును నగు శ్రీరాముని సమీపములో, బ్రహ్మసమీపములో దేవర్షు లుండునటుల, సుగ్రీవుఁడు మొదలగు వానరులు అంజలిచేసికొని నిలిచియుండిరి.

(3) పిమ్మట, బంగారుకొండవంటి దేహకాంతిగల వాఁడును, బాలసూర్యునివంటి ముఖకాంతి గలవాఁడును, నగు వాయుపుత్రుఁడగు హనుమంతుఁడు అంజలిచేసికొని రామునితో నిటు లనెను.

భవత్ప్రసాదా త్సుగ్రీవః పితృపైతామహం మహత్।
వానరాణాం సుదుష్ప్రాపం ప్రాప్తో రాజ్య మిదం ప్రభో॥ ౪

భవతా సమనుజ్ఞాతః ప్రవిశ్య నగరం శుభమ్।
సం విధాస్యతి కార్యాణి సర్వాణి ససుహృ జ్జనః॥ ౫

స్నాతో౽యం వివిధై ర్గంధై రౌషధైశ్చ యథావిధి।
అర్చయిష్యతి రత్నైశ్చ మాల్యైశ్చ త్వాం విశేషతః॥ ౬

ఇమాం గిరిగుహాం రమ్యా మభిగంతు మితో ర్హసి।
కురుష్వ స్వామిసంబంధం వానరాన్ సంప్రహర్షయన్। ౭

ఏవ ముక్తో హనుమతా రాఘవః పరవీరహా।
ప్రత్యువాచ హనూమంతం బుద్ధిమా న్వాక్యకోవిదః॥ ౮

చతుర్దశ సమా స్సౌమ్య గ్రామం వా యదివా పురమ్।
నప్రవేక్ష్యామి హనుమన్ పితు ర్నిర్దేశపాలకః॥ ౯

సుసమృద్ధాం గుహాం రమ్యాం సుగ్రీవో వానరర్షభః।
ప్రవిష్టో విధివ ద్వీరః క్షిప్రం రాజ్యే౽భిషిచ్యతామ్॥ ౧౦

శ్రీరాముఁడు హనుమంతునితోను సుగ్రీవునితోను మాటలాడుట. అర్థ

(౪) హే ప్రభో! నీకటాక్షముచే సుగ్రీవుఁడు వానరులకు దుర్లభమగు పితృపితామహక్రమముగ వచ్చిన యీగొప్ప రాజ్యమును బడసెను.

(౫) సుగ్రీవుఁడు నీచే నాజ్ఞాపింపఁబడి స్నేహితులతోడ మంగళకరమగు వానరరాజ్యములోఁ బ్రవేశించి సకల కార్యములు చేయును.

(౬) సుగ్రీవుఁడు పట్టాభిషేకము చేసికొని నానావిధములగు సుగంధములతోను నానావిధములగు ఓషధులు రసములు రత్నములు పూలతో శాస్త్రోక్త ప్రకారముగ నిన్ను బాగుగఁ బూజించును.

(౭) రామా! ఇచటినుండి మనోహరముగ నుండు యీ కిష్కింధకు నీవు ప్రయాణము చేయఁగలయుదు. వానరులకు మిగుల సంతోషము గలిగించుచు సుగ్రీవుని వారికి రాజుగఁ జేయుము.

(౮) వీరులగు శత్రువులను జంపువాఁడును బుద్ధిమంతుఁడును మాటలాడుటలోఁ బండితుఁడనునగు శ్రీరాముఁడు హనుమంతుని మాటవిని అతనితో నిటుల బదులు చెప్పెను.

(౯) హనుమంతుఁడా! పితృవాక్య పరిపాలన చేయుచుండు నేను ౧౪ సంవత్సరముల వరకు, సౌమ్యుఁడా! ఒక గ్రామములో గాని పట్టణములో గాని ప్రవేశించను.

(౧౦) వానరశ్రేష్ఠుఁడును ధీరుఁడును నగు సుగ్రీవుని మిగుల సంపదగలిగి రమ్యముగనుండు కిష్కింధకుఁ బిలుచుకొనిపోయి శీఘ్రముగ శాస్త్రోక్తముగ మీరు పట్టాభిషేకము సేయుఁడు.

(౧౦౪) సదాచారము దెలిసికొనియుండు శ్రీరాముఁడు హనుమంతునితో నిటులఁ జెప్పి, సదాచార సంపన్నుఁడును గొప్ప బలపరాక్రమములు గలవాఁడును నగు సుగ్రీవునితో నిటులనెను.

ఏవ ముక్త్వా హనూమంతం రామ స్సుగ్రీవ మబ్రవీత్।
వృత్తజ్ఞో వృత్తసంపన్న ముదారబలవిక్రమమ్॥ ౧౧
ఇమ మప్యంగదం వీర యౌవరాజ్యేఽభిషేచయ॥ ౧౧½
జ్యేష్ఠస్య స సుతో జ్యేష్ఠ స్సదృశో విక్రమేణ తే।
అంగదోఽయమదీనాత్మా యౌవరాజ్యస్య భాజనమ్॥ ౧౨½
పూర్వోఽయం వార్షికో మాస శ్శ్రావణ స్సలిలాగమః।
ప్రవృత్తా స్సౌమ్య చత్వారో మాసా వార్షికసంజ్ఞకాః॥ ౧౩½
నాయ ముద్యోగసమయః ప్రవిశ త్వం పురీం శుభామ్।
అస్మి న్వత్స్యామ్యహం సౌమ్య పర్వతే సహలక్ష్మణః॥ ౧౪½
ఇయం గిరిగుహా రమ్యా విశాలా యుక్తమారుతా॥
ప్రభూతసలిలా సౌమ్య ప్రభూతకమలోత్పలా। ౧౫½
కార్తికే సమనుప్రాప్తే త్వం రావణవధే యత॥
ఏష న స్సమయ స్సౌమ్య ప్రవిశ త్వం స్వ మాలయమ్। ౧౬½
అభిషిక్త స్స్వరాజ్యేచ సుహృద స్సంప్రహర్షయ॥ ౧౭
ఇతి రామాభ్యనుజ్ఞాత స్సుగ్రీవో వానరాధిపః।
ప్రవివేశ పురీం రమ్యాం కిష్కింధాం వాలిపాలితామ్॥ ౧౮
తం వానరసహస్రాణి ప్రవిష్టం వానరేశ్వరమ్।
అభివాద్య ప్రహృష్టాని సర్వతః పర్యవారయన్॥ ౧౯

పట్టాభిషేకము చేసికొనవలయునని రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పుట. అనగా

(౧౧½) వీరుఁడగు సుగ్రీవుఁడా! ఈ యంగదునికి యువరాజ్య పట్టాభిషేకము సేయుము.

(౧౨½) గొప్ప స్వభావముగల యీ యంగదుఁడు నీయన్నయగు వాలికి పెద్దకొడుకు. పరాక్రమములో నీకు సమానుఁడు. కను[illegible] యౌవరాజ్య పట్టాభిషేకమునకుఁ దగియున్నాఁడు.

(౧౩) (అనంతరికి.— పట్టాభిషేక మహోత్సవమైనపిమ్మట. సీతను వెదకుటకును రావణుని సంహరించుటకును యత్నము సేయవలయునను ప్రశ్నకు ఉత్తరము.) వర్షఋతువులోగల నెలలలో తీర్థసమృద్ధిగల యీ శ్రావణమాసము మొదటిది. ఓ సౌమ్యుఁడా! ఈనాలుగును వాన గురియు మాసములుగ నున్నవి.

(౧౪½) కనుక, యిప్పుడు సీతను వెదకుటకు రావణుని వధించుటకు సమయము కాదు. మంగళకరమగు కిష్కింధలో నీవు ప్రవేశింపుము. సౌమ్యుఁడా! యీ పర్వతములో లక్ష్మణునితోడ నేనుండెదను.

(౧౫½) సౌమ్యుఁడా! యీ పర్వతగుహ రమ్యమైనదియు విశాలమైనదియు మంచిగాలి విశేషముగ జలము కమలములు నల్ల కలువలు గలిగియున్నది.

(౧౬½,౧౭) కార్తికమాసము పుట్టగనే నీవు రావణవధకు ప్రయత్నము సేయవచ్చును. సౌమ్యుఁడా! యిదియు మనకుగల యేర్పాటు. నీవు కిష్కింధకుఁ బోయి పట్టాభిషేకము సేసికొని నీ స్నేహితులకు సంతోషము గలిగింపుము.

(౧౮) శ్రీరాముఁడు యిటుల ఆజ్ఞాపింపగా, వానరరాజగు సుగ్రీవుఁడు వాలి పరిపాలించుచుండిన రమ్యమగు కిష్కింధాపట్టణములోఁ బ్రవేశించెను.

(౧౯) కిష్కింధలోఁ బ్రవేశించిన వానరరాజగు సుగ్రీవునికి అనేకులు వానరులు అభివాదనముచేసి నలుప్రక్కలఁ జుట్టుకొని యుండిరి.

తతః ప్రకృతయ స్సర్వా దృష్ట్వా హరిగణేశ్వరమ్।
ప్రణమ్య మూర్ధ్నా పతితా వసుధాయాం సమాహితాః॥ ౨౦
సుగ్రీవః ప్రకృతీ స్సర్వా స్సంభాష్యోత్థాప్య వీర్యవాన్।
భ్రాతు రంతఃపురం సౌమ్యం ప్రవివేశ మహాబలః॥ ౨౧
ప్రవిశ్య త్వభినిష్క్రాంతం సుగ్రీవం ప్లవగేశ్వరమ్।
అభ్యషించంత సుహృద స్సహస్రాక్ష మివామరాః॥ ౨౨
తస్య పాండుర మాజహ్రు శ్ఛత్రం హేమపరిష్కృతమ్।
శుక్లేచ వాలవ్యజనే హేమదండే యశస్కరే॥ ౨౩
తథా సర్వాణి రత్నాని సర్వబీజౌషధీ రపి।
సక్షీరాణాం చ వృక్షాణాం ప్రరోహా న్కుసుమానిచ॥ ౨౪
శుక్లానిచైవ వస్త్రాణి శ్వేతం చైవానులేపనమ్।
సుగంధీనిచ మాల్యాని స్థలజాన్యంబుజానిచ॥ ౨౫
చందనానిచ దివ్యాని గంధాంశ్చ వివిధా న్బహూన్।
అక్షతం జాతరూపంచ ప్రియంగు మధుసర్పిషీ॥ ౨౬
దధి చర్మచ వైయాఘ్రం వారాహీ చాప్యుపానహౌ॥ ౨౬½
సమాలంభన మాదాయ రోచనాం సమనశ్శిలామ్।
ఆజగ్ము స్తత్ర ముదితా వరాః కన్యాస్తు షోడశ॥ ౨౭

(౨౦) పిమ్మట, వానరులందరు వానరరాజగు సుగ్రీవుని జూచి శిరసా నమస్కరించి భూమిమీదపడి అతని ప్రార్థించుచుండిరి.

(౨౧) గొప్పబలము కీర్తియు గలసుగ్రీవుడు ప్రజలందరితో మాటలాడి వారిని లేవదీసి మనోహరముగనుండు అన్నయంతఃపురములో తానను గౌరవించి తనవశము చేసికొనుటకు బ్రవేశించెను.

(౨౨) అంతఃపురములోఁ బ్రవేశించి వెలుపల వచ్చుచుండు వానరరాజగు సుగ్రీవునకు స్నేహితులు, దేవతలు ఇంద్రునికి పట్టాభిషేకము చేసినటుల, పట్టాభిషేకము చేసిరి.

(౨౩ మొదలు ౨౬ వరకు) బంగారుకాడగల తెల్లగొడుగును, బంగారు పిడిగల కాంతినిగలిగించునట్టి తెల్లచామరములను, సకలరత్నములను సకలధాన్యములు ఓషధులు పాలతో గూడిన వృక్షములచిగురుటాకులు పూలు తెల్లవస్త్రములు తెల్లమైపూతలు మంచివాసనగల నేలలోను జలములోను నుండు పూలు, దివ్యమైన చందనము, నానావిధములగు పరిమళవస్తువులు, బంగారురంగుగల అక్షతలు గసగసాలు తేనె నెయ్యి పెరుగు, పెద్దపులితోలు పందిచర్మముతోఁ జేయఁబడిన పాదరక్షలు, దెచ్చిరి.

(౨౭) ౧౬ మంది వానర కన్యకలు మిగులసంతోషముతో మైపూతను గోరోజనమును తిలకముబెట్టుటకు మనశిలను దీసికొని అచటికి వచ్చిరి.

(౨౮ మొదలు ౩౧ వరకు) పిమ్మట, రత్నములు వస్త్రములు భక్ష్యములిచ్చి బ్రాహ్మణులను బూజించి ఆటుపై, మంత్రములను నెరింగిన పురోహితులు చుట్టు దర్భలుపరచి మధ్యలో బాగుగ వెలుంగుచుండు అగ్నిలో మంత్రములచే పరిశుద్ధమగు హవిస్సును హోమముచేసి, పిదప, రమ్యమగు మేడమీద నానారంగులు గలపూలహారములతోఁ బ్రకాశించుచుండు బంగారుకాళ్ళుగలిగి ద్రా

తతస్తే వానరశ్రేష్ఠం యథాకాలం యథావిధి।
రత్నై ర్వస్త్రైశ్చ భక్ష్యైశ్చ తోషయిత్వా ద్విజర్షభాన్॥
తతః కుశపరిస్తీర్ణం సమిద్ధం జాతవేదసమ్।
మన్త్రపూతేన హవిషా హుత్వా మంత్రవిదో జనాః॥ ౨౯½
తతో హేమప్రతిష్ఠానే వరాస్తరణ సంవృతే।
ప్రాసాదశిఖరే రమ్యే చిత్రమాల్యోపశోభితే॥ ౩౦½
ప్రాఙ్ముఖం వివిధై ర్మంత్రైః స్థాపయిత్వా వరాసనే।
నదీనదేభ్య స్సంహృత్య తీర్థేభ్యశ్చ సమంతతః॥ ౩౧½
ఆహృత్య చ సముద్రేభ్య స్సర్వేభ్యో వానరర్షభాః।
అపః కనకకుంభేషు నిధాయ విమలా శ్శుభాః॥ ౩౨½
శుభై ర్వృషభశృంగైశ్చ కలశైశ్చాపి కాంచనైః।
శాస్త్రదృష్టేన విధినా మహర్షి విహితేన చ॥ ౩౩½
గజో గవాక్షో గవయ శ్శరభో గంధమాదనః।
మైందశ్చ ద్వివిద శ్చైవ హనుమా౯ జాంబవా న్నళః॥ ౩౪½
అభ్యషించంత సుగ్రీవం ప్రసన్నేన సుగంధినా।
సలిలేన సహస్రాక్షం వసవో వాసవం యథా॥ ౩౫½
అభిషిక్తే తు సుగ్రీవే సర్వే వానరపుంగవాః।
ప్రచుక్రుశు ర్మహాత్మానో హృష్టా స్తత్ర సహస్రశః॥ ౩౬½

వృషుగనంపుపరపు పరచియుండు సింహాసనముమీద వానరశ్రేష్ఠుఁడగుసుగ్రీవుని తూర్పుముఖముగ మంచి ముహూర్తములో శాస్త్రప్రకారము కూర్చుండఁబెట్టి, నదీనదములనుండియు సముద్రము నుండియు పుణ్యతీర్థములనుండియుఁ దేఁబడిన నిర్మలమైన మంగళకరమగు జలమును గలిపి బంగారు బిందెలలో నుంచుకొని వృషభముకొమ్ము ఆకారముగ నుండి శుభమైన బంగారు కలశములచే శాస్త్రములోఁ జెప్పఁబడి మహర్షులచేఁ జేయఁబడిన రీతిగా గజుఁడు గవాక్షుఁడు గవయుఁడు శరభుఁడు గంధమాదనుఁడు మైందుఁడు ద్వివిదుఁడు హనుమంతుఁడు జాంబవంతుఁడు నలుఁడు, అష్టవసువులు ఇంద్రునికి పట్టాభిషేకము చేసినటుల, నిర్మలమై మంచి వాసనగల తీర్థముచే నానావిధము లగుమంత్రములు చెప్పుచు సుగ్రీవునికి పట్టాభిషేకము చేసిరి.

(౨౬౪) సుగ్రీవునికి పట్టాభిషేకము కాగా మహాత్ము లగువానరశ్రేష్ఠులెల్లరు సంతోషించి అచట కేకలు వేసిరి.

రామస్య తు వచః కుర్వన్ సుగ్రీవో హరిపుంగవః।
అంగదం సంపరిష్వజ్య యౌవరాజ్యేఽభ్యషేచయత్॥ ౩౭
అంగదేచాభిషిక్తేతు సానుక్రోశాః ప్లవంగమాః।
సాధుసాధ్వితి సుగ్రీవం మహాత్మానోఽభ్యపూజయన్॥ ౩౮
రామంచైవ మహాత్మానం లక్ష్మణంచ పునఃపునః।
ప్రీతాశ్చ తుష్టువు స్సర్వే తాదృశే తత్ర వర్తతి॥ ౩౯

హృష్టపుష్టజనాకీర్ణా పతాకాధ్వజశోభితా।
బభూవ నగరీ రమ్యా కిష్కింధా గిరిగహ్వరే॥ ౪౦
నివేద్య రామాయ తదా మహాత్మనే మహాభిషేకం కపివాహి
నీపతిః । రుమాం చ భార్యాం ప్రతిలభ్య వీర్యవా నవాప
రాజ్యం త్రిదశాధిపో యథా॥ ౪౧
ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - షడ్వింశస్సర్గః.

## సప్తవింశస్సర్గః.

అభిషిక్తేతు సుగ్రీవే ప్రవిష్టే వానరేగుహామ్।
ఆజగామ సహభ్రాత్రా రామః ప్రస్రవణం గిరిమ్॥ ౧

(౩౭౪) వానరశ్రేష్ఠుఁడగు సుగ్రీవుఁడు శ్రీరాముని మాటను బరిపాలించుచు అంగదుని నాలింగనము చేసికొని అతనికి యువరాజ్యపట్టాభిషేకము సేసెను.

(౩౮౪) అంగదునికి యువరాజ్య పట్టాభిషేకము కాగా అతనిమీద ప్రీతిగల మహాత్ము లగువానరులు మంచిది మంచిది యని సుగ్రీవుని శ్లాఘించిరి.

(౩౯-౪) కిష్కింధలో నట్టిపట్టాభిషేక మహోత్సవములు జరుగగా వానరులందరు సంతోషించి మహాత్ముఁడగు రాముని లక్ష్మణుని మిగుల స్తోత్రము చేసిరి.

(౪౦౪) పర్వత సమీపములోనుండు కిష్కింధ సంతోషముతో వృద్ధిపొంది యుండు జనులతో నిండి పతాకములు ధ్వజములతో నలంకరింపఁబడి ప్రకాశించి రమ్యముగ నుండెను.

(౪౧౪) వీర్యవంతుఁడుగను, వానరులకు రాజుగను నుండు సుగ్రీవుఁడు రుమయను నతని భార్యను బడసి కిష్కింధలో పట్టాభిషేకము సేసికొని, మహాత్ముఁడగు శ్రీరాముని సన్నిధిలో నీవిషయమును దెలిపి, ఇంద్రునివలె, రాజ్యసుఖము ననుభవించుచుండెను.

ఇది యిరువదియారవ సర్గ.

౨౭ వ సర్గ.

(అవతారిక.— ఏకాంతవాసముచే సీతను స్మరించి దుఃఖించుచుండు శ్రీరాముని లక్ష్మణుఁడు సమాధానపరచుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧,౨,౩) కిష్కింధలోఁ బ్రవేశించి సుగ్రీవుఁడు పట్టాభిషేకము సేసికొనిన పిమ్మట, పులుల జింకల ధ్వనులతోను, భయంకరముగ గర్జించు సింహము

శార్దూలమృగసంఘుష్టం సింహై ర్భీమరవై ర్వృతమ్।
నానాగుల్మలతాగూఢం బహుపాదపసంకులమ్॥ ౨
ఋక్షవానరగోపుచ్ఛై ర్మార్జారైశ్చ నిషేవితమ్।
మేఘరాశినిభం శైలం నిత్యం శుచిజలాశ్రయమ్॥ ౩
తస్య శైలస్య శిఖరే మహతీ మాయతాం గుహామ్।
ప్రత్యగృహ్ణత వాసార్థం రామ స్సౌమిత్రిణా సహ॥ ౪
కృత్వా చ సమయం సౌమ్య స్సుగ్రీవేణ సహానఘః।
కాలయుక్తం మహ ద్వాక్య మువాచ రఘునందనః॥ ౫
వినీతం భ్రాతరం భ్రాతా లక్ష్మణం లక్ష్మివర్ధనమ్॥ ౫½
ఇయం గిరిగుహా రమ్యా విశాలా యుక్తమారుతా।
అస్యాం వసావ సౌమిత్రే వర్ష రాత్ర మరిందమ॥ ౬½
గిరిశృంగ మిదం రమ్య మున్నతం పార్థివాత్మజ।
శ్వేతాభిః కృష్ణతామ్రాభి శ్శిలాభి రుపశోభితమ్॥ ౭½
నానాధాతుసమాకీర్ణం దరీనిర్ఝరశోభితమ్॥
వివిధై ర్వృక్షషండైశ్చ చారుచిత్రలతావృతమ్। ౮½
నానావిహగసంఘుష్టం మయూరరవనాదితమ్।
మాలతీకుందగుల్మైశ్చ సింధువారకురంటకైః॥ ౯½
కదంబార్జునసర్జైశ్చ పుష్పితై రుపశోభితమ్॥ ౧౦

లతోను, నానావిధములగు పొదలు లతలు వృక్షములతోను యెలుగుబంట్లు కోతులు కొండముచ్చులు అడవిపిల్లులతోను నిండినదియు, మేఘముల గుంపువలెఁ బ్రకాశించుచుండునదియు, సదా నిర్మలముగనుండు తీర్థము గలసరసులు గలదియు, రాళ్ళమయముగనుండు ఋశ్యమూకపర్వతమునకు లక్ష్మణునితోడ రాముఁడు వచ్చెను.

(౪) ఋశ్యమూకపర్వతముమీఁద లక్ష్మణునితోడ శ్రీరాముఁడు గొప్పదిగను విశాలముగనునుండు గుహలో వసించుచుండెను.

(౫,౫½) సౌమ్యుఁడును పరిశుద్ధుఁడును నగు శ్రీరాముఁడు సుగ్రీవునితో సంకేత మేర్పరచుకొని, వినయముగలవాఁడును అన్నయగు తన కైంకర్య లక్ష్మిని వృద్ధిచేయుచుండు లక్ష్మణుని జూచి యిటు లనెను.

(౬½) సుమిత్రాపుత్త్రుఁడా, శత్రుసంహారకుఁడా! పర్వతముమీఁదనుండు యీ గుహ రమ్యముగను విశాలముగను వలసినంత గాలి గలదిగను నున్నది. దీనిలోనే మనము యీవానకాలమును గడుపవచ్చును.

(౭½) రాజపుత్త్రుఁడా! తెల్లగను నల్లగను యెఱ్ఱగను నుండు రాళ్ళతోఁ బ్రకాశించునట్టిదిగను,

(౮½) నానావిధములగు గైరికాది ధాతువులతో నిండిన గుహలతోను గిరినదులతోను బ్రకాశించునదిగను, నానావిధములగు తోఁపులతోను, అందమైన నారంగులు గలలతలతో నిండినదిగను,

(౯½) నానావిధములగు పక్షుల రొదతోఁ గూడినదిగను, నెమళ్ళ కేకల ధ్వనిగలదిగను, మాలతి కుంద పొదలతోను, సింధువారము కురంటకములతోను,

(౧౦) పూచిన కదంబ అర్జున సర్జ వృక్షములతో బ్రకాశించుచుండునదిగనునుండు యీపర్వతశిఖరము రమ్యముగను ఉన్నతముగను నున్నది.

ఇయంచ నళినీ రమ్యా ఫుల్లపంకజమండితా।
నాతిదూరే గుహాయా నౌ భవిష్యతి నృపాత్మజ॥ ౧౧
ప్రాగుదక్ప్రవణే దేశే గుహా సాధు భవిష్యతి।
పశ్చాచ్చైవోన్నతా సౌమ్య నివాతేయం భవిష్యతి॥ ౧౨
గుహాద్వారేచ సౌమిత్రే శిలా సమతలా శుభా।
శ్లక్ష్ణా చైవాఽఽయతాచైవ భిన్నాంజనచయోపమా॥ ౧౩
గిరిశృంగ మిదం తాత పశ్య చోత్తరత శ్శుభమ్।
భిన్నాంజనచయాకార మంభోధర మివోత్థితమ్॥ ౧౪

దక్షిణస్యామపి దిశి స్థితం శ్వేత మివాపరమ్।
కైలాసశిఖరప్రఖ్యం నానాధాతువిభూషితమ్॥ ౧౫
ప్రాచీనవాహినీం చైవ నదీం భృశ మకర్దమామ్।
గుహాయాః పూర్వతః పశ్య త్రికూటే జాహ్నవీ మివ॥ ౧౬
చంపకై స్తిలకై స్తాలై స్తమాలై రతిముక్తకైః।
పద్మకై స్సరళై శ్చైవ అశోకై శ్చైవ శోభితామ్॥ ౧౭
వానీరై స్తిమిశై శ్చైవ వకుళైః కేతకై ర్ధవైః।
హింతాలై స్తిరిటై ర్నీపై ర్వేత్రకైః కృతమాలకైః॥ ౧౮
తీరజై శ్శోభితా భాతి నానారూపై స్తత స్తతః।
వసనాభరణోపేతా ప్రమదేవాభ్యలంకృతా॥ ౧౯

(౧౧) ఈ సరస్సు వికసించియుండు తామరపూలతోఁగూడి రమ్యముగ నున్నది. ఓ రాజపుత్రుఁడా! యిది మనగుహకు సమీపములో నున్నది.

(౧౨) నైఋతిదిక్కు కభిముఖముగ ద్వారముగలిగి యీగుహ బాగుగ నున్నది. దీని పడమటిభాగము ఉన్నతముగనున్నది. అందుచే, యెదురుగ వీచు గాలిని నిది అడ్డగించుటచే గాలిలేక ఉన్నది.

(౧౩) లక్ష్మణా! ఈగుహ ద్వారములో సమముగను మనోహరముగను నుండు రాయి నున్నగను విశాలముగను, విరిపిన కాటుకముద్దవలె, నున్నది.

(౧౪) బిడ్డా! ఉత్తరభాగములో మనోహరముగనుండు యీగిరి శిఖరము విరిసిన కాటుకముద్ద యాకారముగలిగి పైకిలేచియుండు నల్లని మేఘమువలె నున్నది. దీని జూడుము,

(౧౫) దక్షిణభాగములో తెల్లగనుండు యింకొక శిఖరము నానావిధ ములగు ధాతువర్గములుగల కైలాసశిఖరమువలెఁ బ్రకాశించుచున్నది.

(౧౬) నిర్మలమై గుహకు ముందుభాగములో పడమటిదిక్కుకు ప్రవ హించుచుండునది త్రికూటపర్వతమునుండి వచ్చు గంగవలె నున్నది. చూడుము.

(౧౭) చంపక తిలక తాల తమాల అతిముక్తక పద్మక సరళ అశోక,

(౧౮) వానర తిమిశ వకుళ కేతక ధవ హింతాల తిరిట నీప వేత్రక కృతమూలక,

(౧౯) అను పేర్లుగల నదియొడ్డులోఁబుట్టి నానావిధముగనుండు వృక్ష ములతో అచ్చటచట, వస్త్రముధరించి ఆభరణము లలంకరించుకొనియుండు స్త్రీ వలె, యీనది ప్రకాశించుచున్నది.

శతశః పక్షిసంఘైశ్చ నానానాదై ర్వినాదితా।
ఏకైక మనురక్తైశ్చ చక్రవాకై రలంకృతా॥ ౨౦
పులినై రతిరమ్యైశ్చ హంససారససేవితైః।
ప్రహసంతీవ భాత్యేషా నారీ సర్వవిభూషితా॥ ౨౧

క్వచి న్నీలోత్పలై శ్ఛన్నా భాతి రక్తోత్పలైః క్వచిత్।
క్వచి దాభాతి శుక్లైశ్చ దివ్యైః కుముదకుట్మలైః॥ ౨౨
పారిప్లవశతై ర్జుష్టా బర్హిణక్రౌంచనాదితా।
రమణీయా నదీ సౌమ్యా మునిసంఘై ర్నిషేవితా॥ ౨౩
పశ్య చందనవృక్షాణాం పఙ్క్తీ స్సురచితా ఇవ।
కకుభానాంచ దృశ్యంతే మనసేవోదితా స్సమమ్॥ ౨౪

అహో సురమణీయోఽయం దేశ శ్శత్రునిషూదన।
దృఢం రంస్యావ సౌమిత్రే సాధ్వత్ర నివసావహై॥ ౨౫
ఇతశ్చ నాతిదూరే సా కిష్కింధా చిత్రకాననా।
సుగ్రీవస్య పురీ రమ్యా భవిష్యతి నృపాత్మజ। ౨౬

గీతవాదిత్రనిర్ఘోష శ్శ్రూయతే జయతాం వర।
నర్దతాం వానరాణాంచ మృదంగాడంబరై స్సహ॥ ౨౭

(౨౦) నానావిధములుగఁ గూయుచుండు పక్షుల సమూహముల ధ్వనులతోఁగూడి, ఒండొంటిపై మిగుల అనురాగము గల చక్రవాకపక్షులతో నలంకరింపఁబడి,

(౨౧) హంస సారసపక్షులతోఁగూడి మిగుల రమ్యముగ నుండుయిసుకతో, సర్వాలంకారముచేసికొని నవ్వుచుండు స్త్రీవలె, యీనది ప్రకాశించుచున్నది.

(౨౨) కొన్ని ప్రదేశములలో నల్లకలువలతోను, కొన్ని భాగములలో నెర్రకలువలతోను, కొన్నిదిక్కులలో తెల్లగనుండు తామరమొగ్గలతోను యీనది ప్రకాశించుచున్నది.

(౨౩) పారిప్లవమను పేరుగలిగి జలములో నడుచు పక్షులు గలదియు, నెమళుల క్రౌంచపక్షుల ధ్వని గలదియు, ఋషుల గుంపులతోఁ గూడినదియు నగు నీ నది, సౌమ్యుఁడా! మనోహరముగ నున్నది

(౨౪) హారముగ గట్టినటుల నుండుచందనవృక్షముల వరుసను జూడుము, కకుభవృక్షముల వరుసలు అగుపడుచున్నవి. ఈ రెండును సంకల్పముచేతనే గలిగిన వానివలె నున్నవి.

(౨౫) శత్రుసంహారకుఁడా! ఈ ప్రదేశము మిగుల రమణీయముగ నున్నది. ఆశ్చర్యము. లక్ష్మణా! ఇచట బాగుగ మనోవినోదముతో సుఖముగ వసింపదము.

(౨౬) రాజపుత్రుఁడా! ఆశ్చర్యముగనుండు అరణ్యము గల మనోహరమగు సుగ్రీవుని పట్టణ మగుకిష్కింధ దీనికి సమీపములోనే యున్నది

(౨౭) జయశాలురలో శ్రేష్ఠుఁడా! మృదంగము గానము వాద్యములతో గూడిన ధ్వనియు, ఆడుచుండు వానరుల ధ్వనియు వినవచ్చుచున్నది.

లబ్ధ్వా భార్యాం కపివరః ప్రాప్య రాజ్యం సుహృద్వృతః।
ధ్రువం నందతి సుగ్రీవ స్సంప్రాప్య మహతీం శ్రియమ్॥ ౨౮

ఇత్యుక్త్వా న్యవస త్తత్ర రాఘవ స్సహలక్ష్మణః।
బహుదృశ్యదరీకుంజే తస్మి న్ప్రస్రవణే గిరౌ॥ ౨౯

సుసుఖేపి బహుద్రవ్యే తస్మి న్హి ధరణీధరే।
వసత స్తస్య రామస్య రతి రల్పాపి నాభవత్॥ ౩౦
హృతాం హి భార్యాం స్మరతః ప్రాణేభ్యోపి గరీయసీమ్॥ ౩౦½

ఉదయాభ్యుదితం దృష్ట్వా శశాంకంచ విశేషతః। ౩౧
ఆవివేశ న తం నిద్రా నిశాసు శయనం గతమ్॥ ౩౧½
తత్సముత్థేన శోకేన బాష్పోపహతచేతసమ్। ౩౨

తం శోచమానం కాకుత్స్థం నిత్యం శోకపరాయణమ్।
తుల్యదుఃఖోఽబ్రవీ ద్భ్రాతా లక్ష్మణోఽనునయ న్వచః॥ ౩౩

అలంవీర వ్యథాం గత్వా న త్వం శోచితు మర్హసి।
శోచతో వ్యవసీదంతి సర్వార్థా విదితం హి తే॥ ౩౪

సీతకై దుఃఖించు చుండు రామునికి లక్ష్మణుఁడు సమాధానము చెప్పుట. 3౦౫

(౨౭) వానర శ్రేష్ఠుఁడగు సుగ్రీవుఁడు రాజ్యమును భార్యను గొప్ప దైశ్వర్యమును బడసి స్నేహితులతోఁగూడి సంతోషించుచున్నాఁడు. నిజము.

(౨౮) ఈ విధముగఁజెప్పి, శ్రీరాముఁడు లక్ష్మణునితోడ, అనేక విధములగు మంచి పదార్థములు గుహలు పొదరిండ్లు గలఋశ్యమూక పర్వతములో వసించు చుండెను.

(3౦,3౦౫) అనేక పూలు పండ్లుగలిగి మిగుల సుఖమునిచ్చుచుండు ప్రస్రవణ పర్వతములో, ప్రాణములకంటె నధికముగ నుండు రాక్షసుఁ డపహరించుకొని పోయిన, భార్యను స్మరించి వసించుచుండు శ్రీరామునికి కొంచెమైనను సంతోషము గలుగలేదు.

(3౧౫) ఉదయ పర్వతములో నుదయించుచుండు చంద్రుని బాగుగఁ జూచిరాత్రిపూట పడకలోఁబండుకొని యుండు శ్రీరామునికి నిదురపట్టలేదు.

(3౨,33) సీతను స్మరించుటచే గలిగిన దుఃఖముతో బాష్పములు గలిగి మనసు చెడిపోవుండు వాఁడును, సదా దుఃఖించుచుండువాఁడును, నగు రామునికి, అతనితోసమమైన దుఃఖముగల లక్ష్మణుఁడు, సమాధానపరచుచు యిటుల నెను.

(3౪) వీరుఁడా! మనసులో వ్యధ పడిచాలును. నీవు దుఃఖించుటతగదు. దుఃఖించుచుండు వాని కార్యము లన్నియు చెడును. ఇది నీకుఁ దెలిసినదేను.

భవాన్ క్రియాపరో లోకే భవాన్ దైవపరాయణః।
ఆస్తికో ధర్మశీలశ్చ వ్యవసాయీచ రాఘవ॥ 3౫
నహ్యవ్యవసిత శ్శత్రుం రాక్షసం తం విశేషతః।
సమర్థ స్త్వం రణే హంతుం విక్రమై ర్జిహ్మకారిణం॥ 3౬

సమున్మూలయ శోకం త్వం వ్యవసాయం స్థిరం కురు।
తత స్సపరివారం తం నిర్మూలం కురు రాక్షసమ్॥ 3౭
పృథివీ మపి కాకుత్స్థ ససాగరవనాచలామ్।
పరివర్తయితుం శక్తః కి మంగ పున రావణమ్॥ 3౮

శరత్కాలం ప్రతీక్షస్వ ప్రావృట్కాలోఽయ మాగతః।
తత స్సరాష్ట్రం సగణం రావణం త్వం వధిష్యసి॥ 3౯
అహం తు ఖలు తే వీర్యం ప్రసుప్తం ప్రతిబోధయే।
దీప్తై రాహుతిభిః కాలే భస్మచ్ఛన్న మివానలమ్॥ ౪౦

లక్ష్మణస్యతు తద్వాక్యం ప్రతిపూజ్య హితం శుభమ్।
రాఘవ స్సుహృదం స్నిగ్ధ మిదం వచన మబ్రవీత్॥ ౪౧
వాచ్యం య దనురక్తేన స్నిగ్ధేనచ హితేనచ।
సత్యవిక్రమయుక్తేన తదుక్తం లక్ష్మణ త్వయా॥ ౪౨

(౩౫) లోకములో కార్యసిద్ధికి హేతుభూతమగు పురుషకార బలముగలవాఁడుగను, దైవనిష్ఠగల వాఁడుగను, ఆస్తికుఁడుగను, ధర్మశీలుఁడుగను, కార్యముసేయుటలో ప్రయత్నముగలవాఁడుగను, ఓరామా! నీవు ఉన్నావు.

(౩౬) సీతను నపహరించి గొప్పద్రోహముచేసిన రాక్షసుని యుద్ధములో పరాక్రమముచే జంపుటకు ధైర్యములేక అసమర్థుఁడ వగుదువు.

(౩౭) కనుక, నీవు దుఃఖమును నిర్మూలము సేయుము. శత్రుసంహారము సేయుటకు బాగుగఁ బ్రయత్నముసేసి, పిమ్మట, సపరివారముగ రాక్షసుని నిర్మూలము సేయుము.

(౩౮) రామా! సముద్రములు అరణ్యములు కొండలతోఁ గూడిన భూమిని తలక్రిందు చేయుటకు నీకు శక్తిగలదు. ఇఁక రావణుఁడెంతమాత్రము.

(౩౯) వర్షాకాలము వచ్చినది. శరత్కాలమును నిరీక్షించుచుందుము. అప్పుడు నీవు రావణుని రాజ్యముతోను పరివారముతోను వధించెదవు.

(౪౦) ప్రకాశము గలిగించునట్టి ఆజ్యాహుతులచే చల్లారిపోవునప్పుడు బూడిదగప్పిన అగ్నిని ప్రజ్వలింపఁజేసినటుల, నిద్రించుచుండు నీపరాక్రమమును నిదురలేపుచున్నాను.

(౪౧) హితముగను శుభముగను నుండు లక్ష్మణుని మాటలను శ్లాఘించి శ్రీరాముఁడు, స్నేహముతోఁ గూడి మిగులప్రియమును దెలుపు మాటను జెప్పెను.

(౪౨) లక్ష్మణా! అనురాగము గలిగినవాఁడుగను, ఆయాకాలములలోఁ బ్రియము సెప్పువాఁడుగను, హితపరుఁడుగను, వ్యర్థముకాని పరాక్రమము గలవాఁడుగను నుండువాఁడు చెప్పునట్టి మాటలనన్నిటిని నీవు చెప్పితివి.

ఏష శోకః పరిత్యక్త స్సర్వకార్యావసాదకః।
విక్రమేష్వప్రతిహతం తేజః ప్రోత్సాహయామ్యహమ్॥ ౪౩
శరత్కాలం ప్రతీక్షిష్యే స్థితోఽస్మి వచనే తవ।
సుగ్రీవస్య నదీనాంచ ప్రసాద మనుపాలయన్॥ ౪౪
ఉపకారేణ వీరస్తు ప్రతికారేణ యుజ్యతే।
అకృతజ్ఞోఽప్రతికృతో హంతి సత్త్వవతాం మనః॥ ౪౫
అథైవ ముక్తః ప్రణిధాయ లక్ష్మణః కృతాంజలి స్తత్ప్రతిపూ
జ్య భాషితమ్। ఉవాచ రామం స్వభిరామదర్శనం ప్రదర్శయ
న్దర్శన మాత్మన శ్శుభమ్॥ ౪౬
యథోక్త మేత త్తవ సర్వ మీప్సితం నరేంద్ర కర్తా నచిరా
ద్ధరీశ్వరః। శరత్ప్రతీక్షః క్షమతా మిమం భవాన్ జలప్రపాతం
రిపునిగ్రహే ధృతః॥ ౪౭
నియమ్య కోపం ప్రతిపాల్యతాం శరత్ క్షమస్వ మాసాంశ్చ
తురో మయా సహ। వసాచలేఽస్మి న్మృగరాజసేవితే సంవర్ధ
య న్శత్రువధే సముద్యమమ్॥ ౪౮

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - సప్తవింశస్సర్గః.

(౪౩) సర్వకార్యములను నాశము సేయునట్టి యీశోకమును సంపూర్ణముగ విడిచితిని. వ్యర్థము కానట్టి నాపరాక్రమమును వృద్ధిచేసికొనెదను.

(౪౪) సుగ్రీవునియొక్కయు నదులయొక్కయు సహాయమును బ్రతీక్షించుచు, నీమాట ప్రకారము, శరత్కాలమున కెదురుచూచుచుండెదను.

(౪౫) ఉపకారము బొందియుండు వీరుఁడు ప్రత్యుపకారము తప్పక సేయును. ఉపకారమును మరచి ప్రత్యుపకారము సేయని పురుషుని సత్పురుషులు నిందించెదరు.

(౪౬) శ్రీరాముఁ డిటుల చెప్పగా, లక్ష్మణుఁడు అంజలిచేసికొని, ఆమాటను శ్లాఘించి, రాబోవు కార్యమును నాలోచించి, తన మంచియభిప్రాయమును దెలుపుచు మనోహరముగనుండు చూపుగల రామునితో నిటు లనెను.

(౪౭) రాజా! నీకోరికలనన్నిటిని శీఘ్రములోనే వానరరాజు పూర్తిచేయును. ఈ వానకాలమును సైచుకొని, శరత్కాలమును నెదురుచూచుచు, శత్రువులను జంపుటలో ధైర్యముగలవాఁడవుగ నుండుము.

(౪౮) కోపమును నడచుకొని, యీనాలుగునెలలు ఓర్చుకొని, శరత్కాలమును నెదురుచూచుచుండుము. వాతోడ సింహములు గల యీపర్వతములోఁ శత్రువులను జంపుటలో నీప్రయత్నమును వృద్ధిపరచుకొనుచు ఉండుము.

ఇది యిరువదియేడవ సర్గ.



## అష్టావింశస్సర్గః.



స తధా వాలినం హత్వా సుగ్రీవ మభిషిచ్యచ।
వస న్మాల్యవతః పృష్ఠే రామో లక్ష్మణ మబ్రవీత్॥ ౧

అయం స కాల స్సంప్రాప్త స్సమయోఽద్యజలాగమః।
సంపశ్య త్వం నభో మేఘైః సంవృతం గిరిసన్నిభైః॥ ౨

నవమాసధృతం గర్భం భాస్కరస్య గభస్తిభిః।
పీత్వా రసం సముద్రాణాం ద్యౌః ప్రసూతే రసాయనమ్॥ ౩

శక్య మంబర మారుహ్య మేఘసోపానపజ్క్తిభిః।
కుటజార్జునమాలాభి రలంకర్తుం దివాకరమ్॥ ౪

సంధ్యా రాగోత్థితై స్తామ్రై రంతేష్వధికపాండరైః।
స్నిగ్ధై రభ్రపటచ్ఛేదై ర్బద్ధవ్రణ మివాంబరమ్॥ ౫

మందమారుతనిశ్వాసం సంధ్యాచందనరంజితమ్।
ఆపాండు జలదం భాతి కామాతుర మివాంబరమ్॥ ౬

## ౨౮ వ సర్గ

(అవతారిక— రాముఁడతని ఆశ్రితుల విశ్లేషమును సైచకుండుటచు అన్యాపదేశముద్వారా లక్ష్మణునికిఁ దెలుపుచు వర్షఋతువునువర్ణించుచున్నాఁడు.)

(౧) ఈవిధముగ వాలిని జంపి సుగ్రీవునికి పట్టాభిషేకముసేసి ప్రస్రవణమను కొండమీద వసించుచు శ్రీరాముఁడు లక్ష్మణునితో నిటు లనెను.

(౨) సుగ్రీవునికి మనకు సంకేతముగనుండు వర్షాకాలము యిప్పుడు మిగుల సమీపించెను. లక్ష్మణా! కొండవలెనుండు మేఘములతో నిండియుండు ఆకాశమును జూడుము.

(3) మేఘములు సూర్యుని కిరణములద్వారా సముద్రజలమును పానముచేసి కార్తికము మొదలు ఆషాఢమువరకు గర్భముధరించి షడ్రసములకు కారణముగనుండు జలమును వర్షించుచున్నవి.

(౪) లక్ష్మణా! మేఘము లను మెట్లమీద నెక్కి ఆకాశమునకుఁబోయి కొండమల్లెలు అర్జునపూలమాలలతో మన కులగురువగు సూర్యుని మధ్యలోనుండు నారాయణుని నలంకరించుటకు సాధ్యముగనున్నది. (సీతతోడ నారాయణుని బూజించుటకు లేకపోయెనని రాముఁడు చింతించుట యిచట ధ్వనించుచున్నది.)

(౫) అపుడు పుట్టిన సంధ్యారాగముచే నెర్రగనుండునదియు, దీని కొనలలో మిగుల తెల్లగనుండునదియు, గొంచము తడిగనుండు మేఘములనెడు వస్త్రఖండములచే ఆకాశము, కట్టుగట్టఁబడిన వ్రణమువలె, ప్రకాశించినది.

(౬) మందమారుత మనునిశ్వాసముగలదియు, సంధ్యారాగమనెడు చందనము పూయఁబడినదియు, కొంత తెల్లగనుండు మేఘములు గలదియు, నగు ఆకాశము, కాంతనువెడబాసిన కామాతురుఁడో, అను నట్లు ప్రకాశించినది.

ఏషా ఘర్మపరిక్లిష్టా నవవారిపరిప్లుతా।
సీతేవ శోకసంతప్తా మహీ బాష్పం విముంచతి॥ ౭

మేఘోదరవినిర్ముక్తాః కహ్లారసుఖశీతలాః।
శక్య మంజలిభిః పాతుం వాతాః కేతకిగంధినః॥ ౮

ఏష ఫుల్లార్జున శ్శైలః కేతకై రధివాసితః।
సుగ్రీవఇవ శాంతారి ర్ధారాభి రభిషిచ్యతే॥ ౯

మేఘకృష్ణాజినధరా ధారా యజ్ఞోపవీతినః।
మారుతాపూరితగుహాః ప్రాధీతా ఇవ పర్వతాః॥ ౧౦

కశాభి రివ హైమీభి ర్విద్యుద్భిరివ తాడితమ్।
అంతస్స్తనితనిర్ఘోషం సవేదన మివాంబరమ్॥ ౧౧

నీలమేఘాశ్రితా విద్యుత్ స్ఫురంతీ ప్రతిభాతి మే।
స్ఫురంతీ రావణస్యాంకే వైదేహీవ తపస్వినీ॥ ౧౨

(౭) గ్రీష్మసంతాపముచే మిగుల క్లేశమును బొందినదియు, క్రొత్తజలముతో తడిసియుండునదియు, నగు యీభూమి, శోకముచే కుందుచుండు సీతవలె, వేడియావిరిని విడుచుచున్నది.

(౮) మేఘముల మధ్యనుండి వెలుపలవచ్చినదియు, నీలోత్పలమువలె సుఖముగనుండు శైత్యముగలదియు, మొగలిపూలమీఁదినుండి వీచుటవలన యిట్టి పరిమళముగలదియును నగు గాలి దోసిలితోఁ బుచ్చుకొని పానము సేయుటకు తగియున్నది. (అతిశయోక్తి అలంకారము.)

(౯) పూచియుండు అర్జున వృక్షములుగలదియు, మొగలిపూలవాసనగలదియు, తాపముడిగి యుండునదియు నగుయీ పర్వతము, సుగ్రీవునివలెనే, వర్షధారలచే అభిషేకము సేయఁబడుచున్నది. (ఉపమా లంకారము.)

(౧౦) మేఘములను కృష్ణాజినములు ధరించినవిగను, వర్షధారలను జన్నిదములను ధరించినవిగను, గాలితో నిండిన గుహలుగలవిగను, నుండు పర్వతములు, బాగుగ అధ్యయనము సేయుట కుపక్రమించు బ్రహ్మచారులవలె నుండినవి.

(౧౧) మెఱుపులను బంగారు కొరడాలతోఁ గొట్టఁబడిన వానివలెనుండునదియు, గర్జనయను గొప్పధ్వనిగలదియు, ఇందుచేతనే వేదనతోఁ గూడిన బ్రహ్మచారివలె ఆకాశము ఉన్నది

(౧౨) నీలవర్ణమైన మేఘమును నాశ్రయించి ప్రకాశించుచుండు మెరుపు, రావణునితొడలోఁ గూర్చుండి దుఃఖించుచుండు సీతవలె, నాకుఁ దోచుచున్నది.

ఇమాః స్ఫు మన్మథవతాం హితాః ప్రతిహతా దిశః।
అనులిప్తాఇవ ఘనై ర్నష్టగ్రహనిశాకరాః॥ ౧3

క్వచి ద్బాష్పాభిసంరుద్ధాన్ వర్షాగమసముత్సుకాన్।
కుటజా న్పశ్య సౌమిత్రే పుష్పితాన్ గిరిసానుషు॥ ౧౮
మమ శోకాభిభూతస్య కామసందీపనాన్ స్థితాన్॥ ౧౮4

రజః ప్రశాంతం సహిమోఽద్యవాయు ర్నిదాఘదోషప్రస
రాః ప్రశాంతాః। స్థితాహి యాత్రా వసుధాధిపానాం ప్రవా
సినో యాంతి నరా స్స్వదేశాన్॥ ౧౨4

సంప్రస్థితా మానసవాసలుబ్ధాః ప్రియాన్వితా స్సంప్రతి చక్ర
వాకాః। అభీక్ష్ణవర్షోదకవిక్షతేషు యానాని మార్గేషు నసం
పతంతి॥ ౧౬4

(౧౩) మేఘములచే మైపూతపూసికొని నటుల అగుపడు చుండునవియు, కంటికిఁ దెలియకుండు సూర్యాదిగ్రహములు చంద్రుఁడుగలదియు. అందుచేత నే, యిది పడమర యిది యుత్తరమని తెలియకుండునవియు నగు యీదిక్కులు స్త్రీలతోడనుండు వారికి సుఖకరముగ నున్నవి.

(౧౪,౧౪౫) కొన్నిప్రదేశములలోనూతనమైన జలము పడుటచే పైకిలేచియుండు ఆవిరి పొగగలదియు, వానవచ్చినందున సుఖము పొందినవిగను, పర్వత పార్శ్వములలో పూచియుండు సీతా శోకముచేఁ బీడింపఁబడియుండు నాకు కామోద్రేకమును గలిగించుచుండు నట్టివియునగు కుటజవృక్షములను, లక్ష్మణా! చూడుము.

(౧౫౫) దుమ్మునిలిచిపోయినది. గాలిచల్లగనున్నది. గ్రీష్మతాపము శాంతపడినది. రాజుల దండయాత్రలు నిలిచిపోయినవి. దేశాంతరములకుఁ బోయిన ప్రజలు వారిస్వదేశములు చేరిరి (విశేషార్థము.— భగవత్ కటాక్షముచే చేతనునికి రజస్తమోగుణములు నశించినవి. సంసారిగనుండు మనుజుఁడు పరార్ద్రహృదయుఁడుగ నున్నాఁడు. చేతనునికి ఆధ్యాత్మికాది తాపములు ప్రకృతిసంబంధము నివర్తించినది. ఇట్టి చేతనుఁడు ప్రాప్యమగు పరమపదమును బొందుచున్నాఁడు.)

(౧౬౫) హంసలు వానకు భయపడి దాగియున్నవి. చక్రవాక పక్షులు కామోద్రేకముచే యిపుడు ఆఁడు పక్షులతోఁ గూడి యున్నవి. సదా వానకురియు చుండుటచే మిట్టపల్లములై చెడియుండు మార్గములలో రథము మొదలగు వాహనములు పోవుటలేదు.

క్వచి త్ప్రకాశం క్వచి దప్రకాశం నభఃప్రకీర్ణాంబుధరంవిభాతి।
క్వచి త్క్వచిత్పర్వతసన్నిరుద్ధం రూపం యథా శాంతమహా
ర్ణవస్య॥ ౧౭

వ్యామిశ్రితం సర్జకదంబపుష్పైః నవం జలం పర్వతధాతుతా
మ్రమ్॥ మయూరకేకాభిరనుప్రయాతం శైలాపగా శ్శీఘ్రత
రం వహంతి॥ ౧౮

రసాకులం షట్పదసన్నికాశం ప్రభుజ్యతే జంబుఫలం ప్రకా
మమ్। అనేకవర్ణం పవనావధూతం భూమౌ పతత్యామ్రఫలం
విపక్వమ్॥ ౧౯

విద్యు త్పతాకా స్సబలాకమాలా శ్శైలేంద్రకూటాకృతిసన్ని
కాశాః। గర్జంతి మేఘా స్సముదీర్ణ నాదా మత్తాగజేంద్రా ఇవ
సంయుగస్థాః॥ ౨౦

వర్షోదకాప్యాయిత శాద్వలాని ప్రవృత్తనృత్తోత్సవ బర్హి
ణాని। వనాని నిర్వృష్టబలాహకాని పశ్యాపరాహ్ణేష్వధికం
విభాంతి॥ ౨౧

సముద్వహంత స్సలిలాతిభారం బలాకినో వారిధరా నదంతః
మహత్సు శృంగేషు మహీధరాణాం విశ్రమ్య విశ్రమ్య పునః
ప్రయాంతి॥ ౨౨

(౧౭౫) చెదిరిన మేఘములు గలిగియుండుటచే కొన్ని ప్రదేశములలో ప్రకాశముగలదిగను, కొన్నిప్రదేశములలో ప్రకాశములేనిదిగనునుండు ఆకాశము, కొన్నిప్రదేశములలో పర్వతములచే అడ్డగింపఁబడి, అలలులేని సముద్రము రూపమువలె ప్రకాశించినది.

(౧౮౦) సర్జ కదంబపూలతో గలిసియుండునదియు, పర్వతములోనుండు గైరికాది ధాతువులసంబంధముచే నెర్రగనుండునదియు, నెమళ్ల కేకలతో గూడినదియునగు క్రొత్తనీరు గిరినదులలో శీఘ్రముగఁ బారుచున్నది.

(౧౯౫) మాధుర్యముతో నిండినవియు, తుమ్మెదవలె నల్లగ నుండునవియు, నగునేరేడుపండ్లను విశేషముగ జనులు భుజించుచున్నారు. నానావిధముల గురంగులుగలిగి గాలిచేఁ గొట్టఁబడి పక్వముగనుండు మామిడిపండ్లు భూమిమీద పడుచున్నవి.

(౨౦౫) మెరుపులనెడు ధ్వజపటములు గలవియు, కొంగలవరుస లనెడు నక్షత్రమాలలు గలవియు, శ్రేష్ఠమైన కొండశిఖరములతో సమానముగ నుండునవియు నగు మేఘములు, యుద్ధములో నుండునట్టి మిగుల ధ్వనులుచేయునట్టి మదించిన యేనుఁగులవలె, గర్జించుచున్నవి.

(౨౧౫) వానజలముచే ఆప్యాయము పొందియుండుపచ్చిక గలవియు, నాట్యము సేయుచుండు నెమళ్లు గలవియు, విశేషముగ వర్షించుచుండు మేఘములు గలవనములు సాయంసమయములో మిగుల ప్రకాశించుచున్నవి. చూడుము.

(౨౨౫) జలముయొక్క గొప్పభారమును మోయుచుండు, కొంగలతోఁ గూడి గర్జించుచుండు, మేఘములు పర్వతశిఖరములమీద నిలిచి నిలిచి మఱియు లేచిపోవుచున్నది.

మేఘాభికామా పరిసంపతంతీ సంమోదితా భాతి బలాక పఙ్క్తిః। వాతావధూతా వరపౌండరీకీ లంబేవ మాలా రచితాంబరస్య॥ ౨౩

బాలేంద్రగోపాంతరచిత్రితేన విభాతి భూమి ర్నవశాద్వలేన। గాత్రానువృత్తేన శుకప్రభేణ నారీవ లాక్షోక్షితకంబళేన॥ ౨౪

నిద్రా శనైః కేశవ మభ్యుపైతి ద్రుతం నదీ సాగరమభ్యుపైతి। హృష్టా బలాకా ఘన మభ్యుపైతి కాంతా సకామా ప్రియ మభ్యుపైతి॥ ౨౫

జాతా వనాంతా శ్శిఖిసంప్రనృత్తా జాతాః కదంబా స్సకదంబశాఖాః। జాతా వృషా గోషు సమానకామా జాతా మహీ సస్యవనాభిరామా॥ ౨౬

వహంతి వర్షంతి నదంతి భాంతి ధ్యాయంతి నృత్యంతి సమాశ్వసంతి। నద్యో ఘనా మత్తగజా వనాంతాః ప్రియా విహీనా శ్శిఖినః ప్లవంగాః॥ ౨౭

ప్రహర్షితాః కేతకపుష్పగంధ మాఘ్రాయ హృష్టా వననిర్ఝరేషు। ప్రపాత శబ్దాకులితా గజేంద్రా స్సార్ధం మయూరై స్సమదా నదంతి॥ ౨౮

(౨౩౫) గర్భము ధరించుటకై మేఘమును నపేక్షించి, దానిసమీపమునకు వచ్చుచుండునట్టి మిగుల సంతోషించియుండు కొంగలవరుస, ఆకాశమును నలంకరించుటకై కట్టఁబడి గాలిచేఁ గొట్టఁబడి చలించుచుండు తెల్ల తామరపూలహారమువలె అగుపడుచున్నది.

(౨౪౫) బాలేంద్రగోపములచే మధ్యమధ్యలో నానారంగులుగనుండు క్రొత్తపచ్చిక ప్రదేశములు గలభూమి, చిలుకవంటిరంగు మధ్యమధ్యలో లాక్షారాగముగలిగి కప్పుకొనియుండు స్త్రీవలె, ప్రకాశించుచున్నది.

(౨౫౫) శ్రీహరికి ఆషాఢమాసములో నిద్ర ప్రారంభమగుచున్నది. నదులు త్వరగ సముద్రములోఁ జేరుచున్నవి. సంతోషము గలకొంగలు మేఘమును బడయుచున్నవి. కామముగల స్త్రీలు ప్రియులను బొందుచున్నారు.

(౨౬౫) వనముల మధ్యప్రదేశములు నెమళ్ళనాట్యముతోఁ గూడియున్నవి. కదంబవృక్షములశాఖలు పూలతోనిండియున్నవి. వృషభములు గోవులతో సమానమైన కామము గలవియైనవి. భూమి పైరుపచ్చలతో మనోహరముగ నున్నది.

(౨౭౫) నదులు ప్రవహించుచున్నవి. మేఘములు వర్షించుచున్నవి. అడవులలోనుండు మదించిన యేనుఁగులు సంతోషించుచున్నవి. వన మధ్యప్రదేశములు ప్రకాశించుచున్నవి. ప్రియురాండ్రను నెడబాసిన పురుషులు చింతించుచున్నారు. నెమళ్ళు నాట్యముచేయుచున్నవి. కోతులు ఒకచోట నేవలసినన్ని ఫలములు లభించినందున చలనములేక స్వస్థచిత్తముతో నున్నవి.

(౨౮౫) సంతోషించియుండు శ్రేష్ఠమగు యేనుఁగులు మొగలిపూలవాసనకు మిగుల సంతోషించి, అడవిలోకి దిగుచుండు కొండనదుల ధ్వనిచే బెదరనవగుచు మదించి నెమళ్ళతోడ సంతోషించినవి.

ధారా నిపాతై రభిహన్యమానాః కదంబశాఖాసు విలంబమా
నాః। క్షణార్జితం పుష్పరసావగాఢం శనై ర్మదం షట్చరణా
స్త్యజంతి॥ ౨౯

అంగారచూర్ణోత్కరసన్నికాశైః ఫలై స్సువర్యాప్తరసై స్స
మృద్ధైః। జంబూద్రుమాణాం ప్రవిభాంతి శాఖా నిలీయమా
నా ఇవ షట్పదౌఘైః॥ ౩౦

తటిత్పతాకాభి రలంకృతానా ముదీర్ణగంభీర మహారవాణామ్।
విభాంతి రూపాణి వలాహకానాం రణోద్యతానా మివ వార
ణానామ్॥ ౩౧

మార్గానుగ శ్శైలవనానుసారీ సంప్రస్థితో మేఘరవం నిశమ్య।
యుద్ధాభికామః ప్రతినాగశంకీ మత్తో గజేంద్రః ప్రతిసన్ని
వృత్తః॥ ౩౨

క్వచి త్ప్రగీతా ఇవ షట్పదౌఘైః క్వచిత్ప్రనృత్తా ఇవ నీలకం
ఠైః। క్వచిత్ప్రమత్తా ఇవ వారణేంద్రై ర్విభాంత్యనేకాశ్రయి
ణో వనాంతాః॥ ౩౩

కదంబసర్జార్జునకందళాఢ్యా వనాంతభూమి ర్నవవారిపూర్ణా।
మయూరమత్తాభిరుతప్రనృత్తై రాపానభూమిప్రతిమా విభాతి॥

(౨౯వ) వానచేఁ గొట్టఁబడినవియు, అందువల్లనే పూలను విడిచి కదంబ వృక్షశాఖలలో వ్రేలాడుచుండిన తుమ్మెదలు అపుడు తేనెను గ్రోలనందున మదమును బోగొట్టుకొను చున్నవి.

(౩౦వ) బొగ్గు పొడిరాసితో సమమై నీలవర్ణముగ నుండునదియు, బాగుగ నిండిన రసముగలిగి చెట్లలోనిండియుండు ఫలములచే నేరేడుచెట్ల శాఖలు, తుమ్మెదలతోఁ గప్పఁబడినటుల, ప్రకాశించుచున్నవి.

(౩౧వ) మెరుపులను ధ్వజములతో నలంకరింపఁబడిన పుట్టి గంభీరముగఁ నుండు గొప్ప మేఘగర్జన యనుసింహ నాదము గలమేఘముల ఆకారములు యుద్ధసన్నద్ధములై యుండు యేనుఁగులవలెఁ బ్రకాశించుచున్నవి.

(౩౨వ) అది వసించుచుండు కొండను వనమును ననుసరించి మార్గములోఁ బోవుచుండునదియు, మదించియుండునదియు నగు గజేంద్రుఁడు మేఘగర్జనను వెనుకభాగములో విని యింకొక యేనుఁగు గర్జించుచు వచ్చుచున్నదనుకొని దానితోఁ బోరుటకుకోరి వెనుకకుతిరిగెను. (ధ్వన్యర్థము.— వేదమార్గమును ననుసరించి దిగ్విజముసేయుటకై ప్రతివాది ను విని అతనితో వాదించుటకుగోరి వెనుకకుఁ దిరుగు పురుషశ్రేష్ఠుఁడు సూచింపఁబడెను.)

(౩౩వ) గీతము నృత్తము మదమును నాశ్రయించియుండు వనప్రదేశములు కొన్నిచోట్ల తుమ్మెదలసమూహములచే బాగుగ గానముసేయునటులను, కొన్ని ప్రదేశములలో నెమళులచే బాగుగ నాట్యముసేయునటులను, కొన్నిప్రదేశములలో ఏనుఁగులచే బాగుగ మదించియుండునటులను ప్రకాశించినవి.

(౩౪వ) కదంబ, సర్జ, అర్జున కందళీ పుష్పములతోను క్రొత్తజలముతోను నిండియుండు వనప్రదేశము, మదించియుండు నెమళుల కేకాధ్వనులతోను విశేషమగు నాట్యముతోను కల్లు విక్రయించు ప్రదేశమువలె నున్నది.

ముక్తాసకాశం సలిలం పత ద్వై సునిర్మలం పత్రపుటేషు ల
గ్నమ్। హృష్టా వివర్ణచ్ఛదనా విహంగా స్సురేంద్రదత్తం తృ
షితాః పిబంతి॥ ౩౫ ౪

షట్పాదతంత్రీమధురాభిధానం ప్లవంగమోదీరితకంఠతాళమ్।
ఆవిష్కృతం మేఘమృదంగనాదై ర్వనేషు సంగీతమివ ప్రవృ
త్తమ్॥ ౩౬ ౪

క్వచి త్ప్రనృత్తైః క్వచి దున్నదద్భిః క్వచిచ్చ వృక్షాగ్రనిషణ్ణకా
యైః। వ్యాలంబబర్హాభరణై ర్మయూరై ర్వనేషు సంగీతమివ
ప్రవృత్తమ్॥ ౩౭ ౪

స్వనై ర్ఘనానాం ప్లవగాః ప్రబుద్ధా విహాయ నిద్రాం చిరసన్ని
రుద్ధామ్। అనేకరూపాకృతివర్ణనాదా నవాంబుధారాభిహతా
నదంతి॥ ౩౮ ౪

నద్య స్సముద్వాహితచక్రవాకా స్తటాని శీర్ణాన్యపవాహ
యిత్వా। దృప్తా నవప్రాభృతపూర్ణభోగా ద్రుతం స్వభర్తార
ముపోపయాంతి॥ ౩౯ ౪

నీలేషు నీలాః ప్రవిభాంతి సక్తా మేఘేషు మేఘా నవవారిపూ
ర్ణాః। దవాగ్నిదగ్ధేషు దవాగ్నిదగ్ధా శ్శైలేషు శైలా ఇవ బ
ద్ధమూలాః॥ ౪౦ ౪

(౩౫౪) కాంతిచెడిన రెక్కలుగల సంతోషించియుండు చాతక పక్షులు దాహము గలవియై, ముత్యములవలెనుండి పడుచుండినదియు, నిర్మలమైన చొప్పలుగనుండు ఆకులలోఁగల ఇంద్రునిచే నీయంబడిన జలమును ద్రాగుచున్నవి.

(౩౬౪ భ్రమరముల నెడి తంత్రియొక్క మధురమగు నాదముతోను కప్పలయొక్క కంఠతాళములతోను మేఘముల నెడి మద్దెలనాదములతోను ప్రకాశించుచుండు సంగీతము వనములలో జరుగుచుండు నటు లుండినది.

(౩౭౪) కొన్ని ప్రదేశములలో బాగుగ నాట్యము సేయుచుండునవియు, కొన్నిచోట్లలో బాగుగ కేకాధ్వనులు సేయుచుండునవియు, కొన్ని ప్రదేశములలోవృక్షములమీద కూర్చుండునవియు, వ్రేలుచుండు పింఛములను నాభరణములుగ గలవియు, నగు నెమళ్ళచే అడవులలో సంగీతము జరుపంబడినటు లుండెను.

(౩౮౪) కప్పలు బహుకాలముగ వాని వ్యాపారములకు ప్రతిబంధకముగ నుండిన నిద్రను, మేఘగర్జనను విని, విడిచి మేలుకొని నానావిధములుగ నుండు అవయవములు రంగులు ధ్వనులు గలవియై, క్రొత్తగనుండు వర్ష జలధారలచేఁగొట్టఁబడి, కూయుచున్నవి.

(౩౯౪) ప్రవాహముమీద పోవుచుండు చక్రవాకపక్షులు గలవియు, మదించియుండునవియు, నూతనములగు ఫలాది ఉపహారములు, చందనము కర్పూరము కుసుమములు తాంబూలాది భోగములు గలిగి, విరిగిపోయియుండు గనిమెలను విడిచి శీఘ్రముగ వాని భర్తయగు సముద్రమునకు, యువతులు వారిభర్తలవద్దకుఁ బోవునటుల, నదులు పోవుచున్నవి.

(౪౦౪) కార్చిచ్చుచే దగ్ధమైన పర్వతముతోఁ జేరి దగ్ధమగుచుండు మరికొన్ని పర్వతములవలె నీలవర్ణముగనుండు మేఘములతో సంబంధించునవియు, నీలవర్ణముగ నుండునవియు క్రొత్తనీటితో నిండియుండినవియు నగు మేఘములు ప్రకాశించుచున్నవి.

పరిహృష్టసన్నాదితబర్హిణాని సశక్రకోపాకులశాద్వలాని।
చరంతి నీపార్జునవాసితాని గజా స్సురమ్యాణి వనాంతరాణి॥

నవాంబుధారాహతకేసరాణి ద్రుతం పరిత్యజ్య సరోరుహాణి।
కదంబపుష్పాణి సకేసరాణి నవాని హృష్టా భ్రమరాః పతంతి॥

మత్తా గజేంద్రా ముదితా గవేంద్రా వనేషు విశ్రాంతతరా మృ
గేంద్రాః। రమ్యా నగేంద్రా నిభృతా నరేంద్రాః ప్రక్రీడితో
వారిధరై స్సురేంద్రః॥ ౪౩

మేఘా స్సముద్భూత సముద్రనాదా మహాజలౌఘై ర్గగనావలం
బాః। నదీ స్తటాకాని సరాంసి వాపీ ర్మహీం చ కృత్స్నా మ
పవాహయంతి॥ ౪౪

వర్షప్రవేగా విపులాః పతంతి ప్రవాంతి వాతా స్సముదీర్ణఘో
షాః। ప్రణష్టకూలాః ప్రవహంతి శీఘ్రం నద్యో జలై ర్విప్ర
తిపన్నమార్గాః॥ ౪౫

నరై ర్నరేంద్రా ఇవ పర్వతేంద్రా స్సురేంద్రదత్తైః పవనోపనీ
తైః। ఘనాంబుకుంభై రభిషిచ్యమానా రూపం శ్రియం స్వా
మివ దర్శయంతి॥ ౪౬

(౪౧౫) మిగుల సంతోషించి కేకలు వేయుచుండు నెమళులు గలవియు, ఇంద్రగోపమను పురుగులు గలపచ్చికభూమి గలవియు, నీప అర్జునపూల వాసనగలవియు మిగుల మనోహరములగు వనప్రదేశములలో ఏనుఁగులు సంచరించుచున్నవి.

(౪౨౫) నూతనముగ నీటిధారలచేఁ గొట్టఁబడిన కింజల్కములుగల నూతనముగ పూచియుండు కదంబపుష్పములలో సంతోషించి తుమ్మెదలు ప్రవేశించుచున్నవి.

(౪౩౫) గజశ్రేష్ఠములు మదించియున్నవి. వృషభశ్రేష్ఠములు సంతోషముగనున్నవి. సింహములు సుఖముగ నిదురబోవుచున్నవి. పర్వతములు చిగురు మొగ్గలు పూలతో రమ్యముగనున్నవి. రాజులు దండయాత్రలు నిలిపి స్వస్థచిత్తులుగ నున్నారు. దేవేంద్రుఁడు మేఘములతో ఆటలాడుచున్నాఁడు.

(౪౪౫) తిరస్కరింపఁబడిన సముద్రము ఘోషగల, ఆకాశములో వ్రేలాడుచుండు మేఘములు విశేషముగ వర్షించి నదులను తటాకములను సరస్సులను బావులను, భూమినంతయు నిండించి, ప్రవహించునటుల చేయుచున్నది.

(౪౫౫) వాన విశేషముగఁ గురియుచున్నది. గొప్పశబ్దముతో గాలివీచుచున్నది. తెగినతీరములు గలజలముచే మార్గము తెలియక ఉండునదులు వేగముగఁ బ్రవహించుచున్నవి.

(౪౬౫) ప్రజలచే అభిషేకము సేయఁబడుచుండు రాజులు వారిరైశ్వర్యమును జూపినటుల, ఇంద్రునిచే నీయఁబడిన గాలితెచ్చిన మేఘములనెడు నీళ్ళ కడవలచే గొప్పపర్వతములు అభిషేకము సేయఁబడినవియై, వాటి నిర్మలమైన [illegible]పమును దెలుపుచున్నవి.

ఘనోపగూఢం గగనం సతారం న భాస్కరో దర్శన మభ్యుపైతి। నవైర్జలౌఘై ర్ధరణీవిసృప్తా తమోవిలిప్తా నదిశః ప్రకాశాః॥
మహాంతి కూటాని మహీధరాణాం ధారాభిధౌతా న్యధికం విభాంతి। మహాప్రమాణై ర్విపులైః ప్రపాతై ర్ముక్తాకలాపైరివ లంబమానైః॥ ౪౮

శైలోపలప్రస్ఖలమానవేగా శ్శైలోత్తమానాం విపులాః ప్రపాతాః। గుహాసు సన్నాదితబర్హిణాసు హారా వికీర్యంత ఇవాభిభాంతి॥ ౪౯
శీఘ్రప్రవేగా విపులాః ప్రపాతా నిర్ధౌతశృంగోపతలా గిరీణామ్। ముక్తాకలాపప్రతిమాః పతంతో మహాగుహోత్సంగతలై ర్ధ్రియంతే॥ ౫౦

సురతామర్దవిచ్ఛిన్నాః స్వర్గస్త్రీహారమౌక్తికాః।
పతంతీవాకులా దిక్షు తోయధారాస్సమంతతః॥ ౫౧
నిలీయమానై ర్విహగై ర్నిమీలద్భిశ్చ పంకజైః।
వికసంత్యా చ మాలత్యా గతోఽస్తం జ్ఞాయతే రవిః॥ ౫౨
వృత్తా యాత్రా నరేంద్రాణాం సేనా ప్రతినివర్తతే।
వైరాణి చైవ మార్గాశ్చ సలిలేన సమీకృతాః॥ ౫౩

(౪౭౫) నక్షత్రములతోఁ గూడిన ఆకాశమును మేఘములు మరుగుపరచుచున్నవి. సూర్యుఁడగుపడలేదు. క్రొత్త జలప్రవాహముచే భూమి నిండియున్నది. అంధకారముతోఁ గూడఁబడి దిక్కులు ప్రకాశించలేదు.

(౪౮౫) వర్షధారలచేఁ గడుగఁబడిన పర్వతములయొక్క గొప్పశిఖరములు, పెద్దవిగను విశాలములుగను వ్రేలాడుచుండు ముత్యాలహారములవలెనుండు నదులచే, మిగుల ప్రకాశించుచున్నవి.

(౪౯౫ గొప్ప పర్వతములనుండి విశేషముగఁ బ్రవహించుచుండు నదులు గుండురాళ్ళు అడ్డపడినందున చెదిరి వేగముగలవియై కేకలువేయుచుండు నెమళులు గల గుహలలోఁ బడి, ముత్యాలహారముల వలెఁ బ్రకాశించుచున్నవి.

(౫౦౫) పర్వత శిఖరప్రదేశములును, నిర్మలముగఁ జేసి శీఘ్రముగఁ బ్రవహించుచుండు అనేకములగు గిరినదులు ముత్యాల హారములతో సమానములై గొప్పగుహలుగల ప్రదేశములలో పడుచున్నవి.

(౫౧౫) వర్షధారలు, సంభోగసమయములోఁ దెగిజారిపడిన దేవతాస్త్రీల ముత్యాలహారములవలె, వ్యాకులములై నలుదిక్కులలోను బడుచున్నవి.

(౫౨౫) గూళ్ళలోదాగిన పక్షులతోను, ముడుచుకొని పోయిన తామర పూలతోను, వికసించినమాలతిపూలతోను, సూర్యుఁడు అస్తమించెనని తెలిసికొనవలసియున్నది.

(౫౩౫) రాజులు యుద్ధమునకుఁ బోవుట నిలిచిపోయినది. సేనలు స్వస్థానములకు తిరిగివచ్చుచున్నవి. రాజులకు గల పరస్పర ద్వేషములు, జలముయొక్క ప్రతిబంధకమువలన, నిలిచిపోయినవి. జలము మార్గములను నావరించినది.

మాసి ప్రోష్ఠపదే బ్రహ్మ బ్రాహ్మణానాం వివక్షతామ్।
అయ మధ్యాయసమయ స్సామగానా ముపస్థితః॥ ౫౪

నివృత్తకర్మాయతనో నూనం సంచితసంచయః।
ఆషాఢీ మభ్యుపగతో భరతః కోసలాధిపః॥ ౫౫

నూన మాపూర్యమాణాయా స్సరయ్వా వర్ధతే రయః।
మాం సమీక్ష్య సమాయాంత మయోధ్యాయా ఇవ స్వనః॥
ఇమా స్స్ఫీతగుణా వర్షా స్సుగ్రీవ స్సుఖ మశ్నుతే।
విజితారి స్సదారశ్చ రాజ్యే మహతిచ స్థితః॥ ౫౭

అహంతు హృదదారశ్చ రాజ్యాచ్చ మహత శ్చ్యుతః।
నదీకూలమివ క్లిన్న మవసీదామి లక్ష్మణ॥ ౫౮
శోకశ్చ మమ విస్తీర్ణో వర్షాశ్చ భృశదుర్గమాః।
రావణశ్చ మహా న్శత్రు రపారం ప్రతిభాతి మే॥ ౫౯

అయాత్రాం చైవ దృష్ట్వేమాం మార్గాంశ్చ భృశదుర్గమాన్।
ప్రణతే చైవ సుగ్రీవే నమయా కించి దీరితమ్॥ ౬౦

(౧౪౫) భాద్రపద మాసములో సామవేదు లగుబ్రాహ్మణులు వేదాధ్యయనము సేయుటకు మంచిసమయముగ నున్నది. వీరికిది వేదారంభసమయమని భావము.

(౧౫౫) కోసలదేశము రాజగు భరతుఁడు తనకు వలసినపదార్థములన్నిటిని సేకరించియుంచుకొని గృహముతో సంబంధించిన పనులను విడిచి వలసిన ధనమును సేకరించియుంచుకొని యున్నాఁడు. ఆషాఢమాసములో వచ్చు పూర్ణిమ మొదలు అతఁడు వ్రతము సలుపుచున్నాఁడు.

(౧౬౫) అరణ్యమునకు వచ్చుచుండు నన్ను చూచుచుండిన అయోధ్య ప్రజలరోదన ధ్వనివలె, జలముతో నిండిన సరయూనది వేగము ధ్వని, ఉండును.

(౧౭౫) శత్రువును జయించి భార్యతోఁగూడి గొప్పరాజ్యములోనుండి సుగ్రీవుఁడు మంచి గుణములుగల యీ వానకాలములో సుఖము ననుభవించుచున్నాఁడు.

(౧౮౫) నేనో భార్యను బోఁగొట్టుకొని గొప్పరాజ్యమును విడిచి వచ్చి, లక్ష్మణా! నది ఒడ్డు కూలిపడినటుల దుఃఖించుచున్నాను.

(౧౯౫) నాశోకము గొప్పదిగనున్నది. వానకాలమో సైచుటకు తగనిదిగ నున్నది. రావణుఁడు గొప్పశత్రువుగ నున్నాఁడు. ఈమూటిని జయించుట సాధ్యము కాదని తోచుచున్నది.

(౨౦౫) ఈ సమయములో రాజులు యుద్ధమునకుఁ బోఁగూడదను విషయమును, ప్రయాణము సేయుటకు మార్గములు తగియుండకుండుటనుజూచి, ఇపుడే సీతను వెతకుటకును రావణుని జంపుటకు యత్నము సేయవలయునని సుగ్రీవుఁడు నమస్కరించి ప్రార్థించినను నేనేమియు చెప్పుట తగదు.

అపి చాతిపరిక్లిష్టం చిరాద్దారై స్సమాగతమ్।
ఆత్మకార్యగరీయస్త్వా ద్వక్తుం నేచ్ఛామి వానరమ్॥ ౬౧

స్వయ మేవ హి విశ్రమ్య జ్ఞాత్వా కాల ముపాగతమ్।
ఉపకారంచ సుగ్రీవో వేత్స్యతే నాత్ర సంశయః॥ ౬౨

తస్మా త్కాలప్రతీక్షోఽహం స్థితోఽస్మి శుభలక్షణ।
సుగ్రీవస్య నదీనాంచ ప్రసాద మనుపాలయన్॥ ౬౩
ఉపకారేణ వీరో హి ప్రతీకారేణ యుజ్యతే।
అకృతజ్ఞోఽప్రతికృతో హంతి సత్త్వవతాం మనః॥ ౬౪

తమేవ ముక్తః ప్రణిధాయ లక్ష్మణః కృతాంజలి స్తత్ప్రతిపూ
జ్య భాషితమ్। ఉవాచ రామం స్వభిరామదర్శనం ప్రదర్శయ న్
దర్శన మాత్మన శ్శుభమ్॥ ౬౫

యథోక్త మేత త్తవ సర్వ మీప్సితం నరేంద్ర కర్తా నచిరా ద్ధరీ
శ్వరః। శర త్ప్రతీక్షః క్షమతా మిమం భవా న్ జలప్రపాతం రి
పునిగ్రహే ధృతః॥ ౬౬

ఇతి శ్రీమత్కింష్కింధాకాండే - అష్టావింశస్సర్గః.

(౬౧౪) మనకార్యము గొప్పదిగనుండుటచేతను, మరియు, మిగుల దుఃఖించి బహుకాలమునకు భార్యలతోఁగూడిన సుగ్రీవునికి, యిపుడె యీపనిపెట్టుటకు నేను యిష్టపడను.

(౬౨౪) శ్రమతీర్చుకొని సంకేతకాలము పమీపించినది. అతఁడె తెలిసికొని ప్రత్యుపకారము సేయుటకు యత్నించును. ఇందుకు సందేహములేదు.

(౬౩౪) మంచిలక్షణములు గలలక్ష్మణుఁడా! శరత్కాలమును సుగ్రీవుని యొక్క నదులయొక్క సహాయమును నెదురుచూచుచున్నాను.

(౬౪౪) ఉపకారము బొందియుండు వీరుఁడు ప్రత్యుపకారము తప్పకసేయును, ఉపకారమును మరచి ప్రత్యుపకారముసేయని పురుషుని సత్పురుషులు నిందించెదరు.

(౬౫౪) శ్రీరాముఁడిటుల చెప్పగా, లక్ష్మణుఁడు అంజలిచేసికొని, ఆమాటను శ్లాఘించి, రావోవు కార్యమును నాలోచించి తన మంచియభిప్రాయమును దెలుపుచు మనోహరముగనుండు చూపుగల రామునితో నిటులనెను.

(౬౬౪) రాజా! నీకోరికల నన్నిటిని త్వరలోనే వానరరాజు పూర్తిచేయును. ఈ వానకాలమును సైచుకొని, శరత్కాలమును నెదురుచూచుచు, శత్రువులను జంపుటలో ధైర్యముగలవాఁడవుగ నుండుము.

ఇది ఇరువైయెనిమిదవ సర్గ.

---

౨౯ వ సర్గ.

(అవతారిక.—హనుమంతుఁడు రామభక్తుఁడుగ నుండినను సుగ్రీవునిఅనుమతిలేనందున ఋశ్యమూకములోనే యుండి రామునిధ్యానించుచు, సుగ్రీవుఁచేరా

## ఏకోనత్రింశస్సర్గః

సమీక్ష్య విమలం వ్యోమ గతవిద్యుద్వలాహకమ్।
సారసారవసంఘుష్టం రమ్యజ్యోత్స్నానులేపనమ్॥ ౧
సమృద్ధార్థం చ సుగ్రీవం మందధర్మార్థసంగ్రహమ్।
అత్యర్థ మసతాం మార్గ మేకాంతగతమానసమ్॥ ౨

నిర్వృత్తకార్యం సిద్ధార్థం ప్రమదాభిరతం సదా।
ప్రాప్తవంత మభిప్రేతాన్ సర్వానేవ మనోరథాన్॥ ౩
స్వాంచ పత్నీ మభిప్రేతాం తారాం చాపి సమీప్సితామ్
విహరంత మహోరాత్రం కృతార్థం విగతజ్వరమ్॥ ౪

క్రీడంతమివ దేవేశం నందనేఽప్సరసాం గణైః।
మంత్రిషు న్యస్తకార్యంచ మంత్రిణా మనవేక్షకమ్॥ ౫
ఉత్సన్నరాజ్య సందేశం కామవృత్త మవస్థితమ్॥ ౫½
నిశ్చితార్థోఽర్థతత్త్వజ్ఞః కాలధర్మవిశేషవిత్।
ప్రసాద్య వాక్యైర్మధురైర్హేతుమద్భిర్మనోరమైః॥ ౬½
వాక్యవిద్వాక్యతత్త్వజ్ఞం హరీశం మారుతాత్మజః।
హితం తత్త్వంచ పథ్యంచ సామధర్మార్థనీతిమత్॥ ౭½

ముని కనుకూలమైన కార్యమును జేయుచుండుటకు యత్నించుట యీసర్గలోఁ జెప్పఁబడినది.)

(౧) నిర్మలముగను మెఱుపులు కొంగలు లేక హంసలధ్వనులతోఁగూడి నదిగను నుండు ఆకాశమును,

(౨) సంపూర్ణముగనుండు వస్త్రాభరణాదుల గలవాఁడును, అల్పముగ నుండు ధర్మార్థములుగలవాఁడును, అసత్తులగు కాముకుల మార్గమునే ప్రధానమని యెంచిన మనసుగలవాఁడును,

(౩) తనకార్యమును బూర్తిచేసికొని రాజ్యమును బొందియుండువాఁడును, సదా స్త్రీలోలుఁడుగనుండువాఁడును, తనకోరికలన్నియు, కొనసాగియుండువాఁడును,

(౪) మిగుల యిష్టముగనుండు అతని భార్యను తారను పొంది రాత్రిపగలువారితో విహరించుచు కృతార్థుఁడుగ నుండువాఁడును, భయముతీరినవాఁడును,

(౫) నందనవనములో అప్సరసల గుంపులతోఁ గూడి క్రీడించుచుండు దేవేంద్రునివలె నుండువాఁడును, మంత్రుల వశములో రాజ్యకార్యములను నుంచి వారిని కంటితోనైనను జూడకుండు వాఁడును,

(౫౪ మొదలు ౮౪ వరకు) రాజ్య పరిపాలన విధమును చెడగొట్టుకొనిన వాఁడును, కామవ్యాపారమునకు లోఁబడియుండువాఁడును, మాటలతత్త్వమును నెరింగిన వానరరాజగు సుగ్రీవుని, ఈ కార్యమును నీవిధముగఁ జేయవలయునని నిశ్చయించి యుండువాఁడును, అర్థస్వభావమును కాలోచితమగు ధర్మవిశేషములను నెరింగినవాఁడును, మాటలు చెప్పుటలో నేర్పుగలవాఁడును వాయుపుత్రుఁడును నగుహనుమంతుఁడుచూచి మధురమై హేతువులతోఁగూడి మనసుకు యింపుగనుండు మాటలచే సంతోషపరచి హితముగను సత్యముగను పథ్యముగను

ప్రశ్రయప్రీతిసంయుక్తం విశ్వాసకృతనిశ్చయమ్।
హరీశ్వర ముపాగమ్య హనుమా న్వాక్య మబ్రవీత్॥ ౮
రాజ్యం ప్రాప్తం యశ శ్చైవ కౌలీ శ్రీ రభివర్ధితా।
మిత్రాణాం సంగ్రహ శ్శేష స్తం భవా న్కర్తు మర్హతి॥ ౯

యో హి మిత్రేషు కాలజ్ఞ స్సతతం సాధు వర్తతే।
తస్య రాజ్యంచ కీర్తిశ్చ ప్రతాపశ్చాభివర్ధతే॥ ౧౦
యస్య కోశశ్చ దండశ్చ మిత్రాణ్యాత్మాచ భూమిప।
సమవేతాని సర్వాణి సరాజ్యం మహ దశ్నుతే॥ ౧౧

తద్భవా న్వృత్తసంపన్న స్స్థితః పథి నిరత్యయే।
మిత్రార్థ మభినీతార్థం యథావ త్కర్తు మర్హతి॥ ౧౨
సంత్యజ్య సర్వకార్యాణి మిత్రార్థే యోఽనువర్తతే।
సంభ్రమాద్ధి కృతోత్సాహ స్సోఽనర్థై ర్నావరుధ్యతే॥ ౧౩

యస్తు కాలవ్యతీతేషు మిత్రకార్యేషు వర్తతే।
స కృత్వా మహతోఽప్యర్థా న్నమిత్రార్థేన యుజ్యతే॥ ౧౪
యదిదం వీర కార్యం నో మిత్రకార్య మరిందమ।
క్రియతాం రాఘవ స్యైత ద్వైదేహ్యాః పరిమార్గణమ్॥ ౧౫

సామము ధర్మము అర్థము నీతితోఁ గూడినదిగను, స్నేహముతోను ప్రీతితోను గూడిన అప్పుఁడు చెప్పినమాటలో నమ్మకముగలదిగను నుండుమాటను హనుమంతుఁడు చెప్పెను.

(౯౪) రాజ్యము యశస్సు నీకులభించినవి. కులక్రమముగ వచ్చినసంపద వృద్ధియైనది. మిత్రుని కార్యమును జేయుట మాత్రము నిలిచియున్నది. దాని నీవు చేయవలయును.

(౧౦౪) ఎవఁడు మిత్రులనుసంపాదింపుకొను కాలమును నెఱింగినవాఁడై, యెల్లప్పుడు సాధువుగనుండునో, అట్టివాని రాజ్యము కీర్తి ప్రతాపము అభివృద్ధి పొందును.

(౧౧౪) ఏరాజుయొక్క బొక్కసము సేనమిత్రులు అతఁడు యివన్నియు పొసగియుండునో అట్టిరాజు గొప్పరాజ్యమును ననుభవించును. (ఈ నాలుగింటి లో నొకటి లేకపోయినను మహారాజ్యమైనను చెడునని భావము.)

(౧౨౪) సచ్చరిత్రము గలనీవు, నాశములేని సన్మార్గములోనుండి స్నేహితుని కార్యమును, సఫలమగునటుల, నీప్రతిజ్ఞ ప్రకారము, సేయుము.

(౧౩౪) తాను సుఖపడుటకు సాధనముగనుండు అన్నికార్యములను విడిచి మిగుల ఉత్సాహముతోఁగూడి ఆదరముతో మిత్రునికార్యము సేయువిషయములో సదా ఉండువానికి ఆపద గలుగదు.

(౧౪౪) కాల మతిక్రమించిన పిమ్మట మిత్రునికి సహాయముచేయుటకు యత్నించి గొప్పకార్యములు చేసినను అతఁడు మిత్రునికి సహాయము సేసినటుల భావింపఁబడఁడు.

(౧౫౪) ఓ వీరుఁడా! మనము స్నేహితుని పనిని కొనసాగించవలయును. శత్రుసంహారకుఁడా! శ్రీరాముని కార్య మగుసీతాన్వేషణమును జేయవలయును.

తదిదం వీర కార్యం తే కాలాతీత మరిందమ॥ ౧౬

నచ కాల మతీతం తే నివేదయతి కాలవిత్।
త్వరమాణోఽపి స న్ప్రాజ్ఞ స్తవ రాజ న్వశానుగః॥ ౧౭

కులస్య హేతు స్స్ఫీతస్య దీర్ఘబంధుశ్చ్ర రాఘవః।
అపరిమేయ ప్రభావశ్చ స్వయం చాప్రతిమోగుణైః॥ ౧౮

తస్య త్వం కురు వై కార్యం పూర్వం తేన కృతం తవ।
హరీశ్వర హరిశ్రేష్ఠా నాజ్ఞాపయితు మర్హసి॥ ౧౯

నహి తావ ద్భవే త్కాలో వ్యతీత శ్చోదనా దృతే।
చోదితస్యహి కార్యస్య భవే త్కాలవ్యతిక్రమః॥ ౨౦

అకర్తురపి కార్యస్య భవా న్కర్తా హరీశ్వర।
కింపునః ప్రతికర్తు స్తే రాజ్యేనచ ధనేనచ॥ ౨౧

శక్తిమానపి విక్రాంతో వానరర్క్ష గణేశ్వర।
కర్తుం దాశరథేః ప్రీతి మాజ్ఞాయాం కి న్నసజ్జసే॥ ౨౨

(౧౬) వీరుఁడా, శత్రుసంహారకుఁడా! నీవు చేయవలసిన మిత్రుని కార్యమునకు కాలమతిక్రమించినది.

(౧౭) కాలమతిక్రమించినదని తెలిసినవాఁడును, ప్రాజ్ఞుఁడును, నీస్వాధీనములో నుండువాఁడును నగు రాముఁడు, ఓరాజా! సీతను వెతకిఁదెచ్చుటలో త్వరగలవాఁడుగనుండియు, కాలమతిక్రమించినది నీకుఁ దెలుపలేదు.

(౧౮) మిగుల సమృద్ధితోఁ గూడిన నీకులమును నిలుపుటకు హేతువుగను, నీకు చిరకాలముండదగిన స్నేహితుఁడుగను, అప్రమేయమైన ప్రభావము గలవాఁడుగను, సాటిలేనిగుణములుగలవాఁడుగను శ్రీరాముఁడున్నాఁడు.

(౧౯) ముందు శ్రీరాముఁడు నీకార్యమును పూర్తి చేసెను. అతనికార్యమును నీవు చేయుము. వానరేశ్వరా! సీతను వెతకుటకు వానరులను బిలుచుకొని వచ్చుటకు ఆజ్ఞాపింపుము.

(౨౦) శ్రీరాముఁడు సమాచారము పంపుటకు ముందుగనే యీకార్యము చేసినట్లైతే కాలాతీతముకాదు. అతఁడు చెప్పిపంపినపిదప కార్యమును జేసిన కాలమతిక్రమించును.

(౨౧) వానరేశ్వరుఁడా! ఉపకారము సేయనివానికార్యమును సహా నీవు సేయువాఁడవు. రాజ్యమును ఏకల సంపదను నిచ్చి ఉపకారము చేసినవానికి ప్రత్యుపకారము సేయు విషయములో నేను నీకు చెప్పవలయునా,

(౨౨) వానరుల, ఎలుగు బంట్ల, గుంపులకు నాథుఁడుగనుండు వాఁడా నీవు శక్తిగలవాఁడవై పరాక్రమము చేఁ బ్రసిద్ధుఁడుగనుండినను శ్రీరామునికి సంతోషము గలిగించుటకై, వానరసేనను జేర్చుట కాజ్ఞాపించుటకు యత్నమెందుకు సేయకున్నావు.

కామం ఖలు శరై శ్శక్త స్సురాసురమహోరగాన్।
ఏకే దాశరథిః కర్తుం త్వత్ప్రతిజ్ఞాంతు కాంక్షతే। ౨౩
ప్రాణత్యాగావిశంకేన కృతం తేన తవ ప్రియమ్।
తస్య మార్గామ వైదేహీం పృథివ్యామపి చాంబరే॥ ౨౪
నదేవా నచ గంధర్వా నాసురా న మరుద్గణాః।
నచ యక్షా భయం తస్య కుర్యుః కిముత రాక్షసాః॥ ౨౫
తదేవం శక్తియుక్తస్య పూర్వం ప్రియకృత స్తవ।
రామస్యార్హసి పింగేశ కర్తుం సర్వాత్మనా ప్రియమ్॥ ౨౬
నాధస్తా దవనౌ నాప్సు గతి ర్నోపరి చాంబరే।
కస్యచి త్సజ్జతేఽస్మాకం కపీశ్వర తవాజ్ఞయా॥ ౨౭
త దాజ్ఞాపయ కః కిం తే కృతే వసతు కుత్ర వా।
హరయో హ్యప్రధృష్యా స్తే సంతి కోట్యగ్రతోఽనఘ॥ ౨౮
తస్య తద్వచనం శ్రుత్వా కాలే సాధునివేదితమ్।
సుగ్రీవ స్సత్త్వసంపన్న శ్చకార మతి ముత్తమామ్॥ ౨౯
స సందిదేశాభిమతం నీలం నిత్యకృతోద్యమమ్।
దిక్షు సర్వాసు సర్వేషాం సైన్యానా ముపసంగ్రహే॥ ౩౦
యథా సేనా సమగ్రా మే యూథపాలాశ్చ సర్వశః।
సమాగచ్ఛంత్యసంగేన సేనాగ్రాణి తథా కురు॥ ౩౧

(౨౩) దశరథుని కొడుకగు రాముఁడు సురలు అసురులు గొప్ప పన్నగులను నతని బాణములచే బాగుగ స్వాధీనము సేసికొనుటకు సమర్థుఁడేను, నీప్రతిజ్ఞను అతఁడు యెరుగు మాచు మున్నాఁడు.

(౨౪) తనప్రాణము పోగొట్టుకొను విషయములోను శంకలేనివాఁడై శ్రీరాముఁడు నీయిష్టమును బరిపూర్తి చేసెను. అట్టి వానిభార్యయగు సీతను భూమిలోను ఆకాశములోను వెతుకుదము.

(౨౫) దేవతలు గంధర్వులు అసురులు మరుద్దేవతలు యక్షులు శ్రీరామునికి భీతిగలిగించలేరు. ఇఁక రాక్షసులెంతమాత్రము.

(౨౬) ఇట్టి శక్తిగలవాఁడును, ముందుగ నీకు మేలుచేసినవాఁడును నగు రామునికి సకల విధములలోను ప్రీతిగలిగించుట, వానరరాజా! నీకుఁ దగును.

(౨౭) వానరరాజా! నీయాజ్ఞచే పాతాళము భూమి జలము ఆకాశములోను సీతను వెతుకుటకుఁ బోవుటకు మనవానరులలో నెవనికిని ఆటంకము లేదు.

(౨౮) ఎవఁడు యేకార్యమునకుగాను నెచటికిఁ బోవలయునో ఆజ్ఞాపింపుము. ఎవరికిని తిరస్కరించుటకు సాధ్యులుకానివారును స్వామిభక్తిగలవారును నగు వానరులు కోట్లపర్యంతము నీయొద్దగలరు కదా.

(౨౯) యుక్తమగు కాలములో బాగుగ నిటులచెప్పిన హనుమంతుని మాటవిని బలసంపన్నుఁడగు సుగ్రీవుఁడు బాగుగ నాలోచించెను.

(౩౦) మిగులయిష్టుఁడును సదా అతని కార్యము సేయుటలోఁ బ్రయత్నించుచుండువాఁడును నగునీలుని జూచి అన్నిదిక్కులలో గల సేననంతయుఁ జేర్పుటకు సుగ్రీవుఁడు ఆజ్ఞాపించెను.

(౩౧) నా సేననంతయు, సేనాపతులనందరిని సేనకుముందు పోవునట్టివారిని శీఘ్రముగ నొకటిగఁ గూర్పుము.

యే త్వంతపాలాః ప్లవగా శ్శీఘ్రగా వ్యవసాయినః।
సమానయంతు తే సైన్యం త్వరితా శ్శాసనా న్మమ॥ ౩౨
స్వయంచానంతరం సైన్యం భవా నేవానుపశ్యతు॥ ౩౨౺
త్రిపంచరాత్రా దూర్ధ్వం యః ప్రాప్నుయా న్నేహ వానరః।
తస్య ప్రాణాంతికో దండో నాత్ర కార్యా విచారణా॥ ౩౩౺
హరీంశ్చ వృద్ధానుపయాతు సాంగదో భవా న్మమాజ్ఞా మధి
కృత్య నిశ్చితామ్। ఇతి వ్యవస్థాం హరిపుంగవేశ్వరో విధాయ
వేశ్మ ప్రవివేశ వీర్యవాన్॥ ౩౪౺
ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - ఏకోనత్రింశస్సర్గః.

త్రింశస్సర్గః.

గుహాం ప్రవిష్టే సుగ్రీవే విముక్తే గగనే ఘనైః।
వర్షరాత్రోషితో రామః కామశోకాభిపీడితః। ౧
పాండురం గగనం దృష్ట్వా విమలం చంద్రమండలమ్।
శారదీం రజనీం చైవ దృష్ట్వా జ్యోత్స్నానులేపనామ్॥ ౨
కామవృత్తంచ సుగ్రీవం నష్టాంచ జనకాత్మజామ్।
బుద్ధ్వా కాల మతీతంచ ముమోహ పరమాతురః॥ ౩

(౩౨) సేననంతయును పాలించువారును మిగుల త్వరగలవారును ఆలోచన గలవారును నగు వానరులు నాయాజ్ఞచే సేనను జేర్చవలయును.

(౩౨½) నీవు శేషించిన సేనను జూచుచుండవలయును.

(౩౩½) ౧౫ దినములకులోపల వచ్చిచేరని వానరునికి మరణదండన విధింపవలయును. ఈ విషయములో నాలోచన అక్కరలేదు.

(౩౪½) నాయాజ్ఞచే నీవు అంగదునితోఁ గలిసి జ్ఞానవృద్ధులు వయోవృద్ధులునునగు వానరులతోడ నుండవలయును. ఈవిధముగ వానర శ్రేష్ఠుఁడును వీర్యవంతుఁడును నగు సుగ్రీవుఁడు నిష్కర్షచేసి అంతఃపురములోకిఁ బోయెను.

ఇది యిరువదితొమ్మిదవ సర్గ.

## ౩౦ వ సర్గ.

(అవతారిక.— శరత్కాలము వచ్చినను సీతను వెతకుటకు సుగ్రీవుఁడు ప్రయత్నము సేయనందున శ్రీరాముఁడు ఆగ్రహపడుట యీ సర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧,౨,౩) సుగ్రీవుఁడు కిష్కింధలోఁ బ్రవేశించగా, వానకాలము రాత్రిలలో ప్రస్రవణ పర్వతములో గుహలో వసించుచుండు శ్రీరాముఁడు కామశోకములచేఁబీడితుఁడై, మేఘములు ఆకాశమును విడిచిపోయినందున, తెల్లగనుండు ఆకాశమును నిర్మలముగనుండు చంద్రమండలమును వెన్నెలయును మెప్పూతగల శరత్కాల రాత్రిని జూచి, కామపరతంత్రుఁడుగనుండు సుగ్రీవుని, సీత నష్టమైయుండుటను, సుగ్రీవుఁడు చెప్పినకాలము అతిక్రమించి యుండుటను నాలోచించి వర్షాకాలములో గలిగిన దానికంటె హెచ్చుగ దుఃఖముగలఁవాడై మూర్ఛపోయెను.

స తు సంజ్ఞా ముపాగమ్య ముహూర్తా న్మతిమా& పునః।
మనస్థానమపి వై దేహీం చింతయామాస రాఘవః॥ ౪
ఆసీనః పర్వతస్యాగ్రే హేమధాతువిభూషితే।
శారదం గగనం దృష్ట్వా జగామ మనసా ప్రియామ్॥ ౫

దృష్ట్వాచ విమలం వ్యోమ గతవిద్యుద్వలాహకమ్।
సారసారవసంఘుష్టం విలలాపా౽ ర్తయా గిరా॥ ౬
సారసారవసన్నాదై స్సారసారవనాదినీ।
యా౽శ్రమే రమతే బాలా సా౽ద్య మే రమతే కథమ్॥ ౭

పుష్పితాం శ్చాసనా& దృష్ట్వా కాంచనానివ నిర్మలా&।
కథం సా రమతే బాలా పశ్యంతీ మా మపశ్యతీ॥ ౮
యా పురా కలహంసానాం స్వరేణ కలభాషిణీ।
బుధ్యతే చారుసర్వాంగీ సా౽ద్య మే బుధ్యతే కథమ్॥ ౯

నిస్స్వనం చక్రవాకానాం నిశమ్య సహచారిణామ్।
పుండరీకవిశాలాక్షీ కథ మేషా భవిష్యతి॥ ౧౦
సరాంసి సరితో వాపీః కాననాని వనానిచ।
తాం వినా మృగశాబాక్షీం చర న్నాద్య సుఖం లభే॥ ౧౧

(౪) బుద్ధిమంతుఁడగు శ్రీరాముఁడు మహార్తకాలమునకు తెలివి తెచ్చుకొని సీత మనసులో నిండియుండినను మరియు మరియు ఆమెను స్మరించెను.

(౫) బంగారు మొదలగు ధాతువులచే నలంకరింపఁబడియుండు కొండమీఁదఁ గూర్చుండిన శ్రీరాముఁడు శరత్కాల ఆకాశమును జూచి సీతను మనసులోఁ దలఁచెను.

(౬) మెరుపులు కొంగలు లేక నిర్మలమై హంసల ధ్వనులుగల ఆకాశమును జూచి ఆర్తధ్వనితో రాముఁడు పరిలపించెను.

(౭) హంస ధ్వనివంటి కంఠస్వరముగల బాలయగుసీత ఆశ్రమములో హంసలధ్వనులు విని సంతోషించుచుండెను. అట్టి సీత నాకిపుడు యెటుల సంతోషము గలిగించును.

(౮) నిర్మలమైన బంగారమువలె వెలుఁగుచుండు పూచిన అసన వృక్షములను జూచి, నన్ను నలుదిక్కులు వెతకియు చూపలేక, బాల యగుసీత యెటుల సంతోషించును.

(౯) సుందరమగు అవయవములు గల సీత, మధురముగ సంభాషించుచు, పూర్వము హంసలవంటి కంఠస్వరము గలదని తెలిసికొనియుంటిని. ఇపుడెటుల తెలిసికొనఁగలను.

(౧౦) జంటగ సంచరించుచుండు చక్రవాక పక్షుల ధ్వని విని తామర రేకులవలె విశాలమగు నేత్రములు గలయీసీత యెటు లుండునో.

(౧౧) సరస్సులు నదులు తటాకములు కాననములు వనములు వీనిలో జింకపిల్ల నేత్రములవంటి నేత్రములు గలసీతను విడిచి సంచరించుచు యిపుడు నేను సుఖము పొందలేదు.

అపితాం మద్వియోగాచ్చ సౌకుమార్యాచ్చ భామినీమ్।
నదూరం పీడయే త్కామ శ్శరద్గుణనిరంతరః॥ ౧౨
ఏవ మాది నరశ్రేష్ఠో విలలాప నృపాత్మజః।
విహంగ ఇవ సారంగ స్సలిలం త్రిదశేశ్వరాత్॥ ౧౩
తత శ్చంచూర్యరమ్యేషు ఫలార్థీ గిరిసానుషు।
దదర్శ పర్యుపావృత్తో లక్ష్మీవా న్లక్ష్మణో౽గ్రజమ్॥ ౧౪
తం చింతయా దుస్సహయా పరీతం విసంజ్ఞ మేకం విజనే
మనస్వీ। భ్రాతు ర్విషాదా త్త్వరితాపదీన స్సమీక్ష్య సౌమిత్రి
రువాచ రామమ్॥ ౧౫
కి మార్య కామస్య వశంగతేన కి మాత్మపౌరుష్య పరాభవేన।
అయం సదా సంహ్రియతే సమాధిః కి మత్ర యోగేన నివ
ర్తితేన॥ ౧౬
క్రియాభియోగం మనసః ప్రసాదం సమాధియోగానుగతంచ
కాలమ్। సహాయసామర్థ్య మదీనసత్వ స్స్వకర్మహేతుంచ కురు
ష్వ హేతుమ్॥ ౧౭
న జానకీ మానవవంశనాథ త్వయా సనాథా సులభా పరేణ।
నచాగ్నిచూడాం జ్వలితా ముపేత్య నదహ్యతే వీరవరార్హ
కశ్చిత్॥ ౧౮

(౧౨) శరదృతువులో నతనికి సాధనము లగుపదార్థములు గలమన్మథుఁడు సీతయొక్క సౌకుమార్యముచేతను నన్ను విడిచియుండుటచేతను ఆసుందరికి మరణము గలిగించకుండునా.

(౧౩) నరోత్తముఁడును రాజపుత్రుఁడును నగు రాముఁడు, ఇంద్రునివలన జలమును గోరిన చాతకపక్షివలె, యీవిధముగ ప్రలపించెను.

(౧౪) పిమ్మట, శ్రీరామకైంకర్య మైశ్వర్యమును గల లక్ష్మణుఁడు, పండ్లు దెచ్చుటకై మనోహరముగనుండు పర్వతము ప్రక్కలలో తిరుగుచు, మరలివచ్చి, అన్నయగు రాముని జూచెను.

(౧౫) మంచిమనసు గలలక్ష్మణుఁడు సైచుటకు సాధ్యపడని చింతగలవాఁడును, శూన్యముగనుండు ప్రదేశములో మూర్ఛపోయి ఏకాకిగనుండు వాఁడును నగు శ్రీరాముని జూచి, ఆతని దుఃఖమువల్ల గలిగిన పరితాపముచే,దీనుఁడై యిటులనెను.

(౧౬) ఓపూజ్యుఁడా! కామము నేస్మరించుచుండుట నీ పరాక్రమమును నవమానించుట తగదు. అప్పుడప్పుడు చిత్తమును సమాధానపరచుకొని యుండవలయును, ఇపుడు, ఉత్సాహమును విడిచిన మనకేమి లాభము గలుగును.

(౧౭) ధీరుఁడా! పనిచేయుటకు ప్రయత్నము, మనసును బాగుగనుంచుకొనుట, ధైర్యము, ఉపాయములతోఁ గూడినకాలము, సుగ్రీవుఁడు మొదలగు వారి సహాయ సామర్థ్యము, దేవతోపాసన, యివియన్నియు నీకార్యము సిద్ధించుటకుపాయములని తెలిసికొనుము.

(౧౮) ఓ మానవవంశనాథా! నిన్ను నాథునిగ బడసియుండు జానకిని యింకొకఁడు పొందలేఁడు. శ్రేష్ఠులగు వీరులలో శ్రేష్ఠుఁడా! మండుచుండు అగ్నిజ్వాలలోఁ బడి దహింపఁబడనివాఁడుండఁడు.

సలక్షణం లక్ష్మణ మప్రధృష్యం స్వభావజం వాక్య మువాచ
రామః। హితంచ పథ్యంచ నయప్రసక్తం ససామధర్మార్థ
సమాహితంచ॥ ౧౯

నిస్సంశయం కార్య మవేక్షితవ్యం క్రియావిశేషో హ్యనువర్తి
తవ్యః। నను ప్రవృత్తస్య దురాసదస్య కుమార కార్యస్య ఫలం
న చింత్యమ్॥ ౨౦

అథ పద్మపలాశాక్షీం మైథిలీ మనుచింతయన్।
ఉవాచ లక్ష్మణం రామో ముఖేన పరిశుష్యతా॥ ౨౧
తర్పయిత్వా సహస్రాక్ష స్సలిలేన వసుంధరామ్।
నిర్వర్తయిత్వా సస్యాని కృతకర్మా వ్యవస్థితః॥ ౨౨

స్నిగ్ధగంభీరనిర్ఘోషాః శైలద్రుమపురోగమాః।
విసృజ్య సలిలం మేఘాః పరిశ్రాంతా నృపాత్మజ॥ ౨౩
నీలోత్పలదళశ్యామా శ్శ్యామీకృత్వా దిశో దశ।
విమదా ఇవ మాతంగా శ్శాంతవేగాః పయోధరాః॥ ౨౪

జలగర్భా మహావేగాః కుటజార్జునగంధినః।
చరిత్వా విరతా స్సౌమ్య వృష్టివాతా స్సముద్యతాః ౨౫

(౧౯) యుక్తిచే ఛేదించుటకు సాధ్యముకానిదియు, స్వభావసిద్ధముగను ఉత్తరోత్తర, తత్కాలములోను, సుఖమును నిచ్చునదిగను రాజనీతితోఁ గూడినదిగను, సామదానార్థములతోఁ గూడినదిగనునుండు మాటఁజెప్పిన లక్ష్మణునితో శ్రీరాముఁడిటుల బాగుగఁజెప్పెను.

(౨౦) సీతను వెతకుట మొదలగు కార్యములను నిస్సందేహముగ నాలోచించ వలసినదేను. మనము ఉత్సాహము మొదలగుసంతోషమును గలిగించుకొనవలయును. ఓ బిడ్డా! ఇపుడు మనము సేయవలసిన ఆసాధ్యమగు కార్యమునకు ఫలము సీత లభించుటే యని ఆలోచించవలయును.

(౨౧) పిమ్మట, తామరరేకులవంటి కన్నులుగల సీతను జింతించి ముఖము వాడిపోయి శ్రీరాముఁడు లక్ష్మణునితో నిటుల నెను.

(౨౨) ఇంద్రుఁడు జలముచే భూమిని సంతోషపరచి పైరును పండించి కృతకృత్యుఁడాయెను.

(౨౩) మనోహరముగను గంభీరముగను నుండు శబ్దముగలవిగను కొండలకు వృక్షములకుముందుపోవుచుండునవిగను నుండు మేఘములు, జలమును బాగుగ వర్షించి, ఓ రాజపుత్రుఁడా! విశ్రమించుచున్నవి.

(౨౪) నల్లకలువల రేకులవలె శ్యామలవర్ణముగ నుండు మేఘములు పదిదిక్కులను నల్లగఁజేసి, మదము తొలగియుండు యేనుఁగులవలె, శాంతపడిన వేగముగలవిగ నున్నవి.

(౨౫) జలమును గర్భములోగలదియు, మిగుల వేగముగలదియును, కుటజ అర్జున పూలవాసనతోఁ గూడినదియు నగు వానగాలి వృద్ధియై బాగుగవీచి, ఓ సౌమ్యుఁడా! నిలిచిపోయినది.

ఘనానాం వారణానాంచ మయూరాణాంచ లక్ష్మణ।
నాదః ప్రస్రవణానాంచ విశ్రాంత స్సహసాఽనఘ॥ ౨౬

అభివృష్టా మహామేఘై ర్నిర్మలా శ్చిత్రసానవః।
అనులిప్తా ఇవాభాంతి గిరయ శ్చిత్రదీప్తిభిః॥ ౨౭

దర్శయంతి శర న్నద్యః పులినాని శనై శ్శనైః।
నవసంగమసవ్రీడా జఘనానీవ యోషితః॥ ౨౮

శాఖాసు సప్తచ్ఛదపాదపానాం ప్రభాసు తారార్కనిశాకరాణామ్। లీలాసు చైవోత్తమవారణానాం శ్రియం విభజ్యాద్య శర త్ప్రవృత్తా॥ ౨౯

సంప్రత్యనేకాశ్రయచిత్రశోభా లక్ష్మీ శ్శరత్కాలగుణోపనీతా। సూర్యాగ్రహస్తప్రతిబోధితేషు పద్మాకరేష్వభ్యధికం విభాతి॥ ౩౦

సప్తచ్ఛదానాం కుసుమోపగంధీ షట్పాదబృందై రనుగీయమానః। మత్తద్విపానాం పవనోనుసారీ దర్పం వనేష్వభ్యధికం కరోతి॥ ౩౧

అభ్యాగతై శ్చారువిశాలపక్షై స్సరఃప్రియైః పద్మరజోవకీర్ణైః। మహానదీనాం పులినోపయాతైః క్రీడంతి హంసా స్సహ చక్రవాకైః॥ ౩౨

(౨౬) ఓ లక్ష్మణా! మేఘములు ఏనుఁగులు నెమళులు సెలయేళ్ళు వీని ధ్వని యేకకాలములో నిలిచిపోయెను. పాపరహితుఁడా!

(౨౭) గొప్పమేఘములు బాగుగ వర్షించినందున నిర్మలముగను నానారంగులుగలపక్కలు గలపర్వతములు నానారంగుల కాంతిచే మైపూతపూసికొని యుండునటు లున్నవి.

(౨౮) శరదృతువులో నదులు కొంచెము కొంచెముగ యిసుకదిబ్బలను, నూతన సంగమకాలములో లజ్జతోఁగూడిన స్త్రీజఘనములనువలె, జూపుచున్నవి.

(౨౯) శరత్కాలములో పూచుచుండు సప్తచ్ఛద వృక్షములశాఖలలో పువ్వువికారరూపముగనుండు కాంతిని, నక్షత్రములు సూర్యుఁడు చంద్రుఁడు మొదలగువాటికాంతులలో నిర్మలరూపముగనుండు కాంతిని, శ్రేష్ఠమగు గజముల లీలలలో తలకుమించిపోవునట్టి ఉత్సాహరూపముగ నుండు కాంతిని, పంచిపెట్టి శరదృతువు ప్రారంభమాయెను.

(30) తెల్లగను యెర్రగను నీలవర్ణముగను నుండు కమలములను నాశ్రయించి నానావిధము లగుకాంతిగల, శరత్కాలగుణములచే వృద్ధిపొందిన లక్ష్మి, సూర్యుని నూతనకిరణములచే ప్రకాశించుచుండు సరస్సులలో వెలుంగుచున్నది.

(3౧) ఏడాకుల మ్రానుయొక్క పూలవాసనగలదియు, తుమ్మెదగుంపుల గానముగలదియు, పోవుచుండు నోటికి వచ్చుచుండునదియు నగు గాలి, మదించియుండు యేనుగులను అరణ్యములలో మిగుల మదమును గలిగించుచున్నది.

(3౨) జంటలు జంటలుగ నచటికి వచ్చిచేరినవియు, సంతోషముచే పఱుపుకొని రమ్యముగనుండు రెక్కలుగలవియు, సరస్సులలోనుండుటకు ప్రీతిగలవియు, పద్మపరాగముచేఁ గప్పఁబడినవియు, మహానదుల యిసుకదిన్నెలనుండి వచ్చినవియు, నగు చక్రవాకములతో హంసలు క్రీడించుచున్నవి.

మదప్రగల్భేషుచ వారణేషు గవాం సమూహేషుచ దర్పితేషు।
ప్రసన్నతోయాసుచ నిమ్నగాసు విభాతి లక్ష్మీ ర్బహుధా
విభక్తా॥ 33

నభ స్సమీక్ష్యాంబుధరై ర్విముక్తం విముక్తబర్హాభరణా
వనేషు। ప్రియాస్వసక్తా వినివృత్తశోభా గతోత్సవా ధ్యానపరా
మయూరాః॥ 3౪

మనోజ్ఞగంధైః ప్రియకై రనల్పైః పుష్పాతిభారావనతాగ్ర
శాఖైః। సువర్ణగౌరై ర్నయనాభిరామై రుద్యోతితానీవ వనాం
తరాణి॥ 3౫

ప్రియాన్వితానాం నళినీప్రియాణాం వనేరతానాం కుసుమోద్ధ
తానామ్। మదోత్కటానాం మదలాలసానాం గజోత్తమానాం
గతయోఽద్యమందాః॥ 3౬

వ్యభ్రం నభ శ్శస్త్రవిధౌతవర్ణం కృశప్రవాహాని నదీజలాని।
కల్హారశీతాః పవనాః ప్రవాంతి తమోవిముక్తాశ్చ దిశః
ప్రకాశాః 3౭

సూర్యాతపక్రామణ నష్టపంకా భూమి శ్చిరోద్ఘాటిత సాంద్ర
రేణుః। అన్యోన్యవైరామర్షాయుతానా ముద్యోగకాలోఽద్య
నరాధిపానామ్॥ 3౮

(౩౩) మిగుల మదించియుండు యేనుగులలోను, కొవ్వియుండు వృషభముల గుంపులలోను, నిర్మలమగుజలము గలనదులలోను, నానావిధములుగ విభజింపఁబడి శరదృతువుయొక్క కాంతి ప్రకాశించుచున్నది.

(౩౪) మేఘములులేని ఆకాశమును జూచి ఆభరణముగ నుండు పింఛములను ముడుచుకొని ప్రియులను విడిచి కాంతిచెడి సంతోషములేక నెమళులు వనములలో ధ్యానము సేయుచున్నవి.

(౩౫) ఇంపుగనుండు పరిమళముగలవిగను, పూలభారముచే వంగియుండు శాఖల కొనలుగలవిగను, బంగారువలె పచ్చవర్ణముగలవిగను, చూచుటకు మనోహరముగ నుండునవిగను నుండు అనేకబంధుకవృక్షములతోఁగూడి వనముల మధ్యభాగములు ప్రకాశించుచున్నవి.

(౩౬) పెంటియేనుఁగులతోఁ గూడినవియు, సరస్సులలో నుండుట కిష్టపడినవియు, అరణ్యములమీఁద ఆశగలవియు, సప్తచ్ఛద పూలవాసనచే మదించినవియు, మదముచే చీలియుండుతలలు గలవియు, మదముచే శ్రమ చెందియుండునవియు నగు శ్రేష్ఠమైన గజముల సంచారములు మందపడినవి.

(౩౭) ఆకాశము మేఘములులేక బాగుగ కడుగబడిన కత్తివలె నున్నది. నదులలోప్రవాహము సన్నగబోవుచున్నది. తామరపూల సంబంధము గలిగి గాలి చల్లగ వచ్చుచున్నది. చీకటిలేక దిక్కులు బాగుగ ప్రకాశించుచున్నవి.

(౩౮) ఎండకాయుచుండుటవల్ల బురదలేని భూమిలో పెద్దరేణువులుగల దుమ్ములు లేచుచున్నవి. పరస్పరము ద్వేషముగలిగి కొంచెమైనను ఓర్పులేకుండునట్టిరాజులకు యుద్ధయాత్రకు సమయముగనున్నది.

శరద్గుణాప్యాయితరూపశోభాః ప్రహర్షితాః పాంసుసముత్
క్షితాంగాః। మదోత్కటా స్సంప్రతి యుద్ధలుబ్ధా వృషా గవాం
మధ్యగతా నదంతి॥ ౩౯
సమన్మథం తీవ్రగతానురాగాః కులాన్వితా మందగతింకరేణ్వః।
మదాన్వితం సంపరివార్య యాంతం వనేషు భర్తార మను
ప్రయాంతి॥ ౪౦

త్యక్త్వా వరాణ్యాత్మవిభూషణాని బర్హాణి తీరోపగతా నదీనామ్।
నిర్భర్త్స్యమానాఇవ సారసౌఘైః ప్రయాంతి దీనా విమదా
మయూరాః॥ ౪౧
విత్రాస్య కారండవచక్రవాకాన్ మహారవై ర్భిన్నకటా గ
జేంద్రాః। సరస్సు బద్ధాంబుజభూషణేషు విక్షోభ్య విక్షోభ్య
జలం పిబంతి॥ ౪౨
వ్యపేతపంకాసు సవాలుకాసు ప్రసన్నతోయాసు సగోకులాసు।
ససారసారావవినాదితాసు నదీషు హృష్టా నిపతంతి హంసాః॥

నదీఘనప్రస్రవణోదకానా మతిప్రవృద్ధానిలబర్హిణానామ్।
ప్లవంగమానాంచ గతోత్సవానాం ధ్రువం రవా స్సంప్రతి
సంప్రణష్టాః॥ ౪౪

(౩౯) శరత్కాలములో గల నిర్మలమైన తీర్థము, పచ్చిక మొదలగు వానిచే అభివృద్ధి పొందియుండు దేహాకారము కాంతిగలవిగను, దుమ్ముతోఁ గప్పఁబడిన దేహముగలవిగను, మిగుల సంతోషముగలవిగను, మిగుల మదముగలవిగను నుండు వృషభములు ఒకటితో నింకొకటి పోరుటకు ఆశగలవియై ఆవులగుంపుల లో నుండి సంతోషించుచున్నవి.

(౪౦) మిగుల ప్రేమము గల్లవిగను, సజాతీయములగు గుంపులతోఁ గూడినవిగను నుండు పెంటియేనుఁగులు మన్మథోద్రేకముగలిగి, మందముగ, మదము గలిగి బోవుచుండు భర్తను వనములోఁ జుట్టుకొని పోవుచున్న.

(౪౧) మంచి ఆభరణములుగ నుండు పింఛములను విడిచి నదులతీరముల లో నెమళులు మదములేక దీనమై హంసలచే బెదిరింపఁబడిన వానివలె పోవుచున్నవి.

(౪౨) మదముచే పగిలియుండు కుంభస్థలములుగల శ్రేష్ఠమైన యేనుగులు ఘీంకరించుచు హంస చక్రవాక పక్షులకు భయముగలిగించి తరమి, తామరపూలను ఆభరణములుగగల సరస్సులలో తొండములను చాచి చాచి జలముల త్రాగుచున్నవి.

(౪౩) బురదలేనట్టివియు ఇసుకగలవియు నిర్మలమగు జలముగలవియు ఆవులుగలవియు హంసముల ధ్వనులతోఁగూడినవియు నగు నదులలో సారస పక్షులతోడఁ గూడిన హంసలు పడుచున్నవి.

(౪౪) సంతోషము పోయియుండు నదులు, మేఘములు, గిరినదులజలము, మిగుల అభివృద్ధి పొందియుండు గాలి, నెమళుల కప్పలయొక్క ధ్వని, యిపుడు సంపూర్ణముగ నిలిచిపోయినది.

అనేకవర్ణా స్సువినష్టకాయా నవోదితేష్వంబుధరేషు నష్టాః।
క్షుధార్దితా ఘోరవిషా బిలేభ్య శ్చిరోషితా విప్రసరన్తి సర్పాః॥

చంచచ్చంద్రకరస్పర్శ హర్షోన్మీలితతారకా।
అహో రాగవతీ సంధ్యా జహాతి స్వయ మంబరమ్॥ ౪౫

రాత్రి శ్శశాంకోదితసౌమ్యవక్త్రా తారాగణోన్మీలిత చారు
నేత్రా। జ్యోత్స్నాంశుకప్రావరణా విభాతి నారీవ శుక్లాం
శుకసంవృతాంగీ॥ ౪౬

విపక్వశాలిప్రసవాని భుక్త్వా ప్రహర్షితా సారసచారుపఙ్క్తిః।
నభ స్సమాక్రామతి శీఘ్రవేగా వాతావధూతా గ్రథితేవ
మాలా॥ ౪౭

సుప్తైకహంసం కుముదై రుపేతం మహాహ్రదస్థం సలిలం విభాతి।
ఘనై ర్విముక్తం నిశి పూర్ణచంద్రం తారాగణాకీర్ణ మివాంత
రిక్షం॥ ౪౮

ప్రకీర్ణహంసాకులమేఖలానాం ప్రబుద్ధపద్మోత్పలమాలినీనామ్। ౪౯
వాప్యుత్తమానా మధికాఽద్య లక్ష్మీ ర్వరాంగనానామివ భూ
షితానామ్॥ ౫౦

(౪౫) నానావర్ణములుగనుండునవియు, మిక్కిలి కృశించిన శరీరములుగల వియు వర్షాకాలములో బహుకాలము దాగియుండినవియు ఘోరమైన విషముగల పాములు ఆకలిచేఁ బీడింపఁబడినవియై పుట్టలలోనుండి వెలుపలవచ్చుచున్నవి.

(౪౬) ప్రకాశించుచుండు చంద్రికిరణముల స్పర్శచేఁ గలిగిన సంతోషముతో నిర్మలమై ప్రకాశించుచుండు నక్షత్రములు గలదియు, ఎఱ్ఱని రంగు గల సంధ్య, తాను ఆకాశమును విడుచుచున్నది. ఆశ్చర్యము. (ఈ శ్లోకములో ఉనవిగను కరస్పర్శచే గలిగిన సంతోషమువల్ల ప్రకాశించుచుండు కన్నులుగలది యు, అభివృద్ధిపొందిన అనురాగముగలదియు, క్రీడార్థము వస్త్రమును తా నేత్య జించుచుండు కాముకీ చెప్పఁబడినది. ఇది సమాసోక్తి)

(౪౭) ఉదయించిన చంద్రుఁ డనుమనోహర మగుముఖముగలిగి, ప్రకా శించుచుండు నక్షత్రము లను నేత్రములుగలిగి, వెన్నెల యను వస్త్రమును ధరించి రాత్రి, తెల్లవస్త్రమును ధరించిన స్త్రీవలె, ప్రకాశించినది.

(౪౮) పండి పక్వమైయుండు వరి ధాన్యమును భుజించి, మిక్కుతో వె న్నులనుద్రించి తీసికొనిపోవుచుండు మిగుల సంతోషముగల రమ్యముగనుండు కొంగల గుంపు మిగుల వేగముతో, గాలిచే నెగరకొట్టఁబడిన నానారంగులుగల పూలహారమువలె, ఆకాశములోఁ బోవుచున్నది.

(౪౯) నిద్రించుచుండు ఒకహంసము గలదియు, తెల్లనికమలముతోఁ గూడినదియు, గొప్పమడుగులో నుండు జలము, మేఘములేనట్టి రాత్రిలో పూర్ణ నక్షత్రముల గుంపుచే నిండిన ఆకాశమువలె, ప్రకాశించెను.

(౫౦) చక్రవాక[illegible]ముగ సంచరించుచుండు హంసలచే నిండిన వికసించియుం డు తామరపూలు నల్లకలువలుగల మంచిపడబావుల కాంతి, సర్వాభరణములు ధరించిన ఉత్తమస్త్రీలకాంతివలె, మిగుల ప్రకాశించుచున్నది.

వేణుస్వనవ్యంజితతూర్యమిశ్రః ప్రత్యూష కాలానిల సంప్రవృ
ద్ధః । సమ్మూర్ఛితో గర్గరగో వృషాణా మన్యోన్య మాపూర
యతీవ శబ్దః॥ ౫౧

నవై ర్నదీనాం కుసుమప్రభాసై ర్వ్యాధూయమానై ర్మృదు
మారుతేన । ధౌతామలక్షౌమపటప్రకాశైః కూలాని కాశై రు
పశోభితాని॥ ౫౨

వనప్రచండా మధుపానశౌండాః ప్రియాన్వితా ష్షట్చరణాః ప్ర
హృష్టాః । వనేషు మత్తాః పవనానుయాత్రాం కుర్వంతి పద్మా
సన రేణుగౌరాః॥ ౫౩

జలం ప్రసన్నం కుముదం ప్రభాసం క్రౌంచస్వన శ్శాలివనం వి
పక్వమ్ । మృదుశ్చ వాయు ర్విమలశ్చ చంద్ర శ్శంసంతి వర్ష
వ్యపనీతకాలమ్। ౫౪

మీనోపసందర్శితమేఖలానాం నదీవధూనాం గతయోఽద్య
మందాః । కాంతోపభుక్తాలసగామినీనాం ప్రభాత కాలేష్వివ
కామినీనామ్॥ ౫౫

సచక్రవాకాని సశైవలాని కాశై ర్దుకూలై రివ సంవృతాని।
సపత్రలేఖాని సరోచనాని వధూముఖానీవ నదీముఖాని॥ ౫౬

(౫౧) గోపాలురచేయు వేణుగానముచేఁ బ్రకాశించుచుండు తూర్యధ్వనితోఁ గూడి ప్రాతఃకాలము గాలితో వృద్ధిపొంది, వ్యాపించియుండు దధిభాండములు గోవులు వృషభములధ్వని, ఒండొంటిని వృద్ధి చేయు నటు లున్నది.

(౫౨) క్రొత్తగ పెరిగినవియు కుసుంబధాన్యముకాంతి గలవియు, మందమారుతముతోఁ గదిలింపఁ బడినవియును, బాగుగ ఉతుకబడి నిర్మలమై తెల్లగనుండు పట్టువస్త్రమువలె, ప్రకాశించుచుండు కాశపూలచే నదుల తీరములు ప్రకాశించుచున్నవి.

(౫౩) అరణ్యములో అడ్డములేని గమనము గలవిగను, మధుపానము చేసి గర్వించియుండు పక్ష్మములు ఆసనపూలపొడిచే పచ్చగనుండునవిగను, భార్యలతోఁగూడి మిగుల సంతోషించి మదించియుండు తుమ్మెదలు, అరణ్యములలో గాలిలోగల సువాసన ననుసరించి, పోవుచున్నవి.

(౫౪) నిర్మలమైన జలము, బాగుగ ప్రకాశించుచుండు కుముదము, క్రౌంచపక్షిధ్వని, పండిన వరిపైరు, మృదువైన గాలి, నిర్మలమైన చంద్రుఁడు, వానకాలము పోయెనని సూచించుచున్నవి.

(౫౫) ప్రియులచే భోగింపఁబడినవారై ప్రభాతకాలములో మందముగ నడచుచుండు స్త్రీలగమనమువలె, మండలాకారముగ సంచరించుచుండు చేపలచేఁ జూపఁబడిన వడ్డాణములుగల నదులగమనము, యిప్పుడు మందముగనున్నది.

(౫౬) చక్రవాకపక్షులతోను ప్రాచితోనుగూడి ధరించిన తెల్లనివస్త్రమువలెనుండు కాశపుష్పములతో వ్యాప్తమైయుండు నదులఅంచులు, మకరికాపత్రములరచనములతోఁ గూడిన స్త్రీలముఖములవలెఁ బ్రకాశించినవి.

ప్రఫుల్ల భాణాసనచిత్రితేషు ప్రహృష్ట షట్పాదనికూజితేషు।
గృహీతచాపోద్యత చండదండః ప్రచండచాపోఽద్య వనేషు
కామః॥ ౫౭

లోకం సువృష్ట్యా పరితోషయిత్వా నదీ స్తటాకానిచ పూర
యిత్వా । నిష్పన్నసస్యాం వసుధాంచ కృత్వా త్యక్త్వా నభ
స్తోయధరాః ప్రణష్టాః॥ ౫౮

ప్రసన్నసలిలాః సౌమ్య కురరీభి ర్వినాదితాః।
చక్రవాకగణాకీర్ణా విభాంతి సలిలాశయాః॥ ౫౯

అసనా స్సప్తపర్ణాశ్చ కోవిదారాశ్చ పుష్పితాః।
దృశ్యంతే బంధుజీవాశ్చ శ్యామాశ్చ గిరిసానుషు॥ ౬౦

హంససారసచక్రాహ్వైః కురరైశ్చ సమంతతః।
పులినా న్యవకీర్ణాని నదీనాం పశ్య లక్ష్మణ॥ ౬౧

అన్యోన్యబద్ధవైరాణాం జిగీషూణాం నృపాత్మజ।
ఉద్యోగసమయ స్సౌమ్య పార్థివానా ముపస్థితః॥ ౬౨

ఇయం సా ప్రథమా యాత్రా పార్థివానాం నృపాత్మజ।
నచ పశ్యామి సుగ్రీవముద్యోగం వా తథా విధమ్॥ ౬౩

చత్వారో వార్షికా మాసా గతా వర్షశతోపమాః।
మమ శోకాభిభూతస్య సౌమ్య సీతా మపశ్యతః॥ ౬౪

(౪౭) బాగుగ వికసించిన పూలుగల బాణ అసన వృక్షములచే నానావర్ణములుగ నుండునవియు, మకరందపానము సేసి మిగుల సంతోషించియుండు తుమ్మెదరొదగలవియు, నగువనములలో ధనువును క్రూరముగ నుండుదండమును బాణమును బుచ్చుకొని మన్మథుఁడు ఉగ్రముగ సంచరించుచున్నాఁడు.

(౪౮) మంచివాన కురిసి లోకమును సంతోషపరచి, నదులను తటాకములను నిండించి, భూమిని ఫలముగల పైరుపచ్చలు గలదిగఁజేసి, ఆకాశమును విడిచి మేఘములు పోయినవి.

(౪౯) సౌమ్యుఁడా! నిర్మలమైన జలము కురరిపక్షుల ధ్వనులు, గలిగి, చక్రవాక పక్షులగుంపుతోఁ గూడి తటాకములు ప్రకాశించుచున్నవి.

(౫౦) అశన సప్తపర్ణ కోవిదార బంధజీవనము అను వృక్షములు పూచి పర్వతప్రాంతప్రదేశములలో నల్లగ అగుపడుచున్నవి.

(౫౧) లక్ష్మణా! హంసలు సారసపక్షులు చక్రవాకములు కురరపక్షులు నదులయొక్క యిసుకదిబ్బలలో నన్నిచోటులలోను నిండియున్నవి. చూడుము.

(౫౨) పరస్పరము బద్ధద్వేషముగలిగి ఒకరిని నొకరు జయించుటకు కోరికగలరాజులకు, ఓ రాజకుమారా! సౌమ్యుఁడా! దండయాత్రకు తగిన సమయము సమీపించినది.

(౫౩) రాజపుత్రుఁడా! జయమునుగోరిన రాజులకు యిది మొట్టమొదటి ప్రయాణమునకు సమయముగనున్నది. సుగ్రీవుఁడు యుద్ధప్రయత్నము సేయుట అగుపడలేదు.

(౫౪) సౌమ్యుఁడా! సీతను జూడక మిగులదుఃఖించుచుండు నేను వానకాలము నాలుగునెలలను అనేకసంవత్సరములనువలె గడిపితిని.

చక్రవాకీవ భర్తారం పృష్ఠతోఽనుగతా వనం।
విషమం దండకారణ్య ముద్యానమివ యాగతా॥ ౬౫
ప్రియావిహీనే దుఃఖార్తే హృతరాజ్యే వివాసితే।
కృపాం నకురుతే రాజా సుగ్రీవో మయి లక్ష్మణ॥ ౬౬
అనాథో హృతరాజ్యోఽయం రావణేన చ ధర్షితః।
దీనో దూరగృహః కామీ మాంచైవ శరణం గతః॥ ౬౭
ఇత్యేతైః కారణైస్సౌమ్య సుగ్రీవస్య దురాత్మనః।
అహం వానరరాజస్య పరిభూతః పరంతప॥ ౬౮
సకాలం పరిసంఖ్యాయ సీతాయాః పరిమార్గణే।
కృతార్థస్సమయం కృత్వా దుర్మతి ర్నావబుధ్యతే॥ ౬౯
త్వం ప్రవిశ్య చ కిష్కింధాం బ్రూహి వానరపుంగవమ్।
మూర్ఖం గ్రామ్యసుఖే సక్తం సుగ్రీవం వచనాన్మమ॥ ౭౦
అర్థినా ముపపన్నానాం పూర్వంచాప్యుపకారిణామ్।
ఆశాం సంశ్రుత్య యో హంతి స లోకే పురుషాధమః॥ ౭౧
శుభంవా యదివా పాపం యోహి వాక్య ముదీరితమ్।
సత్యేన పరిగృహ్ణాతి స వీరః పురుషోత్తమః॥ ౭౨
కృతార్థా హ్యకృతార్థానాం మిత్రాణాం నభవంతి యే।
తా న్మృతానపి క్రవ్యాదాః కృతఘ్నా న్నోపభుంజతే॥ ౭౩

(६५) చక్రవాకపక్షి భర్తను ననుసరించిపోవునటుల, మిట్ట పల్లములుగల దండకావనమునకు ఉద్యానవనమునకు నాతోడ వచ్చినటుల, సీత వచ్చెను.

(६६) రాజ్యమునుండి వెడలఁగొట్టఁబడి భార్యను నెడబాసి దుఃఖించుచుండు నావిషయములో రాజగు సుగ్రీవుఁడు, లక్ష్మణా! దయయుంచకున్నాఁడు.

(६७,६८) రాజ్యము బోఁగొట్టుకొని అనాథయై రావణునిచే తిరస్కరింపఁబడి దీనుఁడై ఇల్లువిడిచి బహుదూరమువచ్చి కామకుఁడై నా శరణుచొచ్చెను అనితలచి, ఓ సౌమ్యుఁడా! దురాత్ముఁడును వానరరాజును నగుసుగ్రీవుఁడు, ఓశత్రుసంహారకుఁడా! నన్ను లక్ష్యపెట్టకున్నాఁడు.

(६९) సీతను వెతకుటకు నాలుగునెలలు గడువుపెట్టి, అతనికార్యముకుదుర్చుకొని, దురాత్ముఁడగు సుగ్రీవుఁడుసంకేతసమయమును దెలిసికొనకున్నాఁడు.

(७०) నీవు కిష్కింధకుఁబోయి మూర్ఖుఁడును నీచమైనసుఖములో నాసక్తిగలవాఁడును వానరశ్రేష్ఠుఁడునునగు సుగ్రీవునికి నామాటగ నిటులచెప్పుము,

(७१) ఒక పనిచేసిపెట్టవలయునని కోరి ఆశ్రయించినవారికి, పూర్వము ఉపకారము చేసియుండువారికి, వారిపనులు పరిపూర్తిచేసిపెట్టునటుల చెప్పియుండి ఎవఁడు అట్లుచేయఁడో వాఁడే యీ లోకములో అధముఁడు.

(७२) మంచిదిగనుండినను చెడ్డదిగనుండినను చెప్పినమాటను నెవఁడుగాపాడుకొనుచున్నాఁడో అట్టివీరుఁడే పురుషశ్రేష్ఠుఁడు.

(७३) ఒకరిచే ఉపకారమును బొంది కృతార్థులై మిత్రులకు ప్రత్యుపకారముచేయని అట్టి కృతఘ్నులు చచ్చినను వారిశవములను మాంసము భక్షించి జీవించువారైనను ముట్టరు.

నూనం కాంచన పృష్ఠస్య వికృష్టస్య మయా రణే।
ద్రష్టు మిచ్ఛతి చాపస్య రూపం విద్యుద్గణోపమమ్॥ ౨౪

ఘోరం జ్యాతల నిర్ఘోషం క్రుద్ధస్య మమ సంయుగే।
నిర్ఘోషమివ వజ్రస్య పున స్సంశ్రోతు మిచ్ఛతి॥ ౨౫

కామమేవం గతే ప్యస్య పరిజ్ఞాతే పరాక్రమే।
త్వత్సహాయస్య మే వీర నచింతా స్యా న్నృపాత్మజ॥ ౨౬

యదర్థ మయ మారంభః కృతః పరపురంజయ।
సమయం నాభిజానాతి కృతార్థః ప్లవగేశ్వరః॥ ౨౭

వర్షాసమయకాలం తు ప్రతిజ్ఞాయ హరీశ్వరః।
వ్యతీతాం శ్చతురో మాసా న్విహర న్నావబుధ్యతే॥ ౨౮

సామాత్యపరిష త్క్రీడ న్పానమేవోపసేవతే।
శోక దీనేషు నాస్మాసు సుగ్రీవః కురుతే దయామ్॥ ౨౯

ఉచ్యతాం గచ్ఛ సుగ్రీవ స్త్వయా వత్స మహాబల।
మమ రోషస్య యద్రూపం బ్రూయాశ్చైన మిదం వచః॥ ౩౦

(౨౪) బంగారు మయమగు పృష్ఠభాగముగలదియు, యుద్ధములో నాచే అల్లెత్రాడుగట్టి యీడువబడినదియు నగుధనుసుయొక్క మెరుపులగుంపుతో సమమైన రూపమును నీవు చూడఁగోరుచున్నావు.

(౨౫) యుద్ధములో కోపముగలిగియుండు నాయొక్క భయంకరమైన అల్లెత్రాటి ధ్వనిని, మరియు, వజ్రాయుధము ధ్వనివలె వినఁగోరుచున్నావు.

(౨౬) వీరుఁడా! రాజపుత్రుఁడా! నిన్నే సహాయముగ గల యిట్టి నాపరాక్రమమును సుగ్రీవుఁడు బాగుగ నెరింగియుండినను, సమయమతిక్రమించినందున నేను చంపివేయుదునని అతఁడు భయపడవలసినదిలేదు.

(౨౭) స్నేహము చేసికొని వాలిని జంపుట సీతను నతఁడు వెతుకవలయుననుట కేను. శత్రువుల పట్టణములను జయించువాఁడా! వానరరాజగు సుగ్రీవుఁడు మన సంకేతసమయమును కృతార్థుఁడై, తెలిసికొనకున్నాఁడు.

(౨౮) వానకాలము యీ నాలుగు నెలలు గడచిఁపిమ్మట సీతను వెతకు నటులచెప్పి, వానరరాజగు సుగ్రీవుఁడు, అంతఃపురస్త్రీలతో విహరించుచు, యీ కాలము గడచిపోయినది తెలిసికొనలేదు.

(౨౯) సుగ్రీవుఁడు మంత్రులతోను బంధువులతోను గూడి విహరించుచు మద్యపానము సేయుచు ఉన్నాఁడు. సీతాశోకముచే దుఃఖించుచుండు మనమీద దయయుంచలేదు.

(౩౦) ఓ బిడ్డా! గొప్పబలముగలవాఁడా! పోయి సుగ్రీవునికి యీసమాచారమును జెప్పుము. కోపముచే నాకుగల యీరూపమును, నేను జెప్పిపంపిన మాటలను సుగ్రీవునికిఁ దెలుపుము.

నచ సంకుచితః పంథా యేన వాలీ హతో గతః।
సమయే తిష్ఠ సుగ్రీవ మా వాలిపథ మన్వగాః॥ ౮౧

ఏక ఏవ రణే వాలీ శరేణ నిహతో మయా।
త్వాం తు సత్యా దతిక్రాంతం హనిష్యామి సబాంధవమ్॥ ౮౨

తదేవం విహితే కార్యే యద్ధితం పురుషర్షభ।
తత్త ద్బ్రూహి నరశ్రేష్ఠ త్వర కాలవ్యతిక్రమః॥ ౮౩

కురుష్వ సత్యం మయి వానరేశ్వర ప్రతిశ్రుతం ధర్మ మవేక్ష్య
శాశ్వతమ్। మా వాలినం ప్రేత్య గతో యమక్షయం త్వ
మద్య పశ్యే ర్మమ చోదితైః శరైః॥ ౮౪

స పూర్వజం తీవ్రవివృద్ధకోపం లాలప్యమానం ప్రసమీక్ష్య
దీనమ్। చకార తీవ్రాం మతిముగ్రతేజా హరీశ్వరే మానవ
వంశనాథః॥ ౮౫

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - త్రింశస్సర్గః.



రాముఁడతని ఆగ్రహమును సుగ్రీవునికి లక్ష్మణునిచేఁ జెప్పిపంపుట. ౩-౫

(౨౧) హతుఁడైనవాలి పోయియుండు పరలోకము నష్టమైపోలేదు. సుగ్రీవుఁడా! మనమేర్పరచుకొనిన సంకేత సమయమును మరచి పోవలదు. వాలి పోయిన మార్గములోఁ బోవలదు.

(౨౨) యుద్ధములో నేను వాలిని నొకనే బాణముతోఁ జంపితిని. సత్యమును విడిచియుండు నిన్ను బంధువులతోడ చంపెదను.

(౨౩) విషయమిటులుండగా, ఓపురుషశ్రేష్ఠుడా! హితముగనుండుదాని సుగ్రీవునికిఁ దెలుపుము, కాలమతిక్రమించి పోవుచున్నది. కనుక, త్వరగఁ బొమ్ము.

(౨౪) స్థిరమగు ధర్మమును నెఱింగి నావిషయమై చేసిన ప్రతిజ్ఞను గాపాడు కొనుము. ఇపుడు నాచే విడువఁబడిన బాణములు తగిలి మృతిపొంది యమలోకమునకుఁబోయి వాలిని జూడవలదనుము.

(౨౫) ఘోరమై హెచ్చియుండు కోపముగలవాఁడును, సీతను దలఁచి పరిలపించుచుండు వాఁడును, దీనుఁడును నగుఅన్నను జూచి, మానవవంశమునకు నాథుఁడును ఉగ్రమైన తేజస్సు గలవాఁడును నగు లక్ష్మణుఁడు సుగ్రీవుని నిగ్రహించవలయునని దలంచెను.

ఇది ముప్పదవ సర్గ.



## ౩౧ వ సర్గ.

(అవతారిక.— ఈ సర్గలో లక్ష్మణుఁడు మిగుల కోపము గలవాఁడై యుండుట అంగదుఁడు సుగ్రీవునికిఁ దెలుపుచున్నాఁడు.)

## ఏకత్రింశస్సర్గః.

స కామినం దీన మదీనసత్వం శోకాభిపన్నం సముదీర్ణ కోపమ్।
నరేంద్రసూను ర్నరదేవపుత్రం రామానుజః పూర్వజ మిత్యు
వాచ॥ ౧

నవానరస్థాస్యతి సాధువృత్తే నమంస్యతే కర్మఫలానుషంగాన్।
నభోక్ష్యతే వానరరాజ్యలక్ష్మీం తథాహి నాభిక్రమతేస్యబుద్ధిః॥

మతిక్షయా ద్గ్రామ్యసుఖేషు సక్త స్తవ ప్రసాదాప్రతికారబు
ద్ధిః। హతోఽగ్రజం పశ్యతు వీర తస్య నరాజ్య మేవం విగుణ
స్య దేయమ్॥ ౩

నధారయే కోప ముదీర్ణవేగం నిహన్మి సుగ్రీవ మసత్య మద్య।
హరిప్రవీరై స్సహ వాలిపుత్రో నరేంద్రపత్న్యా విచయం
కరోతు॥ ౪

త మాత్తబాణాసన ముత్పతంతం నివేదితార్థం రణచండకోపం।
ఉవాచ రామః పరవీరహంతా స్వవేక్షితం సానునయంచ
వాక్యమ్॥ ౫

(౧) కామపరతంత్రుఁడుగను, అందు చేత నే దీనుఁడుగనుండువాఁడును, అయినను గంభీరమైన బలముగలవాఁడును, మిగులదుఃఖించుచుండు వాఁడును, వృద్ధిపొందియుండు గొప్ప కోపముగలవాఁడును, దశరథుని కొడుకును అన్నయు నగు రాముని జూచి, రాజపుత్రుఁడగు లక్ష్మణుఁడు యిటు లనెను.

(౨) సుగ్రీవుఁడు సమానమైన సుఖదుఃఖములుగల స్నేహితుని ఆచారము లో నుండలేదు. అగ్నిసాక్షిగ స్నేహము చేసికొని, వాలిని జంపి రాజ్యమును భార్యను బడసినఫలమును తలఁచలేదు. మనకార్యము సేయుటలో నితనిబుద్ధి అభిముఖముగనుండలేదు. కనుక, యితఁడు వానరరాజ్యము యొక్క గొప్పసంపదను అనుభవించ నేరఁడు.

(౩) బుద్ధిలేక గ్రామ్యసుఖములలో మనసుంచియుండు సుగ్రీవుఁడు నీ సహాయముచే రాజ్యముచు బడసి కృతఘ్నుఁడై యున్నాఁడు. వీరుఁడా! హతుఁడై, సుగ్రీవుఁడు వాలిని జూచుచు. ఇట్టి గుణహీనునికి రాజ్య మీయరాదు.

(౪) మిగుల వృద్ధియైయుండు కోపమును సైచలేను. సత్యమును విడిచియుండు సుగ్రీవుని నిపుడే చంపెదను. మిగుల వీరులుగనుండు వానరులతోడ వాలి పుత్రుఁడగు అంగదుఁడు సీతను వెతకి కనిపెట్టును.

(౫) మనసులో సుగ్రీవుని

వలయునని నేను పలికినందునవే వానిజంపుటలో లక్ష్మణుఁడు సిద్ధముగనున్నాఁడని పరితాపము గలవాఁడును, వీరులగు శత్రువులను జంపువాఁడును నగు రాముఁడు, ధనుర్ధారియై సుగ్రీవుని జంపుటకు లేచుచుండువాఁడును, అతనికోపములను దెలిపినవాఁడును, యుద్ధములో ప్రచండమైన కోపముగలవాఁడును నగు లక్ష్మణుని జూచి బాగుగ నాలోచించి సమాధానపరచుచు యిటు లనెను.

నహివై త్వద్విధో లోకే పాపమేవం సమాచరేత్।
పాప మార్యేణ యో హంతి స వీరః పురుషోత్తమః॥ ౬
నేద మద్య త్వయాగ్రాహ్యం సాధువృత్తేన లక్ష్మణ।
తాం ప్రీతి మనువర్తస్వ పూర్వవృత్తం చ సంగతమ్॥ ౭

సామోపహితయా వాచా రూక్షాణి పరివర్జయన్।
వక్తు మర్హసి సుగ్రీవం వ్యతీతం కాలపర్యయే॥ ౮
సోగ్రజే నానుశిష్టార్థో యథావ త్పురుషర్షభః।
ప్రవివేశ పురీం వీరో లక్ష్మణః పరవీరహా॥ ౯

తత శ్శుభమతిః ప్రాజ్ఞో భ్రాతుః ప్రియహితే రతః।
లక్ష్మణః ప్రతిసంరబ్ధో జగామ భవనం కపేః॥ ౧౦
శక్రబాణాసన ప్రఖ్యం ధనుః కాలాంతకోపమః।
ప్రగృహ్య గిరిశృంగాభం మందర స్సానుమానివ॥ ౧౧

యథోక్తకారీ వచనముత్తరం చైవసోత్తరమ్।
బృహస్పతిసమో బుద్ధ్యా మత్వా రామానుజ స్తథా॥ ౧౨
కామక్రోధసముత్థేన భ్రాతుః కోపాగ్నినావృతః।
ప్రభంజనఇవా ప్రీతః ప్రయయౌ లక్ష్మణ స్తదా॥ ౧౩

(౬) లోకములో నీవంటివాఁడు మిత్రుని జంపుటకు యత్నించుటరూపముగనుండు పాపమును జేయరాదు. వివేకముచే పాపమును దొలగించుకొనువాఁడే వీరుఁడు, పురుషశ్రేష్ఠుఁడు.

(౭) సత్పురుషుల ఆచారముగల నీవు మిత్రుని జంపుటను యత్నించు పాపమును దలఁచకూడదు. పూర్వము చేసిన సఖ్యరూపమగు సంబంధమును దలఁచి అట్టిప్రీతిని నతనియెడల నుంచవలయును.

(౮) అనుకొనిన సంకేత సమయమును నతిక్రమించిన సుగ్రీవునితోడ, కఠినమైన మాటలు విడిచి, సమాధానముగ బలుకవలయును.

(౯) పురుషశ్రేష్ఠుఁడును వీరులగు శత్రువులను జంపువాఁడును నగు లక్ష్మణుఁడు అన్న చెప్పిన సమాధానము మాటలనువిని కిష్కింధలోఁ బ్రవేశించెను.

(౧౦) మంచిబుద్ధిగలవాఁడును ప్రాజ్ఞుఁడును అన్నకుఁబ్రియమును హితమును జేయుటలో ఆసక్తిగలవాఁడును నగు లక్ష్మణుఁడు,సుగ్రీవుని జంపవలయునను అభిప్రాయమును విడిచి, కిష్కింధకుఁ బోయెను.

(౧౧) ప్రళయకాల యమునివలె నుండు లక్ష్మణుఁడు ఇంద్ర ధనుసు వంటిదైన పర్వతశిఖరమువలె వెలుంగుచుండు ధనుసును దీసికొని సానుప్రదేశముతోఁ గూడిన మందరపర్వతమువలె కిష్కింధకుఁ బోయెను.

(౧౨,౧౩) రాముఁడు చెప్పినటుల చేయుచుండు లక్ష్మణుఁడు సుగ్రీవునితో నతఁడు చెప్పవలసినమాటలను, అతని మాటలకుఁ సుగ్రీవుఁ డేవిధముగ బదులుచెప్పు ననుమాటలను, అందుకు అతనికి బదులు చెప్పవలసిన మాటలను, బృహస్పతివంటి బుద్ధితో నాలోచించుకొని, కామక్రోధములచే, అన్నకుగలిగిన కోపముచే అతఁడు కోపముగలవాఁడై సంతోషములేక వాయువేగముతోఁ బోవుచుండెను.

సాలతాలాశ్వకర్ణాంశ్చ తరసా పాతయ న్బహూన్।
పర్యస్య న్గిరికూటాని ద్రుమా నన్యాంశ్చ వేగతః। ౧౪
శిలాశ్చ శకలీకుర్వన్ పద్భ్యాం గజఇవాశుగః।
దూర మేకపదం త్యక్త్వా యయౌ కార్యవశా ద్ద్రుతమ్॥ ౧౫

తా మపశ్య ద్బలాకీర్ణాం హరిరాజమహాపురీమ్।
దుర్గా మిక్ష్వాకుశార్దూలః కిష్కింధాం గిరిసంకటే॥ ౧౬
రోషాత్ ప్రస్ఫురమాణోష్ఠ స్సుగ్రీవం ప్రతిలక్ష్మణః।
దదర్శ వానరాన్ భీమాన్ కిష్కింధాయా బహిశ్చరాన్। ౧౭

తం దృష్ట్వా వానరా స్సర్వే లక్ష్మణం పురుషర్షభమ్।
శైలశృంగాణి శతశః ప్రవృద్ధాంశ్చ మహీరుహాన్॥ ౧౮
జగృహుః కుంజరప్రఖ్యా వానరాః పర్వతాంతరే॥ ౧౮½
తాన్గృహీత ప్రహరణాన్ హరీన్ దృష్ట్వా తు లక్ష్మణః।
బభూవ ద్విగుణం క్రుద్ధో బహ్వింధన ఇవానలః॥ ౧౯½
తం తే భయపరీతాంగాః క్రుద్ధం దృష్ట్వా ప్లవంగమాః।
కాలమృత్యుయుగాంతాభం శతశో విద్రుతా దిశః॥ ౨౦½
తత స్సుగ్రీవభవనం ప్రవిశ్య హరిపుంగవాః।
క్రోధ మాగమనం చైవ లక్ష్మణస్య న్యవేదయన్॥ ౨౧½

(౧౪,౧౫) అనేకములగు సాల తాల అశ్వకర్ణ వృక్షములను మరికొన్ని వృక్షములను కొండలశిఖరములను రాళ్ళుచు, యేనుఁగువలె మిగుల వేగముగఁ బోవుచుండు లక్ష్మణుఁడు కాళులతో పొడిచేయుచు, కుడికాలును దూరముగ నుంచి, రాముని కార్యమును జేయఁగోరి శీఘ్రముగఁ బోవుచుండెను.

(౧౬) ఇక్ష్వాకు వంశములోఁ బుట్టినవారిలో నుత్తముఁడుగ నుండు లక్ష్మణుఁడు వానరసేనతో నిండినదిగను చూచుటకు సాధ్యము కానిదిగను, దట్టమైన కొండలమధ్యలో నుండు సుగ్రీవునిపట్టణ మగుకిష్కింధను జూచెను.

(౧౭) సుగ్రీవునిమీఁద గల కోపముచే అదురుచుండు పెదవులు గల లక్ష్మణుఁడు కిష్కింధకు వెలుపల సంచరించుచుండు భయంకరు లగు వానరులను జూచెను.

(౧౮,౧౮½) ఏనుఁగులవలె నుండు వానరులందరు పురుషశ్రేష్ఠుఁడగు లక్ష్మణుని జూచి అనేకకొండలమధ్యలోనుండు అనేకశిఖరములను, మిగుల పెరిగియుండు వృక్షములను, పెళ్ళగించి తీసికొనిరి.

(౧౯½) ఆయుధములను బుచ్చుకొనియుండు వానరులను జూచి లక్ష్మణుఁడు, అనేకములగు కట్టెలతోఁగూడి అగ్ని వెలుంగునటుల, మిగుల కోపము గలవాఁడాయెను.

(౨౦½) మిగుల కోపము గలిగియుండు వాఁడును ప్రళయకాల యముని వలె వెలుంగుచుండు వాఁడును నగులక్ష్మణుని జూచి, వానరులు భయపడి గుంపులుగుంపులుగ నలుదిక్కుల పారిపోయిరి.

(౨౧½) కొందఱు వానరోత్తములు, పిమ్మట, సుగ్రీవుని భవనములోఁ బ్రవేశించి లక్ష్మణుఁడు మిగుల కోపముతో వచ్చియున్నాఁడని దెలిపిరి.

తారయా సహితః కామీ సక్తః కపివృషో రహః।
న తేషాం కపివీరాణాం శుశ్రావ వచనం తదా॥ ౨౨

తత స్సచివసందిష్టా హరయో రోమహర్షణాః।
గిరికుంజరమేఘాభా నగర్యా నిర్యయు స్తదా॥ ౨౩

నఖదంష్ట్రాయుధా ఘోరా స్సర్వే వికృతదర్శనాః।
సర్వే శార్దూలదర్పాశ్చ సర్వేచ వికృతాననాః॥ ౨౪

దశనాగబలాః కేచి త్కేచి ద్దశగుణోత్తరాః।
కేచి న్నాగసహస్రస్య బభూవు స్తుల్యవిక్రమాః॥ ౨౫

కృత్స్నం హి కపిభి ర్వ్యాప్తాం ద్రుమహస్తై ర్మహాబలైః।
అపశ్య ల్లక్ష్మణః క్రుద్ధః కిష్కింధాం తాం దురాసదామ్॥ ౨౬

తత స్తే హరయ స్సర్వే ప్రాకారపరిఘాంతరాత్।
నిష్క్రమ్యోదగ్రసత్వాస్తు తస్థు రావిష్కృతం తదా॥ ౨౭

సుగ్రీవస్య ప్రమాదంచ పూర్వజం చార్త మాత్మవాన్।
బుద్ధ్వా కోపవశం వీరః పున రేవ జగామ సః॥ ౨౮

స దీర్ఘోష్ణ మహోచ్ఛ్వాసః కోపసంరక్తలోచనః।
బభూవ నరశార్దూల స్సధూమఇవ పావకః॥ ౨౯

(౨౨౪) అప్పుడు తారతో అంతఃపురములో నుండువాఁడును మిగుల కామియు కపివరుఁడును నగుసుగ్రీవుఁడు వీరులగు వానరులు చెప్పినమాటలను వినకపోయెను.

(౨౩౪) పిమ్మట, కొండలు యేనుఁగులు మేఘములవలెనుండి రోమాంచము గలిగించునట్టి వానరులు మంత్రులచే ఆజ్ఞాపింపఁబడి కిష్కింధనుండి వెలుపలవచ్చిరి.

(౨౪౪) వానరులందరు గోళ్ళు కోరపండ్లు ఆయుధములుగ గలవారుగను భయంకరులుగను వికారముగనుండు ఆకారములు గలవారుగను పులివంటి దర్పముగలవారుగను వికారముగనుండు ముఖములు గలవారుగను నుండిరి.

(౨౫౪) కొందరు పది కొందరు నూరు కొందరు వేయి యేనుఁగుల బలముగలవారుగ నుండిరి.

(౨౬౪) వృక్షములు చేతిలోనుంచుకొని గొప్ప బలముగల వానరులతో నిండినదియు, ప్రవేశించుటను సాధ్యముకానిదియు నగు కిష్కింధను మిగుల కోపముగలిగియుండు లక్ష్మణుఁడు చూచెను.

(౨౭౪) ఉత్తమమైన బలముగలవానరులందరు ప్రాకారమునను అగడ్తల మధ్యలోగల మార్గముగ వెలుపలవచ్చి ఉండిరి.

(౨౮౪) ధైర్యముగలవాఁడును వీరుఁడును నగు లక్ష్మణుఁడు సుగ్రీవుని అజాగ్రత్తను దుఃఖపీడితుఁడై యుండు రాముని యోచించి మరియు మిగుల కోపము గలవాఁడాయెను.

(౨౯౪) దీర్ఘమైన వేడిగనుండు గొప్పనిట్టూర్పులుగలిగి కోపముచే మిగుల యెఱ్ఱనైన కన్నులు గలవాఁడును నరోత్తముఁడును నగు లక్ష్మణుఁడు పొగకప్పిన అగ్నివలె నుండెను.

బాణశల్యస్ఫురజ్జిహ్వ స్సాయకాసనభోగవాన్।
స్వతేజోవిషసంఘాతః పంచాస్యఇవ పన్నగః॥ ౩౦౪
తం దీప్తమివ కాలాగ్నిం నాగేంద్రమివ కోపితమ్।
సమాసాద్యాంగద స్త్రాసా ద్విషాద మగమ ద్భృశమ్॥ ౩౧౪
సోంగదం రోషతామ్రాక్షః సందిదేశ మహాయశాః।
సుగ్రీవః కథ్యతాం వత్స మమాగమన మిత్యుత॥ ౩౨౪
ఏష రామానుజః ప్రాప్త స్త్వత్సకాశ మరిందమః।
భ్రాతు ర్వ్యసనసంతప్తో ద్వారి తిష్ఠతి లక్ష్మణః॥ ౩౩౪
తస్య వాక్యే యది రుచిః క్రియతాం సాధు వానర।
ఇత్యుక్త్వా శీఘ్ర మాగచ్ఛ వత్స వాక్య మరిందమ॥ ౩౪౪
లక్ష్మణస్య వచ శ్శ్రుత్వా శోకావిష్టోంగదో బ్రవీత్।
పితు స్సమీప మాగమ్య సౌమిత్రి రయ మాగతః॥ ౩౫౪
అథాంగద స్తస్య వచో నిశమ్య సంభ్రాంతభావః పరిదీనవక్త్రః।
నిపత్య తూర్ణం నృపతే స్తరస్వీ తతః కుమార శ్చరణా వవందే॥ ౩౬౪
సంగృహ్య పాదౌ పితు రగ్ర్యతేజా జగ్రాహ మాతుః పునరేవ పాదౌ। పాదౌ రుమాయాశ్చ నిపీడయిత్వా నివేదయామాస తత స్తమర్థమ్॥ ౩౭౪

(౩౦౪) బాణములమొన లను ప్రకాశించుచుండు నాలుక, ధనుసు అను పడిగె, అతని తేజస్సు అను విషము, గల లక్ష్మణుఁడు ౫ తలలుగల సర్పమువలె నుండెను.

(౩౧౪) వెలుంగుచుండు ప్రళయకాలాగ్నివలెను కోపముగల నాగేంద్రునివలెను నుండు లక్ష్మణుని సమీపమునకు అంగదుఁడు వచ్చి భయపడి మిగుల దుఃఖించెను.

(౩౨౪,౩౩౪,౩౪౪) బిడ్డా! శత్రుసంహారకుఁడా! అంగదుఁడా! శత్రుసంహారకుఁడగు యీలక్ష్మణుఁడు నీవద్దకు వచ్చియున్నాఁడు. అన్నయగు రాముని వ్యసనముచే మిగుల తపించి ద్వారములో నున్నాఁడు. అతని మాటలు వినుటలో నీకు రుచియుండునటులైతే, ఓవానరుఁడా! అతని వద్దకుఁబోవుట మిగుల శ్రేయము. లేక, అతనిని నీవద్దకు పిలిపించుకొనుము. ఈవిధముగ సుగ్రీవునికిఁ దెలిపి శీఘ్రముగ రమ్ము అని గొప్ప యశస్సుగలవాఁడును రోషముచే నెఱ్ఱనైన కన్నులు గలవాఁడును నగు లక్ష్మణుఁడు అంగదునికి ఆజ్ఞాపించెను.

(౩౫౪) లక్ష్మణుని మాటలువిని దుఃఖించుచుండు అంగదుఁడు పినతండ్రి వద్దకు వచ్చి లక్ష్మణుఁడు వచ్చియున్నాఁడని దెలిపెను.

(౩౬౪) పిమ్మట, లక్ష్మణునిమాట విని మిగులభయపడి దీనుఁడై బలవంతుఁడగు అంగదుఁడు శీఘ్రముగ గంతువేసి రాజగు సుగ్రీవుని పాదములకు నమస్కరించెను.

(౩౭౪) శ్రేష్ఠమైన కాంతి గలఅంగదుఁడు సుగ్రీవుని పాదములను తల్లులగు తారరుమాదేవుల పాదములను బట్టుకొని, పిమ్మట, లక్ష్మణుఁడు చెప్పినమాటలను వినిపించెను.

స నిద్రామదసంవీతో వానరో న విబుద్ధవాన్।
బభూవ మదమత్తశ్చ మదనేన చ మోహితః॥ 38½
తతః కిలకిలాం చక్రు ర్లక్ష్మణం ప్రేక్ష్య వానరాః।
ప్రసాదయంత స్తం క్రుద్ధం భయమోహితచేతసః॥ 39½
తే మహౌఘనిభం దృష్ట్వా వజ్రాశనిసమస్వనమ్।
సింహనాదం సమం చక్రు ర్లక్ష్మణస్య సమీపతః॥ 40½
తేన శబ్దేన మహతా ప్రత్యబుధ్యత వానరః।
మదవిహ్వలతామ్రాక్షో వ్యాకులస్రగ్విభూషణః॥ 41½
అథాంగదవచ శ్శ్రుత్వా తేనైవచ సమాగతౌ।
మంత్రిణౌ వానరేంద్రస్య సమ్మతౌ దారదర్శినౌ॥ 42½
ప్లక్షశ్చైవ ప్రభావశ్చ మంత్రిణా వర్థధర్మయోః।
వక్తు ముచ్చావచం ప్రాప్తం లక్ష్మణం తౌ శశంసతుః॥ 43½
ప్రసాదయిత్వా సుగ్రీవం వచనై స్సామనిశ్చితైః।
ఆసీనం పర్యుపాసీనౌ యథా శక్రం మరుత్పతిమ్॥ 44½
సత్యసంధౌ మహాభాగౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ।
వయస్యభావం సంప్రాప్తౌ రాజ్యార్హౌ రాజ్యదాయినౌ॥ 45½
తయో రేకో ధనుష్పాణి ర్ద్వారి తిష్ఠతి లక్ష్మణః।
యస్య భీతాః ప్రవేపంతో నాదా న్ముంచంతి వానరాః॥ 46½

(౩౮౫) నిద్రామదముతోఁ గూడియుండు సుగ్రీవుఁడు అంగదుఁడు చెప్పిన విషయమును గ్రహించలేదు. సురాపానముచే మత్తుఁడుగను కామమోహితుఁడుగను నతఁడు ఉండెను.

(౩౯౫) పిమ్మట, లక్ష్మణుని జూచి వానరులు మిగుల భయపడినవారై కోపపడియుండు లక్ష్మణుని శాంతపరచుటకు కిలకిలారావములు చేయుచుండిరి.

(౪౦౫) గొప్ప ప్రవాహము వలెనుండు లక్ష్మణుని జూచినతోడనే, వజ్రాయుధము పిడుగువలె సింహనాదమును, నతని సమీపములో వానరులు చేసిరి.

(౪౧౫) మదముచే స్వాధీనముతప్పి యెఱ్ఱగనుండు కన్నులుగలిగి, బాగుగ చెదిరియుండు పూలహారములు ఆభరణములుగల సుగ్రీవుఁడు ఆగొప్పధ్వని విని మేలుకొనెను.

(౪౨౫,౪౩౫) అంగదునిమాట విని అతనితోడనే వచ్చియుండు వారును, వానరశ్రేష్ఠుఁడగు సుగ్రీవునికి యిష్టులుగనుండువారును, అంతఃపురములో పోవుటకుతగినవారును బాగుగ మంత్రాలోచన చేయుచుండువారును నగుప్లక్షుఁడు ప్రభావుఁడు అనుమంత్రులు, ధర్మార్థముల హెచ్చుతగ్గులను దెలుపుటకువచ్చియుండు లక్ష్మణుని సమాధానవాక్యముల చే సుగ్రీవునికి తెలివిగలుగునటుల చెప్పిరి.

(౪౪౫ మొదలు ౪౭౫ వరకు) లక్ష్మణా! సమాధానవాక్యములచే సుగ్రీవునికి మేము తెలివిగలిగించెదము. మరుత్ దేవతలకు పతిగనుండు ఇంద్రునిదేవతలు ప్రార్థించునటుల సుఖముగనుండు సుగ్రీవుని ప్రార్థించుచుండువారును సత్యసంధులును మహానుభావులును, అన్నదమ్ములును నగు రామలక్ష్మణులు నీయెడల స్నేహభావముగలిగియున్నారు. వారు రాజ్యపరిపాలనను చేయుటకు తగినవారు. నీకు రాజ్యమును నిచ్చినవారు. వారిలో నొకఁడగు లక్ష్మణుఁడు ధనుసు ధరించి ద్వారములో నున్నాఁడు. అతని జూచి భయపడి వానరులు కిలకిలారా

స ఏష రాఘవభ్రాతా లక్ష్మణో వాక్యసారథిః।
వ్యవసాయ రథః ప్రాప్త స్తస్య రామస్య శాసనాత్॥ ౪౭
అయం చ దయితో రాజ్ఞ స్తారాయా స్తనయోంగదః।
లక్ష్మణేన సకాశం తే ప్రేషిత స్త్వరయాఽనఘ॥ ౪౮

సోఽయం రోషపరీతాక్షో ద్వారి తిష్ఠతి వీర్యవాన్।
వానరా న్వానరపతే చక్షుషా నిర్దహన్నివ॥ ౪౯
తస్య మూర్ధ్నా ప్రణమ్య త్వం సపుత్ర స్సహబంధుభిః।
గచ్ఛ శీఘ్రం మహారాజ రోషో హ్యస్య నివర్త్యతామ్॥ ౫౦

యదాహ రామో ధర్మాత్మా తత్కురుష్వ సమాహితః।
రాజ్ఞ స్తిష్ఠస్వ సమయే భవ సత్యప్రతిశ్రవాః॥ ౫౧

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - ఏకత్రింశస్సర్గః.

## ద్వాత్రింశస్సర్గః.

అంగదస్య వచ శ్శ్రుత్వా సుగ్రీవ స్సచివై స్సహ।
లక్ష్మణం కుపితం శ్రుత్వా ముమోచాసన మాత్మవాన్॥ ౧

నములు చేయుచున్నారు. ఇట్టి, శ్రీరామునితమ్ముఁ డగులక్ష్మణుఁడు అతని నాజ్ఞచేఁ బ్రేరితుఁడై, శత్రువులను నిరసించుట ముఖ్యముగఁ దలఁచి, వచ్చి యున్నాఁడు.

(౪౮-౪) ఓ రాజా! తార కొడుకగు నీయంగదుఁడు లక్ష్మణునికి ప్రేమపాత్రుఁడుగనున్నాఁడు. పాపరహితుఁడా! లక్ష్మణుఁడు నీకు సమాచారము దెలుపుటకు అంగదుని బంపెను.

(౪౯-౪) రోషముతోఁ గూడిన కన్నులుగలవాఁడును, వీర్యవంతుడును నగు నీలక్ష్మణుఁడు, వానరరాజా! వానరులను గంటితో దహించునటు లున్నాఁడు.

(౫౦౪ మహారాజా! పుత్రులు బంధువులతోఁ గూడి శీఘ్రముగఁ బోయి లక్ష్మణునికి శిరసుతో నమస్కరించి అతనిరోషమును శమనపరచుము.

(౫౧౪) ధర్మాత్ముఁడగు శ్రీరాముఁడు చెప్పినవిషయమును జాగ్రత్తగలవాఁడవై చేయుము. ఓరాజా! సీతను వెతకు విషయములో సత్యమైనప్రతిజ్ఞగలవాఁడవై యుండుము. అని మంత్రులు సుగ్రీవునితోఁ జెప్పిరి.

ఇది ముప్పదియొకటవ సర్గ.



౩౨ వ సర్గ.

(అవతారిక.— హనుమంతుఁడు సుగ్రీవునికి హితముచెప్పుట యీ సర్గలోఁ జెప్పఁబడుచున్నది )

(౧) ధైర్యవంతుఁ డగుసుగ్రీవుఁడు మంత్రులతోడ అంగదుఁడు చెప్పిన మాట విని లక్ష్మణుఁడు మిగులకోపముగలిగియున్నాడని తెలిసికొని ఆసనము విడిచి లేచెను.

సచివా నబ్రవీ ద్వాక్యం నిశ్చిత్య గురులాఘవమ్।
మంత్రజ్ఞా న్మంత్రకుశలో మంత్రేషు పరినిష్ఠితాన్॥ ౨
న మే దుర్వ్యాహృతం కించి న్నాపి మే దురనుష్ఠితమ్।
లక్ష్మణో రాఘవభ్రాతా క్రుద్ధః కిమితి చింతయే॥ ౩
అసుహృద్భి ర్మమామిత్రై ర్నిత్య మంతరదర్శిభిః।
మమ దోషా నసంభూతాన్ శ్రావితో రాఘవానుజః॥ ౪
అత్ర తావ ద్యథా బుద్ధి సర్వైరేవ యథావిధి।
భావస్య నిశ్చయస్తావ ద్విజ్ఞేయో నిపుణం శనైః॥ ౫
నఖల్వస్తి మమ త్రాసో లక్ష్మణా న్నాపి రాఘవాత్।
మిత్రం త్వస్థానకుపితం జనయత్యేవ సంభ్రమమ్॥ ౬
సర్వథా సుకరం మిత్రం దుష్కరం పరిపాలనమ్।
అనిత్యత్వా చ్చ చిత్తానాం ప్రీతి రల్పేపి భిద్యతే॥ ౭
అతో నిమిత్తం త్రస్తోఽహం రామేణ తు మహాత్మనా।
య న్మమోపకృతం శక్యం ప్రతికర్తుం నతన్మయా॥ ౮
సుగ్రీవేణైవ ముక్తస్తు హనుమా న్హరిపుంగవః।
ఉవాచ స్వేన తర్కేణ మధ్యే వానరమంత్రిణామ్॥ ౯
సర్వథా నైతదాశ్చర్యం య త్త్వం హరిగణేశ్వర।
న విస్మరసి సుస్నిగ్ధ ముపకారకృతం శుభమ్॥ ౧౦

(౨) మంత్రాలోచన చెప్పుటలో సమర్థుఁ డగుసుగ్రీవుఁడు మంత్రాలోచనను నెరింగించి నీతిమార్గమును బ్రయోగించుచుండు మంత్రులతోడ మేలును నిశ్చయించుకొని యిటు లనెను.

(౩) నేను కఠినమైనమాటలు చెప్పలేదు. అపకారముసేయలేదు. ఇటులుండగా శ్రీరాముని తమ్ముఁడగు లక్ష్మణుఁడు కోపముగలిగియున్నాఁడు. ఇందుకు కారణ మేమని ఆలోచించుచున్నాను.

(౪) చెడు తలంపుగల, సమయము కనిపెట్టియుండు, నావిరోధులు నాయెడల లేనిదోషములను లక్ష్మణునితోఁ జెప్పియుందురు.

(౫) ఈవిషయములో మీరందరు మీబుద్ధినంతయు వినియోగించి కోపముగలిగియుండు లక్ష్మణుని అభిప్రాయమును బాగుగ కనిపెట్టవలయును.

(౬) రామ లక్ష్మణులవల్ల నాకు భయములేదు. అసమయములో కోపము గలిగియుండు స్నేహితుని జూచినపుడు భయము గలుగుచున్నది.

(౭) సులభముగ స్నేహమును సంపాదించ వచ్చును. దాని కాపాడుకొనుట కష్టము. చిత్తము చంచలమైనందున అల్పమైన కారణముచేతను స్నేహమునకు భంగము గలుగుచున్నది.

(౮) మహాత్ముఁడగు రాముఁడు నాకు ఉపకారము సేసెను. అతనికి ప్రత్యుపకారము నేను చేయలేదు. కనుక నేను భయపడుచున్నాను.

(౯) సుగ్రీవుఁ డిటుల చెప్పగా, వానరశ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు మంత్రులగు వానరుల మధ్యలో ఆత్మని యూహను దెలిపెను.

(౧౦) వానరగుంపులకు రాజగు సుగ్రీవుఁడా! శుభమైన మిగుల ప్రీతితో రాముఁడుసేసిన యుపకారమును మఱచి పోకున్నావు. ఇందులో ఆశ్చర్యమేమియు లేదు.

రాఘవేణతు వీరేణ భయ ముత్సృజ్య దూరతః।
త్వత్ప్రియార్థం హతో వాలీ శక్రతుల్యపరాక్రమః॥ ౧౧

సర్వథా ప్రణయా త్క్రుద్ధో రాఘవో నాత్ర సంశయః।
భ్రాతరం సంప్రహితవా ల్లక్ష్మణం లక్ష్మివర్ధనమ్॥ ౧౨
త్వం ప్రమత్తో నజానీషే కాలం కాలవిదాంవర।
ఫుల్లసప్తచ్ఛదశ్యామా ప్రవృత్తా తు శరచ్ఛివా॥ ౧౩

నిర్మల గ్రహనక్షత్రా ద్యౌః ప్రణష్టవలాహకా।
ప్రసన్నాశ్చ దిశ స్సర్వా స్సరితశ్చ సరాంసి చ॥ ౧౪
ప్రాప్త ముద్యోగకాలం తు నావైషి హరిపుంగవ।
త్వం ప్రమత్త ఇతి వ్యక్తం లక్ష్మణోఽయ మిహాగతః॥ ౧౫

ఆర్తస్య హృతదారస్య పరుషం పురుషాంతరాత్।
వచనం మర్షణీయం తే రాఘవస్య మహాత్మనః॥ ౧౬
కృతాపరాధస్య హి తే నాన్య త్పశ్యా మ్యహం క్షమమ్।
అంతరేణాంజలిం బద్ధ్వా లక్ష్మణస్య ప్రసాదనాత్॥ ౧౭

నియుక్తై ర్మంత్రిభి ర్వాచ్యో హ్యవశ్యం పార్థివో హితమ్।
అతఏవ భయం త్యక్త్వా బ్రవీమ్యవధృతం వచః॥ ౧౮

లక్ష్మణుని వేడుకొనవలయునని హనుమంతుఁడు సుగ్రీవునికిఁ దెలుపుట. ౩౮-౩

(౧౧) వీరుఁడగు శ్రీరాముఁడు భయములేనివాఁడై నీకు ప్రియము సేయుటకై ఇంద్రునివంటి పరాక్రమము గలవాలిని జంపెను.

(౧౨) శ్రీరాముఁడు నీయెడల గల విశ్వాసముచే బహుశః కోపము గలిగియుండును. ఇందుకు సందేహములేదు. కైంకర్యలక్ష్మిని వృద్ధిచేయుచుండు లక్ష్మణుని నీవద్దకుఁ బంపెను.

(౧౩) సమయమును నెఱింగినవారిలో నుత్తముఁడా! నీవు మఱచినవాఁడవై సంకేతసమయమును దెలిసికొనలేదు. వికసించిన యేడాకుల వృక్షములుగల నల్లగనుండునదియు నగు శరత్కాలము వచ్చినది.

(౧౪) మేఘములులేక ఆకాశము నిర్మలమైన గ్రహములు నక్షత్రములు గలిగియున్నది. దిక్కులన్నియు నదులు సరసులు ప్రసన్నములుగనున్నవి.

(౧౫) వానరశ్రేష్ఠుఁడా! సీతను కనిపెట్టి రావణుని జంపవలసిన కాలము వచ్చియుండుట నీవెఱుంగలేదు. నీవు బాగుగమదించియున్నావు. ఇది వ్యక్తముగ నున్నందున లక్ష్మణుఁ డిచటికి వచ్చెను.

(౧౬) భార్యను బోగొట్టుకొని దుఃఖించుచుండు వాఁడును మహాత్ముఁడును నగు శ్రీరాముఁడు చెప్పిన కఠినమైన పలుకులను లక్ష్మణుఁడు చెప్పుచున్నాఁడు. నీవు సహించుకొనవలసినదేను.

(౧౭) అపరాధము చేసిన నీవు అంజలిచేసికొని లక్ష్మణుని అనుగ్రహమును సంపాదించుకొనుట తప్ప యిందుకు తగిన ప్రతిక్రియ యింకొకటిలేదని తలంచుచున్నాను.

(౧౮) రాజులడిగినపుడు మంత్రులు హితమును దెలుపవలయును. కనుక, నేను భయము విడిచి నా యభిప్రాయమును బాగుగ, దెలిపితిని.

అభిక్రుద్ధ స్సమర్థో హి చాప ముద్యమ్య రాఘవః।
సదేవాసురగంధర్వం వశే స్థాపయితుం జగత్॥ ౧౯

న స క్షమః కోపయితుం యః ప్రసాద్యః పునర్భవేత్।
పూర్వోపకారం స్మరతా కృతజ్ఞేన విశేషతః॥ ౨౦

తస్య మూర్ధ్నా ప్రణమ్య త్వం సపుత్ర స్ససుహృజ్జనః।
రాజం స్తిష్ఠస్వ సమయే భర్తు ర్భార్యేవ తద్వశే॥ ౨౧

న రామ రామానుజ శాసనం త్వయా కపీంద్ర యుక్తం మనసా
ప్యపోహితుమ్। మనో హి తే జ్ఞాస్యతి మానుషం బలం సరాఘ
వస్యాస్య సురేంద్రవర్చసః॥ ౨౨

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - ద్వాత్రింశస్సర్గః.

## త్రయస్త్రింశస్సర్గః.

అథ ప్రతిసమాదిష్టో లక్ష్మణః పరవీరహా।
ప్రవివేశ గుహాం ఘోరాం కిష్కింధాం రామశాసనాత్॥ ౧

(౧౯) శ్రీరాముఁడు మిగుల కోపముగలవాఁడై ధనుసును ధరించి దేవతులు అసురులు గంధర్వులుతోఁ గూడిన లోకమును అతని స్వాధీనములో నుంచుకొనుటకు సమర్థుఁడేను.

(౨౦) ముందు చేసిన ఉపకార్యమును స్మరించి కృతజ్ఞుఁడుగ నుండు నీవు శ్రీరామునికి అనుగ్రహము గలుగునటుల వేడుకొనినచో మరియు అతనికి కోపము గలుగదు.

(౨౧) ఓరాజా! నీవు పుత్రమిత్ర బంధువులతోఁ గూడి నీశిరసుతో రామునికి నమస్కారముచేసి నీవుచేసికొనినప్రతిజ్ఞలోనుండి, భార్య భర్తవశములో నుండునటుల, అతని వశములో నుండుము.

(౨౨) ఓ కపిశ్రేష్ఠుఁడా! శ్రీరామ లక్ష్మణుల శాసనమును మనసుచేతను నతిక్రమించుటకు నీకు సాధ్యము కాదు. నారాయణుని కాంతివంటి కాంతిగల లక్ష్మణునితోఁ గూడిన రామునియొక్క దివ్యాస్త్రబలము అటుండగా, కేవలము స్వాభావికముగనుండు యితని మనుష్యబలము నీ మనసుకుఁ దెలిసియున్నది కదా?

ఇది ముప్పది రెండవ సర్గ.

## 33 వ సర్గ.

(అవతారిక — అంతఃపురములోఁ బ్రవేశించిన లక్ష్మణుని తార సమాధాన పరచుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) పిమ్మట, శత్రు సంహారకుఁడగు లక్ష్మణుఁడు, అంగదుఁడు పిలువగా, శ్రీరాముని యాజ్ఞచే, భయంకరముగనుండు కిష్కింధ గుహలోఁ బ్రవేశించెను

ద్వారస్థా హరయ స్తత్ర మహాకాయా మహాబలాః।
బభూవు ర్లక్ష్మణం దృష్ట్వా సర్వే ప్రాంజలయః స్థితాః॥ ౨
నిశ్శ్వసంతం తు తం దృష్ట్వా క్రుద్ధం దశరథాత్మజమ్।
బభూవు ర్హరయ స్త్రస్తా న చైనం పర్యవారయన్॥ ౩

స తాం రత్నమయీం శ్రీమాన్ దివ్యాం పుష్పితకాననామ్।
రమ్యాం రత్నసమాకీర్ణాం దదర్శ మహతీం గుహామ్॥ ౪
హర్మ్యప్రాసాదసంబాధాం నానాపణ్యోపశోభితామ్।
సర్వకామఫలై ర్వృక్షైః పుష్పితై రుపశోభితామ్॥ ౫
దేవగంధర్వపుత్రైశ్చ వానరైః కామరూపిభిః।
దివ్యమాల్యాంబరధరై శ్శోభితాం ప్రియదర్శనైః॥ ౬

చందనాగరుపద్మానాం గంధై స్సురభిగంధినామ్।
మైరేయాణాం మధూనాం చ సంమోదితమహాపథామ్॥ ౭
దదర్శ గిరినద్యశ్చ విమలా స్తత్ర రాఘవః॥ ౭½
అంగదస్య గృహం రమ్యం మైందస్య ద్వివిదస్య చ।
గవయస్య గవాక్షస్య గజస్య శరభస్య చ॥ ౮½
విద్యున్మాలేశ్చ సంపాతే స్సూర్యాక్షస్య హనూమతః।
వీరబాహో స్సుబాహోశ్చ నళస్య చ మహాత్మనః॥ ౯½

(౨) గొప్పశరీరము బలముగల కిష్కింధలో ద్వారపాలకులుగ నుండు వానరులందరు లక్ష్మణుని జూచి అంజలి చేసికొని నిలిచియుండిరి.

(3) నిట్టూర్పు విడుచుచుండువాఁడును కోపము గలవాఁడును దశరథుని కొడుకును నగు లక్ష్మణుని జూచి వానరులు భయపడి అతని సమీపమునకు రాక దూరములో నిలిచియుండిరి.

(౪) రత్నములతో నిర్మింపఁబడినదియు, దివ్యమైనదియు, పూచియుండు అరణ్యములుగలదియు, మనోహరముగనుండునదియు, రత్నములతో నిండినదియు,

(౫)ధనికులయిండ్లు దేవతాలయములు గలదియు, నానావిధములగు అంగడి వీథులచేఁ బ్రకాశించుచుండునదియు, పూచి కోరినఫలములుగల వృక్షములతోఁ బ్రకాశించుచుండునదియు,

(౬) దివ్యమైన పూలహారములు పీతాంబరములు ధరించియుండువారును ప్రియమైన చూపుగలవారును కోరిన రూపము ధరించువారును దేవతల గంధర్వుల బిడ్డలగు వానరులతోఁ బ్రకాశించుచుండునదియు,

(౭,౨౪) మంచివాసన గలచందనము అగరు పద్మము అను పేరుగల వాసనద్రవ్యము సురతేనె వీని వాసనతో నిండిన రాజమార్గములు గలదియు నగుగొప్ప కిష్కింధ గుహను, అచట నిర్మలమై పారుచుండు కొండనదులను, శ్రీమంతుఁడగు లక్ష్మణుఁడు చూచెను.

(౮ మొదలు ౧౨ వరకు) అంగదుఁడు మైందుఁడు ద్వివిదుఁడు గవయుఁడు గవాక్షుఁడు గజుఁడు శరభుఁడు విద్యున్మాలి, సంపాతి సూర్యాక్షుఁడు హనుమంతుఁడు వీరబాహుఁడు సుబాహుఁడు మహాత్ముఁడగు నీలుఁడు కుముదుఁడు సుషేణుఁడు తారుఁడు జాంబవంతుఁడు దధివక్త్రుఁడు నీలుఁడు సపాటలుఁడు

కుముదస్య సుషేణస్య తారజాంబవతో స్తథా।
దధివక్త్రస్య నీలస్య సుపాటల సునేత్రయోః॥ ౧౦½
ఏతేషాం కపిముఖ్యానాం రాజమార్గే మహాత్మనామ్।
దదర్శ గృహముఖ్యాని మహాసారాణి లక్ష్మణః॥ ౧౧½
పాండురాభ్రప్రకాశాని దివ్యమాల్యయుతాని చ।
ప్రభూతధనధాన్యాని స్త్రీరత్నైః శోభితానిచ॥ ౧౨½
పాండురేణ తు సాలేన పరిక్షిప్తం దురాసదమ్॥ ౧౩
వానరేంద్రగృహం రమ్యం మహేంద్రసదనోపమమ్
శుక్లైః ప్రాసాదశిఖరైః కైలాస శిఖరోపమైః।
సర్వకామఫలై ర్వృక్షైః పుష్పితై రుపశోభితమ్॥ ౧౪½
మహేంద్రదత్తై శ్శ్రీమద్భి ర్నీలజీమూతసన్నిభైః।
దివ్యపుష్పఫలై ర్వృక్షై శ్శీతచ్ఛాయై ర్మనోరమైః॥ ౧౫½
హరిభి స్సంవృత ద్వారం బలిభి శ్శస్త్రపాణిభిః।
దివ్యమాల్యావృతం శుభ్రం తప్తకాంచనతోరణమ్॥ ౧౬½
సుగ్రీవస్య గృహం రమ్యం ప్రవివేశ మహాబలః।
అవార్యమాణ స్సౌమిత్రి ర్మహాభ్రమివ భాస్కరః॥ ౧౭½
స సప్తకక్ష్యా ధర్మాత్మా నానాజన సమాకులాః॥ ౧౮
ప్రవిశ్య సుమహ ద్గుప్తం దదర్శాంతఃపురం మహత్।

సునేత్రుఁడు మొదలగుమహాత్ములగు కపిశ్రేష్ఠుల మిగులబలముగ నిర్మింపఁబడినవై, తెల్లని మేఘములవలెఁ బ్రకాశించుచుండునవియు, దివ్యమైన పూలహారములతో నలంకరింపఁబడినవియు, విశేషముగ ధనధాన్యములతో నిండినవియు, ఉత్తమురాండ్రగు స్త్రీలతోఁ బ్రకాశించుచుండునవియు నగు గొప్పభవనములను రాజమార్గములో లక్ష్మణుఁడు చూచెను.

(౧౩ మొదలు ౧౮ వరకు) తెల్లని ప్రాకారము చుట్టునుగలదియు, ప్రవేశించుటకు సాధ్యము కానిదియు, మనోహరమై ఇంద్రుని భవనమువలెనుండునదియు, కైలాసశిఖరములతో సమానమై తెల్లగనుండు దేవతాగృహముల మీఁదనుండు గోపురములుగలదియు, మంచిఫలములుగలిగి పూచియుండు వృక్షములతోను, నల్లనిమేఘములతో సమమై వెలుగుచుండునట్టి ఇంద్రుఁడిచ్చిన చల్లనినీడగలిగి మనోహరముగనుండు దేవతార్హమగు పూలుపండ్లు గల వృక్షములతోను ప్రకాశించుచుండునదియు, ఆయుధములుధరించి బలముగలవారై ద్వారములలో కావలికాచుచుండు వానరులు గలదియు, దివ్యమైన పూలహారములుగలదియు, తెల్లగనుండునదియు, పుటము వేసిన బంగారువాకిలిగలదియు. మనోహరమైనదియు, నగుసుగ్రీవుని భవనములో గొప్పబలముగల లక్ష్మణుఁడు అడ్డములేనివాఁడై, సూర్యుఁడుగొప్పమేఘములోఁ బ్రవేశించునటుల, ప్రవేశించును.

(౧౯, ౧౯౪, ౧౫౪,) నానావిధములగు జనులతో నిండియుండు యేడు కక్ష్యములను దాటి మిగులగొప్పదిగను వానరులచే రక్షింపఁబడినదిగను వెలలేని చిత్రాసనములతోను పరచియుండు బంగారు వెండి మంచములతోను, మరికొన్ని

హేమరాజతపర్యంకై ర్బహుభిశ్చ వరాసనైః।
మహార్హా స్తరణోపేతై స్తత్ర తత్రోప శోభితమ్॥ ౧౯
ప్రవిశ న్నేవ సతతం శుశ్రావ మధుర స్వరమ్।
తంత్రీగీతసమాకీర్ణం సమగీతపదాక్షరమ్॥ ౨౦

బహ్వీశ్చ వివిధాకారా రూపయౌవనగర్వితాః।
స్త్రియ స్సుగ్రీవభవనే దదర్శ స మహాబలః॥ ౨౧
దృష్ట్వాఽభిజనసంపన్నా శ్చిత్రమా ల్యకృతస్రజః।
ఫలమాల్యకృతవ్యగ్రా భూషణోత్తమభూషితాః॥ ౨౨

నాతృప్తా న్నాపిచావ్యగ్రా న్నానుదాత్త పరిచ్ఛదాః
సుగ్రీవానుచరాం శ్చాపి లక్షయామాస లక్ష్మణః॥ ౨౩
కూజితం నూపురాణాంచ కాంచీనాం నినదం తథా।
సన్నిశమ్య తత శ్శ్రీమా న్సౌమిత్రి ర్లజ్జితో భవత్॥ ౨౪

రోషవేగప్రకుపిత శ్శ్రుత్వా చాభరణస్వనమ్।
చకార జ్యాస్వనం వీరో దిశ శ్శబ్దేన పూరయన్॥ ౨౫
చారిత్రేణ మహాబాహు రపకృష్ట స్సలక్ష్మణః।
తస్థావేకాంత మాశ్రిత్య రామశోకసమన్వితః॥ ౨౬

మంచి ఆసనములతోను అచ్చటచట ప్రకాశించుచుండు అంతఃపురమును ధర్మాత్ముడగులక్ష్మణుఁడు చూచెను.

(౨౦౪) మనోహరమగు శ్రుతితోఁగూడిన వీణమొదలగు వాద్యములను, తంత్రియొక్క ధ్వనికి సమముగ కంఠముతోఁ బాడుచుండు పాటలను, తంబుర మొదలగు ధ్వనులను అచట లక్ష్మణుఁడు వినెను.

(౨౧౪) గొప్పబలము గలలక్ష్మణుఁడు సౌందర్యము యౌవనముచేగర్వించి నానావిధములగు ఆకారములుఁగల అనేకస్త్రీలను సుగ్రీవుని భవనములోఁజూచెను.

(౨౨౪, ౨౩౪) మంచివంశముగలవారిని, నానారంగుల పూలహారములు ధరించినవారిని, ఫలములు పూలహారములు దెచ్చుటలో సమర్థులుగనుండు వారిని, ఉత్తమమైన ఆభరణములు ధరించుకొనినవారిని, సంతోషించి యుండు వారిని, సమర్థులుగనుండువారిని, అమూల్యములగు వస్త్రములను ఆభరణములను ధరించిన వారిని సుగ్రీవుని అనుచరులలో లక్ష్మణుఁడు చూచెను.

(౨౪౪) పాదములలో ధరించిన గజ్జల వడ్డాణముల ధ్వనినివిని శ్రీమంతుఁడగు లక్ష్మణుఁడు సిగ్గుపడెను.

(౨౫౪) ఆభరణముల ధ్వనినివిని మిగులరోషముచే విశేషముగ కోపము గలవాఁడై వీరుఁడగులక్ష్మణుఁడు అల్లెత్రాటినిగట్టి దానిధ్వనిచేదిక్కులునిండిచెను.

(౨౬౪) గొప్పభుజములు గలవాఁడును, రాముని విషయమై దుఃఖము గలవాఁడును నగు లక్ష్మణుఁడు, సదాచారముతోఁ గూడినవాఁడగుటచే, పరస్త్రీలను జూచి వారుధరించిన ఆభరణముల ధ్వనులను విని సిగ్గుపడి ఉదాసీనుఁడై స్త్రీలులేని ప్రదేశములో నుండెను.

తేన చాపస్వనే నాథ సుగ్రీవః ప్లవగాధిపః।
విజ్ఞాయాగమనం త్రస్త స్సంచచాల వరాసనాత్॥ ౨౬½
అంగదేన యథా మహ్యం పురస్తా త్ప్రతివేదితమ్।
సువ్యక్త మేష సంప్రాప్త స్సౌమిత్రి ర్భ్రాతృవత్సలః॥ ౨౮½

అంగదేన సమాఖ్యాతం జ్యాస్వనేనచ వానరః।
బుబుధే లక్ష్మణం ప్రాప్తం ముఖం చాస్య వ్యశుష్యత॥ ౨౯½
తత స్తారాం హరిశ్రేష్ఠః సుగ్రీవః ప్రియదర్శనామ్।
ఉవాచ హిత మవ్యగ్ర స్త్రాసనంభ్రాంతమానసః॥ 30½

కిన్ను తత్కారణం సుభ్రు ప్రకృత్యా మృదుమానసః।
సరోష ఇవ సంప్రాప్తో యేనాయం రాఘవానుజః॥ 3౧½
కిం పశ్యసి కుమారస్య రోషస్థాన మనిందితే।
నఖల్వకారణే కోప మాహరే న్నరసత్తమః॥ 3౨½

యదస్య కృత మస్మాభి ర్బుధ్యసే కించి దప్రియమ్।
తద్బుద్ధ్యా సంప్రధార్యాశు క్షిప్ర మర్హసి భాషితుమ్॥ 33½
అథవా స్వయ మేవైనం ద్రష్టు మర్హసి భాషితుమ్।
వచనై స్సాన్త్వయుక్తైశ్చ ప్రసాదయితు మర్హసి॥ 3౪½

(౨౭౪) పిమ్మట, వానరరాజగు సుగ్రీవుఁడు అల్లెత్రాటి ధ్వని విని లక్ష్మణుఁడు వచ్చినందుకు భయపడి ఉత్తమమైన సింహాసనమునుండి గడగడలాడి తోకను ఆడించి పూలహారములను తెంచి కోతిచేష్టలు చేసెను.

(౨౮౪) పూర్వము నాతో అంగదుఁడు చెప్పినటులనే అన్నమీఁద మిగుల ప్రీతిగల యీ లక్ష్మణుఁడు సమీపమునకు వచ్చెను. నిజము.

(౨౯౪) అంగదుఁడు చెప్పినందునను, అల్లెత్రాటి ధ్వని విన్నందునను లక్ష్మణుఁడు వచ్చెనని సుగ్రీవుఁడు తెలిసికొని అతని ముఖము వాడిపోయెను.

(3౦౪) వానరశ్రేష్ఠుఁడును సమర్థుఁడును నగు సుగ్రీవుఁడు భయముచే బెదిరిన మనసుగలవాఁడై ప్రియమైన మోము గల తారను జూచి యిటు లనెను.

(3౧౪) మంచి కనుబొమ్మలు గలదానా! స్వభావముచేతనే మిగుల మెత్తనిమనసు గలశ్రీరాముని తమ్ముఁడగు లక్ష్మణుఁడు కోపముగలవాఁడై వచ్చియున్నాఁడు. ఇందుకు కారణమేమి.

(3౨౪) కారణము లేక నరోత్తముఁడగు లక్ష్మణునికి కోపము రాదు. ఓ యుత్తమురాలా! దశరథు కొడుకగు అతనికెందుకు కోపము వచ్చినది. నీ వెఱుంగుదువా.

(33౪) మేము యితనికి కొంచెమైనను అప్రియమైన కార్యమును జేసినది నీకు తెలిసియుండునటులైతే ఆవిషయమును నీవు బాగుగ నాలోచించి త్వరగఁ దెలుపవలయును.

(3౮,౧) అటుల కాకపోయినచో, అతనితో సంభాషించుటకు నీకే యిష్టముండినటులైతే సమాధానముతోఁ గూడినమాటలు చెప్పి అతని అనుగ్రహమును సంపాదించవలయును.

త్వద్దర్శనవిశుద్ధాత్మా న స కోపం కరిష్యతి।
నహి స్త్రీషు మహాత్మానః క్వచి త్కుర్వంతి దారుణమ్॥ 3౫4

త్వయా సాంత్వై రుపక్రాంతం ప్రసన్నేంద్రియ మానసమ్।
తతః కమలపత్రాక్షం ద్రక్ష్యామ్యహ మరిందమమ్॥ 3౬4

సా ప్రస్ఖలంతీ మదవిహ్వలాక్షీ ప్రలంబకాంచీగుణహేమసూ
త్రా। సలక్షణా లక్ష్మణసన్నిధానం జగామ తారా నమితాంగ
యష్టిః॥ 3౭4
స తాం సమీక్ష్యైవ హరీశపత్నీం తస్థావుదాసీనతయా మహా
త్మా। అవాఙ్ముఖో భూన్మనుజేంద్రపుత్ర స్త్రీసన్నికర్షా ద్విని
వృత్తకోపః॥ 3౮4

సా పానయోగా ద్వినివృత్తలజ్జా దృష్టిప్రసాదాచ్చ నరేంద్ర
సూనోః। ఉవాచ తారా ప్రణయప్రగల్భం వాక్యం మహా
ర్థం పరిసాంత్వపూర్వమ్॥ 3౯4
కిం కోపమూలం మనుజేంద్రపుత్ర కస్తే నసంతిష్ఠతి వాఙ్ని
దేశే। కః శుష్కవృక్షం వన మాపతంతం దవాగ్ని మాసీదతి
నిర్విశంకః॥ ౪౦4

(౩౫౪) నిన్నుచూచి శాంతచిత్తుఁడై కోపమును నతఁడువిడుచును, ఏలననఁగా, మహాత్ములు స్త్రీలవిషయములో దారుణమైనపని యెప్పటికిని చేయరు.

(౩౬౪) నీవు సమాధాన పరచినందున ప్రసన్నమైన యింద్రియములు మనసుగలవాఁడును శత్రుసంహారకుఁడును తామరరేకులవంటికన్నులు గలవాఁడును నిచటవచ్చినవాఁడును నగులక్ష్మణుని పిసప నేనుచూచెదను.

(౩౭౪) రమణీయమైన ఆకారముగలదియు, అడుగుమీఁద అడుగుపెట్టుచు పోవునదియు, మధుపానమదముచే నెఱ్ఱగనుండు కన్నులుగలదియు, జారియుండు వడ్డాణము బంగారముతోఁ జేయఁబడిన ఉత్తరజన్నిదము గలదియు, సంభోగ గురుతులుగలదియు, నమ్రముగను కొంచెము వంగియుండు దేహముగలదియు నగు తార లక్ష్మణుని సన్నిధికిఁ బోయెను.

(౩౮౪) దశరథునికొడుకును మహాత్ముఁడును నగులక్ష్మణుఁడు వాలిభార్యయగు తారను జూచి, ఆఁడుదిసమీపమునకు వచ్చినందున, ఉదాసీనుఁడై తలవంచుకొని యుండెను.

(౩౯౪) పానముచేసియుండుటచే సిగ్గువిడిచి యుండుతార, దశరథుని కొడుకగు లక్ష్మణుని, దృష్టిచే అతనికి కోపము తగ్గినదని తెలిసికొని, అతనిమీఁద గలప్రీతిచే గంభీరముగను గొప్పఅర్థముగల సమాధానమును దెలుపు మాటలు పలికెను.

(౪౦౪) ఓ మనుజేంద్రపుత్రా! కోపమునకు కారణమేమి నీయాజ్ఞను మీరినవాఁడెవఁడు. ఎండిపోయినచెట్లు గలవనములో నలుప్రక్కల వ్యాపించియుండు కార్చిచ్చులోఁ బడుట కెవఁడు సాహసించును.

స తస్యావచనం శ్రుత్వా సాంత్వపూర్వ మశంకితమ్।
భూయః ప్రణయదృష్టార్థం లక్ష్మణో వాక్య మబ్రవీత్॥ ౪౧
కి మయం కామవృత్తస్తే లుప్తధర్మార్థసంగ్రహః।
భర్తా భర్తృహితే యుక్తే నచైన మవబుధ్యసే॥ ౪౨

న చింతయతి రాజ్యార్థం నాస్మాన్ శోకపరాయణాన్।
సామాత్యపరిష త్తారే కామ మేవోపసేవతే॥ ౪౩
సమాసాం శ్చతురః కృత్వా ప్రమాణం ప్లవగేశ్వరః।
వ్యతీతాం స్తా న్మదవ్యగ్రో విహర న్నావబుధ్యతే। ౪౪

నహి ధర్మార్థసిద్ధ్యర్థం పాన మేవం ప్రశస్యతే।
పానా దర్థశ్చ ధర్మశ్చ కామశ్చ పరిహీయతే॥ ౪౫
ధర్మలోపో మహాంస్తావ త్కృతే హ్యప్రతికుర్వతః।
అర్థలోపశ్చ మిత్రస్య నాశే గుణవతో మహాన్॥ ౪౬

మిత్రం హ్యర్థగుణశ్రేష్ఠం సత్యధర్మపరాయణమ్।
తద్ద్వయంతు పరిత్యక్తం నతు ధర్మే వ్యవస్థితమ్। ౪౭
తదేవం ప్రస్తుతే కార్యే కార్య మస్మాభిరుత్తరమ్।
యత్కార్యం కార్యతత్త్వజ్ఞే తదుదాహర్తు మర్హసి॥ ౪౮

(౪౧౫) కపటములేక తారపలికిన సమాధానము మాటలువిని లక్ష్మణుఁడు స్నేహముచే ప్రయోజనము గలిగించు మాటలను మరియుఁ జెప్పెను.

(౪౨౫) భర్తకు హితముసేయుటలో నాసక్తిగలదానా! నీభర్త ధర్మార్థములను విడిచి కామపరతంత్రుఁడై యున్నాఁడు. ఈ విషయము నీకువిశదపడి యుండలేదా.

(౪౩౫) తారా! రాజ్యలాభమున దుఃఖించుచుండు మమ్మును దలఁచక మంత్రులతోను వానరులతోను గూడి నీభర్తసదా పానలోలుఁడై యున్నాఁడు.

(౪౪౫) వానరరాజగు నీభర్తసీతను వెతకుటకు నాలుగు నెలలు గడువుయేర్పరచి,మిగులమదించినవాఁడై విహరించుచు గడిచినకాలమును తెలిసికొనలేదు.

(౪౫౫) ధర్మార్థములను బడయగోరువానికి మధుపానముతగదు. మధుపానముచే ధర్మార్థకామములు నశించును.

(౪౬౫) ఉపకారముచేసినవానికి ప్రత్యుపకారము చేయకపోయినటులైతే గొప్ప ధర్మలోపముగలుగును. ప్రత్యుపకారము లభించనందున గుణవంతుఁడగు మిత్రుఁడు ప్రాణమువిడిచినటులైతే అర్థకామములకు గొప్ప హానిగలుగును.

(౪౭౫) సత్యము ధర్మముతో నాసక్తి గలమిత్రుఁడు అర్థకామములకు మూలముగనుండుటచే వానికంటె ఉత్తముఁడు.అట్టిమిత్రుని త్యజించుచుండు సుగ్రీవునిచే, అర్థకామములు విడిచిపెట్టఁబడినవి. ధర్మమును విడువబడినది. •

(౪౮౫) అందుచేత, కార్యముల నిజస్వరూపమును నెఱింగినదానా! ధర్మార్థములకు లోపముగలిగించునట్టి మిత్రపరిత్యాగమునే గురుతుగగల కార్యమిటు లగుచుండగా, మే మిపుడు యేమి చేయవలయును. చెప్పవలయును.

సా తస్య ధర్మార్థసమాధియుక్తం నిశమ్య వాక్యం మధురస్వ
భావమ్ । తారా గతార్థే మనుజేంద్రకార్యే విశ్వాసయుక్తం
త మువాచ భూయః॥ ౪౯

న కోపకాలః క్షితిపాలపుత్ర నచాతికోప స్స్వజనే విధేయః।
త్వదర్థకామస్య జనస్యతస్య ప్రమాద మప్యర్హసి వీరసోఢుమ్॥

కోపం కథంనామ గుణప్రకృష్టః కుమార కుర్యా దపకృష్ట
సత్వే । క స్త్వద్విధః కోపవశంహి గచ్ఛే త్సత్వావరుద్ధ స్తప
సః ప్రసూతిః॥ ౫౧

జానామి రోషం హరివీరబంధో ర్జానామి కార్యస్యచ కాల
సంగమ్ । జానామి కార్యం త్వయి యత్కృతం న స్తచ్చాపి
జానామి యదత్ర కార్యమ్॥ ౫౨

తచ్చాపి జానామి యథాఽవిసహ్యం బలం నరశ్రేష్ఠ శరీరజ
స్య। జానామి యస్మింశ్చ జనేఽవబద్ధం కామేన సుగ్రీవ మస
క్త మద్య॥ ౫౩

న కామతంత్రే తవ బుద్ధి రస్తి త్వం వై యథామన్యువశం
ప్రపన్నః । న దేశకాలౌహి యథార్థధర్మా వవేక్షతే కామరతి
ర్మనుష్యః॥ ౫౪

(౪౯-౪) ధర్మార్థముల సంబంధముగల ఇంపుగనుండు లక్ష్మణుని మాటలు విని, తార వీరి కార్యమిట్టిదని తెలిసికొని, శ్రీరాముని కార్యములో మిగుల విశ్వాసముగల లక్ష్మణునితో, మరియు నిటు లనెను.

(౫౦౪) ఓ రాజపుత్త్రుఁడా! సుగ్రీవుఁడు కామాతురుఁడై యుండుటచే యిది కోపమునకు సమయము కాదు. స్వజనులమీఁద మిగులకోపపడుటతగదు. నీకార్యమును సాధించుటలోనే ఆసక్తిగల సుగ్రీవుని అజాగ్రత్తను, ఓవీరుఁడా! సైచవలయును.

(౫౧౪) బలహీనుని మీఁద గొప్పవీర్యము గలవాఁడు, ఓ రాజపుత్త్రుఁడా! కోపము చేయుటతగునా! సత్త్వగుణము విశేషముగ గలిగి, శాంతికి ఆకరముగనుండు నీవంటివాఁడు కోపపడవచ్చునా.

(౫౨౪) శ్రీరాముని కోపము వ్యర్థము కాదనియు, ఇపుడు చేయవలసిన పనికి ఆలస్యము గలిగినదియు, నే నెఱుంగుదును. వాలిని మీరు చంపి మాకార్యమును జేసినదియు, ఇట్టి యుపకారమునకు మేము చేయవలసిన సీతాన్వేషణము మొదలగు ప్రత్యుపకారమును దెలిసికొనియున్నాను.

(౫౩౪) నరోత్తముఁడా! మన్మథుని బలము సైచుటకు సాధ్యము కాదని నే నెఱుంగుదును. ఇపుడు సుగ్రీవుఁడు సదా కామాతురుఁడై యుండుటను దెలిసికొనియున్నాను.

(౫౪౪) (లక్ష్మణా!) నీవు కోపమునకు స్వాధీనుఁడవుగ నుండుటచే కామతంత్రములో నీకు బుద్ధిచొరలేదు. (అనఁగా నీవు కామతంత్రమును నెరింగి యుండినట్లైతే సుగ్రీవునిమీఁద నీకు కోపము గలుగదనిభావము.) కామపరతంత్రుఁడగు వాఁడు దేశకాలములను ధర్మార్థములను లక్ష్యపెట్టఁడు.

తం కామవృత్తం మమ సన్నికృష్టం కామాభియోగాచ్చ నివృ
త్తలజ్జమ్। క్షమస్వ తావ త్పరవీరహంత స్త్వద్భ్రాతరం వా
నరవంశనాథమ్॥ ౫౫

మహర్షయో ధర్మతపోభికామాః కామానుకామాః ప్రతిబద్ధ
మోహాః। అయం ప్రకృత్యా చపలః కపిస్తు కథం నసజ్జేత సు
ఖేషు రాజా॥ ౫౬

ఇత్యేవ ముక్త్వా వచనం మహార్థం సా వానరీ లక్ష్మణ మప్ర
మేయమ్। పున స్సఖేలం మదవిహ్వలంచ భర్తుర్హితం వాక్య
మిదం బభాషే॥ ౫౭

ఉద్యోగస్తు చిరాజ్ఞప్త స్సుగ్రీవేణ నరోత్తమ।
కామస్యాపి విధేయేన తవార్థప్రతిసాధనే॥ ౫౮

ఆగతాహి మహావీర్యా హరయః కామరూపిణః।
కోటీశతసహస్రాణి నానానగ నివాసినః॥ ౫౯

తదాగచ్ఛ మహాబాహో చారిత్రం రక్షితం త్వయా।
అచ్ఛలం మిత్రభావేన సతాం దారావలోకనమ్॥ ౬౦

(౫౫) కామవ్యాపారము గల వాఁడును నాసమీపములో నుండువాఁడును కామమోహముచే లజ్జను విడిచినవాఁడును వానరవంశమునకు రాజుగనుండువాఁడును నీకుతమ్ముఁడును నగుసుగ్రీవుని, వీరు లగుశత్రువులను జంపువాఁడా! క్షమింపుము.

(౫౬) ధర్మములోను తపస్సులోను ఆసక్తిగల మహర్షులు, అపేక్షగలిగిన పిమ్మట, కామాతురులై స్త్రీలయెడల దృఢమైన వ్యామోహముగలవారుగ నున్నారు. రాజుగనుండు యీకోతి (సుగ్రీవుఁడు) పుట్టుకచేతనే చపలచిత్తుఁడు. ఇఁక సుఖములో నెటుల మనసు నిలుపనివాఁడుగ నుండును.

(౫౭) ఈవిధముగ వానరస్త్రీయగు తార గొప్పఅర్థము గలమాటలు చెప్పి మరల లీలతోఁ గూడి, మదముచే మధురముగను, భర్తకు మేలుగలిగించు మాటను అమితమైన శక్తిగల లక్ష్మణునితో నిటు లనెను.

(౫౮) నరోత్తముఁడా! మన్మథునికి విధేయుఁడుగనుండినను సుగ్రీవుఁడు మీకార్యము సేయుటలో బహుకాలముగ ప్రయత్నము సేయుచునే యున్నాఁడు.

(౫౯) గొప్ప పరాక్రమముగల వారుగను కోరిన రూపము ధరించువారుగను అనేకపర్వతములలో వసించువారుగను నుండు కోట్లసంఖ్యగల వానరులు వచ్చియున్నారు కదా.

(౬౦) అందుచేత, గొప్పభుజములు గలవాఁడా! రమ్ము. అంతఃపురస్త్రీలను జూడరానను సదాచారమును వెలుపలనే యుండి గాపాడితివి. మైత్రిచే అంతఃపురస్త్రీలను జూచుట సత్పురుషులకు దోషము కాదు.

కిష్కింధాకాండ, ౩౮ వ సర్గ.

తారయాచాభ్యనుజ్ఞాత స్త్వరయా చాపి చోదితః।
ప్రవివేశ మహాబాహు రభ్యంతర మరిందమః॥ ౬౧౪

తత స్సుగ్రీవ మాసీనం కాంచనే పరమాసనే।
మహాస్తా స్త రణోపేతే దదర్శాదిత్యసన్నిభమ్॥ ౬౨౪

దివ్యాభరణచిత్రాంగం దివ్యరూపం యశస్వినమ్।
[illegible]ంబరధరం మహేంద్రమివ దుర్జయమ్॥ ౬౩౪

దివ్యాభరణమాల్యాభిః ప్రమదాభి స్సమావృతమ్।
సంరబ్ధతరరక్తాక్షో బభూవాంతకసన్నిభః॥ ౬౮౪

[illegible] వీరః పరిరభ్య గాఢం నరాధిపస్తే వరహేమవర్ణః।
[illegible] సౌమిత్రి మదీనసత్వం విశాలనేత్రి స్సువిశాలనేత్రః॥
ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - త్రియస్త్రింశస్సర్గః.

---

చతుస్త్రింశస్సర్గః.

---

త మప్రతిహతం క్రుద్ధం ప్రవిష్టం పురుషర్షభమ్।
సుగ్రీవో లక్ష్మణం దృష్ట్వా బభూవ వ్యథితేంద్రియః॥ ౧

(౬౧౫) తారచే నాజ్ఞాపింపఁబడి శ్రీరాముని కార్యము త్వరగజరుగవలయునను త్వరగలవాఁడై, శత్రుసంహారకుఁడును గొప్పభుజములు గలవాఁడును నగు లక్ష్మణుఁడు అంతఃపురములోఁ బ్రవేశించెను.

(౬౨౫, ౬౩౫, ౬౪౫) దివ్యమైన ఆభరణములు గలిగి ఆశ్చర్యముగ నగపడుచుండు అవయవములు గలవాఁడును, ఉత్తమమైన సౌందర్యముగలవాఁడును, కీర్తివంతుఁడును, దివ్యమైన పూలహారములు పీతాంబరము ధరించి యుండువాఁడును, ఇంద్రునివలె అజేయుఁడును, దివ్యమైన ఆభరణములు పూలహారములు ధరించిన స్త్రీలమధ్యలో నుండువాఁడును, వెలలేని చిత్రసనముపరచిన ఉత్తమమగు బంగారు పీఠముమీదఁ గూర్చుండి సూర్యునివలె వెలుఁగుచుండు వాఁడును, నగు సుగ్రీవునిజూచి, లక్ష్మణుఁడు మిగుల యెఱ్ఱనికన్నులు గలవాఁడై యమునివలె అగుపడెను.

(౬౫౫) వీరుఁడును రుమాదేవిని గాఢాలింగనముచేసి ఉత్తమమగు ఆసనములోఁ గూర్చుండినవాఁడును ఉత్తమమైన బంగారము కాంతిగలవాఁడును, విశాలమగు నేత్రములుగలవాఁడును నగు సుగ్రీవుఁడు, మిగుల విశాలమగు నేత్రములుగలిగి అపరిమితమగు బలముగల లక్ష్మణుని జూచెను.

ఇది ముప్పది మూఁడవ సర్గ.

---

## ౩౪ వ సర్గ.

(అవతారిక—శ్రీరాముఁడు చెప్పినమాటలను లక్ష్మణుఁడు సుగ్రీవునికిఁ దెలుపుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) ఎవరికిని నెదిరించుటకు సాధ్యముకానివాఁడును కోపముగలవాఁడును పురుషశ్రేష్ఠుఁడును అంతఃపురములోఁ బ్రవేశించినవాఁడును నగు లక్ష్మణుని జూచి సుగ్రీవుఁడు మిగుల భయపడెను.

క్రుద్ధం నిశ్శ్వసమానం తం ప్రదీప్తమివ తేజసా।
భ్రాతు ర్వ్యసనసంతప్తం దృష్ట్వా దశరథాత్మజమ్॥ ౨

ఉత్పపాత హరిశ్రేష్ఠో హిత్వా సౌవర్ణ మాసనమ్।
మహా న్మహేంద్రస్య యథా స్వలంకృత ఇవ ధ్వజః॥ ౩

ఉత్పతంత మనూత్పేతూ రుమాప్రభృతయః స్త్రియః।
సుగ్రీవం గగనే పూర్ణచంద్రం తారాగణా ఇవ॥ ౪

సంరక్తనయన శ్శ్రీమాన్ విచచాల కృతాంజలిః।
బభూవావస్థిత స్తత్ర కల్పవృక్షో మహానివ॥ ౫

రుమాద్వితీయం సుగ్రీవం నారీమధ్యగతం స్థితమ్।
అబ్రవీ లక్ష్మణః క్రుద్ధ స్సతారం శశినం యథా॥ ౬

సత్త్వాభిజనసంపన్న స్సానుక్రోశో జితేంద్రియః।
కృతజ్ఞ స్సత్యవాదీచ రాజా లోకే మహీయతే॥ ౭

యస్తు రాజా స్థితో ధర్మే మిత్రాణా ముపకారిణామ్।
మిథ్యాప్రతిజ్ఞాం కురుతే కో నృశంసతర స్తతః॥ ౮

(౨,౩) కోపము గలిగి నిట్టూర్పు విడుచుచుండువాఁడును తేజస్సుచే వెలుఁగుచుండువాఁడును అన్నకుఁగలిగిన దుఃఖముచే తపించుచుండువాఁడును దశరథునికొడుకును నగు లక్ష్మణునిజూచి, ఆభరణములచే నలంకరింపఁబడిన వాఁడును వానరశ్రేష్ఠుఁడును నగు సుగ్రీవుఁడు బంగారు పీఠమునుండి, ఇంద్రుని గొప్ప ధ్వజమువలె, లేచెను.

(౪) ఆకాశములో పూర్ణచంద్రుని తారాగణములు అనుసరించి పోవునటుల పీఠమువిడిచి లేచుచుండు సుగ్రీవునితోడ రుమా మొదలగు వానరస్త్రీలందరు లేచిరి.

(౫) కామమదముచే ఎఱ్ఱని నేత్రములు గలవాఁడును శ్రీమంతుఁడును నగు సుగ్రీవుఁడు అంజలి చేసికొని గొప్ప కల్పవృక్షమువలె నచటనుండి కంపము నొందెను.

(౬) రుమాదేవితోఁ గూడి నక్షత్రములతోఁ గూడిన చంద్రునివలె నుండువాఁడును, స్త్రీలమధ్యలోనుండువాఁడును నగు సుగ్రీవునితో లక్ష్మణుఁడు మిగుల ఆగ్రహపడి యిటు లనెను.

(౭) సత్త్వగుణము ప్రధానముగ గలవంశములోఁ బుట్టినవాఁడుగను, దయగలవాఁడుగను, కృతజ్ఞుఁడుగను, సత్యసంధుఁడుగను, నుండు రాజు లోకములోఁ బూజింపఁబడుచున్నాఁడు.

(౮) అధర్మములోనుండు రాజు ఉపకారముచేసిన మిత్రులకు ప్రత్యుపకారము సేయునటుల చెప్పి తప్పిపోయినటులైతే, వానికంటె పాపి యింకొకఁడుండఁడు.

శతమశ్వానృతే హంతి సహస్రంతు గవానృతే।
ఆత్మానం స్వజనం హంతి పురుషః పురుషానృతే॥

పూర్వం కృతార్థో మిత్రాణాం న తత్ప్రతికరోతి యః।
కృతఘ్న స్సర్వభూతానాం స వధ్యః ప్లవగేః

గీతోఽయం బ్రహ్మణా శ్లోక స్సర్వలోకనమస్కృతః।
దృష్ట్వా కృతఘ్నం క్రుద్ధేన తం నిబోధ ప్లవంగమ॥

బ్రహ్మఘ్నే చ సురాపే చ చోరే భగ్నవ్రతే తథా।
నిష్కృతి ర్విహితా సద్భిః కృతఘ్నే నాస్తి నిష్కృతిః

అనార్య స్త్వం కృతఘ్నశ్చ మిథ్యావాదీచ వానర।
పూర్వం కృతార్థో రామస్య నత త్ప్రతికరోషి యత్॥

నను నామకృతార్థేన త్వయా రామస్య వానర।
సీతాయా మార్గణే యత్నః కర్తవ్యః కృత మిచ్ఛతా॥

స త్వం గ్రామ్యేషు భోగేషు సక్తో మిథ్యాప్రతిశ్రవః।
న త్వాం రామో విజానీతే సర్పం మండూకరావిణమ్॥

(౯) ఒకగుఱ్ఱమును గోవును నిచ్చునటుల చెప్పి మాటతప్పినవాఁడు నూ
౯ రుగుఱ్ఱములను నూరుగోవులను జంపిన పాపములోఁబోవును. ఒకమనిషి విషయ
మై అబద్ధము చెప్పినటులైతే ఆత్మహత్య స్వజనహత్యచేసిన దోషము సంభవించు
ను. (అనఁగా, మహాపురుషుఁడగు శ్రీరామునివిషయమై అబద్ధమాడినవానికి సర్వ
౧౦ హత్యలుచేసిన పాపము గలుగునని భావము.)

(౧౦) ముందు తనపని దీర్చుకొని కృతార్థుఁడై, మరియు, సర్వప్రాణము
లకు హితులుగనుండు స్నేహితులకు ప్రత్యుపకారము సేయని కృతఘ్నుని, ఓ
వానరరాజా! చంపవలయును.

౧౧

(౧౧) కృతఘ్నునివిషయమై కోపముగలవాఁడై బ్రహ్మచెప్పిన, సకలలో
కములచేనాదరింపఁబడిన శ్లోకమును జెప్పెదను, ఓవానరుఁడా! వినుము.

౧౨ (౧౨) బ్రహ్మహత్య మద్యపానము దొంగలించుట వ్రతభంగముచేయుట
యిట్టిపాపములకు సత్పురుషులు ప్రాయశ్చిత్తము విధించియున్నారు. కృతఘ్ను
నికి ప్రాయశ్చిత్తములేదు.

౧౩ (౧౩) వానరుఁడా! మొదుట నీపని దీర్చుకొని కృతార్థుఁడవై శ్రీరామునికి
ప్రత్యుపకారము సేయకుండుటచే నీవు నీచుఁడవు కృతఘ్నుఁడవు, అబద్ధముచెప్పు
వాఁడవు.

౧౪ (౧౪) వానరుఁడా! కృతార్థుఁడవైన నీవు శ్రీరాముఁడు చేసినయుపకార
మును స్మరించి సీతను వెతకుటలో యత్నము సేయుము. సేయవలయునుకదా.

(౧౫) నీవు నీచమైన సుఖములలో మనసుగలవాఁడవై చెప్పినటులచేయు
క, కప్పను బట్టుకొనుటకై దానివలె అరచుచుండు సర్పమువలె, విశ్వాసఘా
౧౫ తుకుఁడవుగనుండు నిన్ను శ్రీరాముఁడు తెలిసికొనలేక పోయెను,

మహాభాగేన రామేణ పాపః కరుణవేదినా।
హరీణాం ప్రాపితో రాజ్యం త్వం దురాత్మా మహాత్మనా॥ ౧౬.
కృతంచే న్నాభిజానీషే రామస్యాక్లిష్టకర్మణః।
సద్య స్త్వం నిశితై ర్బాణై ర్హతో ద్రక్ష్యసి వాలినమ్॥ ౧౭

న చ సంకుచితః పంథా యేన వాలీ హతో గతః।
సమయే తిష్ఠ సుగ్రీవ మా వాలిపథ మన్వగాః॥ ౧౮
న నూన మిక్ష్వాకువరస్య కార్ముకచ్యుతా న్శరా న్పశ్యసి వ
జ్రసన్నిభాన్ । తత స్సుఖం నామ నిషేవసే సుఖీ న రామకా
ర్యం మనసా ప్యవేక్షసే॥ ౧౯

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - చతుస్త్రింశస్సర్గః.

## పంచత్రింశస్సర్గః.

తథా బ్రువాణం సౌమిత్రిం ప్రదీప్తమివ తేజసా।
అబ్రవీ ల్లక్ష్మణం తారా తారాధిపనిభాననా॥ ౧
నైవం లక్ష్మణ వక్తవ్యో నాయం పరుష మర్హతి।
హరీణా మీశ్వర శ్శ్రోతుం తవ వక్త్రాద్విశేషతః॥ ౨

(౧౬) మిగుల పూజ్యుఁడును దయారసమిట్టిపని తెలిసికొనియుండు వాఁడును మహాత్ముఁడును నగు రాముఁడు, దురాత్ముఁడవగు నీకు కపిరాజ్య పట్టాభిషేకము చేసెను.

(౧౭) పరిశుద్ధమగు వ్యాపారముగల శ్రీరామునికి ప్రత్యుపకారము చేయుటను నీవు ఆలోచించలేదు. ఇపుడే, కరకుగల బాణముతోఁ జంపఁబడిన వాలిని జూడబోవుచున్నావు.

(౧౮) హతుఁడైనవాలి పోయియుండు పరలోకము పాడైపోలేదు. సుగ్రీవుఁడా! మనమేర్పరచుకొనిన సంకేత సమయమును మరచిపోవలదు. వాలి పోయిన మార్గములోఁ బోవలదు.

(౧౯) ఇక్ష్వాకువంశములోఁ బుట్టినవారిలో గొప్పవాఁడగు శ్రీరాముని ధనస్సునుండి విడువఁబడిన బాణములు వజ్రాయుధములవంటివని నీ వెఱుంగవు. నిజము. అందువల్లనే సుఖము ననుభవించుచున్నావు. సుఖములోనుండి శ్రీరాముని పనిని మనసులోను దలఁచలేవు.

ఇది ముప్పదినాలుగవ సర్గ.

---

3౫ వ సర్గ.

(అవతారిక — మఱియు, తార లక్ష్మణుని సమాధానపరచుట యీ సర్గలోఁ దెలుపఁబడుచున్నది.)

(౧) ఇట్లు చెప్పుచు తేజస్సుచే వెలుంగుచుండువాఁడును, సుమిత్రా పుత్రుఁడగు లక్ష్మణునిజూచి, చంద్రునివంటి ముఖముగల తార యిటు లనెను.

(౨) లక్ష్మణా! వానరులకు రాజుగనుండు యీ సుగ్రీవుఁడు నీనోటినుండి విశేషముగ వచ్చుచుండు కఠినోక్తులను వినుటకుఁ దగఁడు.

నైవా కృతజ్ఞ స్సుగ్రీవో న శఠో నాపి దారుణః।
నైవానృతకథో వీర నజిహ్మశ్చ కపీశ్వరః॥ ౩
ఉపకారం కృతం వీరో నాప్యయం విస్మృతః కపిః।
రామేణ వీర సుగ్రీవో యదన్యై ర్దుష్కరం రణే॥ ౪
రామప్రసాదా త్కీర్తించ కపిరాజ్యంచ శాశ్వతమ్।
ప్రాప్తవా నిహ సుగ్రీవో రుమాం మాం చ పరంతప॥ ౫
సుదుఃఖం శయితః పూర్వం ప్రాప్యేదం సుఖ ముత్తమమ్।
ప్రాప్తకాలం నజానీతే విశ్వామిత్రో యథా మునిః॥ ౬
ఘృతాచ్యాం కిల సంసక్తో దశ వర్షాణి లక్ష్మణ।
అహోఽమన్యత ధర్మాత్మా విశ్వామిత్రో మహామునిః॥ ౭
స హి ప్రాప్తం నజానీతే కాలం కాలవిదాం వరః।
విశ్వామిత్రో మహాతేజాః కింపున ర్యః పృథగ్జనః॥ ౮
దేహధర్మం గతస్యాస్య పరిశ్రాంతస్య లక్ష్మణ।
అవితృప్తస్య కామేషు కామం క్షంతు మిహార్హసి॥ ౯
నచ రోషవశం తాత గంతు మర్హసి లక్ష్మణ।
నిశ్చయార్థ మవిజ్ఞాయ సహసా ప్రాకృతో యథా॥ ౧౦
సత్వయుక్తా హి పురుషా స్త్వద్విధాః పురుషర్షభ।
అవిమృశ్య నరోషస్య సహసా యాంతి వశ్యతామ్॥ ౧౧

(౩) కపిరాజగు సుగ్రీవుఁడు మీరుచేసిన ఉపకారమును తలంచనివాఁడు కాఁడు. శఠుఁడునుకాఁడు. కఠినస్వభావము గలవాఁడును గాఁడు. అబద్ధము సెప్పు వాఁడును కాఁడు. కుటిలస్వభావముగలవాఁడు కాఁడు. ఓవీరుఁడా!

(౪) వీరుఁడా! వీరుఁడును వానరుఁడును నగు సుగ్రీవుఁడు యుద్ధములో నితరులకుఁజేయుటకు సాధ్యముకాని శ్రీరాముఁడు చేసిన యుపకారమును మరిచిపోలేదు.

(౫) శత్రువులను తపింపఁజేయువాఁడా! శ్రీరాముని అనుగ్రహముచే కీర్తిని శాశ్వతమగు వానరరాజ్యమును రుమను నన్నుసుగ్రీవుఁడు బడసెను.

(౬) ముందు మిగుల దుఃఖముతో పండుకొనియుండి పిమ్మట యీయుత్తమమైన సుఖమును బడసి, విశ్వామిత్రమహర్షివలె, కడచిన సంకేతసమయమును సుగ్రీవుఁడు తెలిసికొనకున్నాఁడు.

(౭) లక్ష్మణా! ధర్మాత్ముఁడగు విశ్వామిత్రుఁడు మేనకాసక్తుఁడై కడచిన పదిసంవత్సరములను నొకదినముగఁ దలఁచుకొనెను కదా.

(౮) గొప్పతేజస్సుగల కాలజ్ఞానులలో నుత్తముఁడగు విశ్వామిత్రమహర్షి గడచిపోయిన పదిసంవత్సరములను దెలిసికొనలేకపోయెను. సాధారణమైన వారెటుల దెలిసికొనఁగలరు.

(౯) దేహస్వభావమును ననుసరించి కామవిషయములో తృప్తిపొందక మిగుల శ్రమతోఁగూడియుండు యితని అపరాధమును క్షమించవలయును.

(౧౦) సామాన్యమైనవారివలె సుగ్రీవుఁడుచేసిన యేర్పాటును దెలిసికొనక శీఘ్రముగ, ఓ లక్ష్మణా! కోపము తెచ్చుకొనుట నీకు తగదు. ఓతండ్రీ!

(౧౧) పురుషోత్తముఁడా! సత్త్వగుణముగల నీవంటివారు యోచించక రోషమునకు వశ్యులుగారు.

పరిసాదయే త్వాం ధర్మజ్ఞ సుగ్రీవార్థే సమాహితా।
మహా న్రోష సముత్పన్న స్సంరంభ స్త్యజ్యతా మయమ్॥ ౧౨
రుమాం మాం కపిరాజ్యంచ ధనధాన్యవసూనిచ।
రామప్రియార్థం సుగ్రీవ స్త్యజే దితి మతి ర్మమ॥ ౧౩
సమానేష్యతి సుగ్రీవ స్సీతయాసహ రాఘవమ్।
శశాంకమివ రోహిణ్యా నిహత్వా రావణం రణే॥ ౧౪
శతకోటిసహస్రాణి లంకాయాం కిల రాక్షసాః॥ ౧౪½
అయుతానిచ షట్త్రింశ త్సహస్రాణి శతానిచ। ౧౫
అహత్వా తాంశ్చ దుర్ధర్షా న్రాక్షసా న్కామరూపిణః।
నశక్యో రావణో హంతుం యేన సా మైథిలీ హృతా॥ ౧౬
తే న శక్యా రణే హంతు మసహాయేన లక్ష్మణ।
రావణః క్రూరకర్మాచ సుగ్రీవేణ విశేషతః॥ ౧౭
ఏవ మాఖ్యాతవా న్వాలీ సహ్యాభిజ్ఞో హరీశ్వరః।
ఆగమస్తు నమే వ్యక్త శ్శ్రవా త్తస్మా ద్బ్రవీమ్యహమ్॥ ౧౮
త్వత్సహాయనిమిత్తం వై ప్రేషితా హరిపుంగవాః।
ఆనేతుం వానరా న్యుద్ధే సుబహూ న్హరియూధపాన్॥ ౧౯
తాంశ్చ ప్రతీక్షమాణోఽయం విక్రాంతా న్సుమహాబలాన్।
రాఘవస్యార్థసిద్ధ్యర్థం న నిర్యాతి హరీశ్వరః॥ ౨౦

(౧౨) ధర్మజ్ఞుఁడా! సుగ్రీవుని విషయములో నేను జాగ్రత్తగలదాని నై నిన్ను వేడుకొనుచున్నాను. నీకు మిగుల కోపమువచ్చియున్నది. ఇట్టి కోపావేశమును విడువుము.

(౧౩) శ్రీరామునికిఁ బ్రియము సేయుటకు సుగ్రీవుఁడు రుమను నన్ను కిష్కింధను ధనధాన్యములను నిధులను విడిచిపెట్టును. ఇది నా యభిప్రాయము.

(౧౪) యుద్ధములో రావణునిజంపి, రోహిణితోఁ జంద్రునిజేర్చునటుల, సీతాదేవితోడ శ్రీరాముని జేర్చును.

(౧౪½) లంకలో కోట్లసంఖ్యగల రాక్షసులు ఉన్నారు కదా.

(౧౫,౧౬) ఇతరులకు జయించుటకు సాధ్యపడని కోరినరూపమును దాల్చు ఆరాక్షసులను జంపక సీతను నపహరించుకొనిపోయిన రావణుని జంపుటకు సాధ్యపడదు.

(౧౭) రాక్షసులను యుద్ధములోఁ జంపుట కష్టము. సుగ్రీవునికి మరి కొందరు సహాయము చేయకపోయినటులైతే యితఁడొకఁడె నీచుఁడగు రావణుని జంపలేఁడు.

(౧౮) లక్ష్మణా! వానరరాజగువాలి యిటుల నాతోఁజెప్పెను. అతఁడు మిగుల ప్రాజ్ఞుఁడు. ఈవిషయము నాకు బాగుగఁ దెలియదు. అతఁడు చెప్పినది విని చెప్పుచున్నాను.

(౧౯) అందుచేత, యుద్ధములో సహాయపడుటకై అనేకులగు వానరసేనాపతులను బిలుచుకొనివచ్చుటకు వానరవీరులను సుగ్రీవుఁడు బంపియున్నాఁడు.

(౨౦) ప్రసిద్ధులై గొప్పబలముగల వానరులరాకను నెదురుచూచుచుండు వానరరాజగు యీసుగ్రీవుఁడు శ్రీరామునికార్యమును జేయుటకై ప్రయాణము కాకున్నాఁడు.

కృతాతు సంస్థా సౌమిత్రే సుగ్రీవేణ యథా పురా।
అద్య తైర్వానరైస్సర్వై రాగంతవ్యం మహాబలైః॥ ౨౧
ఋక్షకోటిసహస్రాణి గోలాంగూలశతాని చ।
అద్య త్వా ముపయాస్యంతి జహి కోప మరిందమ॥ ౨౨
కోట్యోఽనేకాస్తు కాకుత్స్థ కపీనాం దీప్తతేజసామ్॥ ౨౨½
తవ హి ముఖ మిదం నిరీక్ష్య కోపా త్క్షతజనిభే నయనే నిరీక్ష
మాణాః। హరివరవనితా నయాంతి శాంతిం ప్రథమభయస్య
హి శంకితా స్స్మ సర్వాః॥ ౨౩½

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే పంచత్రింశస్సర్గః.

## షట్ త్రింశస్సర్గః.

ఇత్యుక్త స్తారయా వాక్యం ప్రశ్రితం ధర్మసంహితమ్।
మృదుస్వభావ స్సౌమిత్రిః ప్రతిజగ్రాహ తద్వచః॥ ౧
తస్మి న్ప్రతిగృహీతేతు వాక్యే హరిగణేశ్వరః।
లక్ష్మణా త్సుమహ త్త్రాసం వస్త్రం క్లిన్న మివాత్యజత్॥ ౨
తతః కంఠగతం మాల్యం చిత్రం బహుగుణం మహత్।
చిచ్ఛేద విమద శ్చాసీ త్సుగ్రీవో వానరేశ్వరః॥ ౩

(౨౧) లక్ష్మణా! సీతాన్వేషణకార్యమునకై సుగ్రీవుఁడు నీరాకకు ముందుగనే, ౧౫ దినములలో నందరు వచ్చి చేరవలయునని వానరులకుఁ జెప్పిపంపెను. గొప్పబలము గలవానరులందరు నేఁడు రావలసియున్నది.

(౨౨, ౨౪) శత్రుసంహారకుఁడా! అనేకకోట్ల యెలుగుబంట్లు కొండముచ్చులు, ప్రకాశించుచుండు తేజస్సుగల కోట్లకొలది వానరులు, లక్ష్మణుఁడా! యిపుడు నీసమీపమునకువచ్చి చేరుదురు. కోపము విడువుము.

(౨౩) ఓ లక్ష్మణ! నీముఖమును చూచి వాలివధవల్ల గలిగిన భీతి శంకగలవారై వానరశ్రేష్ఠుల భార్యలందరు రోషమువల్ల రక్తమువంటి వర్ణముగల నీకన్నులను జూచుచు చిత్తశాంతిని బడయలేదు.

ఇది ముప్పదియైదవ సర్గ.

---

## ౩౬ వ సర్గ.

(అవతారిక.— లక్ష్మణుఁడు సుగ్రీవుఁడు సమాధానపడి సంభాషించుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) ఈవిధముగ మిగులవినయముగను ధర్మముగను తారపలికిన పలుకులు విని మెత్తని స్వభావముగల లక్ష్మణుఁడు ఆపె మాటలను నంగీకరించెను.

(౨) తారచెప్పిన మాటలను లక్ష్మణుఁడు అంగీకరించగా వానరరాజగు సుగ్రీవుఁడు, తడివస్త్రమును విడిచివేసినటుల, లక్ష్మణునివల్ల గలిగిన గొప్ప భయమును విడిచెను.

(౩) పిమ్మట, వానరరాజగు సుగ్రీవుఁడు మెడలలో ధరించిన నానారంగులుగల మిగులసంతోషమును నిచ్చునట్టి దివ్యమైన హారమును వినయముతోఁ దీసివైచి, మదము విడిచి యుండెను.

స లక్ష్మణం భీమబలం సర్వవానరసత్తమః।
అబ్రవీ త్ప్రశ్రితం వాక్యం సుగ్రీవ స్సంప్రహర్షయన్॥ ౪
ప్రణష్టా శ్రీశ్చ కీర్తిశ్చ కపిరాజ్యంచ శాశ్వతమ్।
రామప్రసాదా త్సౌమిత్రే పునః ప్రాప్త మిదం మయా॥ ౫

క శ్శక్త స్తస్య దేవస్య ఖ్యాతస్య స్వేన కర్మణా।
తాదృశం విక్రమం వీర ప్రతికర్తు మరిందమ॥ ౬
సీతాం ప్రాప్స్యతి ధర్మాత్మా వధిష్యతిచ రావణమ్।
సహాయమాత్రేణ మయా రాఘవ స్స్వేన తేజసా॥ ౭

సహాయకృత్యం కిం తస్య యేన సప్త మహాద్రుమాః।
శైలశ్చ వసుధాచైవ బాణేనైకేన దారితాః॥ ౮
ధను ర్విస్ఫారయాణస్య యస్య శబ్దేన లక్ష్మణ।
సశైలా కంపితా భూమి స్సహాయై స్తస్య కిన్ను వై॥ ౯

అనుయాత్రాం నరేంద్రస్య కరిష్యేఽహం నరర్షభ।
గచ్ఛతో రావణం హంతుం వైరిణం సపురస్సరమ్॥ ౧౦
యది కించి దతిక్రాంతం విశ్వాసా త్ప్రణయేన వా।
ప్రేష్యస్య క్షమితవ్యం మే నక శ్చిన్నాపరాధ్యతి॥ ౧౧

(౪) వానరులందరిలోను నుత్తముఁడగు సుగ్రీవుఁడు భయంకరమైన బలముగల లక్ష్మణునికి మిగులసంతోషము గలిగించుచు వినయముతో నిట్లులనెను.

(౫) నష్టమైన యైశ్వర్యము కీర్తి శాశ్వతమగు వానరరాజ్యమును, ఓలక్ష్మణా! రాముని అనుగ్రహముచే నేను మరియు పొందితిని.

(౬) తనసదాచారముచేఁ బ్రసిద్ధుఁడై వెలుంగుచుండు శ్రీరామునియొక్క అట్టిపరాక్రమమునకు, ఓవీరుఁడా! శత్రుసంహారకుఁడా! ప్రత్యుపకారమెవ్వఁడు సేయగలఁడు.

(౭) ధర్మాత్ముఁడగు శ్రీరాముఁడు సీతను బడసి, నిమిత్తమాత్రముగనుండు నాసహాయమును నుంచుకొని, అతని పరాక్రమము చేతనే రావణుని జంపును.

(౮) గొప్ప సప్తసాలవృక్షములను పర్వతమును భూమిని నొకబాణముతో బద్దలు సేసెను. అట్టి రామునికి నాసహాయమెందులకు.

(౯) లక్ష్మణా! రాముఁడు ధనుష్టంకారముచేసిన ధ్వనితోనే కొండలతోఁ గూడినభూమి గడగడలాడినది. అట్టి రామునికి నాసహాయముచే నేమిలాభము.

:

(౧౦) నరశ్రేష్ఠుఁడా! శత్రువుగనుండు రావణుని సపరివారముగ జంపుటకై పోవుచుండగా శ్రీరాముని అనుసరించి నేను పోయెదను.

(౧౧) ఆశ్రితుఁడుగ నుండువాఁడు అపరాధముచేసినను బాధించఁడను నమ్మకముచేతను, ఇక, స్నేహముచేతను, అతిక్రమించి దాసుఁడనగు నేను చేసిన అపరాధమును క్షమించవలయును. సేవకులలో నపరాధము సేయనివాఁడు లేఁడు.

ఇతి తస్య బ్రువాణస్య సుగ్రీవస్య మహాత్మనః।
అభవ ల్లక్ష్మణః ప్రీతః ప్రేష్ణా చైన మువాచహ॥ ౧౨
సర్వథాహి మమ భ్రాతా సనాథో వానరేశ్వర।
త్వయా నాథేన సుగ్రీవ ప్రశ్రితేన విశేషతః॥ ౧౩

య స్తే ప్రభావ స్సుగ్రీవ యచ్చ తే శౌచ మార్జవమ్।
అర్హ స్త్వం కపిరాజ్యస్య శ్రియం భోక్తు మనుత్తమామ్॥ ౧౪
సహాయేనచ సుగ్రీవ త్వయా రామః ప్రతాపవాన్।
వధిష్యతి రణే శత్రూ న్నచిరా న్నాత్ర సంశయః॥ ౧౫

ధర్మజ్ఞస్య కృతజ్ఞస్య సంగ్రామేష్వనివర్తినః।
ఉపపన్నంచ యుక్తంచ సుగ్రీవ తవ భాషితమ్॥ ౧౬
దోషజ్ఞ స్సతి సామర్థ్యే కోఽన్యో భాషితు మర్హతి।
వర్జయిత్వా మమ జ్యేష్ఠం త్వాంచ వానరసత్తమ॥ ౧౭

సదృశ శ్చాసి రామస్య విక్రమేణ బలేన చ।
సహాయో దైవతై ర్దత్త శ్చిరాయ హరిపుంగవ॥ ౧౮
కింతు శీఘ్ర మితో వీర నిష్క్రామ త్వం మయాసహ।
సాంత్వయస్వ వయస్యం త్వం భార్యాహరణకర్శితమ్॥ ౧౯

(౧౨) ఈవిధముగ మహాత్ముఁడగు సుగ్రీవుఁడు చెప్పగా విని లక్ష్మణుఁడు సంతోషించి ప్రేమతో అతనితో నిటు లనెను.

(౧౩) వానరరాజా! మిగుల వినయముగలిగి నాథుఁడుగనుండు నిన్ను బడసి నాయన్నయగు శ్రీరాముఁడు అన్నివిధములలోను నాథుఁడు గలవాఁడా యెను.

(౧౪) సుగ్రీవుఁడా! నీప్రభావము సదాచారము ఋజుస్వభావముచే ఉత్తమమగు వానరరాజ్య పదవిని అనుభవించుటకుఁ దగియున్నావు.

(౧౫) ప్రతాపముగల శ్రీరాముఁడు, సుగ్రీవుఁడా! నీసహాయముచే యుద్ధములో శత్రువులను శీఘ్రముగనే చంపును. ఇందుకు సందేహములేదు.

(౧౬) సుగ్రీవుఁడా! రాజధర్మమును నెఱింగి కృతజ్ఞుఁడవై యుద్ధములో వెనుకతీయని నీమాట మిగులబాగుగను యుక్తియుక్తముగను నున్నది.

(౧౭) వానరోత్తముఁడా! నాయన్నయగు రాముఁడు నీవుతప్ప, శత్రువులను జయించు శక్తియుండెనగా, స్వదోషమును నెఱింగి యిటుల యెవఁడు పలుకును.

(౧౮) వానరశ్రేష్ఠుఁడా! పరాక్రమములోను బలములోను శ్రీరాముని కీసముఁడుగ నున్నావు. దేవతలే యిట్టిసహాయమును శ్రీరామునికి, బహుకాలమునకు, ప్రసాదించిరి.

(౧౯) మరియు, వీరుఁడా! నాతోడ యిచటినుండి నీవు శీఘ్రముగఁ బ్రయాణముచేసి భార్యను బోగొట్టుకొని దుఃఖించుచుండు స్నేహితుఁడగు శ్రీరామునికి సమాధానము చెప్పవలయును.

యచ్చ శోకాభిభూతస్య శ్రుత్వా రామస్య భాషితమ్।
మయా త్వం పరుషాణ్యుక్త స్తచ్చ త్వం క్షంతు మర్హసి॥ ౨౦
ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - షట్త్రింశస్సర్గః.

## సప ంశస్సర్గః.

ఏవ ముక్తస్తు సుగ్రీవో లక్ష్మణేన మహాత్మనా।
హనూమంతం స్థితం పార్శ్వే సచివం త్విద మబ్రవీత్॥ ౧
మహేంద్రహిమవద్వింధ్య కైలాసశిఖరేషు చ।
మందరే పాండుశిఖరే పంచశైలేషు యే స్థితాః॥ ౨
తరుణాదిత్యవర్ణేషు భ్రాజమానేషు సర్వతః।
పర్వతేషు సముద్రాంతే పశ్చిమాయాంతు యే దిశి॥
ఆదిత్యభవనే చైవ గిరౌ సంధ్యాభ్రసన్నిభే।
పద్మతాళవనం భీమం సంశ్రితా హరిపుంగవాః॥ ౪
అంజనాంబుదసంకాశాః కుంజరప్రతిమౌజసః।
అంజనే పర్వతే చైవ యే వసంతి ప్లవంగమాః॥ ౫
మనశ్శిలా గుహావాసా వానరాః కనకప్రభాః।
మేరుపార్శ్వగతా శ్చైవ యే ధూమ్రగిరిసంశ్రితాః॥ ౬

(౨౦) (అవతారిక — అతఁడు పలికిన కఠినోక్తులు రాముఁడు చెప్పి పంపెనను శంక సుగ్రీవునికి గలుగకుండుటకై ఆమాటలను తానే చెప్పినటుల అందుకు తన్ను క్షమించవలయునని లక్ష్మణుఁ డనుచున్నాఁడు.) మిగుల దుఃఖించుచుండు శ్రీరామునిమాట విని, నేను వినతగని కఠినోక్తులను నీతోఁ బలికితిని. అందుకు నన్ను నీవు క్షమించవలయును, సుగ్రీవుఁడా!

ఇది ముప్పదియారవ సర్గ.

౩౭ వ సర్గ.

(అవతారిక — వానరులందరు వచ్చి చేరుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) మహాత్ముఁడగు లక్ష్మణుఁ డిట్లు చెప్పఁగా, సుగ్రీవుఁడు సమీపములో నిలిచియుండు మంత్రియగు హనుమంతునితో నిటు లనెను.

(౨) మహేంద్రము హిమవంతము వింధ్యము కైలాసము తెల్లనిశిఖరములు గలమందర అను నీ ఐదు పర్వతములలోను,

(౩) బాలసూర్యుని కాంతిగలిగి ప్రకాశించుచుండు పడమటిదిక్కులో ఆ స్తగిరిపరికునుండు పర్వతములలోను,

(౪) సంధ్యాకాల మేఘమువలెనుండు ఉదయపర్వతములోను, భయంకరమగు చంపన తాటివృక్షముల వనములలోను నుండు వానరశ్రేష్ఠులను,

(౫) నల్లని మేఘమువలెఁ బ్రకాశించుచు యేనుఁగువంటి పరాక్రమము గలిగి అంజన పర్వతములో నుండు వానరులను,

(౬) అనేకవిధములగు గైరికాది ధాతువులు గలగుహలలో వసించుచు బంగారువంటి దేహకాంతిగల వానరులను, మేఘపర్వతము ప్రక్కలలో నుండు వానరులను, ధూమ్రగిరిలోనుండు వానరులను,

తరుణాదిత్యవర్ణాశ్చ పర్వతేచ మహారుణే।
పిబంతో మధుమైరేయం భీమవేగాః ప్లవంగమాః॥ ౭
వనేషుచ సురమ్యేషు సుగంధిషు మహత్సుచ।
తాపసానాంచ రమ్యేషు వనాంతేషు సమంతతః॥ ౮

తాంస్తాన్ సమానయ క్షిప్రం పృథివ్యాం సర్వవానరాన్।౮½
సామదానాదిభి స్సర్వై రాశు ప్రేషయ వానరాన్॥ ౯
ప్రేషితాః ప్రథమం యేచ మయా దూతా మహాజవాః।
త్వరణార్థం తు భూయ స్త్వం హరీ న్సంప్రేషయాపరాన్॥ ౧౦

యే ప్రసక్తాశ్చ కామేషు దీర్ఘసూత్రాశ్చ వానరాః।
ఇహానయస్వ తా న్సర్వాన్ శీఘ్రం తు మమ శాసనాత్॥
అహోభి ర్దశభి ర్యేహి నాగచ్ఛంతి మమాజ్ఞయా।
హంతవ్యా స్తే దురాత్మానో రాజశాసనదూషకాః॥ ౧౨

శతాన్యథ సహస్రాణాం కోట్యశ్చ మమశాసనాత్।
ప్రయాంతు కపిసింహానాం దిశో మమ మతే స్థితాః॥ ౧౩
మేఘపర్వతసంకాశా శ్ఛాదయంత ఇవాంబరమ్।
ఘోరరూపాః కపిశ్రేష్ఠా యాంతు మచ్ఛాసనా దితః॥ ౧౪

(౬) బాలసూర్యునివంటి కాంతిగలిగి మధువును సురను పానము సేయుచు భయంకరమైన వేగముగల మహారుణమను పర్వతములోఁగల వానరులను,

(౭) మిగుల అందమై సువాసనగలిగి విశాలముగనుండు అరణ్యములలోనుండు వానరులను, ఋషులయొక్క రమ్యమగు వనముల మధ్యలోనుండు వానరులను,

(౮) ఇంకను భూమిలో నచ్చటచట గలవానరులందరిని శీఘ్రముగఁ బిలుపింపుము.

(౯) సామదానాది ఉపాయములచే శీఘ్రముగ వానరులను బిలుచుకొని వచ్చుటకు దూతలను బంపుము.

(౧౦) మిగుల వేగముగఁ బోఁగల దూతలను యింతకుమునుపే వానరులను బిలుచుకొనివచ్చుటకుఁ బంపియున్నాను. మరియు, వారిని త్వరగఁ బిలుచుకొని వచ్చుటకై నీవు కొందరు వానరులను బంపుము.

(౧౧) కొందఱు వానరులు కామాసక్తులై ప్రయాణము సేయుచు వారివలెనే కాలముగడుపుచుందురు. నాయాజ్ఞచే శీఘ్రముగ అట్టివానరులను బిలిపించవలయును.

(౧౨) పదిదినములలోఁగా నాయాజ్ఞప్రకారము రాకుండు దురాత్ములై రాజు ఆజ్ఞను లక్ష్యపెట్టని వానరులకు మరణదండన విధించవలసినదేను.

(౧౩) నాయాజ్ఞకు లోఁబడియుండు కోట్లకొలది వానరులను బిలుచుకొనివచ్చుటకు అనేకులగు వానరులను బంపుము.

(౧౪) మేఘములతోను పర్వతములతోలను సమానులై ఆకాశమునుగప్పుకొనుచుండు వారివలెనుండు భయంకరులగు వానరశ్రేష్ఠులు, యిచటినుండి నాయాజ్ఞచే, వానరులను బిలుచుకొని వచ్చుటకుఁ బోవలయును.

తే గతిజ్ఞా గతిం గత్వా పృథివ్యాం సర్వవానరాః।
ఆనయంతు హరీ న్సర్వాం స్త్వరితా శ్శాసనాన్మమ॥ ౧౫
తస్య వానరరాజస్య శ్రుత్వా వాయుసుతో వచః।
దిక్షు సర్వాసు విక్రాంతాన్ ప్రేషయామాస వానరాన్॥ ౧౬
తే పదం విష్ణువిక్రాంతం పతత్రిజ్యోతిరధ్వగాః।
ప్రయాతాః ప్రహితా రాజ్ఞా హరయ స్తత్క్షణేన వై॥ ౧౭
తే సముద్రేషు గిరిషు వనేషు చ సరస్సుచ।
వానరా వానరా న్సర్వాన్ రామహేతో రచోదయన్॥ ౧౮
మృత్యుకాలోపమస్యాజ్ఞాం రాజరాజస్య వానరాః।
సుగ్రీవస్యాయయు శ్శ్రుత్వా సుగ్రీవభయదర్శినః॥ ౧౯
తత స్తేంజనసంకాశా గిరే స్తస్మా న్మహాజవాః।
తిస్రః కోట్యః ప్లవంగానాం నిర్యయు ర్యత్ర రాఘవః॥ ౨౦
అస్తం గచ్ఛతి యత్రార్క స్తస్మిన్ గిరివరే స్థితాః।
తప్తహేమమహాభాస స్తస్మా త్కోట్యో దశ చ్యుతాః॥ ౨౧
కైలాసశిఖరేభ్యశ్చ సింహకేసరవర్చసామ్।
తతః కోటిసహస్రాణి వానరాణా ముపాగమన్॥ ౨౨
ఫలమూలేన జీవంతో హిమవంత ముపాశ్రితాః।
తేషాం కోటిసహస్రాణాం సహస్రం సమవర్తత॥ ౨౩

(౧౫) వానరులు వసించుచుండు ప్రదేశములను నెరింగిన దూతలందరు భూమిలోనంతయు సంచరించి నాయాజ్ఞచే అచ్చటచట గల వానరులను బిలుచుకొని రావలయును.

(౧౬) వానరరాజగు సుగ్రీవుని మాటవిని వాయుపుత్రుడగు హనుమంతుడు ప్రసిద్ధులగు దూతలను నన్నిదిక్కులకును బంపెను.

(౧౭) రాజగు సుగ్రీవునిచే బంపబడినవానరులు పక్షులు నక్షత్రములు గల ఆకాశమార్గములలో బోయిరి.

(౧౮) వానరదూతలు సముద్రతీరములలోను కొండలలోను వనములలోను సరస్సుల తీరములలోను నుండు వానరులనందరిని, రామునికి సహాయము సేయుటకు రావలయునని, బిలిచిరి.

(౧౯) కాలమృత్యువుతో సముడగు రారాజగు సుగ్రీవుని ఆజ్ఞను విని వానరులు, ఆతనికి భయపడినవారై, వచ్చిచేరిరి.

(౨౦) పిమ్మట అంజనాద్రితో సమానమైన గొప్ప వేగముగల మూడుకోట్ల వానరులు అంజనాద్రినుండి శ్రీరాముడుండు చోటికి వచ్చిరి.

(౨౧) సూర్యుడు అస్తమించు కొండమీదనుండు కుందనమువంటి దేహకాంతిగల పదికోట్లవానరులు వచ్చిరి.

(౨౨) సింహము జడలవంటి కాంతిగల వేయికోట్ల వానరులు కైలాసశిఖరములనుండి వచ్చిరి.

(౨౩) ఫలములు కందమూలములు భక్షించి జీవించుచుండు వేయికోట్ల వానరులు హిమాలయమునుండి వచ్చిరి.

అంగారకసమానానాం భీమానాం భీమకర్మణామ్।
వింధ్యా ద్వానరకోటీనాం సహస్రాణ్యపత న్ద్రుతమ్॥ ౨౪
క్షీరోదవేలానిలయా స్తమాలవనవాసినః।
నారికేళాశనా శ్చైవ తేషాం సంఖ్యా న విద్యతే॥ ౨౫
వనేభ్యో గహ్వరేభ్యశ్చ సరిద్భ్యశ్చ మహాజవా।
ఆగచ్ఛ ద్వానరీ సేనా పిబంతీవ దివాకరమ్॥ ౨౬
యేతు త్వరయితుం యాతా వానరా స్సర్వవానరాన్।
తే వీరా హిమవచ్ఛైలం దదృశు స్తం మహాద్రుమమ్॥ ౨౭
తస్మి న్గిరివరే రమ్యే యజ్ఞో మాహేశ్వరః పురా।
సర్వదేవమనస్తోషో బభౌ దివ్యో మనోహరః॥ ౨౮
అన్ననిష్యందజాతాని మూలానిచ ఫలానిచ।
అమృతాస్వాదకల్పాని దదృశు స్తత్ర వానరాః॥ ౨౯
తదన్నసంభవం దివ్యం ఫలం మూలం మనోహరమ్।
యః కశ్చి త్సకృ దశ్నాతి మాసం భవతి తర్పితః॥ ౩౦
తాని మూలాని దివ్యాని ఫలానిచ ఫలాశనాః।
ఔషధానిచ దివ్యాని జగృహు ర్హరియూథపాః॥ ౩౧
తస్మాచ్చ యజ్ఞాయతనా త్పుష్పాణి సురభీణిచ।
ఆనిన్యు ర్వానరా గత్వా సుగ్రీవప్రియకారణాత్॥ ౩౨

(౨౪) నిష్ఠూకణములతో సములై భయంకరులై భయంకరమైన కార్యములు సేయుచుండు వేయికోట్ల వానరులు వింధ్యపర్వతమునుండి వచ్చిచేరిరి.

(౨౫) క్షీరసముద్రము తీరములోను తమాలవనములోను వసించుచు టెంకాయలు భక్షించుచుండిన వానరులు త్వరగ వచ్చిచేరిరి. వీరిందరని లెక్కలేదు.

(౨౬) వనములు గుహాలు నదీతీరములనుండి సూర్యుని మ్రింగివేయునటుల వానరులసేన మిగుల వేగముగ వచ్చిచేరెను.

(౨౭) వానరులనందరిని బిలుచుకొనివచ్చుటను పోయిన వీరులగు వానరదూతలు గొప్ప వృక్షములుగల హిమవంతమును జూచిరి.

(౨౮) పూర్వము మనోహరముగనుండు యీ హిమవంతములో సకలదేవతల మనసును సంతోషపరచునట్టి శ్రేష్ఠమై మనోహరమై రుద్రుడు చేసినయాగము ప్రకాశించినది.

(౨౯) ఆయజ్ఞశాలలో హోమద్రవ్యముగు ఆజ్యాదిధారలచే గలిగి ఆమృతమువలె రుచిగనుండు కందమూలములను ఫలములను జూచిరి.

(౩౦) హోమద్రవ్యముగు ఆజ్యాదులచే గలిగిన శ్రేష్ఠమై మనోహరముగనుండు ఫలములను గడ్డలను నెవ్వడైన నొకసారి భక్షించినను అతడొక మాసమువరకు ఆకలిలేక సుఖముగనుండును.

(౩౧) ఫలములు భక్షించునట్టి వానరసేనాపతులు యాగశాలలోనుండు శ్రేష్ఠములగు గడ్డలను ఫలములను ఓషధులను గ్రహించిరి.

(౩౨) ఆ యాగశాలనుండి మంచివాసన గలపూలను వానరులు సుగ్రీవునికి సంతోషము గలిగించుటకు దెచ్చిరి.

తేతు సర్వే హరివరాః పృథివ్యాం సర్వవానరాన్।
సంచోదయిత్వా త్వరితా యూథానాం జగ్ము రగ్రతః। 33
తేతు తేన ముహూర్తేన యూథపా శ్శీఘ్రగామినః।
కిష్కింధాం త్వరయా ప్రాప్తా స్సుగ్రీవో యత్ర వానరః॥ 3४
తే గృహీత్వౌషధీ స్సర్వాః ఫలం మూలంచ వానరాః।
తం ప్రతిగ్రాహయామాసు ర్వచనం చేద మబ్రువన్॥ 3౫
సర్వే పరిగతా శ్శైలా స్సముద్రాశ్చ వనానిచ।
పృథివ్యాం వానరా స్సర్వే శాసనా దుపయాంతి తే॥ 3౬
ఏవం శ్రుత్వా తతో హృష్ట స్సుగ్రీవః ప్లవగాధిపః।
ప్రతిజగ్రాహ తత్ప్రీత స్తేషాం సర్వ ముపాయనమ్॥ 3౭
ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - సప్తత్రింశస్సర్గః.

## అష్ట ంశస్సర్గః

ప్రతిగృహ్యచ తత్సర్వ ముపాయన ముపాహృతమ్।
వానరా న్సాంత్వయిత్వాచ సర్వానేవ వ్యసర్జయత్॥ ౧
విసర్జయిత్వా స హరీన్ శూరాం స్తా న్కృతకర్మణః
మేనె కృతార్థ మాత్మానం రాఘవంచ మహాబలమ్॥ ౨

(౩౩) దూతలగు వానర శ్రేష్ఠులందరు భూమిలోఁగల వానరులనందరిని ప్రయాణముసేయించి శీఘ్రముగ వారికి ముందుపోయిరి.

(౩౪) సేనాధిపతులుగనుండు వానరులు ఆముహూర్తములోనే శీఘ్రముగ సుగ్రీవుఁడు వాసముసేయుచుండు కిష్కింధకు వచ్చి చేరిరి.

(౩౫) వానరులు అనేకములగు దివ్యమగు ఓషధులను ఫలములను కందమూలములను సుగ్రీవునికిఁ దెచ్చియిచ్చి యిట్లనిరి.

(౩౬) కొండలు సముద్రములు వనములు మొదలగు అన్నిచోట్లకుఁ బోయివచ్చితిమి. భూమిమీదనుండు వానరులందరు నీయాజ్ఞప్రకారము వచ్చుచున్నారు.

(౩౭) వానరరాజగు సుగ్రీవుఁడు ఈవిధముగ దూతలుచెప్పిన సమాచారమును విని సంతోషించి ఫలాదులలో మిగుల ప్రీతిగలవాఁడై వారు తెచ్చియిచ్చిన కానుకలను నంగీకరించెను.

ఇది ముప్పది యేడవ సర్గ.



## ౩౮ వ సర్గ.

(అవతారిక — సుగ్రీవుఁడు శ్రీరాముని సమీపమునకుఁ బోవుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) సేనాపతులగు దూతలు తెచ్చి యిచ్చిన కానుకలను సుగ్రీవుఁడు పుచ్చుకొని వారికి ఉపచారములుచెప్పి సెలవిచ్చి పంపెను.

(౨) కార్యము ముగించుకొని వచ్చిన శూరులగు వానరులను పంపివైచి అతఁడు రాముఁడు కృతార్థులైనటుల సుగ్రీవుఁడు తలఁచెను.

స లక్ష్మణో భీమబలం సర్వవానరసత్తమమ్।
అబ్రవీ త్ప్రశ్రితం వాక్యం సుగ్రీవం సంప్రహర్షయన్॥ ౩
కిష్కింధాయాం వినిష్క్రామ యది తే సౌమ్య రోచతే। ౩½
తస్య తద్వచనం శ్రుత్వా లక్ష్మణస్య సుభాషితమ్।
సుగ్రీవః పరమప్రీతో వాక్య మేత దువాచ హ॥ ౪½
ఏవం భవతు గచ్ఛావః స్థేయం త్వచ్ఛాసనే మయా॥ ౫
త మేవ ముక్త్వా సుగ్రీవో లక్ష్మణం శుభలక్ష్మణమ్।
విసర్జయామాస తదా తారా మన్యాశ్చ యోషితః॥ ౬
ఏతేత్యుచ్చై ర్హరివరాన్ సుగ్రీవ స్సముదాహరత్॥ ౬½
తస్య తద్వచనం శ్రుత్వా హరయ శ్శీఘ్ర మాయయుః॥ ౭
బద్ధాంజలిపుటా స్సర్వే యే స్యు స్త్రీసన్నిదర్శన క్షమాః॥ ౭½
తా నువాచ తతః ప్రాప్తాన్ రాజాఽర్కసదృశప్రభః।
ఉపస్థాపయత క్షిప్రం శిబికాం మమ వానరాః॥ ౮½
శ్రుత్వా తు వచనం తస్య హరయ శ్శీఘ్రవిక్రమాః।
సముపస్థాపయామాసు శ్శిబికాం ప్రియదర్శనామ్॥ ౯½
తా ముపస్థాపితాం దృష్ట్వా శిబికాం వానరాధిపః।
లక్ష్మణారుహ్యతాం శీఘ్ర మితి సౌమిత్రి మబ్రవీత్॥ ౧౦½

(౩, ౩½) భయంకరమైన బలముగలవాఁడును వానరులలో నుత్తముఁడును నగు సుగ్రీవునితో వినయమగు మాటలుచెప్పి అతనికి సంతోషముగలిగించుచు, ఓ సౌమ్యుఁడా! నీకుయిష్టముండినటులైతే కిష్కింధనుండి ప్రయాణము సేయుమని లక్ష్మణుఁ డనెను.

(౪½) ఇట్లుచెప్పిన లక్ష్మణుని మంచిమాటవిని సుగ్రీవుఁడు మిగుల సంతోషించి అతనితో నిటు లనెను.

(౫) అటులనే పోవుదము. నేను నీయాజ్ఞలో నుండుటకుఁ దగినవాఁడ నేను.

(౬) సుగ్రీవుఁడు మంగళకరమైన లక్షణములుగల లక్ష్మణునితో నిటు లచెప్పి, తారను యితరస్త్రీలను అంతఃపురములోనికిఁ బంపెను.

(౬½) దయచేయుఁడు, అని వానరోత్తములతో సుగ్రీవుఁడు చెప్పెను.

(౭) వానరులు సుగ్రీవునిమాటవిని శీఘ్రముగవచ్చిరి.

(౭½) అంతఃపురస్త్రీలను జూడఁగల వానరులందరు అంజలిచేసికొని ఉండిరి.

(౮½) పిమ్మట సూర్యునితో సమమైనకాంతిగల సుగ్రీవుఁడు అచట గూడియుండు వానరులను జూచి, వానరులారా! శీఘ్రముగ నాపల్లకిని సిద్ధపరచవలయు ననెను.

(౯½) గొప్పపరాక్రమముగల వానరులు సుగ్రీవునిమాట విని రమ్యముగ నుండు పల్లకి దెచ్చియుంచిరి.

(౧౦½) వానరరాజగు సుగ్రీవుఁడు వానరులుదెచ్చియుంచిన పల్లకినిజూచి, లక్ష్మణా! శీఘ్రముగ దీనిలోఁ గూర్చుండుము అనెను.

ఇత్యుక్త్వా కాంచనం యానం సుగ్రీవ స్సూర్యసన్నిభమ్।
బృహద్భి ర్హరిభి ర్యుక్త మారురోహ సలక్ష్మణః॥ ౧౧
పాండురేణాతపత్రేణ ధ్రియమాణేన మూర్ధని।
శుక్లైశ్చ వాలవ్యజనై ర్ధూయమానై స్సమంతతః॥ ౧౨
శంఖభేరీనినాదైశ్చ హరిభి శ్చాభినందితః।
నిర్యయౌ ప్రాప్య సుగ్రీవో రాజ్యశ్రియ మనుత్తమామ్॥
స వానరశతై స్తీక్ష్ణై ర్బహుభి శ్శస్త్రపాణిభిః।
పరికీర్ణో యయౌ తత్ర యత్ర రామో వ్యవస్థితః॥ ౧౪
స తం దేశ మనుప్రాప్య శ్రేష్ఠం రామనిషేవితమ్।
అవాతర న్మహాతేజా శ్శిబికాయా స్సలక్ష్మణః॥ ౧౫
ఆసాద్య చ తతో రామం కృతాంజలిపుటోఽభవత్॥
కృతాంజలౌ స్థితే తస్మిన్ వానరా శ్చాభవం స్తథా। ౧౬
తటాకమివ త ద్దృష్ట్వా రామః కుట్మలపంకజమ్।
వానరాణాం మహ త్సైన్యం సుగ్రీవే ప్రీతిమానభూత్॥ ౧౭
పాదయోః పతితం మూర్ధ్నా త ముత్థాప్య హరీశ్వరమ్।
ప్రేమ్ణా చ బహుమానాచ్చ రాఘవః పరిషస్వజే॥ ౧౮
పరిష్వజ్య చ ధర్మాత్మా నిషీదేతి తతోఽబ్రవీత్॥ ౧౯
తం నిషణ్ణం తతో దృష్ట్వా క్షితౌ రామోఽబ్రవీ ద్వచః॥

(౧౧౫) సుగ్రీవుఁడు యిటుల చెప్పి సూర్యునివలె వెలుంగుచుండు గొప్ప వానరులు మోసికొని యుండు పల్లకిలో లక్ష్మణునితోడ నెక్కి కూర్చుండెను.

(౧౨౫, ౧౩౫) సుగ్రీవుఁడు ఉత్తమమగు రాజ్య లక్ష్మిని బడసి అతని శిరసుమీద వానరులు పట్టియుండు తెల్లగొడుగుతోను నలుప్రక్కల వేయఁబడు చుండు తెల్లని చామరములతోను బావగుల శంఖభేరి వాద్యముల ధ్వనులతోను సంతోషముచు బొంది కిష్కింధనుండి ప్రయాణముచేసెను.

(౧౪౫) క్రూరమైన స్వభావముగల శస్త్రములు ధరించియుండు అనేకులగు వానరులతోడ నలుప్రక్కల చుట్టఁబడి శ్రీరాముఁడుండిన చోటికి సుగ్రీవుఁడు ప్రయాణముచేసెను.

(౧౫౫ శ్రీరాముఁడు వసించునట్టి శ్రేష్ఠముగనుండు ప్రదేశముచేరి, గొప్ప తేజస్సుగల సుగ్రీవుఁడు లక్ష్మణునితోడ పల్లకి దిగెను.

(౧౬౫) పిమ్మట, శ్రీరాముని సమీపమునకుఁ బోయి సుగ్రీవుఁడు అంజలిచేసికొని నిలిచియుండెను. అటులనే, వానరులు కూడ అంజలిచేసికొని నిలిచియుండిరి.

(౧౭౫) మొగ్గలుగనుండు తామరపూలు గలసరస్సువలె శ్రీరాముఁడు గొప్ప వానరసేనను జూచి సుగ్రీవుని మీద మిగుల ప్రీతిగల వాఁడాయెను.

(౧౮౫) శిరసును పాదములమీదనుంచి పడియుండు వానరరాజగు సుగ్రీవుని లేవనెత్తి, శ్రీరాముఁడు ప్రేమతోను గౌరవముతోను నతని ఆలింగనము చేసికొనెను.

(౧౯) ధర్మాత్ముఁడగు శ్రీరాముఁడతని నాలింగనము చేసికొని 'కూర్చుండుము' అని చెప్పెను.

(౧౯౧) భూమిమీదఁ గూర్చుండిన సుగ్రీవునిజూచి రాముఁడిటుల చెప్

ధర్మ మర్థంచ కామంచ యస్తు కాలే నిషేవతే।
విభజ్య సతతం వీర స రాజా హరిసత్తమ॥ ౨౦
హిత్వా ధర్మం తథాఽర్థంచ కామం యస్తు నిషేవతే।
స వృక్షాగ్రే యథా సుప్తః పతితః ప్రతిబుధ్యతే॥ ౨౧
అమిత్రాణాం వధే యుక్తో మిత్రాణాం సంగ్రహే రతః।
త్రివర్గఫలభోక్తా తు రాజా ధర్మేణ యుజ్యతే॥ ౨౨
ఉద్యోగసమయ స్త్వేష ప్రాప్త శ్శత్రువినాశన।
సంచింత్యతాం హి పింగేశ హరిభి స్సహ మంత్రిభిః। ౨౩
ఏవ ముక్తస్తు సుగ్రీవో రామం వచన మబ్రవీత్॥ ౨౪

ప్రణష్టా శ్రీశ్చ కీర్తి శ్చ కపిరాజ్యంచ శాశ్వతమ్।
త్వత్ప్రసాదా న్మహాబాహో పునః ప్రాప్త మిదం మయా।
తవ దేవ ప్రసాదాచ్చ భ్రాతుచ్చ జయతాం వర॥ ౨౫
కృతం న ప్రతికర్యా ద్యః పురుషాణాం స దూషకః॥ ౨౬
ఏతే వానరముఖ్యాశ్చ శతశ శ్శత్రుసూదన।
ప్రాప్తా శ్చాదాయ బలినః పృథివ్యాం సర్వవానరాన్॥ ౨౭
ఋక్షాశ్చావహితా శ్శూరా గోలాంగూలాశ్చ రాఘవ।
కాంతారవనదుర్గాణా మభిజ్ఞా ఘోరదర్శనాః॥ ౨౮

(౨౦½) వీరుఁడవగు కపిశ్రేష్ఠుఁడా! ఆయా కాలములకుఁ దగినటుల ధర్మార్థకామములను విభజించి స్వరూపము నెఱింగి అనుష్ఠించువాఁడే రాజు.

(౨౧½) ధర్మమును అర్థమును విడిచి కామమునే గోరియుండు వాఁడు, చెట్టుకొనలో పండుకొని నిద్రించినవాఁడు క్రింద పడి మేలుకొనిన వానివలె, నుండును.

(౨౨½) శత్రువులను జంపి మిత్రులను జేర్చుకొని ఆయా కాలములో ధర్మార్థకామ రూపముగనుండు ఫలములను ననుభవించు రాజే ధర్మాత్ముఁడనిపించుకొనును.

(౨౩½) శత్రు సంహారకుఁడా! సీతను కనిపెట్టి రావణునితో యుద్ధము చేయవలసిన సమయము వచ్చినది. వానరుఁడా! మంత్రులతోను వానరులతోను నీవు ఆలోచించవలయును.

(౨౪) శ్రీరాముని మాట విని సుగ్రీవుఁ డిటు లనెను.

(౨౫, ౨౫½) గొప్పభుజములు గలవాఁడా, నాథా! జయించువారలలో నుత్తముఁడా. నీకటాక్షముచేతను, నీతమ్ముని అనుగ్రహముచేతను తొలగిపోయిన ఐశ్వర్యమును, కీర్తిని, శాశ్వతమగు వానర రాజ్యమును, నేను బడసితిని.

(౨౬) ఉపకారమును బొంది ప్రత్యుపకారము సేయనివాఁడు పురుషులలో నధముఁడు.

(౨౭) శత్రు సంహారకుఁడా! ఈ వానర శ్రేష్ఠులు భూమిమీద గల బలిష్ఠులగు వానరులందరిని పిలుచుకొని వచ్చియున్నారు.

(౨౮) ఓ రామా! జాగ్రత్తగనుండు ఎలుగుబంట్లు, కొండముచ్చులు, అడవులను వనములను దుర్గములను నెఱింగియున్నారు. వీరు మిగుల భయంకరులుగ నున్నారు.

దేవగంధర్వపుత్రాశ్చ వానరాః కామరూపిణః।
స్వైః స్వైః పరివృతా స్సైన్యై ర్వర్తంతే పథి రాఘవ॥ ౨౯
శతైః శ్శతసహస్రైశ్చ కోటిభి శ్చ ప్లవంగమాః।
అయుతై శ్చావృతా వీరా శ్శంకుభిశ్చ పరంతప॥ ౩౦
అర్బుదై రర్బుదశతై ర్మధ్యై శ్చాంతైశ్చ వానరాః।
సముద్రైశ్చ పరార్ధైశ్చ హరయో హరియూథపాః॥ ౩౧
ఆగమిష్యంతి తే రాజన్ మహేంద్రసమవిక్రమాః॥ ౩౧౻

మేరుమందరసంకాశా వింధ్యమేరుకృతాలయాః॥ ౩౨
తే త్వా మభిగమిష్యంతి రాక్షసం యే సబాంధవమ్।
నిహత్య రావణం సంఖ్యే హ్యానయిష్యంతి మైథిలీమ్॥ ౩౩

తత స్త ముద్యోగ మవేక్ష్య బుద్ధిమాన్ హరిప్రవీరస్య నిదేశ వర్తినః। బభూవ హర్షా ద్వసుధాధిపాత్మజః ప్రబుద్ధనీలోత్పల తుల్యదర్శనః॥ ౩౪

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - అష్టత్రింశస్సర్గః



(౨౯) దేవతల గంధర్వుల పుత్రులును కోరినరూపము ధరించగలవారును నగు వానరులు వారివారి సేనలతోఁ గూడి, ఓ రామా! మార్గములో నున్నారు.

(౩౦,౩౧,౩౧½) ఓ శత్రుసంహారకుఁడా! ఇంద్రునివంటి పరాక్రమముగల సేనాపతులగు వానరులలోఁ గొందరు నూర్గురు వానరులతోను, కొందరు వేయి మందితోను, కొందరు లక్షమంది వానరులతోను, కొందరు కోటిమంది వానరులతోను, కొందరు పదికోట్లవానరులతోను, కొందరు శంఖ సంఖ్యగల వానరులతోను, కొందరు అర్బుదము సంఖ్యగల వానరులతోను, కొందరు నూరు అర్బుదములసంఖ్య గలవానరులతోను, కొందరు మధ్యమనుసంఖ్య గలవానరులతోను, కొందరు అంతమనుసంఖ్య గల వానరులతోను, కొందరు సేనాపతులు సముద్రముపరార్థము అనుసంఖ్యలు గల వానరులతోను చేరి, ఓరాజా! వచ్చుచున్నారు.

(౩౨,౩౩) రాక్షసుఁడగు రావణుని బంధువులతోడ యుద్ధములోఁ జంపి, సీతను దెచ్చునట్టి, మేరు మందరపర్వతములవలె వెలుంగుచుండునట్టి, వింధ్య మేరు పర్వతములలో వసించు వానరులు నీ సమీపమునకు వచ్చుచున్నారు.

(౩౪) పిమ్మట, బుద్ధిమంతుఁడగు దశరథుని పుత్రుఁడగు శ్రీరాముఁడు తనయాజ్ఞలో నుండు వానరవీరుఁడగు సుగ్రీవునియొక్క సీతను వెతకుటలో నుండు యత్నమును జూచి సంతోషముతో బాగుగ వికసించియుండు నీలోత్పలములతో తుల్యమైన చూపుగలవాఁడై యుండెను.

ఇది ముప్పదియెనిమిదవ సర్గ.



## ఏకోన చత్వారింశస్సర్గః

ఇతి బ్రువాణం సుగ్రీవం రామో ధర్మభృతాంవరః।
బాహుభ్యాం సంపరిష్వజ్య ప్రత్యువాచ కృతాంజలిమ్॥ ౧

యదిందో వర్షతేవర్షం న తచ్చిత్రం భవే త్క్వచిత్।
ఆదిత్యోవా సహస్రాంశుః కుర్యా ద్వితిమిరం నభః॥ ౨

చంద్రమా రశ్మిభిః కుర్యా త్పృథివీం సౌమ్య నిర్మలామ్।
త్వద్విధోవాపి మిత్రాణాం ప్రీతికుర్యా త్పరంతప॥ ౩

ఏవం త్వయి నతచ్చిత్రం భవేద్య త్సౌమ్య శోభనమ్।
జానామ్యహం త్వాం సుగ్రీవ సతతం ప్రియవాదినమ్॥ ౪
త్వత్సనాథ స్సఖె సంఖ్యే జేతాస్మి సకలా నరీన్।
త్వమేవ మే సుహృ న్మిత్రం సాహాయ్యం కర్తు మర్హసి॥ ౫
జహారాత్మవినాశాయ వైదేహీం రాక్షసాధమః।
వంచయిత్వాతు పౌలోమీ మనుహ్లాదో యథా శచీమ్॥ ౬
న చిరా త్తం హనిష్యామి రావణం నిశితై శ్శరైః।
పౌలోమ్యాః పితరం దృప్తం శతక్రతు రివాహవే॥ ౭

## ౩౯ వ సర్గ.

(అవతారిక.— వానరసేనలు ఒకటిగఁ గూడుట యీ సర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) ధర్మాత్ములలో సత్తముఁడగు శ్రీరాముఁడు అంజలిచేసికొని యిటుల చెప్పుచుండు సుగ్రీవుని ఆలింగనము చేసికొని యిటు లనెను.

(౨, ౩) సౌమ్యుఁడా! శత్రువులను దమింపఁజేయువాఁడా? ఇంద్రుఁడు వానకురిపించుట, వేయికిరణములు గలసూర్యుఁడు ఆకాశములోఁ జీకటిని బోఁగొట్టుట, చంద్రుఁడతని కిరణములచే భూమిని చల్లగఁజేయుట, నీవంటివాఁడు మిత్రులకు ప్రత్యుపకారము సేయుట, యెపుడును, ఆశ్చర్యము కాదు.

(౪) సౌమ్యుఁడా! ఇటులనే నీవు స్నేహితుల విషయమై ప్రత్యుపకారము సేయుట నీవిషయమై ఆశ్చర్యము కాదు. సుగ్రీవుఁడా! సదానీవు ప్రియమైన మాటలు సెప్పువాఁడవని నేనెఱుంగుదును.

(౫) స్నేహితుఁడా! నిన్నే రక్షకునిగ గలవాఁడనై యుద్ధములో సకల శత్రువులను జయించగలను. నీవే నాకు మంచిమనసు గల స్నేహితుఁడవు. నీవే యుద్ధరంగములో సహాయము సేయుటకు దగినవాఁడవు.

(౬) రాక్షసాధముఁడగు రావణుఁ డతనిచావుకొరకే నన్ను వంచించి, పులోముని కూఁతురగు శచీదేవిని అతని నాశముకొరకే అతనిపుత్రుఁడగు అనుహ్లాదుఁడు అపహరించినటుల, అపహరించెను.

(౭) కరకుగల బాణములతో త్వరలోనే, ఇంద్రుఁడు అహంకారముగల శచీదేవితండ్రియగు పులోముని యుద్ధములోఁ జంపినటుల, రావణుని జంపెదను.

ఏతస్మిన్నంతరే చైవ రజ స్సమభివర్తత।
ఉష్ణాం తీవ్రాం సహస్రాంశో శ్ఛాదయ ద్గగనే ప్రభామ్॥ ౮
దిశః పర్యాకులా శ్చాసన్ రజసా తేన మూర్ఛితాః।
చచాల చ మహీ సర్వా సశైలవనకాననా॥ ౯
తతో నగేంద్రసంకాశై స్తీక్ష్ణదంష్ట్రై ర్మహాబలైః।
కృత్స్నా సంఛాదితా భూమి రసం[illegible]ః ప్లవంగమైః॥ ౧౦

నిమేషాంతరమాత్రేణ తత స్తై ర్హరియూథపైః।
కోటీశతపరీవారైః కామరూపిభి రావృతా॥ ౧౧
నాదేయైః పార్వతీయైశ్చ సాముద్రైశ్చ మహాబలైః।
హరిభి ర్మేఘనిర్హ్రాదై రన్యైశ్చ వనచారిభిః॥ ౧౨
తరుణాదిత్యవర్ణైశ్చ శశిగౌరైశ్చ వానరైః।
పద్మకేసరవర్ణైశ్చ శ్వేతై ర్మేరుకృతాలయైః॥ ౧౩
కోటీసహస్రై ర్దశభి శ్శ్రీమా న్పరివృత స్తదా।
వీర శ్శతవలి ర్నామ వానరః ప్రత్యదృశ్యత॥ ౧౪
తతః కాంచనశైలాభ స్తారాయా వీర్యవా న్పితా।
అనేకై ర్దశసహస్రైః కోటిభిః ప్రత్యదృశ్యత॥ ౧౫.

(౮) ఇట్టి సంభాషణ జరుగుచుండగా, వేడిగను సైచుటకు సాధ్యముకానిదిగనుండు సూర్యుని కాంతిని నాటంకపరచుచు ఆకాశములో దుమ్ము విశేషముగ లేచెను.

(౯) అన్నిచోటులలోను వ్యాపించుచుండు దుమ్ముచే దిక్కులు తెలియక పోయెను. కొండలు అరణ్యములతోఁ గూడిన భూమి యంతయు గడగడలాడెను.

(౧౦) పిమ్మట, కొండలవలె వెలుంగుచుండు వారును, పదునుగల కోరపండ్లు గొప్పబలము గలవారును నగు లెక్కలేని వానరులతో భూమి నిండిపోయెను.

(౧౧) కనుమూసి కనుతెరచునంతకాలములో కోట్లసంఖ్య పరివారముతో గూడి కోరినరూపము ధరించగల వానరసేనాపతులతో భూమి నిండియుండెను.

(౧౨) నదీతీరములు పర్వతములు సముద్రతీరములలో వసించుచుండు వారును గొప్పబలము గలవారును మేఘమువలె గర్జించువారును వనములలో సంచరించువారును నగు వానరులతో భూమి నిండియుండెను.

(౧౩,౧౪) బాలసూర్యునివంటి దేహకాంతిగలవారును, చంద్రునివలె గౌరవర్ణముగలవారును, తామరపూల కింజల్కములవర్ణము గలవారును, తెల్లగనుండువారును, నగు మేరుపర్వతములో వసించుచుండు పదికోట్ల వానరులతోడ శ్రీమంతుఁడును వీరుఁడును నగు శతవలి యను వానరుఁడు వచ్చిచేరెను.

(౧౫) పిమ్మట, బంగారుకొండవలె వెలుంగుచుండువాఁడును, వీర్యవంతుఁడును తారాదేవితండ్రియునునగు సుషేణుఁడను వానరుఁడు అనేక కోట్లవానరులతో వచ్చెను.

తథాఽపరేణ కోటీనాం సహస్రేణ సమన్వితః।
పితా రుమాయా స్సంప్రాప్త స్సుగ్రీవశ్వశురో విభుః॥ ౧౬
పద్మకేసరసంకాశ స్తరుణార్కనిభాననః।
బుద్ధిమా న్వానరశ్రేష్ఠ స్సర్వవానరసత్తమః॥ ౧౭
అనీకై ర్బహుసాహస్రై ర్వానరాణాం సమన్వితః।
పితా హనుమత శ్శ్రీమాన్ కేసరీ ప్రత్యదృశ్యత॥ ౧౮
గోలాంగూలమహారాజో గవాక్షో భీమవిక్రమః।
వృతః కోటిసహస్రేణ వానరాణా మదృశ్యత॥ ౧౯
ఋక్షాణాం భీమవేగానాం ధూమ్రశ్శత్రునిబర్హణః।
వృతః కోటిసహస్రాభ్యాం ద్వాభ్యాం సమభివర్తత॥ ౨౦
మహాచలనిభై ర్ఘోరైః పనసో నామ యూథపః।
ఆజగామ మహావీర్య స్తిసృభిః కోటిభి ర్వృతః॥ ౨౧
నీలాంజనచయాకారో నీలో నామాథ యూథపః।
అదృశ్యత మహాకాయః కోటిభిర్దశభి ర్వృతః॥ ౨౨
తతః కాంచనశైలాభో గవయో నామ యూథపః।
ఆజగామ మహావీర్యః కోటిభిః పంచభి ర్వృతః॥ ౨౩
దరీముఖశ్చ బలవాన్ యూథపోఽభ్యాయయౌ తదా।
వృతః కోటిసహస్రేణ సుగ్రీవం సముపస్థితః॥ ౨౪

(౧౫) అటులనే, ప్రభువుగను సుగ్రీవునికి మామయును రుమాదేవి తండ్రియు నగు తారుడను వానరుడు అనేక కోట్ల వానరసేనతో వచ్చిచేరెను.

(౧౬,౧౭) పద్మకింజల్కములవలె ప్రకాశించు బాలసూర్యునివంటి ముఖముగలవాడును బుద్ధిమంతుడును వానరులలో నుత్తముడును శ్రీమంతుడును హనుమంతుని తండ్రియునునగు కేసరియను వానరుడు అనేక కోట్ల వానరులతో వచ్చెను.

(౧౯) కొండముచ్చులకు రాజును, భయంకరమైన పరాక్రమము గలవాడును, నగు గవాక్షుడను వానరుడు వేయికోట్ల వానరులతోడ వచ్చిచేరెను.

(౨౦) శత్రుసంహారకుడగు ధూమ్రుడను వానరుడు భయంకరమైన పరాక్రమముగల రెండువేల కోట్ల యెలుగుబంట్లతోడ వచ్చెను.

(౨౧) గొప్ప కొండలతో సములై భయంకరులుగనుండు మూడుకోట్ల వానరులతో గొప్ప పరాక్రమముగల వాడును సేనాధిపతియునగు పనసుడను వానరుడు వచ్చెను.

(౨౨) కాటుకకొండలవంటి ఆకారముగల సేనాపతియు గొప్ప శరీరము గల నీలుడను వానరుడు పదికోట్ల వానరులతోడ వచ్చెను.

(౨౩) పిమ్మట, బంగారుకొండవంటి దేహకాంతిగల వాడును సేనాపతియు నగు గొప్ప పరాక్రమముగల గవయుడను వానరుడు ౫ కోట్ల వానరులను బిలుచుకొని వచ్చెను.

(౨౪) బలవంతుడును సేనాపతియు నగు దరీముఖుడను వానరుడున్ను వేయికోట్ల వానరులతోను సుగ్రీవుని సన్నిధానమునకు వచ్చెను.

మైందశ్చ ద్వివిద శ్చోభౌ వశ్విపుత్రౌ మహాబలౌ।
కోటికోటిసహస్రేణ వానరాణా మదృశ్యతాం॥ ౨౫
గజశ్చ బలవా న్వీరః కోటిభి స్తిసృభి ర్వృతః।
ఆజగామ మహాతేజా స్సుగ్రీవస్య సమీపతః॥ ౨౬
ఋక్షరాజో మహాతేజా జాంబవా న్నామ నామతః।
కోటిభి ర్దశభిః ప్రాప్త స్సుగ్రీవస్య వశే స్థితః॥ ౨౭
రుమణ్వా న్నామ విక్రాంతో వానరో వానరేశ్వరమ్।
ఆయయౌ బలవాం స్తూర్ణం కోటీశతసమావృతః॥ ౨౮
తతః కోటిసహస్రాణాం సహస్రేణ శతేనచ।
పృష్ఠతోఽనుగతః ప్రాప్తో హరిభి ర్గంధమాదనః॥ ౨౯
తతః పద్మసహస్రేణ వృత శ్శంకుశతేనచ।
యువరాజోఽంగదః ప్రాప్తః పితృతుల్యపరాక్రమః॥ 30
తత స్తారాద్యుతి స్తారో హరి ర్భీమపరాక్రమః।
పంచభి ర్హరికోటీభి ర్దూరతః ప్రత్యదృశ్యత॥ 3౧
ఇంద్రజానుః కపి ర్వీరో యూథపః ప్రత్యదృశ్యత।
ఏకాదశానాం కోటీనా మీశ్వర స్తైశ్చ సంవృతః॥ 3౨
తతో రంభ స్త్వనుప్రాప్త స్తరుణాదిత్యసన్నిభః।
అయుతేనావృత శ్చైవ సహస్రేణ శతేనచ॥ 33

వానరసేనాపతులు వారివారి సేనలతోడ రాముని సన్నిధికి వచ్చిచేరుట. ౪౪౫

(౨౫) అశ్వినీదేవతల పుత్రులగు గొప్పబలము గలమైంద ద్వివిదులు అనేకకోట్ల వానరులతో వచ్చిరి

(౨౬) బలవంతుఁడును వీరుఁడును గొప్ప తేజస్సు గలవాఁడును నగు గజుఁడను వానరుఁడు మూఁడుకోట్ల వానరులతోడ సుగ్రీవుని సమీపమునకు వచ్చెను.

(౨౭) ఎలుగుబంట్లకు రాజును గొప్పతేజస్సు గలవాఁడును నగు జాంబవంతుఁడు ౧౦ కోట్ల యెలుగుబంట్లతోడ వచ్చి సుగ్రీవుని వశములోనుండెను.

(౨౮) బలవంతుఁడును ప్రసిద్ధుఁడును నగు రుమణ్వంతుఁడను వానరుఁడు నూరుకోట్ల వానరులతోడ శీఘ్రముగ సుగ్రీవుని సమీపమునకు వచ్చెను.

(౨౯) పిమ్మట, గంధమాదనుఁడను వానరుఁడు అనేకకోట్ల వానరులను బిలుచుకొని వచ్చెను.

(30) యువరాజును, తండ్రియగు వాలివంటి పరాక్రమముగల అంగదుఁడు వేయిపద్మసంఖ్య నూఱుశంఖుసంఖ్య గలవానరులతోడ వచ్చిచేరెను.

(3౧) నక్షత్రములవంటి కాంతి గలవాఁడును భయంకరమగు పరాక్రమముగలవాఁడును నగు తారుఁడను వానరుఁడు ౫ కోట్ల వానరులతోడ కొంతదూరములోవచ్చుచుండెను. (ఇతఁడు, రుమాదేవితండ్రి కాఁడు.)

(3౨) వీరుఁడును సేనాపతియు ౧౧కోట్లవానరులకు నాథుఁడును నగు ఇంద్రజానుఁడను వానరుఁడు ఆసేనతోడ వచ్చిచేరెను.

(33) బాలసూర్యునివంటి దేహకాంతిగల రంభుఁడను వానరుఁడు అనేకవేలవానరులతో వచ్చెను.

తతో యూథపతి ర్వీరో దుర్ముఖో నామ వానరః।
ప్రత్యదృశ్యత కోటిభ్యాం ద్వాభ్యాం పరివృతో బలీ॥ ౩౪
కైలాసశిఖరాకారై ర్వానరై ర్భీమవిక్రమైః।
వృతః కోటిసహస్రేణ హనుమాన్ ప్రత్యదృశ్యత॥ ౩౫
నళశ్చాపి మహావీర్య స్సంవృతో ద్రుమవాసిభిః।
కోటీశతేన సంప్రాప్త స్సహస్రేణ శతేనచ॥ ౩౬
తతో దధిముఖ శ్శ్రీమాన్ కోటిభి ర్దశభి ర్వృతః।
సంప్రాప్తోఽభిమత స్తస్య సుగ్రీవస్య మహాత్మనః॥ ౩౭

శరభః కుముదో వహ్ని ర్వానరో రంహ ఏవచ।
ఏతే చాన్యేచ బహవో వానరాః కామరూపిణః॥ ౩౮
ఆవృత్య పృథివీం సర్వాం పర్వతాంశ్చ వనానిచ।
యూథపా స్సమనుప్రాప్తా స్తేషాం సంఖ్యా నవిద్యతే॥ ౩౯
ఆగతాశ్చ విశిష్టాశ్చ పృథివ్యాం సర్వవానరాః॥ ౩౯½
ఆప్లవంతః ప్లవంతశ్చ గర్జంతశ్చ ప్లవంగమాః।
అభ్యవర్తంత సుగ్రీవం సూర్య మభ్రగణా ఇవ॥ ౪౦½
కుర్వాణా బహుశబ్దాంశ్చ ప్రహృష్టా బాహుశాలినః।
శిరోభి ర్వానరేంద్రాయ సుగ్రీవాయ న్యవేదయన్॥ ౪౧½

వానరసేనాపతులు వారివారి సేనలతోడ రాముని సన్నిధికి వచ్చిచేరుట. ౪౪౮

(౩౪) పిమ్మట, సేనాపతియు, వీరుఁడును బలవంతుఁడును నగు దుర్ముఖుఁడను వానరుఁడు రెండుకోట్ల వానరులను బిలుచుకొని వచ్చెను.

(౩౫) కైలాసశిఖరమువలె పెరిగియుండువారును, భయంకరమైన పరాక్రమముగల వారును నగు వేయికోట్ల వానరులతోడ హనుమంతుఁడు వచ్చెను.

(౩౬) గొప్ప పరాక్రమముగల నలుఁడను వానరుఁడు చెట్లలో వాసము చేయుచుండు అనేకకోట్ల వానరులతోడ వచ్చెను.

(౩౭) పిమ్మట, మహాత్ముఁడగు సుగ్రీవునికి మిగులయిష్టుఁడును, శ్రీమంతుఁడును నగు దధిముఖుఁడను వానరుఁడు పదికోట్ల వానరులతోడ వచ్చెను.

(౩౮,౩౯) శరభుఁడు, కుముదుఁడు, వహ్ని, రంహ అనువానరులు, కోరిన రూపము ధరించగల మరికొందరు వానరులు భూమిని పర్వతములను అరణ్యములను ఆవరించుకొని సేనాపతులు వచ్చిరి. వీరికి లెక్కలేదు.

(౩౯½) భూమిలోగల నుత్తములగు వానరులందరు వచ్చిరి.

(౪౦½) వీరందరు గంతులు వేయుచు ఆకాశములోఁ బోవుచు గర్జించుచు, సూర్యుని సమీపమునకు మేఘములు వచ్చునటుల, సుగ్రీవుని సమీపించి వచ్చిరి.

(౪౧½) విశేషముగ కేకలు వేయుచుండువారును సంతోషించియుండువారును భుజములచేఁ బ్రకాశించుచుండువారును నగు వానరులు వానరేంద్రుఁడగు సుగ్రీవునికి శిరసుతో నమస్కరించి వారివారి నామధేయములు చెప్పుకొనిరి.

అపరే వానరశ్రేష్ఠా స్సంయమ్యచ యథోచితమ్।
సుగ్రీవేణ సమాగమ్య స్థితాః ప్రాంజలయ స్తదా॥ ४६५
సుగ్రీవ స్త్వరితో రామే సర్వాం స్తా న్వానరర్షభాన్।
నివేదయిత్వా ధర్మజ్ఞః స్థితః ప్రాంజలి రబ్రవీత్॥ ४३५
యథాసుఖం పర్వతనిర్ఝరేషు వనేషు సర్వేషుచ వానరేం
ద్రాః। నివేశయిత్వా విధివ ద్బలాని బలం బలజ్ఞః ప్రతిపత్తు
మీష్టే॥ ४४५

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - ఏకోనచత్వారింశస్సర్గః.

## చత్వారింశస్సర్గః.

అథ రాజా సమృద్ధార్థ స్సుగ్రీవః ప్లవగేశ్వరః।
ఉవాచ నరశార్దూలం రామం పరబలార్దనమ్॥ ౧
ఆగతా వినివిష్టాశ్చ బలినః కామరూపిణః।
వానరా వారణేంద్రాభా యే మద్విషయవాసినః॥ ౨
త ఇమే బహువిక్రాంతై ర్హరిభి ర్భీమవిక్రమైః।
ఆగతా వానరా ఘోరా దైత్యదానవసన్నిభాః॥ ३

(౪౨) అపుడు మరికొందరు వానరవీరులు వస్త్రములు బాగుగ బిగించి కట్టుకొని సుగ్రీవుసమీపములో అంజలిచేసికొని నిలిచి యుండిరి.

(౪౩) ధర్మజ్ఞుఁడగు సుగ్రీవుఁడు అంజలిచేసికొని శీఘ్రముగ శ్రీరాముని సన్నిధిలో వానరులందరు వచ్చిరని దెలిపి వానరులతో నిట్లనెను.

(౪౪) వానరశ్రేష్ఠులారా! పర్వతములలోను గిరినదులలోను అరణ్యములలోను సుఖముగ వారివారి సేనను నిలిపి సేనాపతిగ నుండువాఁడు వాని సేనను బాగుగ గురుతుపెట్టి యుంచుకొనవలయును.

ఇది ముప్పదితొమ్మిదవ సర్గ.

## ౪౦ వ సర్గ

(అవతారిక.— సీతను వెతకుటకు తూర్పుదిక్కునకు వినతుఁడను వానరుని సుగ్రీవుఁడు బంపుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది )

(౧) పిమ్మట, వానరరాజగు సుగ్రీవుఁడు వానరులరాకచే సఫలమైనప్రయోజనముగలవాఁడై, శత్రుపుత్రసేనను హింసించువాఁడును పురుషోత్తముఁడును నగు రామునితో నిట్లనెను.

(౨) బలవంతులును కామరూపులును నేనెరింగిన దేశములలో వసించుచు, శ్రేష్ఠములగు గజములవలెనుండు, వానరులు వచ్చి సమీపములో నున్నారు.

(౩) దైత్యులు దానవులతో సములుగనుండు భయంకరులగు వానరులు మిగుల ప్రసిద్ధులై భయంకరమైన పరాక్రమముగల వానరులతోడ వచ్చియున్నారు.

ఖ్యాతకర్మాపదానాశ్చ బలవంతో జితక్లమాః।
పరాక్రమేషు విఖ్యాతా వ్యవసాయేషు చోత్తమాః॥ ౪
పృథివ్యంబుచరా రామ నానానగనివాసినః।
కోట్యగ్రశ ఇమే ప్రాప్తా వానరాస్తవ కింకరాః॥ ౫
నిదేశవర్తిన స్సర్వే సర్వే గురుహితే రతాః।
అభిప్రేత మనుష్ఠాతుం తవ శక్ష్యంత్యరిందమ। ౬
త ఇమే బహుసాహస్రై రనీకై ర్భీమవిక్రమైః।
యన్మన్యసే నరవ్యాఘ్ర ప్రాప్తకాలం తదుచ్యతామ్॥ ౭
త్వత్సైన్యం త్వద్వశే యుక్త మాజ్ఞాపయితు మర్హసి॥ ౭½

కామమేషా మిదం కార్యం విదితం మమ తత్త్వతః।
తథాపితు యథా తత్త్వ మాజ్ఞాపయితు మర్హసి॥ ౮½
ఇతి బ్రువాణం సుగ్రీవం రామో దశరథాత్మజః।
బాహుభ్యాం సంపరిష్వజ్య ఇదం వచన మబ్రవీత్॥ ౯½
జ్ఞాయతాం మమ వైదేహీ యది జీవతివా నవా।
సచ దేశో మహాప్రాజ్ఞ యస్మి న్వసతి రావణః॥ ౧౦½
అధిగమ్యతు వైదేహీం నిలయం రావణస్యచ।
ప్రాప్తకాలం విధాస్యామి తస్మి న్కాలే సహ త్వయా॥ ౧౧½

(౪,౫) బహుదూరము లంఘనము చేయుటలోను, పూర్వము శత్రువుల సేనలను నిరసించుటలోను ప్రసిద్ధులుగనుండువారును బలవంతులును శ్రమలేనివారును, ప్రసిద్ధమైనపరాక్రమముగలిగి, కార్యములను సాధించుటలో నిపుణులును, భూమిలోనుజలములోను సంచరించువారును, అనేకకొండలలో వసించువారును, ఓ రామా! నీకింకరులును నగువానరులు కోట్లసంఖ్యలుగ వచ్చియున్నారు.

(౬) శత్రుసంహారకుఁడా! అందరు నీయాజ్ఞలోనుండి నీకు హితము సేయుటలో నాసక్తిగలిగి నీయిష్టప్రకారము సేయుటకు సిద్ధముగనున్నారు.

(౭,౮½) నరోత్తముఁడా! అనేకవేల సంఖ్యగల భయంకరమగు యీవానరసేనతో నేమిసేయుటకు గోరుచున్నావో అందుకుఁసమయముగనున్నది. ఆజ్ఞాపించవలయును. ఇదంతయు నీసైన్యమేను. నీయధీనములోనున్నది. నీవు ఆజ్ఞాపించవచ్చును.

(౮½) ఈసేనలు సేయవలసిన కార్యమును నేను బాగుగ నెఱుంగుదును. అయినను, నీవే యాజ్ఞాపించవలయును.

(౯½) ఇట్లు సుగ్రీవుఁడు చెప్పగా, నతని రాముఁడు ఆలింగనము చేసికొని యిటు లనెను.

(౧౦½) ప్రాజ్ఞుఁడా! జనకునికూతుఁగగు నాసీత జీవించియున్నదో లేదో తెలిసికొనవలయును. రావణుఁడు వసించుదేశమును గనిపెట్టవలయును.

(౧౧½) సీతయొక్క క్షేమమును రావణుఁడు వసించుప్రదేశమును తెలిసికొని ఆసమయములో నీతోడ కాలానుగుణముగ పనిచేసెదను.

నాహ మస్మి ప్రభుః కార్యే వానరేశ నలక్ష్మణః।
త్వ మస్య హేతుః కార్యస్య ప్రభుశ్చ ప్లవగేశ్వర॥ ౧౨½
త్వ మేవాజ్ఞాపయ విభో మమ కార్యవినిశ్చయమ్।
త్వంహి జానాసి యత్కార్యం మమ వీర నసంశయః॥ ౧౩½
సుహృ ద్ద్వితీయో విక్రాంతః ప్రాజ్ఞః కాలవిశేషవిత్।
భవా నస్మద్ధితే యుక్త స్సుకృతార్థోఽర్థవిత్తమః॥ ౧౪½

ఏవ ముక్త స్తు సుగ్రీవో వినతం నామ యూథపం।
అబ్రవీ ద్రామసాన్నిధ్యే లక్ష్మణస్యచ ధీమతః॥ ౧౫½
శైలాభం మేఘనిర్ఘోష మూర్జితం ప్లవగేశ్వరః॥ ౧౬
సోమసూర్యాత్మజై స్సార్ధం వానరై ర్వానరోత్తమ।
దేశకాలనయై ర్యుక్తః కార్యాకార్యవినిశ్చయే॥ ౧౭
వృత శ్శతసహస్రేణ వానరాణాం తరస్వినామ్।
అధిగచ్ఛదిశం పూర్వాం సశైల వనకాననామ్॥ ౧౮

తత్ర సీతాంచ వైదేహీం నిలయం రావణస్యచ।
మార్గధ్వం గిరిశృంగేషు వనేషుచ నదీషుచ॥ ౧౯
నదీం భాగీరథీం రమ్యాం సరయూం కౌశికీం తథా।
కాళిందీం యమునాం రమ్యాం యామునంచ మహాగిరిమ్॥ ౨౦

(౧౨½) వానరరాజా! ఈ కార్యమును నేను లక్ష్మణుఁడు యజమానుల ము కాము. నీవే దీనికి ప్రవర్తకుఁడవు ప్రభువును నీవేను.

(౧౩½) ఓ ప్రభుఁడా! నా కార్యమిట్టిదని నీవే వారికి ఆజ్ఞాపింపుము. వీరుఁడా! నా కార్యమిట్టిదని నీకే తెలిసియున్నది. ఇందుకు సందేహము లేదు.

(౧౪½) నీవు నాకు రెండవ స్నేహితుఁడవు ప్రసిద్ధుఁడవు. ప్రాజ్ఞుఁడవు. కాలవిశేషమును నెరింగినవాఁడవు మాకు హితము సేయుటలో నాసక్తిగలవాఁడవు. మంచికార్యములు చేసియున్నావు. రాజనీతిని బాగుగ నెరింగినవారిలో నుత్తముఁడవు.

(౧౫½, ౧౬) ఈవిధముగ శ్రీరాముఁడు చెప్పగా, వానరరాజగు సుగ్రీవుఁడు రామలక్ష్మణుల సన్నిధిలో, కొండవలె వెలుఁగుచుండు వాఁడును మేఘమువలె గర్జించుచుండు వాఁడును తేజస్వియు సేనాపతియు నగు వినతునితో నిట్టు లనెను.

(౧౭,౧౮) వానరోత్తముఁడా! సూర్యచంద్రుల కొడుకులగు వానరులతోడ, కార్యాకార్యములను నిశ్చయించుటలో దేశోచిత కాలోచితమగు నీతులతో గూడి బలముగల అనేకవేల సంఖ్యగల వానరులతోడ పర్వతములు అరణ్యములు గలతూర్పుదిక్కునకుఁ బొమ్ము.

(౧౯) తూర్పుదిక్కులో పర్వతములమీఁదను అరణ్యములలోను నదీతీరములలోను జనకునికూతురగు సీతను రావణుఁ డుంచినచోటిని కనిపెట్టవలయును.

(౨౦) మనోహరమగు గంగా సరయూ కౌశికీ కళింద పుత్రికయగు యమున, యమునకు సమీపములోనుండు గొప్పపర్వతము,

సప్వతీంచ సింధుంచ శోణం మణినిభోదకమ్।
మహీం కాలమహీం చైవ శైలకాననశోభితామ్॥ ౨౧
బ్రహ్మమాలా న్విదేహాంశ్చ మాళవా న్కాశికోసలాన్।
మాగధాంశ్చ మహాగ్రామా న్పుండ్రా న్వంగాం స్తథైవచ॥

పత్తనం కోశకారాణాం భూమించ రజతాకరామ్।
సర్వ మేత ద్విచేతవ్యం మార్గయద్భి స్తత స్తతః॥ ౨౩
రామస్య దయితాం భార్యాం సీతాం దశరథస్నుషామ్॥ ౨౩½
సముద్ర మవగాఢాంశ్చ పర్వతా న్పత్తనానిచ॥ ౨౪
మందరస్యచ యే కోటిం సంశ్రితాః కేచి దాయతామ్॥

కర్ణప్రావరణాశ్చైవ తథాచాప్యోష్ఠకర్ణకాః।
ఘోరలోహముఖాశ్చైవ జవనా శ్చైకపాదకాః॥ ౨౫½
అక్షయా బలవంతశ్చ పురుషాః పురుషాదకాః॥ ౨౬
కిరాతాః కర్ణచూడాశ్చ హేమాంగాః ప్రియదర్శనాః।
ఆమమీనాశనా స్తత్ర కిరాతా ద్వీపవాసినః॥ ౨౭
అంతర్జలచరా ఘోరా నరవ్యాఘ్రాఇతి శ్రుతాః।
ఏతేషా మాలయా స్సర్వేవిచేయాః కాననౌకసః॥ ౨౮

(౨౧) సరస్వతి సింధు నీలరత్నమువంటి జలముగల శోణనది వీనిలోను కేములతోను అరణ్యములతోను శోభించుచుండు మహీ కాలమహీ యను పేరులుగల దేశములలోను,

(౨౨) బ్రహ్మమాల విదేహ మాళవ కాశి కోసల గొప్ప గ్రామములు గలమగధ పుండ్ర వంగ దేశములలోను,

(౨౩,౨౩౪) కోశకారు లను పేరు గలరాజుల పట్టణములలోను, వెండికి ఉత్పత్తిస్థానముగనుండు భూప్రదేశములలోను, నాలుగుదిక్కులలోను శ్రీరాముని ప్రియమైన భార్యయు, దశరథునికి కోడలును నగుసీతను యీప్రదేశము లన్నిటిలోను వెతుకవలయును.

(౨౫,౨౫౪,౨౬) సముద్రము లోపలనుండు పర్వతములలోను పట్టణములలోను, మిగుల విశాలమగు మందరపర్వతము శిఖరములో వసించుచుండు వారును, చవులులేనివారును, చెవులవలె నుండుపెదవులు గలవారును, భయంకరమైన లోహమువలెనుండు ముఖముగలవారును, మిగుల వేగముగలవారును, ఒక పాదముతోనడచువారును, దీర్ఘాయువు గొప్పబలముగలిగి నరమాంసము భుజించువారును, వసించుప్రదేశములలోను,

(౨౭) చెవులవద్ద జుట్టుగలవారును, బంగారువంటి దేహముగలిగి చూచుటకు అందముగనుండువారును, పచ్చిచేపలను భుజించుచు ద్వీపములలో వసించు కిరాతులుండు ప్రదేశములలోను,

(౨౮) నీళ్ళలోపల సంచరించుచు సగముమనిషి సగము పులివంటి దేహముగలిగి భయంకరులై నరవ్యాఘ్రులని పేరు గలవారు వసించుచోటులనన్నిటిలోను, వానరులారా! సీతాదేవిని వెతుకవలయును.

గిరిభి ర్యేచ గమ్యంతే ప్లవనేన ప్లవేనచ।
రత్నవంతం యవద్వీపం సప్తరాజ్యోపశోభితమ్॥ ౨౯

సువర్ణరూప్యకం చైవ సువర్ణాకరమండితమ్।
యవద్వీప మతిక్రమ్య శిశిరో నామ పర్వతః॥ ౩౦

దివం స్పృశతి శృంగేణ దేవదానవసేవితః।
ఏతేషాం గిరిదుర్గేషు ప్రపాతేషు వనేషుచ॥ ౩౧

మార్గధ్వం సహితా స్సర్వే రామపత్నీం యశస్వినీమ్॥ ౩౧౼

తతో రక్తజలం శోణ మగాధం శీఘ్రగామినమ్।
గత్వా పారం సముద్రస్య సిద్ధచారణసేవితమ్॥ ౩౨౼

తస్య తీర్థేషు రమ్యేషు విచిత్రేషు వనేషుచ।
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః॥ ౩౩౼

పర్వతప్రభవా నద్య స్సురమ్యా బహునిష్కుటాః।
మార్గితవ్యా దరీమంతః పర్వతాశ్చ వనానిచ॥ ౩౪౼

(౨౯ మొదలు, ౩౧వరకు) పర్వతములమీద నెక్కి పోఁదగిన ద్వీపముల లోను, దాటిపోదగిన ద్వీపములలోను, పడవలలో నెక్కి పోవఁగినద్వీపములలోను, సీతను వెతకి రత్నములు గలిగి యేడుభాగములుగ నుండు యవద్వీపమునకును, బంగారు గనులతోఁ గూడి యుండు సువర్ణరూప్యకమను ద్వీపమునకును బోయి దీని దాటిన, దేవతలు దానవులు గలిగి యున్నతమై యాకాశమును ముట్టుకొనుచుండు శిశిరమను పర్వతముగలదు. దీనిలోను, యీద్వీపములతో సంబంధించిన చొచ్చుటకు సాధ్యపడని కొండలలోను, వాని ప్రాంత్యప్రదేశములలోను అరణ్యములలోను అందరు గుంపులుగఁ గూడి యశస్సుగల శ్రీరాముని భార్యను వెతుకవలయును. (యవద్వీపము సువర్ణరూప్యకమను ద్వీపములు సముద్రము మధ్యలో నున్నవి.)

(౩౨) (అవతారిక — ఇదివరకు జంబుద్వీపము దీనిలోని యేడుఖండములను లవణసముద్రములోఁగల ద్వీపములను దెలిపి యికమీద ప్లక్షద్వీపములో గల ప్రదేశములను జెప్పుచున్నాఁడు)

(౩౩) పిమ్మట, ఎఱ్ఱనైనయుండు జలముగలదియు లోతుగనుండునదియు, వేగముగఁ బ్రవహించునదియు, సిద్ధులు చారణులతోఁ గూడినదియు, లవణసముద్రముయొక్క అవతలి తట్టుననుండు శోణ మను పేరుగల నదము వద్దకుఁ బోయి, అందలియొక్క మనోహరములగు రేవులలోను, మిగుల ఆశ్చర్యముగనుండు జలములోను, అచ్చటచ్చట సీతతోఁ గూడియుండు రావణుని వెతుకవలయును.

(౩౪) కొండలలోఁ బుట్టి మిగులరమ్యమైన అనేకములగు ఉద్యానవనములుగల నదీతీరములలోను, గుహలుగలపర్వతములలోను వనములలోను సీతను వెతుకవలయును.

తత స్సముద్రద్వీపాంశ్చ సుభీమాన్ ద్రష్టు మర్హథ॥ ౩౫
ఊర్మిమంతం సముద్రంచ క్రోశంత మనిలోద్ధతమ్॥ ౩౫½
తత్రాసురా మహాకాయా శ్ఛాయాం గృహ్ణంతి నిత్యశః।
బ్రహ్మణా సమనుజ్ఞాతా దీర్ఘకాలం బుభుక్షితాః॥ ౩౬½

తం కాలమేఘప్రతిమం మహోరగనిషేవితమ్।
అభిగమ్య మహానాదం తీర్థేనైవ మహోదధిమ్॥ ౩౭½
తతో రక్తజలం భీమం లోహితం నామ సాగరమ్।
గతా ద్రక్ష్యథ తాం చైవ బృహతీం కూటశాల్మలీమ్॥ ౩౮½
గృహంచ వైనతేయస్య నానారత్న విభూషితమ్।
తత్ర కైలాససంకాశం విహితం విశ్వకర్మణా॥ ౩౯½

తత్ర శైలనిభా భీమా మందేహానామ రాక్షసాః॥
శైలశృంగేషు లంబంతే నానారూపా భయావహాః। ౪౦½
తే పతంతి జలే నిత్యం సూర్యస్యోదయనం ప్రతి॥ ౪౧
నిహతా బ్రహ్మతేజోభి రహన్యహని రాక్షసాః।
అభితప్తాశ్చ సూర్యేణ లంబంతేస్మ పునఃపునః॥ ౪౨
తతః పాండురమేఘాభం క్షీరోదంనామ సాగరమ్।
గతా ద్రక్ష్యథ దుర్ధర్షా ముక్తాహార మివోర్మిభిః॥ ౪౩

సుగ్రీవుఁడు వినతునికి తూర్పుదిక్కును వర్ణించి చెప్పుట. 

(౩౪) ఇక్షుసముద్రములోనుండు భయంకరమగు ద్వీపములలోను సీతను వెతుకవలయును.

(౩౪½) అలలతోఁ గూడి గాలికొట్టి మ్రోగుచుండు యిక్షుసముద్రమున కుఁబోయి చూడవలయును.

(౩౫½) ఇక్షుసముద్రములో, గొప్పశరీరముగలవారును బహుకాలముగ ఆకలితోనుండువారును నగు రాక్షసులు, బ్రహ్మయాజ్ఞచేనచటవసించుచు, ఆ ప్రాంతములోసంచరించుచుండు వారినీడను బట్టుకొనుచున్నారు.

(౩౬½,౩౭½,౩౮½) నల్లనిమేఘములతో సమానముగను, గొప్పసర్పములు గలదిగను మ్రోగుచుండు గొప్పధ్వనిగలదిగను నుండు ఇక్షుసముద్రమును నుపాయముతో దాటిపోయి, యెర్రనిజలముగలిగి భయంకరముగనుండు మనుసముద్రమున విశాలమైగుంపుగనుండు శల్మలివృక్షములను జూడవలయును. ఆశల్మలిద్వీపములో నానారత్నములచే నలంకరింపఁబడినదియు, కైలాసమువలె వెలుంగుచుండునదియు, విశ్వకర్మనిర్మించినదియు నగు గరుడుని గృహమును జూడవలయును.

(౪౦½) ఆమధుసముద్రములో కొండలతోసమానులై భయంకరులుగనుండు వారును, నానావిధములగు ఆకారములు గలవారును, మందేహులను పేరుగల రాక్షసులు అచటి కొండమీద వసించుచున్నారు.

(౪౧,౪౨) ఆమందేహులు సూర్యోదయము సమయములో ప్రతిపగటి పూట గాయత్రీమంత్రము తేజస్సుచేఁ గొట్టఁబడినవారై సూర్యుని తేజస్సుచే తపించి నురియు మరియు నాకొండమీదనే వసించుచున్నారు.

(౪౩) పిమ్మట, తెలని మేఘము కాంతిగలదియు, అలలుగలిగి ముత్యాలహారములతోఁ గూడినట్లుండు తెల్లనిజలముగల క్షీరసముద్రమును, తిరస్కరించుటకు సాధ్యపడని వానరులారా! పోయి చూడవలయును.

తస్య మధ్యే మహాః శ్వేత ఋషభోనామ పర్వతః।
దివ్యగంధైః కుసుమితై రాజతైశ్చ నగై ర్వృతః॥ ౪౪

సరశ్చ రాజతైః పద్మై ర్జ్వలితై ర్హేమకేసరైః।
నామ్నా సుదస్శనం నామ రాజహంసైః సమాకులమ్॥ ౪౫

విబుధా శ్చారణా యక్షాః కిన్నరా స్సాప్సరోగణాః।
హృష్టా స్సమభిగచ్ఛంతి నళినీం తాం రిరంసవః॥ ౪౬

క్షీరోదం సమతిక్రమ్య తతో ద్రక్ష్యథ వానరాః।
జలోదం సాగరశ్రేష్ఠం సవ్వభూతభయావహమ్॥ ౪౭

తత్ర తత్కోపజం తేజః కృతం హయముఖం మహత్।
అస్యాహు స్తన్మహావేగ మోదనం సచరాచరమ్॥ ౪౮

తత్ర విక్రోశతాం నాదో భూతానాం సాగరౌకసామ్।
శ్రూయతేచ సమర్థానాం దృష్ట్వా తద్బడబాముఖమ్॥ ౪౯

స్వాదూదస్యోత్తరేదేశే యోజనాని త్రయోదశ।
జాతరూపశిలోనామ మహా న్కనకపర్వతః॥ ౫౦

(౪౪) ఆక్షీరసముద్రముమధ్యలో దివ్యమైనపరిమళముగలిగి పూచిప్రకాశించుచుండు వృక్షములుగలదియు, విశాలముగను తెల్లగను నుండుఋషభ మహాపర్వతము గలదు.

(౪౫) వెలుఁగుచుండు బంగారమువంటి కింజల్కములుగలిగి, వెండివలెనుండు తామరపూలుగలిగి రాజహంసములతో నిండియుండు సుదర్శనమను పేరు గల సరస్సు గలదు.

(౪౬) దేవతలు చారణులు యక్షులు కిన్నెరులు అప్సరసల గుంపుతోఁ గూడి సంతోషించి ఆసరస్సునకు క్రీడించుటకు కోరవచ్చుచున్నారు. ఆచటకును బోయి చూడవలయును.

(౪౭) పిదప, వానరులారా! క్షీరసముద్రమునుదాటి సకలప్రాణులకు భయముగలిగించునట్టి మంచితీర్థముగల సముద్రమును జూడవలయును.

(౪౮) ఆమంచితీర్థముగల సముద్రములో బడబాగ్నిచేఁగలిగి గుర్రమువంటిముఖము గలగొప్పతేజస్సు గలదు. ఈ తేజస్సునకు స్థావరజంగములతోఁ గూడి గొప్పవేగము గలయీశుద్ధజలము, జగత్సంహారకాలములో, కట్టెలుగ నుండునని చెప్పుదురు.

(౪౯) ఈశుద్ధోదకసముద్రములో వసించుచుండు భూతములు సమర్థములుగనుండినను ఆతేజస్సుముఖమును జూచి భయపడి కూతలిడుధ్వని వినవచ్చుచున్నది.

(౫౦) ఆశుద్ధజలసముద్రము ఆవలితీరములో ౧౩ యోజనములు విస్తారముగల బంగారమువంటి రాళ్ళుగలిగి గొప్పబంగారము కొండ యున్నది.

తత్ర చంద్రప్రతీకాశం పన్నగం ధరణీధరమ్।
పద్మపత్రవిశాలాక్షం తతో ద్రక్ష్యథ వానరాః॥ ౫౧
ఆసీనం పర్వతస్యాగ్రే సర్వభూతనమస్కృతమ్।
సహస్రశిరసం దేవ మనంతం నీలవాససమ్॥ ౫౨

త్రిశిరాః కాంచనః కేతు స్తాల స్తస్య మహాత్మనః।
స్థాపితః పర్వతస్యాగ్రే విరాజతి సవేదికః॥ ౫౩
పూర్వస్యాం దిశి నిర్మాణం కృతం త త్త్రిదశేశ్వరైః॥ ౫౩½
తతః పరం హేమమయ శ్శ్రీమా నుదయపర్వతః।
తస్య కోటి ర్దివం స్పృష్ట్వా శతయోజన మాయతా॥ ౫౪½

జాతరూపమయీ దివ్యా విరాజతి సవేదికా॥ ౫౫½
సాలై స్తాలై స్తమాలైశ్చ కర్ణికారైశ్చ పుష్పితైః।
జాతరూపమయై ర్దివ్యై శ్శోభతే సూర్యసన్నిభైః॥ ౫౬
తత్ర యోజన విస్తార ముచ్ఛ్రితం దశయోజనమ్।
శృంగం సౌమనసంనామ జాతరూపమయం ధ్రువమ్॥ ౫౭

తత్ర పూర్వం పదం కృత్వా పురా విష్ణు స్త్రివిక్రమే।
ద్వితీయం శిఖరే మేరో శ్చకార పురుషోత్తమః॥ ౫౮

(౫౧,౫౨) ఆపర్వతముమీఁద చంద్రునివలె వెలుఁగుచు భూమిని మోయువాఁడును, పద్మపత్రములవలె విశాలములగు నేత్రములుగలవాఁడును, దానిశిఖరములోనుండువాఁడును, సకలప్రాణికోట్లచే నమస్కరింపఁబడువాఁడును, వేయితలలుగలవాఁడును, ప్రకాశించుచుండువాఁడును, నాశములేనివాఁడును, నీలమైన వస్త్రమునుధరించుకొని యుండు ఆదిశేషుని, వానరులారా! చూడవలయును.

(౫౩,౫౩½) మూఁడుశిఖరములుగలదియు, బంగారుచేఁ జేయఁబడి, తాటిచెట్టువలెనుండునదియు, నగు ఒకధ్వజము పీఠముతోడ మహాత్ముఁడగు అనంతునికి ఆశ్రయమగు పర్వతముమీఁద, తూర్పుదిక్కు యింతవరకే యనుటకు,గురుతుగ, దేవతలు నిలిపియున్నారు.

(౫౪½) ఆబంగారు కొండకు పిమ్మట, బంగారువికారమైన కాంతిగల ఉదయగిరిగలదు. దాని శిఖరము ఆకాశమునుముట్టుచు నూరుయోజనములు విశాలముగనున్నది.

(౫౫½,౫౬) బంగారువికారముగనుండునదియు శ్రేష్ఠముగనుండునదియు వేదికతోఁగూడినదియు, బంగారుమయమై సూర్యునివలెనుండు, శ్రేష్ఠమై పూచియుండు, సాల తాల తమాల కర్ణికార వృక్షములు గలిగి ఉదయగిరిశిఖరము ప్రకాశించుచున్నది.

(౫౭) ఆశిఖరములో నొకయోజనము వెడల్పుగను పదియోజనముల నిడివిగను బంగారుమయమై వృత్తముగనుండు సౌమనస మనుశిఖరము గలదు.

(౫౮) పూర్వము,పురుషోత్తముఁడగు విష్ణు త్రివిక్రమావతారములో ఆసౌమనసశిఖరములో నొకపాదమును రెండవపాదమును సౌవర్ణికమనుపేరుగల మేరువుశిఖరములోను నుంచెను.

ఉత్తరేణ పరిక్రమ్య జంబూద్వీపం దివాకరః।
దృశ్యో భవతి భూయిష్ఠం శిఖరం తన్మహోచ్ఛ్రియమ్॥ ౫౯

తత్ర వైఖానసానామ వాలఖిల్యా మహర్షయః।
ప్రకాశమానా దృశ్యంతే సూర్యవర్ణా స్తపస్వినః॥ ౬౦

అయం సుదర్శనో ద్వీపః పురో యస్య ప్రకాశతే।
యస్మిం స్తేజశ్చ చక్షుశ్చ సర్వప్రాణి భృతామపి॥ ౬౧

శైలస్య తస్య శృంగేషు కందరేషు వనేషుచ।
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః॥ ౬౨

కాంచనస్యచ శైలస్య సూర్యస్యచ మహాత్మనః।
ఆవిష్టా తేజసా సంధ్యా పూర్వా రక్తా ప్రకాశతే॥ ౬౩

పూర్వ మేత త్కృతం ద్వారం పృథివ్యా భువనస్యచ।
సూర్యస్యోదయనం చైవ పూర్వా హ్యేషా దిగుచ్యతే॥ ౬౪

(౫౯) సూర్యుడు జంబూద్వీపమునకు ఉత్తరభాగములో సంచరించి మిగులమున్నతముగనుండు సౌమనస మనుశిఖరము చేరి, మేరుపర్వతమునకు దక్షిణభాగములోనుండువారికి బాగుగ అగుపడుచున్నాడు.

(౬౦) ఉదయపర్వతములో సూర్యునివంటివర్ణముగలవారును తపసుచేయుచుండువారును నగువైఖానసులు వాలఖిల్యులు అనుమహర్షులు ప్రకాశించుచు అగుపడుచున్నారు.

(౬౧) ఉదయగిరిప్రక్కలోనుండు ద్వీపమునకు సుదర్శన ద్వీపమనిపేరు. సకలప్రాణికోటుల నేత్రములు సూర్యుని తేజస్సుతోను సకలపదార్థములను గ్రహించగలవు అట్టిసూర్యుడను తేజస్సు సుదర్శన ద్వీపములో వెలుగుచున్నది.

(౬౨) ఆ ఉదయగిరి శిఖరములలోను గుహలలోను వనములలోను, వానరులారా! అచ్చటచట సీతాదేవిని రావణుని కనిపెట్టవలయును.

(౬౩) బంగారుమయమగు ఉదయపర్వతము మహాత్ముడగు సూర్యుని తేజస్సుపడి ప్రాతఃకాలములో నెర్రగ ప్రకాశించుచున్నది.

(౬౪) ఈ ఉదయగిరిని భూమికి లోకమునకు మొట్టమొదటి ద్వారముగ బ్రహ్మ సృష్ట్యాదిలో నేర్పరచెను సూర్యుడు నాలుగుప్రక్కలలో సంచరించుటకు మొట్టమొదటిస్థానముగ దీని నేర్పాటుచేసెను కనుకనే, దీనికి పూర్వము (మొదటి) దిక్కు అని పేరుగలిగినది.

తస్య శైలస్య పృష్ఠేషు నిర్ఝరేషు గుహాసుచ।
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః॥ ౬౫
తతః పరమగమ్యాస్యా ద్దిక్పూర్వా త్రిదశావృతా।
రహితా చంద్రసూర్యాభ్యా మదృశ్యా తిమిరావృతా॥ ౬౬

శైలేషు తేషు సర్వేషు కందరేషు వనేషుచ।
యేచ నోక్తా మయా దేశా విచేయా తేషు జానకీ॥ ౬౭
ఏతావ ద్వానరై శ్శక్యం గంతుం వానరపుంగవాః।
అభాస్కర మమర్యాదం నజానీమ స్తతః పరమ్॥ ౬౮

అధిగమ్యతు వైదేహీం నిలయం రావణస్యచ।
మాసే పూర్ణే నివర్తధ్వ ముదయం ప్రాప్య పర్వతమ్॥ ౬౯
ఊర్ధ్వం మాసా న్నవస్తవ్యం వస న్వధ్యో భవే న్మమ।
సిద్ధార్థా స్సన్నివర్తధ్వ మధిగమ్యచ మైథిలీమ్॥ ౭౦

మహేంద్రకాంతాం వనషండమండితాం దిశం చరిత్వా నిపు
ణేన వానరాః। అవాప్య సీతాం రఘువంశజ ప్రియాం తతో
నివృత్తా స్సుఖినోభవిష్యథ॥ ౭౧
ఇతి శ్రీమత్కింధాకాండే - చత్వారింశస్సర్గః.

(౬౫) ఆ ఉదయగిరి క్రిందిభాగములోను కొండనదులలోను గుహలలోను నచ్చటచట సీతాదేవిని రావణుని వెతుకవలయును.

(౬౬) ఉదయగిరికి పిమ్మటిభాగములో దేవతులు నిండియుండు పూర్వదిక్కులోఁ బోవుటకు సాధ్యముకాదు. ఏలననఁగా, అచట సూర్యచంద్రులు లేక అంధకారము నిండి యేమియు తెలియక ఉండును.

(౬౭) నేనుచెప్పిన పర్వతములు గుహములు వనములు అన్నిటిలోను నేను చెప్పని ప్రదేశములలోను సీతను వెతుకవలయును.

(౬౮) వానరశ్రేష్ఠులారా! నేను చెప్పినంతవరకు మీరు పోగలరు. ఈ ప్రదేశమునకు పైన సూర్యుని ప్రకాశము నగరములు గ్రామములు లేక చీకటిగనుండును.

(౬౯) ఉదయగిరిచేత సీతాదేవిని రావణుఁడుండు ప్రదేశమును కనిపెట్టి ఒకనెల నిండుటకులోగా వచ్చి చేరవలయును.

(౭౦) ఒకనెల గడిచి మీరెచటను నుండకూడదు. అటుల ఉండినవాని నేను వధింతును. సీతాదేవిని కనిపెట్టి కృతార్థులై తిరిగి రావలయును.

(౭౧) వానరులారా! ఇంద్రునికి ప్రియముగనుండునదియు వనసమూహములచే నలంకరింపఁబడినదియు నగు పూర్వదిక్కులో చాతుర్యముగ సంచరించి శ్రీరాముని ప్రియురాలగు సీతను గనిపెట్టి వచ్చి సుఖముగ నుండవచ్చును.

ఇది నలుబదవసర్గ.



## ఏకచత్వారింశస్సర్గః.

తతః ప్రస్థాప్య సుగ్రీవ స్తన్మహ ద్వానరం బలమ్।
దక్షిణాం ప్రేషయామాస వానరా నభిలక్షితాన్॥ ౧
నీల మగ్నిసుతం చైవ హనుమంతంచ వానరమ్।
పితామహసుతం చైవ జాంబవంతం మహాబలమ్॥ ౨
సుహోత్రంచ శరారించ శరగుల్మం తథైవచ।
గజం గవాక్షం గవయం సుషేణ మృషభం తథా॥ ౩
మైందంచ ద్వివిదం చైవ విజయం గంధమాదనమ్।
ఉల్కాముఖ మసంగంచ హుతాశనసుతా వుభౌ॥ ౪
అంగదప్రముఖా న్వీరాన్ వీరః కపిగణేశ్వరః।
వేగవిక్రమసంపన్నాన్ సందిదేశ విశేషవిత్॥ ౫
తేషా మగ్రేసరం చైవ మహ ద్బల మసంగగమ్।
విధాయ హరివీరాణా మాదిశ ద్దక్షిణాం దిశమ్॥ ౬
యే కేచన సముద్దేశా స్తస్యాం దిశి సుదుర్గమాః।
కపీశః కపిముఖ్యానాం సతేషాం తా నుదాహరత్॥ ౭
సహస్రశిరసం వింధ్యం నానాద్రుమలతాయుతమ్।
నర్మదాంచ నదీం దుర్గాం మహోరగనిషేవితామ్॥ ౮

సుగ్రీవుఁడు సీతాన్వేషణకై అంగదాదులను దక్షిణదిక్కునకుఁ బంపుట. ౪౬౯

౪౧ వ సర్గ.

(౧) సుగ్రీవుఁడు ఆ గొప్ప వానరసేనను తూర్పుదిక్కునకుఁ బంపి, పిమ్మట, యింతకుముందే సమర్థులని తెలిసియుండిన వానరులను దక్షిణ దిక్కునకుఁ బంపెను.

(౨ మొదలు ౫ వరకు) వీరుఁడును కపిసమూహములకు రాజుగనుండువాఁడును వారివారి యోగ్యతావిశేషములను కనిపెట్టిన సుగ్రీవుఁడు, వేగము పరాక్రమము గలవారును, అంగదుఁడు మొదలగు వీరులగు అగ్ని పుత్రుఁడగు నీలుఁడు, హనుమంతుఁడు, బ్రహ్మపుత్రుఁడైన గొప్పబలముగల జాంబవంతుఁడు, సుహోత్రుఁడు, శరారి, శరగుల్మ, గజ, గవాక్ష, గవయ, సుషేణుఁడు, ఋషభుఁడు, మైందద్వివిదులు, విజయుఁడు, గంధమాదనుఁడు, అగ్ని కొడుకులగు ఉల్కాముఖుఁడు అసంగుఁడు అను వానరులను దక్షిణదిక్కునకుఁ బంపెను.

(౬) వానరవీరులను వీరికి ముందు గొప్ప వానరసేన వేగముగ దక్షిణ దిక్కులోఁ బోవలయునని ఆజ్ఞాపించెను.

(౭) దక్షిణదిక్కులోఁ బోవుటకు సాధ్యముకాని ప్రదేశములను వానరరాజగు సుగ్రీవుఁడు ఆ వానర వీరులతోఁ జెప్పెను.

(౮) వేయిశిఖరములు గలిగి నానావిధములగు వృక్షములులతలతో నిండియుండు వింధ్యపర్వతమును, గొప్పపాములతో నిండి ప్రవేశించుటకు సాధ్యముకాని నర్మదానదిలోను,

తతో గోదావరీం రమ్యాం కృష్ణవేణీం మహానదీమ్।
వరదాంచ మహాభాగాం మహోరగనిషేవితామ్॥ ౯
మేఖలా ముత్కలాంశ్చైవ దశార్ణ నగరాణ్యపి।
అశ్వవంతీ మవంతీంచ సర్వ మేవానుపశ్యత॥ ౧౦
విదర్భా నృషికాంశ్చైవ రమ్యా న్మాహిషకానపి।
తథా వంగా న్కలింగాంశ్చ కౌశికాంశ్చ సమంతతః॥ ౧౧
అన్వీక్ష్య దండకారణ్యం సపర్వత నదీం గుహామ్।
నదీం గోదావరీం చైవ సర్వ మేవానుపశ్యత॥ ౧౨
తథైవాంధ్రాంశ్చ పుండ్రాంశ్చ చోళా న్పాండ్యా న్సకేరళాన్।
అయోముఖశ్చ గంతవ్యః పర్వతో ధాతుమండితః॥ ౧౩
విచిత్రశిఖర శ్శ్రీమాన్ చిత్రపుష్పితకాననః।
స చందనవనోద్దేశో మార్గితవ్యో మహాగిరిః॥ ౧౪
తత స్తా మాపగాం దివ్యాం ప్రసన్నసలిలాం శివామ్।
తత్ర ద్రక్ష్యథ కావేరీం విహితా మప్సరోగణైః॥ ౧౫
తస్యాసీనం నగస్యాగ్రే మలయస్య మహౌజసమ్।
ద్రక్ష్యథాదిత్యసంకాశ మగస్త్య మృషిసత్తమమ్॥ ౧౬
తత స్తేనాభ్యనుజ్ఞాతాః ప్రసన్నేన మహాత్మనా।
తామ్రపర్ణీం గ్రాహజుష్టాం తరిష్యథ మహానదీమ్॥ ౧౭

(౯) మనోహరమగు గోదావరి, గొప్పనదియగు కృష్ణవేణి, మిగుల మహిమగలిగి గొప్ప సర్పములుగల వరదానదిలోను,

(౧౦) మేఖలా ఉత్కలాయను నదులలోను, దశార్ణమను పట్టణములోను అశ్రవంతి అవంతి పట్టణములలోను, అన్ని ప్రదేశములలోను సీతను వెతుకవలయును.

(౧౧) విదర్భ ఋషిక రమ్యమగు మహిష దేశములలోను, వంగ కళింగ కాశీ దండకారణ్య దేశములలోను,

(౧౨,౧౨౪) పర్వతములు నదులు గుహలుగల దండకారణ్యములో నుండు గోదావరి ఖండములలోను, అటులనే ఆంధ్ర పుండ్ర చోళ పాండ్య కేరళ దేశములలోను సీతను వెతుకవలయును.

(౧౩,౧౪) గైరికాది ధాతువులచే నలంకరింపఁ బడినదిగను, విచిత్రములగు శిఖరములుగలదిగను, నానారంగులుగల పూచియుండు అరణ్యముల కాంతితోఁ గూడినదిగను చందనవనములతో నిండినదిగను, నుండు సహ్య పర్వతమను గొప్పకొండలో సీతను వెతుకవలయును.

(౧౫) పిమ్మట, నిర్మలమగు తీర్థముగలదియు, శుభమును నిచ్చునదియు, అప్సరసలచేఁ బూజింపఁబడునదియు నగు కావేరియను నదిని సహ్యకొండలోఁ జూడవలయును.

(౧౬) ప్రసిద్ధమగు మలయపర్వతముమీఁదఁ గూర్చుండియుండు గొప్ప తేజస్సుగల సూర్యునివలె వెలుఁగుచుండు ఋషిశ్రేష్ఠుఁడగు అగస్త్యమహర్షిని జూడవలయును.

(౧౭) ప్రసన్నుఁడును మహాత్ముఁడును నగు అగస్త్యుని ఆజ్ఞనుబడిసి మకరములతో నిండియుండు తామ్రపర్ణియను నదిని దాఁటవలయును.

సా చందనవనై ర్దివ్యైః పరిచ్ఛన్నా ద్వీపశాలినీ।
కాంతేవ యువతిః కాంతం సముద్ర మవగాహతే॥ ౧౮

తతో హేమమయం దివ్యం ముక్తామణివిభూషితమ్।
యుక్తం కవాటం పాండ్యానాం గతా ద్రక్ష్యథ వానరాః॥ ౧౯

తత స్సముద్ర మాసాద్య సంప్రధార్యార్థనిశ్చయమ్।
అగస్త్యేనాంతరే తత్ర సాగరే వినివేశితః॥ ౨౦

చిత్రనానానగ శ్శ్రీమా న్మహేంద్రః పర్వతోత్తమః।
జాతరూపమయ శ్శ్రీమాం నవగాఢో మహార్ణవమ్॥ ౨౧

నానావిధై ర్నగై స్సర్వై ర్లతాభి శ్చోపశోభితమ్।
దేవర్షి యక్షప్రవరై రప్సరోభిశ్చ సేవితమ్॥ ౨౨

సిద్ధచారణసంఘైశ్చ ప్రకీర్ణం సుమనోహరమ్।
తముపైతి సహస్రాక్ష స్సదా పర్వసు పర్వసు॥ ౨౩

ద్వీప స్తస్యాపరే పారే శతయోజన మాయతః।
అగమ్యో మానుషై ర్దీప్త స్తం మార్గధ్వం సమంతతః॥
తత్ర సర్వాత్మనా సీతా మార్గితవ్యా విశేషతః॥ ౨౪½

(౧౭) శ్రేష్ఠమగు చందనవనములు ద్వీపములుగలదియు నగు తామ్రపర్ణి యువతియగు స్త్రీ భర్తను బడయుచున్నటుల, సముద్రమునకుఁ బోవుచున్నది.

(౧౮) పిమ్మట, వానరులారా! బంగారుతో నిండినదియు దివ్యమైనదియు, ముత్యములతోను రత్నములతో నలంకరింపఁబడినదియు నగు పాండ్యరాజులకుఁదగియుండు పట్టణమును జూడవలయును.

(౨౦, ౨౧) పాండ్యదేశమునుండి సముద్రతీరమునకుఁ బోయి, సముద్రమును దాటుట మొదలగు కార్యములను నిటుల చేయవలయును. ఆతీరములో ఆశ్చర్యముగను నానావిధములగు వృక్షములను గలదిగను, పుష్పఫలాది సమృద్ధి గలదిగను, ప్రకాశించుచుండునదిగను బంగారు వికారముగనుండునదిగను నుండు మహేంద్రపర్వతమును అగస్త్యమహర్షి ఉంచియున్నాఁడు. అది గొప్పసముద్రములో మునిగినటు లున్నది.

(౨౨, ౨౩) నానావిధములగు వృక్షములు లతలచేఁ బ్రకాశించుచుండునదియు, దేవర్షులు శ్రేష్ఠులగు యక్షులు అప్సరసులు సిద్ధులు చారణుల గుంపులతో నిండి మిగులమనోహరముగ నుండునదియు, నగుఆపర్వతమునకు ఇంద్రుఁడు పర్వదినములలో సదా వచ్చుచున్నాఁడు.

(౨౪) సముద్రములో నూరుయోజనముల వెడల్పుగలదియు, మనుష్యులుపోవుటకు సాధ్యపడనదియు, ప్రకాశించుచుండునదియు నగునొకద్వీపముగలదు. దానిలో నలుప్రక్కలలోను వెతుకవలయును.

(౨౫) ఆద్వీపములో నన్నిప్రదేశములలోను బాగుగ సీతాదేవిని వెతుకవలయును.

సహి దేశస్తు వధ్యస్య రావణస్య దురాత్మనః।
రాక్షసాధిపతే ర్వాస స్సహస్రాక్షసమ ద్యుతేః॥
దక్షిణస్య సముద్రస్య మధ్యే తస్యతు రాక్షసీ॥
అంగారకేతి విఖ్యాతా ఛాయా మాకృష్య భోజినీ॥

ఏవం నిస్సంశయా న్కృత్వా సంశయా న్నష్టసంశయా
న్మృగయధ్వం నరేంద్రస్య పత్నీ మమితతేజసః॥
త మతిక్రమ్య లక్ష్మీవాన్ సముద్రే శతయోజనే।
గిరిః పుష్పితకో నామ సిద్ధచారణసేవితః॥

చంద్రసూర్యాంశుసంకాశ స్సాగరాంబుసమావృతః।
భ్రాజతే విపులై శ్శృంగై రంబరం విలిఖన్నివ॥
తస్యైకం కాంచనం శృంగం సేవతే౽యం దివాకరః।
శ్వేతం రాజత మేకంచ సేవతే౽యం నిశాకరః॥

న తం కృతఘ్నాః పశ్యంతి నన్నృశంసా ననాస్తికాః।
ప్రణమ్య శిరసా శైలం తం విమార్గత వానరాః॥
త మతిక్రమ్య దుర్ధర్షా స్సూర్యవాన్నామ పర్వతః।
అధ్వనా దుర్విగాహేన యోజనాని చతుర్దశ॥

(౨౧౪) దురాత్ముఁడును పాపియును ఇంద్రునివంటి కాంతిగలవాఁడును రాక్షసులకురాజును, వధించుటకుఁ దగినవాఁడును నగు రావణునికి అదివాసస్థానముగ నున్నది.

(౨౬౪) ఆ దక్షిణసముద్రము మధ్యలో మనుజుల ఛాయలను బట్టుకొని వారినిభుజించునట్టి అంగారక యనుపేరుగల రక్కసి గలదు.

(౨౭౪) ఈ విధముగ సీతఉన్నదో లేదో యనుసందేహముగనుండు దేశములలో నామెను వెతకి ఆమెయుండుట లేకపోవుట నిర్ధారణచేసికొని సందేహమునుబోగొట్టుకొని అపరిమితముగ తేజస్సుగల, శ్రీరామునిభార్య యగుసీతను మరికొన్నిప్రదేశములలో వెతుకవలయును.

(౨౮౪,౨౯౪) ఆ లంకాద్వీపమును దాటి సముద్రములో నూరుయోజనములుపోయినటులైతే కాంతిగలదియు, సిద్ధులు చారణులతో నిండినదియు, సూర్యచంద్రుల కిరణములవలె వెలుంగుచుండునదియు, సముద్రము జలముచేఁజుట్టఁబడినదియు, విశాలమగు శిఖరములచే ఆకాశమును ముట్టుకొనునటు లుండునదియు నగుపుష్పితకమను పర్వతము ప్రకాశించుచున్నది.

(౩౦౪) ఆపుష్పితకమను కొండయొక్క బంగారుమయమగు శిఖరములో దక్షిణాయనములో సూర్యుఁడు వచ్చుచున్నాఁడు. వెండివలెనుండు ఒకశిఖరములోఁ జంద్రుఁడు వచ్చుచున్నాఁడు.

(౩౧౪) వానరులారా! కృతఘ్నులు పాపులు నాస్తికులు అపుష్పితక పర్వతముచుజూచలేరు ఆపర్వతమునకు శిరసానమస్కరించి అచట సీతను వెతుకవలయును.

(౩౨౪) ఇతరులు తిరస్కరించుటకు సాధ్యపడనివానరులారా! పుష్పితక పర్వతమునుదాటి పోయినటులైతే సూర్యవంతము అను పేరుగల పర్వతమున్నది. ఆమార్గము మిగులకష్టముగనుండును. పుష్పితకపర్వతమునకుదీనికి ౧౮యోజనములు.

తత స్తమప్యతిక్రమ్య వైద్యుతో నామ పర్వతః।
సర్వకామఫలై ర్వృక్షై స్సర్వకాలమనోహరైః॥ ౩౩½
తత్ర భుక్త్వా వరార్హాణి మూలానిచ ఫలానిచ।
మధూని పీత్వా ముఖ్యాని పరం గచ్ఛత వానరాః॥ ౩౪½

తత్ర నేత్రమనఃకాంతః కుంజరోనామ పర్వతః।
అగస్త్యభవనం యత్ర నిర్మితం విశ్వకర్మణా॥ ౩౫½
తత్ర యోజనవిస్తార ముచ్ఛ్రితం దశయోజనమ్।
శరణం కాంచనం దివ్యం నానారత్నవిభూషితమ్॥ ౩౬½

తత్ర భోగవతీనామ సర్పాణా మాలయః పురీ।
విశాలకక్ష్యా దుర్ధర్షా సర్వతః పరిరక్షితా। ౩౭½
రక్షితా పన్నగై ర్ఘోరై స్తీక్ష్ణదంష్ట్రై ర్మహావిషైః।
సర్పరాజో మహాప్రాజ్ఞో యస్యాం వసతి వాసుకిః॥ ౩౮½

నిర్యాయ మార్గితవ్యాచ సాచ భోగవతీ పురీ॥ ౩౯
తత్రచానంతరా దేశా యేకేచన సుసంవృతాః॥ ౩౯½
తంచ దేశ మతిక్రమ్య మహా నృషభసంస్థితః।
సర్వరత్నమయ శ్శ్రీమా నృషభోనామ పర్వతః॥ ౪౦½

(౩౩½) పిమ్మట, సూర్యవంతమను పర్వతమును దాఁటి పోయినటులైతే కోరినట్టిఫలములుగల, సదామనోహరముగనుండు వృక్షములుగల వైద్యుతము అను పర్వతము గలదు.

(౩౪½) వానరులారా! ఆపర్వతములో ఉత్తములు భుజింపఁదగిన గడ్డలు ఫలములు భుజించి ఉత్తమమగు మధుపానముచేసి అచటినుండి పోవలయును.

(౩౫½) ఆప్రదేశములో నేత్రములకు మనసుకును యింపుగనుండు కుంజరమను పర్వతముగలదు. దానిమీద విశ్వకర్మ అగస్త్యుఁడు వసించుటకై గృహమును నిర్మించుచున్నాఁడు.

(౩౬½) ఆకుంజర పర్వతముమీఁద ౧౦యోజనములు పొడవుగలదియును, బంగారువికారముగను శ్రేష్ఠముగను నానారత్నములతో నలంకరింపఁ బడినదియును నగు అగస్త్యుని గృహముగలదు.

(౩౭½,౩౮) ఆ పర్వతములో విశాలమగు కక్ష్యములుగలదియును, తిరస్కరించుటకు సాధ్యముకానిదియును, పదునుగలకోరపండ్లు గొప్పవిషముగలిగి భయంకరమగు పాములచే అన్నిదిక్కులలోను బాగుగరక్షింపఁబడిన సర్పములువసించునట్టి భోగవతియనిపేరుగల పట్టణము గలదు.

(౩౯) ఆభోగవతీ పట్టణములో మిగులప్రాజ్ఞుఁడును సర్పములకురాజును నగువాసుకి వసించుచున్నాఁడు. అగస్త్యుని గృహమునుండి ప్రయాణమైపోయి భోగవతి పట్టణములో సీతను వెతుకవలయును.

(౩౯½) ఆభోగవతి మధ్యలో ననేకరహస్యప్రదేశములు గలవు. ఆచటను వెతకి చూడవలయును.

(౪౦½) భోగవతీపట్టణమును దాటిపోయిన గొప్పదిగను ఎద్దువంటి ఆకారముగలదిగను రత్నములమయమై ప్రకాశించుచుండు ఋషభమను పర్వతము గలదు.

గోశీర్షకం పద్మకం చ హరిశ్యామంచ చందనమ్।
దివ్య ముత్పద్యదే యత్రి తచ్చైవాగ్నిసమ ప్రభమ్॥ ౪౧
నతు తచ్చందనం దృష్ట్వా స్ప్రష్టవ్యంచ కదాచన।
రోహితానామ గంధర్వా ఘోరా రక్షంతి తద్వనమ్॥ ౪౨

తత్రి గంధర్వపతయః పంచసూర్య సమప్రభాః।
శైలూషో గ్రామణీ శిగ్రు శ్శుభ్రో బభ్రు స్తథైవచ॥ ౪౩
రవిసోమాగ్నివపుషాం నివాసః పుణ్యకర్మణామ్।
అంతే పృథివ్యా దుర్ధర్షా స్తత్రి స్వర్గజిత స్థితాః॥ ౪౪

తతః పరం నవస్సేవ్యః పితృలోక స్సుదారుణః।
రాజధానీయ మస్యైషా కష్టేన తమసావృతా॥ ౪౫
ఏతావ దేవ యుష్మాభి ర్వీరా వానరపుంగవాః।
శక్యం విచేతుం గంతుంవానాతో గతిమతాం గతిః॥ ౪౬

సర్వ మేత త్సమాలోక్య యచ్చాన్యదపి దృశ్యతే।
గతిం విదిత్వా వైదేహ్యా స్సన్నివర్తితు మర్హథ॥ ౪౭
యస్తు మాసా న్నివృత్తోగ్రే దృష్టా సీతేతి వక్ష్యతి।
మత్తుల్య విభవో భోగై స్సుఖం సవిహరిష్యతి॥ ౪౮

(౮౧౪) ఆపర్వతములో గోరోచనము పద్మదళము, తమాలచిగురువంటి వర్ణముగల దివ్యమైన చందనవృక్షములు ఉత్పత్తియగుచున్నవి. అవి అగ్నివంటి కాంతిగలిగి ఉండును.

(౮౨౪) వానరులారా! ఆచందన వృక్షములనుజూచి వానిముట్టుకొనవలదు. ఆచందనవనమును భయంకరులగు రోహితులను గంధర్వులు రక్షించుచున్నారు.

(౮౩౪) అచట సూర్యునివలె వెలుంగుచుండు శైలూషుఁడు, గ్రామణి శిగ్రుడు, శుభ్రుఁడు, బభ్రుఁడు అను పేర్లుగల ౫ మంది గంధర్వరాజులు వసించుచున్నారు.

(౮౮౪) సూర్యుఁడు చంద్రుఁడు అగ్నివంటిదేహముగల పుణ్యముచేసినవారికిది వాసస్థానముగనున్నది. భూమికి కొట్టకొనలోనుండు ఆపర్వతములో తిరస్కరించుటకు సాధ్యపడని స్వర్గమును బొందియుండు పుణ్యపురుషులు వసించుచున్నారు.

(౮౫౪) దానిదాటిన మిగుల భయంకరమగు పితృలోకమున్నది. అచటికి మీరు పోవలదు. అది యముని రాజధాని. మిగుల చీకటి దాని నావరించుకొనియున్నది.

(౮౬౪) వీరులగు వానరశ్రేష్ఠులారా! మీరు యింతవరకే పోయి సీతను వెతుకగలరు. దాని దాఁటిపోవుటకు మీకు సాధ్యపడదు.

(౮౭౪) నేను చెప్పిన యీ ప్రదేశములలోను, నేను చెప్పని మరికొన్ని ప్రదేశములలోను, సీతాదేవియుండు ప్రదేశమును దెలిసికొని తిరిగిరావలయును.

(౯౦౪) ఒక నెలలోపల తిరిగివచ్చి సీతను జూచినటుల నాకుఁ జెప్పువాఁడు సకల సుఖములు నావలె ననుభవించుచు సుఖముగ నుండవచ్చును.

తతః ప్రియతరో నాస్తి మమ ప్రాణా ద్విశేషతః।
కృతాపరాధో బహుశో మమబంధు ర్భవిష్యతి॥ ౪౯

అమిత బలపరాక్రమా భవంతో విపులగుణేషు కులేషుచ
ప్రసూతాః । మనుజపతి సుతాం యథా లభధ్వం తదధిగుణం
పురుషార్థ మారభధ్వమ్॥ ౫౦

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - ఏకచత్వారింశస్సర్గః.

## ద్విచత్వారింశస్సర్గః.



అథ ప్రస్థాప్య సుగ్రీవ స్తాన్ హరీ ద్దక్షిణాం దిశమ్।
అబ్రవీ న్మేఘసంకాశం సుషేణంనామ యూథపమ్॥ ౧
తారాయాః పితరం రాజా శ్వశురం భీమవిక్రమమ్।
అబ్రవీ త్ప్రాంజలి ర్వాక్య మభిగమ్య ప్రణమ్యచ॥ ౨
మరీచిపుత్రం మారీచ మర్చిష్మంతం మహాకపిమ్।
వృతం కపివరై శ్శూరై ర్మహేంద్రసదృశద్యుతిమ్॥ ౩
బుద్ధివిక్రమసంపన్నం వైనతేయ సమద్యుతిమ్।
మరీచిపుత్రా న్మారీచా నర్చిర్మాలా న్మహాబలాన్॥ ౪

(౪౯½) అట్టిపురుషునికంటె నాప్రేమకుఁ బాత్రుఁడుగనుండు వాఁడిం కొకఁడుండఁడు. అతఁడు నాప్రాణములకంటె నాకు మిగుల ప్రేమపాత్రుఁడు. అతఁడనేకాపరాధములు చేసినను నాకు బంధువగును.

(౫౦½) అపరిమితముగనుండు బలపరాక్రమములు గలవారగను, అనేకములగు సద్గుణములుగల కులములోఁ బుట్టినవారగను నుండు మీరు జనకుని కూఁతురగు సీతను నెట్లు కనిపెట్టవచ్చునో అట్టి పురుషప్రయత్నమును జేయవలయును.

ఇది నలువదియొకటవ సర్గ.

---

౪౨ వ సర్గ.

(అవతారిక.—సుగ్రీవుఁడు సుషేణుఁడు మొదలగువారిని సీతను వెతుకుటకై పడమటదిక్కునకుఁ బంపుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧, ౨) అంగదుఁడు మొదలగు వానరులను దక్షిణదిక్కునకుఁబంపి, పిమ్మట, మేఘమువలె వెలుఁగుచుండు వాఁడును వానరసేనాధిపతియు, తారాదేవితండ్రియు, అతనికి మామయు, భయంకరమగు పరాక్రమము గలవాఁడును నగు సుషేణుని సమీపమునకుఁబోయి సుగ్రీవుఁడు నమస్కరించి అంజలిచేసికొని యిటు లనెను.

(౩, ౪, ౪½) తేజోవంతుఁడును శూరులగు వానరవీరులచేఁ గూడియుండువాఁడును, ఇంద్రునివంటి కాంతిగలవాఁడును బుద్ధి పరాక్రమము గలవాఁడును, గరుడునితో సమమైన తేజస్సుగలవాఁడును, నగు మహాకపియగు మరీచుని పెద్ద

ఋషిపుత్రాంశ్చ తా న్సర్వా న్ప్రతీచీ మాదిశ ద్దిశమ్। ౪
ద్వాభ్యాం శతసహస్రాభ్యాం కపీనాం కపిసత్తమాః।
సుషేణప్రముఖా యూయం వైదేహీం పరిమార్గత॥ ౫
సురాష్ట్రా న్సహ బాహ్లీకా న్శూరా న్భీమాం స్తథైవచ।
స్ఫీతా న్జనపదా న్రమ్యా న్విపులాని పురాణిచ॥ ౬
పున్నాగగహనం కుక్షిం వకులోద్దాలకాకులమ్।
తథా కేతకషండాంశ్చ మార్గధ్వం హరియూథపాః॥ ౭
ప్రత్యక్స్రోతో గమాశ్చైవ నద్య శ్శీతజలా శ్శివాః।
తాపసానా మరణ్యాని కాంతారా గిరయశ్చయే॥ ౮

తత స్స్థలీం మరుప్రాయా మత్యుచ్చ శిరస శ్శిలాః।
గిరిజాలావృతాం దుర్గాం మార్గిత్వా పశ్చిమాం దిశమ్॥ ౯

తతః పశ్చిమ మాసాద్య సముద్రం ద్రష్టు మర్హథ।
తిమినక్రాయుతజల మక్షోభ్య మథ వానరాః॥ ౧౦
తతః కేతకషండేషు తమాలగహనేషు చ।
కపయో విహరిష్యంతి నారికేళ వనేషుచ॥ ౧౧
తత్ర సీతాంచ మార్గధ్వం నిలయం రావణస్యచ।
వేలాతట నివిష్టేషు పర్వతేషు వనేషుచ॥ ౧౨

కొడుకగు మారీచుని, తేజస్సు గొప్పబలము గలవారగను, మరీచి పుత్రులగు వారినందరిని పడమటిదిక్కునకుఁ బోవలయునని ఆజ్ఞాపించెను.

(౫౫) సుషేణుడు మొదలగు వానరవీరులారా! రెండు లక్షల వానరుల తోడ మీరు పోయి సీతను వెతుకవలయును.

(౬౫, ౭౫, ౮౫) రమ్యమై ధనధాన్య సమృద్ధిగలిగియుండు సురాష్ట్ర, బాహ్లీక శూర భీమ దేశములలోను, విశాలమగు పట్టణములలోను, పొన్న పొగడ ఉద్దాలక చెట్లతో నిండియుండు అరణ్య మధ్య ప్రదేశములలోను, అటులనే, మొగలి పొదలలోను, పడమటిదిక్కుగ బోవునట్టి చల్లనిజలముగలిగి మంగళకరమగు నదులలోను, ఋషులువసించునట్టి అరణ్యములలోను, ఇంకను మరికొన్ని అరణ్యములలోను పర్వతములలోను, వానరసేనాధిపతులారా! సీతను వెతుకవలయును.

(౯౫, ౧౦౫) పిమ్మట, మరుభూమిలోను పొడవుగనుండు బండలమీదను అనేకకొండలుగల పడమటిదిక్కులోను సీతను వెతకి, పిమ్మట, పడమటిదిక్కునకుఁ బోయి తిమితిమింగిలములు ఎండ్రకాయలతోఁ గూడిన జలముగల యొండిపోనట్టి పడమటిసముద్రమును జూడవలయును.

(౧౧౫) అచట, మొగలిపొదలలోను తమాలవనములలోను టెంకాయతోపులలోను వానరులు విహరించవచ్చును.

(౧౨౫) సముద్రజలముగల ప్రదేశములలోను, తీరములోనుండు పర్వతములు అరణ్యములలోను సీతను రావణుడుండు ప్రదేశమును వెతుకవలయును.

మురచీ పత్తనం చైవ రమ్యాంచైవ జటీపురమ్।
అవంతీ మంగలోపాంచ తథా చాలక్షితం వనమ్॥ ౧౩½
రాష్ట్రాణిచ విశాలాని పత్తనాని తత స్తతః॥ ౧౪

సింధుసాగరయోశ్చైవ సంగమే తత్ర పర్వతః।
మహా న్ హేమగిరి ర్నామ శతశృంగో మహాద్రుమః॥ ౧౫
తస్య ప్రస్థేషు రమ్యేషు సింహాః పక్షగమాః స్థితాః।
తిమి మత్స్యగజాంశ్చైవ నీడాన్యా రోపయంతి తే॥ ౧౬

తాని నీడాని సింహానాం గిరిశృంగగతాశ్చయే।
దృప్తా స్తృప్తాశ్చ మాతంగా స్తోయదస్వన నిస్స్వనాః॥ ౧౭
విచరంతి విశాలేస్మిన్ తోయపూర్ణే సమంతతః॥ ౧౭½

తస్య శృంగం దివ స్పర్శం కాంచనం చిత్రపాదపమ్।
సర్వ మాశు విచేతవ్యం కపిభిః కామరూపిభిః॥ ౧౮½
కోటిం తత్ర సముద్రేతు కాంచనీం శతయోజనామ్।
దుర్దర్శాం పారియాత్రస్య గతా ద్రక్ష్యథ వానరాః॥ ౧౯½

కోట్య స్తత్ర చతుర్వింశ ద్గంధర్వాణాం తరస్వినామ్।
వసం త్యగ్నినికాశానాం ఘోరాణాం కామరూపిణామ్॥ ౨౦½

(౧౩౪,౧౪) మరీచిపట్టణములోను, రమ్యమగు జటీపురములోను, అవంతి అంగలోప అను పట్టణములలోను, అందరికిని తెలియనంతు అరణ్యము లలోను,విశాలముగనుండు దేశములలోను పట్టణములలోను నచ్చటచట సీతాదేవిని వెతుకవలయును.

(౧౫) పడమటిదిక్కులో సింధునది సముద్రములోఁ గలియు ప్రదేశములో గొప్పదిగను నూరుశిఖరములు గలదిగను గొప్పవృక్షములుం గలదిగను నుండు హేమగిరి యను పర్వతము గలదు.

(౧౬) మనోహరముగనుండు హేమగిరి ప్రాంతప్రదేశములలో రెక్కలుగల సింహములున్నవి. అవి తిమి మొదలగు చేపలను, యితరచేపలను గజములను గొప్పవృక్షముల కొనలలోనుండు వాని గూళ్ళలో దీసికొనిపోయి యుంచుకొనుచున్నవి.

(౧౭,౧౮) మేఘగర్జనవంటి ధ్వనిగలిగి మదించి సంతోషముగల విశేషముగ జలముగల ప్రదేశములలో నుండు యేనుఁగులు, హేమగిరి మీదనుండు యేనుఁగులు, సింహముల గూళ్ళుగల ప్రదేశములలో సంచరించుచున్నవి.

(౧౮౪) ఆకాశమును తాకుచుండునవియు బంగారు మయముగ నుండునవియు నానావర్ణములు గలవృక్షములు గలవియు నగు హేమగిరి శిఖరములన్నిటిలోను కోరినరూపములను దాల్చగల కపులు సీతను వెతుకవలయును.

(౧౯౪) ఆసముద్రములో పారియాత్రమను పర్వతముయొక్క బంగారు మయమైన నూరుయోజనముల విశాలముగల చూచుటకు సాధ్యపడని శిఖరమును, వానరులారా! పోయి చూడవలయును.

(౨౦౪) బలవంతులును అగ్నివలె వెలుంగుచుండువారును భయంకరులుగ నుండువారును కోరినరూపమును ధరించువారును నగు ౨౪ కోట్ల గంధర్వులు అచట వసించుచున్నారు.

పావకార్చిః ప్రతీకాశా స్సమవేతా స్సహస్రశః।
నాత్యాసాదయితవ్యా స్తై వానరై ర్భీమవిక్రమైః॥ ३०५

నాదేయంచ ఫలం తస్మా ద్దేశా త్కించిత్ ప్లవంగమైః।
దురా సదాహి తే వీరా స్సత్త్వవంతో మహాబలాః॥ ३३५
ఫలమూలాని తే తత్ర రక్షంతె భీమవిక్రమాః॥ ३३

తత్ర యత్నశ్చ క_ర్తవ్యో మార్గితవ్యాచ జానకీ।
నహి తేభ్యో భయం కించి త్కపిత్వ మనువ_ర్తతామ్॥

తత్ర వైడూర్య వర్ణాభో వజ్రసంస్థానసంస్థితః।
నానాద్రుమలతాకీర్ణో వజ్రోనామ మహాగిరిః॥ ३४
శ్రీమా న్సముదిత_స్తత్ర యోజనానాం శతం సమమ్॥ ३४५

గుహా_స్తత్ర విచేతవ్యాః ప్రయత్నేన ప్లవంగమాః॥ ३६
చతుర్భాగే సముద్రస్య చక్రవా న్నామ పర్వతః।
తత్ర చక్రం సహస్రారం నిర్మితం విశ్వకర్మణా॥ ३२

తత్ర పంచజనం హత్వా హయగ్రీవం చ దానవమ్।
ఆజహార తత శ్చక్రం శంఖంచ పురుషో త్తమః॥ ३८

(౨౧½) అగ్నిజ్వాలవలె నుండువారును, వేనవేలుగ గుంపుగనుండు వారును నగు అట్టి గంధర్వుల వద్దకు, భయంకరమగు పరాక్రమముగల వానరులు పోకూడదు.

(౨౨½,౨౩) వానరులు ఆప్రదేశమునుండి ఒకఫలమునైనను తీసికొనిరాకూడదు. ఏలననఁగా, వీరులగు గంధర్వులు ధైర్యము గొప్పబలముగలవారై, యితరులు జయించుటకు సాధ్యపడనివారై, ఉన్నారు. భయంకరమైన పరాక్రమముగల ఆగంధర్వులు కొండమీఁది ఫలములను మూలములను రక్షించుకొని యున్నారు.

(౨౪) అచట, ఫలములను భుజించుటకు యత్నించక సీతను వెతుకవలయును. సామాన్యమైన వానరులకు ఆగంధర్వులవల్ల నేమియు భయములేదు.

(౨౫,౨౫½) పడమటిసముద్రములో వైడూర్యమువంటి కాంతిగలదియు, వజ్రమువలె దృఢముగనుండునదియు, నానావిధములగు చెట్లతోను లతలతోను నిండినదియునగు వజ్రమనుకొండగలదు. కాంతిగలఆకొండ నూరుయోజనములు సమముగను ఉన్నతముగను నున్నది.

(౨౬) వానరులారా! గొప్పప్రయత్నముతో ఆకొండలోనుండు గుహలలో సీతను వెతుకవలయును.

(౨౭) లవణసముద్రమునకు నాల్గవభాగములో చక్రవంత మనుకొండగలదు. ఆపర్వతములో విశ్వకర్మ వేయిఆకులు గలచక్రమును నిర్మించియున్నాఁడు.

(౨౮) ఆచక్రవంతములో పురుషోత్తముఁడగు విష్ణు, చక్రమును రక్షించుచుండు హయగ్రీవుఁడను రాక్షసునిజంపి చక్రమును, పంచజనుఁడను రాక్షసుని జంపి అతని అస్థిగనుండి పాంచజన్యమనుపేరుగల శంఖమును, అపహరించెను.

తస్య సానుషు చిత్రేషు విశాలాసు గుహాసుచ।
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః॥ ౨౯
యోజనానాం తత ష్షష్టి ర్వరాహో నామ పర్వతః।
సువర్ణ శృంగ స్సుశ్రీమా నగాధే వరుణాలయే॥ ౩౦
తత్ర ప్రాగ్జ్యోతిషం నామ జాతరూపమయం పురమ్।
యస్మి న్వసతి దుష్టాత్మా నరకో నామ దానవః॥ ౩౧
తత్ర సానుషు చిత్రేషు విశాలాసు గుహాసుచ।
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః॥ ౩౨
త మతిక్రమ్య శైలేంద్రం కాంచనాంతరనిర్దరః।
పర్వత స్సర్వసౌవర్ణో ధారా ప్రస్రవణాయుతః॥ ౩౩
తం గజాశ్చ వరాహాశ్చ సింహా వ్యాఘ్రాశ్చ సర్వతః।
అభిగర్జంతి సతతం తేన శబ్దేన దర్పితాః॥ ౩౪
యస్మి న్హరిహయ శ్శ్రీమా న్మహేంద్రః పాకశాసనః॥
అభిషిక్త స్సురై రాజా మేఘవా న్నామ పర్వతః॥ ౩౫
త మతిక్రమ్య శైలేంద్రం మహేంద్రపరిపాలితమ్।
షష్టి ర్గిరిసహస్రాణి కాంచనాని గమిష్యథ॥ ౩౬
తరుణాదిత్యవర్ణాని భ్రాజమానాని సర్వతః।
జాతరూపమయై ర్వృక్షైః శోభితాని సుపుష్పితైః॥ ౩౭

(౨౯) నానారంగులుగల ఆచక్రవంతము ప్రక్కలలోను, విశాలమగు గుహలలోను, మరియు, అచ్చటచటను, సీతాదేవిని రావణుని వెతుకవలయును.

(30) ఈచక్రవంతమును దాటిపోయినట్లయితే బంగారు మయమైన శిఖరములుగలిగి మిగుల ప్రకాశించుచుండు, ౬౦ యోజనముల విశాలముగల వరాహమనుపర్వతము. మిగుల లోతుగనుండు పడమటి సముద్రములోఁ నున్నది.

(౩౧) ఆవరాహ పర్వతముమీద బంగారుమయమగు ప్రాగ్జోతిషమను పురముగలదు. దానిలో దుష్టుఁడగు నరకాసురుఁడు ఉన్నాఁడు.

(3౨) ఆపర్వతముయొక్క నానారంగులుగల ప్రక్కలలోను విశాలమగు గుహలలోను అచ్చటచట సీతను రావణుని వెతుకవలయును.

(33) శ్రేష్ఠమగు వరాహపర్వతమును దాఁటి పోయినచో లోపల వెలుపల బంగారు మయముగనుండు గుహలుగల గిరినదులధారలతోఁగూడిన సర్వసౌవర్ణ పర్వతముగలదు.

(3౪) ఏనుఁగులు పందులు సింహములు పులులు ఆ పర్వతములో నన్ని ప్రదేశములలో మదించి కూఁతలు వేయుచున్నవి.

(3౫) పచ్చనిగుఱ్ఱములు గలిగి శ్రీమంతుఁడును పాకాసురుని జంపినవాఁడును రాజును నగు ఇంద్రునికి దేవతలు పట్టాభిషేకము చేసిన కొండను మేఘవంతమని పేరు.

(3౬) ఇంద్రుఁడు పరిపాలించునట్టి మేఘవంతమును దాఁటి బంగారు మయములగు ౬౦వేల కొండలకుఁ బోవలయును.

(3౭) బాలసూర్యునివంటి వర్ణముగలిగి నన్ని ప్రదేశములలోను బ్రకాశించి బాగుగఁ బూచియుండు బంగారు మయమగు వృక్షములచే ఆకొండలు ప్రకాశించుచున్నవి.

తేషాం మధ్యే స్థితో రాజా మేరు రుత్తరపర్వతః।
ఆదిత్యేన ప్రసన్నేన శైలో దత్తవరః పురా॥ ౩౮
తేనైవ ముక్త శ్శైలేంద్రః సర్వఏవ త్వదాశ్రయాః।
మత్ప్రసాదా ద్భవిష్యంతి దివారాత్రించ కాంచనాః॥ ౩౯
త్వయి యే చాపి వత్స్యంతి దేవగంధర్వదానవాః।
తే భవిష్యంతి రక్తాశ్చ ప్రభయా కాంచనప్రభాః। ౪౦
విశ్వేదేవాశ్చ మరుతో వసవశ్చ దివౌకసః।
ఆగమ్య పశ్చిమాం సంధ్యాం మేరుముత్తరపర్వతమ్॥ ౪౧
ఆదిత్య ముపతిష్ఠంతి తైశ్చ సూర్యోభిపూజితః।
అదృశ్య స్సర్వభూతానా మస్తం గచ్ఛతి పర్వతమ్॥ ౪౨
యోజనానాం సహస్రాణి దశ తాని దివాకరః।
ముహూర్తార్ధేన తం శీఘ్ర మభియాతి శిలోచ్చయమ్॥ ౪౩
శృంగే తస్య మహద్దివ్యం భవనం సూర్యసన్నిభమ్।
ప్రాసాదగణసంబాధం విహితం విశ్వకర్మణా॥ ౪౪
శోభితం తరుభి శ్చిత్రై ర్నానాపక్షిసమాకులైః।
నికేతం పాశహస్తస్య వరుణస్య మహాత్మనః॥ ౪౫
అంతరా మేరు మస్తంచ తాలో దశశిరా మహాన్।
జాతరూపమయ శ్శ్రీమాన్ భ్రాజతే చిత్రవేదికః॥ ౪౬

(౩౮) ప్రసన్నుఁడైన సూర్యునిచే పూర్వము వరములు బడసినట్టి ఉత్తర దిక్కులోనుండు మేరుపర్వతము ౬౦ వేల కొండల మధ్యలో పర్వత రాజుగ నున్నది.

(౩౯) 'నీమీద వసించుచుండు వారు నా యనుగ్రహముచే రాత్రిపగలు బంగారువలె నుందురు.' అని సూర్యుఁడు మేరుపర్వతమునకు వరమిచ్చెను.

(౪౦) నీమీద వసించుచుండు దేవతలు గంధర్వులు దానవులు బంగారు వంటి కాంతిగలవారై యెర్రగ నగుపడుచుందురు.

(౪౧,౪౨) విశ్వేదేవతలు మరుత్ దేవతలు అష్టవసువులు దేవతలు సాయం సంధ్యాకాలములో మనకు ఉత్తరములోనుండు మేరు పర్వతమునకు వచ్చియుండు సూర్యుని బూజించుచున్నారు. సూర్యుఁడెవరికిని దెలియక అచటినుండి అస్తగిరికిఁ బోవుచున్నాఁడు.

(౪౩) సూర్యుఁడు అర్థముహూర్తములోపల పదివేల యోజనములు దాటి అస్తగిరిని శీఘ్రముగఁ జేరుచున్నాఁడు.

(౪౪) అస్తగిరి శిఖరముమీద గొప్పదిగను శ్రేష్ఠముగను సూర్యునితో సమముగను అనేక మేడలతో నిండియుండు గృహము వు విశ్వకర్మ సూర్యుఁడు వసించుటకు నిర్మించియున్నాఁడు.

(౪౫) నానావిధములగు పక్షులుగల అనేకరంగులుగల వృక్షములతోఁ బ్రకాశించుచుండు గృహమును, పాశమునుగ్రహించిన మహాత్ముఁడగు వరుణునికి విశ్వకర్మ నిర్మించి యిచ్చెను.

(౪౬) మేరుపర్వతమునకు అస్తగిరికిమధ్య బంగారు మయముగను కాంతి గలదిగను నానారంగులుగల వేదికగలదిగను గొప్పదిగను పదితలలు గలతాటివృక్షము ప్రకాశించుచున్నది.

తేషు సర్వేషు దుర్గేషు సరస్సుచ సరిత్సుచ।
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః॥ ౪౭
యత్ర తిష్ఠతి ధర్మజ్ఞ స్తపసా స్వేన భావితః।
మేరుసావర్ణి రిత్యేవ ఖ్యాతో వై బ్రహ్మణా సమః॥ ౪౮

ప్రష్టవ్యో మేరుసావర్ణి ర్మహర్షి స్సూర్యసన్నిభః।
ప్రణమ్య శిరసా భూమౌ ప్రవృత్తిం మైథిలీం ప్రతి॥ ౪౯
ఏతావ జ్జీవలోకస్య భాస్కరో రజనీక్షయే।
కృత్వా వితిమిరం సర్వ మస్తం గచ్ఛతి పర్వతమ్॥ ౫౦
ఏతావ ద్వానరై శ్శక్యం గంతుం వానరపుంగవాః।
అభాస్కర మమర్యాదం నజానీమ స్తతః పరమ్॥ ౫౧

అధిగమ్యతు వైదేహీం నిలయం రావణస్యచ।
అస్తపర్వత మాసాద్య పూర్ణే మాసే నివర్తత॥ ౫౨
ఊర్ధ్వం మాసా న్నవస్తవ్యం వసన్వధ్యో భవే న్మమ॥ ౫౨½
సహైవ శూరో యుష్మాభి శ్శ్వశురో మే గమిష్యతి।
శ్రోతవ్యం సర్వ మేతస్య భవద్భి ర్దిష్టకారిభిః॥ ౫౩½
గురు రేష మహాబాహుః శ్వశురో మే మహాబలః।
భవంతశ్చాపి విక్రాంతాః ప్రమాణం సర్వకర్మసు॥ ౫౪½

(౪౭) పోవుటకు సాధ్యముకాని ఆదుర్గములలోను తటాకములలోను నదులలోను అచ్చటచట సీతాదేవిని రావణుని వెదుకవలయును.

(౪౮) మేరుపర్వతములో ధర్మజ్ఞుఁడును తపసుచే మహిమగలవాఁడును బ్రహ్మతో సమమైనవాఁడును ప్రసిద్ధుఁడునుఁగు మేరుసావర్ణి యనఋషి వసించుచున్నాఁడు.

(౪౯) సూర్యునితో సముఁడగు మేరుసావర్ణి మహర్షికి సాష్టాంగనమస్కారముసేసి సీతవృత్తాంతమును నతని మీరు అడుగవలయును.

(౫౦) సూర్యుఁడు రాత్రి గడచిపోవుచుండగా ప్రాణిలోకమునకు ఉదయపర్వతము అస్తపర్వతము మధ్యగల ప్రదేశములలో చీకటిని బోఁగొట్టి అస్తగిరిలోఁ బ్రవేశించుచున్నాఁడు.

(౫౧) వానరవీరులారా! నేను చెప్పినంతవరకు మీరు పోవచ్చును. అంతకుపైన సూర్యుఁడు లేక వ్యవస్థలేని ప్రదేశములు మనకుఁ దెలియవు.

(౫౨, ౫౨½) అస్తగిరికిఁ బోయి, సీతాదేవిని రావణునిప్రదేశమును దెలిసికొని ఒకనెల నిండుటకు మునుపే వచ్చిచేరవలయును. ఒకనెలకు పైన అచట ఉండకూడదు. అటుల ఉండినవానికి మరణదండన విధించెదను.

(౫౩½) శూరుఁడును నామామయు నగు సుషేణుఁడు, చెప్పిన పనిచేయుచుండు మీతోడ, వచ్చుచున్నాఁడు. మీరందరు అతనిమాటను వినుచుండవలయును.

(౫౪½) గొప్ప భుజములు బలము గలనామామయగు సుషేణుఁడు అందరికిని పెద్దవాఁడుగ నున్నాఁడు. మీరంపరును మిగుల పరాక్రమముగల వారుగనే యున్నారు. అన్నికార్యములు సేయుటలో మీరే ముఖ్యులుగ నుండవలయును.

పరిమాణ మేనం సంస్థాప్య పశ్యధ్వం పశ్చిమాందిశమ్॥ ౫౫
దృష్టాయాంతు నరేంద్రస్య పత్న్యా మమితతేజసః।
కృతకృత్యా భవిష్యామః కృతస్య ప్రతికర్మణా॥ ౫౬

అతో౽న్యదపి యత్కార్యం కార్యస్యాస్య హితం భవేత్।
సంప్రధార్య భవద్భిశ్చ దేశకాలార్థసంహితమ్॥ ౫౭

తత స్సుషేణప్రముఖాః ప్లవంగా స్సుగ్రీవవాక్యం నిపుణం ని
శమ్య। ఆమంత్ర్య సర్వే ప్లవగాధిపం తే జగ్ము ర్దిశం తాం వ
రుణాభిగుప్తామ్॥ ౫౮

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - ద్విచత్వారింశస్సర్గ.

## త్రిచత్వారింశస్సర్గః.

తత స్సందిశ్య సుగ్రీవ శ్శ్వశురం పశ్చిమాందిశమ్।
వీరం శతవలిం నామ వానరం వానరర్షభః॥ ౧
ఉవాచ రాజా ధర్మజ్ఞ స్సర్వవానరసత్తమమ్।
వాక్య మాత్మహితంచైవ రామస్యచ హితం తథా॥ ౨

(౫౫) ఇతనిమీఁదు యజమానునిగ నేర్పరచుకొని పడమటిదిక్కులో సీతాదేవిని వెతకిచూడవలయును.

(౫౬) అపరిమితమైన తేజస్సుగల శ్రీరామునిభార్య ఆగుపడినటులైతే, ఉపకారమునకు ప్రత్యుపకారముచేసి, మనమందరు ధన్యులుగా వచ్చును.

(౫౭) సీతాన్వేషణ కార్యమునకు అనుకూలమగు మరికొన్ని కార్యములను దేశకాలార్థములను నాలోచించి మీరే చేయవలయును.

(౫౮) పిమ్మట, సుషేణుఁడు మొదలగువానరులు సుగ్రీవుని యొక్క సార్థకమైన మాటను విని వానరులందరు అతనివద్ద అనుజ్ఞ పుచ్చుకొని వరుణుఁడు పాలించుచుండు పడమటిదిక్కుకుఁ బోయిరి.

ఇది నలువది రెండవ సర్గ.

౪౩ వ సర్గ.

(అవతారిక. — శతవలి మొదలగు వానరులను సుగ్రీవుఁడు సీతను వెతకుటకు ఉత్తరదిక్కునకుఁ బంపుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది)

(౧, ౨) పడమటిదిక్కునకు మామయగు సుషేణుని పోవలయునని ఆజ్ఞాపించి, పిమ్మట, వానరశ్రేష్ఠుఁడును రాజును ధర్మజ్ఞుఁడును నగు సుగ్రీవుఁడు, వీరుఁడును వానరులలో నుత్తముఁడును నగుశతవలియను పేరుగలవానరునితో తనకు రామునికి హితముగనుండు మాటను జెప్పెను.

వృత శ్శతసహస్రేణ త్వద్విధానాం వనౌకసామ్।
వైవస్వతసుత్తై స్సార్థం ప్రతిష్ఠస్వ స్వమంత్రిభిః॥ ౩
దిశం హ్యుదీచీం విక్రాంతాం హిమశైలావతంసకామ్।
సర్వతః పరిమార్గధ్వం రామపత్నీ మనిందితామ్॥ ౪

అస్మి న్కార్యే వినిర్వృత్తే కృతే దాశరథేః ప్రియే।
ఋణా న్ముక్తా భవిష్యామః కృతార్థార్థవిదాం వరాః॥ ౫
కృతంహి ప్రియ మస్మాకం రాఘవేణ మహాత్మనా।
తస్య చేత్ ప్రతికారోఽస్తి సఫలం జీవితం భవేత్॥ ౬

అర్థినః కార్యనిర్వృత్తి మకర్తు రపి యశ్చరేత్।
తస్యస్యా త్సఫలం జన్మ కింపునః పూర్వకారిణః॥ ౭
ఏతాం బుద్ధి మవస్థాయ దృశ్యతే జానకీ యథా।
తథా భవద్భిః కర్తవ్య మస్మ త్ప్రియహితైషిభిః। ౮

అయం హి సర్వభూతానాం మాన్య స్తు నరసత్తమః।
అస్మాసు చాగత ప్రీతీ రామః పరపురంజయః॥ ౯
ఇమాని వనదుర్గాణి నద్య శ్శైలాంతరాణిచ।
భవంతః పరిమార్గంతు బుద్ధివిక్రమసంపదా॥ ౧౦

సీతాన్వేషణకై సుగ్రీవుఁడు శతవలిని ఉత్తరదిక్కునకుఁ బంపుట. ౪౩

(౩) నీవంటి లక్షవానరులతోను వైవస్వతుని కొడుకులగు నీమంత్రులతోఁ గూడి ప్రయాణము చేయుము.

(౪) విశాలమై హిమవత్పర్వతమును ఆభరణముగ గల ఉత్తరదిక్కునకుఁ బోయి అన్నిచోట్లలోను పరిశుద్ధురాలగు శ్రీరాముని భార్యను బాగుగ వెతుకవలయును.

(౫) ఈకార్యమును పరిపూర్తిచేసి శ్రీరామునికి సంతోషము గలిగించి ఋణవిముక్తులమై కృతార్థులలోను లాభమును బొందినవారిలోను నుత్తములుగ మనము ఉండవచ్చును.

(౬) మహాత్ముఁడగు శ్రీరాముఁడు మనకు మిగుల సంతోషము గలిగించెను. అట్టి సంతోషమునకు ప్రత్యుపకారము చేసినటులైతే మనజన్మము సార్థకమగును.

(౭) ఒక ఉపకారముచేయక కార్యమును నపేక్షించు వానికి అట్టికార్యా పరిపూర్తిచేసినవాని జన్మము సఫలమగును. ఉపకారము చేసినవాని కార్యమును సఫలము చేసినచో జన్మము సఫలమగునని చెప్పవలయునా.

(౮) ఇట్టి యభిప్రాయమును మనసులో నుంచుకొని నాకు ప్రియమును హితమును గోరుచుండు మీరు సీతను వెతకి కనిపెట్టుటలో యత్నము సేయవలయును.

(౯) పురుషోత్తముఁడగు యీ రాముఁడు సకల ప్రాణికోట్లకుపూజ్యుఁడు. శత్రుపుర పట్టణములను జయించగల యితనికి మనమీద మిగుల ప్రీతిగలదు.

(౧౦) ఈవనములు దుర్గములలోను నదులు పర్వతముల మధ్యప్రదేశములలోను మీరు బుద్ధి పరాక్రమసంపదతోఁ గూడి సీతను వెతుకవలయును.

తత్ర మ్లేచ్ఛా న్పుళిందాంశ్చ శూరసేనాం స్తథైవచ।
ప్రస్థరా న్భరతాంశ్చైవ కురూంశ్చ సహమద్రకైః॥ ౧౧
కాంభోజా న్యవనాం శ్చైవ శకా నారట్టకానపి।
బాహ్లీకా నృషికాం శ్చైవ పౌరవా నథ టంకణాన్॥ ౧౨

చీనా న్పరమచీనాంశ్చ నిహారాంశ్చ పునఃపునః।
అన్విష్య దరదాంశ్చైవ హిమవంతం తథైవచ॥ ౧౩
లోధ్రపద్మకషండేషు దేవదారువనేషుచ।
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తతః స్తతః॥ ౧౪

తత స్సోమాశ్రమం గత్వా దేవగంధర్వసేవితమ్।
కాళంనామ మహాసానుం పర్వతంతు గమిష్యథ॥ ౧౫
మహత్సు తస్య శైలస్య నిర్దరేషు గుహాసుచ।
విచినుధ్వం మహాభాగాం రామపత్నీం తత స్తతః॥ ౧౬

త మతిక్రమ్య శైలేంద్రం హేమగర్భం మహాగిరిమ్।
తత స్సుదర్శనం నామ గంతు మర్హథ పర్వతమ్॥ ౧౭
తతో దేవసఖో నామ పర్వతః పతగాలయః।
నానాపక్షిగణాకీర్ణో వివిధద్రుమభూషితః॥ ౧౮

(౧౧) మ్లేచ్ఛ, పుళింద, సూరసేన, దేశములలోను, భరత ఇంద్రప్రస్త మొదలగు ప్రదేశములలోను, దక్షిణకురు మద్రక,

(౧౨) కాంభోజ యవన శక ఆరట్టక బాహ్లీక రుషిక పౌరవ టంకణ చీనా, ఉత్తరచీనా,

(౧౩) నీహార, దరద, దేశములలోను హిమవత్పర్వతములోను, మరియు మరియు వెతకి సీతను కని పెట్టవలయును.

(౧౪)లోధ్ర చందన దేవదారు వనములలో నచ్చటచట సీతాదేవిని రావణుని వెతుకవలయును.

(౧౫) దేవతలు గంధర్వులు నిండియుండు సోముని ఆశ్రమమునకుఁ బోయి గొప్ప ప్రక్కభావములు గల కాలమను పర్వతమునకు మీదు పోవలయును.

(౧౬) కాళమను పర్వతముయొక్క గొప్ప మధ్య ప్రదేశములలోను, గుహలలోను, మిగుల పూజ్యురాలగు శ్రీరాముని భార్యను అచ్చటచట వెతుకవలయును.

(౧౭) లోపల బంగారముగల కాళమను; గొప్పపర్వతమును దాటి, పిమ్మట, సుదర్శన మనుపేరుగల పర్వతమునకుఁ బోవలయును.

(౧౮) దాని దాటిపోయినటులైతే, పక్షులకు వాసస్థానమై అనేక పక్షులగుంపులతో నిండి నానావిధములగు వృక్షములచే నలంకరింపఁబడిన దేవసఖము ను పర్వతముగలదు,

తస్య కాననషండేషు నిర్ఝరేషు గుహాసుచ।
రావణస్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః॥ ౧౯
త మతిక్రమ్య చాకాశం సర్వత శ్శతయోజనమ్।
అపర్వతనదీవృక్షం సర్వసత్త్వవివర్జితమ్॥ ౨౦

తం తు శీఘ్ర మతిక్రమ్య కాంతారం రోమహర్షణమ్।
కైలాసం పాండురం శైలం ప్రాప్య హృష్టా భవిష్యథ॥ ౨౧
తత్ర పాండురమేఘాభం జాంబూనదపరిష్కృతమ్।
కుబేరభవనం దివ్యం నిర్మితం విశ్వకర్మణా॥ ౨౨

విశాలా నళినీ యత్ర ప్రభూతకమలోత్పలా।
హంసకారండవాకీర్ణా హ్యప్సరోగణసేవితా॥ ౨౩
తత్ర వైశ్రవణో రాజా సర్వభూతనమస్కృతః।
ధనదో రమతే శ్రీమాన్ గుహ్యకైస్సహ యక్షరాట్॥ ౨౪

తస్య చంద్రనికాశేషు పర్వతేషు గుహాసుచ।
రావణస్సహవైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః॥ ౨౫
క్రౌంచంతు గిరి మాసాద్య బిలం తస్య సుదుర్గమమ్।
అప్రమత్తైః ప్రవేష్టవ్యం దుష్ప్రవేశం హి తత్ స్మృతమ్॥ ౨౬

(౧౯) దేవసఖపర్వతము అరణ్యములలోను గిరినదులలోను గుహలలోను సీతను రావణుని అచ్చటచట వెతుకవలయును.

(౨౦) ఈ దేవసఖ పర్వతము దాటి పోయినచో కొండలు నదులు వృక్షములు, ఒకప్రాణిలేక, నూరు యోజనములవరకు నలుప్రక్కలలోను శూన్యమైన ప్రదేశము గలదు.

(౨౧) రోమాంచము గలిగించునట్టి ఆశూన్యారణ్యమును శీఘ్రముగ దాటి, తెల్లగనుండు కైలాసపర్వతముచేరి మీరు సంతోషించెదరు.

(౨౨) కైలాసపర్వతములో తెల్లని మేఘమువలె కాంతిగలదియు, బంగారుచేఁ జేయఁబడినదియు, శ్రేష్ఠమైనదియు, నగు విశ్వకర్మ నిర్మించిన కుబేరుని భవనము గలదు.

(౨౩) ఆకైలాసములో బాగుగ వృద్ధిపొందియుండు తామరపూలు నల్లకలువలు గలిగి హంసలు నీటికోళ్ళతో నిండి అప్సరసల గుంపుతోఁ గూడి విశాలమైన మానససరస్సు గలదు.

(౨౪) ఆకైలాసములో సకల భూతములచే నమస్కరింపఁబడువాఁడును, శ్రీమంతుఁడును, ధనమును నిచ్చువాఁడును, యక్షులకు రాజును నగు కుబేరుఁడు గలఁడు.

(౨౫) కైలాసపర్వతముయొక్క దాపున చంద్రునివలె వెలుంగుచుండు మరికొన్ని పర్వతములలోను గుహలలోను రావణుని సీతాదేవిని అచ్చటచట వెతుకవలయును.

(౨౬) అచటనుండి క్రౌంచపర్వతమునకుఁ బోయి ప్రవేశించుటకు సాధ్యముకాని దానిబిలములో మిగుల జాగ్రత్తగఁ బ్రవేశించవలయును. ఏలననఁగా, దానిలోఁ బ్రవేశించుట మిగుల కష్టముగనుండును.

వసంతి హి మహాత్మాన స్తత్ర సూర్యసమప్రభాః।
దేవై రప్యర్చితా స్సమ్య గ్దేవరూపా మహర్షయః॥ ౨౭

క్రౌంచస్య తు గుహాశ్చాన్యా స్సానూని శిఖరాణిచ।
నిర్దరాశ్చ నితంబాశ్చ విచేతవ్యా స్తత స్తతః॥ ౨౮

క్రౌంచస్య శిఖరంచాపి నిరీక్ష్యచ తత స్తతః।
అవృక్షం కామశైలంచ మానసం విహగాలయమ్॥ ౨౯

న గతి స్తత్ర భూతానాం దేవదానవరక్షసామ్।
సచ సర్వై ర్విచేతవ్య స్ససాను ప్రస్థభూధరః॥ ౩౦

క్రౌంచం గిరి మతిక్రమ్య మైనాకో నామ పర్వతః।
మయస్య భవనం యత్ర దానవస్య స్వయంకృతం॥ ౩౧

మైనాకస్తు విచేతవ్య స్ససానుప్రస్థకందరః।
స్త్రీణా మశ్వముఖీనాంచ నికేతా స్తత్ర తత్రతు॥ ౩౨

తం దేశం సమతిక్రమ్య ఆశ్రమం సిద్ధసేవితమ్।
సిద్ధా వైఖానసా స్తత్ర వాలఖిల్యాశ్చ తాపసాః॥ ౩౩

(౨౭) ఆక్రౌంచపర్వతములో మహాత్ములును సూర్యునివంటి కాంతిగల వారును, దేవతలచే బాగుగ పూజింపఁబడుచుండువారును, దేవతలుగనుండు మహర్షులు వసించుచున్నారు.

(౨౮) ఆక్రౌంచపర్వతము యితరగుహలలోను ప్రక్కలలోను దానిశిఖరములలోను రాళ్ళసందులలోను వెనుక భాగములోను సీతాదేవిని అచ్చటచట వెతుకవలయును.

(౨౯) క్రౌంచపర్వతముయొక్క ప్రధానమగు శిఖరములోను, అవృక్షమను పేరుగల ప్రత్యంత పర్వతములోను కామమను పేరుగల పర్వతములోను, పక్షులకు వాసస్థానమగు మానసమను పర్వతములోను అచ్చటచట చూచి సీతను వెతుకవలయును.

(30) మానసపర్వతములో భూతములకు దేవదానవులకు సంచారములేదు దానిసమీప ప్రదేశములోను మధ్యప్రదేశములోను దానిమీదను మీరందరు సీతను వెతుకవలయును.

(3౧) క్రౌంచపర్వతమును దాటిపోయినటులైతే మైనాకపర్వతముగలదు. మయుఁడను దానవుఁడు అచట వసించుటకు గృహమును నిర్మించుకొనియున్నాఁడు.

(3౨) మైనాకపర్వతము సమీపము భూములలోను, దానిమధ్యలోను గుహలలోను సీతను వెతుకవలయును. ఆచట, గుర్రమువంటి ముఖముగల కింపురుషస్త్రీల గృహములు గలవు.

(33) మైనాకపర్వతమును దాటిపోయినటులైతే సిద్ధాశ్రమము గలదు. ఆచట, సిద్ధులు వైఖానసులు వాలఖిల్యులు అని గొప్పఋషులు గలరు.

వంద్యా స్తే తు తపస్సిద్ధా స్తపసా వీతకల్మషాః।
ప్రష్టవ్యాచాపి సీతాయాః ప్రవృత్తి ర్వినయాన్వితైః॥ ౩౪

హేమపుష్కరసంఛన్నం తస్మిన్ వైఖానసం సరః।
తరుణాదిత్యసంకాశై ర్హంసై ర్విచరితం శుభైః॥ ౩౫

ఔపవాహ్యః కుబేరస్య సార్వభౌమ ఇతి స్మృతః।
గజః పర్యేతి తం దేశం సదా సహ కరేణుభిః॥ ౩౬

తత్సర స్సమతిక్రమ్య నష్టచంద్రదివాకరమ్।
అనక్షత్రగణం వ్యోమ నిష్పయోద మనాదితమ్॥ ౩౭

గభస్తిభి రివార్కస్య సతు దేశః ప్రకాశతే।
విశ్రామ్యద్భి స్తపస్సిద్ధై ర్దేవకల్పై స్స్వయంప్రభైః॥ ౩౮

తం తు దేశ మతిక్రమ్య శైలోదానామ నిమ్నగా॥ ౩౮½

ఉభయో స్తీరయో స్తస్యాః కీచకానామ వేణవః।
తే నయంతి పరం తీరం సిద్ధాన్ ప్రత్యానయంతి చ॥ ౩౯½

ఉత్తరాః కురవ స్తత్ర కృతపుణ్యప్రతిశ్రయాః॥ ౪౦

(౩౪) తపసుచే పాపపరిహారమై శుద్ధులుగను అణిమాది అష్టసిద్ధులుగల ఋషులకు నమస్కరించి మీరు మిగుల వినయముతో సీతాదేవి వృత్తాంతమును వారిని నడుగవలయును.

(౩౫) ఆ సిద్ధాశ్రమములో బంగారు తామరపూలతో నిండినదియు, బాలసూర్యునివలె వెలుంగుచు సుందరమగు హంసలు సంచరించునట్టి వైఖానసమను సరస్సుగలదు.

(౩౬) కుబేరునికి వాహనముగనుండు సార్వభౌమము అనుప్రసిద్ధిగల యేనుఁగు పెంటియేనుఁగులతోడ ఆసరస్సుకు సదా వచ్చుచుండును.

(౩౭) ఆసరస్సును దాటిపోయినటులైతే సూర్యచంద్రుల సంచారము నక్షత్రములు మేఘములును సద్దాలేక ఆకాశము నిశ్శబ్దముగను ఉన్నది.

(౩౮) సూర్యుని తేజస్సువలె వెలుంగుచుండువారును, స్వతస్సిద్ధమగు జ్ఞానముగలవారును, దేవతలతో సమముగనుండువారును, స్వయం ప్రకాశముగలవారును, శ్రమము దీర్చుకొని యుండువారును, నగుసిద్ధులతో ఆప్రదేశము ప్రకాశించుచున్నది.

(౩౮½) ఆప్రదేశమును దాటిపోయినటులైతే శైలోద మనునది గలదు.

(౩౯½) శైలోదనదికి రెండుతీరములలోను కీచకమనుపేరుగల వెదురుపొదలుగలవు. అవి ఒకటితోనొకటికి పెనవేసికొని యుండుటచే సిద్ధులు ఆతీరము నకుఁబోవుటకు, అచటినుండి యీతీరమున వచ్చుటకు సాధ్యముగనున్నది.

(౪౦) అచట, పుణ్యపురుషులకు భోగభూమిగ ఉత్తర కురుదేశము లున్నవి.

తతః కాంచనపద్మాభిః పద్మినీభిః కృతోదకాః।
నీలవైడూర్యపత్రాభి ర్నద్య స్తత్ర సహస్రశః॥ ౪౧
రక్తోత్పలవనై శ్చాత్ర మండితాశ్చ హిరణ్మయైః।
తరుణాదిత్యసదృశై ర్భాంతి తత్ర జలాశయాః॥ ౪౨

మహార్హ మణిపత్రైశ్చ కాంచనప్రభ కేసరైః।
నీలోత్పలవనై శ్చిత్రైః స దేశ స్సర్వతో వృతః॥ ౪౩
నిస్తులాభిశ్చ ముక్తాభి ర్మణిభిశ్చ మహాధనైః।
ఉద్భూతపులినా స్తత్ర జాతరూపైశ్చ నిమ్నగాః॥ ౪౪

సర్వరత్నమయై శ్చిత్రై రవగాఢా నగోత్తమైః।
జాతరూపమయైశ్చాపి హుతాశనసమ ప్రభైః॥ ౪౫
నిత్యపుష్పఫలా స్తత్ర నగాః పత్రరథాకులాః।
దివ్యగంధరసస్పర్శా స్సర్వకామాన్ స్రవంతిచ॥ ౪౬
నానాకారాణి వాసాంసి ఫలంత్యన్యే నగోత్తమాః॥ ౪౬-౧
ముక్తా వైడూర్యచిత్రాణి భూషణాని తథైవచ॥ ౪౭
స్త్రీణాం చాప్యనురూపాణి పురుషాణాం తథైవచ।
సర్వర్తు సుఖసేవ్యాని ఫలంత్యన్యే నగోత్తమాః॥ ౪౮

(౪౧) పుణ్యపురుషులకు భోగభూమియగుటచే, అచట, బంగారుమయమగు తామరపూలు నీలవర్ణమగు వైడూర్యముతో సమమగు ఆకులతోగూడిన తామరలతలతో నిండిన జలముగల నదులు వేనవేలుగ నున్నవి.

(౪౨) ఉత్తర కురుదేశములో నచ్చటచ్చటనుండు తటాకములు రక్తవర్ణముగను, బంగారువర్ణముగను బాలసూర్యునివలెను వెలుంగుచుండు తామరపూలతో వెలుంగుచున్నది.

(౪౩) వెల లేని నీలరత్నమువంటి ఆకులు, బంగారు కాంతివంటి కింజల్కములుగలిగి, ఆశ్చర్యముగనుండు నల్లకలువల వనములతో ఉత్తరకురుదేశము నిండి ప్రకాశించుచున్నది.

(౪౪) గుండ్రముగనుండు ముత్యములు, వెలలేనిరత్నములు బంగారము తో ఉన్నతముగనుండు యిసుకదిబ్బలుగల నదులు ప్రకాశించుచున్నవి.

(౪౫) నానావిధములగు రత్నములతో నానారంగులుగలిగి బంగారువికారమై అగ్నివలె వెలుంగుచుండు పర్వతములతోను నదులు నిండి యున్నవి.

(౪౬) ఆయుత్తర కురుదేశములోగల వృక్షములు సదాపూలుపండ్లుగలిగి పక్షులతోనిండి దివ్యమైన పరిమళము రసము స్పర్శముగలవియై కోరినకోరికలను నిచ్చుచున్నివి.

(౪౬ఎ) అచటగల కొన్ని మంచివృక్షములు నానారంగులుగల వస్త్రములను గాయుచున్నవి.

(౪౭,౪౮) మరికొన్ని మంచివృక్షములు ముత్యములు వైడూర్యములుపొదిగి ఆశ్చర్యముగను స్త్రీలు, పురుషులు ధరించుకొనుటకు తగినవిగను, హేమంతాది ఋతువులన్నిటిలోను సుఖముగ ధరించుకొనటకుతగిన ఆభరణములను గాయుచున్నవి.

మహార్హాణి విచిత్రాణి హైమా న్యన్యే నగోత్తమాః।
శయనాని ప్రసూయంతే చిత్రా స్తరణవంతిచ॥ ౪౯

మనః కాంతాని మాల్యాని ఫలంత్యత్రాపరే ద్రుమాః।
పానానిచ మహార్హాణి భక్ష్యాణి వివిధానిచ॥ ౫౦

స్త్రియశ్చ గుణసంపన్నా రూపయౌవనలక్షితాః।
గంధర్వాః కిన్నరా స్సిద్ధా నాగా విద్యాధరా స్తథా॥ ౫౧
రమంతే సహితా స్తత్ర నారీభి ర్భాస్కరప్రభాః॥ ౫౧½

సర్వే సుకృతకర్మాణ స్సర్వే రతిపరాయణాః।
సర్వే కామార్థసహితా వసంతి సహయోషితః॥ ౫౨½

గీతవాదిత్రనిర్ఘోష స్సోత్కృష్టహసిత స్స్వనః।
శ్రూయతే సతతం తత్ర సర్వభూతమనోహరః॥ ౫౩½

తత్ర నాముదితః కశ్చి న్నాస్తికశ్చి దసత్ప్రియః।
అహన్యహని వర్ధంతే గుణా స్తత్ర మనోరమాః॥ ౫౪½

సమతిక్రమ్య తం దేశ ముత్తరః పయసాన్నిధిః॥ ౫౫

(౪౯) మరికొన్ని మంచివృక్షములు వెలలేని, ఆశ్చర్యకరములగు, బంగారుమయముగను నానారంగులుగల చిత్రాసనములుగల శయనములను గాయుచున్నవి.

(౫౦) మరికొన్ని వృక్షములు మనసుకు యింపుగనుండు పూలహారములను, వెలలేని పానపదార్థములను, నానావిధములగు భక్ష్యములను గాయుచున్నవి.

(౫౧,౫౧½) గుణవతులై రూపయౌవనముతోఁ గూడినస్త్రీలు అచటగలరు. సూర్యునివలె వెలుంగుచుండు గంధర్వులు కిన్నరులు సిద్ధులు నాగులు విద్యాధరులు, ఆట్టిస్త్రీలతోఁగూడి విహరించుచున్నారు.

(౫౨½) వీరందరు పుణ్యపురుషులు అందరు రతిలోనాసక్తిగలవారు అందరు కోరికలతోను సంపనతోనుగూడి స్త్రీలతోడ వసించుచున్నారు.

(౫౩½) ఆయుత్తర కురుదేశములో నెల్లపుడు మనోహరమగు చిరునగవు ధ్వనితో గూడినదియు, సకల ప్రాణికోటుల మనసును హరించునట్టిదియు నగు గానము వీణమొదలగు వాద్యములధ్వని వినవచ్చుచున్నది.

(౫౪½) ఆదేశములో సంతోషములేనివాఁడు, ప్రియురాలు లేనివాడు ఒకఁడునులేఁడు. అచట, మనసుకు యింపుగనుండు గుణములు దిన దినము వృద్ధి పొందుచున్నవి.

(౫౫) ఈయుత్తర కురుదేశమును దాటి పోయినటులైతే, ఉత్తరలవణసముద్రము ఉన్నది.

తత్ర సోమగిరి ర్నామ మధ్యే హేమమయో మహాన్।
ఇంద్రలోకగతా యేచ బ్రహ్మలోకగతాశ్చ యే॥ ౫౬
దేవా స్తం సమవేక్షంతే గిరిరాజం దివంగతాః॥ ౫౬½
స తు దేశో విసూర్యోపి తస్య భాసా ప్రకాశతే।
సూర్యలక్ష్మ్యాఽభివిజ్ఞేయ స్తపతేవ వివస్వతా॥ ౫౭½
భగవానపి విశ్వాత్మా శంభు రేకాదశాత్మకః।
బ్రహ్మా వసతి దేవేశో బ్రహ్మర్షి పరివారితః॥ ౫౮½
న కథంచన గంతవ్యం కురూణా ముత్తరేణ వః।
అన్యేషామపి భూతానాం నాతిక్రామతి వై గతిః॥ ౫౯½
సహి సోమగిరిర్నామ దేవానా మపి దుర్గమః॥
త మాలోక్య తతః క్షిప్ర ముపావర్తితు మర్హథ॥ ౬౦½
ఏతావ ద్వానరై శ్శక్యం గంతుం వానరపుంగవాః।
అభాస్కర మమర్యాదం నజానీమ స్తతః పరం॥ ౬౧½
సర్వ మేత ద్విచేతవ్యం యన్మయా పరికీర్తితం।
యదన్యదపి నోక్తంచ తత్రాపి క్రియతాం మతిః॥ ౬౨½
తతః కృతం దాశరథే ర్మహ త్ప్రియం మహత్తరంచాపి తతో
మమ ప్రియమ్। కృతం భవిష్యత్యనిలానలోపమా విదేహజా
దర్శనజేన కర్మణా॥ ౬౩½

(౫౬, ౫౬౪) ఆ లవణసముద్రము మధ్యలో సోమగిరియను నొకగొప్ప బంగారు పర్వతముగలదు. ఇంద్రలోకములోను బ్రహ్మలోకములోను అంతరిక్షములోను గలదేవతలు ఆసోమగిరియను పర్వతమును జూచుచున్నారు.

(౫౭౪) సూర్యునివెలుతురుచే, దెలిసికొనందగిన పదార్థములు గలదేశము సూర్యుని తేజస్సుచేఁ గనుపడునటుల ఆదేశములో సూర్యుఁడు లేకపోయినను అది సోమగిరికాంతిచేఁ బ్రకాశించుచున్నది.

(౫౮౪) జగమును శరీరముగ గలశ్రీమాన్నారాయణుఁడు, ౧౧వ రుద్రుఁడు, దేవతలలోఁ గొప్పవాఁడగు చతుర్ముఖబ్రహ్మ, యీముగ్గురును బ్రహ్మర్షులతోఁగూడి అచటవసించుచున్నారు.

(౫౯౪) ఉత్తర కురుదేశమును దాటి మీరు యెంతమాత్రము పోవలదు. దేవాదులకుఁ గూడ అచట సంచారములేదు.

(౬౦౪) సోమగిరికిఁ బోవుటకు దేవాదులకును సాధ్యము కాదు. సోమగిరిలో సీతను వెతకిచూచి అచటినుండి శీఘ్రముగ మీరు తిరిగి రావలయును.

(౬౧౪) వానరశ్రేష్ఠులారా! ఇంతవరకే మీరుపోవచ్చును. దానికి పిమ్మట, సూర్యప్రకాశములేక దిక్కుతెలియకుండు ప్రదేశము లిట్టివని మనకుఁ దెలియవు.

(౬౨౪) నేనుచెప్పిన ప్రదేశములన్నిటిలోను సీతనువెతుక వలయును. నేనుచెప్పని ప్రదేశములలోను నామెను వెతుకుటకు మీరు యత్నించవలయును.

(౬౩౪) వాయు దేవునితోను అగ్నిదేవునితోను సములుగనుండు వానరులారా! సీతనువెతకి కనిపెట్టిన కార్యముచే శ్రీరామునికి గొప్పసంతోషము గలిగించినటు లగును. రామునికంటె హెచ్చుగ సంతోషము నాకును గలిగించినటు లగును.

తతః కృతార్థా స్సహితా స్సబాంధవా మయార్చితా స్సర్వ
గుణై ర్మనోరమైః। చరిష్యథోర్వీం ప్రతిశాంతశత్రవ స్సహప్రి
యా భూతధరాః ప్లవంగమాః॥ ౬౪

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - త్రిచత్వారింశస్సర్గః.



చ తు శ్చ త్వా రిం శ స్స ర్గః



విశేషేణ తు సుగ్రీవో హనుమత్యర్థ ముక్తవాన్।
సహి తస్మి న్హరిశ్రేష్ఠే నిశ్చితార్థోఽర్థసాధనే॥ ౧
అబ్రవీ చ్చ హనూమంతం విక్రాంత మనిలాత్మజమ్।
సుగ్రీవః పరమప్రీతః ప్రభు స్సర్వవనౌకసామ్॥ ౨
నభూమౌ నాంతరిక్షేవా నాంబరే నామరాలయే।
నాప్సువా గతిసంగం తే పశ్యామి హరిపుంగవ॥ ౩
నాసురా స్సహగంధర్వా స్సనాగనరదేవతాః।
విదితా స్సర్వలోకా స్తే ససాగరధరాధరాః॥ ౪
గతి ర్వేగశ్చ తేజశ్చ లాఘవంచ మహాకపే।
పితు స్తే సదృశం వీర మారుతస్య మహౌజసః॥ ౫

(౬౪) వానరులారా! పిమ్మట, కృతార్థులై గుంపుగఁగూడి బంధువులతోఁగలసి మనోహరముగనుండు మీనుగుణములచే నాచే గౌరవింపఁబడినవారై, శత్రు నిర్మూలము చేసినవారలై మీభార్యలతోఁ గూడి సకల భూతములకు ఆధారముగనుండు భూమిలో సంచరించు చుండుఁడు.

ఇది నలువది మూఁడవ సర్గ.

## ౪౪ వ సర్గ.

(అవతారిక—హనుమంతుఁడే యీకార్యమును సాధించదగిన వాఁడని శ్రీరాముఁడు తెలిసికొని అతని చేతికి ఉంగరమును నిచ్చుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) సుగ్రీవుఁడు హనుమంతునికి విశేషముగ మరికొన్ని విషయములు చెప్పెను. ఏలననఁగా ఇతఁడే కార్యమును సాధించగలవాఁడని సుగ్రీవుఁడు నిశ్చయించి యుండెను.

(౨) వానరులకందరికి ప్రభువగు సుగ్రీవుఁడు మిగుల సంతోషించి ప్రసిద్ధుఁడును వాయుపుత్రుఁడును నగు హనుమంతునితో నిటులనెను.

(3) భూలోకములోను, నిరాధారముగనుండు మేఘసంచారముగల అంతరిక్షములోను వాయువుమాత్రము సంచరించుచుండు ఆకాశములోను, ప్రబలమైన వారుండునట్టి స్వర్గలోకములోను, లోతుగమాత్రమే పోదగిన జలములోను, ఓ వానరశ్రేష్ఠుఁడా! నీగమనమునకు ఆటంకమును నేనెరుంగను.

(౪) అసురులు గంధర్వులు నాగులు నరులు దేవతలు, సముద్రములు పర్వతములతోఁ గూడిన లోకములన్నిటిని నీవెఱుంగుదువు.

(౫) గొప్పవానరుఁడా! గమనము వేగముపరాక్రమము లాఘవము, ఓవీరుఁడా! గొప్పతేజస్సుగల నీతండ్రియగు వాయుదేవునికి సమముగ నీకునుగలవు.

తేజసా వాపి తే భూతం సమం భువి న విద్యతే।
తద్యథా లభ్యతే సీతా తత్త్వమేవోపపాదయ॥ ౬
త్వయ్యేవ హనుమన్నస్తి బలం బుద్ధిః పరాక్రమః।
దేశకాలానువృత్తిశ్చ నయశ్చ నయపండిత॥ ౭

తతః కార్యసమాసంగమవగమ్య హనూమతి।
విదిత్వా హనుమంతంచ చింతయామాస రాఘవః॥ ౮
సర్వథా నిశ్చితార్థోఽయం హనూమతి హరీశ్వరః।
నిశ్చితార్థకరశ్చాపి హనుమాన్ కార్యసాధనే॥ ౯

తదేవం ప్రస్థితస్యాస్య పరిజ్ఞాతస్య కర్మభిః।
భర్త్రా పరిగృహీతస్య ధ్రువః కార్యఫలోదయః॥ ౧౦
తం సమీక్ష్య మహాతేజా వ్యవసాయోత్తరం హరిమ్।
కృతార్థ ఇవ సంవృత్తః ప్రహృష్టేంద్రియమానసః॥ ౧౧

దదౌ తస్య తతః ప్రీతః స్వనామాంకోపశోభితమ్।
అంగులీయమభిజ్ఞానం రాజపుత్ర్యాః పరంతపః॥ ౧౨
అనేన త్వాం హరిశ్రేష్ఠ చిహ్నేన జనకాత్మజా।
మత్సకాశాదనుప్రాప్తమనుద్విగ్నాఽనుపశ్యతి॥ ౧౩

(౬) పరాక్రమములోఁ నీకు సమానుఁడగు ప్రాణి భూమిలోఁ లేదు. కనుక, తలభించఁదగిన ఉపాయమును నీవే తెలుపవలయును,

(౭) హనుమంతుఁడా! బలము బుద్ధి పరాక్రమము దేశకాలానుసరణము, నయపండితుఁ          నీయెడలనే గలవు.

(౮) హనుమంతునిమీఁద సుగ్రీవుఁడు కార్యభారమును మోపెనని తెలిసికొని, శ్రీరాముఁడును హనుమంతుఁడీకార్యమును సాధించగలవాఁడని తలఁచి, ఆలోచించెను.

(౯) వానరరాజగు యీసుగ్రీవుఁడు హనుమంతుఁడే సర్వప్రకారములచే కార్యమును సాధించగలఁడని నిశ్చయించియున్నాఁడు. హనుమంతుఁడును కార్యమును సాధించుటలో దృఢమైన అధ్యవసాయము గలిగియున్నాఁడు.

(౧౦) ఇతఁడు యిదివరకు చేసిన కార్యములచే యీకార్యముసహా యితని వలన నగునని బాగుగ తెలిసికొనబడినవాఁడును, కార్యమును సాధించగలవాఁడని రాజుచే అంగీకరింపఁబడినవాఁడును కార్యమును సాధించుటకు ప్రయాణము చేయుచుండువాఁడును నగు హనుమంతునియొక్క పని సిద్ధించును. నిజము.

(౧౧) గొప్ప తేజస్సుగల రాముఁడు ప్రయత్నముచేయుటలోఁ శ్రేష్ఠుఁడగు హనుమంతుని జూచి మిగులసంతోషించి కృతార్థుఁడైనటుల అనుకొనెను.

(౧౨) పిమ్మట, శత్రువులను దమింపఁ జేయువాఁడగు రాముఁడు అతని పేరు మలుపఁబడి ప్రకాశించుచుండు ఉంగరమును, జనకుని కూతురగు సీతకు ఆనవాలుగ నుండుటకై, హనుమంతుని కిచ్చెను.

(౧౩) ఓ వానరశ్రేష్ఠుఁడా! జనకునికూతురగు సీత యీ యానవాలుచే భయపడక నావద్దనుండి పోయిన నిన్నుచూచును.

వ్యవసాయశ్చ తే వీర సత్త్వయుక్తశ్చ విక్రమః।
సుగ్రీవస్య చ సందేశ స్సిద్ధిం కథయతీవ మే॥ ౧౪

సతం గృహ్యా హరిశ్రేష్ఠః స్థాప్య మూర్ధ్ని కృతాంజలిః।
వందిత్వా చరణౌ చైవ ప్రస్థితః ప్లవగోత్తమః॥ ౧౫

స తత్ప్రకర్ష న్హరిణాం బలం మహ ద్బభూవ వీరః పవనాత్మ
జః కపిః । గతాంబుదే వ్యోమ్ని విశుద్ధమండల శ్శశీవ నక్షత్రగ
ణోపశోభితః॥ ౧౬

అతి బల బల మాశ్రిత స్తవాహం హరివర విక్రమ విక్రమై
రనల్పైః । పవనసుతయథాభిగమ్యతే సా జనకసుతా హనుమ
న్తథా కురుష్వ॥ ౧౭

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - చతుశ్చత్వారింశస్సర్గః.

## పంచచత్వారింశస్సర్గః.

సర్వాం శ్చాహూయ సుగ్రీవః ప్లవగా న్ప్లవగర్షభః।
సమస్తా నబ్రవీ ద్భూయో రామకార్యార్థసిద్ధయే॥ ౧
ఏవ మేత ద్విచేతవ్యం యన్మయా పరికీర్తితమ్॥ ౨

(౧౪) వీరుఁడా! నీయొక్క మంచిప్రయత్నము, బలముతోఁ గూడిన పరాక్రమము, సుగ్రీవుఁడు చేసిన ఆజ్ఞ, కార్యసిద్ధిని నాకుఁ దెలుపునటుల అగుపడుచున్నవి.

(౧౫) వానరశ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు ఉంగరమును దీసికొని శిరసులో నుంచుకొని అంజలిచేసి శ్రీరాముని పాదములకు నమస్కరించి దక్షిణదిక్కుకు ప్రయాణము చేయుటకు ఉద్యుక్తుఁడాయెను.

(౧౬) వీరుఁడును వాయుపుత్రుఁడును కపియును నగు హనుమంతుఁడు వానరుల గొప్పసేనను బిలుచుకొని యెగిరిపోవునపుడు, మేఘములు లేని ఆకాశములో నిర్మలమైన మండలముగల నక్షత్రగణముతోఁ బ్రకాశించుచుండు చంద్రునివలె, ఉండెను.

(౧౭) మిగులబలము గలవాఁడా! శ్రేష్ఠమగు సింహమువంటి పరాక్రమముగలవాఁడా! నీ బలమును నేను నమ్మియున్నాను. ఓ వాయుపుత్రుఁడా! అపరిమితమైన పరాక్రమముచే సీతను నెటుల కనిపెట్టుదువో, ఓ హనుమంతుఁడా! అటుల పనిచేయవలయును.

ఇది నలువదినాలుగవ సర్గ.



## ౪౫ వ సర్గ.

(అవతారిక — సీతాన్వేషణమునకై వానరుల ప్రయాణ సన్నాహము యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧, ౯) వానరశ్రేష్ఠుఁడగు సుగ్రీవుఁడు వానరులందరిని బిలిచి శ్రీరామునికి కార్యము సిద్ధించుటకై వారితో నిటు లనెను. నేనుచెప్పినటులనే అన్ని ప్రదేశములలోను సీతను వెతుకవలయును.

తదుగ్రశాసనం భర్తు ర్విజ్ఞాయ హరిపుంగవాః।
శలభా ఇవ సంఛాద్య మేదినీం సంప్రతస్థిరే॥ ౨౹

రామః ప్రస్రవణే తస్మి న్న్యవస త్సహ లక్ష్మణః।
ప్రతీక్షమాణ స్తం మాసం య స్సీతాధిగమే కృతః॥ ౩౹

ఉత్తరాంతు దిశం రమ్యాం గిరిరాజసమావృతామ్।
ప్రతస్థే సహసా వీరో హరి శ్శతవలి స్తదా॥ ౪౹
పూర్వాం దిశం ప్రతి యయౌ వినతో హరియూథపః॥ ౫

తారాంగదాదిసహితః ప్లవగో మారుతాత్మజః।
అగస్త్య చరితా మాశాం దక్షిణాం హరియూథపః॥ ౬

పశ్చిమాంతు భృశం ఘోరాం సుషేణః ప్లవగేశ్వరః।
ప్రతస్థే హరిశార్దూలో దిశం వరుణపాలితామ్॥ ౭

తత స్సర్వా దిశో రాజా చోదయిత్వా యథాతథమ్।
కపిసేనాపతీ న్ముఖ్యా న్ముమోద సుఖిత స్సుఖమ్॥ ౮

ఏవం సంబోధితా స్సర్వే రాజ్ఞా వానరయూథపాః।
స్వాం స్వాం దిశ మభిప్రేత్య త్వరితా స్సంప్రతస్థిరే॥ ౯

(౨) వానరశ్రేష్ఠులు సుగ్రీవుని భయంకరమైన ఆజ్ఞను విని భూమిని మిడతలవలె కప్పుకొని ప్రయాణమైరి.

(౩) సీతను వెతకి ఒక నెలలో రావలయునని సుగ్రీవుఁడు చేసిన ఆజ్ఞను శ్రీరాముఁడు యెదురుచూచుచు లక్ష్మణునితోడ ప్రస్రవణపర్వతములో వసించుచుండెను.

(౪) అపుడు, వీరుఁడగు శతవలియను వానరుఁడు హిమవత్పర్వతముగల రమ్యమగు ఉత్తరదిక్కునకు వెంటనే ప్రయాణము చేసెను.

(౫) వినతుఁడను వానరసేనాపతి తూర్పుదిక్కునకుఁ బ్రయాణము చేసెను.

(౬) సేనాపతియు వాయుపుత్రుఁడును నగు హనుమంతుఁడు తారుఁడు అంగదుఁడు మొదలగు వానరులతోడ అగస్త్యమహర్షి వసించుచుండు దక్షిణదిక్కునకు బ్రయాణము చేసెను.

(౭) వానరసేనకు రక్షకుఁడును వానరశ్రేష్ఠుఁడును నగు సుషేణుఁడను వానరుఁడు మిక్కిలి భయంకరమై వరుణుఁడు పరిపాలించుచుండు పడమటిదిక్కునకు ప్రయాణమాయెను

(౮) పిమ్మట, క్రమముగ నాలుగుదిక్కులకు ఉత్తములగు వానరసేనాపతులను బంపి, ముందు రాజ్యము లభించినందున సంతోషించియుండు సుగ్రీవమహారాజు యిప్పుడు పైపై సుఖమును బడసి సంతోషించెను.

(౯) నిశ్చయముగ సుగ్రీవునిచే బాగుగ ఆయాదిక్కులలోగల విశేషములను బోధింపఁబడినవారై వానరసేనాపతులందరు శీఘ్రముగ వారివారి దిక్కులకు ప్రయాణమైరి.

ఆనయిష్యామహే సీతాం హనిష్యామశ్చ రావణమ్।
నదంత శ్చోన్నదంతశ్చ గర్జంతశ్చ ప్లవంగమాః॥ ౧౦
క్ష్వేళంతో ధావమానాశ్చ వినదంతో మహాబలాః॥ ౧౦½
అహ మేకో హనిష్యామి ప్రాప్తం రావణ మాహవే।
తత శ్చోన్మథ్య సహసా హరిష్యే జనకాత్మజామ్॥ ౧౧½
వేపమానాం శ్రమే ణాద్య భవద్భి స్స్థీయతా మితి। ౧౨

ఏక ఏవాహరిష్యామి పాతాళాదపి జానకీమ్॥
విధమిష్యా మ్యహం వృక్షాన్ పాతయిష్యా మ్యహం గిరీన్।
ధరణీం దారయిష్యామి క్షోభయిష్యామి సాగరాన్॥ ౧౩½
అహం యోజనసంఖ్యాయాః ప్లవితా నాత్ర సంశయః।
శతం యోజనసంఖ్యాయా శ్శతం సమధికం హ్యహమ్॥ ౧౪½

భూతలే సాగరేవాపి శైలేషుచ వనేషుచ।
పాతాళస్యాపివా మధ్యే నమమాచ్ఛిద్యతే గతిః॥ ౧౫½
ఇత్యేకైకం తదా తత్ర వానరా బలదర్పితాః।
ఊచుశ్చ వచనం తత్ర హరిరాజస్య సన్నిధౌ॥ ౧౬½
ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - పంచచత్వారింశస్సర్గః.

(౧౦,౧౦౪) 'సీతను దెచ్చెదము. రావణుని జంపెదము' అని కేకలు వేయుచు, మరియు సంతోషించి హెచ్చుగ కేకలు వేయుచు వారివారి పౌరుషములను దెలుపుకొని సింహనాదములు సేయుచు పరుగెత్తుచు నానావిధములుగ గాయుచు గొప్పబలముగల వానరులు ప్రయాణముచేసిరి.

(౧౦౪,౧౨) యుద్ధరంగములో రావణుని నేనొక్కఁడనే చంపగలను. రాక్షస సేనలను నాశనముచేసి, శ్రమపడి భయముతో వణుకుచుండు జనకుని కూతురగు సీతను దెచ్చెదను. మీరందరు యిచటనే యుండుఁడు. అని యొక కపి పలికెను.

(౧౩,౧౩౪) పాతాళములో నుండినను సీతాదేవిని నేనొకఁడనే తెచ్చెదను. వృక్షములను నన్నిటిని నాశముచేయుదును. పర్వతములను పెల్లగించి క్రిందత్రోయగలను. భూమిని బద్దలుచేసి సముద్రమును అల్లకల్లోలము సేయగలను అని మరియొక వానరుఁడనెను.

(౧౪౪) నేను నూరుయోజనములు దాటగలను. ఇందుకు సందేహములేదు. అని యొకఁడు, నూరుయోజనములకు హెచ్చుగ గంతువేయగలనని యింకొకఁడు, చెప్పెను.

(౧౫౪) భూమిలోను సముద్రములోను కొండలలోను అరణ్యములలోను పాతాళములోను పాతాళమధ్యప్రదేశములోను నాగమనమునకు అడ్డములేదని ఒకఁడనెను.

(౧౬౪) ఈవిధముగ, అపుడు, బలముచే క్రొవ్వియుండు వానరులు వానరరాజగు సుగ్రీవుని సన్నిధిలో, ఒక్కొకఁడు చెప్పుకొనెను.

ఇది నలువదియైదవ సర్గ.

## షట్చత్వారింశస్సర్గః

గతేషు వానరేంద్రేషు రామ స్సుగ్రీవ మబ్రవీత్।
కథం భవా న్విజానీతే సర్వం వై మండలం భువః॥ ౧
సుగ్రీవస్తు తతో రామ మువాచ ప్రణతాత్మవాన్॥
శ్రూయతాం సర్వ మాఖ్యాస్యే విస్తరేణ నరర్షభ॥ ౨

యదా తు దుందుభిం నామ దానవం మహిషాకృతిమ్।
పరికాలయతే వాలీ మలయం ప్రతి పర్వతమ్॥ ౩
తదా వివేశ మహిషో మలయస్య గుహాం ప్రతి॥ ౩½

వివేశ వాలీ తత్రాపి మలయం తజ్జిఘాంసయా। ౪

తతోఽహం తత్ర నిక్షిప్తో గుహాద్వారి వినీతవత్।
నచ నిష్క్రమతే వాలీ తదా సంవత్సరే గతే॥ ౫

తతః క్షతజవేగేన ఆపుపూరే తదా బిలమ్।
తదహం విస్మితో దృష్ట్వా భ్రాతృశోకవిషార్దితః॥ ౬

అథాహం కృతబుద్ధిస్తు సువ్యక్తం నిహతో గురుః॥ ౬½

## ౪౬ వ సర్గ.

(అవతారిక.— సుగ్రీవుఁడు రామునితోఁ దనకు సర్వభూమండల జ్ఞానము గలిగినందుకు కారణమును నీసర్గలోఁ జెప్పుచున్నాఁడు.)

(౧) వానరశ్రేష్ఠులు ఆయాదిక్కులకు సీతను వెతుకుటకుఁ బోవుచుండఁగా శ్రీరాముఁడు, సుగ్రీవుఁడా! భూమండలమునంతయు నెట్లు నీవు దెలిసికొనియున్నావు, అని అడిగెను.

(౨) పిమ్మట, సుగ్రీవుఁడు మిగుల నమ్రుఁడై, నరోత్తముఁడా! సవిస్తరముగ నంతయుఁ దెలుపుచున్నాను, అని రామునితోఁ జెప్పెను.

(౩-౪) మహిషవేషము ధరించియుండిన దుందుభి అను రాక్షసుని వాలి మలయపర్వతమునకు తరుముకొని పోయెను. అపుడు ఆమహిషాసురుఁడు ఆపర్వతపు గుహలోఁ బ్రవేశించెను.

(౫) అతని సంహరించుటకు గోరి వాలి ఆపర్వతపు గుహలోఁ బ్రవేశించెను.

(౬) పిమ్మట, నేను ఆగుహయొక్క ద్వారమునందు మిగుల వినయముతో కనిపెట్టుకొని యుంటిని. ఒకసంవత్సరము, అపుడు, గడచినను వాలి వెలుపల రాలేదు.

(౭) పిమ్మట, రక్తప్రవాహముతో ఆగుహయొక్క ద్వారము నిండినది. అందుచే నేను మిగులఆశ్చర్యపడి రక్తప్రవాహమును జూచి, అన్నయగు వాలి చచ్చెనని మిగుల దుఃఖించుచుంటిని.

(౮-౯) పిమ్మట, అన్నయగు వాలి చచ్చెనని బాగుగ నిశ్చయించుకొంటిని.

శిలాపర్వతసంకాశా బిలద్వారి మయాఽఽవృతా।
అశక్నువ న్నిష్క్రమితుం మహిషో వినశ్యే దితి॥ ౭½
తతోఽహ మాగాం కిష్కింధాం నిరాశ స్తస్య జీవితే।
రాజ్యంచ సుమహ త్ప్రాప్తం తారయా రుమయాసహ॥ ౮½
మిత్రైశ్చ సహిత స్తత్ర వసామి విగతజ్వరః।
ఆజగామ తతో వాలీ హత్వా తం దానవర్షభమ్॥ ౯½
తతోఽహ మదదాం రాజ్యం గౌరవా ద్భయయంత్రితః॥ ౧౦
స మాం జిఘాంసు ర్దుష్టాత్మా వాలీ ప్రవ్యథితేంద్రియః।
పరికాలయతే క్రోధా ద్ధావంతం సచివై స్సహ॥ ౧౧
తతోఽహం వాలినా తేన సానుబంధః ప్రధావితః।
నదీశ్చ వివిధాః పశ్య న్వనాని నగరాణిచ॥ ౧౨
ఆదర్శతలసంకాశా తతో వై పృథివీంమయా।
అలాతచక్రప్రతిమా దృష్టా గోష్పదవ త్తదా॥ ౧౩
పూర్వాం దిశం తతో గత్వా పశ్యామి వివిధా న్ద్రుమాన్।
పర్వతాంశ్చ నదీ రమ్యా స్సరాంసి వివిధానిచ॥ ౧౪
ఉదయం తత్ర పశ్యామి పర్వతం ధాతుమండితమ్।
క్షీరోదం సాగరంచైవ నిత్య మప్సరసాలయమ్॥ ౧౫
పరికాలయమానస్తు వాలినాఽభిద్రుత స్తదా॥ ౧౫½

భూమండలజ్ఞానము గలిగినరీతిని సుగ్రీవుఁడు రామునికిఁ దెలుపుట. ౪౬

(౭౪) వెలుపల వచ్చుటకు శక్తిలేనివాఁడై మహిషాసురుఁడు నాశము బొందెనని యోచించి పర్వతము వలెనుండు యొకబండను ఆబిల ద్వారమునకడ్డముగ నుంచితిని.

(౮౪) అచటనుండి నేను, వాలి బ్రతికి యుండునను ఆశవిడిచి, కిష్కింధకువచ్చి తార రుమలతోడ గొప్పకపిరాజ్యమును బడసితిని.

(౯౪) కిష్కింధలో నిర్భయముగ స్నేహితులతోడ వసించుచుంటిని. పిమ్మట, వాలి రాక్షస వీరుఁడగు మహిషాసురుని జంపి కిష్కింధకు వచ్చెను.

(౧౦) పిమ్మట, భయపడి అన్నయను గౌరవముచే అతనికి రాజ్యము నిచ్చితిని.

(౧౧) దుష్టుఁడును మిగులదుఃఖించి కోపముగలవాఁడును నగు వాలి నన్ను జంపఁగోరి మంత్రులతోడ పారిపోవుచుండు నన్ను తరుముకొని వచ్చెను.

(౧౨) పిమ్మట, నేను మంత్రులతోడ వాలిచే తరుమబడిన వాఁడనై నానావిధములగు నదులను వనములను పట్టణములను జూచుచు పారిపోతిని.

(౧౩) అపుడు, కొరవికట్టై భ్రమణముతో సమానముగనుండు భూమిని గోష్పాదమువలె చేసి భూమినంతయు అద్దములో వలెనే చూచితిని.

(౧౪) తూర్పు దిక్కునకుఁబోయి నానావిధములగు వృక్షములను పర్వతములను రమ్యముగనుండు నదులను నానావిధములగు సరస్సులను జూచుచు పారిపోతిని.

(౧౫,౧౬) అపుడు, వాలి తరుముగా పారిపోవుచు తూర్పుదిక్కులో గైరికాది ధాతువులతో వెలుంగుచుండు ఉదయపర్వతమును, సదా అప్సరసలు వసించుచుండు క్షీరసముద్రమును జూచితిని.

పున రావృత్య సహసా ప్రస్థితోఽహం తదా విభో।
పున రావర్తమానస్తు వాలినాఽభిద్రుతో ద్రుతమ్॥ ౧౬
దిశ స్తస్యా స్తతో భూయః ప్రస్థితో దక్షిణాం దిశమ్।
వింధ్యపాదపసంకీర్ణాం చందనద్రుమభూషితామ్॥ ౧౭
ద్రుమశైలాం స్తతః పశ్యన్ భూయో దక్షిణతోఽపరాన్।
పశ్చిమాంతు దిశం ప్రాప్తో వాలినా సమభిద్రుతః॥ ౧౮
సంపశ్య న్వివిధాన్ దేశా నస్తంచ గిరిసత్తమమ్।
ప్రాప్యచాస్తం గిరిశ్రేష్ఠ ముత్తరాం సంప్రధావితః॥ ౧౯
హిమవంతంచ మేరుంచ సముద్రంచ తథోత్తరమ్॥ ౨౦
యదా నవిందం శరణం వాలినా సమభిద్రుతః।
తదా మాం బుద్ధిసంపన్నో హనుమా న్వాక్య మబ్రవీత్॥ ౨౧
ఇదానీం మే స్మృతం రాజన్ యథా వాలీ హరీశ్వరః।
మతంగేన తదా శప్తో హ్యస్మి న్నాశ్రమ మండలే॥ ౨౨
ప్రవిశే ద్యది వై వాలీ మూర్ధాఽస్య శతధా భవేత్।
తత్ర వాస స్సుఖోఽస్మాకం నిరుద్విగ్నో భవిష్యతి॥ ౨౩
తతః పర్వత మాసాద్య ఋశ్యమూకం నృపాత్మజ।
నవివేశ తదా వాలీ మతంగస్య భయా త్తదా॥ ౨౪
ఏవం మయా తదా రాజన్ ప్రత్యక్ష ముపలక్షితం।
పృథివీమండలం కృత్స్నం గుహా మస్యాగత స్తతః॥ ౨౫

(౧౫) వెంటనే, వెనుకకుతిరిగి, హే ప్రభో! ప్రయాణము చేసితిని. అపుడు మరియు వాలి మిగుల వేగముగ నన్ను తరుముకొని వచ్చెను.

(౧౬) తూర్పు దిక్కునుండి వింధ్యపర్వతము, వృక్షములు చందనవృక్షములతో నిండియుండు దక్షిణ దిక్కుకు ప్రయాణము చేసితిని.

(౧౭) దక్షిణదిక్కులో మరికొన్ని వృక్షములను పర్వతములను జూచుచు, వాలి తరుముగా, అచటనుండి పడమటి దిక్కునకు బోతిని.

(౧౮) పడమటదిక్కులో నానావిధములగు దేశములను అస్తగిరిని జూచుచు ఆ యస్త గిరికి బోయి అచటినుండి ఉత్తరదిక్కునకు పరుగెత్తిపోతిని.

(౨౦) అచటనుండి హిమవంతము మేరుపర్వతము ఉత్తర సముద్రమును జూచితిని.

(౨౧) వాలి నన్నుతరుముకొనివచ్చుచుండగా నాకురక్షకమగు చోటుదొరకలేదు. అపుడు మిగుల బుద్ధిమంతుడగు హనుమంతుడు నాతో నిటులనెను.

(౨౨,౨౩) ఓరాజా! ఈయాశ్రమ మండలములో వాలి ప్రవేశించినట్లైతే అతనితల వేయి వక్కలగునని పూర్వము మతంగమహర్షి కపిరాజగు వలికి శాపమిచ్చెను. అది యిపుడు నాకు జ్ఞాపకము వచ్చినది. అచట, మనము నిర్భయముగ వసించవచ్చును.

(౨౪) పిమ్మట, ఓరాజపుత్రుడా! ఆమంతగా శ్రమముతో జేరిన యీ ఋశ్య మూకమునకు వచ్చియుంటిని. అపుడు మతంగమహర్షి యిచ్చిన శాపమునకు భయపడి యిచటికి వాలి రాలేను.

(౨౫) ఓరాజా! ఈవిధముగ అపుడు నేను భూమండలమంతయు ప్రత్యక్షముగజూచి ఋశ్యమూకములో, సీతయొక్క ఆభరణములను నుంచిన గుహలో, నుంటిని.

## సప్తచత్వారింశస్సర్గః.

దర్శనార్థంతు వైదేహ్యాస్సర్వతః కపియూథపాః।
వ్యాదిష్టాః కపిరాజేన యథోక్తం జగ్మురంజసా॥ ౧
సరాంసి సరితః కక్షానాకాశం నగరాణిచ।
నదీ దుర్గాంస్తథా శైలాన్ విచిన్వంతి సమంతతః॥ ౨

సుగ్రీవేణ సమాఖ్యాతాస్సర్వే వానరయూథపాః।
ప్రదేశాన్ ప్రవిచిన్వంతి సశైలవనకాననాన్॥ ౩
విచిత్య దివసం సర్వే సీతాధిగమనే ధృతాః।
సమాయాంతిస్మ మేదిన్యాం నిశాకాలేషు వానరాః॥ ౪

సర్వర్తుకామాన్ దేశేషు వానరాస్సఫలాన్ ద్రుమాన్।
ఆసాద్య రజనీం శయ్యాం చక్రుస్సర్వే హ్యహస్సుతే॥ ౫
తదహః ప్రథమం కృత్వా మాసే ప్రస్రవణం గతాః।
కపిరాజేన సంగమ్య నిరాశాః కపియూథపాః॥ ౬

విచిత్యతు దిశం పూర్వాం యథోక్తాం సచివైస్సహ।
అదృష్ట్వా వినతస్సీతామాజగామ మహాబలః॥ ౭

## ౪౭ వ సర్గ.

(అవతారిక.— సీతను వెతకుటకై తూర్పు పడమర ఉత్తర దిక్కులకుఁ బోయిన వానరులు వచ్చిచేరుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) సీతను వెతకుటకై కపిరాజగు సుగ్రీవునిచేఁ బంపఁబడిన వానర సేనాపతులందరు శీఘ్రముగ సుగ్రీవుఁడు చెప్పినటుల ప్రయాణమై ఆయాదిక్కులకుఁ బోయిరి.

(౨) సరస్సులు నదులు పొదలు ఆకాశముపట్టణములు దుర్గములు అన్నిచోట్లలోను వానరులు సీతాదేవిని వెతకిరి.

(౩) సుగ్రీవుని ఆజ్ఞను బొందియుండు వానర సేనాపతులందరు కొండలతోను అరణ్యములతోను గూడియుండు ప్రదేశములలో సీతను వెతకిరి.

(౪) వానరులందరు సీతను కనిపెట్టుటలో ధైర్యముగలవారై పగలంతయు వెతకి రాత్రిపూట గుంపుగ భూమిమీఁదఁ గూర్చుండిరి.

(౫) వానరులు ఆ దేశములలో సకలఋతువులలోను గలుగు పూలు ఫలములతోఁగూడిన వృక్షములలోను జూచి ఆపండ్లు భుజించి పగటిపూట సీతను వెతకి రాత్రులలో నిద్రించుచుండిరి.

(౬) వానరసేనాపతులు ప్రయాణమైపోయినది మొదలు ఒక నెల నిండగా సీతను వెతకుటలో ఉత్సాహము తగ్గినవారై, సుగ్రీవునికి వారి రాకను దెలిపి మాల్యవంతములో నుండిరి.

(౭) సుగ్రీవుఁడు చెప్పినటులనే తూర్పుదిక్కులో గొప్ప బలముగల వినతుఁడను వానరుఁడు మంత్రులతోడ సీతను వెతకి ఆమెను జూడలేక వచ్చి చేరెను.

ఉత్తరాంచ దిశం సర్వాం విచిత్య స మహాకపిః।
ఆగత స్సహసైన్యేన వీర శ్శతవలి స్తదా॥ ౮
సుషేణః పశ్చిమా మాశాం విచిత్య సహ వానరైః।
సమేత్య మాసే సంపూర్ణే సుగ్రీవ ముపచక్రమే॥ ౯

తం ప్రస్రవణపృష్ఠ స్థం సమాసాద్యాభివాద్య చ।
ఆసీనం సహ రామేణ సుగ్రీవ మిద మబ్రువన్॥ ౧౦
విచితాః పర్వతా స్సర్వే వనాని గహనాని చ।
నిమ్నగా స్సాగరాంతాశ్చ సర్వే జనపదాశ్చ యే॥ ౧౧

గుహాశ్చ విచితా స్సర్వా స్త్వయా యాః పరికీర్తితాః।
విచితాశ్చ మహాగుల్మా లతా వితతసంతతాః॥ ౧౨
గహనేషు చ దేశేషు దుర్గేషు విషమేషు చ।
సత్త్వాన్యతిప్రమాణాని విచితాని హతాని చ॥ ౧౩
ఉదారసత్త్వాభిజనో మహాత్మా స మైథిలీం ద్రక్ష్యతి వానరేంద్రః। దిశంతు యామేవ గతాతు సీతా తా మాస్థితో వాయుసుతో హనూమాన్॥ ౧౪

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే- సప్తచత్వారింశస్సర్గః.



తూర్పు పడమటిదిక్కులకుఁబోయిన వానరులు సీతనుజూడకయే వచ్చుట. ౫౩౧

(౮) వీరుఁడును గొప్పకపియును నగు శతవలి సేనతోడ ఉత్తరదిక్కులో నంతయు సీతాదేవిని వెతకి ఆమెను జూడలేక వచ్చిచేరెను.

(౯) సుషేణుఁడు వానరులతోడ పడమటిదిక్కులో సీతాదేవిని వెతకి ఒకనెల నిండగా వచ్చి సుగ్రీవుని సన్నిధిలోఁ జేరెను.

(౧౦) ప్రశ్రవణమను కొండమీద శ్రీరామునితోడ గూర్చుండి యుండిన సుగ్రీవుని యొద్దచేరి, అతనికి నమస్కారము చేసి, వానరులు అతనితో నిటులనిరి.

(౧౧) సమస్తమైన పర్వతములలోను, ప్రవేశించుటకు సాధ్యపడనివనములలోను సముద్రములోఁ గలియుచుండు నదులలోను,సకలమైన దేశములలోను సీతను వెతకి చూచితిమి.

(౧౨) నీవు చెప్పిన గుహలన్నిటిలోను, లతలతోనిండిన గొప్ప పొదలలోను సీతను వెతకితిమి.

(౧౩) పోవుటకు సాధ్యపడని దేశములలోను మిగుల శ్రమపడి పోదగిన మిట్టపల్లములుగల ప్రదేశములోను, సీతను వెతకి, గొప్పశరీరముగల ప్రాణుల సమీపమునకుఁ బోయి, రావణుఁడని తలఁచి, వానిం జంపితిమి.

(౧౪) గొప్పబలముగల వంశములోఁ బుట్టినవాఁడును మహాత్ముఁడును వానరశ్రేష్ఠుఁడును వాయుపుత్రుఁడును నగు హనుమంతుఁడు సీతయుండు దిక్కునకుఁ బోయియున్నాఁడు. అతఁడు సీతను జూచి వచ్చును.

ఇది నలువదియేడవ సర్గ.



## అష్టచత్వారింశస్సర్గః



సహ తారాంగదాభ్యాంతు గత్వా స హనుమా న్కపిః।
సుగ్రీవేణ యథోద్దిష్టం తం దేశ ముపచక్రమే॥ ౧
సతు దూర ముపాగమ్య సర్వై స్తైః కపిసత్తమైః।
విచినోతిస్మ వింధ్యస్య గుహాశ్చ గహనానిచ॥ ౨

పర్వతాగ్రా న్నదీ దుర్గాం స్సరాంసి విపులా న్ద్రుమాన్।
వృక్షషండాంశ్చ వివిధా న్పర్వతా న్ఘనపాదపాన్॥ ౩
అన్వేషమాణా స్తే సర్వే వానరా స్సర్వతో దిశమ్।
న సీతాం దదృశు ర్వీరా మైథిలీం జనకాత్మజామ్॥ ౪

తే భక్షయంతో మూలాని ఫలాని వివిధానిచ।
అన్వేషమాణా దుర్ధర్షా న్యవసం స్తత్ర తత్రహ॥ ౫
స తు దేశో దురన్వేషో గుహాగహనవా న్మహాన్॥ ౫.౫

నిర్జలం నిర్జనం శూన్యం గహనం రోమహర్షణమ్॥ ౬.
త్యక్త్వాతు తం తదా దేశం సర్వేవై హరియూథపాః।
తాదృశా న్యప్యరణ్యాని విచిత్య భృశపీడితాః॥ ౭

## ౪౮ వ సర్గ.

(అవతారిక.— దక్షిణ దిక్కునకుఁ బోయిన హనుమంతుఁడు మొదలగు వానరులు యొక రాక్షసుని నిరసనము సేయువరకీ సర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) హనుమంతుఁడు, తారుఁడు అంగదునితోడ సుగ్రీవుఁడు దెలిపిన ప్రదేశమునకుఁ బోయెను.

(౨,౩) హనుమంతుఁడు ప్రసిద్ధులగు కపిశ్రేష్ఠు లందరితోడ బహుదూరము వచ్చి వింధ్యపర్వతము గుహలలోను అరణ్యములలోను ఆపర్వతము శిఖరములలోను నదులలోను దుర్గములలోను సరస్సులలోను విశాలమగు వృక్షములలోను నానావిధములగు తోపులలోను గొప్ప వృక్షములుగల ప్రత్యంత పర్వతములలోను సీతాదేవిని వెతకెను.

(౪) వీరులగు వానరులందరు అన్నిదిక్కులలోను వెతకి జనకుని కూతురగు సీతాదేవిని జూడలేదు.

(౫) తిరస్కరించుటకు సాధ్యులుగాని హనుమంతుఁడు మొదలగు వానరులు సీతను వెతకుచు నానావిధములగు కందమూలములను ఫలములను భక్షించుచు అచ్చటచట వసించిరి.

(౫౪) గుహలుగలిగి ప్రవేశించుటకు సాధ్యపడని ఆగొప్ప ప్రదేశములో సీతను వెతకుట మిగుల శ్రమగనుండెను.

(౬,౭) జనము జలములేక శూన్యముగను ప్రవేశించుటకు సాధ్యపడనిదిగను, రోమాంచముగలిగించునదిగను నుండు ఆప్రదేశమును విడిచి అపుడు వానరసేనానాయకులందరు దానివలెనే యుండు మరికొన్ని యరణ్యములలో సీతను వెతకి మిగుల శ్రమపడిరి.

దేశ మన్యం దురాధర్షం వివిశు స్స్వకుతోభయాః।
యత్ర వంధ్యఫలా వృక్షా విపుష్పాః పర్ణవర్జితాః॥ ౮
నిస్తోయా స్సరితో యత్ర మూలం యత్ర సుదుర్లభమ్।
నసంతి మహిషా యత్ర నమృగా నచ హస్తినః॥ ౯
శార్దూలాః పక్షిణో వాపి యేచాన్యే వనగోచరాః।
న యత్ర వృక్షా నౌషధ్యో నలతా నాపి వీరుధః॥ ౧౦
స్నిగ్ధపత్రాః స్థలే యత్ర పద్మిన్యః ఫుల్లపంకజాః।
ప్రేక్షణీయా స్సుగంధాశ్చ భ్రమరైశ్చాపి వర్జితాః॥ ౧౧
కండుర్నామ మహాభాగ స్సత్యవాదీ తపోధనః।
మహర్షిః పరమామర్షీ నియమైర్దుష్ప్రధర్షణః॥ ౧౨
తస్య తస్మి న్వనే పుత్రో బాల ష్షోడశ వార్షికః।
ప్రణష్టో జీవితాంతాయ క్రుద్ధ స్తత్ర మహామునిః॥ ౧౩
తేన ధర్మాత్మనా శప్తం కృత్స్నం తత్ర మహద్వనమ్।
అశరణ్యం దురాధర్షం మృగపక్షివివర్జితమ్॥ ౧౪
తస్య తే కాననాంతాంశ్చ గిరీణాం కందరాణిచ।
ప్రభవాని నదీనాంచ విచిన్వంతి సమాహితాః ౧౫
తత్ర చాపి మహాత్మానో నాపశ్య న్జనకాత్మజామ్।
హర్తారం రావణంవాపి సుగ్రీవ ప్రియకారిణః॥ ౧౬

(౮,౯,౧౦) పూలు ఆకులు ఫలములు లేనివృక్షములు, జలము లేనినదులు గలిగి, కందమూలములు మహిషములు మృగములు యేనుగులు పులులు పక్షులు అరణ్యములలో సంచరించుచు, యితరజంతువులు వృక్షములు ఓషధులు లతలు పొదలు లేక శూన్యమై ప్రవేశించుటకు సాధ్యము కాని ప్రదేశమునకు కొంచమైనను భయములేక వానరులు పోయిరి.

(౧౧) ఆయరణ్యములలో జలము లేని ప్రదేశములలో తళతళమను చుండు తామరాకులు వికసించిన తామరపూలుగలిగి, వర్ణనీయముగను మంచిగంధము గలిగిన నేల తామర లతలుండెను. ఆపూలవద్దకు తుమ్మెదలు పోవుటలేదు.

(౧౨) మహాత్ముడును సత్యము పలుకువాడును తపస్సే ధనముగ గలవాడును మిగుల కోపముగలవాడును వ్రతములు సేయుచుండి తిరస్కరించుటకు సాధ్యపడనివాడును నగు కండుమహర్షి అచట ఉండెను.

(౧౩) అరణ్యములో ౧౬ సంవత్సరముల వయసుగల కండుమహర్షి కొడుకు అగుపడక పోయెను. అతడు నాశనమైనందున ఆవనముమీద కండుమహర్షికి మిగుల కోపము గలిగెను.

(౧౪) ధర్మాత్ముడగు కండు మహర్షి ఆగొప్ప వనమునకంతయు శాపమిచ్చెను. అందువల్ల, అది యెకరి ఆశ్రయము కాక, ప్రవేశించుటకు సాధ్యపడక మృగములు పక్షులు లేనిదిగ ఆయెను.

(౧౫) అట్టి యరణ్యముయొక్క మధ్యలోను, కొండల గుహలలోను నదుల ఉత్పత్తిస్థానములలోను వానరులు మిగుల సావధానులై సీతను వెతకిరి.

(౧౬) సుగ్రీవునికి ప్రియము సేయునట్టి మహాత్ములగు వానరులు అట్టి ప్రదేశములలోను జనకునికూతురగు సీతను ఆమెను నపహరించిన రావణుని వెతికియు, జూడలేదు.

తే ప్రవిశ్యాశు తం భీమం లతాగుల్మ సమావృతమ్।
దదృశుః క్రూరకర్మాణ మసురం సురనిర్భయమ్॥ ౧౭
తం దృష్ట్వా వానరా ఘోరం స్థితం శైలమివాపరమ్।
గాఢం పరిహితా స్సర్వే దృష్ట్వా తా న్పర్వతోపమాన్॥ ౧౮
సోపితాన్ వానరా న్సర్వా న్నష్టాస్థేత్యబ్రవీ ద్బలీ।
అభ్యధావత సంక్రుద్ధో ముష్టి ముద్యమ్య సంహితమ్॥ ౧౯
త మాపతంతం సహసా వాలి పుత్రోంగద స్తదా।
రావణోయ మితి జ్ఞాత్వా తలేనాఽభిజఘానహ॥ ౨౦
స వాలిపుత్రాభిహతో వక్త్రా చ్ఛోణి తముద్వమన్।
అసురోభ్యపత ద్భూమౌ పర్యస్తఇవపర్వతః॥ ౨౧
తేపి తస్మిన్నిరుచ్ఛ్వాసే వానరాజితకాశినః।
వ్యచిన్వన్ ప్రాయశ స్తత్ర సర్వం తద్గిరిగహ్వరమ్॥ ౨౨
విచితంతు తతః కృత్వా సర్వే తే కాననం పునః।
అన్యదేవాపరం ఘోరం వివిశు ర్గిరిగహ్వరమ్॥ ౨౩
తే విచిత్య పునః ఖిన్నా వినిష్పత్య సమాగతాః।
ఏకాంతే వృక్షమూలేతు నిషేదు ర్దీనమానసాః॥ ౨౪
ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - అష్టచత్వారింశస్సర్గః.

(౧౭) వానరులు శీఘ్రముగ లతలతోను పొదలతోనునిండి భయంకరమగు అరణ్యములోఁ బ్రవేశించి అచట దేవతలవల్లను భయములేని, క్రూరమైన కర్మముగల, ఒక రాక్షసుని జూచిరి.

(౧౮, ౧౯) వానరులు, భయంకరుఁడై రెండవ కొండవలెనుండు ఆయసురునిజూచి అందరు నడుముకు బాగుగ గుడ్డలు గట్టుకొని నిలిచిరి. బలముగలఆయసురుఁడు కొండలవలె వెలుంగుచుండు వానరులను జూచి 'మీరు చచ్చితిరి' అని చెప్పి, మిగుల కోపముగలవాఁడై బిడికిలి బాగుగఁ బట్టుకొని వారిమీదికి పరుగెత్తి వచ్చెను.

(౨౦) అపుడు వాలిపుత్త్రుఁడగు అంగదుఁడు పైకివచ్చుచుండు ఆరాక్షసుని రావణుఁడేయని తలంచి మిగుల వేగముగ అరచేతితో నతనిం గొట్టెను.

(౨౧) వాలి కొడుకుచేఁ గొట్టఁబడిన అసురుఁడు నోటినుండి నెత్తురు గ్రక్కుచు, పర్వతము తలక్రిందుగఁ బడునటుల, భూమిమీదపడెను.

(౨౨) జయించి ప్రకాశించుచుండు ఆవానరులు రాక్షసుఁడు ప్రాణములుపోయి ఊపిరిలేక నుండగా ఆప్రదేశములో నతఁడు వసించుచుండిన కొండమధ్యప్రదేశములో నంతయు సీతను బాగుగ వెతకిచూచిరి.

(౨౩) వానరులందరు ఆరణ్యములో సీతనువెతకి మరియు భయంకరముగనుండు యింకొక కొండమధ్యలో నామెను వెతకుటకుఁ బ్రవేశించిరి.

(౨౪) ఆవానరులు సీతనువెతకి మరియు ఖిన్నులై వెలుపలవచ్చి గుంపుగూడి యేకాంతముగనుండు ఒక చెట్టుక్రింద దీనమైనమనసు గలవారై కూర్చుండిరి.

ఇది నలుబదియెనిమిదవ సర్గ.

## ఏకోనపంచాశస్సర్గః.

అథాంగద స్తదా సర్వా న్వానరా నిద మబ్రవీత్।
పరిశ్రాంతో మహాప్రాజ్ఞ స్సమాశ్వాస్య శనై ర్వచః॥ ౧
వనాని గిరయో నద్యో దుర్గాణి గహనానిచ।
దర్యో గిరిగుహాశ్చైవ విచితాని సమంతతః॥ ౨

తత్ర తత్ర సహాస్మాభి ర్జానకీ నచ దృశ్యతే।
తద్వా రక్షో హృతా యేన సీతా సురసుతోపమా॥ ౩
కాలశ్చ నో మహాన్యాత స్సుగ్రీవ శ్చోగ్రశాసనః।
తస్మా ద్భవంత స్సహితా విచిన్వంతు సమంతతః। ౪

విహాయ తంద్రీం శోకంచ నిద్రాం చైవ సముత్థితామ్।
విచినుధ్వం యథా సీతాం పశ్యామో జనకాత్మజామ్॥ ౫
అనిర్వేదంచ దాక్ష్యంచ మనస శ్చాపరాజయః।
కార్యసిద్ధికరాణ్యాహు స్తస్మా దేత ద్బ్రవీమ్యహమ్॥ ౬

అద్యాపి తద్వనం సర్వం విచిన్వంతు వనౌకసః।
ఖేదం త్యక్త్వా పున స్సర్వై ర్వనమేత ద్విచీయతామ్॥ ౭

## ౪౯ వ సర్గ.

(అవతారిక.— ఇంకొక ప్రదేశములో వానరులు సీతను వెతకుట యీ సర్గలోఁ జెప్పఁబడుచున్నది.

(౧) పిమ్మట, మిగుల ప్రాజ్ఞుఁడగు అంగదుఁడు మిగుల శ్రమము గల వాఁడై అపుడు వానరు లందరికిని సమాధానము చెప్పి వారితో నిటు లనెను.

(౨) వనములు కొండలు నదులు దుర్గముగనుండు ప్రదేశములు గొప్ప అరణ్యములు పర్వత మధ్యప్రదేశములు పర్వతముల గుహలలో నలుప్రక్కలలోను సీతాదేవిని వెతకితిమి.

(3) ఆయా ప్రదేశములలో సీతాదేవిని, దేవకన్యకతో సమానురాలైన ఆమెను అపహరించిన రాక్షసుని మనము వెతకి చూచితిము. వాఁడు అగుపడలేదు.

(౪) మనము ప్రయాణమైవచ్చి పెద్దకాలమైనది. సుగ్రీవుఁడు కఠినముగ దండించువాఁడు. అందుచే, మీరు గుంపుగూడి నలుప్రక్కలలోను సీతను వెతుకవలయును.

(౫) సోమరితనము దుఃఖము నిద్ర విడిచి జనకుని కూతురగు సీతాదేవి కంటికి అగుపడునటుల వెతుకవలయును.

(౬) దుఃఖము లేకుండుట, ఉత్సాహము ధైర్యము యివియన్నియు కార్యములను సఫలము సేయునట్టివి. అందుచేత యిటుల నేను చెప్పుచున్నాను.

(౭) వానరులు ప్రవేశించుటకు సాధ్యము గాని ఆ వనములోనే యిపుడు వెతుకవలయును. మరియు, అందరు ఖేదమును విడిచి యీ వనములోను సీతాదేవిని వెతుకవలయును.

అవశ్యం క్రియమాణస్య దృశ్యతే కర్మణః ఫలమ్।
అలం నిర్వేద మాగమ్య నహి నో మీలనం క్షమమ్॥ ౮
సుగ్రీవః కోపనోరాజా తీక్ష్ణదండశ్చ వానరః।
భేతవ్యం తస్య సతతం రామస్యచ మహాత్మనః॥ ౯

హితార్థ మేత దుక్తం వః క్రియతాం యది రోచతే।
ఉచ్యతాం వా క్షమం యన్న స్సర్వేషా మేవ వానరాః॥ ౧౦
అంగదస్య వచ శ్శ్రుత్వా వచనం గంధమాదనః।
ఉవాచాఽవ్యక్తయా వాచా పిపాసాశ్రమ ఖిన్నయా॥ ౧౧

సదృశంఖలు వో వాక్య మంగదో యదు వాచహ।
హితంచైవానుకూలంచ క్రియతా మస్య భాషితమ్॥ ౧౨
పున ర్మార్గామహై శైలాన్ కందరాంశ్చ దరీ స్తథా।
కాననానిచ శూన్యాని గిరిప్రస్రవణానిచ॥ ౧౩

యథోద్దిష్టాని సర్వాణి సుగ్రీవేణ మహాత్మనా।
విచిన్వంతువనం సర్వే గిరిదుర్గాణి సర్వశః॥ ౧౪
తత స్సముత్థాయ పున ర్వానరా స్తే మహాబలాః
వింధ్యకాననసంకీర్ణాం విచేరు ర్దక్షిణాం దిశమ్॥ ౧౫

(౮) కార్యము చేయుచుండినట్లైతే ఫలము అవశ్యముగ గలుగును. దుఃఖించునదిచాలును. మనము కన్నులు మూసికొని యుండుట తగదు.(చేయవలసిన కార్యమును జేయకుండుట తగదని భావము.)

(౯) వానరుఁడును రాజును నగుసుగ్రీవుఁడు కోపము గలవాఁడు. కఠినముగ శిక్షించువాఁడు. అతనికిని మహాత్ముఁడగు రామునికిని యెల్లప్పుడు భయపడవలయును.

(౧౦) మీకు హితము గలుగుటకై యీమాట చెప్పితిని. మీకు యిష్టముగనుండినట్లైతే నేను చెప్పినటులఁ జేయుఁడు. లేకపోయిన, వానరులారా! మనకందరికిని దగిన ఆలోచన నైనను జెప్పవలయును.

(౧౧) గంధమాధనుఁ డనువానరుఁడు అంగదుని మాట విని దాహముశ్రమచే దీనమై స్ఫుటములేని మాటతో నిటు లనెను.

(౧౨) అంగదుఁడు చెప్పినమాట మీకందరికిని యుక్తముగనున్నది. మేలు గలిగించునట్టి అనుకూలమైన అంగదునిమాట ప్రకారము సేయుఁడు.

(౧౩) మరియు, కొండలలోను కొండల సంధులలోను గుహలలోను జనములేని అడవులలోను కొండనదులలోను మరియు సీతను వెతకి చూడవలయును.

(౧౪) మహాత్ముఁడగు సుగ్రీవుఁడు చెప్పియుండు ప్రదేశము లన్నిటిలోను కొండలల్లోను దుర్గములలోను అన్నిటిలోను సీతను వెతుకవలయును.

(౧౫) గొప్పబలముగల ఆ వానరులందరు ఆ యేకాంత ప్రదేశమునుండి మరిమలేచి వింధ్యపర్వతము అడవులతో నిండియుండు దక్షిణదిక్కులో సంచరించి సీతను వెతకు చుండిరి.

తే శారదాభ్రప్రతిమం శ్రీమద్రజతపర్వతమ్।
శృంగవంతం దరీమంత మధిరుహ్యచ వానరాః॥ ౧౬
తత్ర లోధ్రవనం రమ్యం సప్తపర్ణ వనానిచ।
వ్యచిన్వం స్తే హరివరా స్సీతాదర్శనకాంక్షిణః॥ ౧౭

తస్యాగ్ర మధిరూఢా స్తే శ్రాంతా విపులవిక్రమాః।
నపశ్యంతిస్మ వైదేహీం రామస్య మహిషీం ప్రియామ్॥ ౧౮
తేతు దృష్టిగతం కృత్వా తం శైలం బహుకందరమ్।
అవారోహంత హరయో వీక్షమాణా స్సమంతతః॥ ౧౯

అవరుహ్య తతో భూమిం శ్రాంతా విగతచేతసః।
స్థిత్వా ముహూర్తం తత్రాథ వృక్షమూల ముపాశ్రితాః॥ ౨౦
తే ముహూర్తం సమాశ్వస్తాః కించి ద్భగ్నపరిశ్రమాః।
పున రేవోద్యతాః కృత్స్నాం మార్గితుం దక్షిణాందిశమ్॥ ౨౧

హనుమత్ప్రముఖా స్తేతు ప్రస్థితాః ప్లవగర్షభాః।
వింధ్యమేవాదిత స్తావ ద్విచేరు స్తే తత స్తతః॥ ౨౨
ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - ఏకోనపంచాశస్సర్గః



(౧౬) ఆ వానరులు శరత్కాల మేఘముతో సమానమై కాంతిగలిగిన శిఖరములు గుహలుగల వెండికొండను నెక్కిరి.

(౧౭) ఆ కొండమీద మనోహరమగు లోధ్ర వనములోను యేడాకుల మ్రానులుగల వనములోను సీతను జూచుటకు కోరుచుండిన వానరవీరులు ఆమెను వెతకుచుండిరి.

(౧౮) ఆ కొండమీద నెక్కియుండు మిగుల పరాక్రమము గల వానరులు వెతకి శ్రమ గలవారై శ్రీరాముని పట్టమహిషియు ప్రియురాలును నగు సీతను జూడలేదు.

(౧౯) అనేక గుహలుగల ఆపర్వతమును బాగుగఁ బరీక్షించి చూచి వానరులు నలుప్రక్కల సీతను వెతకుచు దానిమీదినుండి దిగిరి.

(౨౦) కొండనుండి వానరులుదిగి శ్రమముపొంది వ్యాకులచిత్తులై అచట కొంతసేపు నిలిచి పిదప ఒక చెట్టుక్రింద అందరు గూర్చుండిరి.

(౨౧) వానరులు ముహూర్తకాలము అచటనుండి ధైర్యము దెచ్చుకొని శ్రమతీర్చుకొని మరియు దక్షిణ దిక్కులలో నన్నిచోటులలోను సీతను వెతకుటకు ఆరంభించిరి.

(౨౨) సీతను వెతకుటకు ప్రయాణము సేసియుండు హనుమంతుఁడు మొదలగు వానరోత్తములు మొదట వింధ్యపర్వతము నలుప్రక్కలలోను సీతను వెతికి సంచరించు చుండిరి.

ఇది నలువదితొమ్మిదవ సర్గ.



## పంచాశస్సర్గః.



సహ తారాంగదాభ్యాంతు సంగమ్య హనుమా న్కపిః।
విచినోతిస్మ వింధ్యస్య గుహాశ్చ గహనానిచ॥ ౧
సింహశార్దూలజుష్టేషు శిలాశ్చ సరిత స్తథా।
విషమేషు నగేంద్రస్య మహాప్రస్రవణేషుచ॥ ౨

ఆసేదు స్తస్య శైలస్య కోటిం దక్షిణపశ్చిమామ్।
తేషాం తత్రైవ వసతాం స కాలో వ్యత్యవర్తత॥ ౩
సహి దేశో దురన్వేషో గుహాగహనవా న్మహాన్॥ ౩½

తత్ర వాయుసుత స్సర్వం విచినోతిస్మ పర్వతమ్।
పరస్పరేణ హనుమా నన్యోన్యస్యా విదూరతః॥ ౪½

గజో గవాక్షో గవయ శ్శరభో గంధమాదనః॥ ౫
మైందశ్చ ద్వివిదశ్చైవ సుషేణో జాంబవా న్నళః।
అంగదో యువరాజశ్చ తారశ్చ వనగోచరః॥ ౬
గిరిజాలావృతా న్దేశా న్మార్గిత్వా దక్షిణాం దిశమ్।
విచిన్వంత స్తత స్తత్ర దదృశు ర్వివృతం బిలమ్॥ ౭

## ౫౦ వ సర్గ.

(అవతారిక.— ఆంజనేయుఁడు మొదలగు వానరులు ఋక్షబిలములో ప్రవేశించి స్వయం ప్రభయొక్క ఆశ్రమమును జూచుట.)

(౧,౨) వానరుఁడగు హనుమంతుఁడు తార అంగదులతోఁగూడి వింధ్య పర్వతము గుహలలోను గొప్ప అరణ్యములలోను, రాళ్ళలోను నదులలోను సింహములు శార్దూలములుగల మిట్టపల్లములుగనుండు ప్రదేశములలోను గొప్ప కొండ నదులలోను సీతాదేవిని వెతకి చూచెను.

(3) వానరులు ఆపర్వతముమీద నైరుతిదిక్కులోఁ గూర్చుండిరి. అపుడు, సుగ్రీవుఁడు చెప్పిన ఒక నెల గడువు ముగిసిపోయెను.

(౩౪) గుహలుగలిగి ప్రవేశించుటకు సాధ్యముకాక · విశాలముగనుండు ఆప్రదేశములో సీతను వెతకుట మిగుల ప్రయాసగ నుండెను.

(౪౫) వాయుపుత్రుఁడగు హనుమంతుఁడు వానరులను నాలుగు దిక్కుల లోను నొకరిని నింకొకరి సమీపములోనుంచి ఆపర్వతములో నంతయు నతఁడు సీతను వెతకి చూచెను.

•

(౫,౬,౭,) గజుఁడు గవాక్షుఁడు గవయుఁడు శరభుఁడు గంధమాధనుఁడు మైందద్వివిదులు సుషేణుఁడు జాంబవంతుఁడు నళుఁడు యువరాజగు అంగదుఁడు, అరణ్యములను బాగుగ నెరింగియుండు తారుఁడు, కొండలతో నిండియుండు ప్రదేశములలో సీతను వెతకి, దక్షిణదిక్కులోను నచ్చటచట వెతకుచు, విశాలముగనుండు ఒకబిలమును నచట చూచిరి.

దుర్గ మృక్షబిలం నామ దానవేనాభిరక్షితమ్।
క్షుత్పిపాసాపరీతాశ్చ శ్రాన్తాశ్చ సలిలార్థినః॥ ౭
అవకీర్ణం లతావృక్షై ర్దదృశు స్తే మహాబిలమ్॥ ౮౪
తతః క్రౌంచాశ్చ హంసాశ్చ సారసాశ్చాపి నిష్క్రమన్।
జలార్ద్రా శ్చక్రవాకాశ్చ రక్తాంగాః పద్మరేణుభిః॥ ౯౪

తత స్తద్బిల మాసాద్య సుగంధి దురతిక్రమమ్।
విస్మయవ్యగ్రమనసో బభూవు ర్వానరర్షభాః॥ ౧౦౪
సంజాతపరిశంకా స్తే తద్బిలం ప్లవగోత్తమాః।
అభ్యపద్య. న్తసంహృష్టా స్తేజోవంతో మహాబలాః॥ ౧౧౪
నానాసత్త్వసమాకీర్ణం దైత్యేంద్రనిలయోపమమ్।
దుర్దర్శ మతిఘోరంచ దుర్విగాహం చ సర్వశః॥ ౧౨౪

తతః పర్వతకూటాభో హనుమాన్పవనాత్మజః।
అబ్రవీద్వానరా న్సర్వా న్కాంతారవనకోవిదః॥ ౧౩౪
గిరిజాలావృతా న్దేశా న్మార్గిత్వా దక్షిణాం దిశమ్।
వయం సర్వే పరిశ్రాంతా నచపశ్యామ మైథిలీమ్॥ ౧౪౪
అస్మాచ్చాపి బిలా ద్ధంసాః క్రౌంచాశ్చ సహసారసైః।
జలార్ద్రా శ్చక్రవాకాశ్చ నిష్పతంతిస్మ సర్వతః॥ ౧౫౪

(౮,౮½) ఆకలి దాహముచే మిగుల తపించి జలముగోరి శ్రమను బొంది యుండు వానరులు లతలతోను వృక్షములతోను నిండి ప్రవేశించుటకు సాధ్య పడని ఋక్షబిలమను పేరుగల ఒక గొప్ప బిలమును జూచిరి.

(౯½) ఆ బిలమునుండి క్రౌంచ హంస సారస, తడిసి తామరపూల దూళిపడినందున చక్రవాక, పక్షులు వెలుపల వచ్చినవి.

(౧౦½) పిమ్మట, వానర శ్రేష్ఠులు మంచివాసనగలిగి ప్రవేశించుటకు సాధ్యపడని ఆ గుహాసమీపమునకుఁ బోయి మిగుల ఆశ్చర్యపడియుండిరి.

(౧౧½,౧౨½) తేజస్సు గొప్పబలము గలవానరోత్తములు నానావిధ ములగు మృగములు గలదియు రాక్షసేంద్రుని గృహముతో సమానమై చూచు టకు సాధ్యపడక, మిగుల భయంకరమై ప్రవేశించుటకు సాధ్యముకాని ఆబిల మును జూచి, యిది పాతాళమా, లేక, మాయచేఁ గల్పింపఁబడినదా యని సందే హము గలిగి సంతోషము లేనివారై ఉండిరి.

(౧౩½) పిమ్మట, పర్వతశిఖరమువలె వెలుంగుచుండు వాఁడును, వాయు పుత్త్రుఁడును పోవుటకు సాధ్యపడని మార్గములలోను అరణ్యములలోఁ బోవు టకు శక్తిగలవాఁడునునగు హనుమంతుఁడు వానరులతో నిటు లనెను.

(౧౪½) కొండలతోనిండిన ప్రదేశములలోను దక్షిణ దిక్కులోను వెతకి మనమందరము మిగుల శ్రమగలవారమైతిమి. సీతను జూడక పోతిమి.

(౧౫½) ఈ బిలమునుండి నీళ్ళలోఁ దడిసిన హంసలు క్రౌంచములు సార సపక్షులు చక్రవాకపక్షులు వెలుపల వచ్చుచున్నవి.

నూనం సలిలవా నత్ర కూపోవా యది వా హ్రదః।
తథాచేమే బిలద్వారే స్నిగ్ధా స్తిష్ఠంతి పాదపాః॥ ౧౬
ఇత్యుక్త్వా తద్బిలం సర్వే వివిశు స్తిమిరావృతమ్।
అచంద్రసూర్యం హరయోదదృశూరో మహర్షణమ్॥ ౧౭
నిశామ్య తస్మా త్సింహాంశ్చ తాంస్తాంశ్చ మృగపక్షిణః।
ప్రవిష్టా హరిశార్దూలా బిలం తిమిరసంవృతమ్॥ ౧౮
నతేషాం సజ్జతే చక్షు ర్న తేజో న పరాక్రమః।
వాయోరివ గతి స్తేషాం దృష్టి స్తమసి వర్తతే॥ ౧౯
తే ప్రవిష్టాస్తు వేగేన తద్బిలం కపికుంజరాః।
ప్రకాశ మభిరామంచ దదృశు ర్దేశముత్తమమ్॥ ౨౦
తత స్తస్మి న్బిలే దుర్గే నానాపాదపసంకులే।
అన్యోన్యం సంపరిష్వజ్య జగ్ము ర్యోజన మంతరమ్॥ ౨౧
తే నష్టసంజ్ఞా స్తృషితా స్సంభ్రాంతా స్సలిలార్థినః।
పరిపేతు ర్బిలే తస్మి న్కంచిత్కాల మతంద్రితాః॥ ౨౨
తే కృశా దీనవదనాః పరిశ్రాంతాః ప్లవంగమాః।
ఆలోకం దదృశు ర్వీరా నిరాశా జీవితే తదా॥ ౨౩
తత స్తం దేశ మాగమ్య సౌమ్యం వితిమిరం వనమ్।
దదృశుః కాంచనా న్వృక్షా న్దీప్త వైశ్వానరప్రభాన్॥ ౨౪

(౧౬౪) గనుక, ఈబిలములో తీర్థముగల బావి లేక సరస్సుగలదు. నిజము. మరియు, దీనిద్వారములో పచ్చగనుండు వృక్షములు గలవు.

(౧౭౪) ఇటులచెప్పి, వానరులందరు సూర్య చంద్రుల కిరణములులేక చీకటితోనిండి రోమాంచము గలిగించునట్టి గుహలోఁ బ్రవేశించిచూచిరి.

(౧౮౪) ఆచటనుండి వచ్చుచుండు సింహములను నానావిధములగు పక్షులను, చీకటితోనిండిన ఆగుహలోఁ బ్రవేశించిన, వానరులు చూచిరి.

(౧౯౪) ఈ వానరుల నేత్రములు తేజస్సు పరాక్రమము గాలివంటి వేగము ఆబిలములో నుపయోగపడలేదు. కన్నులు కనిపించలేదు.

(౨౦౪) ఆగుహలో మిగుల వేగముగఁ బ్రవేశించుచుండు వానర శ్రేష్ఠులు ప్రకాశముగను మనోహరముగను నుండు రమ్యమగు నొక ప్రదేశమును జూచిరి.

(౨౧౪) పిమ్మట, మిగుల ప్రయాసతో, బ్రవేశించదగినదియు, నానావిధములగు వృక్షములతో నిండినదియు, నగు ఆబిలములోఁ వానరులు ఒకరినొకరుచేయిపట్టుకొని ఒకయోజనము దూరము లోపల పోయిరి.

(౨౨౪) వానరులు దాహముగలవారై జలమును వెతకుచు భ్రాంతిపొందిన వారై ప్రజ్ఞ తప్పి ఆబిలములో మిగుల ప్రయాసతోఁ బోవుచుండిరి.

(౨౩౪) వీరులగు వానరులు కృశులై వాడిన ముఖముగలవారై మిగుల శ్రమపొంది ప్రాణముమీద ఆశలేనివారై ఒకవెలుతురును జూచిరి.

(౨౪౪,౨౫౪) పిమ్మట, వానరులు ఆప్రదేశము చేరి ఆచట చల్లగను చీకటిలేకయు నుండు వనమును ఆవనములో స్వర్ణమయమగు వెలుంగుచుండు అగ్నివంటి కాంతిగల పూచియుండు సాల తాల పున్నాగ కకుభ వంజుళ ధవ చంపక నాగ కర్ణికార వృక్షములను జూచిరి.

సాలాం స్తాలాంశ్చ పున్నాగా న్కకుభా న్వంజులా న్ధవాన్।
చంపకా న్నాగవృక్షాంశ్చ కర్ణికారాంశ్చ పుష్పితాన్॥ ౨౫
స్తబకైః కాంచనై శ్చిత్రై రక్తైః కిసలయై స్తథా।
ఆపీడైశ్చ లతాభిశ్చ హేమాభరణభూషితాన్॥ ౨౬
తరుణాదిత్యసంకాశా న్వైడూర్యకృతవేదికాన్।
విభ్రాజమానా న్వపుషా పాదపాంశ్చ హిరణ్మయాన్॥ ౨౭½
నీలవైడూర్యవర్ణాశ్చ పద్మినీః పతగావృతాః।
మహద్భిః కాంచనైః పద్మై ర్వృతా బాలార్కసన్నిభైః॥ ౨౮
జాతరూపమయై ర్మత్స్యై ర్మహద్భిశ్చ సకచ్ఛపైః।
నళినీ స్తత్ర దదృశుః ప్రసన్నసలిలావృతాః॥ ౨౯½
కాంచనాని విమానాని రాజతాని తథైవచ।
తపనీయగవాక్షాణి ముక్తాజాలావృతానిచ॥ ౩౦
హైమరాజతభౌమాని వైడూర్యమణిమంతి చ।
దదృశు స్తత్ర హరయో గృహముఖ్యాని సర్వశః॥ ౩౧½
పుష్పితా న్ఫలినో వృక్షా న్ప్రవాళమణిసన్నిభాన్।
కాంచనభ్రమరాంశ్చైవ మధూనిచ సమంతతః॥ ౩౨
మణికాంచనచిత్రాణి శయనాన్యాసనానిచ।
మహార్హాణిచ యానాని దదృశు స్తే సమంతతః॥ ౩౩½

(౨౬౪, ౨౭౪) బంగారుమయముగనుండు గొత్తులతోను, చిత్రముగను ఎర్రగను నుండు చిగురుతోను, శిరోభూషణములతోను, లతలతోను, ప్రకాశించు చుండునట్టిదిగను, ఫలించియుండు బంగారు సొమ్ములుగలదిగను, బాలసూర్యునివలె వెలుంగుచుండునదిగను, వృక్షములచుట్టు వైడూర్యములతోఁ జేయఁబడిన వేదికలుగలదిగను, స్వభావముచేతనే ప్రకాశించుచుండు వెండి మయముగనుండు వృక్షములుగలదిగను ఆబిలమును వానరులు చూచిరి.

(౨౮౪, ౨౯౪) పక్షులతో నిండినవిగను, బాలసూర్యునివలె వెలుంగుచుండునవిగను, బంగారు వికారమైన గొప్ప తామరపూలతో నిండిన నీల వైడూర్యరంగులుగల తామరలతలను, తాబేళ్ళతోను బంగారువికారముగనుండు గొప్ప చేపలతోను నిండి నిర్మలమగు జలముగల సరస్సులను అచట వానరులు చూచిరి.

(304, 314) బంగారము వెండి మయముగనుండు విమానములను, ముత్యముల హారములతో నిండిన బంగారు గవాక్షములను, బంగారు వెండితోఁ జేయఁబడిన వైడూర్యములు పొదగబడిన ఉత్తమమైన గృహములను, ఆగుహలో వానరులు అచ్చటచట చూచిరి.

(౩౨౪, ౩౩౪) పూచి ఫలించియుండు పగడములతోను రత్నములతోను సమానమగు వృక్షములను, బంగారు వికారముగనుండు తుమ్మెదలను, అన్నిచోట్లలోను తేనెను, రత్నములు బంగారముతో నిర్మింపఁబడి నానారంగులుగల శయనములను ఆసనములను, వెలలేని వాహనములను, వానరులు ఆగుహలో నచ్చటచట చూచిరి.

హైమరాజతకాంస్యానాం భాజనానాంచ సంచయాన్।
అగరూణాంచ దివ్యానాం చందనానాంచ సంచయాన్॥ ౩౪
శుచీన్య భ్యవహార్యాణి మూలానిచ ఫలానిచ।
మహార్హాణిచ పానాని మధూని రసవంతిచ।
దివ్యానా మంబరాణాంచ మహార్హాణాంచ సంచయాన్॥ ౩౫
కంబళానాం చ చిత్రాణా మజినానాంచ సంచయాన్।
తత్ర తత్రచ విన్యస్తా న్దీప్తా న్వైశ్వానరప్రభాన్॥ ౩౬
దదృశు ర్వానరా శ్శుభ్రాన్ జాతరూపస్య సంచయాన్॥ ౩౭
తత్ర తత్ర విచిన్వంతో బిలే తస్మి న్మహాబలాః।
దదృశు ర్వానరా శ్శూరాః స్త్రియం కాంచి దదూరతః॥ ౩౮
తాం దృష్ట్వా భృశసంత్రస్తా శ్చీరకృష్ణాజినాంబరామ్।
తాపసీం నియతాహారాం జ్వలంతీ మివ తేజసా॥ ౩౯
విస్మితా హరయ స్తత్ర వ్యవాతిష్ఠంత సర్వశః॥ ౪౦
పప్రచ్ఛ హనుమాం స్తత్ర కాసి త్వం కస్య వా బిలమ్॥ ౪౧
తతో హనూమా న్గిరిసన్నికాశః కృతాంజలి స్తా మభివాద్య
వృద్ధామ్। పప్రచ్ఛ కా త్వం భవనం బిలంచ రత్నాని హే-
మాని వదస్వ కస్య॥ ౪౨

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - పంచాశస్సర్గః.

(౩౮౻, మొదలు ౩౭౻ వరకు) బంగారము వెండి కంచుతోఁ జేయఁబడిన అనేక పాత్రములను, ఉత్తమమగు అగరు చందన మైపూతలను, పరిశుద్ధమైన భక్ష్యములను, కందమూలములను ఫలములను, ఉత్తమమైన పాన ద్రవ్యములను, మిగుల రుచిగనుండు తేనెలను, శ్రేష్ఠమై వెలలేని వస్త్రముల మూటలను, రత్నకంబళములను జింకచర్మములను, అచ్చటచట ఉంచబడి అగ్నివలె బాగుగ వెలుంగుచు నిర్మలమైన బంగారు రాసులను వానరులు ఆగుహలోఁ జూచిరి.

(౩౮౻) గొప్ప బలముగల శూరులగు వానరులు అబిలములో నచ్చటచట సీతాదేవిని వెతకుచు సమీపములో నొకస్త్రీని జూచిరి.

(౩౯౻,౪౦) నారవస్త్రము జింకతోలు ధరించి, నియతమైన ఆహారము గలిగి, తేజస్సుచే వెలుంగుచుండు ఒకతాపసిని జూచి మిగుల భయఁపడి వానరులు ఆశ్చర్యముగలవారై బిలములో నామెకు దూరముగ గుంపుగుంపుగ నిలిచిరి.

(౪౦౻) వానరుల మధ్యలో హనుమంతుఁడు ఆమెను జూచి 'నీవెవతె యీగుహ యెవరిది' అని అడిగెను.

(౪౧౻) పిమ్మట, పర్వతమువలెనుండు హనుమంతుఁడు అంజలిచేసికొని, వృద్ధురాలగు స్వయంప్రభకు నమస్కరించి 'నీవు యెవతె, యీ భవనము బిలము రత్నములు బంగారము ఎవరివి' అని అడిగెను.

ఇది యేఁబదవ సర్గ.



## ఏకపంచాశస్సర్గః.



ఇత్యుక్త్వా హనుమాం స్తత్ర పునః కృష్ణాజినాంబరామ్।
అబ్రవీ త్తాం మహాభాగాం తాపసీం ధర్మచారిణీమ్॥ ౧
ఇదం ప్రవిష్టా స్సహసా బిలం తిమిరసంవృతమ్।
క్షుత్పిపాసా పరిశ్రాంతాః పరిఖిన్నాశ్చ సర్వశః॥ ౨
మహద్ధరణ్యా వివరం ప్రవిష్టాః స్మ పిపాసితాః।
ఇమాం స్త్వేవం విధా న్భావా న్వివిధా నద్భుతోపమాన్॥ ౩
దృష్ట్వా వయం ప్రవ్యథితా స్సంభ్రాంతా నష్టచేతసః ౩½
కస్యైతే కాంచనా వృక్షా స్తరుణాదిత్యసన్నిభాః।
శుచీ న్యభ్యవహార్యాణి మూలానిచ ఫలానిచ॥ ౪½
కాంచనాని విమానాని రాజతాని గృహాణిచ॥
తపనీయ గవాక్షాణి మణిజాలావృతానిచ॥ ౫½
పుష్పితాః ఫలవంతశ్చ పుణ్యా స్సురభిగంధినః।
ఇమే జాంబూనదమయాః పాదపాః కస్య తేజసా॥ ౬½
కాంచనానిచ పద్మాని జాతాని విమలే జలే।
కథం మత్స్యాశ్చ సౌవర్ణాశ్చరంతి సహ కచ్ఛపైః॥ ౭½

## ౫౧ వ సర్గ.

(అవతారిక.— స్వయం ప్రభయను స్త్రీ ఋక్షబిలముయొక్క వృత్తాంత మును వానరులకుఁ దెలుపుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) ఇటుల ప్రశ్న చేసి, కృష్ణాజినము ధరించినదియు, మహాభాగ్యవతి యు, ధర్మచారిణియునగు ఆతాపసితో హనుమంతుఁడు మరియు నిటు లనెను.

(౨) మిగుల మార్గాయాసము గలవారును, ఆకలి దాహముచే మిగుల శ్రమగలవారును నగు మేము చీకటితో నిండియుండు యీబిలములో వేగముగఁ బ్రవేశించితిమి.

(3,3½) దాహముగలవారమై గొప్పదిగనుండు యీభూమిలో గల గుహ లోఁ బ్రవేశించితిమి. నానావిధములై ఇంద్రజాలముయొక్క ఆశ్చర్యముతో సమమైనట్టి యీవిధముగనుండు పదార్థములను జూచి, యివి రాక్షసుల మాయచే గల్పింపఁబడియుండునా యని వ్యధగలవారమై కర్తవ్యాకర్తవ్యము లఁతోఁచక మిగుల భ్రమచెందియున్నాము.

(౪½,౫½,౬½) బాలసూర్యుని కాంతితో సమమైన యీ బంగారు వృక్ష ములు, పరిశుద్ధమై భుజించుటకుఁ దగిన కందమూలములు ఫలములు, బంగారుమ యమైన విమానములు, వెండిమయమైన గృహములు, బంగారముచేఁ జేయఁబ డిన గవాక్షములు, రత్నములచేఁ జేయఁబడిన జాలకములు, పూచి ఫలములతోఁ గూడి పరిశుద్ధములై మంచి పరిమళముగల బంగారు వికారముగనుండు యీవృక్ష ములు, యెవని తపోమహిమవల్ల గలిగియుండునో తెలియలేదు.

(౭½) నిర్మలమగు జలములో బంగారు వికారమైన కమలములు పుట్టియుం న్నవి. బంగారు వికారముగనుండు చేపలు తాబేళ్లతోడ యెటుల సంచరించు చున్నవో చూడుము.

ఆత్మాన మనుభావంచ కస్యచైత త్తపోబలమ్॥
అజానతాం న స్సర్వేషాం సర్వ మాఖ్యాతు మర్హసి॥ ౮

ఏవ ముక్తా హనుమతా తాపసీ ధర్మచారిణీ।
ప్రత్యువాచ హనూమంతం సర్వభూతహితే రతా॥ ౯

మయోనామ మహాతేజా మాయావీ దానవర్షభః।
తే నేదం నిర్మితం సర్వం మాయయా కాంచనం వనమ్॥ ౧౦

పురా దానవముఖ్యానాం విశ్వకర్మా బభూవహ।
యేనేదం కాంచనం దివ్యం నిర్మితం భవనో త్తమమ్॥ ౧౧

సతు వర్షసహస్రాణి తప స్తప్త్వా మహావనే।
పితామహా ద్వరంలేభె సర్వమౌశనసంధనమ్॥ ౧౨

వనం విధాయ బలవా న్సర్వకామేశ్వర స్తదా।
ఉవాస సుఖితః కాలం కంచి దస్మి న్మహావనే॥ ౧౩

త మప్సరసి హేమాయాం స క్తం దానవపుంగవమ్।
విక్రమ్యైవాశనిం గృహ్య జఘానేశః పురందరః॥ ౧౪

(౮౪) నిన్ను నీమహిమను, యివన్నియు నెవని తపోబలముచేఁ గలిగినవో యీవిషయమును, మాకందరికిని అంతయుఁ దెలుపవలయును.

(౯౪) హనుమంతుఁ డిటుల అడుగగా, ఋషిధర్మమును నాచరించు చుండునదియు, సర్వభూతములకు హితము సేయుటలో నాసక్తిగలదియు నగు ఆ తాపసి అతనితో నిటు లనెను.

(౧౦౪) గొప్ప తేజస్సుగల అనేక విధములగు మాయలను జేయఁగల మయుఁ డను దానవోత్తముఁడు గలఁడు. అతఁ డతని ప్రభావముచే యీ బంగారువనము నంతయు సృష్టించెను.

(౧౧౪) బంగారు విశారమై దివ్యముగనుండు యీయుత్తమమగు భవనమును నిర్మించిన మయుఁడు పూర్వము రాక్షసోత్తములకు విశ్వకర్మగనుండెను. (ఈమయుఁడు త్రిపురముల కధిపతి. ఈ త్రిపురములను ఈశ్వరుఁడు పొడుచేయఁగా ఆత్మరక్షణకై యితఁడు భూమిలోపల యీగుహను నిర్మించుకొనెనని మత్స్యపురాణములో త్రిపుర దహనకథలోఁ జెప్పఁ బడియున్నది.)

(౧౨౪) మయుఁడు వేయిసంవత్సరములు గొప్పవనములో తపసుచేసి బ్రహ్మచే శుక్రాచారి సంబంధముగనుండు విచిత్రనిర్మాణమును దెలుపునట్టి శిల్పశాస్త్రజ్ఞానమును బడసెను.

(౧౩౪) మిగుల బలముగల బ్రహ్మవరముచే సకల కోరికలను కొనసాగించు కొనగలిగిన మయుఁడు యీవనమును నీవిధముగ నిర్మించి దీనిలో కొంతకాలము సుఖముగ వసించుచుండెను.

(౧౪౪) హేమ యనుఅప్సరసవీాద యేకాంతములో ప్రీతిగలిగియుండు రాక్షసోత్తముఁడుగ నుండుమయుని త్రిలోకాధిపతిగనుండు ఇంద్రుఁడు కనిపెట్టి వజ్రాయుధముతో నతని జంపెను.

ఇదంచ బ్రహ్మణా దత్తం హేమాయై వన ముత్తమమ్।
శాశ్వతాః కామభోగాశ్చ గృహంచేదం హిరణ్మయమ్॥ ౧౫
దుహితా మేరుసావర్ణే రహం తస్యాః స్స్వయంప్రభా।
ఇదం రక్షామి భవనం హేమాయా వానరోత్తమ॥ ౧౬

మమ ప్రియసఖీ హేమా నృత్తగీతవిశారదా।
తయా దత్తవరా చాస్మి రక్షామి భవనోత్తమమ్॥ ౧౭
కిం కార్యం కస్యవా హేతోః కాంతారాణి ప్రపశ్యథ।
కథం చేదం వనం దుర్గం యుష్మాభి రుపలక్షితమ్॥ ౧౮

ఇమా న్యభ్యవహార్యాణి మూలానిచ ఫలానిచ।
భుక్త్వా పీత్వాచ పానీయం సర్వం మే వక్తు మర్హథ॥ ౧౯

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే ఏకపంచాశస్సర్గః.

## ద్విపంచాశస్సర్గః.

అథ తా నబ్రవీ త్సర్వా న్విశ్రాంతా న్హరిపుంగవాన్।
ఇదం వచన మేకాగ్రా తాపసీ ధర్మచారిణీ॥ ౧

(౧౫౪) ఈ యుత్తమమగు బంగారువనమును మయుఁడు హేమయను అప్సరసకు యిచ్చెను. ఇచట, కామభోగములన్నియు శాశ్వతముగ నున్నవి. బంగారు వికారమైన గృహముకూడ శాశ్వతముగ నున్నది.

(౧౬౪) నేను మేరు సావర్ణియొక్క కూతురు. నాపేరు స్వయంప్రభ. హేమయొక్క యీవనమును నేను రక్షించుచున్నాను. వానరోత్తముఁడా!

(౧౭౪) నాట్య గానములలో సమర్థురాలగు హేమ నాప్రియసఖి. ఆమె యితరులు తిరస్కరించలేనట్టి శక్తిని నాకు ప్రసాదించెను. ఈయుత్తమమైన భవనమును రక్షించుచున్నాను.

(౧౮౪) ఏ హేతువుచే, యెట్టి కార్యమును సాధించుటకు మీరు అరణ్యములలోఁ దిరుగుచున్నారు. ప్రవేశించుటకు సాధ్యముకాని యీవనమును మీ రెటుల కనిపెట్టితిరి.

(౧౯౪) ఈ భక్ష్యయులను కందమూలములను ఫలములను భుజించి రస ద్రవ్యముల్లను పానముచేసి, అంతయు నాకుఁ దెలుపవలయును.

ఇది యేబదియొకటవ సర్గ.

---

## ౫౨ వ సర్గ.

(అవతారిక.— హనుమంతుఁడతని కార్యమును స్వయంప్రభకుఁ దెలుపుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) పిమ్మట, దృఢమైన మనసుగల ధర్మమును నాచరించుచుండు స్వయంప్రభ యనుతాపసి పరాక్రమశాలురగు వానరోత్తములను జూచి యిటు లనెను.

వానరా యది వః ఖేదః ప్రణష్టః ఫలభక్షణాత్।
యద్యైత న్మయా శ్రావ్యం శ్రోతు మిచ్ఛామి కథ్యతామ్॥ ౨
తస్యా స్తద్వచనం శ్రుత్వా హనుమా న్మారుతాత్మజః।
ఆర్జవేన యథా తత్త్వ మాఖ్యాతు ముపచక్రమే॥ ౩

రాజా సర్వస్యలోకస్య మహేంద్రవరుణోపమః।
రామో దాశరథి శ్శ్రీమా న్ప్రవిష్టో దండకావనమ్॥ ౪
లక్ష్మణేన సహభ్రాత్రా వైదేహ్యాచాపి భార్యయా।
తస్య భార్యా జనస్థానా ద్రావణేన హృతా బలాత్॥ ౫

వీర స్తస్య సఖా రాజ్ఞ స్సుగ్రీవో నామ వానరః।
రాజా వానరముఖ్యానాం యేన ప్రస్థాపితా వయమ్॥ ౬
అగస్త్య చరితా మాశాం దక్షిణాం యమరక్షితామ్॥ ౬½

సహైభి ర్వానరై ర్ఘోరై రంగద ప్రముఖై ర్వయమ్॥ ౭
రావణం సహితా స్సర్వే రాక్షసం కామరూపిణమ్॥
సీతయాసహ వైదేహ్యా మార్గధ్వ మితి చోదితాః। ౮

విచిత్యతు వయం సర్వే సమగ్రాం దక్షిణాందిశమ్।
బభుక్షితాః పరిశ్రాంతా వృక్షమూల ముపాశ్రితాః॥ ౯

(౨) వానరులారా! ఫలములు భుజించినందున మీకుమార్గాయాసము తీరి యుండినట్లైతే, నేను వినఁదగినదిగ నుండినను, మీకథను వినఁగోరుచున్నాను. చెప్పవలయును.

(౩) వాయుపుత్రుఁడగు హనుమంతుఁడు స్వయంప్రభ మాటలు విని ఋజుస్వభావము గలవాఁడై నిజమును జెప్పుట కుపక్రమించెను.

(౪,౫) సకలలోకములకు రాజును, ఇంద్రునితోను వరుణునితోను సమానముగ నుండువాఁడును దశరథుని కొడుకును శ్రీమంతుఁడును నగు శ్రీరాముఁడు తమ్ముఁడగు లక్ష్మణునితోడను, భార్యయగు సీతతోడను దండకావనములోఁ బ్రవేశించెను. రావణుఁడు బలాత్కారముచే అతని భార్యయగుసీతను జనస్థానమునుండి అపహరించుకొని పోయెను.

(౬,౭) వీరుఁడును వానరోత్తములకురాజును శ్రీరామునికి స్నేహితుఁడును నగు సుగ్రీవుఁడను వానరుఁడు గలఁడు. అతఁడు అగస్త్య మహర్షి వాసమునేయుచుండు యమునిచేఁ బరిపాలింపఁబడుచుండు దక్షిణదిక్కునకు మమ్ము బంపెను.

(౮,౯) భయంకరులుగనుండు అంగదుఁడు మొదలగు నీ వానరులతోడ మీరందరు గూడి కోరిన రూపము ధరించగల రాక్షసుఁడగు రావణుని జనక కూతురగు సీతాదేవిని వెతుకవలయునని సుగ్రీవుఁడు మాకాజ్ఞాపించెను.

(౧౦) మేమందరము దక్షిణదిక్కులో నన్ని ప్రదేశములను వెతకి ఆకలి గలవారమై మిగుల శ్రమపడి ఒకచెట్టుక్రిందఁ గూర్చుంటిమి.

వివర్ణవదనా స్సర్వే సర్వే ధ్యానపరాయణాః।
నాధిగచ్ఛామహే పారం మగ్నా శ్చింతా మహార్ణవే॥ ౧౦
చారయంత స్తత శ్చక్షు ర్దృష్టవంతో వయం బిలమ్।
లతాపాదపసంఛన్నం తిమిరేణ సమావృతమ్॥ ౧౧
అస్మా ద్ధంసా జలక్లిన్నాః పక్షై స్సలిలవిస్రవైః।
కురరా స్సారసా శ్చైవ నిష్పతంతి పతత్రిణః॥ ౧౨
సాధ్వత్ర ప్రవిశామేతి మయా తూక్తాః ప్లవంగమాః॥ ౧౨½

తేషా మపిహి సర్వేషా మనుమాన ముపాగితమ్।
గచ్ఛామ ప్రవిశామేతి భర్తృకార్య త్వరాన్వితాః॥ ౧౩½
తతో గాఢం నిపతితా గృహ్య హస్తౌ పరస్పరమ్।
ఇదం ప్రవిష్టా స్సహసా బిలం తిమిరసంవృతమ్॥ ౧౪½
ఏతన్నః కార్యమేతేన కృత్యేన వయ మాగతాః।
త్వాం చైవోపగతా స్సర్వే పరిద్యూనా బుభుక్షితాః॥ ౧౫½

ఆతిథ్యధర్మదత్తాని మూలానిచ ఫలానిచ।
అస్మాభి రుపభుక్తాని బుభుక్షాపరిపీడితైః॥ ౧౬½
యత్త్వయా రక్షితా స్సర్వే మ్రియమాణా బుభుక్షయా।
బ్రూహి ప్రత్యుపకారార్థం కింతే కుర్వంతు వానరాః॥ ౧౭½

(౧౦) మేమందఱు తేజోహీనులమై ఆలోచించుచు చింతయను గొప్పసముద్రములో మునిగినవారమై దానియొడ్డును జూడలేక ఉంటిమి.

(౧౧) మేము అచ్చటచట చూచుచు లతలతోను వృక్షములతోను గప్పఁబడి చీకటితో నిండియుండు యీబిలమును జూచితిమి.

(౧౨,౧౨½) ఈ బిలమునుండి జలములోఁ దడిసియుండు హంసలు కురరపక్షులు సారసపక్షులు మఱికొన్ని పక్షులు జలమును ఱెక్కలతో విదిలించుకొనుచు వెలుపలవచ్చినవి. అపుడు, నేను 'వానరులారా! యీబిలములోఁ బ్రవేశించుదము' అనిచెప్పితిని.

(౧౩½) జలచరములను జూచినందున యిచట జలముగలదని యీవానరులందరికి అనుమానము గలిగినది. యజమానుని పనిలో త్వరగల యీ వానరులు, 'పోవుదము బిలములోఁ బ్రవేశించుదము' అని తీర్మానించిరి.

(౧౪½) పిమ్మట, వానరులు ఒకరి చేతిని నింకొకరు పట్టుకొని గుంపుగపడి చీకటితో నిండియుండు యీగుహలో వేగముగఁ బ్రవేశించిరి..

(౧౫½) మా కార్యము యిదియేను. ఇందుకనియే మే మిచటికి వచ్చితిమి. మే మందరము ఆకలిగొని మిగులశ్రమపడి నీ సన్నిధానమునకు వచ్చితిమి

(౧౬½) ఆకలిచే మిగుల శ్రమపడియుండు మేము, అతిథ్యధర్మము ననుసరించి, నీ విచ్చిన కందమూలములను ఫలములను భక్షించితిమి.

(౧౭½) ఆకలిచే చచ్చుచుండు మమ్మందరిని రక్షించినందున వానరులు నీకు యెట్టి ప్రత్యుపకారము సేయవలయును, తెలుపుము.

ఏవ ముక్తాతు సర్వజ్ఞా వానరై స్తై స్స్వయంప్రభా।
ప్రత్యువాచ తత స్సర్వా నిదం వానరయూథపాన్॥ ౧౮

సర్వేషాం పరితుష్టాస్మి వానరాణాం తరస్వినామ్।
చరంత్యా మమ ధర్మేణ నకార్య మిహ కేనచిత్॥ ౧౯

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - ద్విపంచాశస్సర్గః.

---

## త్రిపంచాశస్సర్గః.

ఏవము క్త శ్శుభం వాక్యం తాపస్యా ధర్మసంహితమ్।
ఉవాచ హనుమా న్వాక్యం తా మనిందిత చేష్టితామ్॥ ౧

శరణం త్వాం ప్రపన్నాస్స్మ స్సర్వేవై ధర్మచారిణి।
యః కృత స్సమయో స్మాకం సుగ్రీవేణ మహాత్మనా॥ ౨

సచ కాలో హ్యతిక్రాంతో బిలేచ పరివర్తతామ్।
సా త్వ మస్మా ద్బిలాద్ఘోరా దుత్తారయితు మర్హసి॥ ౩

తస్మా త్సుగ్రీవవచనా దతిక్రాంతా న్గతాయుషః।
త్రాతు మర్హసి నస్సర్వా న్సుగ్రీవభయశంకితాన్॥ ౪

మహచ్చ కార్య మస్మాభిః కర్తవ్యం ధర్మచారిణి।
తచ్చాపి నకృతం కార్య మస్మాభి రిహ వాసిభిః॥ ౫

(౧౮-౪) ఈవిధముగ వానరులు చెప్పఁగా, సర్వజ్ఞురాలగు స్వయంప్రభ నగ సేనాపతులందరిని జూచి యిటు లనెను.

(౧౯-౪) బలవంతు లగువానరులు చెప్పినమాటకు సంతోషించితిని. ధర్మానుష్ఠానము సేయుచుండు నాకు వానరులచే కాగల యెట్టికార్యమును నిచ టలేదు.

ఇది యేబదిరెండవసర్గ.

---

౫౩ వ సర్గ.

(అవతారిక.— బిలమునుండి వెలుపల వచ్చి వానరులు సీత లభించనందున దుఃఖించుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) తాపసియగు స్వయంప్రభ ధర్మముతోఁ గూడి శుభముగ నీవిధముగఁ బలుకగా, హనుమంతుఁడు శుద్ధమైన చారిత్రముగల ఆమెతో నిటు లనెను.

(౨, ౩, ౪) ఓ ధర్మచారిణీ! మహాత్ముఁడగు సుగ్రీవుఁడు మాకు గడువు యేర్పరచెను. ఈ బిలములో మేము ఉండునపుడు ఆకాల మతిక్రమించినది. కనుక, భయంకరముగనుండు యీబిలమునుండి వెలుపల దాటించుటకు నీవు సహాయము సేయవలయును. సుగ్రీవుని మాటను నతిక్రమించి అల్పమైన ఆయుస్సుగలవారమై అతనికి భయపడి కృశించియుండు మమ్ము అందరిని గాపాడవలయును. నిన్ను మేము శరణాగతి సేసియున్నాము.

(౫) ఓ ధర్మచారిణీ! మేము గొప్పపని చేయవలసి యున్నది. ఈబిలములో తగులుకొనినందున అట్టికార్యము సేయలేక పోతిమి.

ఏవ ముక్తా హనుమతా తాపసీ వాక్య మబ్రవీత్।
జీవతా దుష్కరం మన్యే ప్రవిష్టేన నివర్తితుమ్॥ ౬
తపసస్తు ప్రభావేన నియమోపార్జితేనచ।
సర్వానేవ బిలా దస్మా దుద్ధరిష్యామి వానరాన్॥ ౭

నిమీలయత చక్షూంషి సర్వే వానరపుంగవాః।
నహి నిష్క్రమితుం శక్య మనిమీలిత లోచనైః॥ ౮
తత స్సంమీలితా స్సర్వే సుకుమారాంగుళైః కరైః।
సహసా పిదధు ర్దృష్టిం హృష్టా గమనకాంక్షయా॥ ౯

వానరాస్తు మహాత్మానో హస్తరుద్ధముఖా స్తదా।
నిమేషాంతరమాత్రేణ బిలా దుత్తారితా స్తయా॥ ౧౦
తత స్తా న్వానరాన్ సర్వాం స్తాపసీ ధర్మచారిణీ।
నిస్సృతా న్విషమా త్తస్మా త్సమాశ్వాస్యేద మబ్రవీత్॥

ఏష వింధ్యో గిరి శ్శ్రీమా న్నానాద్రుమలతాకులః
ఏష ప్రస్రవణ శ్శైల స్సాగరోయం మహోదధిః॥ ౧౨
స్వస్తి వోస్తు గమిష్యామి భవనం వానరర్షభాః।
ఇత్యుక్త్వా తద్బిలం శ్రీమత్ ప్రవివేశ స్వయంప్రభా॥ ౧౩

స్వయంప్రభ వానరులను బిలమువెలుపలికిఁ దెచ్చి విడిచిపెట్టుట. 

(౬) ఇట్లు హనుమంతుఁడు పలుకగా, యీబిలములోఁ బ్రవేశించిన వాఁడు ప్రాణముతో వెలుపలపోవుట కష్టమని తలంచెదను. అని స్వయంప్రభ యను తాపసి బదులుచెప్పెను.

(౭) వ్రతములు చేసి సంపాదించిన తపఃప్రభావముచే వానరుల నందఱిని యీబిలమునుండి వెలుపల విడిచిపెట్టెదను.

(౮) ఓ వానరశ్రేష్ఠులారా! మీరందరు కన్నులు మూసికొనవలయును. కన్నులు మూసికొనక యీబిలమునుండి వెలుపల పోవుట సాధ్యముకాదు.

(౯) పిమ్మట, వానరులందరు సుకుమారమైన వేళ్ళుగల చేతులతో, వెలుపల పోవుటకు కోరి సంతోషించి, వెంటనే కన్నులు మూసికొనిరి.

(౧౦) అపుడు చేతులతో ముఖములు మూసికొని యుండిన మహాత్ములగు వానరులను నిమిషములో, బిలమునుండి, స్వయంప్రభ వెలుపలికిఁ దెచ్చి విడిచిపెట్టెను.

(౧౧) ధర్మచారిణియగు ఆతాపసి, విషమముగనుండు ఆబిలమును దాటి వచ్చిన వానరులను జూచి వారిని సమాధానపరచి యిట్లు లనెను.

(౧౨) వానరులారా! నానావిధములగు వృక్షములతోను లతలతోను నిండి వెలుంగుచుండు నిది వింధ్యపర్వతము. ఇది ప్రస్రవణపర్వతము. ఇది సంగ్రామకోవిదుడగు వానరులారా నా [illegible] మహాసముద్రము.

(౧౩) వానరోత్తములారా! మీకు క్షేమముగలుగుగాక. నేను నాయింటికిఁబోయెదను. ఇట్లు స్వయంప్రభ చెప్పి, వెలుంగుచుండు ఆ ఋక్షబిలములోఁ బ్రవేశించెను.

తత స్తే దదృశు ర్ఘోరం సాగరం వరుణాలయమ్।
అపార మభిగర్జంతం ఘోరై రూర్మిభి రావృతమ్॥ ౧౪
మయస్య మాయా విహితం గిరిదుర్గం విచిన్వతామ్।
తేషాం మాసో వ్యతిక్రాంతో యో రాజ్ఞా సమయః కృతః॥ ౧౫

వింధ్యస్య తు గిరేః పాదే సంప్రపుష్పితపాదపే।
ఉపవిశ్య మహాత్మాన శ్చింతా మాపేదిరే తదా॥
తతః పుష్పాతిభారాగ్రాన్ లతాశతసమావృతాన్।
ద్రుమా న్వాసంతికా న్దృష్ట్వా బభూవు ర్భయశంకితాః॥ ౧౭

తే వసంత మనుప్రాప్తం ప్రతిబుద్ధ్వా పరస్పరమ్।
నష్టసందేశకాలార్థా నిపేతు ర్ధరణీతలే॥ ౧౮
తత స్తా న్కపివృద్ధాంస్తు శిష్టాంశ్చైవ వనౌకసః।
వాచా మధురయా భాష్య యథావ దనుమాన్య చ॥ ౧౯

స తు సింహవృషస్కంధః పీనాయతభుజః కపిః।
యువరాజో మహాప్రాజ్ఞ అంగదో వాక్య మబ్రవీత్॥ ౨౦
శాసనా త్కపిరాజస్య వయం సర్వే వినిస్సృతాః।
మాసః పూర్ణో బిలస్థానాం హరయః కిన్నబుధ్యతే॥ ౨౧

గడువుమీరినందుకు దుఃఖించినవానరులను అంగదుఁడు సమాధానపరచుట. ౫౬-౯

(౧౪) పిమ్మట, వరుణునికి వాసస్థానముగను, దరిలేనిదిగను, మిగుల గర్జించుచుండునదిగను, భయంకరమైన అలలతో నిండినదిగను, నుండుభయంకరమైన సముద్రమును వానరులు మాచిరి.

(౧౫) మయునియొక్క విచిత్రమైన మాయాశక్తిచేఁ జేయఁబడిన బిలములో వానరులు సీతాదేవిని వెతకుచుండగా సుగ్రీవుఁడు యేర్పరచిన ఒక నెల గడువు అతిక్రమించిపోయెను.

(౧౬) అపుడు మహాత్ములగు వానరులు, వింధ్యపర్వతముయొక్క శాఖగఁబూచియుండు వృక్షములుగల దక్షిణభాగములోఁగూర్చుండి ఆలోచించిరి.

(౧౭) పిమ్మట, పూలభారముగల కొనలుగలవిగను, అనేక లతలతోనిండియుండు వసంతఋతువులోగల వృక్షములను వానరులు జూచి సుగ్రీవునివల్ల ఆపదగలుగునని శంకించియుండిరి.

(౧౮) వానరులు వసంతఋతువు సమీపించివచ్చినదని ఒండొరులు తెలిసికొని సుగ్రీవుఁడు యేర్పరచిన గడువును నతిక్రమించినవారై అందరు భూమిమీఁదపడిరి.

(౧౯, ౨౦) పిమ్మట, సింహము వృషభమువంటి మెడగలవాఁడును, బలిసి పొడవుగనుండు భుజములుగలవాఁడును మిగుల ప్రాజ్ఞుఁడును యువరాజునగు అంగదుఁడు, వానరులలో వృద్ధులుగను యోగ్యులుగను నుండువానరులను జూచి మధురమగు మాటలచే వారిని సమాధానపరచి యిటులనెను.

(౨౧) కపిరాజగు సుగ్రీవుని నాజ్ఞచే మనమందరు సీతను వెతకుటకై ప్రయాణము చేసితిమి. వానరులారా! ఋక్షబిలములో మన ముండినపుడు సుగ్రీవుఁడేర్పరచిన ఒక నెల గడువు నిండినది. అది మీకు తెలియలేదు.

వయ మాశ్వయుజే మాసి కాలసంఖ్యా వ్యవస్థితాః।
ప్రస్థితా స్సోపి చాతీతః కిమతః కార్యముత్తరమ్॥ ౨౨

భవంతః ప్రత్యయం ప్రాప్తా నీతిమార్గ విశారదాః।
హితే ష్వభిరతా భర్తు ర్నిసృష్టా స్సర్వకర్మసు॥ ౨౩

కర్మ స్వ ప్రతిమా స్సర్వే దిక్షు విశ్రుత పౌరుషాః।
మాం పురస్కృత్య నిర్యాతాః పింగాక్ష ప్రతిచోదితాః॥ ౨౫

ఇదానీ మకృతార్థానాం మర్తవ్యం నాత్రసంశయః।
హరిరాజస్య సందేశ మకృత్వా కః సుఖీ భవేత్॥ ౨౬

తస్మి న్నతీతే కాలేతు సుగ్రీవేణ కృతే స్వయమ్।
ప్రాయోపవేశనం యుక్తం సర్వేషాంచ వనౌకసామ్॥ ౨౭

తీక్ష్ణః ప్రకృత్యా సుగ్రీవ స్స్వామిభావే వ్యవస్థితః।
నక్షమిష్యతి న స్సర్వా నపరాధకృతో గతాన్॥ ౨౮

అప్రవృత్తౌచ సీతాయాః పాపమేవ కరిష్యతి।
తస్మా త్క్షమ మిహాద్యైవ ప్రాయోపవిశనం హి నః॥ ౨౯

సీత లభించనందున ప్రాయోపవేశము సేయుటయే యుక్తమని అంగదుఁడనుట. ౫౭౧

(౨౨) మనము ఆశ్వయుజమాసము మొదలు సుగ్రీవుఁడేర్పరచిన గడువులోనుండి ప్రయాణము చేసితిమి. అట్టి గడువు అతిక్రమించినది. ఇపుడు మనము సేయఁదగినపని యేమి.

(౨౩) మీరు స్వామిభక్తిగలవారుగను, నీతిమార్గమును నెఱింగినవారుగను, యజమానునికి హితము సేయుటలో నాసక్తిగలవారుగను, సకలకార్యములలోను సమర్థులుగను నున్నారు.

(౨౪) మీరందరు కార్యములు సాధించుటలో అసదృశులుగనున్నారు. సకలదిక్కులలోను ప్రసిద్ధమైన పరాక్రమముగలవారుగను నున్నారు. సుగ్రీవుని చే నాజ్ఞాపింపఁబడి నన్ను ముందుంచుకొని సీతను వెతకుటకె ప్రయాణమై వచ్చితిరి.

(౨౫) ఇపుడు, సీతను వెతకి కనిపెట్టనందున మన మందరము చావవలసినదేను. ఇందుకు సందేహములేదు. వానరరాజగు సుగ్రీవుని ఆజ్ఞను జెల్లించకపోయినచో యెవఁడు సుఖపడును.

(౨౬) సుగ్రీవుఁడు యేర్పరచిన గడువు అతిక్రమించిపోయినది. వానరులందరికి ప్రాణములు విడుచుటకు ప్రాయోపవేశము సేయుటె యుక్తము. (ప్రాయోపవేశమనగా, ఆహారాదులు వర్జించి నోరుమూసికొని పండుకొనియుండి ప్రాణములు విడుచుట.)

(౨౭) సుగ్రీవుఁడు పుట్టుకచేతనే క్రూరుఁడు. ఇపుడు రాజుగనున్నాడు. అపరాధము చేసిపోయినటులైతే మనలను క్షమించఁడు.

(౨౮) సీత సమాచారమును తెలిసికొనకపోయినటులైతే మనలను వధించును. కనుక, యిచటనే యిపుడు మనమందరము ప్రాయోపవేశము సేయుటే యుక్తము.

త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ ధనానిచ గృహాణిచ।
ధ్రువం నో హింసితా రాజా సర్వా న్ప్రతిగతానితః॥ ౨౯
వధేనాప్రతిరూపేణ శ్రేయా న్మృత్యు రిహైవ నః॥ ౨౯½

నచాహం యౌవరాజ్యేన సుగ్రీవేణాభిషేచితః।
నరేంద్రేణాభిషిక్తోస్మి రామేణాక్లిష్టకర్మణా॥ ౩౦½

స పూర్వం బద్ధవైరో మాం రాజా దృష్ట్వా వ్యతిక్రమన్।
ఘాత ఇష్యతి దండేన తీక్ష్ణేన కృతనిశ్చయః॥ ౩౧½

కిం మే సుహృద్భి ర్వ్యసనం పశ్య ద్భి ర్జీవితాంతరే।
ఇహైవ ప్రాయ మాసిష్యే పుణ్యే సాగరరోధసి॥ ౩౨½

ఏత చ్ఛ్రుత్వా కుమారేణ యువరాజేన భాషితమ్।
సర్వే తే వానరశ్రేష్ఠాః కరుణం వాక్య మబ్రువన్॥ ౩౩½

తీక్ష్ణః ప్రకృత్యా సుగ్రీవః ప్రియాసక్తశ్చ రాఘవః।
అదృష్టాయాంతు వైదేహ్యాం దృష్ట్వాస్మాన్ సమాగతాన్॥ ౩౪½
రాఘవప్రియకామార్థం ఘాతయిష్య త్యసంశయః।
నక్షమం చాపరాద్ధానాం గమనం స్వామిపార్శ్వతః॥ ౩౫½

సీత చిక్కకుండుటచే సుగ్రీవునివద్దకుఁ బోరాదని వానరు లనుట. ౫౭౩

(౨౯) భార్యాబిడ్డలను ధనమును గృహములను విడిచి మనమందరము యిచటనుండి పోయినట్లైతే రాజు మనలను దండించును, నిజము.

(౨౯౪) అతనిచేతిలోఁజిక్కి చిత్రవధ బడయుటకంటె యిచటనే ప్రాణము విడుచుట మనకు శ్రేయము.

(౩౦౪) సుగ్రీవుఁడు నాకు యువరాజ్య పట్టాభిషేకము సేయలేదు. శుద్ధమైన ప్రవర్తనగల నరోత్తముఁడగు శ్రీరాముఁడు నాకు యీ పట్టా[illegible]ము చేసెను.

(౩౧౪) పూర్వము నాయెడల బద్ధద్వేషముగలవాఁడును నన్ను దండించవలయునని కోరియుండినవాఁడును, నగుకపిరాజును నగుసుగ్రీవుఁడు నాయపరాధమును దెలిసికొని కఠినమైన శిక్షనువిధించును.

(౩౨౪) నాప్రాణముండునంతవరకు నేను అనుభవించు దుఃఖమును నాస్నేహితులెందుకు చూడవలయును. (అనఁగా, నాస్నేహితులకు నాకష్టమును దెలిపి వారిని దుఃఖపెట్టుటచే నాకేమి లాభమని భావము). పరిశుద్ధమైన యీ సముద్రతీరములో నిచటనే ప్రాయోపవేశము సేసెదను.

(౩౩౪) యువరాజగు అంగదుఁడు చెప్పిన యీమాటలు విని వానరోత్తములంపటు కరుణగలవారై యిట్లు లనిరి.

(౩౪౪, ౩౫౪) సుగ్రీవుఁడు పుట్టుకతోనే కఠినచిత్తుఁడు. శ్రీరాముఁడు ప్రియురాలిమీద ఆశగలవాఁడై యున్నాఁడు. జనకుని కూతురగు సీతను జూడక వచ్చినమనలను జూచి రామునికిఁ బ్రియముసేయుటకై సుగ్రీవుఁడు మనలనుజంపును. సందేహములేదు. మనము అపరాధముచేసి రాజువద్దకుఁ బోవుట యుక్తము కాదు.

ఇహైవ సీతా మన్విష్య ప్రవృత్తి ముపలభ్యవా।
నోచే ద్గచ్ఛామ తం వీరం గమిష్యామో యమక్షయమ్॥ ౩౬

ప్లవంగమానాంతు భయార్దితానాం శ్రుత్వా వచ స్తార ఇదం
బభాషే। అలం విషాదేన బిలం ప్రవిశ్య వసామ సర్వే యది
రోచతే వః॥ ౩౭

ఇదంహి మాయా విహితం సుదుర్గమం ప్రభూతవృక్షోదకభో
జ్యపేయకం। ఇహాస్తి నో నైవ భయం పురందరా న్నరాఘు
వా ద్వానరరాజతోపివా॥ ౩౮

శ్రుత్వాంగదస్యాపి వచోనుకూల మూచుశ్చ సర్వే హరయః
ప్రతీతాః। యథా నహింస్యేమ తథా విధాన మసక్త మ
ద్యైవ విధీయతాం నః॥ ౩౯

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - త్రిపంచాశస్సర్గః.



## చతుః పంచాశస్సర్గః.

తథా బ్రువతి తారేతు తారాధిపతివర్చసి।
అథ మేనే హృతం రాజ్యం హనుమా నంగదేన తత్॥ ౧

ఈ ఋక్షబిలములోనే యుండవచ్చునని తారుఁడనుట. ౫౭౫

(౩౬) సీతాదేవిని వెతకి ఆమె వృత్తాంతమును దెలిసికొని వీరుఁడగు సుగ్రీవుని సన్నిధికిఁ బోవలయును. లేనినాడు, యిచటనే ప్రాణములు విడిచి యముని నింటికిఁ బోవుదము. అని వానరులు చెప్పిరి.

(౩౭) భయపీడితులుగ నుండు వానరులమాటలు విని తారుఁ డను వానరుఁడు యిటులనెను. 'దుఃఖించి చాలును, మీకు యిష్టముగనుండిన యీఋక్షబిలములోనేఁ బ్రవేశించి అందరము వసించవచ్చును.'

(౩౮) ఈ ఋక్షబిలము మయునిమాయచే నిర్మింపఁబడినది. ఇతరులు దీనిలోఁ బ్రవేశించుటకు సాధ్యముకాదు. మిగుల సమృద్ధిగనుండు ఫలవృక్షములు జలము భోజనపదార్థములు పానముసేయుటకుఁ దగిన పదార్థములు అచటగలవు. ఈ బిలములో మనకు ఇంద్రునివల్లను రామునివల్లను సుగ్రీవునివల్లను భయములేదు.

(౩౯) వానరులందరు అంగదునికి సమ్మతముగనుండు తారుఁడు చెప్పిన మాటవిని సంతోషించి సుగ్రీవుని వల్ల హింస గలుగక ఉండునటుల కార్యమును శీఘ్రముగ యిపుడే చేయవలయును అనిరి.

ఇది యేఁబదిమూఁడవ సర్గ.

౫౪ వ సర్గ.

(అవతారిక.— అంగదుని అభిప్రాయమును ఖండించి సుగ్రీవుని సమీపమునకుఁ బోవుటను హనుమంతుఁడు స్థిరపరచుచున్నాఁడు.)

(౧) చంద్రునివంటికాంతి గలతారుఁడు యీవిధముగఁ జెప్పుచుండఁగా, హనుమంతుఁడు, అంగదునికి రాజ్యమును పరిపాలించు సామర్థ్యము గలదని తెలిసికొనెను,

బుద్ధ్యా హ్యష్టాంగయా యుక్తం చతుర్బలసమన్వితమ్।
చతుర్దశగుణం మేనే హనుమాన్వాలినస్సుతమ్॥ ౨

ఆపూర్యమాణం శశ్వచ్చ తేజోబలపరాక్రమైః।
శశినం శుక్లపక్షాదౌ వర్ధమానమివ శ్రియా॥

బృహస్పతిసమం బుద్ధ్యా విక్రమే సదృశం పితుః।
శుశ్రూషమాణం తారస్య శుక్రేణేవ పురందరమ్ ౪

భర్తురర్థే పరిశ్రాంతం సర్వశాస్త్రవిదాం వరః।
అభిసంధాతుమారేభే హనుమానంగదం తతః॥ ౫

(౨) గ్రహణము ధారణము స్మరణము ప్రతిపాదనము ఊహ ఉపోహ అర్థవిజ్ఞానమును తత్త్వజ్ఞానము అను ౮ అంగములతోఁ గూడిన బుద్ధిగలవాఁడును, బాహుబలము మనోబలము ఉపాయబలము బంధుబలముతోఁ గూడినవాఁడును, దేశ కాలములను నెఱుంగుట, చిత్తస్థైర్యము గలిగియుండుట, సర్వదుఃఖములను సైచియుండుట, సకలవిషయములను దెలిసికొనియుండుట, సామర్థ్యము బలము గలిగియుండుట, ఆలోచనను రహస్యముగ నుంచుకొనుట, ఆలోచన చేయుటలో నైకమత్యము శౌర్యము గలిగియుండుట, తనబలమును ఇతరులబలమును దెలిసికొనుట, ఉపకారమును స్మరించుట, శరణాగతి చేసినవారిపట్ల వాత్సల్యము గలిగియుండుట, కోపము చపలత లేకుండుట, ఇట్టి ౧౪ గుణములు గలవాఁడుగను వాలిపుత్రుఁడగు అంగదుని హనుమంతుఁడు తెలిసికొనెను.

(౩) పిమ్మట, శుక్లపక్షము మొదలు కాంతిచే వృద్ధిపొందుచుండు చంద్రునివలె తేజస్సు బలము పరాక్రమములచే అప్పుడప్పుడు వృద్ధిపొందుచుండువాఁడును.

(౪) బుద్ధిలో బృహస్పతితోను, పరాక్రమములో తండ్రియగు వాలితోనుసమానుఁడుగ నుండువాఁడును, బృహస్పతి యోచనను ఇంద్రుఁడు ఆదరించునట్టుల తారుఁడను వానరునిమాటను అంగీకరించుచుండువాఁడును,(ఇచట, పురందర శబ్దముతో శుక్రశబ్దము చేరియుండుటచే నీ ప్రకరణములో శుక్రశబ్దమునకు బృహస్పతియని అర్థము.)

(౫) యజమానుని కార్యము విషయములో మిగులశ్రమపడి యుండువాఁడును, సకల శాస్త్రములలోను పండితుఁడుగ నుండువాఁడును, నగు అంగదుని హనుమంతుఁడు సమాధాన పరచుటకు ఉపక్రమించెను.

స చతుర్ణా ముపాయానాం తృతీయ ముపవర్ణయన్।
భేదయామాస తాన్ సర్వా న్వానరా న్వాక్యసంపదా॥ ౭

తేషు సర్వేషు భిన్నేషు తతో భీషయదంగదమ్।
భీషణై ర్బహుభి ర్వాక్యైః కోపోపాయ సమన్వితైః॥ ౮

త్వం సమర్థతరః పితా్రి యుద్ధే తారే యవై ధురమ్।
దృఢం ధారయితుం శక్తః కపిరాజ్యం యథా పితా॥ ౯

నిత్య మస్థిరచిత్తాహి కపయో హరిపుంగవ।
నాజ్ఞాప్యం విషహిష్యంతి పుత్రదారాన్ వినా త్వయా॥ ౧౦

త్వాం నైతే హ్యనుయుంజేయుః ప్రత్యక్షం ప్రవదామి తే।
యథా యం జాంబవా న్నీల సుహోత్రశ్చ మహాకపిః॥ ౧౧

నహ్యహంత ఇమే సర్వే సామదానాదిభిర్గుణైః।
దండేనవా త్వయా శక్యా స్సుగ్రీవా దపకర్షితుమ్॥ ౧౨

విగృహ్య స నమస్యాహు ర్దుర్బలేన బలీయసః।
ఆత్మరక్షాకర స్తస్మా న్నవిగృహ్ణీత దుర్బలః॥ ౧౩

(౬) హనుమంతుఁడు సామ దాన భేద దండరూపములగునుండు నాలుగు ఉపాయములలో భేదోపాయమును జెప్పుచు, అతనిమాటల చాతుర్యముచే వానరుల కందరికిని భేదము గల్పించెను.

(౭) వానరులందరు పరస్పరము భేదించి యుండగా, దండోపాయముతోఁగూడి భయంకరమగు అనేకమాటలచే అంగదునికి హనుమంతుఁడు భయముగలిగించెను.

(౮) అంగదుఁడా! యుద్ధము సేయుటలో నీతండ్రికంటె నీవు మిగులసమర్థుఁడవు. నీతండ్రివలె భారమైన కపిరాజ్యమును బాగుగఁ బరిపాలించుటకు శక్తిగలవాఁడవు.

(౯) వానరోత్తముఁడా! చపలచిత్తులగు వానరులు భార్యాబిడ్డలను విడిచి సదా నీయాజ్ఞకు లోఁబడి ఉండరు.

(౧౦,౧౧) ఈ జాంబవంతుఁడు నీలుఁడు మహాకపియగు సుహోత్రుఁడు యెటుల నిన్ను అనుసరించి యుండరో అటులనే నేను నిన్ను అనుసరించియుండను. ఈ వానరులందరిని సామదాన భేద దండోపాయములచే సుగ్రీవుని విడిపించి, నీస్వాధీనములో నుంచుకొనుటకు సాధ్యపడదు.

(౧౨) (సుగ్రీవునితో విరోధము గల్పించుకొని నేనొకఁడనే ప్రత్యేకముగ నుండెదను అనుటకు సమాధానము)— దుర్బలునితో విరోధము సేసికొని బలవంతుఁడు మనగలఁడు. దుర్బలుఁడు బలవంతునితో విరోధము గల్పించుకొని మనలేఁడు. కనుక, ఆత్మసంరక్షణనుగోరు దుర్బలుఁడు బలవంతునితో విరోధము గల్పించుకొనరాదు.

యాంచే మాం మన్యసే ధాత్రీ మేత ద్బిల మితిశ్రుతమ్।
ఏత ల్లక్ష్మణ బాణానా మీషత్కార్యం విదారణే॥ ౧౩
స్వల్పంహి కృత మింద్రేణ క్షిపతా హ్యశనిం పురా।
లక్ష్మణో నిశితై ర్బాణై ర్భింద్యా త్పత్రపుటం యథా॥ ౧౪

లక్ష్మణస్యతు నారాచా బహవస్సంతి తద్విధాః।
వజ్రాశనిసమస్పర్శా గిరీణామపి దారణాః॥ ౧౫
అవస్థానేయ దైవత్వ మాసిష్యపి పరంతప।
తదైవ హరయ స్సర్వే త్యక్ష్యంతి కృతనిశ్చయాః॥ ౧౬

స్మరంతః పుత్ర దారాణాం నిత్యోద్విగ్నా బుభుక్షితాః
ఖేదితా దుఃఖశయ్యాభి స్త్వాం కరిష్యంతి పృష్ఠతః॥ ౧౭
స త్వం హీనస్సుహృద్భిశ్చ హితకామైశ్చ బంధుభిః।
తృణాదపి భృశోద్విగ్నస్స్పందమానా ద్భవిష్యసి॥ ౧౮

నచజాతు నహింస్యుస్త్వాం ఘోరా లక్ష్మణసాయకాః।
అపవృత్తం జిఘాంసంతో మహావేగా దురాసదాః॥ ౧౯
అస్మాభిస్తు గతం సార్థం వినీతవ దుపస్థితమ్।
ఆనుపూర్వ్యాత్తు సుగ్రీవో రాజ్యే త్వాం స్థాపయిష్యతి॥ ౨౦

(౧౩) (దేహబలము లేకపోయినను దుర్గబలము గలదనుటకు సమాధానము) స్వయంప్రభ గుహ నిన్ను రక్షించునని తలంచితివి. ఇది బలమని తారుఁడు చెప్పెను. లక్ష్మణుని బాణములకు యీ బిలమును భేదించుట మిగుల అల్పమైన పనిగనుండును.

(౧౪) పూర్వము, బిలములో వసించుచుండిన మయునిమీద వజ్రాయుధమును బ్రయోగించిన ఇంద్రుఁడు చిన్నద్వారమును గల్పించెను. లక్ష్మణుఁడు కరకుగల బాణములతో, దొప్పనువలె, దీని భేదించును.

(౧౫) వజ్రాయుధము పిడుగువలె పోయి పడునదిగను, కొండలను బద్దలు సేయునదిగను నుండు వజ్రాయుధమువంటి అనేక బాణములు లక్ష్మణుని వద్దనే ఉన్నవి.

(౧౬) బిలములో నుండినను, సుగ్రీవునితో విరోధము గల్పించుకొని నీవు ఉండినను, శత్రుసంహారకుఁడా! అపుడే వానరులందరు, ఒకే యభిప్రాయము గలవారై, నిన్ను విడిచిపెట్టి పోదురు.

(౧౭) వానరులు సదా భయపడి ఆకలిచేఁ బీడింపఁబడి భార్యాబిడ్డలను స్మరించి దుఃఖించుచు పండుకొని నిన్ను ఉపేక్షించి పోదురు.

(౧౮) స్నేహితులు హితముకోరు బంధువులు లేనివాఁడవై, గాలికి చలించుచుండు తృణమునకంటె, మిగుల భయము గలవాఁడ వగుదువు.

(౧౯) భయంకరములుగను గొప్ప వేగము గలవిగను సైచుటకు సాధ్యపడనవిగను ప్రాణములను హరించగలవిగను నుండు లక్ష్మణుని బాణములు, స్వామికార్యము సేయక ఉండవు, నిన్ను చంపక విడువవు.

(౨౦) మాతోఁగూడి వినయముతో కిష్కింధలోఁ బ్రవేశించినచో నిన్ను సుగ్రీవుఁడు క్రమముగ రాజ్యములో స్థాపించును.

ధర్మకామః పితృవ్యస్తే ప్రీతికామో దృఢవ్రతః।
శుచి స్సత్యప్రతిజ్ఞశ్చ నత్వాంజాతు జిఘాంసతి॥ ౨౧

ప్రియకామశ్చ తే మాతు స్తదర్థం చాస్యజీవితమ్।
తస్యా పత్యం చ నా_స్త్యన్య_త్తస్మా దంగద గమ్యతామ్॥ ౨౨

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే- చతుఃపంచాశస్సర్గః.

---

## పంచపంచాశస్సర్గః.

శ్రుత్వా హనుమతో వాక్యం ప్రశ్రితం ధర్మసంహితమ్।
స్వామిసత్కారసంయుక్త మంగదో వాక్య మబ్రవీత్ ౧

స్థైర్య మాత్మమనశ్శౌచ మానృశంస్య మథార్జవమ్।
విక్రమశ్చైవ ధైర్యంచ సుగ్రీవే నోపపద్యతే॥ ౨

భ్రాతు ర్జ్యేష్ఠస్య యోభార్యాం జీవతో మహిషీం ప్రియామ్।
ధర్మేణ మాతరం యస్తు స్వీకరోతి జుగుప్సితః॥ 3

(౨౧) ధర్మములోను నీకుఁ బ్రీతిసేయుటలోను నపేక్ష గలవాఁడును, స్థిరమైన వ్రతముగలవాఁడును, శుద్ధుఁడును, సత్యమైన ప్రతిజ్ఞగలవాఁడును నగు నీ పినతండ్రి యెప్పటికిని నిన్ను చంపఁడు.

(౨౨) నీ తల్లికి ప్రియమునే సుగ్రీవుఁడు గోరుచున్నాఁడు. ఆమెకుగానే అతఁడు జీవించియున్నాఁడు. సుగ్రీవునికి బిడ్డలేదు. కనుక, అంగదుఁడా కిష్కింధకుఁ బోవుదము.

ఇది యేబదినాలుగవ సర్గ.

## ౫౫ వ సర్గ.

(అవతారిక.— వానరులు సీతాదేవి చిక్కనందున ప్రాయోపవేశము సేయుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.)

(౧) మిగుల వినయముతోను ధర్మముతోను గూడినదియు, యజమానుని గౌరవమును దెలుపునదియు, నగు హనుమంతునిమాట విని అంగదుఁడు యిటు లనెను.

(౨) స్థిరమైనబుద్ధి ఆత్మశుద్ధి అంతఃకరణశుద్ధి దయగలిగియుండుట ఋజుస్వభావము పరాక్రమము, గాంభీర్యము సుగ్రీవునియెడల లేవు.

(౩) జ్యేష్ఠుఁడును జీవించియుండువాఁడును నగు అన్నయొక్క పట్టపు హిషిగను ప్రియురాలుగను తల్లితో సమానురాలుగను నుండు భార్యను ధర్మమని స్వీకరించువాఁడు లోకనిందితుఁడు. (సుగ్రీవునికి అంతఃకరణ శుద్ధిలేదని యీ శ్లోకములోఁ జెప్పఁబడినది.)

కథం సధర్మం జానీతే యేన భ్రాత్రా మహాత్మనా।
యుద్ధాయాభినియుక్తేన బిలస్యాపి హితం ముఖమ్॥ ౪

సత్యాత్పాణిగృహీతశ్చ కృతకర్మా మహాయశాః।
విస్మృతో రాఘవో యేన సకస్యతు కృతం స్మరేత్॥ ౫

లక్ష్మణస్య భయాద్యేన నాధర్మభయభీరుణా।
ఆదిష్టా మార్గితుం సీతాం ధర్మమస్మిన్కథం భవేత్ ౬

తస్మిన్పాపే కృతఘ్నేతు స్మృతిహీనే చలాత్మని।
ఆర్యః కో విశ్వసే జ్జాతు తత్కులీనో జిజీవిషుః॥ ౭

రాజ్యే పుత్రః ప్రతిష్ఠాప్య సగుణో నిర్గుణోపివా।
కథం శత్రుకులీనం మాం సుగ్రీవో జీవయిష్యతి॥ ౮

భిన్నమంత్రోఽపరార్థశ్చ హీనశక్తిః కథం హ్యహమ్।
కిష్కింధాం ప్రాప్య జీవేయ మనాథఇవ దుర్బలః॥ ౯

(౪) వెలుపలవచ్చిన రాక్షసునితో యుద్ధముసేయుటకై మహాత్ముఁడగు అన్నచే ఆజ్ఞాపింపఁబడి వాలి గుహలోఁ బ్రవేశించియుండగా బిలముద్వారమును పెద్దరాతితో మూసెను. అట్టివానికి ధర్మస్వరూప మెటుల తెలియును. (సుగ్రీవుఁడు దయలేనివాఁడని యీశ్లోకము దెలుపుచున్నది.)

(౫) గొప్ప యశస్సుగల శ్రీరాముఁడు ఉపకారముచేసి అగ్నిసాక్షిగ స్నేహముచేసికొని సుగ్రీవుని చేయిపట్టుకొనెను. అట్టిరాముని సుగ్రీవుఁడు మరచిపోయెను. ఇట్లుండగా, ఇంకొకని ఉపకారమును సుగ్రీవుఁడు తలంచునా. (సుగ్రీవునికి కృతజ్ఞతలేదని చెప్పఁబడినది.)

(౬) రామునికి ఉపకారముసేయకపోయిన పాపము సంభవించునను భీతిచే వానరులను బంపలేదు. లక్ష్మణుని బాణములకు భయపడియే సీతను వెతకుటకై వానరులను సుగ్రీవుఁడు పంపెను. కనుక, ఇతనికి ధర్మస్వరూపముగలదని యెటుల చెప్పఁదగును.

(౭) కృతఘ్నుఁడుగను బుద్ధిహీనుఁడుగను చపలచిత్తుఁడుగను పాపిగను నుండు సుగ్రీవునివద్ద వానరకులములోఁ బుట్టిన సాధువుగనుండు వాఁడెవఁడు జీవించుటకు కోరి యితని యెపుడును నమ్మును.

(౮) ఔరస పుత్త్రుఁడుగనుండువాఁడు గుణవంతుఁడైనను గుణహీనుఁడైనను నతని రాజ్యములో స్థాపింపవలసినదేను. శత్రువగు వాలికి జన్మించిన నన్ను సుగ్రీవుఁడు ప్రాణముతో నుంచునా.

(౯) ద్వేషము గలిగియుండు విషయమును ప్రకాశముచేసిన వాఁడుగను అపరాధిగను శక్తిహీనుఁడుగను అనాథవలె బలహీనుఁడుగను నుండు నేను కిష్కింధచేరి యెటుల జీవించగలను.

ఉపాంశు దండేన హి మాం బంధనే నోపపాదయేత్।
శఠః క్రూరో నృశంసశ్చ సుగ్రీవో రాజ్యకారణాత్॥ ౧౦
బంధనా ద్వావసాదాన్మే శ్రేయః ప్రాయోపవేశనమ్।
అనుజానీత మాం సర్వే గృహం గచ్ఛంతు వానరాః॥ ౧౧
అహం వః ప్రతిజానామి నాగమిష్యా మ్యహం పురీమ్।
ఇహైవ ప్రాయమాసిష్యే శ్రేయో మరణ మేవ మే॥ ౧౨

అభివాదనపూర్వంతు రాఘవౌ బలశాలినౌ।
అభివాదనపూర్వంతు రాజా కుశలమేవచ॥ ౧౩
వాచ్యస్తాతో యవీయాన్మే సుగ్రీవో వానరేశ్వరః॥ ౧౩½
ఆరోగ్యపూర్వం కుశలం వాచ్యా మాతా రుమాచ మే।
మాతరంచైవ మే తారా మాశ్వాసయితు మర్హథ॥ ౧౪½

ప్రకృత్యా ప్రియపుత్రా సా సానుక్రోశా తపస్వినీ।
వినష్ట మిహ మాం శ్రుత్వా వ్యక్తం హాస్యతి జీవితమ్॥ ౧౫½
ఏతావ దుక్త్వా వచనం వృద్ధాం స్తా నభివాద్య చ।
వివేశ చాంగదో భూమౌ రుద న్దర్భేషు దుర్మనాః॥ ౧౬½
తస్య సంవిశత స్తత్ర రుదంతో వానరర్షభాః।
నయనేభ్యః ప్రముముచు రుష్ణం వై వారి దుఃఖితాః॥ ౧౭½

(౧౦) లోలోపల అప్రియము సేయువాఁడును కఠినచిత్తుఁడును నీచుఁడును నగు సుగ్రీవుఁడు రాజ్యముమీద ఆశగలవాఁడై రహస్యముగ నన్ను దండించి బంధించును.

(౧౧) బంధనరూపమైన హింసకంటె ప్రాయోపవేశమే నాకు శ్రేయము. అందరు నాకు ఉత్తరవు యీయవలయును. వానరులందరు వారివారి యిండ్లకుఁ బోవచ్చును.

(౧౨) మీరందరు పోవచ్చును. ఇందుకు నేను ఉత్తరవు యిచ్చుచున్నాను. నేనుమాత్రము కిష్కింధకు రాను. ఇచటనే ప్రాయోపవేశము చేసి మృతి పొందుట నాకు శ్రేయము.

(౧౩,౧౩౪) బలశాలురగు రామలక్ష్మణులకును, నాకు పినతండ్రియు రాజును నగు సుగ్రీవునికిని నేను నమస్కార పూర్వముగ అడిగితి నని చెప్పవలయును.

(౧౪) నాతల్లిగనుండు రుమాదేవిని ఆరోగ్య పూర్వకముగ క్షేమమును నేను విచారించితినటుల అడుగవలయును. నాతల్లియగు తారాదేవిని మీరు సమాధాన పరచవలయును.

(౧౫) స్వభావముచేతనే కొడుకుమీద మిగుల ప్రేమ దయగలదియు భర్తను బోగొట్టుకొని దుఃఖించుచుండు నదియు, నగు తార, యిచట నేను మృతిపొందినది విని ప్రాణము విడుచును. నిజము.

(౧౬) ఇంతమాత్రము చెప్పి, వృద్ధులగు ఆవానరులకు నమస్కారము చేసి, అంగదుఁడు మిగులదుఃఖించి యేడ్చుచు భూమిమీద పరచియుండు దర్భల మీఁదఁ గూర్చుండెను.

(౧౭) దర్భలమీద గూర్చుండిన అంగదుని జూచి వానరోత్తములు యేడ్చుచు దుఃఖించి నేత్రములనుండి వేడికన్నీటిని విడిచిరి.

సుగ్రీవం చైవ నిందంతః ప్రశంసంతశ్చ వాలినమ్।
పరివార్యాంగదం సర్వే వ్యవసన్ ప్రాయమాసితుమ్॥ ౧౮
మతం తద్వాలిపుత్రస్య విజ్ఞాయ ప్లవగర్షభాః।
ఉపస్పృశ్యోదకం తత్ర ప్రాఙ్ముఖాః సముపావిశన్। ౧౯
దక్షిణాగ్రేషు దర్భేషు ఉదక్తీరం సమాశ్రితాః।
ముమూర్షవో హరిశ్రేష్ఠా ఏతత్ క్షమమితి స్మ హ॥ ౨౦
రామస్య వనవాసం చ క్షయం దశరథస్య చ।
జనస్థానవధం చైవ వధం చైవ జటాయుషః॥ ౨౧
హరణం చైవ వైదేహ్యా వాలినశ్చ వధం రణే॥
రామకోపం చ వదతాం హరీణాం భయమాగతమ్॥ ౨౨
స సంనివిశద్భి ర్బహుభి ర్మహీధరో మహాద్రికూట ప్రతిమైః ప్లవంగమైః। బభూవ సన్నాదిత నిర్దరాంతరో భృశం నదద్భి ర్జలదైరివోల్బణైః॥ ౨౩

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే పంచపంచాశస్సర్గః.

---

## షట్పంచాశస్సర్గః.

ఉపవిష్టాస్తు తే సర్వే యస్మిన్ ప్రాయం గిరిస్థలే।
హరయో గృధ్రరాజశ్చ తం దేశముపచక్రమే॥ ౧

(౧౭-౪) సుగ్రీవుని నిందించి వాలిని శ్లాఘించుచు వానరులందరు అంగదుని జుట్టుకొని ప్రాయోపవేశము సేయుటకు సిద్ధముగనుండిరి.

(౧౮-౪) వానరోత్తములు వాలి పుత్త్రుఁడగు అంగదునియొక్క నిశ్చయమును నెఱింగి అచట ఉదకమును స్పృశించి తూర్పుదిక్కునకు అభిముఖముగ గూర్చుండిరి.

(౨౦౪) దక్షిణదిక్కుగ నుంచబడిన దర్భలమీద సముద్రము ఉత్తరదిక్కులోనుండు వానరోత్తములు ప్రాయోపవేశము సేయుటే యుక్తమని తలంచి ప్రాణము విడుచుటకు సిద్ధులుగ నుండిరి.

(౨౧-౪, ౨౨౪) శ్రీరాముని వనవాసమును, దశరథుని మరణమును జనస్థానములో ఖరాదుల వధను జటాయుమరణమును సీతాపహరణమును యుద్ధములో వాలి వధను శ్రీరాముని కోపమును ప్రాయోపవేశము సేయవలయునే యను భయమును వానరులు చెప్పుచుండగా,

(౨౩౪) గొప్పపర్వతముతో సములుగనుండు వారును, మిగులరోదనము సేయుచుండువారును వృద్ధిపొందిన మేఘములవలె నుండువారును, తన సమీపములోఁ బ్రవేశించిన వానరుల ధ్వనిచే ఆవింధ్యపర్వతము ప్రతిధ్వనితోఁ గూడిన గుహల మధ్య ప్రదేశములు గలదిగ ఆయెను.

ఇది యేబది అయిదవ సర్గ.

౫౬వ సర్గ.

(అవతారిక.— ప్రాయోపవేశము సేయుచుండు వానరులవద్దకు సంపాతి వచ్చుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.

(౧) వానరులందరు వింధ్యపర్వతమునకు సమీపములోఁ బ్రాయోపవేశము చేసి గూర్చుండిరి. అంతటికి గృధ్రరాజగు సంపాతి వచ్చుటను ఉపక్రమించెను.

సంపాతిర్నామ నామ్నాతు చిరంజీవీ విహంగమః।
భ్రాతా జటాయుష శ్శ్రీమాన్ ప్రఖ్యాతబలపౌరుషః॥ ౨
కందరాదభినిష్క్రమ్య సవింధ్యస్య మహాగిరేః।
ఉపవిష్టాన్ హరీ న్దృష్ట్వా హృష్టాత్మా గిర మబ్రవీత్॥ ౩
విధిః కిల నరం లోకే విధానే నానువర్తతే।
తథా యం విహితో భక్ష్య శ్చిరా న్మహ్య ముపాగతః॥ ౪
పరంపరాణాం భక్షిష్యే వానరాణాం మృతంమృతమ్।
ఉవా చేవం వచః పక్షీ తాన్నిరీక్ష్య ప్లవంగమాన్॥ ౫
తస్య తద్వచనం శ్రుత్వా భక్ష్య లుబ్ధస్య పక్షిణః।
అంగదః పరమాయస్తో హనుమంత మథా బ్రవీత్॥ ౬
పశ్య సీతాపదేశేన సాక్షా ద్వైవస్వతో యమః।
ఇమం దేశ మనుప్రాప్తో వానరాణాం విపత్తయే॥ ౭
రామస్య నకృతం కార్యం రాజ్ఞో నచ వచః కృతమ్।
హరీణా మియ మజ్ఞాతా విపత్తి స్సహసా గతా॥ ౮
వైదేహ్యాః ప్రియకామేన కృతం కర్మ జటాయుషా।
గృధ్రరాజేన యత్తత్ర శ్రుతం వ స్తద శేషతః॥ ౯
తథా సర్వాణి భూతాని తిర్యగ్యోనిగతాన్యపి।
ప్రియం కుర్వంతి రామస్య త్యక్త్వా ప్రాణా న్యథా వయమ్॥ ౧౦
అన్యోన్య ముపకుర్వంతి స్నేహకారుణ్యయంత్రితాః॥ ౧౦½

ప్రాయోపవేశము సేయుచుండు వానరులవద్దకు సంపాతివచ్చుట. ౫౯౧

(౨,౩) చిరంజీవిగను జటాయు అన్నగను శ్రీమంతుఁడుగను, ప్రసిద్ధము లగు బలపరాక్రమములుగల వాఁడుగ నుండు సంపాతి యనుగృధ్రరాజు గొప్ప వింధ్యపర్వతము మధ్యనుండి వెలుపల వచ్చి దగ్గరలమీదఁ గూర్చుండిన వానరు లను జూచి మిగులసంతోషించి యిటు లనెను.

(౪) నాకు బహుకాలమునకు తగిన ఆహారము చిక్కినందున లోకములో దైవము మనుజుల యోగక్షేమమును వహించుచున్నాఁడు.

(౫) వానరులమధ్యలో చచ్చుచుండినవారిని క్రమముగ భక్షించెదను ఇటుల వానరులను జూచి సంపాతిచెప్పెను.

(౬) తినుటలో నాసక్తిగల సంపాతిచెప్పిన మాటను అంగదుఁడు విని మిగుల భయపడి హనుమంతునితో నిటు లనెను.

(౭) సాక్షాత్ యముఁడు సీత యనునెపముచే వానరులయొక్క ఆపదకే యీప్రదేశమునకు వచ్చెను.

(౮) శ్రీరాముని కార్యము ముగియలేదు. సుగ్రీవుని నాజ్ఞప్రకారము సేయలేదు. అచింతితముగనుండు యీవిపత్తు వానరులను మిగుల త్వరగ సంభ వించెను.

(౯) గృధ్రరాజగు జటాయుపక్షి సీతాదేవికి ప్రియముసేయుటకు గోరి యుపకారముచేసెను. అవిషయమును మీరు వినియున్నారు.

(౧౦) మనమువలెనె ప్రాణములు విడిచి శ్రీరామునికి ప్రియమైన కార్య ము సేయుటవలతిర్యగ్జాతులగు సకల ప్రాణులు రామునికి ప్రియము సేయు చున్నవి.

(౧౦౪) స్నేహ కారుణ్యములతోఁ గూడి ప్రత్యేక ప్రత్యేకముగ సకల ప్రాణులు శ్రీరామునికి ఉపకారము సేయుచున్నవి.

తేన తస్యోపకారార్థం త్యజతాత్మానమాత్మనా।
ప్రియం కృతం హి రామస్య ధర్మజ్ఞేన జటాయుషా॥ ౧౧
రాఘవార్థే పరిశ్రాంతా వయం సంత్యక్తజీవితాః।
కాంతారాణి ప్రపన్నాస్స్మ నచ పశ్యామ మైథిలీమ్॥ ౧౨

నసుఖీ గృధ్రరాజస్తు రావణేన హతో రణే।
ముక్తశ్చ సుగ్రీవభయా ద్గతశ్చ పరమాంగతిమ్॥ ౧౩
జటాయుషో వినాశేన రాజ్ఞో దశరథస్య చ।
హరణేనచ వైదేహ్యా స్సంశయం హరయో గతాః॥ ౧౪
రామలక్ష్మణయో ర్వాస అరణ్యే సహసీతయా।
రాఘవస్య చ బాణేన వాలినశ్చ తథా వధః॥ ౧౫

రామకోపా దశేషాణాం రాక్షసానాం తథా వధః।
కైకేయ్యా వరదానేన ఇదం హి వికృతం కృతమ్॥ ౧౬
తద సుఖ మనుకీర్తితం వచో భువిపతితాంశ్చ నిరీక్ష్య వాన
రాన్। భృశ చలితమతి ర్మహామతిః కృపణ ముదాహృతవా
న్స గృధ్రరాట్॥ ౧౭
తత్తు శ్రుత్వా తదా వాక్య మంగదస్య ముఖోద్గతమ్।
అబ్రవీ ద్వచనం గృధ్ర స్తీక్ష్ణతుండో మహాస్వనః॥ ౧౮

అంగదుని మాటలువిని సంపాతి వానరులతో సంభాషించుట. ౫౭-౩

(౧౧౪) ధర్మజ్ఞుఁడగు జటాయువు శ్రీరామునికి ఉపకారము సేయుటకై తనప్రాణమును విడిచి అతనికిఁబ్రియము చేసెను.

(౧౨౪) శ్రీరాముని కార్యమునకై మిగుల శ్రమపడి మనము ప్రాణములు విడుచుచున్నాము. అరణ్యములలో నంతయు వెతకి చూచితిమి. సీత అగుపడలేదు.

(౧౩౪) రావణునిచే యుద్ధములోఁ జంపఁబడిన గృధ్రరాజగు జటాయువు పక్షి ధన్యుఁడు. ఏలననఁగా, సుగ్రీవుని వలన భయములేనివాఁడై ఉత్తమమైన మోక్షపదవిని అతఁడు బొందెను.

(౧౫౪) జటాయువుపక్షి దశరథుల మరణము, సీతాపహరణములచే వానరులు ప్రాణసంశయమును బొందిరి.

(౧౬౪,౧౭౪) సీతాదేవితోడ రామలక్ష్మణులు అరణ్యములో వసించుట, శ్రీరాముని బాణముచే వాలి చచ్చుట, రాముని కోపముచే రాక్షసులందరు [illegible]ట, రాముఁడు వనవాసము ప్రారంభించి మనము ప్రాయోపవేశము చేయువరకు తటస్థించిన విపత్తులన్నియు, కైకేయికి దశరథుఁడు యిచ్చిన వరములచే సంభవించినవి.

(౧౮౪) దుఃఖము గలుగునటుల అంగదుఁడు కథగఁజెప్పినమాటలను, విని [illegible]లో దర్భలమీఁద పండుకొనియుండు వానరులను జూచి, గొప్పబుద్ధిగల గృధ్రరాజగు సంపాతి మిగుల బెదిరినమనసు గలవాఁడై జాలిపుట్టునటుల యిటు లనెను.

(౧౯౪) అప్పుడు, అంగదుఁడు చెప్పిన మాటలు విని పదునుగల ముక్కుగల గృధ్రరాజు పెద్ద గొంతుతో వానరులతో నిటు లనెను.

కోఽయం గిరాఘోషయతి ప్రాణైః ప్రియతమస్య మే।
జటాయుషో వధం భ్రాతుః కంపయన్నివ మే మనః॥ ౧౯
కథ మాసీ జ్జనస్థానే యుద్ధం రాక్షసగృధ్రయోః।
నామధేయ మిదం భ్రాతు శ్చిరస్యాద్య మయా శ్రుతమ్॥ ౨౦
ఇచ్ఛేయం గిరిదుర్గాచ్చ భవద్భి రవతారితుమ్॥ ౨౧
యవీయసో గుణజ్ఞస్య శ్లాఘనీయస్య విక్రమైః।
అతిదీర్ఘస్య కాలస్య తుష్టోఽస్మి పరికీర్తనాత్॥ ౨౨
తదిచ్ఛేయ మహం శ్రోతుం వినాశం వానరర్షభాః।
భ్రాతు ర్జటాయుష స్తస్య జనస్థాననివాసినః॥ ౨౩
తస్యైవ చ మమ భ్రాతుః సఖా దశరథః కథమ్।
యస్య రామః ప్రియః పుత్రో జ్యేష్ఠో గురుజనప్రియః॥ ౨౪
సూర్యాంశుదగ్ధపక్షత్వా న్న శక్నో మ్యుపసర్పితుమ్।
ఇచ్ఛేయం పర్వతా దస్మా దవతర్తు మరిందమాః॥ ౨౫

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - షట్పంచాశస్సర్గః.



సప్తపంచాశస్సర్గః.



శోకా ద్భ్రష్టస్వరమపి శ్రుత్వా తే హరియూథపాః।
శ్రద్దధుర్నైవ తద్వాక్యం కర్మణా తస్య శంకితాః॥ ౧

అంగదుని మాటలువిని సంపాతి వానరులతో సంభాషించుట. ౫౯-౫

(౧౯-౪) ప్రాణములకంటె నాకు బ్రియుఁడుగనుండు తమ్ముఁడగు జటాయువధను, నామనసుకు కంపము గలిగించునటుల, చెప్పుచుండు వాఁడెవఁడు.

(౨౦౪) రావణునికి జటాయుపక్షికి జనస్థానములో నెటుల యుద్ధము జరిగినది. బహుకాలమునకు నాతమ్ముఁడగు జటాయు పక్షిపేరు వినుచున్నాను.

(౨౧) ఈ కొండమీఁదనుండి నన్ను దించవలయునని మిమ్ముఁ గోరుచున్నాను.

(౨౨) గుణవంతుఁడును శ్లాఘనీయమైన పరాక్రమము గలవాఁడును నగు నాతమ్ముని కథను యింతకాలమునకు విని సంతోషించితిని.

(౨౩) వానరోత్తములారా! జనస్థానములో నుండిన నాతమ్ముఁడగు జటాయుపక్షియొక్క మరణమును వినఁగోరుచున్నాను.

(౨౪) సర్వజనులకుఁ బ్రియుఁడును పెద్దవారిపట్ల ప్రీతిగలవాఁడును, పెద్దకొడుకగు రాముని పుత్రునిగాఁ గల దశరథుఁడు నాతమ్ముఁడగు జటాయుపక్షికి యెటుల స్నేహితుఁడాయెను.

(౨౫) సూర్యుని కిరణములచే నా రెక్కలు కాలిపోయినందున దిగివచ్చుటకు నాకు శక్తిలేదు. కనుక, శత్రుసంహారకులగు వానరులారా! పర్వతముమీఁద నుండి నన్ను క్రిందికి దించవలయునని కోరుచున్నాను.

ఇది యేబది యారవ సర్గ.

౫౭ వ సర్గ

(అవతారిక.— సంపాతి యడిగిన ప్రశ్నలకు వానరులు బదులుచెప్పుట యీసర్గలోఁ జెప్పఁబడుచున్నది.

(౧) దుఃఖముచేఁగలిగిన ఆతని గద్గదస్వరమును విని వానర సేనాపతులు సంపాతియొక్క హింసరూపమగు కర్మకు భయపడి, అతనిమాటను నమ్మనేలేదు.

తే ప్రాయ ముపవిష్టాస్తు దృష్ట్వా గృధ్రం ప్లవంగమాః॥
చకారి ర్బుద్ధిం తదా రౌద్రాం సర్వాన్వో భక్షయిష్యతి॥ ౧
సర్వథా ప్రాయమాసీనా న్యది నో భక్షయిష్యతి।
కృతకృత్యా భవిష్యామః క్షిప్రం సిద్ధి మితో గతాః॥ ౨
ఏతాం బుద్ధిం తత శ్చక్రు స్సర్వే తే వానరర్షభాః॥ ౩॥

అవతార్య గిరే శ్శృంగాత్ గృధ్ర మాహాంగద స్తదా ౪
బభూవర్క్షరజానామ వానరేంద్రః ప్రతాపవాన్।
మమార్యః పార్థివః పక్షిన్ ధార్మికౌ తస్య చాత్మజౌ॥ ౫
సుగ్రీవశ్చైవ వాలీచ పుత్రౌ ఘనబలా వుభౌ।
లోకే విశ్రుతకర్మాఽభూ ద్రాజా వాలీ పితా మమ॥ ౬
రాజా కృత్స్నస్య జగత ఇక్ష్వాకూణాం మహారథః॥
రామో దాశరథి శ్శ్రీమాన్ ప్రవిష్టో దండకావనమ్॥ ౭
లక్ష్మణేన సహభ్రాత్రా వైదేహ్యాచాపి భార్యయా।
పితు ర్నిర్దేశ నిరతో ధర్మ్యం పంథాన మాశ్రితః॥

తస్య భార్యా జనస్థానా ద్రావణేన హృతా బలాత్॥ ౮
రామస్యతు పితు ర్మిత్రం జటాయు ర్నామ గృధ్రరాట్।
దదర్శ సీతాం వైదేహీం హ్రియమాణాం విహాయసా॥ ౯

(౨) ప్రాయోపవేశము చేసియుండు వానరులు సంపాతిని జూచి మన లనందరిని యితఁడు భక్షించునని తలఁచి కఠినమైన చిత్తముగలవారైరి.

(౩) సర్వప్రకారములుగ ప్రాయోపవేశము చేసియుండు మనలను నితఁడు భక్షించినయెడల శీఘ్రముగ యీలోకమునుండి సిద్ధిని బొంది కృతకృత్యుల మగుదుము.

(౩౪) వానరోత్తములందరు యీవిధముగ యోచించిరి.

(౪) వింధ్యపర్వతము శిఖరమునుండి సంపాతిని క్రిందికి దించి అప్పుడు అంగదుఁడతనితో నిట్టు లనెను.

(౫,౬) ఓ సంపాతీ! వానరశ్రేష్ఠుఁడును ప్రతాపవంతుఁడును నాకు పితామహుఁడును ధార్మికుఁడును నగు ఋక్షరజస్సు అను వానరరాజు ఉండెను. మీనుపము సంఖ్యాల దేహాబలముగల సుగ్రీవుఁడు వాలియను యిద్దరు ఋక్షరజస్సుగారికి ఔరసపుత్రులు. నాతండ్రియు వానరరాజును నగు వాలి లోకము లోప్రసిద్ధమైన కార్యములు చేసినవాఁడు.

(౭,౮) లోకముల కన్నిటికిని రాజును, ఇక్ష్వాకువంశమువారిలో మహారథుఁడును, తండ్రి ఆజ్ఞను పరిపాలించుటలో ఆసక్తిగలవాఁడును, ధర్మమార్గములో నడచువాఁడును దశరథుని కొడుకును శ్రీమంతుఁడును నగు రాముఁడు తమ్ముఁడగు లక్ష్మణునితోను, భార్యయగు సీతతోను, దండకారణ్యములోఁ బ్రవేశించెను.

(౯౪) రావణుఁడు జనస్థానము నుండి శ్రీరాముని భార్య యగు సీతను అపహరించుకొని పోయెను.

(౧౦౪) శ్రీరాముని తండ్రికి స్నేహితుఁడును గృధ్రరాజును నగు జటాయువు, ఆకాశములో రావణుఁ డపహరించుకొని పోవుచుండు జనకుని కూతురగు సీతను జూచెను.

రావణం విరథం కృత్వా స్థాపయిత్వాచ మైథిలీమ్।
పరిశ్రాంతశ్చ వృద్ధశ్చ రావణేన హతోఽరణే॥ ౧౦½
ఏవం గృధ్రోహి హత స్తేన రావణేన బలీయసా।
సంస్కృతశ్చాపి రామేణ గతశ్చ గతి ముత్తమామ్॥ ౧౧½

తతో మమ పితృవ్యేణ సుగ్రీవేణ మహాత్మనా।
చకార రాఘవ స్సఖ్యం సోఽవధీ త్పితరం మమ॥ ౧౨½
మమ పిత్రా విరుద్ధోహి సుగ్రీవ స్సచివై స్సహ॥ ౧౩
నిహత్య వాలినం రామ స్తత స్త మభిషేచయత్॥ ౧౩½

స రాజ్యే స్థాపిత స్తేన సుగ్రీవో వానరాధిపః।
రాజా వానరముఖ్యానాం యేన ప్రస్థాపితా వయమ్॥ ౧౪½
ఏవం రామ ప్రయుక్తాస్తు మార్గమాణా స్తత స్తతః।
వైదేహీం నాధిగచ్ఛామో రాత్రౌ సూర్యప్రభామివ॥ ౧౫½

తే వయం దండకారణ్యం విచిత్య సుసమాహితాః।
అజ్ఞానాత్తు ప్రవిష్టాస్స్మ ధర్మణ్యా వివృతం బిలమ్॥ ౧౬½
మయస్య మాయా విహితం తద్బిలంచ విచిన్వతామ్।
వ్యతీత స్తత్ర నో మాసో యోరాజ్ఞా సమయః కృతః॥ ౧౭½

(౧౦౪) రావణుని రథమును యుద్ధములో నాశముచేసి, సీతాదేవిని రథమునుండి భూమిమీఁద దించెను. వృద్ధుఁడగుటచే జటాయువు మిగుల శ్రమపడి యుద్ధములో రావణునిచేఁ జంపఁబడెను.

(౧౧౪) బలవంతుఁడగు రావణుఁడు యీవిధముగ జటాయుపక్షిని జంపెను. శ్రీరామునిచే సంస్కరింపఁబడినవాఁడై ఉత్తమమగు గతిని బొందెను.

(౧౨౪,౧౩) పిమ్మట, నాకుఁ బినతండ్రియగు మహాత్ముఁడగు సుగ్రీవుని తోడ శ్రీరాముఁడు స్నేహము చేసికొని, నాతండ్రియగు వాలిని జంపెను. మంత్రులతోడ సుగ్రీవుఁడు నాతండ్రితో ద్వేషించి యుండెను.

(౧౩౪) శ్రీరాముఁడు వాలిని జంపి, పిమ్మట, సుగ్రీవునికి పట్టాభిషేకము చేసెను.

(౧౪౪) వానరరాజగు సుగ్రీవుని రాజ్యములో శ్రీరాముఁడు స్థాపించెను. వానరోత్తములకు రాజుగనుండు సుగ్రీవుఁడు సీతను వెతకి కనిపెట్టుటకు మమ్ము బంపెను.

(౧౫౪) ఈవిధముగ శ్రీరామునిచేఁ బంపఁబడినవారమై అచ్చటచట వెతకుచు, రాత్రికాలములో సూర్యుని కాంతిని నెటుల చూడమో, అటుల సీతాదేవిని జూడలేకపోతిమి.

(౧౬౪) ఇట్టి మేము మిగుల జాగ్రత్తగ దండకారణ్యములో సీతాదేవిని వెతకి, భూమిలోనుండిన గొప్పబిలములో బ్రవేశించితిమి.

(౧౭౪) మయునియొక్క విచిత్రమైన మాయాశక్తిచేఁ గల్పింపఁబడిన ఆ బిలములో సీతను వెతకుచుండగా, సుగ్రీవుఁడు యిచ్చిన ఒకనెల గడువు అచట నిండినది.

తే వయం కపిరాజస్య సర్వే వచనకారిణః।
కృతాం సంస్థా మతిక్రాంతా భయా త్ప్రాయ ముపాస్మహే॥
క్రుద్ధే తస్మిం స్తు కాకుత్స్థే సుగ్రీవేచ సలక్ష్మణే।
గతానామపి సర్వేషాం తత్ర నో నాస్తి జీవితమ్॥ ౧౯

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - సప్తపంచాశస్సర్గః.



## అష్టపంచాశస్సర్గః.



ఇ త్యుక్తః కరుణం వాక్యం వానరై స్త్యక్తజీవితైః।
సబాష్పో వానరా న్గృధ్రః ప్రత్యువాచ మహాస్వనః॥ ౧
యవీయా న్మమ సభ్రాతా జటాయుర్నామ వానరాః।
య మాఖ్యాత హతం యుద్ధే రావణేన బలీయసా॥ ౨
వృద్ధభావా దపక్షత్వా చ్ఛృణ్వం స్తదపి మర్షయే।
నహి మే శక్తి ర స్త్యద్య భ్రాతు ర్వైర విమోక్షణే॥ ౩
పురా వృత్రవధే వృత్తే పరస్పర జయైషిణౌ।
ఆదిత్య ముపయాతౌ స్వో జ్వలంతం రశ్మిమాలినమ్॥ ౪
ఆవృత్యాకాశమార్గేతు జవేనస్మ గతౌ భృశమ్।
మధ్యం ప్రాప్తే దినకరే జటాయు రవసీదత॥ ౫

(౧౪) కపిరాజగు సుగ్రీవుని అజ్ఞలోనుండు మేమంగదము అతఁడు యేర్పరచిన గడువు అతిక్రమించిన వారమై, అతనివద్దకుఁబోయిన నతఁడేమి సేయునోయని భయపడి, యిచటనే ప్రాయోపవేశముచేసి ప్రాణములు విడుచుచున్నాము.

(౧౫) శ్రీరాముఁడు సుగ్రీవుఁడు లక్ష్మణుఁడు అనువారికి కోపముగలిగినటులైతే అచటికి మేము పోయినను చూకు ప్రాణములు దక్కవు.

ఇది యేబది యేడవ సర్గ.

౫౮ వ సర్గ.

(అవతారిక.. సంపాతి సీతయుండు ప్రదేశమును వానరులకుఁ దెలుపుట యీసర్గలోఁ జె చున్నది )

(౧) ప్రాణములు విడుచుచుండు వానరులు జాలిపుట్టునటుల చెప్పిన మాటలు విని, సంపాతి కన్నీరువిడుచుచు, పెద్దస్వరముతో వానరులతో నిటులనెను.

(౨) వానరులారా! బలము గలరావణుఁడు యుద్ధములో నెవని జంపెనని మీరు చెప్పితిరో అతఁడు నాతమ్ముఁడు. అతనిపేరు జటాయు.

(౩) వృద్ధాప్యము చేతను రెక్కలు లేనందునను మీరు చెప్పినమాటలు విని సైచుకొని యున్నాను. నా తమ్మునికి రావణునితో గలిగినవైరమును దీర్చుకొనుటకు యిప్పుడు నాకు శక్తిలేదు.

(౪) పూర్వము, వృత్రాసురుని వధ జరిగినపుడు, పరస్పరము మావేగాతిశయమును ప్రసిద్ధిపరచుటకై జ్వలించుచుండుకిరణములతో గూడియుండు సూర్యుని సమీపమునకు మేము బోతిమి.

(౫) ఆకాశమార్గములో మండలాకృతిగ తిరిగి మిగుల వేగముగఁ బోతిమి. సూర్యుఁడు తలమీఁద సూటిగ వచ్చినపుడు జటాయు కష్టపడెను.

తే మహం భ్రాతరం దృష్ట్వా సూర్యరశ్మిభి రర్దితమ్।
పక్షాభ్యాం ఛాదయామాస స్నేహా త్పరమవిహ్వలః॥ ౬
నిర్దగ్ధపక్షః పతితో వింధ్యేఽహం వానరర్షభాః।
అహ మస్మి న్వసన్ భ్రాతుః ప్రవృత్తిం నోపలక్షయే॥ ౭

జటాయుష స్త్వేవ ముక్తో భ్రాత్రా సంపాతినా తదా।
యువరాజో మహాప్రాజ్ఞః ప్రత్యువాచాంగద స్తదా॥ ౮
జటాయుషో యది భ్రాతా శ్రుతం తే గదితం మయా।
ఆఖ్యాహి యది జానాసి నిలయం తస్య రక్షసః॥ ౯

అదీర్ఘదర్శనం తం వై రావణం రాక్షసాధిపమ్।
అంతికే యది వా దూరే యది జానాసి శంస నః॥ ౧౦
తతోఽబ్రవీ న్మహాతేజా జ్యేష్ఠో భ్రాతా జటాయుషః।
ఆత్మానురూపం వచనం వానరా న్సంప్రహర్షయన్॥ ౧౧

నిర్దగ్ధపక్షో గృధ్రోఽహం హీనవీర్యః ప్లవంగమాః।
వాఙ్మాత్రేణ తు రామస్య కరిష్యే సాహ్య ముత్తమమ్॥ ౧౨
జానామి వారుణా న్లోకా న్విష్ణో స్త్రైవిక్రమానపి।
మహాసురవిమర్దాన్వా ప్యమృతస్య చ మంథనమ్। ౧౩

(౬) సూర్యుని కిరణములు దహించిన తమ్ముఁడగు జటాయువుజూచి మిగుల దుఃఖము గలవాఁడనై స్నేహముచే నా ఱెక్కలను వతనిమీఁద గప్పితిని.

(౭) వానరోత్తములారా! బాగుగ దగ్ధమైన ఱెక్కలుగలవాఁడనై నేను వింధ్యపర్వతము సమీపములోఁ బడితిని. నేను యీవింధ్య పర్వతములో వసించుచు తమ్ముఁడగు జటాయు వృత్తాంతమును దెలిసికొనలేకపోతిని.

(౮) జటాయు అన్నయగు సంపాతి యిటుల చెప్పఁగా, అపుడు, యువరాజును మిగుల ప్రాజ్ఞుఁడును నగుఅంగదుఁ డతనితో నిటు లనెను.

(౯) జటాయుపక్షికి అన్నగ నుండినటులైతే నీవు రామునికి దాసుఁడవేను, నేను చెప్పిన సమాచారమును విని యుందువు. నీకుఁ దెలిసియుండి నటులైతే రావణుఁడు వసించు ప్రదేశమును దెలుపవలయును.

(౧౦) రాఁబోవు అనర్థమును నెఱుంగనివాఁడును, రాక్షసరాజును నగు రావణుఁడు సమీపములో నున్నాఁడా, దూరములో నున్నాఁడా, నీకుఁ దెలిసియుండిన యెడల, మాకుఁ జెప్పవలయును.

(౧౧) పిమ్మట, గొప్పతేజస్సు గలవాఁడును జటాయుపక్షి అన్నయు నగు సంపాతి వానరులకు మిగులసంతోషము గలిగించుచు, శ్రీరామునిపట్ల అతనికిగల భక్తిని వ్యక్తపరచుచు, యిటు లనెను.

(౧౨) వానరులారా! దగ్ధమైన ఱెక్కలుగలిగి వీర్యము లేనివాఁడనై యుండు గృధ్రజాతిలోఁబుట్టిన నేను, వట్టి మాటలతో, రామునికి గొప్పసహాయము సేయుచున్నాను.

(౧౩) అతల వితలాది లోకములను, త్రివిక్రమావతారము నెత్తి శ్రీమన్నారాయణుఁడు కొలిచిన లోకములను, దేవాసురుల యుద్ధములను, క్షీరసముద్రములో అమృత మథనము సేసినదియు నే నెఱుంగుదును.

రామస్య యదిదం కార్యం కర్తవ్యం ప్రథమం మయా।
జరయాచ హృతం తేజః ప్రాణాశ్చ శిథిలా మమ॥ ౧౪
తరుణీ రూపసంపన్నా సర్వాభరణభూషితా।
హ్రియమాణా మయా దృష్టా రావణేన దురాత్మనా॥ ౧౫
క్రోశంతీ రామరామేతి లక్ష్మణేతిచ భామినీ।
భూషణా న్యపవిధ్యంతీ గాత్రాణిచ విధూన్వతీ॥ ౧౬
సూర్యప్రభేవ శైలాగ్రే తస్యాః కౌశేయముత్తమమ్।
ఆసితే రాక్షసే భాతి యథావా తటిదంబుదే॥ ౧౭
తాం తు సీతా మహం మన్యే రామస్య పరికీర్తనాత్।
శ్రూయతాం మే కథయతో నిలయం తస్య రక్షసః॥ ౧౮
పుత్రో విశ్రవస స్సాక్షా ద్భ్రాతా వైశ్రవణస్యచ।
అధ్యాస్తే నగరీం లంకాం రావణో నామ రాక్షసః॥ ౧౯
ఇతో ద్వీప స్సముద్రస్య సంపూర్ణే శతయోజనే।
తస్మిన్ లంకాపురీ రమ్యా నిర్మితా విశ్వకర్మణా॥ ౨౦
జాంబూనదమయై ర్ద్వారై శ్చిత్రైః కాంచనవేదికైః।
ప్రాకారేణార్క వర్ణేన మహతా సుసమావృతా॥ ౨౧
తస్యాం వసతి వైదేహీ దీనా కౌశేయవాసినీ।
రావణాంతఃపురే రుద్ధా రాక్షసీభి స్సురక్షితా॥ ౨౨
జనకస్యాత్మజాం రాజ్ఞ స్తత్ర ద్రక్ష్యథ మైథిలీం॥ ౨౨½

(౧౪) శ్రీరామునిపనిని నేను మొట్టమొదుట చేయవలయును. ఏలననఁగా వృద్ధాప్యము నా పరాక్రమమును నపహరించినది. నా ప్రాణములు శిథిలమై యున్నవి.

(౧౫,౧౬) దేహ సౌందర్యముగలదియు, సర్వాభరణ భూషితురాలును రామా లక్ష్మణా యని యేడ్చుచుండునదియు ఆభరణములను విరిచివేయుచు అవయవములను విదిలించుకొను చుండినదియు నగు, దురాత్ముఁడగు రావణుఁడ పహరించుకొని పోవుచుండిన, కోపము గలిగియుండిన స్త్రీని జూచితిని.

(౧౭) రావణుఁ డపహరించుకొని పోవుచుండిన సీతయొక్క ఉత్తమమగు పీతాంబరము పర్వత శిఖరముమీదనుండు సూర్యుని కాంతివలెను, మేఘములోనుండు మెరుపువలెను, నల్లగనుండు రావణుని మీద ప్రకాశించినది.

(౧౮) శ్రీరాముని గీర్తించుచుపోయిన ఆమె సీతయని నేను తలంచెదను. ఆరాక్షసుఁడు వసించుప్రదేశమును చెలిపెదను. వినుఁడు.

(౧౯) విశ్రవసుయొక్క ఔరసపుత్రుఁడును, కుబేరుని తమ్ముఁడును, నగు రావణుఁడను పేరుగల రాక్షసుఁడు లంకలో వసించుచున్నాఁడు.

(౨౦) ఇచటికి నూరుయోజనములలో సముద్రములో నొక దీవి కలదు. ఆదీవిమీద విశ్వకర్మ లంక యనుపట్టణమును నిర్మించెను.

(౨౧) బంగారు ద్వారములు, రత్నములు పొదగఁబడి నానారంగులుగల అరుగులు గలిగి, సూర్యునివలె వెలుంగుచుండు కోట లంకకు చుట్టును గలదు.

(౨౨) పీతాంబరమును ధరించినదియు, రావణుని అంతఃపురములో నుంచబడి రాక్షసస్త్రీలచే రక్షింపఁబడు జనకుని కూతురగు సీత లంకలోనున్నది.

(౨౩-౨౪) జనకునికూతురగు సీతను లంకలో మీరు చూడఁగలరు.

లంకాయా మథ గుప్తాయాం సాగరేణ సమంతతః॥ ౨౩
సంప్రాప్య సాగరస్యాంతం సంపూర్ణం శతయోజనమ్।
ఆసాద్య దక్షిణం తీరం తతో ద్రక్ష్యథ రావణమ్॥ ౨౪

తత్రైవ త్వరితాః క్షిప్రం విక్రమధ్వం ప్లవంగమాః।
జ్ఞానేన ఖలు పశ్యామి దృష్ట్వా ప్రత్యాగమిష్యథ॥ ౨౫
ఆద్యః పంథాః కులింగానాం యేచాన్యే ధాన్యజీవినః।
ద్వితీయో బలిభోజానాం యేచ వృక్షఫలాశినః॥ ౨౬

భాసా స్తృతీయం గచ్ఛంతి క్రౌంచాశ్చ కురరైః సహ।
శ్యేనా శ్చతుర్థం గచ్ఛంతి గృధ్రా గచ్ఛంతి పంచమమ్॥ ౨౭
బలవీర్యోపపన్నానాం రూపయౌవనశాలినామ్।
షష్ఠస్తు పంథా హంసానాం వైనతేయగతిః పరా॥ ౨౮
వైనతేయాచ్చ నోజన్మ సర్వేషాం వానరర్షభాః॥ ౨౮½

ఇహస్థోఽహం ప్రపశ్యామి రావణం జానకీం తథా।
అస్మాక మపి సౌవర్ణం దివ్యం చక్షు ర్బలం తథా॥ ౨౯½
తస్మా దాహార వీర్యేణ నిసర్గేణచ వానరాః।
ఆయోజన శతా త్సాగ్రా ద్వయం పశ్యామ నిత్యశః॥ ౩౦½

(౨౩, ౨౪) సముద్రములో నూరు యోజనములు దాటి, దక్షిణతీరము చేరి, నలుప్రక్కలలోను సముద్రముచే రక్షింపఁబడుచుండు లంకలో రావణుని జూచుడు.

(౨౫) వానరులారా! వేగముగ సీతను వెతకవలయును. సీతను జూచి యిచటికి మీరు వచ్చి చేరుదురని నాదివ్య జ్ఞానముచే తలంచుచున్నాను.

(౨౬) (ఇట్టి దివ్యజ్ఞానము గలిగినందుకు సంపాతి కారణము చెప్పుచున్నాఁడు.) భూమికి సమీపములో సంచరించు పక్షులు, ధాన్యము తిని ౦చు మరికొన్నిపక్షులు, ఆకాశములో గల యేడు అంతస్థులలో క్రింది అంతస్థులో నున్నవి. కాకులు, వృక్షములలో గల పండ్లు తినుపక్షులు, దీనికిపైన రెండవఅంతస్థులో సంచరించుచున్నవి.

(౨౭) నీటికాకులు, క్రౌంచపక్షులు, కురరపక్షులు వీనికిపైన మూడవ అంతస్థులో సంచరించు చున్నవి. డేగలు నాల్గవ అంతస్థులోను, గద్దలు ౫వ అంతస్థులోను సంచరించు చున్నవి.

(౨౮) బలవీర్యములతోఁగూడి రూపము యౌవనము గలహంసలు ఆరవ అంతస్థులో సంచరించుచున్నవి. గరుడుఁడు అరుణుఁడు యేడవ అంతస్థులో సంచరించుచుందురు.

(౨౮½) వానరోత్తములారా! మేము గరుడుని సంతతి వారము.

(౨౯½) నేను యిచటనే యుండి రావణుని జనకునికూతు రగుసీతను జూచుచున్నాను, మాకు బంగారురంగుగల అమోఘమైన నేత్రపాటవము గలదు.

(౩౦½) కనుక, ఆహారమును సంపాదించుటలో గల పరాక్రమముచేతను, స్వాభావికమైనపరాక్రమము చేతను నూరు యోజనముల దూరములో నుండు పదార్థములు మేము సదా చూచుచున్నాము.

అస్మాకం విహితా వృత్తి ర్నిసర్గేణచ దూరతః।
విహితా పాదమూలేతు వృత్తి శ్చరణయోధినామ్॥ ౩౧

గర్హితం తు కృతం కర్మ యేనస్మ పిశితాశినా।
ప్రతీకార్యంచ మే తస్య వైరం భ్రాతుః కృతం భవేత్॥ ౩౨

ఉపాయో దృశ్యతాం కశ్చి ల్లంఘనే లవణాంభసః।
అభిగమ్యతు వైదేహీం సమృద్ధార్థా గమిష్యథ॥ ౩౩

సముద్రం నేతు మిచ్ఛామి భవద్భి ర్వరుణాలయమ్।
ప్రదాస్యా మ్యుదకం భ్రాతు స్స్వర్గతస్య మహాత్మనః॥ ౩౪

తతో నీత్వా తు తం దేశం తీరం నదనదీపతేః।
నిర్దగ్ధపక్షం సంపాతిం వానరా స్సుమహౌజసః॥ ౩౫

పునః ప్రత్యానయిత్వాచ తం దేశం పతగేశ్వరం।
బభూవు ర్వానరా హృష్టాః ప్రవృత్తి ముపలభ్య తే॥ ౩౬

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - అష్టపంచాశస్సర్గ

---

ఏకోనషష్టితమస్సర్గః

---

తత స్తదమృతా స్వాదం గృధ్రరాజేన భాషితమ్।
నిశమ్య ముదితా హృష్టా స్తే వచః ప్లవగర్షభాః॥ ౧

(౩౧౫) బహుదూరములో నుండు పదార్థములను కనిపెట్టి తెచ్చి భుజించి జీవించుచుందును. కోళ్ళు అవియుండు ప్రదేశమును గిరిచిక్కినదాని భుజింతును.

(౩౨౫) మాంసమును భుజించు రావణుఁడు నిందితమైన సీతాపహరణమును జేసెను. నాతమ్మునివిషయమై నేను రావణునికి బదులు చేయఁదగిన ప్రతిక్రియను మీరు చేసి నామనసు చల్లఁగ జేయఁవలయును.

(౩౩౫) ఉప్పుసముద్రమును దాటుటకు మీరొక ఉపాయమును నాలోచించవలయును. లంకకుఁబోయి సీత క్షేమమును తెలిసికొని వచ్చినపని ముగించుకొని కిష్కింధకుఁబొండు.

(౩౪౫) స్వర్గములోనుండు మహాత్ముఁడగు నాతమ్మునికి నేను ఉదకప్రదానము చేసెదను. అందుచే, మీరు వరుణునికి వాసస్థానముగనుండు సముద్రమునకు నన్ను దీసికొని పోవలయును.

(౩౫౫, ౩౬౫) గొప్ప తేజస్సుగలవానరులు, రెక్కలుకాలిపోయియుండు సంపాతిని వింధ్యపర్వతమునుండి తీసికొనిపోయి సముద్రతీరములో దించి, మరియు, పక్షిరాజగు నతని అతఁడు వసించుచుండిన ప్రదేశమునకుఁ దీసికొనివచ్చి విడిచిపెట్టి, సీతాదేవి వృత్తాంతమును తెలిసికొనినందున మిగుల సంతోషించిరి.

ఇది యేబది యెనిమిదవ సర్గ.

## ౫౯ వ సర్గ.

(అవతారిక.— ... తనముగు గ్రంథములలో నగుపడనందునను, యీసర్గలు లేకపోయినను కథాసంఘటనమునకు భంగము లేనందునను, యీసర్గలవల్ల పూర్వోత్తరశ్లోకములకు విరోధము సూచింపఁ బడుటచేతను, 'తత స్తదమృతాస్వాదు' అను శ్లోకము మొదలు ౫ సర్గలు ప్రక్షిప్తములని గోవిందరాజులు వ్రాసి, వ్యాఖ్యానము చేసియున్నారు.

జాంబవా న్వానరశ్రేష్ఠ స్సహ సర్వైః ప్లవంగమైః।
భూతలా త్సహసోత్థాయ గృధ్రరాజ మథాబ్రవీత్॥ ౨
క్వ సీతా కేనవా దృష్టా కోవా హరతి మైథిలీమ్।
తదాఖ్యాతు భవా న్సర్వం గతి ర్భవ వనౌకసామ్॥ ౩

కో దాశరథిబాణానాం వజ్రవేగ నిపాతినామ్।
స్వయం లక్ష్మణముక్తానాం న చింతయతి విక్రమమ్॥ ౪
సహరీ న్ప్రీతిసంయుక్తా న్సీతాశ్రుతిసమాహితాన్।
పున రాశ్వాసయ న్ప్రీత ఇదం వచన మబ్రవీత్॥ ౫

శ్రూయతా మిహ వైదేహ్యా యథా మే హరణం శ్రుతమ్।
యేన చాపి మమాఖ్యాతం యత్రవాయతలోచనా॥ ౬
అహ మస్మి న్గిరౌ దుర్గే బహుయోజన మాయతే।
చిరా న్నిపతితో వృద్ధః క్షీణప్రాణపరాక్రమః॥ ౭

తం మామేవం గతం పుత్ర స్సుపార్శ్వోనామ నామతః।
ఆహారేణ యథాకాలం బిభర్తి పతతాం వరః॥ ౮
తీక్ష్ణకామా స్తు గంధర్వా స్తీక్ష్ణకోపా భుజంగమాః।
మృగాణాంతు భయం తీక్ష్ణం తత స్తీక్ష్ణక్షుధా వయమ్॥ ౯

(౧) పిమ్మట, సంపాతి చెప్పిన అమృతమువలె మధురముగనుండిన మాటలను వానరులు విని మిగులసంతోషించిరి.

(౨) వానరులందరితోడ వానరోత్తముఁడగు జాంబవంతుఁడు శీఘ్రముగ లేచి సంపాతితో నిటు లనెను.

(౩) సీత యెచ్చటనున్నది. ఆమెను జూచినవాఁడెవఁడు. ఆమెను నపహరించిన వాఁడెవఁడు. నీవు ఆవిషయమునంతయు దెలిపి వానరులను రక్షించవలయును.

(౪) పిడుగువలె పడుచుండు రామలక్ష్మణులు బ్రయోగించిన బాణముల పరాక్రమమును నెవఁడు ఆలోచించకున్నాఁడు.

(౫) శ్రీరామ భక్తితోఁ గూడినవారును సీత వృత్తాంతమును వినుటచే సమాధాన పడినవారును నగు వానరులను, మరియు, సమాధానపరచుచు సంతోషించి సంపాతి యిటు లనెను.

(౬) నేను వినిన సీతాదేవిని అపహరించుకొని పోయినరీతిని, నాకుఁ జెప్పిన వానిని, సీత వసించుచుండు చోటును, దెలిపెదను. వినుఁడు.

(౭) అనేక యోజనములదూరము విస్తారముగనుండు ప్రవేశించుటకు సాధ్యముకాని యీపర్వతములో వృద్ధుఁడనగు నేను బహుకాలమునుండి పడియున్నాను. నా ప్రాణము పరాక్రమము తగ్గిపోవుచున్నవి.

(౮) ఇట్టి యవస్థను బొందియుండు నన్ను పక్షులలో నుత్తముఁడగు సుపార్శ్వుఁడను నాకొడుకు ఆయా కాలములలో ఆహార మిచ్చి గాపాడుచున్నాఁడు.

(౯) గంధర్వులు మిగుల కామము, సర్పములు మిగుల కోపము, జింకలు మిగుల భయము గలిగియున్నవి. వీనికంటె మేము మిగుల ఆకలి గలవారము.

స కదాచిత్ క్షుధార్తస్య మమాహారాభికాంక్షిణః।
గతసూర్యేఽహని ప్రాప్తో మమ పుత్రో హ్యనామిషః॥ ౧౦
సమయా వృద్ధభావాచ్చ కోపాచ్చ పరిభర్త్సితః।
క్షుత్పిపాసాపరీతేన కుమారః పతతాం వరః॥ ౧౧

స మా మాహారసంరోధా త్పీడితం ప్రీతివర్ధనః।
అనుమాన్య యథా తత్త్వ మిదం వచన మబ్రవీత్॥ ౧౨
అహం తాత యథాకాల మామిషార్థీ ఖ మాప్లుతః।
మహేంద్రస్య గిరే ర్ద్వార మావృత్యచ సమాస్థితః॥ ౧౩

తత స్సత్త్వసహస్రాణాం సాగరాంతరచారిణామ్।
పంథాన మేకోఽధ్యవసం సన్నిరోద్ధు మవాఙ్ముఖః॥ ౧౪
తత్ర కశ్చి న్మయా దృష్ట స్సూర్యోదయసమప్రభామ్।
స్త్రియ మాదాయ గచ్ఛన్వై భిన్నాంజనచయప్రభః॥ ౧౫

సోఽహ మభ్యవహారార్థీ తౌ దృష్ట్వా కృతనిశ్చయః।
తేన సామ్నా వినీతేన పంథాన మభియాచితః॥ ౧౬
నహి సామోపపన్నానాం ప్రహర్తా విద్యతే క్వచిత్।
నీచేష్వపి జనః కశ్చి త్కి మంగ బత మద్విధః॥ ౧౭

(౧౦) నేను ఆకలితోఁ గూడి ఆహారమును గోరుచుండు నప్పుడు అతఁడు ఆహారము దెచ్చుటకుఁ బోయి మాంసమును దీసికొనిరాక సూర్యుఁడస్తమించి నప్పుడు వచ్చిచేరెను.

(౧౧) ఆకలి దాహములచేఁ బీడింపఁబడిన నేను ముసలితనముచేతను కోపముచేతను పక్షులలో శ్రేష్ఠుఁడగు నాకొడుకును నిందించితిని.

(౧౨) ఆకలిచేఁ బీడింపఁబడుచుండిన నాకుఁ బ్రీతిని బెంచుచు సమాధానపరచి జరిగిన విషయమును తత్త్వముగ నతఁడు దెలిపెను.

(౧౩) తండ్రీ! కాలమును నతిక్రమించక మాంసము దెచ్చుటకు ఆకాశములో నెగిరిపోయి మహేంద్రపర్వతము ద్వారమును నడ్డగించి నిలిచియుంటిని.

(౧౪) సముద్రముమధ్యలో సంచరించుచుండు అనేక ప్రాణులయొక్క సంచారమార్గమును అడ్డగించుటకై నేనొక్కఁడనే తలను క్రిందుగ నుంచుకొని యుంటిని.

(౧౫) అచట, బద్ధలైన అంజనము కొండవలె వెలుంగుచుండు ఒకరాక్షసుఁడు, సూర్యునివలెఁ బ్రకాశించుచుండు ఒకస్త్రీని నెత్తుకొని పోవుచుండుట చూచితిని.

(౧౬) వారిద్దరిని జూచిన నేను వారిని నీకు ఆహారమునకై దెచ్చుటకు గోరినవాఁడనై అచట నే నిలిచియుంటిని. ఆరాక్షసుఁడు నన్ను సమాధానపరచుకొని వినీతుఁడై త్రోవవిడువవలయునని ప్రార్థించెను.

(౧౭) సమాధానముచేసికొని శరణాగతులైన వారిని చంపువాఁడు నీచుల లోను నెచటను నుండఁడు. ఇట్లుండగా, నావంటివాఁడు అట్టి కార్యము సేయువచ్చునా, కష్టము.

సయాత స్తేజసా వ్యోమ సంక్షిపన్నివ వేగతః।
అథాహం ఖచరై ర్భూతై రభిగమ్య సభాజితః॥ ౧౮

దిష్ట్యా జీవసి తాతేతి హ్యబ్రువ న్మాం మహర్షయః।
కథం చి త్సకళత్రోఽసౌ గతస్తే స్వ స్త్యసంశయమ్॥ ౧౯

ఏవ ముక్త స్తతోఽహం తై స్సిద్ధైః పరమశోభనైః॥ ౧౯ ౹

సచ మే రావణో రాజా రక్షసాం ప్రతివేదితః।
హరణ దాశరథే ర్భార్యాం రామస్య జనకాత్మజామ్॥ ౨౦ ౹

భ్రష్టాభరణకౌశేయాం శోకవేగపరాజితామ్।
రామలక్ష్మణయోర్నామ క్రోశంతీం ముక్తమూర్ధజామ్॥ ౨౧ ౹

ఏష కాలాత్యయస్తావ దితి కాలవిదాంవరః।
ఏత మర్థం సమగ్రం మే సుపార్శ్వః ప్రత్యవేదయత్॥ ౨౨ ౹

త చ్ఛ్రుత్వాపి హి మే బుద్ధి ర్నాసీ త్కాచి త్పరాక్రమే।
అపక్షో హి కథం పక్షీ కర్మకించి దుపక్రమే॥ ౨౩ ౹

యత్తు శక్యం మయా కర్తుం వాగ్బుద్ధిగుణవర్తినా।
శ్రూయతాం త త్ప్రవక్ష్యామి భవతాం పౌరుషాశ్రయమ్॥

(౧౮) అతఁడతని తేజస్సుచే ఆకాశమును నీడుచుకొని పోవునటుల మిగుల వేగముగఁ బోయెను. పిమ్మట, ఆకాశములో సంచరించుచుండిన ప్రాణులు సమీపమునకు వచ్చి నన్ను పూజించినవి.

(౧౯) తండ్రీ! దైవయోగముచే నీవు సుఖముగ జీవించుచున్నావని చెప్పిరి. రాక్షసుఁడు కళత్రముతోడ యిచటనుండి మిగుల ప్రయాసతో తప్పించుకొని పోయెను. నీకు మంగళమగును. ఇందుకు సందేహములేదు. అని మహర్షులు నన్ను చూచి చెప్పిరి.

(౧౯½) ఉత్తములైన క్షేమముగలిగించు సిద్ధులు నాతో నిటుల చెప్పిరి.

(౨౦½, ౨౧½) జారిపోవుచుండు ఆభరణములు పట్టుచీర గలదిగను, మిగుల దుఃఖముగలదిగను, రామ లక్ష్మణుల పేర్లను దుఃఖించుచు సెప్పుచుండు నదిగను, వీడిపోయిన కొప్పుగలదిగను నుండు జనకుని కూతురగు శ్రీరాముని భార్యను నపహరించుకొని పోవుచుండినవాఁడు రాక్షసులకు రాజగు రావణుఁడేయని తెలిసికొంటిని.

(౨౨½) కాలము నెఱింగినవారిలో నుత్తముఁడగు సుపార్శ్వుఁడను నాకొడుకు ప్రొద్దుపోయి వచ్చినందుకు కారణము రావణుని సంధించినదే యని యీ వృత్తాంతము నతఁడు నాకుఁ దెలిపెను.

(౨౩½) ఆవృత్తాంతమును వినియుఁ రావణునిమీఁద నాపరాక్రమమును జూపుటకు నాకు బుద్ధి పుట్టలేదు. ఏలనఁగా, రెక్కలులేని నేను యెటుల కార్యమును చేయఁగలుగుదును.

(౨౪½) వాక్కు బుద్ధి గుణములుగల నేను యేమిసహాయము సేయఁగలనో పి పౌరుషమును నాశ్రయించి యుండు అట్టికార్యమును జెప్పెదను. వినుఁడు.

వాజ్మతిభ్యాంతు సర్వేషాం కరిష్యామి ప్రియం హి వః।
యద్ధి దాశరథేః కార్యం మమ తన్నాత్ర సంశయః॥ ౨౫
తే భవంతో మతిశ్రేష్ఠా బలవంతో మనస్వినః।
ప్రేషితాః కపిరాజేన దేవై రపి దురాసదాః॥ ౨౬
రామలక్ష్మణబాణాశ్చ నిశితాః కంకపత్రిణః।
త్రయాణామపి లోకానాం పర్యాప్తా స్త్రాణనిగ్రహే॥ ౨౭
కామం ఖలు దశగ్రీవ స్తేజోబలసమన్వితః।
భవతాం తు సమర్థానాం నకించి దపి దుష్కరమ్॥ ౨౮
త దలం కాలసంగేన క్రియతాం బుద్ధినిశ్చయః।
నహి కర్మసు సజ్జంతే బుద్ధిమంతో భవద్విధాః॥ ౨౯
ఇతి శ్రీమత్కిష్కింధాకాండే ఏకోనషష్టితమస్సర్గః.



## షష్టితమస్సర్గః.



తతః కృతోదకం స్నాతం తం గృధ్రం హరియూథపాః
ఉపవిష్టా గిరౌ దుర్గే పరివార్య సమంతతః॥ ౧
త మంగద ముపాసీనం తైః సర్వై ర్హరిభి ర్వృతమ్।
జనిత ప్రత్యయో హర్షా త్సంపాతిః పున రబ్రవీత్॥ ౨

(౨౫) వాక్కుతోను బుద్ధితోను మీకందరికి సంతోషము గలిగించెదను. శ్రీరాముని కార్యము నాకార్యమేను. అందున సందేహములేదు.

(౨౬) బుద్ధిచే ఉత్తములుగను బలవంతులుగను ధైర్యముగలవారుగను దేవతలచేతను తిరస్కరించుటకు సాధ్యముకానివారుగనునుండు మిమ్మునుకపిరాజగు సుగ్రీవుఁడు సీతను వెతకుటకుఁ బంపెను.

(౨౭) పదును రెక్కలుగల రామలక్ష్మణుల బాణములు మూఁడులోకములను రక్షించుటలోను శిక్షించుటలోను సమర్థములుగ నున్నవి.

(౨౮) దశకంఠుఁడు గొప్ప తేజోబలములతోఁ గూడి యున్నాఁడు. సమర్థులగు మీకు సాధ్యము కానిది యెద్దియు లేదు.

(౨౯) అందుచేత, ఆలస్యముచేసిన లాభములేదు. కోరినపని అగునని మీబుద్ధిని స్థిరపరచుకొనవలయును. మీవంటి బుద్ధిమంతులు కార్యము సేయుటలో వెనుకతీయరు.

ఇది యేబది తొమ్మిదవ సర్గ.

---

౬౦ వ సర్గ.

(౧) పిమ్మట, ఉదకదానము యిచ్చి స్నానముచేసియుండు సంపాతి చుట్టు వానరసేన చుట్టుకొని వింధ్యపర్వతముమీఁదఁ గూర్చుండెను.

(౨) వానరులచేఁ బూజింపఁబడి వారిమధ్యలో గూర్చుండిన అంగదుని జూచి, వానరులనుజూచినందున అతఁడుబడసిన వరములో నమ్మకము గలవాఁడై, సంతోషించి సంపాతి మరియు నిటు లనెను.

కృత్వా నిశ్శబ్ద మేకాగ్రా శ్శృణ్వంతు హరయో మమ।
తత్త్వం సంకీర్తయిష్యామి యథా జానామి మైథిలీమ్॥ ౩
అస్య వింధ్యస్య శిఖరే పతితోఽస్మి పురా వనే।
సూర్యాతపపరీతాంగో నిర్దగ్ధ స్సూర్యరశ్మిభిః॥ ౪
లబ్ధసంజ్ఞ స్తు షడ్రాత్రా ద్వివశో విహ్వల న్నివ।
వీక్షమాణో దిశ స్సర్వా నాభిజానామి కించన॥ ౫
తతస్తు సాగరా న్శైలా న్నదీ స్సర్వా స్సరాంసిచ।
వనా న్యటవిదేశాంశ్చ సమీక్ష్య మతిరాగమత్॥ ౬
హృష్టపక్షిగణాకీర్ణః కందరాంతరకూటవాన్।
దక్షిణస్యోదధే స్తీరే వింధ్యోఽయమితి నిశ్చయః॥ ౭
ఆసీచ్చాత్రాశ్రమం పుణ్యం సురైరపి సుపూజితమ్।
ఋషి ర్నిశాకరో నామ యస్మి న్నుగ్రతపాభవత్॥ ౮
అష్టౌ వర్షసహస్రాణి తేనాస్మి న్నృషిణా వినా।
వసతో మమ ధర్మజ్ఞ స్స్వర్గతే తు నిశాకరే। ౯
అవతీర్య చ వింధ్యాగ్రా త్కృచ్ఛ్రేణ విషమా చ్ఛనైః॥
తీక్ష్ణదర్భాం వసుమతీం దుఃఖేన పునరాగతః। ౧౦
త మృషిం ద్రష్టుకామోఽస్మి దుఃఖేనాభ్యాగతో భృశమ్।
జటాయుషా మయా చైవ బహుశోఽభిగతో హి సః॥ ౧౧

(౩) వానరులారా! నిశ్శబ్దముగనుండి యేకాగ్రచిత్తులై నామాటలను వినవలయును. నేను సీతను తెలిసికొనిన విషయమును సత్యముగఁ జెప్పుచున్నాను.

(౪) పూర్వము యీయరణ్యములో యీ వింధ్యపర్వతము శిఖరముమీద, సూర్యుని కిరణములచే మిగుల వేడిగలిగి దగ్ధమైన రెక్కలు గలవాఁడనై, పడితిని.

(౫) ఆరుదినములకు పిమ్మట నాకు తెలివి వచ్చి, మైమరచి మూర్ఛపోయిన వానివలెనుండి, దిక్కుల నన్నిటిని జూచితిని. ఏమియుఁ దెలియకుండెను.

(౬) పిమ్మట, సముద్రమును కొండలను అనేకనదులను సరస్సులను ణ్యములను సముద్రతీరమును జూచి నాకు తెలివి గలిగినది.

(౭) సంతోషించియుండు పక్షులగుంపులతో నిండిన పర్వతసంఘులు శిఖరములుగల దీని దక్షిణ సముద్రతీరములోనుండు వింధ్య పర్వతమని నిశ్చయించుకొంటిని.

(౮) ఇచట, దేవతలచేఁ బూజింపఁబడు పుణ్యమైన ఆశ్రమ ముండినది. దానిలో ఉగ్రమైన తపస్సుగల నిశాకరుఁడను మహర్షి వసించుచుండెను.

(౯) నిశాకరఋషి స్వర్గమునకుఁ బోగా అతని విడిచి నేను ఉండునప్పుడు, ధర్మజ్ఞులారా! యెనిమిదివేల సంవత్సరములు నిండెను.

(౧౦) మిగుల దుఃఖముగనుండు వింధ్యపర్వతము మీదనుండి, శ్రమతో మొనలుగల [illegible]లుగల భూమిమీద, దిగ మరియు మిగుల కష్టముతో పైకిపోతిని.

(౧౧) ఆ ఋషిని జూడవలయునను కోరికచే మిక్కిలికష్టముతో క్రిందదిగితిని. ఏలననగాఁ జటాయుపక్షి నేను ఆ ఋషివద్దకుఁ పలుమారు పోయియుంటిమి.

తస్యాశ్రమపదాభ్యాశే వవుర్వాతా స్సుగంధినః।
వృక్షో నాఽపుష్పితః కశ్చి దఫలో వా నవిద్యతే॥ ౧౨

ఉపేత్య చాశ్రమం పుణ్యం వృక్షమూల ముపాశ్రితః।
ద్రష్టుకామః ప్రతీక్షేఽహం భగవంతం నిశాకరమ్।। ౧౩

అథాఽపశ్య మదూరస్థ మృషిం జ్వలితతేజసమ్।
కృతాభిషేకం దుర్ధర్ష ముపావృత్త ముదఙ్ముఖమ్।। ౧౪

త మృక్షా స్సృమరా వ్యాఘ్రా సింహా నాగాస్సరీసృపాః।
పరివార్యోపగచ్ఛంతి ధాతారం ప్రాణినో యథా॥ ౧౫

తతః ప్రాప్త మృషిం జ్ఞాత్వా తాని సత్త్వాని వై యయుః।
ప్రవిష్టే రాజని యథా సర్వం సామాత్యకం బలమ్॥ ౧౬

ఋషి స్తు దృష్ట్వా మాం ప్రీతః ప్రవిష్ట శ్చాశ్రమం పునః।
ముహూర్తమాత్రా న్నిష్క్రమ్య తతః కార్య మపృచ్ఛత॥

సౌమ్య వైకల్యతాం దృష్ట్వా రోమ్ణాం తే నావగమ్యతే।
అగ్నిదగ్ధా విమౌ పక్షౌ త్వ క్చైవ వ్రణితా తవ॥ ౧౮

(౧౨) ఆ యాశ్రమ సమీపములో గాలి సుగంధముతో వీచు చుండు ను. పూలు ఫలములు లేని వృక్షములు అచట లేనేలేవు.

(౧౩) పరిశుద్ధమగు ఆయాశ్రమమునకుఁ బోయి చెట్టు క్రింద నుంటిని, పూజ్యుఁడగు నిశాకరమహర్షిని జూడఁ గోరి యెదురుచూచు చుంటిని.

(౧౪) వెలుంగుచుండు తేజస్సు గలవాఁడును, తిరస్కరించుటకు సాధ్య ముకానివాఁడును, స్నానముచేసి ఉత్తరాభిముఖముగ సమీపముగ వచ్చుచుండు ఆఋషిని జూచితిని.

(౧౫) ఎలుగుబంట్లు పెద్ద సవరపుమృగములు పులులు సింహములు యేనుఁగులు పాములు, బ్రహ్మదేవుని ప్రాణికోటులు చుట్టుకొని వచ్చునటుల, అతని చుట్టుకొని వచ్చుచుండెను.

(౧౬) రాజు నగరులోఁ బ్రవేశించినపుడు మంత్రులతోఁ గూడిన పరి వారమంతయు వారివారి స్థానములకుఁ బోవునటుల, యీఋషి ఆశ్రమములోఁ బ్రవేశించినది తెలిసికొని, యీ జంతువులన్నియు వానివాని నెలవులకుఁ బో యెను.

(౧౭) నిశాకర మహర్షి నన్ను చూచి మిగుల సంతోషించి, ఆశ్రమము లోఁ బ్రవేశించి, మరల, కొంత సేపటికి వెలుపలవచ్చి, 'నీవువచ్చినపనియేమి' అని నన్ను అడిగెను.

(౧౮) ఓ సౌమ్యుఁడా! నీరోమములకు గలిగిన విరూపమును జూచినందున నీవు గుర్తు తెలియకున్నావు. నీరెక్కలు నిప్పులో కాలిపోయినవి. నీచర్మము సహా వ్రణములతోఁ గూడియున్నది.

గృధ్రౌ ద్వౌ దృష్టపూర్వౌ మే మాతరిశ్వసమౌ జవే।
గృధ్రాణాం చైవ రాజానౌ భ్రాతరౌ కామరూపిణౌ॥ ౧౯
జ్యేష్ఠోహి త్వం తు సంపాతే జటాయు రనుజ స్తవ।
మానుషం రూప మాస్థాయ గృహ్ణీతాం చరణౌ మమ॥ ౨౦
కిం తే వ్యాధిసముత్థానం పక్షయోః పతనం కథమ్।
దండోఽవాయం కృతః కేన సర్వ మాఖ్యాహి పృచ్ఛతః॥ ౨౧

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే షష్టితమస్సర్గః.



## ఏకషష్టితమస్సర్గః.

తత స్తద్దారుణం కర్మ దుష్కరం సాహసా త్కృతమ్।
ఆచచక్షే మునే స్సర్వం సూర్యానుగమనం తదా॥ ౧
భగవ న్వ్రణయుక్తత్వా ల్లజ్జయా వ్యాకులేంద్రియః।
పరిశ్రాంతో నశక్నోమి వచనం ప్రతిభాషితుమ్॥ ౨
అహం చైవ జటాయుశ్చ సంఘర్షా ద్దర్పమోహితౌ।
ఆకాశం పతితౌ వీరౌ జిజ్ఞాసంతౌ పరాక్రమమ్॥ ౩

(౧౯) వేగములోవాయువుతో సమముగ నుండువారును, గృధ్రములకు రాజులుగ నుండువారును, అన్నదమ్ములును, కోరిన రూపమును ధరించువారును నగు రెండు గృధ్రములను పూర్వము చూచియున్నాను.

(౨౦) వారిలో, ఓ సంపాతీ! నీవు అగ్రజుఁడవు. జటాయుపక్షి నీతమ్ముఁడు. మనిషిరూపము దాల్చి నాపాదములు బట్టుకొనుము.

(౨౧) నీకు వ్యాధి యెందుకు గలిగినది. నీరెక్కలు రాలిపోయినందుకు కారణమేమి. ఎవరైనను నీవిధముగ నిన్ను శిక్షించినారా. అంతయు, నాకుఁ దెలుపుము.

ఇది అరువదవ సర్గ.

౬౧ వ సర్గ.

(౧) పిమ్మట, సాహసముచేఁ జేయఁబడినదిగను, భయంకరముగను, ఇతరులు చేయుటకు సాధ్యపడనిదిగను నుండు నట్టి జటాయుపక్షి అతఁడుసూర్యుని సమీపమునకుఁ బోయిన వృత్తాంతమునంతయు నిశాకర మహర్షికి సంపాతి తెలిపెను.

(౨) పూజ్యుఁడా! దేహములో వ్రణము లుండుటచేతను, వ్యాకులపడిన ఇంద్రియములు గలవాఁడనుచు మిగుల శ్రమబొంది యుండు వాఁడను నగు నేను లజ్జగలిగి యీవిషయమును దెలుపుటకు అసమర్థుఁడనుగ నున్నాను.

(3) వీరులమగు నేను జటాయుపక్షి మాత్సర్యముచే అహంకారము గలవారమై ఒండొరుల వేగాతిశయమును దెలుపుటకు గోరినవారమై ఆకాశములోకిఁ బోతిమి.

కైలాసశిఖరే బద్ధ్వా మునీనా మగ్రతః పణమ్।
రవి స్స్యాదనుయాతవ్యో యావద స్తం మహాగిరిమ్॥ ౪
అథావాం యుగప త్ప్రాప్తావ పశ్యావ మహీతలే।
రథచక్రప్రమాణాని నగరాణి పృథక్పృథక్॥ ౫
క్వచి ద్వాదిత్రఘోషాంశ్చ బ్రహ్మఘోషాంశ్చ శుశ్రువ
గాయంతీ శ్చాంగనా బహ్వీః పశ్యావో రక్తవాససః॥ ౬
తూర్ణ ముత్పత్య చాకాశ మాదిత్యపథమాశ్రితౌ।
ఆవా మాలోకయావ స్తద్వనం శాద్వలసన్నిభమ్॥ ౭
ఉపలైరివ సంఛన్నా దృశ్యతే భూ శ్శిలోచ్చయైః।
ఆపగాభిశ్చ సంవీతా సూత్రైరివ వసుంధరా॥ ౮
హిమవాంశ్చైవ వింధ్యశ్చ మేరుశ్చ సుమహాన్నగః।
భూతలే సంప్రకాశంతే నాగా ఇవ జలాశయే॥ ౯
తీవ్రస్స్వేదశ్చ ఖేదశ్చ భయం చాసీ త్తదావయోః।
సమావిశతి మోహశ్చ తమో మూర్ఛాచ దారుణా॥ ౧౦
నదిగ్విజ్ఞాయతే యామ్యా నాగ్నేయీ నచవారుణీ।
యుగాంతే నియతో లోకో హతో దగ్ధ ఇవాగ్నినా॥ ౧౧
మనశ్చ మే హతం భూయ స్సన్నివర్త్యాథ సంశ్రయమ్।
యత్నేన మహతా హ్యస్మిన్ పున స్సంధాయ చక్షుషీ॥ ౧౨

(౪) కైలాసపర్వతముమీద ఋషులముందు సూర్యుఁడు అస్తగిరిలోఁ జేరుటకు లోఁగా అతనివద్దకు పోయి చేరవలయునని పందెము వేసికొంటిమి.

(౫) పిమ్మట, మేమిద్దరము ఒకేకాలములో ఆకాశములోఁ బోయి భూమిలోఁగల నగరములను రథములచక్రములనువలెఁ జూచితిమి.

(౬) కొన్నిప్రదేశములలో వాద్యనాదములను వేదఘోషనువిని రక్తవర్ణముగల వస్త్రములు ధరించి పాడుచుండు అనేకులగు స్త్రీలను ఆకాశములోఁ జూచితిమి.

(౭) శీఘ్రముగ ఆకాశములోఁ బైకిపోయి సూర్యుని మార్గములోఁ జేరి కైలాసము సమీపములో నుండు వనమును పచ్చిక మొలచియుండు చిన్నప్రదేశమువలె, చూచితిమి.

(౮) గొప్పకొండాళ్ళు గలభూమి చిన్నచిన్న రాళ్ళు గప్పఁబడినటుల గనుపడెను. నదులు, నూలుపోగులవలె, భూమిని చుట్టుకొని యుండునటుల నుండెను.

(౯) హిమవంతము వింధ్యము మేరువు, మడుగులో పాములవలె, భూమిమీద అగుపడుచుండెను.

(౧౦) అప్పుడు జటాయువుపక్షికి నాకు అధికముగ స్వేదము దుఃఖము గలిగెను. మాకు దేహము తెలియక గొప్ప మూర్ఛగలిగి కన్నులు కానరాకపోయెను.

(౧౧) పశ్చిమ ఆగ్నేయ వరుణ దిక్కులు యివియని మాకు తెలియక పోయెను. ప్రళయకాలములో లోకము అగ్నిచే దహింపఁబడి హతమైనటుల నుండెను.

(౧౨) చూచుటకు సాధనముగనుండు చక్షురింద్రియము చెడినందున మతియును నామనసు మిగుల చెడిపోయెను.

యత్నేన మహతా భూయో రవి స్సమవలోకితః॥ ౧౨౪
తుల్యః పృథ్వీ ప్రమాణేన భాస్కరః ప్రతిభాతినౌ ౧౩
జటాయు ర్మా మనా పృచ్ఛ్య నిపపాత మహీం తతః।
తం దృష్ట్వా తూర్ణమాకాశా దాత్మానం ముక్తవా నహమ్॥
పక్షాభ్యాంచ మయా గుప్తో జటాయు ర్నప్రదహ్యత।
ప్రమాదా త్తత్ర నిర్దగ్ధః పత న్వాయుపథా దహమ్॥ ౧౫
ఆశంకే తం నిపతితం జనస్థానే జటాయుషమ్।
అహంతు పతితో వింధ్యే దగ్ధపక్షో జడీకృతః॥ ౧౬
రాజ్యేన హీనో భ్రాత్రాచ పక్షాభ్యాం విక్రమేణచ।
సర్వథా మర్తుమేవేచ్ఛ న్పతిష్యే శిఖరా ద్గిరేః॥ ౧౭

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - ఏకషష్టితమస్సర్గః.

## ద్విషష్టితమస్సర్గః.

ఏవముక్త్వా మునిశ్రేష్ఠ మరుదం దుఃఖితో భృశమ్।
అథ ధ్యాత్వా ముహూర్తంతు భగవా నిద మబ్రవీత్॥ ౧
పక్షౌచ తే ప్రపక్షౌచ పున రన్యౌ భవిష్యతః।
ప్రాణాశ్చ చక్షుషీచైవ విక్రమశ్చ బలంచ తే। ౨

(౧౨) మరియు గొప్ప ప్రయత్నముచే కన్నులు బాగుగ తెరచి మరి యు సూర్యుని జూచితిమి.

(౧౩) సూర్యుఁడు భూమియంత పరిమాణము గలవాఁడుగ మాకు అగు పడెను.

(౧౪) జటాయుపక్షి నాతోఁ జెప్పకయే అచటినుండి భూమిమీఁద పడిపోయెను. పడుచుండు అతని జూచి శీఘ్రముగ నేనుఆకాశమునుండి అతని ప్రవేశించి రక్షించుటకై రెక్కలతో నతని కప్పితిని.

(౧౫) నా రెక్కలచేఁ గప్పఁబడినందున జటాయుపక్షిని సూర్యుని కిరణములు దహించలేదు. ఆకాశమునుండి క్రిందపడుచుండు నన్ను ప్రమాదము న సూర్యుని కిరణములు దహించినవి.

(౧౬) జటాయుపక్షి జనస్థానములో అపుడు పడియుండునని తలంచు చున్నాను. నేను రెక్కలు పోయి జడముగ వింధ్యపర్వతముమీద పడితిని.

(౧౭) రాజ్యము తమ్ముఁడు పరాక్రమము రెక్కలు అన్నిటిని బోఁగొట్టు కొని, సర్వప్రకారములచే మరణమును గోరుచు వింధ్యపర్వతము శిఖరము నుండి పడియున్నాను.

ఇది అరువది యొకటవ సర్గ.

---

౬౨వ సర్గ.

(౧) ఈ విషయమును నిశాకరమహర్షితోఁ జెప్పి, మిగుల దుఃఖించి యేడ్చి న ... ఆ ముని ఒక ముహూర్తకాలము యోచించి యిటు లనెను.

(౨) సంపాతీ! నీ రెక్కలు మరియు పూర్వమువలె నన్ని కార్యములలో ను ... క్రొత్తవిగను వచ్చుచున్నవి. నీప్రాణములు నేత్రములు ... బలము మునుపటివలెనే నీవు లభించును.

సర్వథా హి నగంతవ్య మీదృశః క్వగమిష్యసి।
దేశకాలౌ ప్రతీక్షస్వ పక్షౌ త్వం ప్రతిపత్స్యసే॥ ౧౦
నోత్సహేయ మహం కర్తు మద్యైవ త్వాం సపక్షకం।
ఇహ స్థ స్త్వంతు లోకానాం హితం కార్యం కరిష్యసి॥ ౧౧

త్వయాపి ఖలు తత్కార్యం తయోశ్చ నృపపుత్రయోః।
బ్రాహ్మణానాం సురాణాంచ మునీనాం వాసవస్య చ॥ ౧౨
ఇచ్ఛా మ్యహ మపి ద్రష్టుం భ్రాతరౌ రామలక్ష్మణౌ।
నేచ్ఛే చిరం ధారయితుం ప్రాణాం స్త్యక్ష్యే కళేబరం॥ ౧౩
మహర్షి స్త్వ బ్రవీ దేవం దృష్ట తత్త్వార్థదర్శనః ౧౪

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - ద్విషష్టితమ స్సర్గః.

## త్రిషష్టితమ స్సర్గః.

ఏతై రన్యైశ్చ బహుభి ర్వాక్యై ర్వాక్యవిశారదః।
మాం ప్రశస్యాభ్యనుజ్ఞాప్య ప్రవిష్ట స్స స్వమాశ్రమం। ౧
కందరాత్తు విసర్పిత్వా పర్వతస్య శనై శ్శనైః।
అహం వింధ్యం సమారుహ్య భవతః ప్రతిపాలయే॥ ౨

అద్య త్వే తస్యకాలస్య సాగ్రం వర్షశతంగతమ్।
దేశకాలప్రతీక్షోఽస్మి హృదికృత్వా మునే ర్వచః॥ ౩
మహాప్రస్థాన మాసాద్య స్వర్గతేతు నిశాకరే।
మాం నిర్దహతి సంతాపో వితర్కై ర్బహుభి ర్వృతమ్॥ ౪

ఉత్థితాం మరణే బుద్ధిం మునివాక్యై ర్నివర్తయే।
బుద్ధి ర్యాతేన మే దత్తా ప్రాణానాం రక్షణాయతు। ౫
[illegible]పనయతే దుఃఖం దీప్తేవాగ్నిశిఖాతమః॥ ౫.౫
బుధ్యతాచ మయా వీర్యం రావణస్య దురాత్మనః।
పుత్ర స్సంతర్జితో వాగ్భి ర్నత్రాతా మైథిలీ కథమ్॥ ౬.౫

తస్యా విలపితం శ్రుత్వా తౌచ సీతా వియోజితౌ।
నమే దశరథ స్నేహా త్పుత్రేణోత్పాదితం ప్రియమ్॥ ౭౫
తస్య త్వేవం బ్రువాణస్య సంపాతే ర్వానరైస్సహ,
ఉత్పేతతు స్తదా పక్షౌ సమక్షం వనచారిణామ్॥ ౮౫

స దృష్ట్వా స్వాంతనుం పక్షై రుద్గతై రరుణచ్ఛదైః।
ప్రహర్ష మతులం లేభే వానరాం శ్చేద మబ్రవీత్। ౯౫
ఋషే ర్నిశాకరస్యైవ ప్రభావా దమితాత్మనః।
ఆదిత్య రశ్మి నిర్దగ్ధౌ పక్షౌ మే పునరుత్థితౌ॥ ౧౦౫

(౩) మీరాకను నెదురుచూచుచుండు నాకు యెనిమిదివేల సంవత్సరములు గడచిపోయెను. ఆ మహర్షి మాటలను మనసులో నుంచుకొని దేశకాలములను గుర్తించుచుంటిని.

(౪) నిశాకరమహర్షి మహాప్రస్థానయాత్రిచేసి స్వర్గమునకుఁ బోవు చుండగా, వానరులు సీతను వెతకుచు యెపుడు వచ్చెదరో నాకు రెక్కలు మొలుచుటయనది యెప్పుడు లభించునో యని విచారించి తపించుచుంటిని.

(౫,౬౪) నేను ప్రాణము విడుచుటకు నిశ్చయించుకొనియుండియు, మహర్షి వాక్యమును స్మరించి అటుల చేయక ఉంటిని. ప్రాణములను గాపాడుకొను బుద్ధి మహర్షి యనుగ్రహించి నాకిచ్చిన బుద్ధి, వెలుగుచుండు అగ్నిజ్వాల చీకటిని బోగొట్టునటుల, నాదుఃఖమును బోగొట్టెను.

(౭౪) దురాత్ముఁడగు రావణుని పరాక్రమమును నెఱింగియుండు నేను సీతాదేవి ప్రలాపమును విని ఆమెను నెందుకు రక్షించలేదు అని నాపుత్రుని తిట్టితిని.

(౮౪) సీతాదేవి ప్రలాపమునువిని, రామలక్ష్మణులు ఆమెను నెడబాసి యుండుట తెలిసికొని, నాపుత్రుఁడగు సుపార్శ్వుఁడు, దశరథునిమీఁదగల స్నేహమున్నను నాలోచించి, ప్రియముసేయక పోయెను.

(౯౪) వానరులతో సంపాతి యిటుల చెప్పుచుండగా, వారియెదుటనే అప్పుడు సంపాతికి రెక్కలు మొలిచినవి.

(౧౦౪) సంపాతి యెఱ్ఱగ మొలిచియుండు రెక్కలుగల అతని శరీరము చూచి మిగుల సంతోషించి వానరులతో నిటు లనెను.

(౧౧౪) మిగులమహిమ గల నిశాకరమహర్షి ప్రభావముచే సూర్యునికిర ణములు సోకి దగ్ధమైపోయిన నా రెక్కలు మరియు మొలిచినవి.

యౌవనే వర్తమానస్య మమాసీద్యః పరాక్రమః।
తమే వాద్యానుగచ్ఛామి బలం పౌరుష మేవచ॥ ౧౧
సర్వథా క్రియతాం యత్న స్సీతా మధిగమిష్యథ।
పక్షలాభో మమాయం వ స్సిద్ధి ప్రత్యయకారకః॥ ౧౨

ఇత్యుక్త్వా స హరీ న్సర్వా న్సంపాతిః పతగోత్తమః।
ఉత్పపాత గిరే శ్శృంగా జ్జిజ్ఞాసుః ఖగమాంగతిమ్॥ ౧౩
తస్య తద్వచనం శ్రుత్వా ప్రీతిసంహృష్టమానసాః।
బభూవు ర్హరిశార్దూలా విక్రమాభ్యుదయోన్ముఖాః॥ ౧౪

అథ పవనసమానవిక్రమాః ప్లవగవరాః ప్రతిలబ్ధపౌరుషాః।
అభిజి దభిముఖా దిశం యయు ర్జనకసుతా పరిమార్గణో
న్ముఖాః॥ ౧౫

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - త్రిషష్టితమస్సర్గః.

## చతుష్షష్టితమస్సర్గః.

ఆఖ్యాతా గృధ్రరాజేన సముత్పత్య ప్లవంగమాః।
సంగతాః ప్రీతిసంయుక్తా వినేదు స్సింహవిక్రమాః॥ ౧

(౧౧౪) యౌవనదశలో నుండునపుడు నాకు గలబలపరాక్రమములే యి ప్పుడు గలిగినవని తలంచుచున్నాను.

(౧౨౪) వానరులారా! సర్వప్రకారముల చేతను సీతను కనిపెట్టుటకు యత్నము సేయవలయును. సీతాదేవి మీకులభించును. నాకురెక్కలు మొలిచినం గున మీపనియు సఫలమగునను నమ్మకము గలుగుచున్నది.

(౧౩౪) ఇటుల వానరులకు దెలిపి పక్షిరాజగు సంపాతి, వింధ్యపర్వత ము శిఖరమునుండి, మునుపటివలె ఆకాశములోఁ బోవుటకు శక్తిగలదా యని జూచుటకు, పైకెగిరిపోయెను.

(౧౪౪) సంపాతిచెప్పిన మాటలు విని వారివారి పరాక్రమమును వృద్ధిచే యుటలో అభిముఖులుగనుండు వానరోత్తములు మిగుల సంతోషించిరి.

(౧౫౪) సంపాతి మాటలను వినిన పిమ్మట వాయుదేవునినంటి పరాక్ర మము గలవారును, వారివారి పౌరుషముయొక్క పెంపును బడసినవారును, జా నకిని వెదకుటలో అభిముఖులుగ నుండువారును నగు వానర వీరులు అ మహాకార్యమును నిరీక్షించినవారై సీతయుండు దిక్కునకుఁ బోయిరి.

ఇది అరువది మూడవ సర్గ.

---

౬౪ వ సర్గ.

(అవతారిక.— ప్రక్షిప్తములుగనుండు ౫ సర్గలు ౬౩ వ సర్గతో ముగిసి నవి. సంక్షేపముగ తమ్ముఁడగు జటాయుపక్షికి ఉదకదానముచేసిన సంపాతిని స్నేహములోఁ జేర్చి, పిమ్మట చేయవలసినపనికి వానరులు పోవుటా యీసర్గ లోఁ జెప్పబడుచున్నది.)

(౧) సంక్షేపముగ సీతావృత్తాంతమును గృధ్రరాజగు సంపాతి దెలుపగా సింహబలపరాక్రమముగల వానరులు గుంపుగూడి గంతులు వేసి మిగులసం తోషించి కేకలువేసిరి.

సంపాతే ర్వచనం శ్రుత్వా హరయో రావణక్షయమ్।
హృష్టా స్సాగర మాజగ్ము స్సీతాదర్శనకాంక్షిణః॥ ౨
అభిక్రమ్య తు తం దేశం దదృశు ర్భీమవిక్రమాః।
కృత్స్నం లోకస్యమహతః ప్రతిబింబ మివస్థితమ్॥ ౩
దక్షిణస్య సముద్రస్య సమాసాద్యోత్తరాం దిశమ్।
సన్నివేశం తత శ్చక్రు ర్హరివీరా మహాబలాః॥ ౪
సత్త్వై ర్మహద్భి ర్వికృతైః క్రీడద్భి ర్వివిధై ర్జలే।
వ్యాత్తాస్యై స్సుమహాకాయై రూర్మిభిశ్చ సమాకులమ్॥ ౫
ప్రసుప్తమివచా న్యత్ర క్రీడంతమివ చాన్యతః।
క్వచి త్పర్వతమాత్రైశ్చ జలరాశిభిరావృతమ్॥ ౬
సంకులం దానవేంద్రైశ్చ పాతాళతలవాసిభిః।
రోమహర్షకరం దృష్ట్వా విషేదుః కపికుంజరాః॥ ౭
ఆకాశమివదుష్పారం సాగరం ప్రేక్ష్య వానరాః।
విషేదు స్సహసా సర్వే కథం కార్య మితి బ్రువన్॥ ౮
విషణ్ణాం వాహినీం దృష్ట్వా సాగరస్య నిరీక్షణాత్।
ఆశ్వాసయామాస హరీ న్భయార్తా న్హరిసత్తమః॥ ౯
తా న్విషాదేన మహతా విషణ్ణా న్వానరర్షభాన్।
ఉవాచ మతిమా న్కాలే వాలిసూను ర్మహాబలః॥ ౧౦

(౨) వానరులు సంపాతి మాటలు విని మిగులసంతోషించి సీతనుజూడఁ గోరినవారై రావణునికి నివాసముగనుండు లంకాద్వీపమునకుఁ బోవుటకు గోరి దానికి మార్గముగనుండు సముద్రతీరము చేరిరి.

(౩) భయంకరమైన పరాక్రమముగల వానరులు సముద్రతీరముచేరి సర్వలోకములలోనుండు సకలపదార్థములతో నిండియుండు సముద్రమును జూచిరి.

(౪) గొప్ప బలముగల వానరవీరులు దక్షిణ సముద్రముయొక్క ఉత్తర తీరములో నిలిచి సేనలను నచట

(౫) వికారమైన రూపముగలిగి నానావిధములై జలములో నోరుతెరచుకొని విహరించుచుండు గొప్ప జంతువులతోను, గొప్పగొప్పగ లేచుచుండు అలలతోను నిండినదియు,

(౬) మరియొకచోట, నిశ్శబ్దమై నిద్రించుచుండువానివలె నుండునదియు, ఇంకొకచోట ఆటలాడుచుండువానివలె నుండునదియు, మరియొకచోట పర్వత ప్రమాణముగ పైకిలేచుచుండు జలరాశితో నిండినదియు,

(౭) పాతాళములో వసించుచుండు రాక్షసోత్తములచేనిండి రోమాంచము గలిగించునట్టిదియు నగు సముద్రమును జూచి వానరోత్తములు దుఃఖించిరి,

(౮) వానరులందరు • ఆకాశమువలె దరిలేకఉండు సముద్రమును జూచి దుఃఖించి యింకమీదు చేయవలసిన కార్యమేమి అని చెప్పుకొనిరి.

(౯) సముద్రమును జూచినందున దుఃఖించిన వానరసేనను జూచి, వానరోత్తముఁడగు అంగదుఁడు భయపీడితులగు వానరులను సమాధానపరచెను.

(౧౦) మిగుల దుఃఖించుచుండు వానరోత్తములతో, గొప్ప బలముగల వానరులను ఉత్సాహపరచుఁడును నగు వాలికొడుకగు అంగదుఁడు యిటుల చెప్పెను.

న విషాదే మనః కార్యం విషాదో దోషవత్తమః।
విషాదో హంతి పురుషం బాలం క్రుద్ధ ఇవోరగః॥ ౧౧
విషాదోఽయం ప్రసహతే విక్రమే పర్యుపస్థితే।
తేజసా తస్యహీనస్య పురుషార్థో నసిధ్యతి॥ ౧౨
తస్యాం రాత్ర్యాం వ్యతీతాయా మంగదో వానరైస్సహ।
హరివృద్ధై స్సమాగమ్య పున ర్మంత్ర మమంత్రయత్॥ ౧౩
సా వానరాణాం ధ్వజినీ పరివార్యాఽంగదం బభౌ।
వాసవం పరివార్యేవ మరుతాం వాహినీస్థితా॥ ౧౪
కోఽన్యస్తాం వానరీం సేనాం శక్త స్తంభయితుం భవేత్।
అన్యత్ర వాలితనయా దన్యత్రచ హనూమతః॥ ౧౫
తత స్తాన్ హరివృద్ధాంశ్చ తచ్చసైన్య మరిందమః।
అనుమాన్యాఽంగద శ్శ్రీమా న్వాక్య మర్థవ దబ్రవీత్॥ ౧౬
క ఇదానీం మహాతేజా లంఘయిష్యతి సాగరమ్।
కః కరిష్యతి సుగ్రీవం సత్యసంధ మరిందమమ్। ౧౭
కో వీరో యోజనశతం లంఘయేచ్చ ప్లవంగమాః।
ఇమాంశ్చ యూథపాన్సర్వా న్మోచయేత్కో మహాభయాత్॥
కస్య ప్రభావా ద్దారాంశ్చ పుత్రాంశ్చైవ గృహాణిచ।
ఇతో నివృత్తాః పశ్యేమ సిద్ధార్థా స్సుఖినో వయమ్॥ ౧౮

(౧౧) దుఃఖములో మనసునుంచకూడదు. దుఃఖము గొప్పదోషము. కోపముగలసర్పము బాలుని జంపునటుల, దుఃఖము మనుజుని జంపును.

(౧౨) పరాక్రమమును జూపవలసిన కాలములో నెవనికి దుఃఖము గలుగుచున్నదో, తేజస్సుచెడిన అట్టిపురుషునికి, పురుషార్థములు లభించనేరవు.

(౧౩) ఆరాత్రి గడచిపోగా, వానరవృద్ధులతో అంగదుఁడు గలిసి మరియు బాగుగనాలోచించెను.

(౧౪) ఇంద్రుని జుట్టుకొని దేవతలసేన ప్రకాశించినటుల అంగదుని జుట్టుకొని వానరులసేన ప్రకాశించెను.

(౧౫) వాలిపుత్రుఁడగు అంగదునికి హనుమంతునికి తప్ప వానరసేనను నొకచోట నిలపియుంచుట కెవనికిని శక్తిలేదు.

(౧౬) పిమ్మట, శ్రీమంతుఁడును శత్రుసంహారకుఁడును నగుఅంగదుఁడు ఆ వానరవృద్ధులను వానరసేనను సమాధానపరచి, సార్థకముగ నిటు లనెను.

(౧౭) గొప్పతేజస్సు గలవానరులారా! మనలో నిపుడు సముద్రమును నెవఁడు దాఁటగలడు. మనలో నెవఁడు, శత్రుసంహారకుఁడగు సుగ్రీవుని సత్యప్రతిజ్ఞునిగఁ జేయఁగలఁడు.

(౧౮) వానరులారా! మనలో నెట్టి వీరుఁడు సముద్రములో నూఱుయోజనములు దాటగలఁడు. ఈ వానరసేనాపతులను గొప్పభయమునుండి యెవఁడు తప్పించగలఁడు.

(౧౯) ఎవనిమహిమచే మనమందరము కృతార్థులమై సుఖముగ నిచటినుండి కిష్కింధకుఁ బోయి భార్యాబిడ్డలను గృహములను జూడగలుగుదుము.

కస్య ప్రసాదా ద్రామంచ లక్ష్మణంచ మహాబలమ్।
అభిగచ్ఛేమ సంహృష్టా స్సుగ్రీవంచ మహాబలమ్॥ ౨౦
యది కశ్చి త్సమర్థోవ స్సాగర ప్లవనే హరిః।
స దదాత్వి హన శ్శీఘ్రం పుణ్యా మభయదక్షిణామ్॥ ౨౧
అంగదస్య వచ శ్శ్రుత్వా నకశ్చి త్కించి దబ్రవీత్।
స్తిమితేవా భవ త్సర్వా తత్ర సా హరివాహినీ॥ ౨౨
పునరేవాంగదః ప్రాహ తా న్హరీ న్హరిసత్తమః।
సర్వే బలవతాం శ్రేష్ఠా భవంతో దృఢ విక్రమాః॥ ౨౩
వ్యపదేశ్యకులే జాతాః పూజితా శ్చాప్యభీక్ష్ణశః।
నహి వో గమనే సంగః కదాచి త్కస్యచి త్క్వచిత్॥
బ్రువధ్వం యస్యయా శక్తిః ప్లవనే ప్లవగర్షభాః॥ ౨౪
ఇతి శ్రీమత్కిష్కింధాకాండే - చతుష్షష్టితమస్సర్గః

---

## పంచషష్టితమస్సర్గః

తతోఽంగదవచ శ్శ్రుత్వా సర్వే తే వానరోత్తమాః।
స్వం స్వం గతౌ సముత్సాహ మాహు స్తత్ర యథాక్రమమ్॥
గజో గవాక్షో గవయ శ్శరభో గంధమాదనః।
మైందశ్చ ద్వివిదశ్చైవ సుషేణో జాంబవాం స్తథా॥ ౨

(౨౦) ఎవని అనుగ్రహముచే మనము మిగుల సంతోషించి గొప్పబలము గల రామలక్ష్మణ సుగ్రీవుల సమీపమునకుఁ బోగలము.

(౨౧) మీలో సముద్రమును దాటుటలో సమర్థుఁడగు వానరుఁడు ఉండినటులైతే అట్టివాఁడు మనకు పరిశుద్ధమగు అభయప్రదాన దక్షిణను సేయవలయును.

(౨౨) అంగదునిమాటలు విని వానరులలో నెవఁడును నేమియు బలుకలేదు. ఆసమయములో వానరసేన కొంచెమైనను కదులక మెదలక ఉండెను.

(౨౩,౨౩౪) మఱియు, వానరోత్తముఁడగు అంగదుఁడు వానరులతో నిటులనెను. మీరందరు బలవంతులలో నుత్తములుగను, స్థిరమైన పరాక్రమము గలవారుగను, ప్రసిద్ధమైన కులములోఁ బుట్టినవారుగను, పలుమరు మీ పరాక్రమమును జూపి పూజింపఁబడిన వారుగను, నున్నారు.

(౨౪) మీలో నెవనికిని నెప్పుడును నేవిషయములోను బోవుటకు అడ్డములేదు. సముద్రమును దాటుటలో నెవనికెంత శక్తిగలదో తెలుపవలయును.

ఇది యరువది నాలుగవ సర్గ.



౬౫ వ సర్గ.

(౧,౨) పిమ్మట, వానరోత్తములగు గజుఁడు గవాక్షుఁడు గవయుఁడు గంధమాదనుఁడు మైందుఁడు ద్వివిదుఁడు సుషేణుఁడు జాంబవంతుఁడు వీరందరు అంగదుని మాటలు విని వారివారికి సముద్రమును దాటుటలోగల ఉత్సాహమును క్రమముగఁ దెలిపిరి.

ఆబభాషే గజ స్తత్ర ప్లవేయం దశయోజనమ్।
గవాక్షో యోజనా న్యాహ గమిష్యామీతి వింశతిమ్॥ ౩
గవయో వానర స్తత్ర వానరాం స్తా నువాచహ।
త్రింశతం తు గమిష్యామి యోజనానాం ప్లవంగమాః॥ ౪
శరభ స్తా నువాచాథ వానరా న్వానరర్షభః।
చత్వారింశ ద్గమిష్యామి యోజనానాం ప్లవంగమాః॥ ౫
వానరస్తు మహాతేజా అబ్రవీ ద్గంధమాదనః।
యోజనానాం గమిష్యామి పంచాశత్తు నసంశయః॥ ౬
మైందస్తు వానర స్తత్ర వానరాం స్తాను వాచహ।
యోజనానాం పరం షష్టి మహం ప్లవితు ముత్సహే॥ ౭
తత స్తత్ర మహాతేజా ద్వివిదః ప్రత్యభాషత।
గమిష్యామి నసందేహ స్సప్తతిం యోజనా న్యహమ్॥ ౮
సుషేణస్తు హరిశ్రేష్ఠః ప్రోక్తవా న్కపిసత్తమాన్।
అశీతిం యోజనానాంతు ప్లవేయం ప్లవగేశ్వరాః॥ ౯
తేషాం కథయతాం తత్ర సర్వాం స్తా ననుమాన్య చ।
తతో వృద్ధతమ స్తేషాం జాంబవా న్ప్రత్యభాషత॥ ౧౦
పూర్వ మస్మాక మప్యాసీ త్కశ్చి ద్గతిపరాక్రమః।
తే వయం వయసః పార మనుప్రాప్తా స్స్మ సాంప్రతమ్॥ ౧౧

(౩) వారిలో గజుఁడు ౧౦ యోజనములు, గవాక్షుఁడు ౨౦ యోజనములు, సముద్రమును దాటునటుల దెలిపిరి.

(౪) వారిలో గవయుఁ డను వానరుఁడు వానరులతో నిటు లనెను. వానరులారా! నేను సముద్రములో ౩౦ యోజనములు దాటగలను.

(౫) పిమ్మట, వానరోత్తముఁడగు శరభుఁడు 'వానరులారా! సముద్రములో ౪౦ యోజనములు నేను దాటగలను' అనెను.

(౬) గొప్ప తేజస్సుగల గంధమాదనుఁ డను వానరుఁడు, 'వానరులారా! సముద్రములో నేను ౫౦ యోజనములు దాటగలను, ఇందుకు సందేహము లేదు' అనెను.

(౭) మైందుఁ డను [illegible]ఁడు వానరులతో నిటు లనెను. నేను సముద్రములో ౬౦ యోజనములు దాటుటకు ఉత్సాహము గలిగియున్నాను.

(౮) పిమ్మట, [illegible]లో గొప్ప తేజస్సుగల ద్వివిదుఁ డను వానరుఁడు, 'సముద్రములో ౭౦ యో[illegible]ములు పోగలను, ఇందుకు సందేహము లేదు' అని చెప్పెను.

(౯) వానర[illegible]ను సుషేణుఁడు వానరోత్తములను జూచి యిటు లనెను. వానరప్రముఖులా[illegible]ద్రములో ౮౦ యోజనములు నేను దాటగలను.

(౧౦) అనట, [illegible]ముఖులగు వానరులు యిటుల చెప్పుచుండగా, [illegible]ని సమాధానపరచి, పిమ్మట, వారిలో మిగుల వృద్ధుఁడగు జాంబవంతుఁడు యిటు లనెను.

(౧౧) వానరులారా! పూర్వము (మాకును) నాకును గమనవేగము ఉండెను. అట్టి (మాకు) నాకు వృద్ధాప్యము వచ్చినది.

కింతు నైవం గతే శక్య మిదం కార్య ముపేక్షితుమ్।
యదర్థం కపిరాజశ్చ రామశ్చ కృతనిశ్చయౌ॥ ౧౨
సాంప్రతం కాలభేదేన యాగతి స్తాం నిబోధత।
నవతిం యోజనానాంతు గమిష్యామి నసంశయః॥ ౧౩
తాం స్తు సర్వాన్ హరిశ్రేష్ఠాన్ జాంబవా న్నిద మబ్రవీత్॥
నఖల్వే తావదేవాసీ ద్గమనే మే పరాక్రమః॥ ౧౪
మయా మహాబలే శ్చైవ యజ్ఞే విష్ణుస్సనాతనః।
ప్రదక్షిణీకృతః పూర్వం క్రమమాణ స్త్రివిక్రమమ్॥ ౧౫
స ఇదానీ మహం వృద్ధః ప్లవనే మందవిక్రమః।
యౌవనేచ తదాసీ న్మే బల మప్రతిమం పరైః॥ ౧౬
సంప్ర త్యేతావతీం శక్తిం గమనే తర్కయా మ్యహమ్।
నైతావతాచ సంసిద్ధిః కార్యస్యాస్య భవిష్యతి॥ ౧౭
అథోత్తరముదారార్థ మబ్రవీ దంగద స్తదా।
అనుమాన్య మహాప్రాజ్ఞం జాంబవంతం మహాకపిః॥ ౧౮
అహమే తద్గమిష్యామి యోజనానాం శతం మహత్।
నివర్తనేతు మే శక్తి స్స్యాన్న వేతి ననిశ్చితా॥ ౧౯
త ముఁవాచ హరిశ్రేష్ఠం జాంబవా న్వాక్యకోవిదః। ౧౯ ౪
జ్ఞాయతే గమనేశక్తి స్తవహర్యృక్ష సత్తమ॥

(౧౨) ఇటులుండగా యీకార్యమును ఉపేక్షించరాదు. సీతను కనిపెట్టునట్టి యీకార్యమును మనము సేయగలమని కపిరాజగు సుగ్రీవుఁడు రాముఁడు నమ్మియున్నారు.

(౧౩) కాలవ్యత్యాసముచే యిప్పుడు నాకు గల గమనశక్తిని దెలిపెదను. సముద్రములో ౯౦ యోజనములు బోగలను. ఇందుకు సందేహములేదు.

(౧౩౪) వానరోత్తము లందరితో జాంబవంతుఁడు మరియు నిటులనెను.

(౧౪, ౧౫) వానరులారా! వేగముగఁ బోవుటలో నాకు గలశక్తి యింతమాత్రమే కాదు. పూర్వము మహాబలిచక్రవర్తి యాగములో సనాతనుఁడగు విష్ణు త్రివిక్రమావతారములో లోకములను నాక్రమించునపుడు నేనతనికి బ్రదక్షిణము చేసితిని.

(౧౬) అట్టినేను యిపుడు వృద్ధుఁడనైనను, దాటుటలో అల్పమైన శక్తి గలవాఁడనైతిని. అపుడు యౌవనదశలో యితరులకు లేనట్టిబలము నాకుండెను.

(౧౭) ఇపుడు సముద్రమును దాటుటలో నింతశక్తి గలదనియే తలంచుచున్నాను. ఇందుచే, యీకార్యము సిద్ధించనేరదు.

(౧౮) పిమ్మట, మహాకపియగు అంగదుఁడు మిగుల ప్రాజ్ఞుఁడగు జాంబవంతుని బూజించి, కంభీరమైన అర్థముగలమాటను నతనితో అపుడు చెప్పెను.

(౧౯) నేను సముద్రములో నూరు యోజనములు దాటగలను. తిరిగి వచ్చుటకు నాకు శక్తిగలదో లేదో అనువిషయము సందేహముగనున్నది.

(౧౯౪) మాటలు చెప్పుటలో సమర్థుఁడగు జాంబవంతుఁడు వానరోత్తముఁడగు అంగదునితో నిటు లనెను.

(౨౦) వానరులలోను ఎలుగుబంట్లలోను ఉత్తముఁడవగుఅంగదుడా! నీవు దాటుటలో శక్తిగలదని తలంచుచున్నాను.

కామం శతసహస్రంవా నహ్యేషవిధి రుచ్యతే।
యోజనానాం భవా న్ఛక్తో గంతుం ప్రతినివర్తితుమ్॥ ౨౧
నహి ప్రేషయితా తాత స్వామీ ప్రేష్యః కథంచన।
భవతాఽయం జనస్సర్వః ప్రేష్యః ప్లవగసత్తమ॥ ౨౨

భవా న్కళత్ర మస్మాకం స్వామిభావే వ్యవస్థితః।
స్వామీ కళత్రం సైన్యస్య గతి రేషా పరంతప॥ ౨౩
తస్మా త్కళత్రవ త్తాత ప్రతిపాల్య స్సదా భవాన్॥ ౨౩౪

అపి చైతస్య కార్యస్య భవాన్మూల మరిందమ। ౨౪
మూల మర్థస్య సంరక్ష్య మేష కార్యవిదాం నయః।
మూలేహి సతి సిధ్యంతి గుణాః పుష్పఫలోదయాః॥ ౨౫

త ద్భవా నస్యకార్యస్య సాధనే సత్యవిక్రమ।
బుద్ధివిక్రమసంపన్నో హేతు రత్ర పరంతప॥ ౨౬
గురుశ్చ గురుపుత్రశ్చ త్వం హి నః కపిసత్తమ।
భవంత మాశ్రిత్య వయం సమర్థా హ్యర్థ సాధనే॥ ౨౭

ఉక్తవాక్యం మహాప్రాజ్ఞం జాంబవంతం మహాకపిః।
ప్రత్యువా చోత్తరం వాక్యం వాలిసూను రథాంగదః॥ ౨౮

(౨౧) నూరుయోజనములు లేక వేయియోజనములు దాటి తిరిగి వచ్చుట కు నీవు మిగుల సమర్థుఁడవేను. అయినను, భృత్యులుగ నుండువారు యిట్టిపని రాజులకు విధించకూడదు.

(౨౨) ఓబిడ్డా! అందరిని ఆజ్ఞాపించునట్టి రాజును నొక పనికై భృత్యు లు పంపకూడదు. వానరోత్తముఁడా! ఈప్రజలనందరిని నీవు బంపవచ్చును.

(౨౩) ప్రభుత్వములోనుండు నీవు మాకందరికి రక్షకుఁడవు. సేన రాజును రక్షించవలయును. శత్రు సంహారకుఁడా! ఇది లోకమర్యాద.

(౨౪) అందుచేత భార్యనువలె నిన్ను సదా మేము రక్షించుచుండవల యును. ఓబిడ్డా!

(౨౫) మరియు, యీసముద్రము దాటునట్టి కార్యమును సాధించుటకు, ఓశత్రు సంహారకుఁడా! నీవే ముఖ్యమైన కారణము.

(౨౬) కార్యమునకు ఆధారముగనుండు వస్తువును బాగుగ రక్షించవల యును. ఇది కార్యజ్ఞులను నెఱింగినవారు చెప్పునట్టి నీతి. వేరుఉండినసే చెట్టు లో పూలు పండ్లు లభించునటుల ముఖ్యమైన పురుషుడుండినసే సకల కార్యము లు సఫలమగును.

(౨౭) సత్యమైన పరాక్రమముగల అంగదుఁడా! శత్రు సంహారకుఁడా! బుద్ధి పరాక్రమములతోఁ గూడియుండు నీవు సముద్రముదాటునట్టి కార్యమును సాధించుటలోఁ గారణముగ నున్నావు.

(౨౮) వానరోత్తముఁడా! పూజ్యుఁడగు వాలిపుత్రుఁడ వగు నీవు మాకు పూజ్యుఁడవు. నిన్ను ముందుంచుకొని కార్యములను సాధించుటలో మేము సమర్థులము.

(౨౯) పిమ్మట, మహాకపియు వాలిపుత్రుఁడును నగు అంగదుఁడు మహాప్రాజ్ఞుఁడగు యిట్లు చెప్పిన జాంబవంతునితో నిటులనెను, -

యది నాహం గమిష్యామి నాన్యే వానరపుంగవాః।
పునః ఖల్విద మస్మాభిఃకార్యం ప్రాయోపవేశనమ్॥ ౨౯
నహ్యకృత్వా హరిపతే స్సందేశం తస్య ధీమతః।
తత్రాపి గత్వా ప్రాణానాం పశ్యామి పరిరక్షణమ్॥ ౩౦

సహి ప్రసాదే చాత్యర్థం కోపేచ హరిరీశ్వరః।
అతీత్య తస్య సందేశం వినాశో గమనే భవేత్॥ ౩౧
తద్యథా హ్యస్య కార్యస్య నభవ త్యన్యథా గతిః।
తద్భవా నేవ దృష్టార్థ స్సంచింతయితు మర్హతి॥ ౩౨

సోంగదేన తదా వీరః ప్రత్యుక్తః ప్లవగర్షభః।
జాంబవా నుత్తరం వాక్యం ప్రోవా చేదం తతోంగదమ్॥ ౩౩
అస్య తే వీర కార్యస్య నకించి త్పరిహీయతే।
ఏష సంచోదయా మ్యేవం యః కార్యం సాధయిష్యతి॥ ౩౪

తతః ప్రతీతం ప్లవతాంవరిష్ఠ మేకాంత మాశ్రిత్య సుఖోపవిష్ట
మ్। సంచోదయామాస హరిప్రవీరో హరిప్రవీరం హనుమంత
మేవ॥ ౩౫

ఇతి శ్రీమత్కిష్కింధాకాండే పంచషష్టితమస్సర్గః.



సముద్రముదాటుటకై హనుమంతునిజాంబవంతుఁడు ప్రోత్సాహపరచుట.౬౭౯

(౨౯) వానరోత్తములారా ! నేను సముద్రమును దాటకపోయినట్లైతే, యింకొకఁడును దాటలేడు. మరియు, మనమందరము ప్రాయోపవేశము సేయవలసినదేను.

(30) బుద్ధిమంతుఁడును వానరరాజును నగు సుగ్రీవుని ఆజ్ఞప్రకారము సేయక, కిష్కింధకుఁబోయి, ప్రాణములు రక్షించుకొనుటకు సాధ్యముకాదు.

(3౧) అనుగ్రహించుటకును దండించుటకును సుగ్రీవుఁడు స్వతంత్రుఁడుగ నున్నాఁడు. అతని ఆజ్ఞను మీరిపోయినట్లైతే మనకందరికి నాశము గలుగును.

(3౨) అందుచేత, సముద్రమును దాటవలసినకార్యము యింకొక విధముగ మారకుండునట్లుల, నీవే విషయమును కనిపెట్టి ఆలోచించవలయును.

(33) అపుడు, వీరుఁడును వానరోత్తముఁడును నగుజాంబవంతుఁడు అంగదునిమాటలు విని, పిమ్మట, అతని కిటుల బదులు చెప్పెను.

(3౪) ఓ వీరుఁడా! నీయీకార్యమునకెట్టి కొరతయు రానేరదు. నేను యీకార్యమును సాధించగలవాని యీవిధముగఁ బ్రోత్సాహ పరిచెదను.

(3౫) పిమ్మట, ప్రసిద్ధుఁడును దాటువారిలో శ్రేష్ఠుడును ఒంటరిగ సుఖముగఁ గూర్చుండినవాఁడును నగు వానరవీరుఁడగు హనుమంతుని వానరవీరుఁడగు జాంబవంతుఁడు బ్రోత్సాహపరచెను.

ఇది అరువది యైదవ సర్గ.



## షట్షష్టితమస్సర్గః



అనేకశతసాహస్రీం విషణ్ణాం హరివాహినీమ్।
జాంబవా న్సముదీక్ష్యైవం హనుమంత మథా బ్రవీత్॥ ౧
వీర వానరలోకస్య సర్వశాస్త్రవిశారద।
తూష్ణీ మేకాంతమాశ్రిత్య హనుమ న్కిం నజల్పసి॥ ౨
హనుమ న్హరిరాజస్య సుగ్రీవస్య సమో హ్యసి।
రామలక్ష్మణయో శ్చాపి తేజసాచ బలేనచ॥ ౩
అరిష్టనేమినః పుత్రో వైనతేయో మహాబలః।
గరుత్మానితి విఖ్యాత ఉత్తమ స్సర్వపక్షిణామ్॥ ౪
బహుశో హి మయా దృష్ట స్సాగరే సమహాబలః।
భుజగా నుద్ధర న్పక్షీ మహావేగో మహాయశాః॥ ౫
పక్షయో ర్యద్బలం తస్య తావద్భుజబలం తవ।
విక్రమ శ్చాపి వేగశ్చ నతే తేనా పహీయతే॥ ౬
బలం బుద్ధిశ్చ తేజశ్చ సత్వంచ హరిపుంగవ।
విశిష్టం సర్వభూతేషు కి మాత్మానం నబుధ్యసే॥ ౭
అప్సరాప్సరసాం శ్రేష్ఠా విఖ్యాతా పుంజికస్థలా।
అంజనేతి పరిఖ్యాతా పత్నీ కేసరిణో హరేః॥ ౮

## ౬౬ వ సర్గ.

(౧) దుఃఖించుచుండు అనేకలక్షల సంఖ్యగల వానరసేనను జాంబవంతుఁడు చూచి హనుమంతునితో నిటుల చెప్పెను.

(౨) వానరులలో వీరుఁడుగ నుండువాఁడా! సకల శాస్త్రములలోఁ బ్రవీణుఁడా! హనుమంతుఁడా! ఏకాంతములోనుండి పలుకక ఉన్నావు.

(3) హనుమంతుఁడా! వానరరాజగు సుగ్రీవునితోను రామలక్ష్మణుల తోను వీర్యములోను బలములోను సమానుఁడవుగనున్నావు.

(౪) కశ్యపబ్రహ్మపుత్రుఁడును గొప్పబలముగలవాఁడును పక్షులలో సుప్రముఁడును నగు గరుడుఁడు మిగుల ప్రసిద్ధుఁడు.

(౫) గొప్పబలము వేగము యశస్సు గలగరుడుఁడు సముద్రములోగల పాములను నెత్తికొనిపోవునపుడు పలుమరు చూచితిని.

(౬) అతని రెక్కలకెంతబలముగలదో అంతబలము నీభుజములకు గలదు. నీకు గల పరాక్రమము వేగము, అతనిపరాక్రమము గమనవేగములకంటె, తక్కువవిగావు.

(౭) నీ బలము బుద్ధి తేజస్సు ధైర్యము, ఓ వానరశ్రేష్ఠుఁడా! సర్వప్రాణుల బలపరాక్రమధైర్యములకంటె హెచ్చుగనున్నవి. ఇది నీకెందుకు విశదపడలేదు.

(౮) అప్సరసలలో నుత్తమురాలగు పుంజికస్థల యనునామె మిగుల ప్రసిద్ధురాలు. కేసరియను వానరునికి ఆపుంజికస్థల, శాపముచే అంజనయను పేరఁ బ్రసిద్ధికెక్కి, భార్యగనుండెను.

విఖ్యాతా త్రిషులోకేషు రూపేణాప్రతిమా భువి।
అభిశాపా దభూ త్తాత వానరీ కామరూపిణీ॥ ౮
దుహితా వానరేంద్రస్య కుంజరస్య మహాత్మనః॥ ౯॥

కపిత్వే చారుసర్వాంగీ కదాచి త్కామరూపిణీ।
మానుషం విగ్రహం కృత్వా రూపయౌవనశాలినీ॥ ౧౦॥

విచిత్రమాల్యాభరణా మహార్హక్షౌమవాసినీ।
అచర త్పర్వతస్యాగ్రే ప్రావృడంబుదసన్నిభే॥ ౧౧॥

తస్యా వస్త్రం విశాలాక్ష్యాః పీతం రక్తదశం శుభమ్।
స్థితాయాః పర్వతస్యాగ్రే మారుతోపహర చ్ఛనైః॥ ౧౨॥

స దదర్శ తత స్తస్యా వృత్తా వూరూ సుసంహతౌ।
స్తనౌచ పీనౌ సహితౌ సుజాతం చారుచాననమ్॥ ౧౩॥

తాం విశాలయతశ్రోణీం తనుమధ్యాం యశస్వినీమ్।
దృష్ట్వైవ శుభసర్వాంగీం పవనః కామమోహితః॥ ౧౪॥
స తాం భుజాభ్యాం దీర్ఘాభ్యాం పర్యష్వజత మారుతః।
మన్మథావిష్టసర్వాంగో గతాత్మా తా మనిందితామ్॥ ౧౫॥

(౯) సౌందర్యముచే మూఁడులోకములలోను బ్రసిద్ధిగాంచి భూమిలో పాటిలేనిదిగ యీపెయుండెను. ఓ బిడ్డా! శాపముచే యీ పుంజికస్థల కోరిన రూపముధరించగల వానరస్త్రీగ నుండెను.

(౯½) ఈమె వానరశ్రేష్ఠుఁడును మహాత్ముఁడును నగుకుంజరునికూతురు.

(౧౦½, ౧౧½,) ఈమెవానరరూపము దాల్చి యుండినపుడు, నొకసమయములో సుందరమగు అవయవములు గలిగి, కోరిన రూపము ధరించ గలదిగ నుండుటచే, మానుష స్త్రీరూపము ధరించి సౌందర్య యౌవనములతోఁ గూడి నానారంగులుగల పూలహారములు ఆభరణములు వెలలేని పీతాంబరమును ధరించి వర్షాకాలమేఘముతో సమమై నల్లగనుండు పర్వతముమీఁద సంచరించుచుండెను.

(౧౨½) పర్వతము మీదనుండిన ఆవిశాలాక్షియగు అంజనాదేవియొక్క యెఱ్ఱని అంచులుగల శుభమైనవస్త్రమును గాలి తిన్నతిన్నగ నెగరఁ గొట్టెను.

(౧౩½) పిమ్మట, వాయుదేవుఁడు ఆయంజనాదేవియొక్క బలిసి గుండ్రమై చేరియుండు తొడలను గొప్పవిగ నుండు స్తనములను మిగుల సుందరముగ నుండు ముఖమును జూచెను.

(౧౪½) విశాలముగను పొడవుగనునుండు కటిపశ్చాద్భాగముగలదియు, సూక్ష్మమగునడుము గలదియు, యశస్సుగలదియు, మంగళకరమై సుందరముగ నుండు అవయవములు గలదియు నగు అంజనాదేవిని జూచి వాయుదేవుఁడు కామమోహితుఁడాయెను.

(౧౫½) వాయుదేవుఁడు ఆమెయెడల మనసునుంచి మన్మథబాధగలవాఁడై పతివ్రతయగు ఆయంజనాదేవిని పొడవగు బాహువులతో నాలింగనముచేసికొనెను.

సా తు తత్రైవ సంభ్రాంతా సువ్రతా వాక్య మబ్రవీత్।
ఏకపత్నీవ్రత మిదం కో నాశయితు మిచ్ఛతి॥ ౧౬½
అంజనాయా వచ శ్శ్రుత్వా మారుతః ప్రత్యభాషత॥ ౧౭

న త్వాం హింసామి సుశ్రోణి మాభూ త్తే సుభగే భయమ్।
మనసా స్మి గతో యత్త్వాం పరిష్వజ్య యశస్వినీమ్॥ ౧౮
వీర్యవా న్బుద్ధిసంపన్న స్తవపుత్రో భవిష్యతి।
మహాసత్త్వో మహాతేజాః మహాబలపరాక్రమః॥ ౧౯
లంఘనే ప్లవనేచైవ భవిష్యతి మయాసమః॥ ౧౯½

ఏవ ముక్తా తత స్తుష్టా జననీ తే మహాకపే।
గుహాయాం త్వాం మహాబాహో ప్రజజ్ఞే ప్లవగర్షభమ్॥
అభ్యుత్థితం తత స్సూర్యం బాలో దృష్ట్వా మహావనే।
ఫలంచేతి జిఘృక్షు స్త్వ ముత్ప్లుత్యా భ్యుత్పతో దివమ్॥ ౨౧½

శతాని త్రీణి గత్వాథ యోజనానాం మహాకపే।
తేజసా తస్య నిర్ధూతో నవిషాదం గత స్తతః॥ ౨౨½
తావ దాపతత స్తూర్ణ మంతరిక్షం మహాకపే।
క్షిప్త మింద్రేణ తే వజ్రం క్రోధావిష్టేన ధీమతా॥ ౨౩½

(౧౬౪) పతివ్రతయగు నామె అచటనే బెదిరి యిటు లనెను. ఒకపురుష నియందేగల యీనావ్రతమును జెరచుట కెవఁడు గోరుచున్నాఁడు.

(౧౭) ఇట్లు చెప్పిన అంజనాదేవిమాట విని వాయుదేవుఁడిటుల బదులిచ్చెను.

(౧౮) యశోవతివగు నిన్ను మనసా మోహించి ఆలింగనముచేసికొనినంగున, ఓ శుశ్రోణీ! నిన్ను నేను హింసించలేదు. ఓ సౌభాగ్యవతి! భయపడవలదు.

(౧౯,౧౯౪) వీర్యవంతుఁడును బుద్ధిమంతుఁడును గొప్ప ధైర్యము తేజస్సు బలము పరాక్రమము గలవాఁడును నగుపుత్రుఁడు నీకు గలుగును. దాటుటలోను నెప్పించి మాటలలోను ఆధిక్య నాతో సమునఁడగుచున్నాఁడు.

(౨౦౪) గొప్పవానరుఁడా! ఇటుల వాయుదేవుఁడు చెప్పగా, మీతల్లియగు అంజనాదేవి సంతోషించి, ఓ గొప్పభుజములుగలవాఁడా! వానరోత్తముఁడవగు నిన్ను మందరపర్వతము గుహలో బ్రసవించెను.

(౨౧౪) గొప్పవనములో బాలుఁడవుగనుండిన నీవు ఉదయించిన సూర్యునిఁజూచి, అదియొక పండని తలఁచి దాని గ్రహించుటకు కోరి, నీవు పైకెగిరి అంతరిక్షమునకుఁ బోతివి.

(౨౨౪) శిశువువు, ఓ మహాకపీ! మున్నూరు యోజనములు అంతరిక్షములో పైకి పోయి సూర్యుని తేజస్సుచేఁ బీడింపఁబడిన వాఁడవైనను, అందుచే నీవు [illegible]లేదు

(౨౩౪) ఓ మహాకపీ! అంతరిక్షమార్గములో సూర్యుని సమీపమునకు [illegible] [illegible]నుండు నీపైన, బుద్ధిమంతుఁడగు ఇంద్రుఁడు కోపాక్రాంతుఁడై, వజ్రాయుధము [illegible] ప్రయోగించెను.

తత శ్శైలాగ్రశిఖరే వామో హనురభజ్యత।
తతోహి నామధేయం తే హనుమానితి కీర్త్యతే॥ ౨౪½
తత స్త్వాం నిహతం దృష్ట్వా వాయు ర్గంధవహ స్స్వయమ్।
త్రైలోక్యేభృశసంక్రుద్ధో నవవౌ వై ప్రభంజనః॥ ౨౫½

సంభ్రాంతాశ్చ సురా స్సర్వే త్రైలోక్యే క్షోభితేసతి।
ప్రసాదయంతి సంక్రుద్ధం మారుతం భువనేశ్వరాః॥ ౨౬½
ప్రసాదితేచ పవనే బ్రహ్మా తుభ్యం వరం దదౌ।
అశ స్త్రవధ్యతాం తాత సమరే సత్యవిక్రమ॥ ౨౭½

వజ్రస్యచ నిపాతేన విరుజం త్వాం సమీక్ష్యచ।
సహస్రనేత్రః ప్రీతాత్మా దదౌ తే వర ముత్తమమ్॥ ౨౮½
స్వచ్ఛందతశ్చ మరణం తే భూయాదితి వై ప్రభో॥ ౨౯
స త్వం కేసరిణః పుత్రః క్షేత్రజో భీమవిక్రమః।
మారుత స్యౌరసః పుత్ర స్తేజసాచాపి తత్సమః॥ ౩౦

త్వంహి వాయుసుతో వత్స ప్లవనేచాపి తత్సమః।
వయ మద్య గతప్రాణా భవాన్న స్త్రాతు సాంప్రతం॥ ౩౧
దాక్ష్యవిక్రమసంపన్నః పక్షిరాజఇవాపరః॥ ౩౧½

(౨౪½) పిమ్మట, నీవు అంతరిక్షమునుండి పర్వతశిఖరముమీదపడి యెడమచెంపను మంచిదెబ్బ తగిలినది. అందుచేతనే నిన్ను హానుమంతుఁడని పిలిచెదరు.

(౨౫½) పిమ్మట, వాసనను దెచ్చుచుండు వాయుదేవుఁడు, ఇట్లు కొట్టఁబడిన నిన్నుచూచి మిగుల కోపాక్రాంతుఁడై మూఁడులోకములలోను అతఁడు సంచరించక ఉండెను.

(౨౬½) మూఁడులోకములు గాలిలేక సంకటపడుచుండగా దేవతలందరు మిగుల భయపడిరి. మిగుల కోపముగలిగియుండు వాయుదేవుని లోకపాలకులు వేడుకొనిరి.

(౨౭½) వాయుదేవుఁడు దేవతల ప్రార్థనచే ప్రసన్నుడు కాఁగా, ఓ సత్యమైన విక్రమము గలవాఁడా! తండ్రీ! యుద్ధములో శస్త్రముచే నిన్ను జంపుట కెవరికిని సాధ్యము కాదని బ్రహ్మ నీకు వరమిచ్చెను.

(౨౮½, ౨౯) సహస్రాక్షుఁడగు ఇంద్రుఁడు వజ్రాయుధము దెబ్బతగిలియు బాధపడని నిన్ను చూచి సంతోషించి, ఓ ప్రభో! నీవు కోరినపుడే నీకు మరణము గలుగుననియు గొప్పవర మిచ్చెను.

(౩౦) బ్రహ్మదేవునివల్లను ఇంద్రునివల్లను వరములు బడసినవాఁడును, భయంకరమైన పరాక్రమము గలవాఁడును, కేసరియను వానరుని పుత్రుఁడును, వాయుదేవుని ఔరస పుత్రుఁడును, వీర్యములో వాయుదేవునికి సమానుఁడును నగు నీవు కేసరిభార్యయగు అంజనాదేవి పుత్రుఁడవు.

(౩౧) ఓబిడ్డా! నీవు వాయుదేవుని పుత్రుఁడవు. దాటుటలో నతనితో సమానుఁడవు. గనుక, యిపుడు మాప్రాణములు పోవుచున్నవి. నీవు మమ్ము గాపాడవలయును.

(౩౧½) నీవు సామర్థ్యము పరాక్రమములతోఁ గూడిన వాఁడవు. రెండవ గరుడుని వలెనున్నావు.

త్రివిక్రమే మయా తాత సశైలవనకాననా।
త్రిస్సప్తకృత్వః పృథివీ పరిక్రాంతా ప్రదక్షిణమ్॥ ౩౨
తథాచౌషధయోస్మాభి స్సంచితా దేవశాసనాత్।
నిష్పన్న మమృతం యాభి స్తదాసీన్నో మహద్బలమ్॥ ౩౩

స ఇదానీ మహం వృద్ధః పరిహీనపరాక్రమః।
సాంప్రతం కాల మస్మాకం భవా న్సర్వగుణాన్వితః॥ ౩౪
తద్విజృంభస్వ విక్రాంతః ప్లవతా ముత్తమో హ్యసి॥ ౩౫
త్వద్వీర్యం ద్రష్టుకామేయం సర్వవానరవాహినీ।
ఉత్తిష్ఠ హరిశార్దూల లంఘయస్వ మహార్ణవమ్॥ ౩౬

పరాహి సర్వభూతానాం హనుమన్యాగతి స్తవ।
విషణ్ణా హరయ స్సర్వే హనూమ న్కిముపేక్షసే॥ ౩౭
విక్రమస్వ మహావేగో విష్ణు స్త్రీ న్విక్రమానివ॥ ౩౮
తతస్తు వై జాంబవతా ప్రచోదితః ప్రతీతవేగః పవనాత్మజః కపిః।
ప్రహర్షయం స్తాం హరివీరవాహినీం చకార రూపం మహదా
త్మన స్తదా॥ ౩౯
ఇతి శ్రీమత్కిష్కింధాకాండే షట్షష్టితమస్సర్గః.

(౩౨) ఓతండ్రీ! త్రివిక్రమావతారములో కొండలతోను అరణ్యములతోను గూడియుండు యీభూమికి యిరువదియొక్కసార్లు ప్రదక్షిణము చేసితిని.

(౩౩) దేవతలఆజ్ఞచే నేను దివ్యఓషధి లతలను జేర్చితెచ్చి క్షీరసముద్రములో నుంచితిని. సముద్రమును మధించగా ఆలతలనుండి అమృతము బుట్టినది. అపుడు నాకు బలము ఉండెను.

(౩౪) అట్టినేను యిపుడు వృద్ధుఁడనై పరాక్రమహీనుఁడనుగ నున్నాను. ఇపుడు మాకిట్టికాలము సంభవించినది. నీవుసకల సద్గుణములతోఁ గూడియున్నావు.

(౩౫) అందుచే, ప్రసిద్ధుఁడవుగ నుండునీవు దేహమును బెంచుము. దాటువారలలో నుత్తముఁడవుగ నున్నావు.

(౩౬) నీ పరాక్రమమును యీవానరసేన యంతయుఁ జూడగోరుచున్నది. ఓవానరోత్తముఁడా! లేచి గొప్పసముద్రమును దాటుము.

(౩౭) హనుమంతుఁడా! నీకుగల గమనశక్తి సమస్త ప్రాణికోటుల గమనశక్తికంటె శ్రేష్ఠముగ నున్నది. వానరులందరు మిగుల దుఃఖించియున్నారు. హనుమంతుఁడా! ఎందుకు ఉపేక్ష చేయుచున్నావు.

(౩౮) గొప్పవేగముగలనీవు, శ్రీమహావిష్ణు మూడువిధములగు పరాక్రమములనుజూపి లోకములనాక్రమించినటుల, దేహమునుబెంచి మిగుల వేగముగ సముద్రమును దాటుము.

(౩౯) పిమ్మట, ప్రసిద్ధమగువేగము గలవాఁడును వాయుపుత్రుఁడును నగు హనుమంతుఁడు జాంబవంతునిచేఁ బోత్సాహపరచబడినవాఁడై వానరవీరుల సేనను సంతోషపరచుచు అపుడు గొప్పరూపమును దాల్చెను.

## సప్తషష్టితమస్సర్గః.

తం దృష్ట్వా జృంభమాణం తే క్రమితుం శతయోజనమ్।
వీర్యేణాపూర్యమాణంచ సహసా వానరోత్తమమ్॥ ౧
సహసా శోకముత్సృజ్య ప్రహర్షేణ సమన్వితాః।
వినేదు స్తుష్టువు శ్చాపి హనుమంతం మహాబలమ్॥ ౨
ప్రహృష్టా విస్మితా శ్చైవ వీక్షంతే స్మ సమంతతః।
త్రివిక్రమకృతోత్సాహం నారాయణమివ ప్రజాః॥ ౩
సంస్తూయమానో హనుమాన్ వ్యవర్ధత మహాబలః।
సమావిధ్యచలాంగూలం హర్షాచ్చ బలమేయివాన్॥ ౪
తస్య సంస్తూయమానస్య వృద్ధై ర్వానరపుంగవైః।
తేజసా పూర్యమాణస్య రూప మాసీ దనుత్తమమ్॥ ౫
యథా విజృంభతే సింహో వివృద్ధో గిరిగహ్వరే।
మారుత స్యౌరసః పుత్ర స్తథా సంప్రతి జృంభతే॥ ౬
అశోభత ముఖం తస్య జృంభమాణస్య ధీమతః।
అంబరీషమివా దీప్తం విధూమఇవ పావకః॥ ౭
హరీణా ముత్థితో మధ్యా త్సంప్రహృష్ట తనూరుహః।
అభివాద్య హరీ న్వృద్ధాన్ హనుమా నిద మబ్రవీత్॥ ౮

౬౭ వ సర్గ.

(౧,౨) సముద్రములో నూరుయోజనములు దాటుటకు దేహమును బెంచుచుండు వాఁడును, పరాక్రమముచే వృద్ధి యగుచుండువాఁడును వానరోత్తముఁడును గొప్పబలము గలవాఁడును నగు ఆంజనేయుని జూచి వానరులు వెంటనే దుఃఖమువిడిచి మిగుల సంతోషము గలవారై సింహనాదముచేసి అతని స్తోత్రముచేసిరి.

(౩) త్రివిక్రమావతారములో లోకములను నాక్రమించుటకు ఉత్సాహము గలిగియుండిన శ్రీమన్నారాయణుని జూచి ప్రజలు సంతోషించినటుల, వానరులు మిగులసంతోషము గలవారై, మిగులఆశ్చర్యపడి హనుమంతుని బాగుగఁజూచిరి.

(౪) వానరులు స్తోత్రము చేయుచుండగా, గొప్పబలము గలహనుమంతుఁడు దేహమును విశేషముగఁబెంచి, తోకనుగొట్టి సంతోషము గలవాఁడై బలమును బడసెను.

(౫) వృద్ధులగు వానరోత్తములు స్తోత్రముసేయగా, పరాక్రమముచే వృద్ధిపొందిన హనుమంతుని రూపము సర్వోత్తమముగ నుండెను.

(౬) గుహలోనుండు సింహము వృద్ధిపొంది ప్రకాశించునటుల వాయుదేవుని ఔరస పుత్రుఁడగు హనుమంతుఁ డిపుడు అటుల వృద్ధిపొందుచున్నాఁడు.

(౭) వృద్ధిపొందుచుండు బుద్ధిమంతుఁడగు హనుమంతుని, ముఖము ఎఱ్ఱగ కాలియుండిన పెనముపలెనుండు పొగలేని నిప్పువలెఁ బ్రకాశించెను.

(౮) వానరులమధ్యనుండిలేచి సంతోషించి వందున రోమాంచము గలవాఁడై హనుమంతుఁడు వృద్ధులగు వానరులకు నమస్కారముచేసి యిటు లనెను,

అరుజ త్పర్వతాగ్రాణి హుతాశనసఖో௨నిలః।
బలవా నప్రమేయశ్చ వాయురాకాశగోచరః॥ ౯

యస్యాహం శీఘ్రవేగస్య శీఘ్రగస్య మహాత్మనః।
మారుతస్యౌరసః పుత్రః ప్లవనే నాస్తి మత్సమః॥ ౧౦

ఉత్సహేయం హి విస్తీర్ణ మాలిఖంత మివాంబరమ్।
మేరుం గిరి మసంగేన పరిగంతుం సహస్రశః॥ ౧౧

బాహువేగప్రణున్నేన సాగరేణాహ ముత్సహే।
సమాప్లావయితుం లోకం సపర్వతనదీహ్రదమ్॥ ౧౨

మమోరుజంఘవేగేన భవిష్యతి సముత్థితః।
సముచ్ఛ్రితమహాగ్రాహ స్సముద్రో వరుణాలయః॥ ౧౩

పన్నగాశన మాకాశే పతంతం పక్షిసేవితే।
వైనతేయమహం శక్తః పరిగంతుం సహస్రశః॥ ౧౪

ఉదయాత్ప్రస్థితం వాపి జ్వలంతం రశ్మిమాలినమ్।
అనస్తమిత మాదిత్య మభిగంతుం సముత్సహే॥ ౧౫

(౯) అగ్నిదేవునికి స్నేహితుఁడును, సదా చలించుచుండువాఁడును, బలవంతుఁడును, అపరిచ్ఛిన్నమైన మహిమ గలవాఁడును, ఆకాశములో సంచరించువాఁడును నగు వాయుదేవుఁడు పర్వతశిఖరములను భంగపరచును.

(౧౦) గరుత్మంతుఁడు మొదలగువారి వేగమువలెనుండు వేగముగల వాఁడును, వారివేగమును నైచక వారికంటె ముందుబోవు వాఁడును, మహాత్ముఁడును, నగు వాయుదేవునికి నేను ఔరసపుత్రుఁడనగుటచే, దాటుటలో నాకు సముఁడుగ నుండువాఁడు లేఁడు.

(౧౧) ఆకాశమును ముట్టుకొను నటులుండు విశాలమగు మేరుపర్వతమును శీఘ్రముగ పలుమరు ప్రదక్షిణము సేయుటకు ఉత్సాహము గలవాఁడనై యున్నాను.

(౧౨) నా భుజవేగముచే త్రోయఁబడిన సముద్రముచే పర్వతములు నదులతోఁ గూడిన లోకములను నొకటిగఁ జేయుటకు ఉత్సాహము గలిగియున్నాను.

(౧౩) నాతొడలు మోకాళులవేగముచే బాగుగ పైకివచ్చియుండు గొప్ప మొసళులు గలదిగను వరుణుని వాసస్థానముగను నుండుసముద్రము పైకిలేచును.

(౧౪) పక్షులతో నిండియుండు ఆకాశములో సంచరించు చుండువాడును వినతపుత్రుఁడును నగు గరుడునికి పలుమరు ప్రదక్షిణము సేయుటకు నాకు శక్తిగలదు.

(౧౫) ఉదయగిరినుండి ప్రయాణమై పోవుచుండు సూర్యుని నేనుండు చోటినుండిపోయి సమీపించి అతనితోడ ప్రయాణము సేయుట కుపక్రమించి అతనికి ముందుగనే అస్తగిరిచేరి, అతఁడస్తమించుటకు ముందుగనే, కిరణములతోఁగూడి జ్వలించుచుండు అతని యెదుర్కొని బోవుటకు నేను ఉత్సాహము గలిగియున్నాను.

తతో భూమి మసంస్పృశ్య పునరాగంతుముత్సహే।
పరివేగేనైవ మహతా భీమేన ప్లవగర్షభాః॥ ౧౬
ఉత్సహేయ మతిక్రాంతుం సర్వా నాకాశగోచరాన్॥ ౧౬½
సాగరం శోషయిష్యామి దారయిష్యామిమేదినీమ్।
పర్వతాం శ్చూర్ణయిష్యామి ప్లవమానః ప్లవంగమాః॥ ౧౭½
హరిష్యామ్యూరువేగేన ప్లవమానో మహార్ణవమ్। ౧౮
లతానాం వివిధం పుష్పం పాదపానాంచ సర్వశః।
అనుయాస్యంతి మా మద్య ప్లవమానం విహాయసా॥ ౧౯
భవిష్యతి హి మే పంథా స్స్వాతేః పంథాఇవాంబరే॥ ౧౯½
చరంతం ఘోర మాకాశ ముత్పతిష్యంతమేవవా।
ద్రక్ష్యంతి నిపతంతంచ సర్వభూతాని వానరాః॥ ౨౦½
మహామేఘప్రతీకాశం మాంచ ద్రక్ష్యథ వానరాః।
దివమావృత్య గచ్ఛంతం గ్రసమాన మివాంబరమ్॥ ౨౧½
విధమిష్యామి జీమూతా న్కంపయిష్యామి పర్వతాన్।
సాగరం క్షోభయిష్యామి ప్లవమాన స్సమాహితః॥ ౨౨½
వైనతేయస్య సా శక్తి ర్మమ యా మారుతస్యవా॥ ౨౩
ఋతే సుపర్ణరాజానం మారుతంవా మహాజవమ్।
నత ద్భూతం ప్రపశ్యామి యన్మాం ప్లుత మనువ్రజేత్॥ ౨౪

ఏషు వేగం కరిష్యామి మహేంద్రశిఖరేష్వహమ్।
నానాద్రుమవికీర్ణేషు ధాతునిష్యందశోభిషు॥ ౩౮

(౩౮) నానావిధములగు వృక్షములతో నిండి గైరికాది ధాతువుల రసములతో వెలుంగుచుండునట్టి యీ మహేంద్రపర్వతము శిఖరములమీద నా గమన వేగమును జూపెదను.

ఏతాని మమ నిష్పేషం పాదయోః ప్లవతాంవరాః।
ప్లవతో ధారయిష్యంతి యోజనానామిత శ్శతమ్॥ ౩౯

(౩౯) దాటుటయందు సమర్థులగు వానరులారా! ఇచటినుండి నూరు యోజనములు పోవుచుండు నాయొక్క నాకాళులయొక్క ఊనికను యీమహేంద్ర పర్వతము శిఖరములు భరించగలవు.

తత స్తం మారుత ప్రఖ్య స్సహరి ర్మారుతాత్మజః।
ఆరురోహ నగశ్రేష్ఠం మహేంద్ర మరిమర్దనః॥ ౪౦

(౪౦) పిమ్మట, వాయుదేవునితో సముడును, అతనిపుత్రుడును, శత్రువులను మర్దించువాడును నగు హనుమంతుడు ఆయుత్తమమగు మహేంద్ర పర్వతము మీద నెక్కెను.

వృతం నానావిధై ర్వృక్షై ర్మృగసేవితశాద్వలమ్।
లతాకుసుమసంబాధం నిత్యపుష్పఫలద్రుమమ్॥ ౪౧

శ్లో

సింహశార్దూలచరితం మత్తమాతంగసేవితమ్।
మత్తద్విజగణోద్ఘుష్టం సలిలోత్పీడసంకులమ్॥ ౪౨
మహద్భి రుచ్ఛ్రితం శృంగై ర్మహేంద్రం స మహాబలః।
విచచార హరిశ్రేష్ఠో మహేంద్రసమవిక్రమః॥ ౪౩

(౪౧½,౪౨½,౪౩½) నానావిధములగు వృక్షములతో నిండినదియు, మృగములు మేయుచుండు పచ్చికబయళ్ళు గలదియు, లతలు పూలతో నిండినదియు, సదాపూచి ఫలించుచుండు చెట్లు గలదియు, సింహములు పులులు మదించిన యేనుగులు గలదియు, మదించిన పక్షులధ్వనులు గలదియు, జల ప్రవాహములతో నిండినదియు, గొప్ప శిఖరములుగలిగి పొడవుగ నుండునదియు, నగు మహేంద్ర పర్వతముమీద, గొప్పబలము గలవాడును ఇంద్రునివంటి పరాక్రమము గలవాడును వానరోత్తముడును నగు హనుమంతుడు సంచరించు చుండెను.

పాదాభ్యాం పీడిత స్తేన మహాశైలో మహాత్మనా।
రరాజ సింహాభిహతో మహాన్మత్త ఇవ ద్విపః॥ ౪౪
ముమోచ సలిలోత్పీడాన్ విప్రకీర్ణశిలోచ్చయః॥

(౪౪½) మహాత్ముడగు ఆంజనేయుని పాదములచే పీడింపబడిన ఆగ పర్వతము, సింహముచే గొట్టబడిన మదించిన గొప్పయేనుగువలె ప్రకాశిల్లె

(౪౫) నలుప్రక్కలలోను చెదిరిన గొప్పరాళ్ళుగల ఆపర్వతము (హనుమంతుతిచే బాగుగ త్రొక్కబడి) జలప్రవాహములను కక్కెను.

విత్రస్త మృగమాతంగః ప్రకంపిత మహాద్రుమః।
నాగగంధర్వమిధునైః పానసంసర్గకర్కశైః॥ ౪౬
ఉత్పతద్భిశ్చ విహగై ర్విద్యాధరగణై రపి।
త్యజ్యమానమహాసాను స్సంనిలీనమహోరగః॥ ౪౭
చలశృంగశిలోద్ఘాత స్తదాఽభూ త్సమహాగిరిః॥ ౪౭½

(౪౬,౪౭,౪౭½) మిగులభయంపడిన మృగములు యేనుఁగులు గలదియు, బాగుగ ఆడుచుండు వృక్షములు గలదియు, పానము సేయుటలో మిగుల యిష్ట ... నాగగంధర్వుల దంపతులు పైకెగిరి పోవుచుండు పక్షులు విద్యాధరులగుంపులు లేచి పైకిపోవుచుండు సాను ప్రదేశములుగలిగి, ఎచటనో బాగుగ దాగియుండు గొప్పపాములుగలిగి చలించుచుండు శిఖరములు, ఒండొండితో ఢీకొనుచుండు రాళ్ళు గలదిగను ఆపర్వత ముండెను.

నిశ్శ్వసద్భి స్తదా తైస్తు భుజంగై రర్ధనిస్సృతైః।
స పతాక ఇవాభాతి స తదా ధరణీధరః॥ ౪౮½

(౪౮½) అపుడు, దుఃఖించి నిట్టూర్పు విడుచుచు సగము వెలుపల వచ్చియుండు పాములచే, ఆపర్వతము పతాకములతోఁగూడినదానివలె, వెలుంగుచుండెను.

ఋషిభి స్త్రాససంభ్రాంతై స్త్యజ్యమాన శ్శిలోచ్చయః।
సీద న్మహతి కాంతారే సార్థహీనఇవాధ్వగః॥ ౪౯

(౪౯) భయముచే చెదిరియుండు ఋషులు విడిచిపెట్టిపోయిన ఆపర్వతము మీదగల పెద్దపెద్దరాళ్ళు, గొప్పఅరణ్యములో తనగుంపును విడిచి దుఃఖించుచుండు పాంథునివలె, నుండెను.

స వేగవా న్వేగసమాహితాత్మా హరిప్రవీరః పరవీరహంతా।
మనస్సమాధాయ మహానుభావో జగామ లంకాం మనసా మనస్వీ॥ ౫౦

(౫౦) వేగముగఁ బోవుటలో దృఢమైనమనసు గలవాఁడును, వానరవీరుఁడును, వీర లగుశత్రువులను జంపువాఁడును, మహానుభావుఁడును నగు హనుమంతుఁడు, మనసును స్థిరపఱచుకొని, లంకకుఁబోవుటకు యత్నించెను.

---

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే శ్రీమద్వాల్మీకీయే
చతుర్వింశత్సహస్రికాయాం సంహితాయాం
శ్రీమత్కిష్కింధాకాండే- సప్తషష్టితమస్సర్గః.

---

ఫలశ్రుతి.

కిష్కింధాఖ్య మిమం శృణ్వన్ పఠన్ వాపి విధానతః।
ఇహ సపూజిత స్సర్వై ర న్తే బ్రహ్మణి లీయతే॥

---